# తిరుమల చరిత్రము

అనువాదం : దీవిరంగనాథాచార్యులు

ప్రచురణ:




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2008

# తిరుపతి చరిత్రము

## శ్రీ వేంకటాచలపతి ఆలయము

(అనువాద సంగ్రహము)

అనువాదకులు
దీవి రంగనాథాచార్యులు

శ్రీమాన్ టి.కె.టి. వీరరాఘవాచార్యులవారి
ఆంగ్లమూలానుసరణము



ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2008

# TIRUPATI CHARITRAMU

*By*
Deevi Ranganathacharyulu



T.T.D. Religious Publications Series No.628
Price : Rs.45/-

First Edition : 1978
Re - Prints : 2003, 2004 , ,2008

Copies : 3,000

*Published by*
**K. V. Ramanachary,** I.A.S.
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507.

Printed at :
**Srinivas Art Printers,**
Nallakunta, Hyderabad - 500 044.
Phone : 9391016683

# అంకితము



తిరుమల శ్రీ వేంకటేశ్వర పాదారవిందములకు

# ఉపోద్ఘాతము

సప్తా చలాధీశుడు శ్రీవేంకటేశ్వరుడు. కలిలో జనుల కలుషములను బాప స్వామి పుష్కరిణి యొడ్డున వెలసిన ప్రత్యక్ష దైవము. కొలిచిన వారికి కొంగుబంగారము.

అనాది పురాణవాఙ్మయము మొదలు ఇటీవల చరిత్ర వరకు లభించిన ఆధారములు స్వామి స్వయంభువు అనే చాటుచున్నవి.

ఇంతటి మహామహిమోపేతమైన ఈ క్షేత్రమును గురించి పురాణ వాఙ్మయ ప్రశస్తి దప్ప ఒక క్రమబద్ధమైన చరిత్రను రూపించు ప్రయత్నములు, ఈ శబ్దము ప్రారంభము వరకు, అంతగా జరుగలేదనే చెప్ప వచ్చును. భారతీయ జీవనవిధానమున వృత్త శీలములకు గల ప్రాముఖ్యము వ్యక్తుల జీవనకాల పరిగణకు లేకుండుటే కారణము గావచ్చును.

తిరుపతి తిరుమలకు సంబంధించినంత వరకు చరిత్ర నిరూపించు ప్రయత్నము ఆంగ్లభాషలోనే జరిగినది. చారిత్రక ప్రమాణములను అనుసరించి శ్రీసాధు సుబ్రమణ్యశాస్త్రి దేవస్థాన శాసన సంపుటములను వెలువరించగా స్వర్గీయ కృష్ణస్వామి అయ్యంగార్, టి.కె.టి. వీరరాఘవా చార్యులు, శ్రీ పి. సీతాపతి, ఐ.ఏ.యస్, తమకు లభించిన ఆధారములతో తిరుపతి తిరుమల చరిత్ర రూపించుటకు గణనీయమైన కృషి సల్పిరి.

కాని మిగిలిన భారతీయ భాషలలో ఈ చరిత్ర వివరములు రానిది కొరతగనే మిగిలిపోయినది. తెలుగుభాషకు సంబంధించినంత వరకిది ఈ గ్రంథముతో కొంతవరకు తీరిందనవచ్చును.

ప్రముఖ వైఖానస శాస్త్రవేత్త, ఆంధ్రరాష్ట్ర అర్చక కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీమాన్ దీవి రంగనాథాచార్యులవారు లోగడ శ్రీవీర రాఘవాచార్యులవారిచే రచింపబడిన తిరుపతి చరిత్ర ఆంగ్ల గ్రంథమును సంక్షిప్తానువాదము చేసినవారు. మూలగ్రంథములోని అభిప్రాయములకు తమ అభిప్రాయము, అభిరుచులు వ్యతిరేకముగాని పద్ధతిలో అనువదించుటలో వీరికి గల శక్తి సామర్థ్యములు పడిన శ్రమ గ్రంథమంతటా వెల్లివిరిసినట్లు చూడగలము.

మూలగ్రంథము సుమారు 30 సం॥ పూర్వము ప్రకటితమైన దగుటవలన ఆనాటి నుండి ఈనాటి వరకు దేవాలయ పరిసరములలో అనేకములగు మార్పులు వచ్చినవి. కాని ఇది అనువాద ప్రధాన గ్రంథమగుటచే మాతృకానుసరణమే ఎక్కువ జరిగినదనక తప్పదు. పాఠకుల ఆదరణ పొందిన ఈ అనువాద గ్రంథం 1978లో ముద్రింపబడి, ఆ ప్రతులన్నీ చెల్లిపోయినందువల్ల మళ్లీ ముద్రిస్తున్నాం.

కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానము
తిరుపతి

# మహత్తర గ్రంథము

శ్రీనివాసుని స్వయంవ్యక్తమగు మూర్తితో వెలయు 'తిరుమల చరిత్రము' చారిత్రకులకు ఆగమములకుగూడ అందని ఒక విచిత్రమయిన యైతిహ్యముతో నిండినది. దానిని బరిశీలించుట చాల గహనమయిన పని. అది చరిత్రకందిన తరువాత దొఱకిన విషయములనుబట్టి వెనుకవాని నూహించుటయేగాని యిదమిత్థమని యెవ్వరును నిశ్చయింపలేరైరి. ఆ మూర్తి ఆగమ శాస్త్రములకు కట్టుబడినమూర్తి కాకుండుటచే దాని స్వరూప నిర్ణయము చేయుటలో సందిగ్ధతనే చూపవలసి వచ్చినది.

ఇఁక పురాణములను బరిశీలించినచో నది కృతయుగమునుండియున్నట్లు గన్పట్టును. దాని నాధునికులు విశ్వసింపరు. కాదని కాలమును నిర్ణయింపలేరు. ఇట్టి సందిగ్ధావస్థలోనున్న స్వయంవ్యక్తమూర్తియగు శ్రీనివాసుని చరిత్రమును కొంతవరకు చారిత్రకముగా నాగమశాస్త్రీను సారముగ ప్రామాణికముగ నిరూపింపయత్నించి కృతకృత్యులైనారు శ్రీమాన్ శ్రీమత్తిరుమలకుమార వేంకట వీర రాఘవాచార్యస్వామివారు.

వీరు తిరుమలలో ప్రథమాచార్య కుటుంబసంతతికి చెందినవారు. ఆగమ శాస్త్రములో పరిపూర్ణమయిన ప్రజ్ఞగలవారగుటచేతను వారి పూర్వులనుండి యచటి సంప్రదాయముల నెఱిగిన వారగుటచేతను చారిత్రక పరిశోధన చేసిన వారగుటచేతను, ఆర్షవాఙ్మయమున విశ్వాసము గలవారగుటచేతను, ఆలయ నిర్వహణాధికారమునగూడ కొంత ప్రవేశముండుటచేతను వారీ తిరుమల చరిత్రను చాలవఱకు స్పష్టముగ వివరింపగల్గిరి. ఇది ఆంగ్లభాషలోనున్నది. అంతకుముందే డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారు తిరుమల చరిత్రము నొకదానిని ఆంగ్లమందే వ్రాసిరి. కాని శ్రీ వీరరాఘవాచార్యులవారు ప్రధానాలయము, మూర్తులు, అర్చామూర్తులలో నాయా బేరములు, ఉపాలయములు, ప్రాకారమంటప నిర్మాణాదులు. తీర్థములు. సంప్రదాయములు మున్నగునవియు, తిరుమలనంబి కాలమునుండి వారి వరకు వచ్చినవానినిఁ జక్కఁగఁ బరిశీలించి, స్పష్టముగ, నిష్పక్షపాతముగఁ బ్రకటించిరి. చారిత్రక సత్యములను చారిత్రకముగను, పురాణములను పురాణ ప్రమాణములతోను, సంప్రదాయ శాస్త్రీ విధానముల నాగమశాస్త్ర ప్రమాణములతోను తత్తన్మంటప ప్రాకారనిర్మాణాదు

లను శాసన ప్రమాణములతోను మేళవించి సంశయ విపరీతవాదములకుఁ దావు లేకుండ నీ గ్రంథమును సంతరించిరి.

ఇది మూడుభాగములుగ బ్రకటింపబడినది. దీనిలో తిరుమల చరిత్రము, తిరుపతి చరిత్రము, ఆగమ శాస్త్రమునకు ఆలయములకుగల సమీచీన సంబంధము, తిరుచానూరు చరిత్రమును గుఱించి సమగ్రముగఁ బేర్కొనఁబడినది.

కాని యిట్టి మహత్తరమగు గ్రంథము శ్రీనివాసునివైభవము దేశమంతటను వెలసిన ఈ రోజులలో ఆంధ్రమున లేకుండుట మిక్కిలి లోపమని భావించి దాని నిదివఱకెన్నియో పర్యాయములు చదివి, అందలి ప్రతిప్రదేశమును తాను నడచిచూచి, పరిశీలించి, సత్యమనినమ్మి, హృదయముద్రవించిన శ్రీమాన్ దీవి రంగనాథాచార్యులవారు ఎట్లైనను దీనిని ఆంగ్లమునుండి తెనుగు చేయవలెననెడు కోర్కెను తిరుమలలోని శ్రీవారికే విన్నించిరి. ఆశ్రితభక్తవత్సలుఁడుకదాస్వామి ! వారనేక పర్యాయములు తిరుమల శ్రీవారిని యేదో యొక పనిమీద తిరుపతి వెళ్లినప్పుడెల్లను సేవించిరి. ఇప్పటికి వీరొకటి రెండు తక్కువగా నూఱుమాఱులు శ్రీవారిని సేవించిరన్నచో మనకు నాశ్చర్యముగాని, వారికి సామాన్యము. స్వామియిట్లే వారిని యెల్ల సమయములందును తనకడకు రప్పించుకొనుగాక.

ఈ శ్రీనివాస సందర్శన తపఃఫలితమే శ్రీవారి యనుగ్రహ ప్రాప్తికి హేతువయ్యెను. ఈ గ్రంథమును తెలుఁగులో అనువదించి ప్రకటించుటకు దేవస్థానము కమిటీ వారంగీకరించినారు. అప్పటి కమీషనర్ శ్రీ వాసుదేవరావు గారు ఆయన వ్యూహమూర్తులలో నొకరగు మానుషవాసుదేవుఁడు. శ్రీవారాయనద్వారా వీరి ననుగ్రహించిరి. ఆంధ్రీకరణము కొనసాగించవలసినదిగా నాదేశింపబడినారు. ఆచార్యులవారు వారి ఆదేశము భగవంతుఁడగు శ్రీవారి యనుగ్రహముగనే వీరొదలదాల్చిరి.

నేటికి ఆచార్యులవారి తపస్సు పండిఫలింప నీ గ్రంథము తెనుఁగున వచ్చినది. దీనిని తెనుఁగున వ్రాయవలెనన్నచో కేవలము భాషాపాండిత్యము చాలదు. సంప్రదాయము తెలియవలెను. ఆ యా తీర్థక్షేత్రస్వరూపములు కన్నుల కదలాడవలెను. ద్రావిడ సంప్రదాయ మవబోధముకావలెను. ఆగమ శాస్త్రములో మిక్కిలి పరిచయము కావలెను. ఇన్నియున్నను ఆంగ్లభాషా

పరిజ్ఞానములేనిదే యీ వ్యవహారము చక్కఁబడదు. ఇన్ని యున్ననేగాని దీనిని యనువదింప యోగ్యతముఁడు కాఁజాలడు. ఈ యట్టిశక్తిని సర్వేశ్వరుడగు శ్రీవారు ఆచార్యులవారికి సర్వసమగ్రముగా ననుగ్రహించినారు. ఆ యనుగ్రహ పరంపరా ప్రభావముచేతనే శ్రీమాన్ దీవిరంగనాథాచార్యస్వామివారు ఈయను వాదమునువారి జామాతృఁడును, మాకళాశాలలో నుపన్యాసకులునగు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులవారి సహాయముతో దీనిని తెలుఁగువారి కందింప గల్గిరి. ఇది యెంతేని ముదావహము.

శ్రీమాన్ ఆచార్యులవారు శ్రీవైఖానస సంప్రదాయమునకుఁ జెందినవారు. వీరి జన్మస్థలము తెనాలి తాలూకా ఎడ్లపల్లిగ్రామము. వీరి తండ్రిగారు దీవి శేషభట్టరు పాకయాజిగారు. వీరి కుటుంబమంతయు పండితవంశము. వీరు పాండిత్యమునకుఁదోడు లౌకిక వ్యవహార నిర్వహణదక్షులై ఒకవైపున నర్చక సమస్యలకు తగు రాజీమార్గమును రూపొందించుచు, మరియొక ప్రక్క ఆగమ ప్రామాణ్యమున దేవాలయవిధానము నడువవలెననెడి కృషి యొనర్చిరి. ఇది నిజముగా సవ్యసాచివ్యము. శ్రీవారి యనుగ్రహమే వీరి నీ విధమగు నుత్తమ కార్యకర్తగాఁ దీర్చి దిద్దినదని భావింపవలెను. ఇంకను, ఆలయములు కేవలము జీవికకై జీవించువారి వృత్తిసాధనమను భ్రమనుబోగొట్టి ఆలయములు మానవ జీవిత నిర్మాణమునకు ప్రథమసోపానముగా వీరు నిరూపించిరి. ఈ లక్ష్యము నెఱుంగని ఆలయనిర్మాణముగాని, అర్చనావిధానముగాని నిరర్థకము. దానిని యోగ్యముగ శిక్షింపఁజేసి యోగ్యులగు భగవదారాధకులుగా నర్చకస్వాము లను రూపొందించి వారిద్వారా భగవచ్ఛక్తిని వృద్ధిపఱచి ఆముష్మికఫలప్రాప్తుల నుగా ప్రజల నాయత్తపఱచుటయే వీరి ప్రధానలక్ష్యము. వీరి కృషి దీనిలో పూవు పిందెయై, కాయగారూపొంది పండి ఫలించినది. ఇది శ్రీవారి యపూర్వ కరుణాకటాక్షము.

ఇట్లు ఆలయములనన్నింటిని గుఱించి, ఆగమములను గుఱించి పరిశ్ర మించుచున్న యాచార్యులవారిని ప్రధానస్థలమగు తిరుమలయందు వెలసిన శ్రీని వాసునిపై యపారమగు భక్తిశ్రద్ధలుండుటాశ్చర్యముకాదు. అందు ప్రధాన మగునది శ్రీవారిమూర్తి యేనాటిదో యేరికి యెఱుకరాదు. పూర్వము నుండి పర్వతమే ముందు వచ్చెనో, శ్రీవారేముందు వేంచేసిరో, శ్రీవారివలన పర్వత మున కాపేరువచ్చెనో లేక పర్వతమువలననే శ్రీవారి కాపేరు వచ్చెనో తెలి యుట కెట్టియాధారములుమలేవు.

మొదట తమిళ గ్రంథమగు శిలప్పాధికారములో ఈ పర్వతముస్తుతింప బడినది. తరువాత దీనిని సమగ్రముగా స్తుతించిన మొదటి ఆళ్వారు నమ్మాళ్వారు. తిరువాయి మొళిని వీరు రచన మొనర్చిరి. అందు మొదటి రెండు దశకములలో శ్రీవేంకటాచలపతిని గీర్తించిరి. ఆ మూర్తియేగాక తిరుమలనే అనగా శ్రీశైలరాజమే ముక్తిదాయకమని వీరు విశ్వసించిరి. ఆ సంప్రదాయమును, బాగుగా తెలిసికొనినారు మన ఆచార్యులవారు. దానిచే వీరికా పర్వతమన్నను, వేంకటాచలపతియన్నను పరమవిశ్వాసము. అట్టి విశ్వాసమే వీరిచే సేవని చేయించినది. వీరికి ప్రపత్తియు స్వామి కలిగించినాఁడు. ఆళ్వారుల యభిప్రాయమును ఇనుమిక్కిలిగాఁ పెంపొందఁజేసినవారు తిరుమలనంబిగారు. వీరు భగవద్రామానుజులకు మేనమామ. తరువాత అనందాళ్వారు భగవద్రామానుజులు, వీరు ఆ సంప్రదాయములను, విశ్వాసములను బరిపూర్ణముగా నధ్యవసాయము చేసినవారు. ఆకారణముచే నీ యనువాదమునకు వీరు మరింత యధికారులైరి.

ఇఁకనాచార్యులవారు వైఖానసకులతిలకు లగుటచే శ్రీవారి ఆలయములోని అర్చావిధానముచే స్వామివారికి మరింత సన్నిహితులైరి. ఇట్లు అనేక కారణములచే శ్రీరంగనాథాచార్యులవారి హృదయమున శ్రీవారే స్వయముగ సంకల్పమును గల్గించి దానిని బహిర్గత మొనర్చుటకు బీజమువేసిరి. ఇది జన్మాంతరసుకృత పరిపాకము. అట్టి మహద్భాగ్యము శ్రీవారి యనుగ్రహముచే వీరికి లభించినది. గాన వీరు ధన్యులైరి. తదుపరి ఆంధ్రజాతినంతను శ్రీనివాసుని చరిత్రనాంధ్రభాషయందు రచించి తచ్చరిత్ర పఠనమున కవకాశము కల్గించి వారిని ధన్యులుగా నొనర్చిరి. ఈకృషి సర్వదా సర్వథా అత్యంతశ్లాఘనీయమను విషయము సర్వాంగీకారము.

వీరికి శ్రీనివాసుడు నిత్యకైంకర్యమును ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించి అనుగ్రహించుగాక! అని మంగళాశాసనము చేయుచున్నాను. ఈ మహత్కార్య వైభవములో నాకు గల్గిన యీ భాగ్యమునకు కృతజ్ఞతతో నమస్కృతము లర్పించుచు విరమించుచున్నాను.

ఇట్లు విన్నవించు,
భాగవతవిధేయుడు

శ్రీ భాష్యం అప్పలాచార్యులు
సాహిత్య విద్యాప్రవీణ
ప్రధాన సంస్కృతోపన్యాసకులు, ప్రభుత్వ కళాశాల, కాకినాడ.

# అభిప్రాయము

శ్రీ వి. కె. వి. వీరరాఘవాచార్యులుగారు వ్రాసిన History of Tirupati అను గ్రంథమును తిరుమల తిరుపతి దేవస్థానము తరఫున ప్రచురించితిమి. తిరుపతి క్షేత్రమునకు సంబంధించిన చారిత్రక–సాంస్కృతిక విషయములెన్నియో యిందు చక్కగా ప్రతిపాదించబడినవి. శ్రీమాన్ దీవి రంగనాథాచార్యులుగారు పై గ్రంథమును 'తిరుపతి చరిత్ర' మను పేర తెనిగించిరి. మూలముననుసరించి యిందు 22 అధ్యాయములు కలవు. శ్రీ ఆచార్యులుగారు తమ అనువాదమున సామాన్యుల కందఱకు అందుబాటులో నుండునట్లు సరళమైన భాష నుపయోగించిరి. మొత్తముమీద శ్రీనివాసక్షేత్రమగు తిరుపతికి సంబంధించిన ఎన్నో విశేషములీ తిరుపతి చరిత్రను చదువుటవలన తెలియగలవు. ఇంత చక్కని అనువాదమును చిక్కని తెనుగులో చేసిన వీరిని అభినందించుచున్నాను.

తిరుపతి, చెలికాని అన్నారావు

1–7–78 దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులు

——

# అభిప్రాయ నివేదిక

S. Subrahmanya Sastry,
Retired Devasthanams Peishkar and
Retd. Dev. Archaeologist

TIRUPATI
18—1—1974

*Sir*

*I went through the manuscript of your Telugu translation of the late Sri T. K. T. Viraraghavacharya's "History of Tirupati" neatly done in understandable Telugu.*

*So far there is no Telugu book dealing with Sri Venkateswara and the temple based on inscriptions giving historical facts. Yours, I believe, is the unique valuable book in this respect. It will certainly furnish historical information to the readers who will be benefited and enlightened thereby.*

*I am happy to congratulate you on your successful effort.*

**Sd./- S. SUBRAHMANYA SASTRY**

---

# వివిధవిషయ విజ్ఞాన వికాస ప్రభాసము

ఈ తిరుమల తిరుపతి చరిత్రమునందు వేదాగమ పురాణశాస నాదులన్నియు నంతర్భూతములై యున్నవి. సమాజమునందు గల దురూహా దుర్భావములను క్షుద్రవిమర్శనముఁను ప్రతిఘటించి యాథార్థ్యములను మనకందీయదగు పెన్నిధానమీ చరిత్రము. చరిత్ర మానవులకు అనన్యసాధారణమగు గతకాల ప్రాశస్త్య ముద్దీప్త మొనర్చు దివ్యమగు తారాకిరణము. కాశ్మీరమునుండి కన్యాకుమారి వరకు వ్యాప్తమైన భారతభూమియందు ఖండఖండాంతరములందును కలి విప్లవకల్లోలితులై నివసించుచున్న హిందువులందరినీ, తనకడకు ఆకర్షించి వారివారి అభీష్టముల నొనగూర్చెడు ఇలవేల్పగు దైవము శ్రీ వేంకటేశభగవానులు.

పద్మాస్యవక్షః యని పారమాత్మికోపనిషత్ప్రతిపాదితమై యోగలక్ష్మీసమలంకృతుడగు శ్రీ వేంకటేశుని శ్రీనివాసుడని మహర్షులు పేర్కొనిరి. శ్రీస్వామినిగూర్చి భవిష్యోత్తరపురాణ వేఙ్కటాచల మాహాత్మ్యమున ఇట్లు చూడగలము. చోళదేశమున పూర్వము అత్యంత నిష్ఠకలిగిన వైఖానసుడను పేరుగల మహర్షి కృష్ణావతారము యొక్క పురాతనకథను విని కృష్ణరూపము జూచెదనని తపముసేయ ఆ ఋషికి గోపాలవేషము ధరించి హరి ప్రత్యక్షమై "త్వయాధ్యేయ శ్రీనివాసో నాహం ధ్యేయో మునీశ్వర! గచ్ఛ శేషగిరిం తత్ర వల్మీకే వర్తతే శుభే ప్రతిమా శ్రీనివాసస్య తత్పూజాం కురు సంతతం" ఓ విఖనా! నీచేత ఆరాధింపబడు నా వేషము శ్రీనివాసుడు, గాదు గాన శేషాద్రికి పొమ్ము. అచ్చట వల్మీకమందు శ్రీనివాసునిప్రతిమ గలదు. ఆ బింబమును పూజించుమనెను.

శ్రీ భాగవతమున గోపికలు కృష్ణుని సాక్షాత్తు పరమాత్మ యని భావించి 'నఖలు గోపికానందనోభగవానఖిలదేహినామన్తరాత్మదృక్ విఖనసార్థితో విశ్వగుప్తయే సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే'

'మా చెలికాడవైన ఓ కృష్ణా! నీవు గోపికానందనుడవు గావు అఖిల దేహధారులకు అంతరాత్మవై శ్రీవిఖనసఋషిచే ప్రార్థింపబడి సకల జగమును రక్షించుటకీ యదుకుల మందవతరించిన భగవానుడవని' నట్లు గలదు. గోపికాగీతయందలి విఖనసార్థితయనుచోట శ్రీ శ్రీ వల్లభాచార్య పురుషులు సుబోధినీవ్యాఖ్యానమిట్లు చేసిరి. 'విఖనాః బ్రహ్మా విశేషేణ ఖనతీతి. సర్వథా వేదార్థవిచారకః - అత ఏవ వైఖానసం మతం బ్రహ్మణా కృతం. భగవద్భజన ప్రతిపాదకం తేనైవమార్గేణ పూజాం భగవాన్ గృహ్ణాతీతి. వేంకటాద్రౌ తథైవపూజా'. తిరుమల శ్రీవారిఅర్చనకు గ్రహింపబడిన వైఖానస భగవచ్ఛాస్త్రము వైదికమనే భావమును విఖనసార్థితయనుచోట విశదీకరించిరి.

పురాణం పంచమం వేదానాం వేదం యని ఉపనిషచ్ఛాందోగ్యము పలికినట్లు భవిష్యోత్తరపురాణ వివరణవల్ల శ్రీవిఖనోమునిచే ప్రార్థింపబడి గోపాలకృష్ణునిగా దర్శనమిచ్చిన హరియే కల్యాణకల్పతరువగు శ్రీవేంకటేశుడని నిశ్చయము. ఆ అనంతలీలామయుని చరిత్రను తన యలౌకికమగు భావనాశక్తిచే ఆంగ్లేయమునుండి తెనుంగున సజీవగ నొనర్చిన ఈ అనువాదకర్త సంస్కృతాంగ్ల ఆంధ్ర భాషా కోవిదులు, ఆగమప్రవీణులును. సనాతనాధునాతనభావాల మేలుకలయికగా నొప్పు విద్వన్మణి. ఇంతేగాక ఆరాధనాబీజం మానవ హృదయక్షేత్రంలో నాటుకున్న దే తడవుగ పైనుండి శ్రీవారి కృపావర్షం పడితీరుతుందనే పరమవిశ్వాసం గలవారు శ్రీదీవి రంగనాథాచార్యులువారు.

లోకములో కొందరు అనువాద మొనర్చునప్పుడు భాషాంతరీకరణ మేకదా యను నూహతో తమకు తోచినరీతిన ననువదింతురు. కాని శ్రీ ఆచార్యులువారు నాడు నేడు గల పరిస్థితులను అవగాహన మొనర్చుకొని తగు శాస్త్రోపపత్తులతో సింహావలోకనము జేసి తిరుపతి చరిత్రను మనకందించిరి.

ప్రపంచంలో విచ్చలవిడిగా తిరుగుతుండే మానవమనస్సులకొక గట్టిపట్టు ఉండాలి. మనకందరికి ఆధారమైన పరమపితయగు శ్రీ శ్రీనివాసమూర్తి ఆ పట్టునకుపాధేయమై ఉన్నారు. ఆ శ్రీమూర్తిని ఆధారము జేసుకొన్న మానవజీవితం ఆదర్శంగా వెల్గొందుతుంది. తిరుపతి చరిత్రము జనతాబృంద మానస సముల్లాసమై వివిధ విషయ విజ్ఞానవికాసమై ప్రకాశించు ననుటలో సందేహము లేదు.

ఇట్లు

పణ్డిత పరాంకుశం సత్యనారాయణ భట్టాచార్యులు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అర్చకపరీక్షాధిపతుల బోర్డుమెంబరు

కొల్లిమర్ల, జూపూడి పోస్టు, బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా

---

# శ్రీపతిచరిత్ర గ్రంథ పరిచయము

సుప్రసిద్ధమై సకలదేవతా సార్వభౌముడై విలసిల్లినట్టి శ్రీవేంకటేశ్వరస్వామివారి నివాసస్థానమైయున్న తిరుపతి క్షేత్రము యొక్క పుట్టుపూర్వోత్తరములను వివరముగా తెలుపునట్టిగ్రంథము ఆంగ్లమున వ్రాయబడియుండినది; అట్టి ఆంగ్లగ్రంథమును ఆంధ్రమున అనువదించుటకై శ్రీమాన్ దీవి రంగనాథాచార్యులవారు సమకట్టిరి. వీరు గుంటూరుమండలములోని తెనాలితాలూకా యడ్లపల్లి గ్రామ కాపురస్తులగు శ్రీమాన్ దీవి శేషభట్టర్ పాకయాజి గారి కుమారులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషాకోవిదులు. పండితబిరుదాంకితులు. వీరు మొదటినుండియు కేవలస్వార్థపరులుగా గాక దేశీయ భావావేశప్రపూరితులును స్వశాఖీయులగు వైఖానసులగు అర్చకుల యొక్క కడగండ్లను రూపుమాప దీక్షాబద్ధులై కృషిచేసినట్టివారును. సుమారు (40) నలుబది సంవత్సరములుగా కృషిచేసి అర్చకకాంగ్రెసును స్థాపించి అర్చకావళికెన్నివిధములుగానో సహకరించి మాన్యశ్రీ మంత్రిమహోదయులచే 'సర్దార్' అనియు 'అర్చకబంధు' అనియు బిరుదములను పొందియున్నట్టివారు. 'అర్చకఎగ్జామినర్స్‌బోర్డు' నందు సభ్యులుగా అర్చకపరీక్షల నిర్వహణలో ప్రధాన భూమిక నిర్వహించుచున్నట్టివారు. ఇంతటి మహదాశయము కలిగిన శ్రీమాన్ పండిత దీవి రంగనాథాచార్యులవారు శ్రీవేంకటేశ్వరస్వామివారి క్షేత్రమగు శ్రీపతి (తిరుపతి) స్థలవిశేషములను సాకల్యముగ నెరిగినట్టివారు గావున ఆంగ్లగ్రంథములోని ముఖ్యాంశములను మాత్రము గ్రహించి ఆనాటినుండి యీనాటి వరకు జరిగినట్టి క్షేత్రాభివృద్ధి విశేషములతోసహా సకల చారిత్రకాంశములను యథార్థమైనస్థితిలో వివరించుచు వ్రాసినారు.

సులభశైలిలో సర్వజనులకు తెలియునట్టి వ్యావహారికభాషలో చక్కగ అనువాదము చేయబడియున్నది.

క్షేత్రములోని తీర్థములయొక్కయు, ఉత్సవములయొక్కయు సంప్రదాయముల యొక్కయు, అనుబంధ దేవాలయముల యొక్కయు, ఆచారాది విధులను బాగుగ వివరించి వ్రాసి యున్నారు. ఈగ్రంధమును చదివినచో తిరుపతిని గురించి తెలియని వెన్నెన్నో విషయములు చదువరులకు సులభగ్రాహ్యము లగును; ప్రతిభక్తుడును చదువతగిన గ్రంథమని నిరూఢమగును. తమ డెబ్బ దవయేట యిట్టిమహత్కార్యమును దలపెట్టి యీ విధముగ గ్రంథ రచనలో కృతకృత్యులైన శ్రీమాన్ పండిత దీవి రంగనాథా చార్యులవారు ధన్యులు. వీరికి శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామివారి కరుణాకటాక్షములో శతాయుః పురుషః అన్నట్లు పూర్ణాయువుతో బాటు నిత్యపరిపూర్ణత కలుగగలదని ఆశిస్తున్నాను.

మకాం: హైదరాబాదు
19—12—73

ఇతి
అనుముల రామనాథశాస్త్రి
ఛేర్మెన్, అర్చకపరీక్షాధిపతులబోర్డు, తిరుపతి

—

# తొలి పలుకు

శ్లో॥ నిరుపమ గుణసిన్ధుర్నిత్య లక్ష్మీసమేతో
నిఖిలనిగమవేద్యో నిస్తులో వేఙ్కటేశః
నిజచరణ సమర్చాసక్త భక్తౌఘరక్షీ
నివసతుహృదయే మే స్వాంఘ్రి భక్తిమ్వితన్వన్.

సర్వేశ్వరుడగు శ్రియఃపతి యపార కరుణాకటాక్షవీక్షణాలేశ ప్రభావ ముచే నీకార్యమెట్టులో సఫలమందినది. అందులకు సర్వేశ్వరుడయిన శ్రీని వాసునకు ప్రణామసహస్రములు సర్వదా సర్వదా సమర్పణముచేసి యనువాద రచనావిషయమై కొంత వివరించుటకుఁ బ్రయత్నింతును.

ఋగ్వేదములో శ్రీవేంకటేశ్వరుని ప్రసక్తియున్నదని అందుగల మన్త్రము ద్వారమున తెలియును. ఆ మంత్రమిది.

ఓం 'అరాయి కాణే వికటేగిరిం గచ్ఛ సదాన్వే శిరింబిఠస్య
సత్త్వభిస్తేభిష్టాశ్చాతయా మసి' [8-8-13]

దీనికి శ్రీనివాసదీక్షితులవారు వ్యాఖ్యాన మీ విధముగాఁ జేసిరి. "హే అరాయి, ఐశ్వర్యహీనే, కాణే, ఏకాక్షీ, అన్యగమనాభావాత్ కాణస్య యథాకథం కించి ద్గమనయోగ్యతా సంభవతీతి కాణే యిత్యుక్తమ్. వికటేగిరిం గచ్ఛ వేంకటగిరిం ప్రతిగచ్ఛ, సదాన్వేసర్వదా అన్వేషణం కురు యద్వా సర్వదా అన్వేషయ, శిరింబిఠస్య (శ్రీ పీఠస్య)వికటస్య సత్వభిః సాత్వికగుణైః తేభిః తైః, త్వా త్వాం చాతయామసి చాతయామః వినాశయామః"

ఇట వేదపురుషుని పురుషార్థకాముకుని గుఱించిన హితము ప్రసక్త మయినది.

ఓయీ పురుషార్థకాముకుడా! నీవు ఐహికాముష్మిక భాగ్యహీనుఁడవయి నను, బాహ్యాన్తరదృష్టిహీనుఁడవయినను తాపత్రయశాలివైనను, ఐహికాముష్మిక పురుషార్థవిరోధులను గలిగియున్నను సర్వానర్థపరిహారమునకుగాను లక్ష్మీ సంపత్తిగలిగిన శ్రీవేంకటాచలమునకు బొమ్ము. అచ్చట సర్వోపచారక్రియా

నిరతులును, సదా సన్నిధానవర్తులును, పరమైకాన్తులును, అన్తరంగపురుషులును, తదీయారాధక మహాభాగులగు శ్రీవైఖానసస్వాములున్నారు. వారిపి నీ యనిష్ట నివారణముకొఱకు శ్రీనివాసుని ప్రార్థింపవలసినదిగా విన్నవింపుము వారును శ్రీనివాసుని ఏకాన్తసేవాకాలమునందు ఆపన్నులయొక్క ఆపన్నివారణ ప్రార్థనమును వినిపింతురు. శ్రియఃపతియు, పరమదయాళువును పాపప్రహార కుఁడునునగు శ్రీనివాసుఁడు తత్ప్రార్థనవిని భక్తులకు వెంటనే ఆపన్నివారణము చేయుచున్నాడు – అని దీనితాత్పర్యము.

ఈయనకు ఆపదమొక్కులవాడని పేరుకదా। ఇక యుపనిషత్తులలో సకలవేదాన్తసారభూతమగునది శ్రీమత్పారమాత్మికోపనిషత్తు. అందులో శ్రీ వేంకటేశ్వరుని మన్త్రమిట్లున్నది. దానినికూడ కొంతవరకు చింతనచేయుదము. 7వ యనువాకములోని 3వ మంత్రమిది.

ఓం రయిః కకుద్మాన్విదద్విన్నష్టం రయిమద్విధానమ్ తస్మై కకుత్రే విక టాయ పిత్రే నమః "

దీనికి శ్రీనివాసదీక్షితులవారి వ్యాఖ్యాన మీ విధముగా నున్నది.

రయిః ఐశ్వర్యరూపః కకుద్మాన్ వృషభాచలవాన్, యద్వా శ్రేష్ఠః, విదద ద్విన్నష్టం యేనకేన ప్రకారేణ యస్మైకస్మైచిద్విన్నష్టం పదార్థం పరప్రదానాది రూపేణ ప్రాపయన్, రయిమద్విధానమ్ రయి రిత్యనేన ప్రత్యుక్తమ్ తస్మై కకుత్రే వికటాయ జేతుమశక్యాయ పిత్రే జగత్పితృరూపాయ తుభ్యం నమః.

ఐశ్వర్యవంతుఁడవై, వృషభాద్రియందు శ్రుతిప్రసిద్ధముగా వేంచేసియుండి ప్రజలు పోగొట్టుకొనిన ఐహికాముష్మిక పదార్థములను పరప్రదానాదులచేత తిరిగి ప్రాపింపఁ జేయుచు అర్చామూర్తియై శ్రీవేంకటాద్రియందు వెలసియున్న శ్రీవేంకటేశ్వరునకు నమస్కారమని దీని తాత్పర్యము

ఈయన అడుగకనే బలికి వరముల నొసంగినవాడు. అతనికి ముక్తిని ప్రసాదించినవాడు. వరదహస్తుఁడు.

ఇట్లు వేదములందును, ఉపనిషత్తులందు మాత్రమేకాక ఏ యొకటియో రెండోదక్క మిగిలినయన్ని పురాణములందును తిరుమల శ్రీవారి ప్రశస్తిలేని చోటు లేదు.

ఇట్టి మహత్తర విశేషములు గలిగిన చరిత్రను మహానుభావుఁడగు శ్రీమత్తిరుమలకుమార వీరరాఘవాచార్యస్వామివారు ఆంగ్లమునందు మూడుభాగములుగా వ్రాసిరి. ఈ గ్రంథములను ఒకనాడు నా మిత్రుఁడగు స్వర్గీయ ఆలపాటి వెంకట్రామయ్య మేము తిరుమల శ్రీవారిని సేవించవెడలినపుడు నాకొసంగెను. నాటినుండి ఆ గ్రంథములను నిరంతరము పఠించుట యొక అలవాటుగా జేసికొంటిని. అది యట్లుంచి నేటికి తిరుమల శ్రీవారిని శతాధికముగా ప్రయాణములు సలిపి దర్శించిన యదృష్టము గలిగినది. కేవలము దర్శించుటగాక తిరుమల పరిసరములందున్న తీర్థములను స్వయముగా కాలిబాటనో, మరియేయితర మార్గములోనో పోయి వానిని సూక్ష్మాతిసూక్ష్మముగా బరిశీలించి వచ్చితిని. ఈ విషయములో శ్రీమాన్ రొంపిచర్లభట్టర్ పార్థసారథి అయ్యంగారు నాకు సాయముగా వచ్చెడివారు. ఇంకను పరంపరగా వచ్చుచున్న సంప్రదాయ విశేషములను, ఆలయములోని కార్యక్రమములను, అర్చకస్వాములు నా కతి సన్నిహితులగుటతో వారివలన తెలిసితిని. ఇతర అధికారులు, అనధికారులవలన నింతకు పూర్వము చేసిన ప్రయాణములలో ననేకవిషయములను సేకరించిపెట్టుకొంటిని. దైవమెప్పుడేపని యెవరిచేత చేయించునో తెలియ సాధ్యముకాదు. నేటికి రెండు సంవత్సరములక్రిత మేలనో దీనిని తెలుగులో తర్జుమాచేయవలెనన్న సంకల్పము కలిగినది. ఆ సంకల్పము నాది కాదు. అది శ్రీనివాసునిదే. ఈ విషయమును నాటి కమీషనరుగారైన శ్రీ వాసుదేవరావు I.A.S గారికి ఎఱుకపఱచితిని. వారామోదించుటయే గాదు ప్రోత్సాహపఱచిరి. తరువాత తిరుమల తిరుపతి దేవస్థానము బోర్డువారి ఆమోదమునకై నా దరఖాస్తు పంపుట, వారు అనుమతి యొసఁగుట యివి యన్నియు వెనువెంటనే జరిగిపోయినవి.

ఇక నా కార్యక్రమ మొక్కటియే మిగిలియున్నది. అది అనువాదము చేయుట, నా వయస్సు నేటికి డెబ్బది వత్సరములు. పైన వృద్ధుఁడను కాని వృద్ధుడను. నేత్రావరోధము ప్రాప్తించినది. వ్రాయసకాండ్రు లేరు. నిరంతరమిది యొక సమస్య అయినది. ముందు అనువాదము నెట్లు చేయవలెనో విభాగించుకొంటిని.

తిరుమల శ్రీవారికి సంబంధించిన చరిత్రనంతయు నెగువ తిరుపతి భాగముగాను, తిరుపతిలోనున్న ఆలయముల చరిత్రను దిగువతిరుపతి భాగముగాను విభజించితిని. ఇంకను ఆలయములు-ఆగమములు అన్న భాగమొకటి గలదు. అది

ఆలయములకును ఆగమములకునుగల సంబంధమును నిరూపించును. దానినొక భాగముగా వ్రాసితిని. శ్రీవారి ఆలయమునకు, తిరుపతిలోని శ్రీగోవిందరాజాల యాది యితర ఆలయములకు రాజుల ప్రాపకము, వారు వివిధసమయములలో సమర్పించిన దానశాసనములు, వారు శ్రీవారి ఆలయమునకు సంబంధించిన పరిపాలనములో దోడ్పడిన విధము ప్రత్యేకముగా విజయనగరరాజుల కాలమునుండి మహంతుల పరిపాలనము వరకు దేవస్థానపు వివిధదశలను వివరించునది మరియొక ప్రత్యేకభాగముగా విభజించితిని. ప్రస్తుతము దేవస్థానము ధర్మకర్తల బోర్డు, 1933 వ సంవత్సరమునుండి యేర్పడిన యనంతరము ఆలయచరిత్రలో పేర్కొనదగిన యభివృద్ధికరమగు మార్పులనన్నింటిని వేరొక యధ్యాయములో వివరించితిని. ఇంతకుముందు చరిత్రగాగాని, పౌరాణికముగా గాని వ్రాయబడని. పద్మావతీదేవి చరిత్రమును గురించి పౌరాణికముగనే నాకు లభించిన సమాచారమును సేకరించి దానినొక అధ్యాయములో వ్రాసియుంటిని. ఇట్లు మొత్తము ఈ యనువాదగ్రంథము 22అధ్యాయములుగను నాలుగుభాగములుగను రూపొందినది.

అనువాదసంగ్రహమే గాని యిది యథానువాదము కాదు. కొన్ని ముఖ్యమయిన ఆసక్తికరమగు చోటుల యథానువాదమే పరిశీలించబడినది. విసువు కల్గించు వివరణములు, యుద్ధవిషయములు, దేవాలయచరిత్రకు సంబంధించని యితరవివరణములను అనువదింప యీ రచయిత సమకట్టలేదు. అట్టివి చదువుకొనుటకు చరిత్రగ్రంథములున్నవి. వానినిట మరల వ్రాసి పాఠకుని విసువుపెట్ట ప్రయత్నము చేయలేదు.

వైష్ణవుల చరిత్ర, ప్రబంధముల యుత్కృష్టత అవసరమయిన తావులందు గ్రంథభాగములోనే ప్రత్యేకముగాకాక విషయములోనే వివరింపబడినవి. వానికై ప్రత్యేకఅధ్యాయ మేమియు వ్రాయదలంచలేదు. కారణము మనకు శ్రీవారిచరిత్ర ముఖ్యముగాని, వైష్ణవులచరిత్ర, ప్రబంధముల యుత్కృష్టత శ్రీవారి తరువాతవేగాని వారితో సమమయినవి గాజాలవుగదా!

శ్రీ వీరరాఘవాచార్యులవారు విశేషించి పరిశ్రమచేసినవారు. వారు కొన్ని కొన్ని విషయముల నుదహరించుటలో జరిగిన పునరుక్తులు సవరింపబడినవి పొరపాటులు దిద్దబడినవి. కొన్నికొన్ని చోటుల మెఱుగులు పెట్టబడినవి. ఇన్ని జరిగినను ఆయన గ్రంథ మద్వితీయమనుటలో నేమాత్రము సంశయింప

బనిలేదని నిశ్చయముగా జెప్పుచున్నాను. అట నట డాక్టరు యస్. కృష్ణస్వామి వారి అభిప్రాయములు స్వీకరింపబడినవి. శ్రీసాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింప బగిన తిరుమల దేవస్థానపు శాసనపరిశీలన రిపోర్టులోని విషయములు గ్రహింప బడినవి.

అనేక తమిళ పదములున్నవి. ఇవియన్నియు తెలుగులోనికి తర్జుమా చేయవలెను. ఆకాలమునాటి తమిళ పదములకు నేడర్థము దొఱుకుట కష్టమైనది 'తిరుప్పోణకమ్' అన్నపదము ఇది. దీనికి శాసన కర్తలు సైతము 'అన్న ప్రసాదమని' యే అర్థము చెప్పిరి. ఇట్టి చోటులందీయర్థమే గ్రహింపబడినది. అర్థము తెలిసికొనుటకు వీలుకాని తావులందా తమిళపదములే వ్రాయబడినవి. అయినను నిట్టివి యత్యల్పపదములే యున్నవి. చాలవరకు అర్థవివరణము నెఱుంగుటలో శాసన పత్రికలు సహాయపడినవి.

భాష అనువాదములో సరళ గ్రాంథికము వాడబడినది. ఇది సర్వ సమగ్రమయిన ఆంధ్ర దేశములోని పండిత పామరులకు ప్రీతికరము గావలెను. సర్వాంధ్రులకు నమాదరణీయము కావలెను. పామర భాషయే వాడినచో పండి తులకు వచ్చక పోవచ్చును. శుద్ధ గ్రాంథికముపయోగించినచో పామరులు దరి చేరరు. అందువలన మధ్యేమార్గముగా సరళ గ్రాంథిక ముపయోగింపబడినది. భాషానువాదమేకాని యథానువాదము కాదని పాఠకులకీ విషయములో మరి యొకసారి మనవి చేయుచున్నాను.

ఇక ఈ యనువాదము ప్రారంభించినప్పటినుండి నాకమూల్యమయిన సలహాల నొసంగిన హిందూదేవాదాయశాఖ మాజీ కమీషనరు శ్రీ కే. వాసుదేవ రావు గారికి, మా అర్చక పరీక్షాధిపతులబోర్డు అధ్యక్షులగు పండిత అనుముల రామనాథశాస్త్రిగారికి ఎనలేని కృతజ్ఞతలు సమర్పించుకొనుచున్నాను.

అనేక తమిళ పదములకు అర్థములు విప్పిచెప్పి తమ అమూల్యమగు అభిప్రాయముల నొసంగిన శ్రీవారి అర్చక మిరాశిదారులకు కృతజ్ఞతలు.

అవసరమయిన సలహా సహకారములనిచ్చిన తిరుమల దేవస్థానం పేష్కారు వారికి నతులు. పారుపత్యదారు తమ పరిధిలోనున్న అనేక విషయ ములనుగూర్చి వివరించిరి. వారికిగూడ కృతజ్ఞతలు సమర్పించుకొనుచున్నాను.

ఇంకను తమ అమూల్యాభిప్రాయము నొసగి, గ్రంథమును పారముట్ట చదివి, యంతవృద్ధాప్యములోను నన్ననుగ్రహించిన శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి వారికి సహస్రానేక ప్రణామములు సమర్పించుచున్నాను.

ఇంకను తిరుమల తిరుపతి దేవస్థానమునకు సంబంధించిన అధికారులు అనధికారులకు ఈ విషయములో సహకరించిన వారికెల్ల కృతజ్ఞత లందించు చున్నాను.

ముఖ్యముగా నీ గ్రంథము నాములాగ్రముగా చదివి నాయందు విశేష గౌరవమునుజూపి విపులమగు పీఠికను దయచేసిన పాంచరాత్ర ఆగమజ్ఞులు, వేదాంత విచారశీలురునగు, శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి గారికి నా యాశీర్వాదముల నంపజేసెదను, శ్రీవారు వీరిని సదా బ్రోవుగాక యని ప్రార్థింతును. ఇంక నీ గ్రంథమునకు ఒక రూపేర్పఱుచుటలో సమగ్రబాధ్యతను స్వీకరించి, సర్వాంగ సుందరముగ రూపొందించి అనువాదప్రతిని శుద్ధముగా వ్రాసి తయారుచేసిన నా యల్లుఁడు చిరంజీవి శ్రీనివాసుని యనవతరము తిరుమల దేవుఁడు కాపాడుగాక యని ప్రార్థింతును.

నా చిరపరిచితులు, నా యీ గ్రంథము వెలువరించుటకు కారకులైన దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులు డా॥ చెలికాని అన్నారావు గారికిన్నీ, సహృదయముతో యీ గ్రంథ శీఘ్రముద్రణకు హేతుభూతులైన దేవస్థాన కార్య నిర్వహణాధికారి శ్రీ పి. యస్. రాజగోపాలరాజు గారికి నా ధన్యవాదములు.

ఈ గ్రంథము నెట్లు రూపొందించవలెనో తగు సలహాల నొసంగిన తిరుపతి దేవస్థానమువారి 'సప్తగిరి' సంపాదకులగు సుబ్బారావు గారికి కృతజ్ఞతలు. అచ్చుపనిలో పూర్తిబాధ్యత వహించి సర్వసమగ్రముగ నీ గ్రంథము వింతగా రూపొందించిన శ్రీవారిప్రచురణాలయ సిబ్బందికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఇంకను ఏందరో మహానుభావులు —

అందరికీ వందనములు



అనువాదకులు:

సర్దార్ దీవి రంగనాథాచార్యులు

ఉభయవేదాన్తప్రవర్తక

వైఖానసమునివరప్రణీత ప్రబంధాశయ ప్రఖ్యాపకులు, శ్రీమత్కౌశికాన్వయపయఃపారావారకాతారాధీశులు, మాన్యులు, సర్వతంత్రస్వతంత్రులు, సాంగోపాంగ సకలవేదాన్తప్రవర్తకులు, శ్రీమద్వేంకటనాథ దివ్యాజ్ఞాలబ్ధానితరసాధారణ వేదాన్త దేశికాఖ్యులు, సకలచేతనరక్షాదీక్షితులు, శ్రీవేంకటేశ్వర దివ్యపాదారవిందార్చకులు నగు —

శ్రీమచ్ఛ్రీనివాసదీక్షితుల వారి స్మృతి
చిహ్నముగా
సహృదయ హృదయ నైవేద్యముగా
సమర్పణము.

గౌతమరంగనాథుఁడు
యడ్లపల్లి యోగానంద లక్ష్మీనరసింహ
దివ్యపాదార్చనాపరతంత్రదాసుఁడు
దీవిశేషభట్టర్ పాకయాజి, పూర్ణమాంబల తృతీయ కుమారుఁడు

# విషయసూచిక

* * *

## 1-వ భాగము

### ఎగువ తిరుపతి

పేజి నెం.

పేజి నెం

8—వ అధ్యాయము (3వ భాగము)



8—వ అధ్యాయము (4వ భాగము)

పేజి నెం



9–వ అధ్యాయము

# 2–వ భాగము

## దిగువ తిరుపతి

## 3-వ భాగము

## ఆలయములు - ఆగమములు

శ్రీమై నమః
లక్ష్మీవేంకటేశ్వరస్వామినే నమః

# తిరుపతి చరిత్రము

* * *

## 1-వ అధ్యాయము

### I స్థలవర్ణనము

నేడు మనము తిరుమలగాఁ బేర్కొనెడి ప్రదేశము నాడు తిరువేంకటాద్రిగాఁ బేర్కొనఁబడెడిది. చరిత్రనవలోకించిన భగవద్రామానుజులు తిరుపతి పట్టణమును తిరుమల కనుబంధముగా నిర్మించినట్లు తెలియుచున్నది. ఇది క్రీ. శ. 12వ శతాబ్దములో జరిగెన సంఘటనము. శ్రీమద్రామానుజులు రాక పూర్వమే ఈ తిరుపతిగా నేడు పేర్కొన్న ప్రదేశమునందు శ్రీ పార్థసారథిస్వామివారి కోవెల యుండెడిది. అట నొక కుగ్రామముకూడ నుండియున్నది. నేడు తిరుచానూరు, చిరుతానూరు, అలిమేలుమంగాపురము అనెడి వివిధ నామములతోఁ బేర్కొనుచున్న గ్రామము నాడు తిరుశుకనూరుగాఁ బేర్కొనెడివారు. ఈగ్రామము తిరుమలయంతటి ప్రాచీనముకాదు కాని తిరుపతి పట్టణముకంటె కడు ప్రాచీనమని చెప్పుటలో నెట్టి సంశయము బడనక్కరలేదు.

శ్రీవేంకటాద్రిఁ బేర్కొనబడుచున్న శ్రీవారి సన్నిధికి ఐదు మైళ్ల దక్షిణముగా, తిరుపతికేడు మైళ్ల పశ్చిమదిశగాఁ జగత్ప్రసిద్ధి చెందిన చంద్రగిరి పట్టణమున్నది. తిరుపతినుండియేకాక, ఈ చంద్రగిరి నుండి కూడ శ్రీవారి సన్నిధికి కాలిత్రోవగలదు.

భారతదేశ పటమందు ఈ క్రిందివిధముగా మన మీ తిరుపతి, తిరుశుకనూరు, చంద్రగిరి పట్టణములను గుర్తింపగలము.

| | అక్షాంశము | రేఖాంశము |
|---|---|---|
| తిరుమల | 13° - 41' ఉ॥ | 70° - 21' తూ॥ |
| తిరుపతి | 13° - 38' ఉ॥ | 79° - 25' తూ॥ |
| తిరుశుకనూరు | 13° - 36' ఉ॥ | 79° - 27' తూ॥ |
| చంద్రగిరి | 13° - 35½' ఉ॥ | 79° - 19¼' తూ॥ |

తిరుపతికి నేడు అధునాతన సౌకర్యములున్న రైల్వేస్టేషను కలదు. ప్రభుత్వమువారిచే నడుపబడు బస్సర్వీసులు కలవు. ప్రభుత్వపు ప్రైవేటు బస్ స్టాండులున్నవి. విమానసౌకర్యమును ఇటీవలనే కేంద్రప్రభుత్వమువారు యాత్రికుల సౌకర్యార్థమై యేర్పాటుచేసిరి.

పూర్వమునుండియు సంప్రదాయముగా నున్న ఆచారములో యాత్ర తిరుపతినుండి ప్రారంభమగును చాలమంది మెట్లు ఎక్కుట కూడ తిరుపతినుండియే. ఏడుకొండలు వరుసగా కాలితో నడచుటయే వీరిలక్ష్యము. ఆ బాధలకు తాళలేనివారు నేడు మోటారురోడ్డుపై మోటారులలో ప్రయాణించుట కాననగును. టాక్సీలుగూడ ప్రత్యేకముగా యాత్రికుల సదుపాయమునకై నడపబడుచున్నవి. దేవస్థానము వారిచే నెలకొల్పబడిన పెక్కుసత్రములు ఎగువ దిగువ తిరుపతులలో గలవు. ఇవిగాక ఆధునిక సౌకర్యములు గలిగిన అనేక కాటేజీలు యాత్రికుల వినియోగార్థమై ఎగువతిరుపతిలో దేవస్థానమువారే వ్యక్తుల నుండి కొంతధనము సంగ్రహించి మిగిలిన ధనమును దేవస్థానమువారే భరించి యా యా దాతల పేరు పైననే ఆ వసతి గృహములు నిర్మించిరి. ఇట్టివి యనేక సౌకర్యములు యాత్రికుల కొఱకు, వారి సులభతరమగు యాత్ర నిర్వహణము కొఱకు రూపొందించి, యాత్రికులవలన వచ్చు దేవస్థానపుటాదాయమును సద్వినియోగ పఱచుచున్నారు. ఇప్పుడు రెండవఘాటురోడ్డుకూడ చంద్రగిరి వైపునుండి నిర్మించినారు. ఇవి పూర్తియయి రాకపోకలు ప్రారంభమైనందున యాత్రికుల

సౌకర్యాలు ఇబ్బడి ముబ్బడి యగుననుటలో నెట్టి సందేహము లేదు.

కాలినడక ప్రయాణమును, అందు యాత్రికుడొందెడి యనుభూతులు పరిశీలించ ప్రయత్నింతము.

కాలినడక కొంచెము శారీరక శ్రమయే. అయినను కమనీయమయిన దృశ్యములు, అతి మనోహరమైన ప్రకృతి సంపద యాత్రికుని ఆ ప్రయాణము నుల్లాసముతో తుద ముట్టజేయునుగాని, యేమాత్రము విసువునొందింపనీయవు. నడవలేనివారి కందుబాటులో 'డోలీవాలా' లుందురు. అయితే నడకలోనున్న ఆనందాస్వాదనము దానికి తగ్గ రమ్య హృదయ పరిపక్వముకూడా ఉంటేగాని సాధ్యముకాదు. కొండ మొదటగా కనబడే ద్వారమే నేడు 'అలిపిరి' గోపురమని చెప్పుదురు. ఇది 'ఆదిపడి' అన్నపదానికి వచ్చిన రూపము. దీనిని మనము 'ఆది అడుగు'గా బేర్కొనవచ్చు.

ఈ మొదటికొండ ఎక్కగానే ఒక పెద్ద గోపురము మనకు ఎదురుగా దర్శనమొసగును. ఇది 1628 వ సంవత్సరములో మట్ల అనంతరాయనిచే నిర్మింపబడినది. ఇక్కడ నుండి యాత్రికుడు దక్షిణదిశను ప్రయాణము చేయును. పచ్చనిగడ్డిపరచి అది భూకాంతకొక అలంకారమైన వలువగా మనకొక భావాన్ని బోధించును. ఒక వైపు అనంతమైన లోయలు. ఆ ప్రకృతికి దాసోహమంటూ ప్రయాణము చేయుచో ఇది యుల్లాసకరమగు యాత్రగా నుండును గాని మరోవిధముగా భావింపలేము. ఈ సమయములోనే దూరముగా స్వర్ణముఖీనది, రైల్వేలైను, తిరుపతి పట్టణము, తిరుచానూరు పట్టణము అతి మనోహరముగా నొకవైపు కానవచ్చును. మరోవైపు తిరిగినచో నున్నతమైన పర్వతశ్రేణి, అవి తన మీదనే విరిగిపడబోతున్నట్లుగా నున్నవానిని సంభ్రమభయాశ్చర్యోద్విగ్న మనస్కుడై దర్శించును.

ఇట్లే కొంత దూరముసాగిన యనంతరము తన యలసట తీర్చుటానికి కొండలే సహాయపడినవన్నట్లు మిట్ట పల్లములు లేని సమతల ప్రదేశములో ప్రయాణమును కొనసాగించును. రెండు ప్రక్కల చక్కని ప్రకృతి సౌందర్యముతో తన్మయుఁడై వ్యవసాయ క్షేత్రభూములను దర్శించును. దీని తర్వాత నిక మోకాళ్లపర్వతము. ఈ కొండకనుమ మిక్కిలి దర్శనీయముగ నుండుటతో నిట యాత్రికులు కొద్ది సేపు నిలిచి ఈ దృశ్య దర్శనాభిలాషాకౌతుక వ్యాజమున సేదఁ దీర్చుకొందురు.

ఈ కొండ కొనయందొక చిన్న మంటపము కలదు. ఇచటనే రామానుజ సన్నిధి యున్నది. దీనికే భాష్యకారుల సన్నిధియనియు బిలుతురు. దీనికొక సంప్రదాయపు టితి వృత్త మున్నది. ఈ మంటపమునందే తన మేనమామయగు తిరుమలనంబి కడ శ్రీరామానుజులు శ్రీమద్రామాయణ రహస్యార్థముల నధ్యయనము గావించెడి వాఁడట. అదియుఁగాక, రామానుజుఁడు యతియైనంత, తిరుమలను దర్శించినపుడు దేవాలయ మర్యాదలతో నీ మంటపముకడనే తన మేనమామయగు తిరుమలనంబిచే సమాశ్వాసింపబడినట్లైతిహ్యమున్నది. ఇఁటనే ఈయన 'ఎంబెరుమానార్' (మనల నడపించు మహానుభావుఁడు) అను దివ్య తిరునాముఁడయ్యెనందురు. ఈ త్రోవయంతయు ననేక మంటప సమ్మిశ్రితము. ఇఁటఁగల నొకలోతైన బావిని 'ముగ్గు బావి' అని పేర్కొందురు. ఈ త్రోవ సమీపముననే యెడమవైపున నొకమంటపమున్నది. అది 'ఘంట మంటప మని' పిలిచెదరు. దీని యైతిహ్యమిట్లు చెప్పుదురు. శ్రీవారి మధ్యాహ్న నివేదనానంతరము ఇఁటఁగల ఘంట కొట్టబడెడిదట. ఆ ఘంటా నాదము విన్న తరువాతనే చంద్రగిరి రాజైన శ్రీ రంగనాథ యాదవరాయలు తన భోజనమొనర్చువాఁడట. అవాచారి కోనకు సమీపముననే చంద్రగిరి వైపుగా తిరుమలకు వచ్చుటకు ఏనుగులు నడచు త్రోవయున్నది. దీనినే ఏనుగుల త్రోవ అని పిలిచెదరు.

ఇటీవలి కాలములో నీ కాలిబాటయంతట నుపాహారశాలలు వెలసినవి. ఈ త్రోవలో దారి బిచ్చగాండ్ర యలజడి ఎక్కువ. అనేకవిధములైన, బహువ్యాపృతులైన, బహువేషధారులైన బిచ్చ గాండ్రిటఁ గానవత్తురు. ఆసక్తిగల యాత్రికునకు మానవునిలోని దారిద్ర్యమెట్టి నీచోపాయములను స్ఫురింపఁజేసి యెట్టి యవస్థలకు గుఱి చేయునో వీరిని పరిశీలించిన తెలియగలదు. బ్రహ్మోత్సవ కాలమందు వీరి యుద్ధృతిని గూర్చి చెప్పఁబనిలేదు. బీదలకన్న దానమనునది ఈ సమయమున నొక ప్రత్యేకాకర్షణము.

ఇఁక మోటారుకారుపై ప్రయాణించు యాత్రికుఁడీ ప్రకృతి పరిశీలావకాశమును బోగొట్టుకొనుటయేగాక మానవ స్వభావ పరిశీలన మును చేయు సదవకాశము ననుభవింపలేడు. కాలినడక త్రోవ యుత్సా హోత్పాదకముకాగా, మోటారు త్రోవ బహు సూక్ష్మవక్రగతుల కాల వాలమై, ప్రతిసన్నని వంపులోను, తాను చూచెడి ప్రకృతి సౌందర్య దర్శనాపేక్షను మరల్చి తన జీవితపు మనుగడపైగల ప్రమత్తతను హెచ్చరించును.

తిరుపతి పుట్టక మునుపే పల్లవుల చోళుల కాలమునుండి 'తిరుచుకనూరు' (తిరుచానూరు) గ్రామములో 'గ్రామసంఘము' లేక 'గ్రామసభ' యొకటి యుండెడిది. ఇది శ్రీవారి ఆలయ నిర్వహణ వ్యవహారమును పరిశీలించుచుండెడిది. తిరుపతికి రెండుమైళ్ళ దక్షిణ మున స్వర్ణముఖీనది యొడ్డున నీ గ్రామమున్నది. అనేకమైన పంట కాల్వలీనదినుండి వెల్వడి ఈ గ్రామములకు చుట్టుప్రక్కలగల పంట పొలములకు నీటినందించుచున్నది. ఈ ప్రదేశమునుండియే 'వడుగర' దేశమని పిలుతురు. కాని పరిస్థితుల ప్రభావముచే తిరుమల శ్రీవారి ఆలయమున కనుబంధింపబడిన అన్నివృత్తుల వారును విధిగా తిరుపతిలో నివాస మేర్పఱుచుకొనుట విధియై, యా తిరుపతి పట్టణమభివృద్ధి నొందుటకు హేతువయ్యెను.

చంద్రగిరి : సాళువ నరసింగరాయని ముత్తాతయగు సాళువ మంగిదేవుని కాలమునుండి ఈ చంద్రగిరి పట్టణమున్నట్లు చారిత్ర కాధారము కలదు. ఈతఁడు మధుర సుల్తానుల నెదుర్కొనుటకై వీర కుమారకంపనిచే నేర్పాటుగావింపఁబడిన సైన్యాధికారులలో నొకడు. ఇది 14 వ శతాబ్దపుటాదికాలములోనిది. ఇదియొక పెద్ద పట్టణముగా రూపొంది సాయుధ సంరక్షణాత్మకమై మొదటగా సాళువులకు బల మైన కోటయై, ఆ తరువాత విజయనగరరాజులకు వశమయ్యెను. విజయనగరరాజుల యనంతరము దీని ప్రాభవము తగ్గెను. నాటి మహా సౌధ ప్రదేశములు నేడు పచ్చిక బీళ్ళయ్యెను. ప్రాచీన దుర్గ ములు, అగడ్తలు, సుందర సౌధములు నేడు వాని ప్రాత సొగసును గుర్తు చేయుచున్నవి. గ్రామమునకు నుత్తరముగా మైలు దూరములో చంద్రగిరికి రైల్వేస్టేషను గలదు.

శ్రీవారి ఆలయమున్న తిరుమల కొండలు మన దృష్టి నెక్కువగా నాకర్షింపవలసియున్నది. బహుళ ప్రచార మొందిన నాలుగు త్రోవలు ఈ కొండల నెక్కుటకుగాను గలవు. తిరుపతినుండి చంద్రగిరినుండి గల రెండు త్రోవల విషయ మీవరకే చర్చింపబడినవి. తూర్పునగల 'మామండూరు' కొండ త్రోవనుగల బాలుపల్లినుండి పోయెడిది మూడవది. పశ్చిమమునగల 'నాగపట్ల' గ్రామమునుండి నాల్గవది. ఇంకను ఇతరములగు కాలిబాటలున్నవి. 18 వ శతాబ్దిలో మిగుల ప్రశస్తినొందిన 'కార్కంబాడి' అను కాలిబాట యొకటి కలదు. ఇది తలకోన జలపాతమును గలిపెడి యరణ్య మార్గము. ఇది తిరు మలకు మిక్కిలి పశ్చిమముగానున్న మార్గము.

తిరుమల కొండలవరుస తూర్పుకనుమలలోనిది. మద్రాసుకు దక్షిణమునగల 'అన్నామలై' నుండి ప్రారంభమయి మైసూరునకు తూర్పు సరిహద్దుప్రాంతమగు కోయంబత్తూరు, సేలము, ఉత్తరఆర్కాటు జిల్లాలగుండా ప్రయాణించి చిత్తూరు జిల్లాలోని పల్మనేరునకు జేరును.

ఇక్కడనుండి యీ కొండలు కొంతవైపు 'తలకోన' జలపాతమువరకు నీశాన్యముగాఁ బయనించి మరల తిరుమల వరకు తూర్పునకు ప్రయాణము చేయును. తలకోననుండి తిరుమలవరకు దీనిపొడవు 12 మైళ్లు. కాని దీని చుట్టుప్రక్కలగల అటవీమార్గముతో గలసి యిది 20 మైళ్ల విస్తృతి గలిగియుండును. అనాదినుండి ఈ ప్రదేశము పరమ పవిత్రమైనది. దీనికిఁ దార్కాణముగా నీ తలకోన జలపాతమునకు బాగుగా పశ్చిమముననున్న మరియొక జలపాతమును 'పాపవినాశనకోన' యని బిలచెదరు. తూర్పునగల జలపాతముగూడ పాపవినాశనపుకోనయే. ఈ పర్వతప్రాంతమంతయు నిట్టి యనేక జలపాతములతోను, దట్టమైన అడవులతోను, ప్రధానముగా వన్యమృగములతోను నుండును. ఈ అడవులయందు రక్తచందనపు వృక్షజాతి ఎక్కువగా నుండును. కొండల లోయలలోను, కొండలోని చిట్టడవుల యందును నట నట ఓషధీ సంబంధితమగు పలురకముల వృక్షసంపదయు గలదు. తలకోనవైపున గల కొండలఎత్తు సముద్రపు మట్టమునకు 3,583′ అడుగులు. తిరుమల కొండలకు పశ్చిమమునకు గల నారాయణాద్రి యున్నవి. సముద్ర మట్టమునకు 3,622 అడుగులు.

'తలకోన' జలపాతము. దానికి సంబంధించిన ప్రవాహము తూర్పుకనుమలలోని 'తలకోన' ప్రాంతమున నీ కొండలు ఉత్తరమున నుండి తూర్పునకు మెలితిరుగుట వలన కలిగిన యొత్తిడి ఫలితమని చరిత్రకారు లూహింతురు. ఇట నుత్తరమున కొండల ఎత్తు. 3,588′ దక్షిణమున 3,800′ జలపాతపు కొండ ఎత్తు 2,650′ జలపాతము పడెడి ఎత్తు 80′. పాకాల-ధర్మవరంమురైలుమార్గ మీచోట సముద్రమట్టమునకు 1800′ నుండి 2000′ వరకు వున్నది. ఇచట కొండకు పశ్చిమముగా దిగువునగల సమతల ప్రదేశమున సిద్ధేశ్వరాలయమున్నది. కొండపైగల ప్రప్రథమ జలపాత మగుటచే దీనికి 'తలకోన' జలపాతమనిరి.

కొండపైగల శ్రీవారి ఆలయమున కతిసమీపమునగల జలపాతములు రెండు. ఒకటి తూర్పునగల పాపవినాశనము, రెండవది 'అవాచారికోన'. దేవాలయమునకు నుత్తరముగా ప్రవహించెడిది పాపవినాశనము. రెండవది ఆగ్నేయముగాఁ బ్రయాణించును. ఇవి రెండును అనేక తీర్థ సమ్మిశ్రితమగుటచే మిగుల ప్రశస్తి గన్నట్టివి.

పాపవినాశనపు వంక :

వాయవ్య నైఋతీ పల్లపు ప్రదేశముఁ బ్రవహించుచున్న నీ వంక కనేక చిన్న నీటి పాయిలు గలవు. అందు వాయవ్యమున పసుపుతీర్థము, కుమారతీర్థము, రామకృష్ణతీర్థము, తుంబురుకోనలు ప్రసిద్ధి వహించినట్టివి. నైఋతీ దిశను జాబాలి, ఆకాశగంగ, పాపవినాశనము, సనకసనందన తీర్థములువున్నవి. ఇందు అత్యంత ప్రాముఖ్యము వహించినవి తుంబురుకోన, ఆకాశగంగ, పాపవినాశనము అనుపేరుగల తీర్థములు.

తుంబురుకోన :

ఈ కోనకడకు మామండూరు రైల్వేస్టేషనునుండి సులువుగా ప్రయాణము చేయవచ్చును. ఈ జలపాతము మిగుల ఎత్తునుండి పడుచు నిట్టనిలువుగా పెద్ద ధారతో దిగువున కుఱుకును. అటనుండి నల్లరాతి బండలమీదుగా నీరు ప్రవహించును. నీరంతయు స్వచ్ఛముగా నుండును. చేపలు పరువులెత్తుచు కమనీయముగా దర్శనమొసఁగును. జలపాత సమీప ప్రదేశమునగల వృక్షసంపద మిగుల దట్టము. గంభీరము, మనోహర సౌందర్య స్ఫోరకము. దీనికొక యైతిహ్యామున్నది. అనేక మునిజన సంవాసితమైన దీ ప్రదేశము. పులులు తదితరములగు యడవి జంతువుల వేటాడుట కిది యనుకూలమగు స్థలము. ఇటనొక గుహకలదు. ఆగుహనుండి శ్రీవారి ఆలయమునకు మార్గము గలదని

కొందఱు చెప్పుదురు. ఇంతకంటె ముఖ్యమైన విషయమే మన 14వ శతాబ్దమున విగ్రహ విధ్వంసకులగు మునల్మానుల దండయాత్రా సందర్భమున, వారిని తప్పించుకొనుటకు శ్రీరంగమునుండి శ్రీరంగనాథుని యుత్సవమూర్తిని తిరుమలకు చేరవేయుచు మార్గమధ్యమున నిచ్చోట నా విగ్రహవాహకుఁడు విగ్రహముతో నీలోయలో పడెననియు, నట దైవవశమున నంతకుముందే మందిరము నిర్మాణమై యుండెననియు, ఆ మంటపములో నీ శ్రీరంగనాథుఁడు తిరుమలకు చేరుటకుముందు కొంతకాల మిట పూజింపబడెనని చెప్పుదురు. దీనికి తార్కాణముగా ప్రవాహమధ్యమునగల నొకమంటప మీయైతిహ్యమును ఋజువు పఱచుచు దర్శనమొసంగును.

ఆలయమునకు మూడుమైళ్లదూరములో నీ పాపనాశన జలపాతమున్నది. యాత్రికుని పాపములన్నియు నీ జలపాత స్నానము క్షాళనమొనర్చునని విశ్వాసము. తిరుమలనంబి శ్రీస్వామివారికి నిత్య తిరుమంజనార్థము జలమును సంగ్రహించుచుండెననియు, నాతని భక్తి తత్పరతను బరీక్షించుటకు శ్రీ వేంకటేశ్వరస్వామివారు వేటకాని రూపము నాతని గలిసి తన దాహము దీర్ప నాకలశ జలము నొసంగుమనియడిగిరట. కాని యాతఁడు తిరస్కరించుటచే నాగ్రహించి యొక బాణముతో కలశమునకు రంధ్రమొనర్చి యా జలమును పానము చేసెనట. ఇది యెఱుగని తిరుమలనంబి, దేవాలయమునకేగి కలశములో జలము నిండుకొనియుండుట గాంచి విస్మితుఁడయ్యెను. దానికితోడు అభిషిక్తగాత్రుఁడగు శ్రీవారును, నాతనిని మరింత యాశ్చర్యమగ్నుని గావించెను. తెల్లవారినంత తిరుమలనంబి తీర్థగ్రహణార్థమై బయలు దేరుటలో నీ వేటకాని స్వరూపములోనున్న శ్రీవారాతని నెదుర్కొని, పాపవినాశతీర్థ సమపవిత్రమగు జలధారయొకటి యత్యంత సమీపమున నున్న దానిని జూపెనట. దానికై యా వేటకాడు తనకడ బాణమును వింటను సంధించి నేలపైగొట్టి యా జలధార యేర్పడినట్లు

చెప్పుదురు. ఇదియే 'ఆకాశగంగ'యను పేరుతోఁ బిలువబడుచున్నది. నాటినుండి తిరుపతిలోని స్వామివారి సేవకై యాకాశగంగనే తెచ్చుచుండెను. ఐతిహ్య మీ రెండు జలధారలకు సంబంధించుటచే యాత్రికులు తప్పనిసరిగా నీ రెంటియందును స్నానమొనర్తురు.

అవాచారి వంక :

ఇది యొక జలసంగమ స్థలము. ఈ వంక కాలిబాటకును మోటారు రోడ్డునకును తగులును. ఉత్తరదిశనుగల గోగర్భ వైకుంఠ తీర్థములనుండి దక్షిణమునకుగల శేష, సీతమ్మ తీర్థములనుండి జలము గ్రహించును. భీమతీర్థము, ఆళ్వారుతీర్థము ఇవి తిరుపతికై పు గల దూరతీరమునకున్న తీర్థములు. తలకోన కీశాన్యదిశగా పర్వత శ్రేణి వంపుకు వేంకటగిరి వైపునకు తిరిగిన యొత్తిడిచే ననేక జలధార లేర్పడినవి. కొండకు తూర్పువైపున ననేక తీర్థములున్నవి. అయినను తూర్పు పడమరలగల తీర్థములన్నియు పాపవినాశమను పేరఁ బరఁగుచున్నవి. ఇది 'పాపదహనమతి'ను నర్థమిచ్చు 'వేంకట' శబ్దమున కన్వర్థమైయున్నది. ఈ విషయమును ప్రకటించుచు ననేక పురాణకథలు యాత్రికుని మనస్సు నాకర్షించును.

ఈ పవిత్ర తీర్థముల చరిత్ర ముగింప బోవుటకు ముందు వేంకటాద్రికి సమమగు పోలికలు కలిగిన అహోబిల పర్వత దేవాలయము మనము దృష్టికిఁ దెచ్చుకోవలెను.

ఈ యహోబిల పర్వతమున అసహజమైన వంపు కలిగి రెండుగా చీలిన ప్రదేశమును నేడు 'జ్వాలానరసింహ ప్రదేశ'మని బిలుచుచున్నారు. తిరుమలలో నేవిధముగా పాపవినాశ జలపాతము గలిగి యుండెనో నిట గూడ నొక కొండధార భవనాశినీ నామములోనున్నది. దీనిని చేరగలుగుటత్యంత క్లేశ సాధ్యము. పర్వత మిరువైపుల నిట్టనిలువుగా నుండి కొన్ని వందల యడుగుల లోతుండును. కాని దృశ్య

ములు మాత్ర మతి మనోహరము. ఇందో యొక ప్రక్కన గల సన్ని కాలిబాట జ్వాలా నృసింహస్వామివారి ఆలయమునకుం జేర్చును. అచట నొకచల్లని నీటిపడియుగూడ గలదు. బాగుగా కొండపైకినెక్కిన యట నొక యుక్కు స్తంభము గలదు. సంతానార్థమైవచ్చిన దంపతులు దీనినికౌగిలింతురట. దీనిని యాత్రికులు పరమ పవిత్రమైన ప్రదేశముగా భావింతురు. తూర్పుకనుమల ప్రాంతమంతయు నిట్టి విశేషములతో నిండియున్నది.

ఈ తిరుమల పర్వతమున కనేక పేళ్లున్నవి. శేషాచలము, గరుడాచలము, వేంకటాచలము, నారాయణాద్రి, వృషభాద్రి, వృషాద్రి, అంజనాద్రి అనునవి వానిలో కొన్ని ముఖ్యమైనవి. ఇందుకుగల ప్రతినామమునకొక ప్రత్యేకమగు నైతిహ్యమున్నది. నేటి ఆధునికుల మతరహిత తత్వము ననుసరించి వీనికిగల ప్రామాణ్యము కొంతతగ్గిన తగ్గవచ్చును. అయినను స్థలవిశేషమును గుఱించి చెప్పవలసినపుడు కొంత దాని ప్రాచీనతను గుఱించియు చెప్పవలసివచ్చును. క్రీ. శ. 15 వ శతాబ్దమునకు పూర్వ మీ పర్వతము 'వేంగడము' 'తిరువేంగడము' అన్న పదములతోనే శాసనములలోని కెక్కుటను గమనింపవలసియున్నది.

## II తిరుమల శ్రీవారి ఆలయ ప్రదేశవర్ణనము

నేడు మూలమూర్తియు, ధృవమూర్తియు నగు శ్రీ వేంకటేశ్వర స్వామివారు నిలిచియున్న స్థలము తిరుమల కొండశిఖరమని యొక ప్రాచీనాభిప్రాయమున్నది. ప్రాచీన తమిళ కావ్యమగు 'శిలప్పదికారము' ను గ్రంథములో నీ విషయమిట్లు వ్రాయబడియున్నది.

"వేఙ్గడ మెన్నుమ్ ఓఙ్గుయర్ మలైయ్ యుత్తుచ్చిమీమిశై"

వేంకటాచలమనే ఎత్తైన కొండపై వసించిన స్వామి యనియర్థము.

ఈమూర్తి స్వయంవ్యక్తమేగాని స్థాపనమూర్తి మాత్రముకాదు. ఈ కారణముచేతనే నీ స్వామిని 'ఉచ్చియిల్ నిన్రాన్' (కొండకొన నున్న

స్వామి) అని పేర్కొనిరి. స్వామివారి ప్రసాదముల కొలమానము నకును అనేక శతాబ్దములవరకు కూడ 'ఉచ్చియిల్-నిన్రాన్-కాల్' అనియే పేర్కొనిరి. 13వ శతాబ్దము మధ్యభాగము వరకు నీ యభిప్రాయమే యనుసరింపబడినది. దేవాలయ పరిసరములు, స్థలపరిశీలనా పరిజ్ఞానము మెఱుగుబడిన తరువాత, దేవాలయము పరిసరములకెంతో లోతైన ప్రదేశములో నున్నదనెడు భావము కల్గినది. ఈ భావము నానాటికి బలపడినది. పదునాలుగవ శతాబ్దమున నుత్సవమూర్తికి 'మలయ కునియ నిన్రాన్' అనుపేరుంచుట, ప్రసాదపు కొలమానము కూడ 'మలై కునియ నిన్రాన్- కాల్' అని పేరుమార్చుట జరిగినది. కొండపైగల కొలమానమునకును దిగువున నున్న స్వామికి నుపయోగించెడి కొల మానమునకును భేదమున్నది. పూర్వాపరములందుంచబడిన పేళ్లలోగల అర్థములోని మార్పేమైన గలదేమో తెలియజాలము. దిగువున నున్న స్వామికి నుపయోగించెడి కొలమానమును 'అరుమొనిదేవన్' అనియు తరువాత 'చాళుక్య నారాయణన్ కాల్' అనియు చెప్పిరి. 1354 వ సంవత్సరమునాటికి 'మలైకునియ నిన్రాన్' అను పేరు శాసనములలో గానవచ్చినప్పటికిని, దేవాలయ నిమ్నతా పరిజ్ఞాన మప్పటికి రెండు శతాబ్దములకు ముందునుండి యే కలిగినదని యూహింపవచ్చును. దీనికి తార్కాణముగా పెరియనంబి శిష్యులకు 'మలైకునియ నిన్రాన్' అను గృహనామ ముండెడిది. తిరుమల శ్రీవారికిగల పేళ్లలో నిదియొకటిగా మనము గుర్తింపవచ్చును. ఆళవందారు శిష్యులలో పెరియనంబి యొకరు. ఈతని జనన కాలము క్రీ. శ. 937 ప్రాంతముగా గుర్తించిరి. 'మలైకునియ నిన్రాన్' పేరుకూడ సుమారు 980 వ సంవత్సరము ప్రాంతములో పుట్టియుండనగును. ప్రాథమిక దేవాలయ నిర్మాణములో నీతడు భాగస్వామ్యము వహించియుండుననుట అసంగతము కాజాలదు. అప్పుడే దేవాలయ ప్రాముఖ్యతను బట్టి యీ స్వామి 'మలై కునియ నిన్రాన్' పేరుపొంది యుండుట నూహింపవచ్చును,

దేవాలయమున కుత్తరమున నీకొండల యెత్తు 3,426′, అలో త్రికోణాకృతి గలిగియున్నవి. దానికి కొంతముందు 'జాబాలి తీర్థమున్నది దాని యెత్తు 3,177′, తూర్పున నీ కొండలు 2,250′ నుండి 2,750′, వరకు నెత్తు గలిగియున్నది. దక్షిణమున నీ కొండల యెత్తు 2,920′, వరకు గలదు. వాయువ్య దిశనుగల నారాయణాద్రి ఎత్తు 3,620′. ఇదియే అన్నింటికంటె మిగుల యెత్తైన ప్రదేశము. ఈ అంకెలు తిరుమల శ్రీవారి దేవాలయ మెంతదిగువున గలదో స్పష్టపఱచుచు 'మలై కుసీయునిన్హాన్' అను పేరునకెట్లు తగియున్నదో తెలుపును.

## III శ్రీవారి ఆలయ స్థల స్మృతులు

### స్థల మాహాత్మ్యములు :

స్థల స్మృతులను గుఱించి తెలిసికొననిదే శ్రీవారి ఆలయ స్థల వర్ణనము పూర్తికాదు. ఇది సంగ్రహముగా నిట వివరింపబడుచున్నది. దక్షిణ భారతములోని అనేక పుణ్య స్థలములు మహమ్మదీయుల దురాక్రమణమునకు గుఱియై మిక్కిలి నాశమొనర్పబడినవి. కాని తిరుమల శ్రీవారి ఆలయమట్టిదురవస్థకు గుఱికాకుండుట స్వామివారి మాహాత్మ్యముగా మొదట పేర్కొన వలసియున్నది. తరువాత నీ ప్రదేశము సకుప్త రహస్య స్థావరమును, కారణమగును. కనుకనే నిది మిక్కిలి భద్రతావహమయినది. హిందూ రాజుల పరస్పర విద్వేషాసూయలపై దేశ భవిష్యత్తు ఆధారపడి యున్నను దేశమునే రాజు పాలింపవచ్చినను శ్రీవారి ఆలయపురోభివృద్ధి యేవిధముగను నాటంక పఱుపబడలేదు. విజయమందిన ప్రతిరాజును దేవాలయ పురోన్నతికి తనకోపినంత దానమిచ్చెడి వాడని శాసనాధారములచే తెలియవచ్చును. తిరుమల శ్రీవారి ఆలయ ప్రాంతములు విదేశీమతానుయాయుల దాడులకు గుఱియయిన విధానము దాని వలన దేవాలయ పురోన్నతి కెట్టి విపత్తు వాటిల్లెనో యిట మనము తెలిసికొనవలసియున్నది.

మొదటగా విదేశీదురాగతులు మన సత్త్వ పరిశీలనము నతి త్వరితముగా గ్రహించి వారికి వెనువెంటనే దేవాలయపు రాబడిలోని కొంత సొమ్మును వారి కర్పించుట యన్న విధానము విదేశీదుండగులకు పాలిచ్చు గోవు పొదుగును ఛేదించుట మంచిది కాదనెడి సూక్తిని దలపించినది. చిత్తూరు జిల్లాలోని ఈశాన్య దిశనుగల 'కార్వేటినగరం' జమీందారీ ప్రాంతమున ఈ తూర్పు కనుమలు ప్రవేశించి అవి యుత్తర దిశగా ప్రయాణించి, క్రమక్రమముగాఁ దూర్పు దిశకు వంగి తిరుపతి వరకు ప్రయాణించును. ఇచట ఒక వరుస పొడవైన లోయగా చీలి ఉత్తరదిశగా 'కార్కూంబాడి', 'మామండూరు' గ్రామములగుండా కడపజిల్లాలోనికి పోవును. మామండూరు లోయకుఁదూర్పున నీ కనుమలు మరల యొకసారి యున్నతిని బడసి కాళహస్తి జమీందారీ ప్రాంతమునుండి నెల్లూరు జిల్లాలో ప్రవేశించువరకు నాగ్నేయదిశను బయనించును. ఈ కనుమల వరుస 'బాల్ఘాట్', లేక మైసూరు ప్రాంతములను 'పేయన్ ఘాట్' తో వేఱుపఱచును.

క్రింపనుండి యీ కొండలపైకి చేరుటకనేక దారులున్నవి. వానిలో ముఖ్యమైనవి కల్లూరు, మొగిలి, శయనగుంట త్రోవలు. తూర్పునన్నున్న నాలుగవ త్రోవ 'కార్కూంబాడి' త్రోవ. ఇది 18 వ శతాబ్దములో చరిత్రాత్మకముగా ప్రసిద్ధిగన్నట్టిది. భాకరాపేటకు పోవు 'నాగపట్ల' కొండ త్రోవకుఁగూడ కొంత ప్రాముఖ్యముకలదు. ఈ త్రోవలు విదేశీ దురాగతులకు కొంత వసతి సమకూర్చి పెట్టినవి. దామలచెఱువు త్రోవ, కార్కూంబాడి త్రోవలు దురాక్రమణ దారులకు చంద్రగిరి తిరుపతులకు మార్గమీయనంతవరకు తిరుమల శ్రీవారి యాలయస్థితికెట్టి భంగముకలుగలేదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

కల్లూరు త్రోవ దామలచెఱువు లోయగుండా చంద్రగిరి తాలూకాలో ప్రయాణించి కల్లూరు పాలియం పీలేరు తాలూకాలను చేరును. మద్రాసు కడప రహదారి మార్గము ఈ త్రోవగుండా పోవును.

మొగిలి త్రోవ చిత్తూరు తాలూకాలో గలదు. దీనిలో నుండియే మద్రాసు—బెంగుళూరు రహదారి మార్గము బోవును. ఇట గల పర్వతము క్రమోన్నతము. గుడియాత్తం, పల్మనేరు రహదారి మార్గము గుండా శయనగుంట త్రోవ గలదు. ఇవి మొగిలి త్రోవతో కలియును. ఇది నిట్ట నిలువుగా నెక్కవలయును. గుడియాత్తం తాలూకాకు పశ్చిమ సరిహద్దునగల 'నాయకనేరి' కొండ త్రోవగుండా బెంగుళూరు నకుగల పాత బాటకూడ చాల నిట్టనిలువుగా నెక్కవలసినట్టిదే.

క్రీ. శ. 1310వ సంవత్సరములో దక్షిణభారతము పై మాలిక్ కాఫరు చేసిన దండయాత్ర రామేశ్వరమువరకు చిచ్చుపెట్టినది. ఈ మారణహోమములో తిరుమల, దాని పరిసర ప్రదేశములకు కొంత ముప్పు వాటిల్లినట్లు వినబోము. అంతేకాక చోళుల, పాండ్యుల, హోయసాళుల, విజయనగర రాజుల క్రమపాలనమును నెట్టి వైపరీత్యము తిరుమల ప్రాంతములకు సంభవింపనీయలేదు. ఏమైనప్పటికిని, విజయనగరరాజ్యము క్రీ. శ. 1565 ప్రాంతములో తళ్లికోటయుద్ధానంతరము పరిస్థితులు కొంత ప్రమాద స్థాయిని చేరుకొన్నవి. బీజపూరు సుల్తానునకు ఢిల్లీ సుల్తానగు షాజహానునకు జరిగిన యొప్పందము ప్రకారము క్రీ. శ. 1636లో చంద్రగిరి గోల్కొండ నవాబులవశమైనది. ఈ ప్రాంతములకు తరువాత వచ్చిన సాహసిక విజేత శివాజీ గోల్కొండ నవాబుతో జరిగినయొక యొప్పందము ప్రకారము తన తమ్ముడైన వెంకాజీ తమ తండ్రి నుండి రాజ్యమును సంక్రమింపజేసికొని యనుభవించుచుండెను. ఈతడే కర్ణాట దేశముపై దండయాత్ర జరిపెను. క్రీ. శ. 1676లో నీయన కల్లూరు కనుమగుండా కర్ణాటమును ప్రవేశించెను. వెల్లూరు, అరణి, జింజీ, పట్టణములను పట్టుకొనెను, కాని తన సహచరుడైన గోల్కొండనవాబు పిలుపుపై నట నుండి తిరిగి పోవలసివచ్చెను. క్రీ. శ. 1674వ సంవత్సరములో తనకుతానే ప్రభువుగా ప్రకటించుకొని యీ విధమయిన దండయాత్ర

ములో నబాబుసోదరుడు 'అబ్దుల్ వహాబ్' అను నాతఁడు దేవాలయపు రాబడిలో తనకును కొంతభాగమును కోరియుండెను. బ్రిటిషువారు ఈ సమయములో కడు జాగరూకులై ప్రవర్తించి యీ ప్రయత్నమును విఫలమొనర్చిరి. ఈతఁడు చంద్రగిరికోటను మొదట స్వాధీనము గావించుకొని బ్రిటిషువారిపై దెబ్బతీయుటకు తగిన అదనుకై నిరీక్షించుచుండెను. 'బుస్సీ' దొర హైదరాబాదుకు పోవుచు త్రోవలో తిరుపతిలో నాగెను. ఈతఁడు దేవాలయపు పాటదారుకడ బలవంతముగా నొక సంవత్సరపుటాదాయమును రాబట్టఁగల్గెను. ఈ కార్యక్రమములో నెల్లూరులోనున్న నజీబుల్లా, చంద్రగిరిలో అబ్దుల్ వహాబ్ ఈయనకు పూర్తిగా సహాయపడిరి ఇది జరిగిన కాలము 1758 వ సంవత్సరము అక్టోబరునెల.

మహారాష్ట్రుల సేనాని గోపాలరావు. కార్కాంబాడిపద్దగల సైన్యమునకు ముఖ్యుఁడగు బాలాజీరావుచే అత్యవసరముగఁ బిలిపింపఁబడెను. ఈ సైన్యమును నడిపించువాఁడు నారాయణశాస్త్రి అను సేనాని. జులై 1759వ సంవత్సరములో నీయన మరల తిరుమల దేవాలయమును స్వాధీనపఱచుకొనెను, ఇది 'పాలేగర్' సహాయముతో జరిగినది. దీని నెదుర్కొనుటకై బ్రిటిషువారు 300 సిపాయిలను 15 మంది యూరోపియను అధికారులను కొండపైకి పంపిరి. కాని 300 సిపాయిలలో కేవలము 80 మంది మాత్రమే కొండ నెక్కుటకనుమతింపఁబడిరి. వీరెనుబదిమంది కొండనెక్కి దేవాలయ ప్రాంగణమున నొకయుద్ధకాండను జరిపిన ఫలితముగా నిరుపైపులననేకులు హతులైరి. దానితో మరికొందఱు సైనికులు క్రింద నుండి పంపఁబడిరి. కాని వీరిలో గూడననేకులు కొండనెక్కుట కనుమతింపబడరైరి. ఆకారణముచే నింగ్లీషువారు కోపోద్రిక్తులైరి. వారి సేనానియగు 'మేజర్ కాలిఝండ్' కరకంబాడి గ్రామమును ముట్టడించి తగుల బెట్టించెను. నారాయణశాస్త్రికి వెనుకకు మఱలక

తప్పని స్థితిగలిగెను. దేవాలయమునకాంగ్లేయులు మరల వచ్చుటకు అంగీకారమయ్యెను. ఆర్కాటు నవాబుకు, ఫ్రెంచివారికి, ఇంగ్లీషు వారికి పరంపరగా ప్రతినిధిగా నప్పుడుండిన దొరై శ్రీనివాసాచారి మహమ్మదీయులకు కొండనెక్కు యవకాశము విరోధించుటయే పవిత్ర విధిగా తలంచినట్టివాడు.

క్రీ. శ. 1779 వ సంవత్సరములో మైసూరు యుద్ధము ప్రజ్వరిల్లి నప్పుడు ఉత్తరపు వైపు పులికాట్టు, దక్షిణపువైపు పాండిచ్చేరి వరకు గల ప్రదేశమును, వెల్లూరునకు చుట్టునుగల ప్రదేశమును హైదరు సర్వనాశనముగావించెను. ఈ ప్రయత్నము నిరోధించుటకుగాను 'కొలోనెల్ బెయిలీ' అను నాతనిని గుంటూరునుండి కాళహస్తి, తిరుపతుల మీదుగాఁబంపఁబడెను. కాని యీ కలోనెల్ బెయిలీ ఈ త్రోవ మిగుల ప్రమాదకరమని భావించెను. కనుకనే యాతఁడు తీరప్రాంతము గుండా పయనించెను. దానితో తిరుపతి, తిరుమలలు రెండు వినాశము నుండి తప్పింపబడినవి.

క్రీ. శ. 1781 లో జరిగిన 'షోళింగరు దండయాత్ర'- అనంతరము, 1780-81 లో జరిగిన 'వెల్లూరు ముట్టడి' కిఁబూర్వము కల్లూరు కనుమవద్ద హైదరు తానుగానుండి, వెల్లూరులోనున్న ఇంగ్లీషువారికి సరఫరాల నడ్డగింపజేయుటకుగాను కార్వేటినగర, కాళహస్తి జమీందారుల సహాయ సహకారములను బూర్తిగా పొందెను. దేవస్థానపు ప్రతి విధులుగూడ నీతనితో చేయికలిపిరి. ఈ కారణముగా తిరుమల తిరుపతి నగరము లెట్టిముట్టడి లేక సంరక్షింపబడెను. మహమ్మద్ ఆలీ సోదరుఁడు చంద్రగిరిని హైదరున కొసంగెను. క్రీ. శ. 1781 లో 'సర్ ఈర్ కూట్' చంద్రగిరిని తన సమీప ప్రదేశములోనుంచు కొనియు దాని నాతఁడు ముట్టడింప యత్నింపలేదు. అప్పటికి చంద్రగిరి 'అబ్దుల్ వహాబ్' స్వాధీనములో నుండెను. కాని దాని ప్రాముఖ్యము నీతడు విస్మరింపలేదు. 1782 వ సంవత్సరములో 'అబ్దుల్ వహాబ్'

నుండి చంద్రగిరి పట్టణమును విముక్తిగావించి యాతనిని శ్రీరంగ పట్టణమునకు బందీగాఁబంపెను. ఈ హైదరు చిత్తూరునకు సమీప మునగల 'వరసింగరాయనిపేట' కడ మరణించెను. నేటికిని ఈతని సమాధి అచ్చట గలదు. అతఁడు తన అనుచరులను తిరుమలపైకి ఎక్కించుటగాని, దేవాలయమును కొల్లగొట్టించుటగాని చేయకుండుట నిజముగా వింతవిషయము.

క్రీ. శ. 1791 లో లార్డుకారన్ వాలీసు తనంతటతానుగా సైన్యము నడపి మూడవ మైసూరు యుద్ధములో టిప్పుపైకి లంఘించి, మైసూరు పీఠభూమిని 'నాయకనేరు' కనుమద్వారా నాక్రమించునట్లు నటించి చివరి క్షణములో తన సైన్యమును మొగిలి కనుమగుండా నడిపించెను,

క్రీ. శ. 1801 జులై 31వ తేదీన కర్ణాట దేశమంతయు నింగ్లీషువారికి వశమయ్యెను. చిత్తూరు జిల్లా ప్రతినిధులు మాత్రము వీరిని ప్రతికూలించుచుండిరి. ఆకారణముచే వీరు బ్రిటిషువారిచే నడ వుల లోనికి తఱిమికొట్టబడిరి. వారుకోపోద్రిక్తులై తిరుపతి యాత్రి కులను కొల్లగొట్టసాగిరి, అపుడు ఇంగ్లీషువారు తిరుపతి పోయెడి యాత్రికుల సంరక్షణ నిమిత్తమై బాటలన్నియును సైన్యముచే కాపుదల చేయించుటకు నుత్తర్వునొసగిరి. తిరుగబడినవారిపై యుద్ధనేరమును మోపి శిక్షించుచుండిరి.

1801వ సంవత్సరములోనే తిరుమల దేవాలయము పూర్తిగా నింగ్లీషువారి ప్రత్యక్షపాలనములోనికి వచ్చెను. ఆకాలములోని శ్రీవారి ప్రసాదముల జాపితాను గమనించినచో నాటి ప్రసాదముల పరిమాణ మెంత తగ్గింప బడినదో తెలియగలదు.

తిరుమల దేవాలయ పవిత్రత, పర్వతముయొక్క పావిత్ర్యము, ఇటు మహమ్మదీయులచేతను, నటు నింగ్లీషువారిచేతను, తమకు మిక్కిలి సమీపములోనుండియు, నతిస్వల్ప సమయములోనే తమ

సేనలనుతికింపగల సమర్థులయ్యెను. సరిసమానముగా గౌరవింపబడిన
వని చెప్పుటకే పైక్రమానుగతమగు చారిత్రకాంశములను ప్రసంగించుట
లోని ముఖ్యమగునుద్దేశము. ఈ వేంకటగిరి స్థలస్మృతులు స్థలపురాణ
ములు తిరుమలకు సంబంధించిమాత్రమే కానవగును. పురాణములన్నింటి
లోను చెప్పబడిన వింధ్యకు దక్షిణమునగల ప్రదేశములోనిదియును.
దక్షిణభారతములోనికెల్లను అపవిత్రతా గుణమును బోగొట్టిపవిత్రతను
పెంచెడి యేకైక ప్రదేశముగా నీ వేంకటాద్రియెట్లు పేరుగడించెనో
దీనివలన మనము చక్కగా నూహించేయవీలుగలుగును.

ఈ బాహ్యచరిత్రతోపాటు దీనియాంతర చరిత్రను మనము కొంత
తెలుసుకొనుటలో నిర్లక్ష్యము చూపరాదు. క్రమానుగతమయిన సంప్ర
దాయ సిద్ధమగు పర్వత పావిత్ర్యము, పర్వతముపై వెలసిన శ్రీవారి
ఆలయ పరిరక్షణము తప్పనిసరిగా నెరవేర్చుటకు యేడాదికి రెండు
లక్షల రూపాయల చొప్పున చెల్లింపవలసియుండెను. ప్రాచీన కాలము
నుండి వచ్చుచున్న ప్రాజాపత్య మంతరించుటతో నార్కాటు నవాబు
దేవాలయపు రాబడిని స్వీకరించుటకై ప్రత్యేకముగా నొక ప్రతినిధిని
నియామకము చేయవలసి వచ్చెను. స్థానికసభవారి యునికి, మనకు
19వ మార్చి 1684వ సంవత్సరములో శ్రీ శివరాజ రామచంద్ర యాద
మాతర దబీర్వా, తిమ్మనయ్యంగారలు శ్రీవారికి బంగారపు కంటెను
సమర్పించిన విషయము తెలుగులో వ్రాయబడి శాసనములో మనకు
కన్పించును. క్రీ. శ. 1638వ సంవత్సరములో శ్రీరంగరాజమహా
రాయులు పరిపాలకుడుగా నున్నప్పుడు మరియొక శాసనమున్నది.
ఇది దేశభాషయగు తెలుగులో లిఖింపబడిన శాసనము. దక్షిణ
భారత చరిత్రవలన 1636వ సంవత్సరములో షాజహానునకు, బీజపూరు
సుల్తానునకు మధ్య జరిగిన యొప్పందమనుసరించి గోల్కొండ,
బీజపూరు రాజ్యములు మిక్కిలి స్వతంత్రములైనవి ఆకారణమున
1656 వ సంవత్సరములో బీజపూరునకు 'వెల్లూరు', గోల్కొండకు

'చంద్రగిరి 'పట్టణములు వశమయ్యెను. 1684 మార్చి 16వ తేదీన వ్రాయబడిన శాసనములో ఆలయ నిర్వాహకులైన 'స్థానిక సభవారు' దేశపాలకునెవ్వరిని పేర్కొనలేదు. ఆకారణముచే వీరు గోల్కొండ సుల్తానును రాజుగా గుర్తింపకుండిరను విషయమును. స్పష్టమగు చున్నది.

క్రీ. శ. 1724 వ సంవత్సరములో హైదరాబాదు నిజాముగా 'ఆసిఫ్ జా' సింహాసనమెక్కి కొన్న తరువాత కర్ణాటకమునకు 'దావూదు ఖాను' నవాబుగా నియమింపబడెను. ఆకారణముచే తిరుపతి, శ్రీవారి ఆలయములు దావూద్‌ఖాను పరిధిలోనికి వచ్చెను. బహుశః, ఈనాటి నుండియే తిరుమల శ్రీవారి ఆలయ పవిత్ర పరి రక్షణార్థము, ఆబాధ్యత స్వీకరించినందులకుగాను నవాబునకు రెండులక్షల ద్రవ్యమీయ వలసి వచ్చియుండును ఇట్లు యొప్పందము కలిగియుండుటచే తిరుమల దేవాలయమునకు నాటినుండి వచ్చిన యుపద్రవములు లేవనిచెప్ప వచ్చును. ఈ రాబడి విషయమును మనము క్రీ. శ. 1753 లో 'మహమ్మద్ కమాల్' అను నాతఁడు శ్రీవారి ఆలయమును కొల్ల గొట్టుటకురాగా బ్రిటీషువారు కొంతసైన్యమును వాని నెదుర్కొనుటకుఁ బంపిరి. ఇరువైపుల అనేకులు నిహతులైరి. చివరకు నవాబునకు బ్రిటీషువారికి జరిగిన యొడంబడికలో నవాబున కొసంగెడు ద్రవ్యము మొత్తము బ్రిటీషువారికి చెందునట్లు ఏర్పాటు జరిగెను.

ఇంతింత పెద్ద పెద్ద మొత్తములేవిధముగా సమకూర్చబడెడివో ఇప్పుడు తెలిసికొనవలసి యున్నది. దేవాలయ నిర్వహణమునకు నియమింపబడిన ప్రతినిధి ఒక పథకము నేర్పాటుచేసి, తన ఆలయమునకు చేయు సేవలకుగాను మరికొంత ధనము నేర్పాటుచేసుకొనవలసిన వాడయ్యెను. దేవాలయమునకు వచ్చుయాత్రికులపై పన్నువిధింప బడెను. స్వామిపుష్కరిణిలోను, ఆళ్వారుతీర్థమందును స్నాన మొన ర్చెడి ప్రతియాత్రికుఁడును సనాతన సంప్రదాయము ప్రకారము కొన్ని

మంత్రములుచ్చరింప వలసియుండును. అవి వేద విదులగు బ్రాహ్మణులు నిర్వర్తింతురు. ఇట్టి వ్యవహారము జరుపుటను కొలుకిచ్చి కొంతధనము రాబట్టెను. తులసీలాలు సమర్పించుచోటయు యాత్రికుడు పన్ను భరింపవలసిన వాడయ్యెను. కర్పూరము వెలిగించుటకు (హారతి) ఒకరూపాయ, శ్రీవారి అర్చనకు ఏడు రూపాయలు రుసుము విధింపబడెను. ఇదే విధముగా ప్రతి పూజా కార్యక్రమమునందును యాత్రికుడు లేక ఆ యుత్సవమును, పూజాదులను నిర్వర్తించు యజమానుడు కొంతరుసుము చెల్లించు కట్టుదిట్టము జరిగెను. ఒక ఆభరణము గాని, ఒక వస్త్రముగాని శ్రీవారికి భక్తుడు సమర్పింపనెంచుచో అది శ్రీవారికి శాశ్వత ధారణమునకై ఆవస్తువునకు సమమగు మూల్యమును రుసుముగా చెల్లించు నియమములు పఱచబడెను. యాత్రికులు ఎవరైనను శ్రీవారికి భోగము చేయింప దలంచినచో ఆ ప్రసాదము విలువతో సమమగు మూల్యము రుసుముగా ఆలయప్రతినిధికి చెల్లింపవలసియుండెను. 1750 సంవత్సరమునకు పూర్వపు శతాబ్దములలో శాసనములందు 'ఆకాశగంగ' పాపవినాశ తీర్థములు దప్ప యే యితర పవిత్ర తీర్థముల ప్రసక్తియు గానరాదు. ఆ తరువాత అనేక పవిత్రతీర్థములు వెలయుటతోబాటు వాని పావిత్ర్యమును స్థిరీకరించు పురాణగాథలును వెలసినవి.

గోగర్భ తీర్థ సమీపమున నొక 'గుండ్రాయి' గలదు, అది క్షేత్రపాలకుఁడనియు చెప్పుట కలదు దీని విషయమై యెట్టి శాసనస్థ సమాచారములేదు. ఇది వివాదవిషయ పరిష్కారములకు పరమ పవిత్ర స్థలముగా రూపొందింపబడినది. ఈ ప్రదేశమునందు వివాదగ్రస్థులైనవారు ఇరువంకలవారు వత్తురు. పెద్ద కర్పూరపు ముద్దను వెలిగింతురు. ఆ హారతి ఎదుట నిలబడి నిజము చెప్పినట్లుగా నొట్టుపెట్టుకొనుట యిట కార్యక్రమము. దీనికై కొంత రుసుమును దేవస్థానమువారికి చెల్లింపవలసియుండును, ఇట్టి విషయములకు

శాస్త్ర మర్యాదగాని, సంప్రదాయముగాని, నైతిక విలువల నిర్ణయాను శీలనముగాని లేదు. ఇదియొక బలవంతపు బ్రాహ్మణార్థమువంటిది. మిక్కిలి అసమంజసము, అసంబద్ధమగు విధానము. దేవాలయపు ప్రతినిధికి, నవాబునకు. కొందఱు పరిచారకులకు రుసుమును సమకూర్చి పెట్టునట్టియొక కార్యక్రమము.

1801వ సంవత్సరములో నీ శ్రీవారి ఆలయపు నిర్వహణబాధ్యత ప్రత్యక్షముగా నింగ్లాండులోని 'కోర్టు ఆఫ్ డైరెక్టర్సు' చేతుఁకు చేరు వరకు కూడ నీవిధమయిన అసమంజసపుఁ బద్ధతి కొనసాగుచునేయుం డెడిది.

అయిన నిందు మేలు ఏమన, ప్రతినిధి నియామకము. కౌలుదారు పద్ధతి రూపుమాపబడెను. ఆలయము ఇంగ్లీషువారి ప్రత్యక్షపాలనము క్రిందకు వచ్చెను. ఈ మార్పు జరిగినట్లు 1831వ సంవత్సరమునాటి 'ఏషియాటిక్ జర్నల్'లో ప్రకటింపబడెను. 1804వ సంవత్సరము నుండి 1843వ సంవత్సరము వరకు అనగా సుమారు 40 సంవత్సరముల కాలము శ్రీవారి ఆలయ నిర్వహణము ఇంగ్లీషువారి ప్రత్యక్ష పాలనములో నుండి ఆ తరువాత వీరికంటె పేరాన కలిగి, యింత వరకు మనమూహింపని, తెలియని 'మహంతు'ల చేతిలోనికి చేరినది ఆ తర్వాత ఈ మహంతుల స్థానములో తిరుపతి దేవస్థానము కమిటీ ప్రవేశించినది. వీరు ప్రాత పద్ధతులకు పునరుద్ధరణము కొనసాగించుటతోబాటు మరికొన్ని అదనపు రుసుములను ప్రవేశపెట్టి దేవస్థానపు టాదాయమును పెంచుటకు దోహదకారులైరి.

1వ అధ్యాయము పరిసమాప్తము.

*

# 2-వ అధ్యాయము

## 1 శ్రీ వేంకటాచల పావిత్ర్యము

### తిరుమల శ్రీవారి ప్రాచీనత

మొదటి అధ్యాయములో తిరుమల పర్వతము, అందున్న శ్రీవారి ఆలయ సంరక్షణము. వివిధ దశలలో ముఖ్యముగా మహమ్మదీయుల దండయాత్రల కాలములో నెట్లు కొనసాగినది, ఆ తరువాత ఆలయ నిర్వహణక్రమము ఈస్టిండియా కంపెనీ, మహంతులు, దేవస్థానపు ట్రస్టు బోర్డు వారు గల సమయములలో నెట్లు జరిగినదో స్థాలీపులా కన్యాయముగా వివరింపఁబడినది.

ఈ అధ్యాయములో శ్రీ వేంకటాచల పావిత్ర్య మే కాలము, నుండి గ్రంథములు, శాసనములలోని కెక్కినదను విషయమును గుఱించి, దేవాలయపు టునికి కాలమును గుఱించి వివరింపబడనున్నది.

మనము ముఖ్యముగా తెలిసికొనవలసినది చారిత్రకాధార సహిత మయిన ప్రాచీనతను గుఱించి యన్న విషయము మఱువరాదు. ఏలనన, చారిత్రక సంబంధములేని పురాణములనేకములీ పర్వతమునకు ప్రాచీనతను ఎంతో పూర్వమునుండి లెక్కగట్టియున్నవి.

ముందుగానీ యితిహాస ప్రసక్తిని ఒకదాని వెనుక నొకటి పరి శీలింతము.

1. గతించిన కృతయుగములో వృషభాసురుఁడను రాక్షసుఁ డొకఁడుండెను. అతఁడీ పర్వతముపై వసించెను. తుంబురుకోన తీర్థ తీర్థమున గొప్పతపమాచరించినవాఁడయ్యెను. అతని తపమునకు శ్రీ మహావిష్ణువు మెచ్చుకొని దర్శనమొసఁగెను. విష్ణువు వరమూ లీఁదలఁచి

యాతని కోరిక నెఱుంగఁగోరెను. తన కెట్టివరము లీవలసిన పని లేదని ద్వంద్వ యుద్ధములో నెవ్వ రెట్టి శక్తిమంతులో తెలియుట యే లక్ష్యమని యారక్కసి యుద్ధమున కాహ్వానించెను. చివరకు శ్రీ మహావిష్ణువు సుదర్శనముతో నా వృషభుని సంహరించెను. ఆ రాక్షసుని యంతిమ కోరిక ప్రకారము నాటి నుండి యీ పర్వతము వృషభాద్రియని పిలువబడుచుండెను ఈ కథకు బ్రహ్మాండ పురాణము ఆధారముగానున్నది.

2. త్రేతాయుగములో పంపా సరోవరతీరమున (నేటి బళ్లారి జిల్లాలోని హంపీ) అంజనాదేవియను నామెవసించెను. ఆమెకు సంతతి లేకుండుటచే వాయుదేవుని గుఱించి దొడ్డతపమొనర్చెను. ఆ తపమీ పర్వతముపైనుండి చేయుట కారణముగా వాయుదేవుఁడు ప్రత్యక్షమయి పుత్రత్వమనుగ్రహించెను. ఆ కారణముచే నీ పర్వతము, అంజనాద్రి, అంజనాచలము అని పేళ్లు గలిగి యుండెను.

3, ద్వాపరయుగమున శ్రీ మహావిష్ణువు శ్రీ మహాలక్ష్మితో నేకాంతమున నుండెను. వాయుదేవుఁడెవ్వని యనుజ్ఞ లేకయేవారి యేకాంతమునకు భంగము గల్గింప యత్నించెను. కాని ఆ సమయమున నాదిశేషుఁడు నిత్యుఁడై అతి జాగరూకతతో యంతఃపురమును రక్షింపు చుండెను. వాయువును శేషుఁడడ్డగించెను. దాని ఫలితముగా గొప్ప సంక్షోభముప్పతిల్లెను. ఈ సంక్షోభమును కడకు శ్రీ మహావిష్ణువుకూడ నైరింపజాలఁడయ్యెను. వారిరువురును తమలో నెవడు శౌర్యవంతుఁడో తేల్చుకొననిశ్చయించిరి. అదిశేషుఁడు మేరుపర్వతమును జుట్టి పూర్తిగా దానినావరించెను. 'సహేంద్రతక్షకుని' వలె మేరువుతోనున్న అది శేషుని పెకల్చ సమర్థమగు నతిభయంకరమగు వాయువును వీచసాగెను. దానితో ముల్లోకములువడకెను. ముల్లోకవాసు లాదిశేషుని, వాయు వును సమీపించి వారి యల్పానల్ప పరీక్ష జనసామాన్యమునకు సంక్షోభ కారణమయ్యెనని నచ్చ జెప్పిరి. ఈ యసహ్య పరిణామ నిరోధమునకై

వాయుదేవునిచే వీవబడిన గాలి యుధృతము కొంత తగ్గునట్లు, ఆది శేషుని వేయి తలలందొక తల కొంతి సమయము మేరు పర్వతమున తప్పుకొనునట్లు సంధి చేసిరి. ఆకారణముచే మేరువులోని కొంత భాగము ప్రచండ మారుతముచే విసరబడెను. ఆ భాగమే భూమిపై బడిన 'తిరుపతి కొండ'. కనుకనేయిది శేషాచలమయ్యెనని ఐతిహ్యము.

4. కలియుగములో శ్రీకాళహస్తియందు పురందరసోమయాజి అను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతఁడు పవిత్రవంతుఁడు వేదవేదాంగవిదుఁడు. అతని యతివేల తపః ఫలితముగా పుత్రుఁ డొకఁడుద్భవిఁచెను. ఆతనికి మాధవుఁడను పేరుంచెను. తండ్రివలనే యీతఁడును సాంగవేదాధ్యయన సంపన్నుఁడు. కాని అమిత గర్వదోష దూషితుఁడు. అతఁడొక చండాల స్త్రీని కామించెను. అంతేకాక అనేక దురభ్యాసములకలవాటుపడి యుండెను. కృష్ణాతీరమునకు చేరి ఆ చండాలాంగనతో యధేచ్ఛామాత్ర విహారుఁడై పదిరెండు సంవత్సర ములనుభవించెను. బ్రాహ్మణ ధర్మమును వీడెను. అంత నాచండాల స్త్రీ మరణించెను. దానితో నీతఁడు విరక్తుఁడయ్యెను. ఆ సమయముననే కొందరు క్షత్రియులు తిరుమలలో శ్రీవారిని దర్శింప యాత్ర కేగుచుండిరి. వారినీబాపడనుసరించెను. తిరుమలకేగి శ్రీవారిని దర్శింప వారియెదుట నిలచెను. వాని నుండి భరింపరాని పాపపంకిలము వెల్వడెను. అంతలో నొక యగ్నిచే నాదేహాము ఆవరింపబడి ఆతని పాపములనుదహించెను. కాన నీ కొండకు వేంకటాచలమను ప్రశస్తి గలిగెను. ఈ మాధవుడు జన్మ విముక్తి గల్గి యనంతర జన్మములో చోళరాజునకు బుట్టి తొండమండలమునేలు రాజుగా నగునట్లు శ్రీవారి యనుగ్రహము బడసెను. ఇది వామన పురాణ మాధారముగా నున్న యైతిహ్యము.

ఈ ఇతిహాసములకు తోడు మఱియొక పురాణకథ యున్నది. అందు శ్రీ వేంకటేశ్వరస్వామివారు 28 మహాయుగములకు పూర్వ

మందున్న కలియుగములో నావిర్భవించినట్లుగలదు. పురాణముల ననుసరించి ఒక మహాయుగకాల పరిమితి 43,20,000 సంవత్సరములు. దీని ప్రకారము తిరుమలకు శ్రీవారు వేంచేసి 28 × 43,20,000 సంవత్సరములు గడిచినవి. 1,19,960,000 మానవ సంవత్సరములకిది సమమగునట్టివి. ఈ విషయము వరాహ, వామన, భవిష్యోత్తర, బ్రహ్మ, బ్రహ్మాండ, పద్మపురాణములలోగలదు.

## 2. శ్రీ మహావిష్ణువు

### వేంకటాచలమునకు వచ్చిన హేతువు.

త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరు లెవ్విధమున తమ తమ విధులను నిర్వర్తించుచుండిరో నెఱుంగగోరి భృగుమహర్షి మొదటగా బ్రహ్మమహేశ్వరులను విచారించి తుదకు విష్ణువుకడ కేతెంచెను. ఆ సమయమున శ్రీ మహావిష్ణువు మహాలక్ష్మితో వినోదించుచుండుట చూచెను. తన విధియగు సకలలోక సంరక్షణమును నిత్య జాగరూకుడై వహించుటను విడచి క్రీడా వినోదియైయుండుట నా భృగువు సహింప లేడయ్యెను. అతఁడు కుపితుఁడై వెంటనే లక్ష్మీదేవి నివాసమగు శ్రీహరి వక్షమును కాలితోఁదన్నెను భక్తుని యాతురతను, తన్నుఁదన్నుటచే నాతని పాదమునకెంత నొప్పి కల్గెనో విచారించుట శ్రీహరికిఁ గర్తవ్యమయ్యెను, ఆ యోదార్యమునుజూచి లక్ష్మీదేవికిఁ గన్నెఱ్ఱయయ్యెను. శిక్షింపవలసిన తావున రక్షింపఁబూనుట, శాంతింపఁజేయ బూనుట నీమెకు సహింపరాని దయ్యెను. లక్ష్మీదేవి మహావిష్ణువునువీడి వైకుంఠమునుండి భువికిరాగా నాయనయు వైకుంఠమును విడిచి భువికిఁ జనెను. శ్రీ మహావిష్ణువు తనకు వసింపఁదగిన స్థానమును తిరుమలగా నిశ్చయించుకొని యా ప్రదేశమున వసింపసాగెను. ఒక దినమున కాక తాళీయముగా నొక సుందరకన్యకామణిని

గాంచి యామె పద్మోద్భవగా నిశ్చయించుకొని యామెను వివాహ మాడ నెంచు కోర్కెను నామెకుఁదెల్పెను. ఆమె తిరుమలకు సమీప మునగల నారాయణవనమును బాలించు నాకాశరాజునకుఁ బెంపుడు కూతురు. ఇసుమంతయు ధనములేని యా శ్రీహరి తన వివాహ నిమిత్తమై ధనాధిపతియగు కుబేరునికడ నప్పుగా ధనమును గొనవలసి వచ్చెను. కలియుగాంతముదనుక తాను సంపాదించిన ధనమును క్రమముగా నప్పునకుఁ గట్టుదునని కట్టడి చేసికొనెను. ఇప్పటికి నీయైతిహ్యమీవిధముననే కొనసాగుచున్నట్లు స్థానికులు చెప్పుదురు

కలియుగాదిన శ్రీవేంకటేశ్వరస్వామివారికి ప్రప్రథమముగా నీ ప్రాంతములోని తొండమండలమునేలెడి ప్రభువగు తొండమాను చక్రవర్తి దేవాలయమును నిర్మించినట్లు ఇతిహ్యముచెప్పును. చారిత్ర కుల యూహననుసరించి తంజావూరునేలిన ప్రప్రథమ చోళచక్రవర్తి కరికాలచోళునకు నాగరాణితో వివాహఫలితముగా 'ఆదోండుఁడ' ను కుమారుడు కలిగెను. అతడే తొండమండల నగరనిర్మాణము చేపట్టుటచే నాయన తొండమానుచక్రవర్తిగా ప్రసిద్ధికెక్కెను. పూర్వమున శ్రీవారి విగ్రహము పుట్టచేఁగప్పబడి యుండెను. ఈ రాజుగోవులు పసులకాపరులచేఁ దోలుకొనిరాబడి యా పుట్టపైనెక్కి పాలు పిదికి వట్టిపోయిన పొదుగులతో తిరిగి రాజసౌధము చేరెడివి. ఈవ్యవహారము తెలిసినంత పుట్ట త్రవ్వించ నందున్నస్వామి బయటపడెను. బ్రహ్మాండ పురాణములోనున్న నీ గాథనుఁ బురస్కరించుకొని శ్రీవారియునికి క్రీ. శ. మొదటి శతాబ్దములోనున్న యీకరికాలచోళుని కాలములో కనుగొనబడినట్లు నిర్ణయింపనగును. ఉత్తర ఆర్కాటు గజటీర్ (1894) లో దీనికి విరుద్ధముగా మరియొక విషయమున్నది. దీనిలో ఆలయమందుగల నొక పుస్తకములో క్రమానుగతమయిన రాజనామములు, వారొసంగిన దానవివరములు వ్రాయబడినట్లు గలదు. దానిలో మొదట పేరుగా పరీక్షిన్మహారాజు పేరున్నది. ఈ మహారాజు శ్రీవారి

అంశములలోపలి ప్రాకారపు గోడలను, నాయనకుమారుడు జనమే జయ మహారాజు వెలుపలి ప్రాకారములను నిర్మాణము గావించినట్లు, చాల శతాబ్దములకు తరువాత శ్రీవిక్రమార్క చక్రవర్తి అనేక అభివృద్ధి కార్యక్రమములను చేపట్టినట్లు గలదు. ఇది యెంత సంబద్ధమో శాసనకర్తలు విచారింపవలసి యున్నది. ఐతిహ్యము మాత్రము చోళరాజగు కరికాలుని కుమారుడగు తొండమండల చక్రవర్తియే దేవాలయ నిర్మాణముగావించినట్లు నిర్ణయించుచున్నది.

శ్రీ వేంకటత్తురైవార్ అను నొక శ్రీవారి అర్చకస్వామిచే రచితమగు శ్రీ వేంకటాచలమాహాత్మ్యమను గ్రంథము తాటియాకులపై నున్నది. 1491 వ సంవత్సరములో వెలికి తీయబడినది. దీనిలో శ్రీవారికి సంబంధించిన పెక్కు కథలున్నవి ఇదినాడు శ్రీవారి ఆలయములో భక్తుల కోఱకును, దేవతా ప్రీతికోఱకును పారాయణము చేయ బడుచునుండెడిది. 16 వ శతాబ్దము మధ్యకాలము నాటికీ యాచారమునకేలనో స్వస్తి చెప్పబడెను. ఈ సంకలనములో నేమేమి కథలు గాథలు గుదిగ్రుచ్చబడి యుండెనో మనము తెలియుట కెట్టియాధారములునులేవు. కాలక్రమమున పురాణములలోని కథలు, గాథలు ఎట్టి మార్పులకు లోనయి యున్నవియో మనకు తెలియని విషయముకాదు. అయినను నీ విషయమిట్లుంచి మనమసలు విషయమునకు వత్తము. కుబేరునకు చట్టబద్ధమయిన ప్రతినిధులుగా శ్రీవారి ద్రవ్య సంగ్రహణమునకు ఈస్టిండియా కంపెనీవారిచే మహంతులు నియమింపబడిన యనంతర కథ మరికొంత మిక్కిలి చమత్కారముగా సాగినది. మహంతులు నిజమునకు పరిపాలనాధికార మణుమాత్రములేనివారు. శ్రీవార న్ననో తామొనర్చిన యప్పులు తీర్చెడి విధి నిర్వహణములో నిమగ్నులయిరి. ఈ కథకు మరింత బలీయముగానుండెడి మరియొక యుపకథను నైతము జోడించుటకు వెనుదీయలేదు. 1500 సంవత్సరములో కొండకు వచ్చినట్లుగా నూహింపబడుచున్న 'హత్తీరాంబావాజీ' అను

నాతఁడు శ్రీవారితో పాచికలాడుట, ప్రతివిజయమును శ్రీవారు కోల్పోయి ఆ విజయమును బావాజీకే సమకూర్చి పెట్టుట, జరిగెను. మొదటి పందెములో శ్రీవారు ఆలయమునే పణముగాఁబెట్టిరి ఫలితము-ఓటమి. పందెమునకు పణమొడ్డుట కితరములగు ధనమెద్దియును లేనికారణమున తన్నొడ్డుకొని, యిందును సంభవించిన యోటమితో బావాజీకి శ్రీవారే పరిచారకులైరి. ఈ కారణమును బురస్కరించుకొనియే 1843 వ సంవత్సరములో నీస్టిండియా కంపెనీవారు శీవారిని, ఆలయమును, దానికి సంబంధించిన సర్వసంపత్తిని 'హత్తీరాంజీ' శిష్యులలో నొక రగు 'శివదాస్ జీ' కి వప్పగింతపెట్టిరి. బాకీదారుని, నిల్వాదారుని స్థితులు పరస్పరము మార్పునకు లోనయ్యెను.

బహుశః ఈ కథకు ప్రప్రథమమున శ్రీవేంకటాచలమాహాత్మ్యము ప్రచురింపబడినపుడు స్థానము లభించి యుండవచ్చును. దేశవ్యాప్తముగా నీ గ్రంథము తెలుగు, సంస్కృత, హిందీ భాషలలో ప్రచురింపబడి అనేక పునర్ముద్రణములనుగూడ బొందిి విస్తృత ప్రశస్తి గన్నట్టి గ్రంథము. అన్ని గ్రంథములలోను పై కథయున్నది. అంతేకాదు. వీనిలో నున్నయొక చిత్రములో శ్రీవారు హత్తీరాంజీతో పాచికలాడు చున్నట్లున్నది ఈ గ్రంథ ప్రచురణమునకు, చిత్ర ప్రచురణమునకు పరిష్కర్తగా నొక ప్రఖ్యాత సంస్కృత పండితుఁడు తనపేరు నుపయోగించుకొనుట కనుమతి నొసంగియుండెను.

తాటాకు ప్రతులలోని మరియితర ప్రాచీన పత్రముల సత్యాసత్యముల నెఱుంగుట మనకు మరిరెండు విధానములు దృష్టికి వచ్చినవి. అందులో నొకటి ఉత్తర ఆర్కాటు గజిటీరు". (పేజీ. 325) ఇది అతిప్రాచీన మయిన తాటియాకుల పుస్తకము. ఇది చంద్రగిరిలోని గ్రామాధికారి అధీనములో నుండెను. దానిలో చంద్రగిరి కోట మొదటగా నారాయణవన ప్రభువులలో నొకరగు ఇమ్మడి నరసింగ యాదవరాయలు (999 క్రీ. శ.) నిర్మాణముగావించినట్లున్నది. ఆయన

తిరుమల శ్రీవారి దర్శనార్థమై పయనించి తన కోర్కె ఫలించుటతో శ్రీశేషాచల పర్వతమునకు సమాంతరముగానున్న కొండపై ప్రాసాద నిర్మాణమును ప్రారంభించెనట. 'కాక్సు' అను దొర ఈ గజిటీరు సంగ్రథనకారుడు. ఈతడీవిషయమునుగూర్చి చెప్పుచు 'అడ్డకొండ' కొండమీద నేటికిని ఈ ప్రాసాద శిథిలములు కనులకు బూర్వ స్మృతులు గల్గించును అని వ్రాసెను. ఈతడే దీనికి సంబంధించిన మరియొక కథ నిట్లు చెప్పెను. ఒక గరుడపక్షి మాంసపుముక్కయని భ్రమించి రాజుగారి తలపాగను ముక్కున గఱచుకొని చంద్రగిరిపై పడవేసెను. రాజు దీనిని శుభశకునముగా భావించెను. అక్కడనే కోటనిర్మాణము గావించి యొక పట్టణమును నూతనముగా నెలకొల్పెను. తిరుమలలో నున్న శాసనములాధారముగా నీ కథలో కొంత సత్యమున్నది.

శ్రీరంగనాథయాదవరాయలు దక్షిణమునుండివచ్చిన మహమ్మదీయులగు 'మాలిక్‌కాఫరు' 'మహమ్మద్‌తుగ్లక్' ల దండయాత్రల నతి కష్టముతో నెదిర్చెను, తదనంతరము తన యుద్ధ నీతి తంత్రము నంతయును తిరుమలలోనుంచ నిశ్చయించి క్రీ. శ.॥ 1359 వ సంవత్సరములో నచట ప్రాసాదములు నిర్మాణముగావించెను. చంద్రగిరి పట్టణ నిర్మాణము, కోటనిర్మాణము మొదలయినవి సాళువ నరసింగ దేవ రాయలవి గాని నారాయణవన ప్రభువులలో నొకరగు ఇమ్మడి నరసింగరాయల పనిగాదు. సాళువ నరసింగ యాదవరాయని తాత యగు మంగి దేవమహారాజు తన రాజధానిని క్రీ. శ. 1370 వ సంవత్సరములో కల్యాణపురమునుండి నారాయణవనమునకు మార్చి యుండును. సాళువనరసింగదేవరాయలు క్రీ శ 1450 వ సంవత్సరములో మాత్రమే చంద్రగిరిలో కోటను నిర్మించెను.

ఇంకను ఇమ్మడి నరసింగరాయల పాలనానంతరము పదుగురు యాదవరాయలు రమారమి 314 సంవత్సరములు రాజ్యపరిపాలనము గావించినట్లు తరువాత విజయనగరరాజులు అధికారములోనికి వచ్చినట్లు

తాళపత్రగ్రంథము తెలుపుచున్నది. ఈకథలో వేంకటపతి నాయఁడను నాతఁడు కృష్ణదేవరాయలను శరణుబొంది యాతనిచే దుర్గసంరక్షణాధిపత్యము స్వీకరించెను. ఇదిరమారమి (999 + 314) క్రీ. శ. 1313 వ సంవత్సరములో జరిగిన సంఘటనము. కాని శ్రీకృష్ణదేవరాయలు చారిత్రకముగా. క్రీ. శ. 1509 వ సంవత్సరములోనే విజయనగర సింహాసనము నధిష్ఠించినట్లు చెప్పుదురు. ఇంకను ఆకథలో వేంకటపతి దేవమహారాయలు నందన సంవత్సర భాద్రపద శుక్ల విదియనాడు చంద్రగిరిలో మరణించినట్లు చెప్పబడినది. ఇది సం॥ 1592 నకు సరియగు సంవత్సరమనియు ఈ సంవత్సరమే శ్రీకృష్ణదేవరాయులు రాజ్యమునధిష్ఠించిన సంవత్సరమనియు చెప్పుదురు.

ఈ గాథలపై విమర్శలవలన మనకు తిరుమల ఏనాటినుండి పావిత్ర ప్రాచుర్యములు గలిగియుండెనో విచారించుట బహుళ కష్టసాధ్యము. డాక్టరు స్వామికణ్ణుపిళ్లైవారి నిర్ణయము ప్రకారము శిలప్పదికారము క్రీ. శ. 756 వ సంవత్సరము నాటిదిగాఁజెప్పనగును. ఆ తమిళ గ్రంథములో తిరుమల పావిత్ర్యమును గూర్చి యేమియును చెప్పబడలేదు. దానిపైగల శ్రీవారి పురాతనత్వముగూడ చర్చింపబడలేదు. ఆళ్వారుల వలననే శ్రీవారి ఘనత మొదటగాఁగీర్తింపఁబడినది. తరువాత కాలములోగూడ నీ కొండశేషుని రూపమనియు, నాకారణముగా నీ కొండ శేషాచలమని పిలువబడెననియు చెప్పబడినది. 5, 6 శతాబ్దములలోనే ఆళ్వారుల ప్రసక్తి కానవచ్చుచున్నది. జైన, బౌద్ధమతములు విజృంభించిన యీకాలములో ఆళ్వారులు తప్పనిసరిగా శైవ, కేశవా భేదముగా నొక మూర్తిని యూహించుట జరిగెను. ఆదిశేషుదే పర్వత స్వరూపుడై ఎల్లవేళల శ్రీవారిని విడువకయున్నట్లు చిత్రించిరి. అతి పవిత్ర ప్రదేశమగుటచే పెక్కురు ఆళ్వారులు, అనంతరము సాంప్రదాయాను సారముగా శ్రీవారి నర్చించుటకు కొండపైకి ఎక్కుట విడనాడబడెను. శ్రీరామానుజులు స్వయముగా

మోకాళ్లతో కొండయంతయు నెక్కినటుల యైతిహ్యమున్నది. యాత్రికుడు ఆళ్వారుతీర్థము (కపిలతీర్థము) కడస్నానమాడి, పూతుడై నమ్మాళ్వారు సన్నిధినగల పెరియాళ్వారును సేవించుకొని కొండ నెక్కుట ప్రారంభించును. ఈ ప్రారంభమును ఒక ప్రత్యేక ప్రాముఖ్యముతో నుంచినట్లు తోచును. పూర్వమునుండి మత · విభేదములను తెగనాడి, శ్రీ వైఖానసాగమ శాస్త్రానుసారముగా నర్చనము జరుగుచున్నప్పటికిని సర్వమతసమాదరణీయమై విరాజిల్లుచుండుట యొక విశేషము. ఇచట శ్రీరామానుజులు దక్షిణదేశములోగల నితర దేవాలయములలో ప్రవేశపెట్టిన పాంచరాత్రమునిట ననుసరింపలేదు. దానికి కారణమును ఇట్లనుకొనవచ్చును. 'మహర్షీణాంభృగురహం' అని గీతలో స్వయముగా భగవానుడే పేర్కొనెను. ఇక శ్రీవైఖానసాగమ శాస్త్రములలో భృగువు వాయించిన ప్రకీర్ణాధికారములో

'సర్వలోకేశ్వరం దేవం శ్రీనివాసం శ్రియః పతిం
వైఖానసై ర్మహాభాగై రర్చ్యమానం నిరన్తరమ్'

అన్నట్లుగా సమస్తలోక ప్రభువగు లక్ష్మీపతి, శ్రీనివాసదేవుని ఎల్లప్పుడు శ్రీ వైఖానసులు పూజించునట్లుగా భృగువచన ముండుటచేత నైనను గావచ్చును. ఆ కారణము నిట నర్చక స్వాములగు శ్రీ వైఖానసులు ఆ భాగము మేరకు సంతృప్తి వహించిరి శ్రీరామానుజులుగాని, ఆళవందారుగాని, ఏ యితర వైష్ణవాళ్వారులనుగాని తిరుమల శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపలేదు. శ్రీరామానుజులకు మాత్రమే అర్చక స్వాములతో నొక యొప్పందము జరిగిన యనంతరము విగ్రహ ప్రతిష్ఠాపనమున యనుమతి లభించెను. దాని తరువాత నిక నెట్టి నూతన విగ్రహముల స్థాపనమును జరుగుట యన్నది తిరుమల ఆలయ చరిత్రలోలేదు. ఆ కారణము చేతగూడ నే యితర దక్షిణ దేశములోని ఆలయములకున్న పావిత్ర్యముకంటె తిరుమల శ్రీవారిఆలయమునకున్న పావిత్ర్యము మిన్నయని చెప్పవచ్చును.

## 3. నమ్మాళ్వారు నిగూఢ ప్రతి పాదనము

శ్రీవారి ఆలయములో నిత్యము పఠింపబడెడి మన్త్రపుష్పములోని భాగమగు నీ క్రింది శ్లోకములో నర్చావతార పూజావిధానమునకు సమగ్రమగు హేతువు కానవచ్చుచున్నది. అది 'మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠం ఉత్తమం, స్వామి, పుష్కరిణీ తీరే రమయాసహ మోదతే' భోగిరాజ గిరింగత్వా స్వామి పుష్కరిణీతటే రమతే రమణీ కాంతే రమణీయే శ్రియః పతిః"

"శ్రీ నగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరేతటే
తింత్రిణీ మూలధామ్నే శ్రీ శఠగోపాయ మఙ్గళమ్"

భగవంతుఁడు మాయావి. ఆయన లీల లతిగూఢములు. ఉత్తమమైన మహానంద స్వరూపమైన వైకుంఠమును వీడి స్వామిపుష్కరిణీ తటమున శ్రీ దేవితో గూడియానందింపుచుండెను అని శ్లోకార్థము.

రెండవ శ్లోకము నమ్మాళ్వారు ప్రశస్తిగూడ పరిగణింపఁబడి యున్నది. క్రీ. శ. 966 వ సంవత్సరములో రజిత భోగ శ్రీనివాస మూర్తి శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపబడిన యనంతరము ఈ శ్లోకములలో రెండవదియగు నమ్మాళ్వారు ప్రశస్తిని చెప్పునట్టిది నూత్నముగాఁ గూర్పఁబడియుండునవి సకారణముగా నూహింపవచ్చును. అయితే యీ విషయము ప్రత్యక్షముగా నీ శ్లోకమందు మనముచూడ లేము. కాని శ్రీవారు వైకుంఠమును వీడి తిరుమలపై నివాస మేర్పఱచుకొన్న కారణము తెలుపఁబడకుండుట, దానికిఁదగు విధముగాఁ బురాణములలో వివిధకథలు, గాథలు, పేర్కొనబడియుండుటఁ బై విషయము నూహించుటకు వీలు నొసంగుచున్నది. ప్రారంభదశలో నాళ్వారుల భక్తిగీతములు. శిలప్పది కారములోనున్న వివరములు తమిళ భాషలోనున్నవి. ఆళ్వారులలో మొట్టమొదటగా నీ తిరుమల పావిత్ర్యము నుగుఱించి స్వామివారు వైకుంఠమునుండి తిరుమలకు వచ్చిన

ప్రసక్తి చేసినవారు నమ్మాళ్వారు. వేంకటాద్రికీయాళ్వా రొసంగిన గుప్తార్థమును దీనికి హేతువుగావచ్చును.

'సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహముచ్యతే
సర్వపాప దహోయస్మాద్వేంకటాద్రి రిత్యభూత్'

'వేం' అను నక్షరము సర్వపాపములకు ప్రతినిధి యనియు 'కట' యను పదము వానిని దహించునది యనియు, నట్లా సర్వపాప దహన హేతువుచే వేంకటాద్రి యని చెప్పబడినదని దీని తాత్పర్యము.

కనుక శ్రీమహావిష్ణువు భూమిపై తాను వసించుటకుఁదగిన ప్రదేశముగా నీ పర్వతము నెంచెను. శ్రీవారి యునికి కి నమ్మాళ్వారు గావించిన వ్యాఖ్యానమిది. దేవతలు బ్రహ్మాదిదేవ సంఘపురస్సరులై వైకుంఠమునందు తన్నెట్లర్చింతురో యట్లే భూమిపైగల మానవులును తన్నర్చించుటకుఁదగిన యవకాశమును శ్రీ మహావిష్ణువు కల్పింపనెంచి యీ తిరుమలపై వేంచేసిరఁట. వైకుంఠమునుండి వీడిన శ్రీ మహావిష్ణువు భూమిపై తాత్కాలికముగా నివసించు నీ పర్వత ప్రదేశమున ఆ దేవతలే మానవుని సహచరులై పూజావిషయాదులలో భాగస్వామ్యము వహించి వైకుంఠమునందు యే యే సేవలు జరుపుదురో యిచటి భక్తులచే నదే విధమైన కైంకర్యములుచేయింప నెంచుటయే శ్రీవారి యాశయమయినట్లు నమ్మాళ్వారు మహాశయులు నిశ్చయించుకొనిరి. శ్రీవారి యీ నివాస విషయమును సమర్థించుటకు స్వాభావికమును, అత్యంత నిర్మలమగు వాత్సల్యమును ప్రకటించు రెండు యుదాహరణములను జూపించెను. అందు మొదటిది మూగజీవులైన గోవులు కేవలము తమ క్షీరములచే మానవులకుఁ బరిచర్యలొనర్చుచు, అతివినాశకరమగు శీతువుచేతను, శిలావర్షముచేతను మిక్కిలి బెగడొందింప బడిన సమయమున ఈ శ్రీవారే శ్రీకృష్ణులుగా నుండి పర్వతమునెత్తి యా మూగజీవులకు రక్షణ కల్పించెను. రెండవది, మహామేధావియగు బలిచక్రవర్తి సర్వలోక విజయుఁడయ్యును, తన్నుతాను జయింపలేక యుండెను. ఆ

సమయములో వానిపై నత్యంత వాత్సల్యము వహించి శ్రీవారే కరుణాంతరంగుఁడై ఆతనిచేఁ బ్రార్థింపఁబడకుండగనే యాతని రక్షింప నెంచినవాఁడై. భూమినవతరించిన వామన స్వరూపముతో నొక చిన్న కోర్కె నడిగెను. ఆ యల్పమగు కోర్కెలోనే విశ్వాంతరాళ విజయమిమిడి యున్నదని శ్రీ మహావిష్ణు స్వరూపుఁడగు వామనుఁడు తెలిపినవాఁడయ్యెను. కలిలో మన మీ రెండు సంఘటనముల ననుసంధించుకొనగలిగియున్నాము.

స్వర్లోకవాసులగు దేవతలు వారికిఁగల పరిమిత శక్తులతో శ్రీవారినెట్లు సేవింతురో అట్లే మనమును మనకు గల పరిమిత శక్తులతో మనకు గల యాశాపాశములతో శ్రీవారిని సేవింతము. మన మీ శరీరముతో స్వర్గాదులనుచేరలేము గనుక, దయాస్వరూపుఁడును, కరుణాంతరంగుడును నగు శ్రీవారు మనల ననుగ్రహించు వేడుకతో వైకుంఠమును వీడి వేంకటాద్రిపై వెలసెను. ఆ వేంకటాద్రియే నేడు కలియుగ వైకుంఠముగాఁ గీర్తింపబడుచున్న యత్యంత పవిత్రమైన పర్వతము. ఆ హేతువుచే మనకర్మలను నశింపఁ జేసికొనుటకు వేంకటాద్రికిఁజని, యచట శ్రీవారి సేవలను, అనగా నభిషేకార్థముతీర్థ సంగ్రహణ స్వరూపమున, పూజార్థము పుష్పములను దెచ్చుటలోను శ్రీవారికి ధూపదీపాదులను సమర్పించుటకుఁ గర్పూరాది వస్తుగ్రహణము చేయుదుముగాక

ఈ విషయమై నమ్మాళ్వారు తనకు గల భక్తి ప్రపత్త్యాదులకు గలిగిన వివరణమేగాని యీ పర్వత పావిత్ర్యమునుగాని శ్రీవారి యునికినిగాని చెప్పుటకే పురాణములను బరామర్శించి యుండలేదు.

భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠానంతరము దేవాలయములోని పూజా విధానములో గణనీయమయిన మార్పు జరిగినది. బహుశః ఇట్టి మర్మజ్ఞతతో గూడిన వివరణము నమ్మాళ్వారు చేయుటకిదియే హేతువుగా వచ్చును. తిరువాయి మొజిలోని మూడవ శతకములోని మూడవ దశకమందు ప్రతిపాదింపఁబడిన శ్రీవారి విభవములను గ్రహిం

చిన వాఁడు ఆళవందారు మహాశయుఁడు. ఈతని మనుమడే తిరుమల నంబి. ఈ తిరుమల నంబియే తన తాతగారైన యాళవందారు ఆశీస్సులను గ్రహించి నమ్మాళ్వారు ప్రతిపాదించిన భక్తి ప్రపత్త్యాదులను స్వప్రయోగాత్మకముగ ననుభవమున కుఁదెచ్చుకొని తనజీవిత సర్వస్వమును శ్రీవారి సన్నిధియగు వేంకటాద్రియందే సేవా పరిచర్యాది గుణాభిముఖుఁడై మెలంగెను. ఈ తిరువాయి మొజిలోని పాశురములే యానందాళ్వారునకు భగవద్రామానుజులు వివరించినపుడు ఆనందాళ్వారు తిరుమలను బాగుపఱచి తిరుమల నంబితో స్వామికి సహపరిచర్యాసక్తుఁడై మెలఁగుట కుపకరించినవి.

మహాభారతములోని మౌసల పర్వములోని మొదవ యధ్యాయములో నొక కథయున్నది. దీనిలో శ్రీ మహావిష్ణువు వైకుంఠమును వీడి భూమిపై యవతరించుటకు, నర్చావతారమను నూత్నరూపములో తానర్చింపఁబడుటకును శ్రీవారు దివినుండి భువికిదిగి వచ్చుటకును గల హేతువు ముడి వేయబడి యున్నది. ఈ విధమైన యర్చా స్వరూపము ఇతః పూర్వమునగల పర, వ్యూహ, విభవాంతర్యామి స్వరూపములకు భిన్నమై సర్వసులభసాధ్య పూజాహేతువైనది. శ్రీకృష్ణుఁడు తానవతారము చాలించునపుడు బ్రహ్మాది దేవతలకును, ఋషులకును, తన నిజ స్వరూప విభవమును దర్శింపఁజేసి కలియుగము నందిట్టి యర్చావతారపూజ బహుధా యపేక్షణీయమని చెప్పినట్లు భారతములోనున్నది.

శ్రీకృష్ణుని నిర్యాణమునకు హేతుభూతమయిన 'జర' యను బోయని గుఱించి బ్రహ్మదేవుఁడే శ్రీకృష్ణునిఁ బ్రశ్నించెను. దానికి శ్రీకృష్ణుఁడు, తాను రామావతారము దాల్చినప్పుడు వాలి తనచేఁగొట్టఁబడెననియు, నదేవిధమున నవ్వాలి యీ సమయమున జర'గా జన్మించెననియు, తానీ విధముగా నా 'జర' బాణముచేఁ గొట్టఁబడితి ననియు సమాధానముచెప్పెను. ఆ యనంతరము శ్రీకృష్ణుని పరమాత్మ స్వరూపమమిత తేజోఽంచితమయి యాకసమునకెగనెను సూర్య

మండలమును భేదించి పోవుచున్న యాదివ్యజ్యోతిని బ్రహ్మాదులు ప్రార్థించిరి. అపుడశరీరవాణి "నేను భూమిపై శిలారూపమున నమిత శక్తిసంపన్నతతో నవతరింతును. మీరు చేసెడు ప్రార్థనలు, పూజలు, పరిచర్యలు యథావిధిగ నచ్చట జరుపుఁడు" అని పలికెను. ఇది ద్వాపరయుగాంతమున జరిగిన సంఘటనము. ఈ సంఘటన మాధార ముగా కలియుగాదియందు శ్రీవారి యీ సముద్భవమును మనమూహింప నగును. శ్రీవారి మూర్తి స్వరూపములో దక్షిణ వక్షమున శ్రీదేవి చిహ్నితయయి యున్నది. ఇరు భుజముల బాహుమూలములవరకు నూర్ధ్వమున యొరపిడిగలిగిన గుర్తులున్నవి. ఇది ధనుర్బాణములు ధరించిన చిహ్నములుగాఁజెప్పనగును. ఈ స్వరూపమునకు శంఖ చక్రాద్యాయుధములు గాని లేక మరి యే యితరములగు నాయుధ ములుగాని యుండలేదు. ఆనాటినుండి నేటిదనుక రాత్రియందు 'బ్రహ్మార్చనము' జరుగుచునేయున్నది. ఉదయమున విశ్వరూపసేవా సందర్శన కాలములో నా బ్రహ్మతీర్థము భక్తులకు దివ్యతీర్థముగా నిత్తురు. శిలప్పది కార రచనాకాలములోనే యీ స్వామికి ధనుర్బా ణము లున్నట్లుగా వ్రాయబడియున్నది. తిరువాయి మొజి గ్రంథము నమ్మాళ్వారు రచించినది. దానిలో మూడవ పత్తులోని మూడవ దానిలోని దశకము. అరవ పాశురములు వరుసగా నిట తెలుఁగులో ననువదింపబడుచున్నవి.

(1) మన తాత ముత్తాతలకు తాతయగు శ్రీవేంకటాద్రిస్వామిని ఈ పర్వతముపై జలపాతములు మృదుమధుర ధ్వనులీనుచుండగా, శ్రీవారి జ్యోతిర్మయ సౌందర్య స్వరూపమును మనమేమాత్రము కాల మును వృథనుపుచ్చక నత్యంత సమీచీనముగానుండి యితర విషయ ములపై మనసును చొరనీయక ఆయననే సేవింతము."

(2) మనతండ్రి, తండ్రి తండ్రుల తాతఁడాద్యుఁడు. ఆయనయే సర్వజీవ సృష్టినిధానము శ్రీ వేంకటాద్రినాథుని సకల సురలు అనంత

పుష్పసురభిళ ద్రవ్యములతో సేవింతురు. అదియే ఆయన యనంత వైభవముగలవాఁడనుటకు విస్పష్టమయిన వివరణము.

(3) ఆయన ప్రభువులకుఁ బ్రభువు మాయాస్వరూపాత్ముఁడు. అతని నేత్రములు రక్తపద్మపత్రనిభములు. పరిణత ఫలవర్ణసమము లాతని యధరోష్ఠములు. నీలమేఘశ్యామ వర్ణమాతని శరీరము. స్వప్రకాశాత్మ స్వరూపుఁడగు నీతఁడు తద్వ్యతిరిక్తులగు దేవాదుల కీశుఁడు. మెఱపుతీవలవలె జాలువారెడి జలపాతములున్న శ్రీవేంకటాద్రి యీతని నివాసము.

(4) శ్రీవారు భూరాది లోకవాసులచేఁ గీర్తింపఁబడువాఁడు. దీనివలన నాఁటనికి వైభవముగలిగెనా! మహావైభవానంద జ్యోతిర్మయ స్వరూపముగలిగి, సర్వోపద్రవమయిన స్థితిలోనున్న యా తిరువేంక టాద్రినాథుని యణుమాత్ర ప్రేమాదరములను నీచాత్ముఁడనగు నాపైఁ బఱపి నన్ను కృతార్థునిజేయ సంకల్పించియున్న వానిని సేవించుటయే ప్రథమ కర్తవ్యము.

(5) ఈ వేంకటాద్రినాఁథుడు సర్వశుభుఁడు. దోషరహితుఁడు. పెక్కు మహర్షులచేఁ గీర్తింపబడిన వేదములకు మధువువంటివాఁడు. సర్వ బ్రహ్మాండములయందును పూజింపబడుచున్నట్టి యాదిమూర్తిగా నీ శ్రీ వారిని వర్ణించినచో నాయనను సమగ్రముగఁ గీర్తించినట్లగునా!

(6) కర్మభారముచేఁ బరువెక్కిన మనమందరము శ్రీవేంకటాచల వాసుని నామము నుచ్చరింతముగాక! దానితో మన ప్రాక్కర్మలు, అద్యతనకర్మలు సమూలముగ నాహుతియగును. ఇది సత్యవిషయము, దీనిని యాచరించుటయనగా వారి యుత్తమ లక్ష్యమునకు వారు త్రోవ చేసికొనుటయే

(7) దేవాదులతో సమముగనే మనకు నీ వేంకటాచలము ముక్త్యర్థమునకు హేతువగును. బ్రహ్మాదిదేవతలు పుష్ప, ఫల,

తోయ, ధూప దీపములతో స్వామికి సేవయొనర్చుచున్నారు. వారితో మన మీవిషయములో సద్భావుని నామ సంకీర్తనముతో ముక్తి సాధించ వలసియున్నది.

(8) మూగ జీవుల సంరక్షణమునకై యాయన తన కొన గోటితో పర్వతమునెత్తెను. వానిని చలి బాధనుండి, శిలావృష్టినుండి తప్పించెను. బలిపై వాత్సల్యముతో నాయన బలిని మూడడుగుల నేల యడిగి దానిలో విశ్వ విజయమును జూపించెను. ఈ పరంబ్రహ్మ స్వరూపమే శ్రీవేంకటాద్రిపై వసించినారు. ఆ పర్వతమును పూజించుట చేతనే మన సర్వ పాపములు శమించును.

(9) భక్తులెవరు మనోవాక్కాయ కర్మలచే నీ వేంకటాద్రిపై గల స్వామిపాద పద్మములను బూజింతురో వారు జరనుండి జనన మరణములనుండి ముక్తి నొందుదురు.

(10) కావున మనము జీవించియున్నప్పుడే, అనగా మనము మన చరమకాలము సమీపమునకుముందే, వయోవార్ధక్యములు మనపైఁ బడకముందే శ్రీవారి నివాసమగు వేంకటాద్రి సానువులందు నందనోద్యానములను బెంపుచేసి వానినిఁజక్కఁ బఱుపవలసియున్నది. అనగా భక్తి బీజములనునాటి, పెంచి, పుష్పింపజేసి, ఫలింపజేయవలసి యున్నది.

*

# 3 వ యధ్యాయము

## దేవాలయ ప్రఖ్యాత ప్రాచుర్యములు

గత యధ్యాయములో పురాణములలోని కథలు, ఇతరములగు చారిత్రకాధారములు తెలుపబడినవి కాని యివి శ్రీవారి స్వయంవ్యక్త స్థితిని గుఱించిగాని, శ్రీ వేంకటాచలమునకు గల ప్రాచుర్యమును గుఱించిగాని, యా ప్రదేశము పాపదహనమునకు హేతుభూత మెట్లయ్యెనో సమగ్రమగు వివరణము లీయ జాలవయ్యెను. అంతమాత్రముచే నీ పావిత్ర్యము యొక్క సత్యమును గుఱించిగాని శ్రీవారి ప్రాచీనతను గుఱించిగాని శంకింపఁబనిలేదు. ఇతిహాసములలో నీ ప్రసక్తి చేయఁబడనప్పటికిని విష్ణుపురాణమునందును భారత భాగవతములందును దీనికి వ్యతిరిక్తమయిన ప్రసక్తిగానరాదు.

చరిత్రకందినంతవఱకు నాళ్వారులు శ్రీవారిని స్తుతించిన వైభవకీర్తనాసందర్భము దక్క ప్రారంభములో శ్రీవారి ఆలయమును గుఱించిగాని యర్చనాదులను గుఱించిగాని మనకు తెలియదు. కాని ప్రప్రథమమున శ్రీవారి యర్చకులు వైఖానసాగమ విశారదులయిన గోపీనాథదీక్షితులవారని వేంకటేశ్వర యితిహాసమాలలో పేర్కొనబడినది. చారిత్రకులు మాత్రమతిపురాతనకాలమునుండి కొన్ని విష్ణుమూర్తి దేవాలయములున్నవని మఱికొన్ని కాల క్రమమున పల్లవరాజులు నిర్మించిరనియు, వానికిదానశాసనములు వ్రాయించిరని చెప్పి తమ పరిశోధనమునకు స్వస్తి వాక్యమును బలికిరి.

అనేక శాసనముల పరిశీలనానంతరము శ్రీవారి ఆలయమును గుఱించిగాని, యాయాలయమునకు దానమిచ్చిన విషయముగాని పదియవ శతాబ్దమునకుఁబూర్వము చెప్పబడియుండలేదని మనము విశ్వసింపవీలగుచున్నది. శ్రీవారి ఆలయ ప్రదేశ పావిత్ర్యమును

గుఱించి యంగీకరింపఁబడి యుండెనుగాని, దాని ప్రాముఖ్యము గోచరింప కుండుట దీనికి హేతువుగావచ్చును. శ్రీవారి యాలయములో పూజా విధానములోని మార్పుల కెట్టి హేతువులుప్పవిల్లెనో తెలిసికొందము. అద్వైత, విశిష్టాద్వైత, మధ్వ మతాచార్యులైన శంకర, రామానుజ, మధ్వుల కాలమునకుఁ బూర్వమున్న స్థితిని గుఱించి మనము పరిశీలింపఁ బోవుచున్నాము. అనగా 'అప్పార్' 'సుందరర్' 'మాణిక్యవాచకర్', 'తిరుగణ (జ్ఞాన) సంబంధార్' మొదలగు శైవ వేదాంతులయు వైష్ణవ ద్వాదశాళ్వారుల కాలములో నుండి చారిత్రకముగా విష్ణుపూజావిధాన మును గుఱించి నిర్దుష్టమగు నభిప్రాయమును పొందియుండని కాలము లోని పూజావిధానమును గుఱించి తెలిసికొనబోవుచున్నాము. అయిన నొకవిషయమిటస్పష్టపఱుపవలసియున్నది. ఈ పూజావిధానము 'భక్తి. పురస్సర పద్ధతియగు యాళ్వారుల ప్రతిపాదనము మాత్రముకాదు. అది వైఖానసాగమమునకుగాని పాంచరాత్ర పద్ధతికిగాని చెందియుండ వచ్చును. యామునాచార్యులవారి 'ఆగమ ప్రామాణ్యము' నను సరించిగాని, తరువాత వేదాంతదేశికులవారి 'పాంచరాత్రరక్ష' నను సరించినట్టి సాంప్రదాయమునకుఁజెందినదీ యాగమమని యూహింప వచ్చును. వైఖానస సంహితలను గాంచినచో వాని ప్రాచీనతా పరి జ్ఞానము తెలియును. బ్రహ్మ శివులెట్లు విధేయులై విష్ణువును పూజిం చుటకెట్లు వేచియుందురో యిందు మనము జూతుము. 'శిలప్పది కారము' అను గ్రంథమునందు శ్రీ వేంకటాద్రిని గుఱించి శ్రీరంగమును గుఱించి వర్ణనము చేయబడినది. అందు శ్రీరంగమునందు సంప్రదాయ సిద్ధమగు పూజావిధానము శ్రీ రంగనాథస్వామివారికి జరుగుచుండెడి దనియు, శ్రీ వేంకటాద్రియందున్న శ్రీవారినలంకరించుటతోనే పూజ సమగ్రమగుననియు తెలియఁజేయఁబడినది. 'శిలప్పదికార' రచయిత దృష్టిలో శ్రీవారు సూర్యచంద్ర కిరణస్పర్శచే నలంకరింపబడుచుండి రన్న విషయము తెలియుచున్నది.

5, 6, 7, శతాబ్దములలో కాంచీపురము నేలిన మతము శైవము. దానికి ప్రతిగా నిలచిన యితర విరుద్ధమతములు జైన బౌద్ధములు.— 600—630 క్రీ. శ. వరకుగల కాంచీపుర ప్రభువగు మహేంద్రవర్మ జైనుడు. కాని 'అప్పారు' అను శైవమతాచార్యునిచే నీతఁడు శైవ మత స్వీకారము చేసెను. 'హూయన్‌సాంగు' అను చీనాయాత్రికుఁ డీ ప్రాంతము నా కాలము పర్యటించెను. అతఁడు బౌద్ధమతములో నొక తెగ యగు మహాయాన బౌద్ధమునకు పదివేల మతాధికారు లుండిరని కనీసము నూరు బౌద్ధసంఘారామము లుండెనని 80 హిందూ దేవాలయములు. అన్నియే జైనదేవాలయములు కంచి పరిసర ప్రదేశములందుండెననియు తన పరిశోధన గ్రంథములో వ్రానెను. ప్రముఖ వేదాంత విచారశీలుఁడును నలందా విశ్వవిద్యాలయాచార్యుఁడునునగు ధర్మపాలుని స్వగ్రామము కాంచీపురము. ఈ విషయములన్నియు నాయన యాత్రా గ్రంథములో వ్రాయబడెను. ఆకాలము క్రీ. శ. 642.

పాండ్యదేశములోగూడ బౌద్ధమతమే ప్రధానమయినది. కాని యది పూర్తిగా వ్యాపారాశ్రయము. ఈకాలములో 1వ నరసింహ వర్మ పరిపాలించుచుండెను. మానవర్మయను నాతఁడు సిలోను పాలించుటకు నరసింహవర్మ సహాయము కోరుచుండెను. పాండ్య దేశములో 'సంబంధినార్' అను శైవాచార్యునిచే నాటి పాండ్యరాజగు 'నేదుమారన్' అను రాజును జైనమునుండి శైవములోనికి మార్చ బడెను. ఇది క్రీ. శ. 760 సంవత్సరమునాటికి జరిగియుండనగును.

ఆనాడు పరస్పరభిన్నదృక్పథములుగల జైన బౌద్ధములొకవైపు, హిందూమతమునంతర్లీనముగా నడిపించు శైవ వైష్ణవములొకవైపు ప్రత్యక్ష సంఘర్షణమునకు లోనుగానప్పటికి, ప్రచ్ఛన్నముగా నొకరి నొకరు విద్వేషించుకొనుటయన్నది కొనసాగుచునేయుండెను. శైవ మతమాదికాలము నుండి యేకొంత వేళ్ళూనికొనినట్లున్నది. బౌద్ధము 'హూయన్‌సాంగ్' అభిప్రాయములో నాటికే కొంత క్షీణదశలో

నున్నట్లు కానవచ్చును. ఇఁక జైనమత విషయములో 'మహేంద్ర వర్మ' కృతమగు 'మత్తవిలాస'మను సంస్కృత ప్రహసనమున, కాపాలికులను, శాక్యభిక్షువులను, పాశుపతులను నిర్ద్వంద్వముగా నిరసించెను.

ఈ విషయములన్నియు పూర్తిగా తెలియఁజేయఁబడవలెనన్నచో పాఠకులకు కొంత శ్రమనీయక తప్పదు. ఈ విషయములో మరికొంత లోతునకుపోయి తలంచవలసియున్నది. మహాయాన బౌద్ధము హిందూ మతములోని విగ్రహారాధనమును యథాతథముగా ననుకరించుటతోఁ జాలక అనేక క్షేత్రపాల దేవతలను వారివారి మంత్రాక్షర (బీజ)ములతో బూజించుచు, జపములు చేయుటయు నారంభించిరి. 'తార', వజ్ర, యోగిని' అన్నవి వాని పేళ్లు. శాక్యభిక్షువు పేళ్లతోవెలసిన బౌద్ధమేమాత్రమూ పేరును నిలుపుకొనియుండలేదు. ఈ విషయములో జైనులు మాత్రము ప్రజాకర్షితులు కాలేకపోయిరి. ఈ కారణముచేతనే Iవ మహేంద్ర వర్మ (పల్లవరాజు) నేదుమారన్ (పాండ్యరాజు)లు జైనము నుండి తమకుతాముగా శైవమునకు మరలిరి. జైన బౌద్ధములనతి నీచముగా విమర్శించు సంస్కృత ప్రహసనమునొకదానిని మహేంద్రవర్మరాజు వ్రాసెను. విదేశీ సంబంధమయిన మతములు (నాడు దేశములు, నేడు రాష్ట్రములు) తమ తమ మతములకు సంబంధించిన గ్రంథములను తమిళములో సృష్టింపలేకపోయినవి. సామాన్య జనులకు పురాణ ములు మొదలు వేదాంత గ్రంథములన్నియు సంస్కృతముతోఁబాటు తమ భాషయగు తమిళములో నందుబాటులో నుండెను. నాడు సిలోను నకు (శ్రీలంక) అన్నివిధములయిన సంబంధములు దక్షిణభారతముతో నుండెను. శ్రీలంక రాజగు 'మానవర్మ' పదవీచ్యుతుఁడై తిరిగి రాజ్యమును సంపాదించుటలో నరసింహవర్మ సహాయమును కోరి కొంత కాలము 'కంచిపట్టణము'లో ప్రవాసముండెను. బౌద్ధులు తమ ధర్మములు తాము సరిగాననుష్ఠింపలేనివారైరి. అదియుఁగాక ఆ ధర్మ

ములన్నియు హిందూమతిములోనివేగాని యన్యముగాదన్న విషయము హిందూమత ప్రాబల్యమున కెక్కువ ప్రయోజనమును కల్గించెను.

7 వ శతాబ్దములోని ప్రముఖ శైవమత ప్రచారకులు ముమ్వురు. వీరు 'అప్పార్', 'సంబందనార్', 'మాణిక్యవాచకర్' వీరు ఇతర మతములను కూకటి వేళ్ళతో పెళ్ళగించుటలో విశేషమయిన కృషి యొనర్చిరి. కాని యీ కృషిలో వీరు పూర్తిగా కృతకృత్యులు కాగలిగి యున్నచో తరువాత వైష్ణవమతము తమ స్థితిని నిల్రదొక్కుకొనుట కంతగా యవకాశము లేకుండెడివి.

శైవ వైష్ణవములు రెండును వేదచోదితమతములని యీ మతాచార్యులు ఒప్పుకొందురు. వీరు వేదములను, పురాణములను, ఇతిహాసములను, ఆగమములను, స్మృతులను తమ మతమునకు మూలముగా నంగీకరింతురు. ఈ కాలమునాటికి అద్వైత విశిష్టాద్వైతములకుసమూలముగా నిర్ణయించి పెట్టిన నిర్దిష్టమగు సిద్ధాంతము లేవియునులేవు. దేవాలయములు మాత్రము శివకేశవుల కిరువురకును గలవు. కాని ఆలయములలో పూజలు మాత్ర మాయా విధానముల ననుసరించి జరుగుచున్నట్లు మనము స్పష్టముగా చెప్పలేము. వైష్ణవాగమములలో రెండు ప్రసిద్ధమయిన భేదములున్నవి. వీనిలో వైఖానసమతి ప్రాచీనము. పాంచరాత్రమతి విస్తృతవ్యాప్తి నొందువరకు వైఖానసమే బహుళముగా నాలయములలో పూజావిధానమునకు స్వీకరింపబడియుండెను. చారిత్రకముగా నీవిషయములో మనము నిర్ణయించుకొనుటకెట్టి యుపపత్తులును లేవు. కాని వైఖానస మతానుయాయులు దక్షిణ దేశములో ప్రాచీనము నుండియు నాలయములలో తమ మతానుసారమే ఆలయములు స్థాపింపఁబడియర్చనా విధానము జరుపబడు చుండెనని చెప్పుదురు. తరువాత రామానుజుల కాలములో నాయన వైష్ణవ క్షేత్రయాత్రలో కొన్ని ప్రసిద్ధమైన వైఖానసార్చనా విధానము జరుపుచున్న వానిని తమ పాంచరాత్ర విధానమునకు మార్చెననియు ఒక్క తిరుపతి తిరుమలలో మాత్రము ఈ

విషయములో మినహాయింపు కలిగియుండెననియు చెప్పుదురు. ఇప్పటికిని ఆ విషయములో నెట్టి శంకయులేకుండుట, తిరుపతి, తిరుమలలో శ్రీస్వామివార్ల యర్చకస్వాములు వైఖానసాగమమునకు చెందినవారగుట మనము ప్రత్యక్షముగనే కనుచున్నాము.

ఒక యైతిహ్యములో శ్రీరంగములోని వైఖానసార్చకుఁడు తన తండ్రిగారి శ్రాద్ధమును జరుపుచు యతియగు రామానుజుని భోక్తగా నర్థించి కృతకృత్యుఁడై 'తృప్తాస్త' అన్న వాక్యమునకు బదులు చెప్పు కాలములో మిన్నకుండెనట. కారణమడుగగా, నా యర్చకుడు శ్రీరంగనాథస్వామివారి కోవెల తాళపుచెవులు తన చేతిలో నుంచినచో బదులు పల్కెదననిరట. అంత నా యర్చకుఁడు తండ్రిగారిపై గల ప్రీతితో తాను తన వంశ పరం పరార్చకత్వమును శ్రీస్వామివారి సేవను వదలుకొనుటకు నిర్ణయించుకొని యాయన కోర్కె నెరవేర్చెనట. అప్పుడు రామానుజయతి 'తృప్తోస్మి' యని తానా తాళపుచెవులుగొని శ్రీరంగేశుని ఆలయములో పాంచరాత్రాగమ పూజావిధానమును ప్రవేశపెట్టెనను యైతిహ్యమున్నది దీనికి సంబంధించిన విషయము గారుడ పురాణములో శ్రీరంగ మాహాత్మ్యములో నున్నది. ఆసక్తి గలవారట చూడవచ్చును. ఇట్టిదే మరియొక ప్రసిద్ధమగు ఆలయము 'సింహాచలము'. శ్రీ నృసింహస్వామి వారి యర్చనము వైఖానసులు జరుపుచుండగా దానిని గూడ పాంచరాత్రాగమమునకు మార్చెనని, అదియు రామానుజ కృతమనియే చెప్పుదురు.

## వైష్ణవమత విజృంభణము

## శైవమత నిరాసము - తద్ధేతువులు

శైవమత నిరాసమునకు ముఖ్యమయిన హేతువు దీని యందాచరింపబడుచున్న జుగుప్సావహమైన తాంత్రిక విధానమేనని చెప్పనగును. దురదృష్టవశమున శైవమునందెక్కువగా, కొంత వైష్ణవమునందు

ఈ తాంత్రికవిధాన పూజకుఁ బ్రవేశము గల్గినది. వేనికి సంబంధించిన యాగమ విధానములు వానికిఁ బ్రత్యేకముగానుండ, నిట్టి పద్ధతులు జొరుట శోచనీయము. దీని తరువాత దేవీపూజ, శక్తిపూజలు ఆవిర్భవించినవి. ఇవి రెండును నిజమునకుఁ బ్రత్యేకమయిన పూజా విధానములుగావు. ఏదైవములేక దేవత యొక్క ప్రత్యేకమగు పూజా విధాన మాదేవతనుపాసించుటచేఁగల్గు ప్రయోజనముపయి యాధార పడియుండును. ఒక విధముగా నిది తాంత్రిక విధానము. శక్తి పూజలోని పంచ తత్వాను పూర్వకమగు వామాచారము సర్వవిధముల దూషింపబడుచు వచ్చినది. అది పంచ మకారమనెడు సంకేతముతో వ్యవహరింపఁబడుచుండెడిది. సాధకుఁడు తాను పూర్తిగా శక్తిపూజా రంభమునకుఁ గడంగునపుడు ఈ ఐదు తత్వములననుసంధించు కోవలసియుండెను. అవి మత్స్య, మాంస, మద్య, ముద్రా, మైథున ములనునవి. ఇది రహస్య పూజయనికూడ నందురు. ఈ పూజా విధానమును గుఱించిన చర్చ యింతటితోఁ జాలింతము.

జంతుబలికూడ నిరాక్షేపణీయమని విశ్వసింపఁబడెను. అశ్వమే ధమందశ్వము ధర్మజునిచే సంహరింపఁ బడినది గదా! ఆ యశ్వము దేవతలకు సమర్పింపఁబడి భుజింపఁబడినది. శత సంవత్సరయజ్ఞ మందు, అనగా సత్రయాగమునందు శౌనకుఁడు. ఇతర ఋషులు సూతునిచే శ్రీమద్భాగవతమును వినిరి. అదే సమయమునందు జంతు బలులును జరిగినవి.

శైవులలో 'మహావ్రతు' లను నది యొక తెగ. వీరు జంగ ములను పేర వామాచారమును నిర్వహించుటలో మిక్కిలి ప్రోత్సా హము జూపిరి. శైవ మతములోని యిట్టి విపరీత, విషాద, జుగుప్సా వహమగు క్రియా విశేషములచే నీ మతము పూర్తిగాఁబురోగమింపఁ జాలకుండెను. ఇదే సమయమందు నాటివైష్ణవము మాత్రమిట్టి దురాచారముల కతీతముగానుండి యజ్ఞయాగాదులందు నయితము

పశుబలులను నిషేధించినది. ఆ యా యవసరములందు పిష్ట పశు యాగము మాత్రము సాగించు కొనిరి. ఆళ్వారులు దీనితో మిన్న కుండలేదు. వారు బోధనా ప్రచారముల కలయి తమ వైష్ణవ సిద్ధాంత ములలోని సూక్ష్మవిషయములను వర్ణాశ్రమ ధర్మ వ్యతిరిక్తమయినను ప్రజలలోనికిఁ దెచ్చుటకు విశేషకృషి యొనర్చిరి. ఆధ్యాత్మిక విషయమునకు సంబంధించినంతవరకు కుల, మత భేదములను జూప కుండిరి. మతావలంబకులుగా స్త్రీలుకూడ సర్హులు అనుటలో వీరు బౌద్ధుల ననుసరించినట్లుగాఁ దోఁచును. ఈ ఆళ్వారులను మన మీక్రింది విధముగా వర్గీకరింపనగును. (1) మొదటి ముగ్గురు ఆళ్వారులు: (పొయిగై, పూదత్తార్ పేయాళ్వారు) ఈ మువ్వుర కులముల ప్రసక్తి వారికి వారు తెలిపినట్లుగానను. వారి తరువాత వారైనను వీరిజననాదుల గురించి ఎఱుకపఱచి యుండలేదు. వీరందఱు కంచి, మహాబలిపురము, మైలాపూరు ప్రాంతములనుండి వచ్చిన వారినిగాఁ జెప్పుదురు. వీరికాలమును గురించి డా॥ స్వామి కణ్ణన్‌గారు 719 క్రీ.శ. గా నిర్ణయించిరి. కాని మనకు వీరి కాలమును దెలియుట యన్నది యంత ముఖ్యమగు విషయముకాదు.

4) తిరుమలేశ (లిశై) ఆళ్వారు: తాను అగ్రజాతి కులములలో నేనియందును జన్మించి యుండలేదని తానే చెప్పికొనెను. తానొక యనాథగా నొక వేటగానిచేఁ బెంపఁబడినట్లు తెలిపెను. ఆతఁడు వేద శాస్త్ర ఆగమములు, జైన, బౌద్ధములు నేర్చిన వాఁడయ్యెను. తనకుఁ దానుగా వైష్ణవ మతము ననుసరించుటకు నిర్ణయించుకొనెను. ఈతని కాలము క్రీ.శ. 720. గా డా॥ స్వామికణ్ణన్ గారే నిర్ణయించిరి.

5) పై నలుగురును కంచి మండలమునకుఁ జెంది యెవరును వారి కాలముచేఁ దెలియఁ బడనివారు. ఇపుడు నమ్మాళ్వారును గురించి గ్రహింతము.

'కారి' 'ఉదయనంగై' యను శూద్ర దంపతులకు జనించిన వాఁడీయన. పుట్టుకతోడనే యీయన యొక విశిష్టమగు నాధ్యాత్మిక విధానము ననుసంధించుకొనెను. 'తిరుక్కురంగై' (తిరునల్వేలి) జిల్లాలో క్రీ. శ. 798 ప్రాంతములో జనించెను. ఆళ్వారులలో నీయ నత్యుత్తమాచార్యునిగాఁ గీర్తింప బడెను.

6) మధురకవి ఆళ్వారు: ఉత్తమ వంశముగా నొప్పెడి బ్రాహ్మణకుటుంబములో 'తిరుక్కోయిలూరు' గ్రామములో జన్మించెను.

7) పెరియాళ్వారు: ఈయన సంప్రదాయ వైష్ణవ కుటుంబములో జనించెను. ఈయన జనించిన గ్రామము శ్రీవిల్లిపుత్తూరు. ఈయనకు 'విష్ణు చిత్తుఁడని' యు నామాంతరము. "పల్లాండు" "పల్లాండు" అని కీర్తించిన దితఁడే. ఈయన క్రీ.శ 725 వ సంవత్సరములో జనించెను.

8) ఆండాళ్: (గోదాదేవి): శ్రీవిల్లిపుత్తూరులో పెరియాళ్వారుకు తాను నిత్యము పెంచెడి తోటలో పద్మములో జనించినదీ గోదాదేవి. ఈమె ఈయనకుఁ బెంపుడు కూతురయ్యెను. అయోనిజగా జన్మించి నిత్యము శ్రీరంగనాథునకు సమర్పించెడిమాలను మొదటగాఁ దాను ధరించిన యనంతరము మాత్రమే స్వామికి సమర్పించెడిది. తుదకు శ్రీరంగనాథుని దేవేరి యయ్యెను.

9) కులశేఖరాళ్వారు: ఈయన క్షత్రియవంశ సంజాతుఁడు. 'షోళింగర్' పట్టణములో దృఢవ్రత మహారాజునకు జన్మించిన వాఁడు. గొప్ప సంస్కృతకవి. పండితుడు కూడను, ఈయన వైష్ణవమతములోని భక్తిమార్గ ప్రభావితుఁడై వైష్ణవమతస్వీకారము చేసెను. క్రీ. శ. 767 ప్రాంతమువాఁడు. ఈయన 'ముకుంద మాలా' అన్న భక్తిరసరాజమగు శ్రీమహావిష్ణుస్తుతి గ్రంథమును సంస్కృత శ్లోకములలో రచించెను. ఈయన పేరనే తిరుమల ఆలయ

ములో శ్రీవారి బంగారువాకిలి గడప 'కులశేఖరపడి' యని పిలువబడు చున్నది.

10) తొండరడిప్పొడి ఆళ్వారు: 'తిరుమండారక్కుడి' అను గ్రామములో నొక సంప్రదాయకమగు వైష్ణవ బ్రాహ్మణ కుటుంబములో జనించెను. 'విప్రనారాయణ' యను పేరు ఈయన నామాంతరము. శ్రీరంగనాథునిభక్తుఁడు. అంటఁగలనందనవనముఁ బెంచుచు శ్రీమహావిష్ణు స్వరూపుఁడుగానున్న శ్రీరంగనాథుని సేవించి ముక్తిని బడసెను.

11. తిరుప్పాణాళ్వారు: ఈయన జననమునుగుఱించి మనకేమియు సమాచారము తెలియదు. యురయూరులోని చండాలదంపతులచేఁ దేఁబడి పెంపఁబడెను. శ్రీరంగనాథుని యాలయమునకు 'లోక సారంగముని' యను వారిచే బుజములపై మోవబడి తేబడినట్లు తెలియును. క్రీ. శ. 601 వ సంవత్సరములో నీయన జన్మించినట్లు వృత్తాంతమొకటియున్నది.

12) తిరుమంగై ఆళ్వారు: 'తిరువాలై తిరునగర్' లో శూద్రజాతిలో జనించెను. ప్రారంభ జీవితములో ననేక నీచకృత్యము లొనర్చి దేశ ద్రిమ్మరియైన తదుపరి యీతఁడు వైష్ణవ భక్తుఁడయ్యెను. ఈయన జనించిన కాలము క్రీ. శ. 776 వ సంవత్సరముగా విశ్వసింప బడుచున్నది.

పైన వివరింపఁబడిన పన్నిద్దరు ఆళ్వారుల చరిత్రను సమీక్షించినచో నీక్రింది యంశములు స్పష్టపడును.

నమ్మాళ్వారు, ఆండాళ్లు, కులశేఖరాళ్వారు, మధురకవి ఆళ్వారు దక్షిణ భారతమునకు చెందిన పాండ్య కేరళ ప్రాంతములకు చెందినవారు. తొండరడిప్పొడి తిరుప్పాణాన్, తిరుమంగై చోళదేశమునకు

చెందినవారు. పొయిగై, భూత, పెయ్ఆళ్వార్, తిరుమలిశై కంచికి లేక తొండమండలమునకుఁ జెందియుండిరి. ఈ విభజనమును మనము మనసునందుంచుకొన్నచో పాండ్యనాడుకంటె తొండమండలము నకే జైనబౌద్ధముల బెడద కొంతముందుగాఁ దగిలియున్నదను విషయ మును విశ్వసింపవచ్చును. మొత్తముమీఁద నాళ్వారులందరు లేక పెక్కురు సమకాలీనులు. వీరందఱును హిందూమతమునకుఁ జేటు తెచ్చెడి వేదదూషిత మతముల నెదుర్కొన్నవారే. భక్తి, ప్రేమలను ప్రధానమైన విషయములుగా నెన్నుకొని యందఱు యాళ్వారులు చేసిన మహోపదేశ మొకటియే. ఈ యాళ్వారులు ప్రజాసంఘముపై యనగా కుల, స్త్రీ, పురుష వివక్షతలేక నొకే ప్రభావమందించిరి. ఈ యాళ్వారు గణమున కధినాయకునిగా నమ్మాళ్వారును శ్రీవైష్ణవులందఱును ఏక గ్రీవముగా గుర్తించిరి. నమ్మాళ్వారు సచ్ఛూద్రవంశజుడు. బ్రాహ్మ ణులలో మహామేధావి, అమితజ్ఞుఁడునగు మధురకవి యీయన శిష్యుఁడు. మధురకవియే క్రీ. శ. 770 వ సంవత్సరములో నన్నామలై కొండలలో పాండ్యరాజగు వరగుణ మహారాజు పాలనాకాలములో నరసింహస్వామి గుహా దేవాలయ నిర్మాతయగు 'మారన్‌కారి' గాఁ గొందఱు గుర్తింతురు. కాని యిది యంతగా విశ్వసింప వలను పడదు.

ఈ విధముగా నన్ని కులములలోను మహా విజ్ఞానులు సాధు పుంగవులుగా జన్మించి మతోద్ధరణముకై ఆత్మవిశ్వాసముతో, విశ్వ శ్రేయమునకై, వేదమత ప్రతిపాదనమునకై పాటు పడుటతో, తాము పూర్వజన్మములందు చేసిన పాపములచే నీ జన్మములో తమ మతోద్ధ రణ ప్రయత్నమునకు విఘాతము గలుగునను విషయము పరాస్తము చేయబడినది.

ఈ యాళ్వారు బృందము వారి కాలములో గుర్తింపబడినచో వీరి ప్రభావముచే శ్రీహరి దేవాలయములో నిత్య సాంప్రదాయములేవి

యైనను మార్పులకు లోనయినవేమో యన్న విషయమును పరిశీలింతము. ఈ యాళ్వారుల యునికిని గుఱించి నిజమునకు రామానుజుల కాలము వరకు విస్తృతమగు ప్రచారమున్నట్లు మనము విశ్వసించుటకు వీలయినట్టి యాధారము లేవియును లేవు. ఆళ్వారులు వ్రాసిన తమిళ ప్రబంధములు ఒక క్రమ పద్ధతినలేక ఛిన్నాభిన్నముగా తమిళ దేశమందలి వైష్ణవ దేవాలయములలో నట నట వెదజల్లబడినవి. ఆ విషయము నాథమునులు తమ పర్యటన సందర్భములో గ్రహించుటయే గాక ఈ ప్రబంధములలో నొక మహా రహస్య వేదాంతభావము గుప్తపఱుపబడి యున్నదనియు నిర్ణయించుకొని వానినీతడొకచోటకు సంగ్రహముగా కూర్చుటయను మహోత్తమ సాహాయ్య మొనర్చెను. ఇట్టి కార్యమును తన యోగశక్తిచే జరిపించెనన్న యైతిహ్యమొకటియున్నది.

ఈ యైతిహ్యము నందఱు వైష్ణవులంగీకరింతురు. వారి జీవిత కాలములో వారి కీర్తి ప్రకాశించినదని చెప్పుటకెట్టి యాధారములు లేవు. కాని వీరిలో కొందఱుమాత్రము పాండ్యరాజుచే నేర్పాటు చేయబడెడి మత వివాద సభలలో పాల్గొని విష్ణువును పరదైవతముగా స్పష్టపఱచి యుండిరని చెప్పనగును. మరియొక యైతిహ్యమేమన, బ్రాహ్మణులు వేదప్రవచనము సలుపుచుండ, తిరుమలిశై ఆళ్వారు ఆ సభలోనికి వచ్చుటచే వారు ప్రవచనము నాపిరి. దానికి కారణ మీతఁడు బ్రాహ్మణుఁడు కాకుండుటయే. కాని తరువాత వారెక్కడ యాపిరో యక్కడ నుండి యాతఁడే సైగలచే జ్ఞాపకము చేయవలసి వచ్చెను. ద్విజేతరుఁడు వేదమును నోటితో నుచ్చరింపరాదన్న నియమమునుఁ బురస్కరించుకొని యీయన యిట్టి సైగల నొనర్చి యుండెనట.

నాథముని కాలములోనైనను యాళ్వారుల బృందమును గుఱించి ప్రస్తావనయున్నట్లు గానము. కానియీయన మనుమడగు యాళవందారు వీరి నందఱిను వెలుగులోనికి తెచ్చిన మహామహుడు. 'స్తోత్ర

రత్నము' అను గ్రంథము వ్రాయునపుడు ఈయన మొదటి మూడు పాశురముల యందు మొదటి దానిలో తన తాతగారును, గురవును, నగు నాథమునిని స్తుతించుచు వ్రాసెను. రెండవది విష్ణుపురాణ మాధార ముగా లోకమునకు నిజమగు విజ్ఞానము నందించి నందులకు పరాశర మహామునిని స్తుతించినట్టిది. మూడవదానిలో కులపతియగు యున నమ్మా ళ్వారును స్తుతించిన విషయమున్నది. కనుక మనము యామునాచార్యుని (ఆళవందారు) వైష్ణవాళ్వారులలో ప్రధానుడైన నమ్మాళ్వారుచేఁ బ్రభావితుఁడైన యొక పరమభాగవతోత్తమునిగా నంగీకరింపవచ్చును. నమ్మాళ్వారు తత్త్వమంతయు నీతనియందు ప్రతిబింబించుటయే దీనికి ప్రధాన హేతువు. ఈతని తరువాత శ్రీరామానుజుఁడు బ్రహ్మసూత్ర ములకు భాష్యము వ్రాయుచు మొదటగా శ్రీహరిని తనకు భక్తిజ్ఞానము లీయవలసినదని ప్రార్థించుట చూడనగును తరువాత వ్యాసునిఁ గీర్తించెను. ఈ విషయములో నాచార్యపరంపర యామునముని, నాథ ముని నమ్మాళ్వారులు గారు- ఇదియట్లుంచినాడు ఏ వైష్ణవుఁడైనను అప్పటికి స్థాపింపబడిన సంప్రదాయము ప్రకారము తాను తిరునామమును మొదట ధరించి తాను తనకు ప్రత్యక్షగురువును మొదటగను, ఆతని ద్వారమున నాతని పైవారగు నాథముని, నమ్మాళ్వారులకు నమస్క రింపవలెను. వారికిపైన విష్వక్సేనుని, శ్రీదేవిని, తదుపరి శ్రీధరుని ధ్యానింపవలెను. మానుషాచార్యులలో నమ్మాళ్వారు ప్రథముఁడు. దానికి గారణమాతఁడు తన విజ్ఞానమును ప్రత్యక్షముగా స్వామివారి నుండి, లక్ష్మీదేవినుండి, విష్వక్సేనునినుండి గ్రహించినట్లు ఐతిహ్యమున్నది.

నమ్మాళ్వారు కాలమునకుఁ బూర్వమునుండి యున్న దేవాలయ ములు ఈయన సిద్ధాంతానుసారముగా స్థాపింపబడియుండలేదు. కాని నమ్మాళ్వారు-తరువాత, విశేషించి ఆళవందారు కాలమునుండి స్థాపింపఁ బడిన విష్ణుమూర్తి దేవాలయములన్నియు నమ్మాళ్వారు సిద్ధాంతము లాధారముగనే నిర్మింపబడి యున్నట్లు మనము విశ్వసింపవచ్చును.

శ్రీవారి దేవాలయములోని రజతభోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపన మీ యాళవందారు కాలములోనిదే.

రజతభోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనావశ్యకత యెందులకు గల్గినదో విచారించవలసియున్నది. స్వయం వ్యక్తమైన శ్రీవారున్నారు. వారి స్థాపనము మానవ ప్రయత్నముతో జరిగినదికాదు. రజత ప్రతిమ ప్రతిష్ఠాపనమునకుఁ బూర్వము శ్రీవారి యర్చనావిధానము నమ్మాళ్వారు సిద్ధాంతము ననుసరించినట్టిది మాత్రముకాదు. నాడు దక్షిణాదిన సర్వ మత విషయైకనిలయము కాంచీమహానగరము.'అప్పారు శివాచార్యుఁడు' అంతములేవి సభ్యమహానగరము 'కంచి' యని కీర్తించెను. పాండ్య దేశములోజైనబౌద్ధములు మిక్కిలి శక్తిమంతములుగా జీవించియున్నవి. శైవము దోషాదోష ప్రసక్తిలేక విచ్చలవిడిగా విశృంఖలముగా పరువు లెత్తు చుండెను. ప్రాచీన వైష్ణవ దేవాలయములు వాని వాని ప్రాచీన సంప్రదాయ పరిరక్షణా విధానముచే నొప్పుచుండెను. 8, 9, 10 శతాబ్దములలోని రాజకీయ పరిస్థితులు తమిళ దేశములో పల్లవ, చోళ పాండ్యులకు నిరంతర యుద్ధములతో, వారిలో రాష్ట్రకూటులు చాళుక్యుల ప్రమేయముతో ఎట్టకేలకు ప్రశాంతత కలిగియుండెను. పల్లవులలో కొందఱు శైవులు, కొందఱు వైష్ణవులు. వారికి నిర్దుష్టమైన మత సిద్ధాంతములులేవు. 10 వ శతాబ్దములో చోళులు తొండమండలమును జయించిన యనంతరము శైవమత ప్రభావ మక్కడ యెక్కువ యయ్యెను.

శ్రీ వైష్ణవ మతాచార్యులు ఈ కారణముగా ప్రాచీన మత సంబంధ కాలుష్యములులేని, ప్రాచీన విభేదముల క్రొత్త కలతలు తల యెత్తని తావులను వెదకి కొనవలసి వచ్చెను.

నాటికాలమున తిరుమలకంటె నతి పవిత్రమయిన ప్రదేశము గాని, శ్రీవారి యాలయములో నెలకొల్పబడిన సంప్రదాయబద్ధమగు పూజావిధానముగల తావుగాని వేఱొకచోట లేదనుట నిర్వివాదాంశము.

శ్రీవారి దేవాలయము నొక దానిని (తిరుచానూరు) తిరుశుకనూరులో ప్రతిష్ఠించిరి. చోళులు రాజ్యమునకు వచ్చుటలో పరాశరేశ్వరాలయము అక్కడ ఎక్కువ ప్రభావముతో నుండెను. తిరుమలలో మనవాళ ప్పెరుమాళ్ (రజితమూర్తి) కూడ క్రీ. శ. 966 వ సంవత్సరములో ప్రతిష్ఠించుట అవసరమయ్యెను. నమ్మాళ్వారు సిద్ధాంతాను సారముగా నచట మూర్తిస్థాపనము మొదలయినవి జరుగుటచేతను, ప్రధానముగా నట వైఖానసాగమము ఆలయమందు నిత్యవ్యవహారములలో ప్రాశస్త్యము వహించి యున్నదని నిర్ణయించుకొనినప్పటికి, నిశ్చయముగాఁ దరువాత కాలములో నా దేవాలయమునకు మిగుల ప్రాచుర్య ప్రాశస్త్యములు లభించిన వనుటలో నెట్టిసందేహమును లేదు.

ఇంతగా పలువుర నాకర్షించిన యీ నమ్మాళ్వారు సిద్ధాంతము లేవియో యిపుడు విచారించు కొందము. అనేక మతాచార్యులు వారి వారి సిద్ధాంతములను చెప్పినట్లే వైష్ణవాచార్యుల వారి మత సిద్ధాంతములను ప్రపంచించిరి. తిరుమలిశై ఆళ్వారు బౌద్ధజైనములు అనేక శైవ ఆగమ గ్రంథముల లోతుపాతులు గ్రహించిన తరువాత తన యదృష్టము చేఁదాను విష్ణుపూజా నిరతుఁడనైతినని ప్రకటించుకొనెను. ఈ యాళ్వారునకుఁ బూర్వులయిన యాళ్వారులు ముప్పురును తిరుమలిశై ఆళ్వారుల యంతటి భక్తినిరతులయ్యెను శ్రీవారి మూర్తిని హరిహర స్వరూపమును మూర్తీభవించినట్టి రూపమనుచు, విష్ణు స్వరూపమే పరమ మనెడు నిర్ణయమునకు వచ్చిరి. పేయాళ్వారు చెప్పిన రీతిని గమనింపుడు.

విరబూసిన జటలు, ఉన్నత కిరీటము, మెఱయు ఖడ్గము, చక్రము, సర్వవేష్టితత్వము, బంగారు కటిసూత్ర వేష్టి గలవాడును నగు శ్రీవారు తిరుమలలో హరిహరరూపుడై యెల్లరను రక్షించుచున్నారు.

బంగారు రంగు గల్గినవాఁడు (శివుఁడు) భూమినుండి ఒకవైపు, పాతాళమునకు మఱియొక వైపు ఆకాశమువంకకు బెరిగిన త్రివిక్ర

ము౨డు. ఇరువురి రూపములు నొకరితో వేరొకరిని బోల్చవచ్చునుగాని ఒకరి రూపములో నొకరున్నారు ".

కాని నమ్మాళ్వారు బహు సూక్ష్మమయిన వివరములతో శ్రీవారిని కీర్తించిరి.

లక్ష్మీదేవి, బ్రహ్మ, శివులు వారి వారి ప్రత్యేకతలను బోగొట్టు కొన్నంత తనలో శ్రీవారు ఇమిడ్చికొనిరి. తన యవతరణముచే యత్యంతోన్నతమగు స్వర్గమును భేదించినా౨డు. విష్ణువుకంటె నత్యంతోన్నతమగు స్వర్గముకలదా! బ్రహ్మరుద్రులకును, శ్రీదేవికిని వారి ప్రత్యేకతా శక్తిత్వమును నమ్మాళ్వారు అంగీకరింపలేదు ఈ భావముతో తిరుమలిశై, సూరికొండలు. ఆళ్వారులేకీభవించిరి నిజ మునకు విష్ణువు బ్రహ్మను సృజింపగా ఆ వెనువెంట బ్రహ్మ రుద్రుని సృజించినా౨డు. ఆ విధమయిన విశ్వాసమున కాలంబముగనే శ్రీవా రవతరించిరి శ్రీ మహావిష్ణువునకు గల దశావతారములలో నీ శ్రీవారేయవతారా విష్టులునుగారు. శ్రీమన్నారాయణు౨డు స్వయముగా౨ దానే మానవజాతి యదృష్టముచే కలియుగమునందు ఈ వేంకటాద్రిపై వెలసినా౨డు. దానికి౨గల నిర్దుష్టమగు కారణములు శ్రీవారికే తెలియ వలయును.

ప్రాచీన విష్ణుదేవాలయములో జరిగెడి ఆగమవిధానమునకు సంబంధించిన దేవాలయముగా దీని నెంచరాదు. అట్లే ఈ మూర్తి విష్ణుపూజా విధానముచే నర్చింపబడినప్పటికి యన్ని మతములవారి యాదరణమునకు౨ బాత్రమై సేవ్యమయినది. లక్ష్మీదేవి విగ్రహము ప్రత్యేకముగా శ్రీవారి ఆలయపు౨ బరిసరములలో కొండపై నెక్కడను లేకుండుటను గమనింప వలసి యున్నది.

ఈ విషయమును గురించి నమ్మాళ్వారు మరింతగా విశదీక రించుచు నిట్లు ప్రకటన మొనర్చెను. 'ఎవరు తమ యిష్ట దేవతా పూజ

కొనసాగింపనిండు, ఆ పూజలన్నియును శ్రీ వేంకటాద్రి నాథునకేఁ జెందును. నమ్మాళ్వారు పాయించిన అరవ పాశురములలో కొన్ని శ్రీవారికి సంబంధించినట్టివిగలవు. వానికిఁ దెలుఁగు యనువాదము లీక్రిందఁ వ్రాయఁబడుచున్నవి.

మానవునకీ ప్రాపంచిక వాంఛలనేకములుండుట సహజము. వానిని తాను పొందుటకు తగిన యర్హతలు, శక్తిగల దైవమును మానవుడు ప్రార్థించి, పూజలొనర్చి, వాంఛా పరిసమాప్తుఁడగుటయు మనము లోకమున గనుచున్నాము. 'ఇట్టివి తంత్ర సమ్మతములై యాగమ గ్రంథములందును గాన వచ్చును. కొన్ని దోషమాత్రములు. మఱికొన్ని సేవ్యమానములు. వైష్ణవేతరులు పురాణోక్తమయిన యనేక వ్రతములాచరించుటయు గనుచున్నాము. కాని నమ్మాళ్వారు వ్రతబాహుళ్యాచరణమువలన గలిగెడి ఫలితము మృగ్యమనుచున్నారు. కారణము సర్వము శ్రీ తిరుమల నాథుఁడే యొడగూర్చుచుండ వేఱె వ్రతముల నాచరింపబనియేమి యని ఆయన ప్రశ్న.

శ్రీవారి నత్యంత భక్తి, వాత్సల్యములతో సేవించుచో నాయన యా యర్చించెడి జీవునకు సుగుణ సంపత్తి నొసంగును. ఆజీవుఁడా సుగుణ సంపత్తితో సుకర్మలొనర్చును. ఆ సుకర్మలు పరలోకమున నా జీవునకు సౌఖ్యమొన గూర్చును. అవియే కొన్ని జన్మల యనంతరము మోక్షమున కాలంబమగును. ఈ వ్రతము లన్నియు మధ్యవర్తుల పరిష్కారమును గోరును అన్యదేవతా ప్రసక్తి యుండెక్కుడుగా నుండును. వారే యిట్టి యల్పమగు వాంఛలను నెఱవేర్చగలుగుదురు. వైష్ణవమతాను యాయులిట్టి కామ్యావంశములగు కోర్కెలకయి నాసవీడి శాస్త్రవిధానముగా నేమి చెప్పియుండెనో వానినాచరింతురు. కాని యీ కర్మల ముందలి సంకల్పమున సాత్త్విక త్యాగముండును. 'భగవత్ప్రీత్యర్థం' అన్న మాట యిట్టిదియే.

D) భక్తులలో నగ్రగణ్యుఁడగు నమ్మాళ్వారు భక్తిని పరా కాష్ఠగా స్వామ్యర్చనమున జెప్పెను. అందులకు.

'విష్ణుభక్తులకుఁ దాను సేవకుఁడననియు, వారు అత్యంత నీచ కులజులయినను విష్ణుభక్తులయినచో వారికిఁ దాను దాస్యమొనర్తు ననియు' తన దాస్యవృత్తిని, ప్రకటించెను. వేదకర్మల ననుసరించు మార్గముకంటె మిన్నయగు భక్తిమార్గమును ప్రతి సంవత్సరము ఉత్థాన ద్వాదశీ కాలములో 'కైశికపురాణము' ను జదువుటచేఁ బొందదగునని చెప్పవచ్చును. ఈ పురాణము భక్తియొక్క పరాకాష్ఠను విపులీకరించి స్పష్టపఱచును. అతివిజ్ఞానవంతుఁడగు నొక బ్రాహ్మణుడు వేదకర్మానుసారియై ముక్తిపొందదలంచి దానియందు అనువర్తుఁడు కాలేక కర్మాచరణమందు డాంబికుడై సంచరించి బ్రహ్మరాక్షసుఁ డయ్యెను. ఒక గొప్ప భక్తుని యనుగ్రహముచే ననేక సంవత్సర ముల యనంతర మీ బ్రాహ్మణునకు బ్రహ్మరక్షిత్వము తొలఁగి ముక్తి కలిగెను. 'సంపాదువన్' అనునొక చండాలుడు పదిరెండు సంవ త్సరములు విడువక యేకరీతిగా నత్యంత భక్తితో నేకాదశీ యుప వాస వ్రతమాచరించెను పదిరెండవ సంవత్సరములో నీతనిని యొక బ్రహ్మరాక్షసి యడ్డగించి నీ మాంసము తిందునని పలికెను. కాని యొక గడియలో తాను నిత్యము సేవించు స్వామిని 'కైశికీరాగము' లో గీర్తించి వత్తుననెను. ఈ మానవుడు తిరిగి వత్తుననుటలో బ్రహ్మ రాక్షసుడు సంశయముపడెను. కాని యనేక నమ్మకములు చెప్పి యొప్పించుటతో విశ్వసించి పంపెను. ఈ చండాలుడు స్వామిని గీర్తించి తనమాట ప్రకారము తిరిగి ఆ రాక్షసునికడకు వచ్చెను. దానికి బ్రహ్మరాక్షసు నా చండాలుని సత్యవాక్పరిపాలనమున కబ్బురమం దెను. బ్రహ్మరాక్షసుడు తనకు ముక్తిగలుగు సమయ మాసన్న మయినట్లు తెలిసిన వానివలె నా చండాలుని భక్తిలో కొంతపాలు కోరెను. దాని కాచండాలు డంగీకరింపలేదు తాను విష్ణుచ

కర్మ నాచరించు చున్నాననెను. దీని ఫలితమంతయు భగవ దర్పిత మయ్యెనని సమాధానించెను. అనేక వాదోప వాదములు జరిగిన తరువాత నా చండాలుని పాటలోని చివరిపాట కైశికీ వృత్తిలో పాడిన పాట యొక్క ఫలిత మీయుమని వేడెను. అదియును లాభము లేక పోయెను. తుదిని ఆ చండాలునకు బ్రహ్మరక్షస్సు సాష్టాంగ ప్రణామ మాచరించి తనకు ముక్తిని ప్రసాదింపుమని వేడు కొనెను, తన జీవితకథ యాతనికి నివేదించెను. అపుడా చండాలుడు తన నీచ జన్మవృత్తాంతమును, తాను నిజముగా నితర జీవాత్మోద్ధరణము చేయ గలిగియుండినచో భగవత్ప్రార్థన మీ విషయమున చేయుదుననిచెప్పెను. బ్రహ్మరాక్షసుని పాప ప్రక్షాళన మయ్యెను. ముక్తినొందెను. ఈ పురాణములోని విషయమును ప్రతిసంవత్సరమును 'ఆళవందారు' కుటుంబములోని ఒకవ్యక్తి తమిళదేశములో ప్రతివైష్ణవదేవాలయములో నా కాలములో పఠించుచుండెను. ఈ పురాణములోని లక్ష్యము నమ్మాళ్వారు భక్తివిషయమయి సాయించిన కుల వివక్షతా రాహిత్యమును తద్వారా భక్తిసాధన మును, తత్ఫలితముగా నున్న మోక్షమును చేఁ జిక్కించుకున్నసత్యము ప్రకటింపఁ జేయుటయే యని చెప్పవచ్చును.

ఆళ్వారుల యౌన్నత్యము యెల్లరకు సమానముగానే యను గ్రహింప బడినది. ఈ యాళ్వారుల విచిత్ర సమ్మేళనమే యీ యుపపత్తిని స్పష్టపఱచు చున్నది. ఏ వైష్ణవ దేవాలయములోనైనను దైనందిన చర్యలలో దీనిని గాంచనగును. కుల వివక్షతో జరిగెడి విభిన్నమగు పూజ నదియే యాలయముగానిండు, మనము చూడ జాలము. విభేదములేక కలిసియే యర్చించుట మనము గాంతుము. హరిజనునకు శఠారి నొసంగుటలోగాని, తీర్థమొసంగుటలోగాని, నవి కలుషితమగుటలేదు. తిరుమలలో మరియొక నిదర్శనమున్నది. శ్రీవారి తిరుమంజనోత్సవము పూర్తియయిన పిమ్మట శ్రీవారికన్న ప్రసాదములో కొంత భాగము 'కులశేఖరపడి' లోపలకు వచ్చిన

దానిని శ్రీవారి సన్నిధిని ఉంతురు. దీనిలో కొంత కైంకర్య పరునకుఁ దీర్థముతో నొసంగుదురు. సామాన్యముగా బ్రాహ్మణుల యిండ్లయందు వండిన భాగములో కొంత శూద్రున కొసంగినచో మిగిలిన భాగమును కలుషితమయినదిగా భావించుటయేగాక నది యా బ్రాహ్మణునకు భుజ్యమానార్హత గోలుపోయి యుండును. కాని తిరుమల శ్రీవారి సన్నిధిలో ఒక చిన్న కొలమానపు ప్రసాదము హరిజనుని తరువాత తనవంతు వచ్చినప్పటికిని మహాప్రసాదముగా బ్రాహ్మణుడు స్వీకరించు చున్నాడు. తాకుటచే గలుగు కాలుష్యము శ్రీవారి ఆలయములో నెచటను గాంచము. అంతేగాదు దేవుఁడు రాజ వీధులందు నూరేగింపుగా నున్నచో నపుడు స్పర్శాదోషములేదు. ఎవరయినను నట్టి భ్రాంతి గలిగియున్నచో నాతడు శునకముగనో గాడిదగనో జన్మింతురని యిచటి విశ్వాసము. శ్రీరంగములో శ్రీవారి తీర్థపు మిరాశిదారులలో చాత్తాద శ్రీవైష్ణవ స్వామివారొకరు. తిరుమల శ్రీవారి ఆలయములో నీ చాత్తాద వైష్ణవులు తిరుమంజనమునకుఁ గావలసిన యన్ని వస్తువుల సమర్పణములో భాగస్వామ్యము ననుభవించు చుండిరి. శ్రీవారి తిరుమంజన వస్తుసమర్పణమున వారందరు దేవాలయ ప్రదక్షిణము నూరేగింపుగా జరుపుకొని లోపల సమర్పింతురు. తరువాత వారికి దేవాలయమునుండి సన్మానములు, ఆవస్తు మూల్యములతోబాటు సమర్పింపబడును. వారు మామూలు శ్రీ వైష్ణవుల గోష్టిలో పాల్గొని దివ్యప్రబంధ పారాయణ మాచరింతురు. అచట తమకు సంబంధించిన సత్కారమును గైకొందురు. ఏ దివ్య ప్రయోజనము నుద్దేశించియో వీరీకార్యమును తమ వంశమున యనాదిగా జరుపుకొని వచ్చుచున్నారు. శాసనములు వీరనుసరించెడికార్యము లాధికారికముగా ననుమోదించినవి.

హిందువులలో నన్నివర్గముల వారినుండి శ్రీవారి ఆలయము ప్రాచుర్యమును సంపాదించిన దనుటకు ఇదియొక వివరణాత్మక

షయిన చిత్రణము. మనము తెలుఁగు, కన్నడ, తమిళ, మహారాష్ట్ర, కేరళ దేశములకుఁ బోయినచో నచటగల మనుష్యుల పేర్లకు 'వేంకట' శబ్దమును తగిలించి యుండుట చూడనగును. అది 'వెంకట రామన్', 'వెంకట సుబ్రమణియన్' వెంకటశివుఁడు, వెంకటనరస, వెంకట కృష్ణ'—ఈ విధముగా నుండును. దక్షిణ భారతములో చాల మందికి శ్రీవారు ఇష్టదైవమగుటయేగాదు - ఇలవేలుపు, మరి గృహ దైవముకూడ. ఇది వ్యవహారము లోనికి ఆళ్వారుల విస్తృత ప్రచారముచే వచ్చినదని మనము విశ్వసింపవచ్చును

వైష్ణవుడు కానివాఁడై యుండి శ్రీవారికి పూజ విషయములో సన్నిహిత సంబంధమున్న యొకనికీ ప్రశ్న ఏట్టవచ్చును: కేవలము తమ కొఱకే ఏర్పాటు చేసికొన్నట్లు ప్రచారము కొఱబడిన 'శాత్తుమొఱ' (మంగళాశాసనము) కు శ్రీ వైష్ణవులు తాము తప్ప యితరుల నేల ఆలయమున నా సమయములో స్వామిని దర్శింపనీయరు? దీనికి మొదటి సమాధానమిది. 'శాత్తుమొఱ' అన్నది వైఖానసాగమానుసారముగాని లేక శ్రీమద్రామానుజునిచేఁ బ్రవేశపెట్టబడిన యే యితర 'నిత్యపూజా' విధానము ననుసరించినదిగాని కాకుండుట. సంప్రదాయబద్ధమగు వైఖానసాగమ సంబంధార్చనానంతరము జరుపబడెడు ఆగమేతరమయిన సహస్రనామార్చనా నంతరము జరిగెడి చిఱి వేడుక. మహమ్మదీయుల తరువాత ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనములో నెప్పుడో యొకప్పుడు ప్రవేశపెట్టబడిన యొక నూత్నమయిన మార్పు. శాస్త్రానుసారము జరుగు వేదమంత్రార్చనమును విడిచి వైఖానసము శ్రీమద్రామానుజుల వారి పాంచరాత్రమునకు మధ్య జరిగిన యొక యొడంబడిక ఫలితమని దీనిని మనము పేర్కొనవచ్చును.

దీని రెండవ భాగపు సమాధానమేమన, ఇతర భక్త బృందములను దీనిలో నిషేధించుట యనునది పూర్వ సాంప్రదాయముకాదు. తిరుమల తిరుపతి దేవస్థానపు కమిటీ మొట్టమొదట అధికారములోనికి

వచ్చినపుడిది ప్రవేశపెట్టబడినది. మహత్తరమగు భక్త సమూహ బృందములో నెవడు శ్రీ వైష్ణవుడో యెవడు పవిత్ర ప్రబంధ పఠనము చేసి యట్టి యుత్సాహకార్యక్రమములో పాల్గొనువాడో, అట్టివాడు, తన బీదరికము చేత పలుకుబడి లేమిచేత గుర్తింపబడదయ్యెను. మరి యొక వైపున ప్రేక్షకులు తమ పలుకుబడి సిఫార్సు ఉత్తరములతో నచటగల ప్రదేశమంతయు నాక్రమించుచుండిరి. ఆ కారణమున నీ యుత్సవము విజయమొనర్చుటకు ద్రావిడ ప్రబంధ సంధాతలుమాత్రమే ప్రవేశమున కనుమతింపబడిరి. ఈ పూజావిధానము తరువాత ప్రవేశము కల్పించుకొన్నదనుటకు ప్రాచీనమున దీని గురించి గాని ఈ పూజా విధానమునకు నిత్యములో దీని తావుగాని యే శాసనములోను కల్పింప బడకుండుటయే. ఇది మొదలుగా దేవాలయమునకు వెలుపల, సన్నిధికి వెలుపల శ్రీమద్రామానుజుని సన్నిధిలోను కొన్ని ప్రత్యేక సమయము లందు పఠింపబడుచు తరువాత కాలములో నిత్యమైనట్లు తోచును. ఇది పూర్తిగా తమిళపదమై దీనికి సరియగు సంస్కృత పదము లేకున్నది. దీనిని 'శ్రీ వైష్ణవ దివ్య ప్రబంధ పారాయణ సేవ' యని మాత్రము చెప్పవచ్చును, స్వామివారిని కీర్తించెడి వస్తు విషయము గనుక 'మంగళాశాసనమని'యు చెప్పనగును.

శ్రీ వేంకటాద్రి నాథుని గూర్చి 'నమ్మాళ్వారు' సాయించిన విశ్వాసమునువారు, మనము రహస్యముగా వదలియుండలేము. మహా విద్వత్సంపత్తి కలిగి, కవులై నుతింపబడువారు వారివారి యద్భుతశక్తు లను అతికొలది వరుమానముల నాశించి, వారికి కృతజ్ఞత జూపుటకయి మనుష్యజీవులను కీర్తించుటకు తమ శక్తియుక్తులను వృథ సేయగా చనదు అని సలహా నిచ్చుచున్నారు. అంతేగాక కష్టించి పనిచేసి తమ కూడు గుడ్డలను సంపాదించుకొని వారికిగల శక్తి యుక్తులను తమ తమ యిష్టదైవముల నారాధించుటలో ఆ స్వామిని బొగడుటలో విని యోగింపవలసినదిగా సలహా నిచ్చుచున్నారు, నిజమునకు శ్రీవారి

నాశ్రయించి మనము వరమేయడుగ దలచినచో నాయన యీయరాని దేదియు నుండదు. 'వెన్దిరెల్లామ్ తరుమ్ కొడిల్ మణివణ్ణాన్' అనుట - ఇది మిక్కిలి సాహస వంతమయిన పదజాలము. మనము యాత్రికులు వారి వారి కోర్కెలను సఫలమొందించుకొను నిమిత్తమై తిరుమలకు బోవుటఁ జూచుచున్నాము. సంతాన ప్రాప్త్యర్థమై వెడలిన వాఁడు, మహావ్యాధి అత్యద్భుతముగా నెమ్మదించినవాఁడు, మహా ప్రమాదమునుండి సునాయాసముగాఁ దప్పుకొన్నవాఁడు దోషిగారూపింప బడి శిక్షనుండి మఱలినవాఁడు, హంతకుడైనను రక్షింపబడినవాఁడు — వీరందఱును తమ తమ కోర్కెలలో సమానముగా సఫలము నొందినట్టి యల్పజీవులే.

ఆళ్వారులు, పురాణములంగీకరించిన వరగ్రహీతలును, దుష్టులునగు రాక్షసులు భస్మాసురుఁడు, హిరణ్యకశిపుడు, మహాబలి, రావణుడు, కంసుఁడు, మొదలుగాగలవారిని విస్మరించి యుండలేదు. ఈ దుష్టులీ వరప్రభావములను ఇచ్చినవారిమీద ప్రయోగించుటకు వెఱువని వారను విషయము వీరెఱుంగనిదికాదు. జీవుని వికాసము స్వేచ్ఛా వర్తనములోనే విపరీత విధానమునకుగాని, వేదాంత సారగమ్యమును గాని చెందును.

ఆళ్వారుల మతములో వైయక్తిక జీవుని యంతిమ లక్ష్యము మోక్షకామన. ఈ లక్ష్యసాధనలో నెగుడు దిగుడులుండును, దోషములచేఁ గలుషితుఁడగుట, వానికై పశ్చాత్తాపబడుట, యివియే వాని విజయములకు బాటలగును. క్రూర పాపాత్మునకైనను నరకము శాశ్వతము గాదని వీరి విశ్వాసము. అడిగినంతనే అది యెట్టిదైనను ఒసగు వాఁడు భగవంతుఁడు. అత్యనుభవ ఫలితముగా తనకు నిజముగాఁ గావలసిన దేదియో తనకు మంచి యేది యొసగునో దాని కోరుకొనగల్గును. ఆళ్వారుల బోధన యేమన, హృదయపూర్వకముగా ఆత్మానుపూర్వముగాఁ బ్రేమింపవలెను. అది యైహిక వస్తు సంపా

దనమునకైనను సరియే. ఇట్టి నిర్మల ప్రేమవర్తనము నొక పర్యాయము సాధించినచో అతని పూర్వపుణ్యమున నేదైనా ఒక దైవశక్తి యొకపరి వానిపై ప్రసరించినచో నీతడు సరియగు వస్తువును నిష్కల్మషముగఁ బ్రేమింప గలుగును. ఇది జరిగినచో నిదియే భక్తియగును. అప్పుడు మనమాతని గానములో మధుర భక్తిపూర్వకమయిన యమర ప్రేమ నందించెడి ప్రియురాలిని గందుము". - తిరుమంగై యాళ్వారులో నీ విధమగు మధుర భక్తిని గాంతుము.

తాత్విక శక్తులను పొందగోరి అతినిష్ఠా పూర్వక మయిన జప తపాదుల నాచరించి పరాకాష్ఠయగు భక్తిని పొందలేకున్నచో, వరము లనుగ్రహింపబడియు నవి విషాద పరిస్థితులకు దారితీయును. రాక్షసుల విషయ మటుండనిండు. విశ్వామిత్రునిగతి యేమైనది? వశిష్ఠుని యాయనధ్యేయముగా నుంచుకొననంతవరకు ఆయన తపః ఫలితముగా నాయన పొందిన శక్తులు ఒకచోట నుండి మఱియొకచోటి కేగుట కుపకరించినవేగాని ధ్యేయము నెరవేరని వారయ్యెనుగదా!

మహాబలికాలములో, నీ మహాబలికి మించిన నిర్మలాత్మ గలవాడు మరియొకడులేడు. కాని తన అహమును జయింపలేక పోవుటే గాక తనకన్న దాత లేడని గర్వించినాడు. తనదను నదేమియును లేదనియు, తనఆత్మయు భగవత్స్వరూపమేయనియు, తుదకు తాను శరణాగతి నొంద వలసినదే ననియు శ్రీహరి బోధింపవలసి వచ్చెను. ఈ తత్వముపై తన భావ ప్రకటనము చేయుచు 'నమ్మాళ్వారు' కూడ తనపై నిట్టి విధానమే అవలంబించవలసినదిగా భగవంతుని వేడుకొనెను. తన కిట్టి శక్తినిఁ బ్రసాదించిన భగవంతునకేవిధిన ఋణమును దీర్చుకొందు ననుచు వాపోయెను. స్వత్వమును, తనగర్వాహంభావములను స్వామికే యర్పించితినని చెప్పెను. తరువాత కొంతసమయమునకు తాను ప్రశ్న వేసికొని నేను. నా ఆత్మ అనుకొనుట, దానిని తానర్పించుట అను నవి సరియగు విధానములేనా అని భావించెను. ఇదంతయు నాతనిది.

అతని యభీష్టము ననుసరించియే యివి గ్రహించుట విడచుట యను నవి యాధారపడి యుండును.

ఈ దేవాలయము ప్రాచీన చరిత్రము పూర్వకాలమున ఆళ్వారుల యత్యున్నతమైన ప్రయోగాత్మక వేదాంత సిద్ధాంతములను జీర్ణించుకొన్న మేధావులచే మలచబడినట్టిది. అంత దీని కీర్తి దశదిశల కెగబ్రాకినది. భూమిపై నేడీ దేవాలయ మత్యున్నత ప్రాశస్త్యము వహించినట్టిదయినది.

"వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి" శ్రీవారికి సమమగు దైవములేదు. ఉండదు. ఇది నేడు నిత్యము మంత్ర పుష్పాంతమున పఠింపబడు దివ్యమంత్రము. మంగళములో

'శ్రీనగర్యాం మహా పుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే
తింత్రిణీ మూలధామ్నే శ్రీశఠగోపాయ మంగళమ్'

ఈ మంగళాశాసన శ్లోకము నమ్మాళ్వారును మనకు జ్ఞప్తి చేయును.

# 4 వ అధ్యాయము

## తిరుమల — తిరుపతుల పరిసరములలో గల దేవాలయముల చరిత్ర.

### 1. సార సంగ్రహము. (Synopsis)

అసత్పదార్థమునుండి సత్తునకు ప్రయాణించుట, ఉత్తమ శక్తిని, దేవతా తత్త్వమును నొక విగ్రహ రూపములో నిబంధించి అర్చనాదులచే తచ్ఛక్తిని భక్తి ప్రవత్తులతోఁ బొందుట యనువిషయము మన ప్రాచీనులంగీకరించి దానిని వ్యాపింపఁజేయుటకు దేవాలయములలో విగ్రహ స్వరూపములను ఆవిర్భవింపఁజేసిరి. భౌతిక వస్త్వభివృద్ధిని, నేడు మనము సూర్యుని నుండి సంగ్రహించిన కిరణములను శాస్త్ర సాంకేతిక పద్ధతుల ద్వారమున నెట్లు సౌరశక్తిగా మార్చి పొందుచున్నామో అట్లే ప్రాచీన మేధావులు కనబడెడి విగ్రహములలో కనబడని శక్తులను మన్త్ర విధానముచే శక్తిపాతముచేసి ఆ యనంతమైన శక్తులను అర్చనాది కార్యములచే మగల స్వీకరించుచు ఆధ్యాత్మికపు టౌన్నత్యమునకు త్రోవ ఏర్పఱచినారు.

మహాభారతములోని మౌసల పర్వములోని యైదవ యధ్యాయములో చెప్పబడిన విగ్రహార్చనను గుఱించి రెండవ యధ్యాయములోనే చెప్పబడినది. విగ్రహారాధన ప్రాముఖ్యమిట్లురాగా, ఈ గ్రంథపు ముఖ్య లక్ష్యము తిరుమల తిరుపతులలోనున్న విగ్రహారాధన స్వరూపమును, ఎట్టి ఫలితములనాశించి యిట్టి మహత్తర నిర్మాణములు గావింప బడినవని తెలుపుటయేయని చెప్పవచ్చును. పుట్టుకయే లేని శ్రీవారు తిరుమలపై నెప్పుడు వెలసిరో తెలియని విషయమేగాక యూహింపరాని విషయము కూడను. ఆయన యభీష్టాను సారము స్వయం వ్యక్తుఁడయ్యెను. ఆవిగ్రహ

మచట తెలియబడని కాలమునుండి నెలకొని యుండెను. ఆ విగ్రహము నావరించిన చిన్నరాతి కట్టడ మెప్పుడు యుద్భవిల్లెనో మాత్రము చెప్ప గలము. నిజమునకు శ్రీవారి దేవాలయ చరిత్ర తిరుమలలో ప్రారంభము కాక తిరుపతికి సమీపమునందున్న 'తిరుశుకనూరు' గ్రామములో, కొండనుండి దిగువకు పది మైళ్ళ దూరముగల ప్రదేశములో ప్రారంభమయ్యెను. దేశములోని విస్తృతమగు రాజకీయ పరిస్థితుల మార్పు దేవాలయ కట్టడముల విషయములో ప్రభావితము కాజడి వేంకటాద్రి పయి దేవాలయ నిర్మాణము జరిగిన చాలకాలమునకు కొండ దిగువున ననువగు తిరుపతి పట్టణ నిర్మాణము శ్రీ మద్రామానుజునిచే జరిపింపబడినది. పల్లవులచే మొదటగా దేవాలయ నిర్మాణము గావింపబడిన తరువాత కొంత కాలమునకు చోళులచే నాక్రమింపబడి శైవ విధానమే పైచేయి యగునట్లుగా తిరుశుకనూరులో సాగింప బడినది. శాసనములలోని సరియగు భావమును గ్రహించుటకు నాటి మత పరిస్థితులు, రాజకీయ పరిస్థితుల యోగాములచేతనే మనము సంపూర్ణముగా నర్థముచేసికొన గలిగియున్నాము.

మనము ఈ విషయముల నింకను సమగ్రముగా నెఱుంగవలసినచో తిరుమల తిరుపతి శాసనములను పూర్తిగా వినియోగించుకొన వచ్చును. తిరుశుకనూరు గ్రామము సరిగా తిరుమల ఆలయమునకు పది మైళ్ళ దూరములోనుండి, యీ గ్రామములోగల శైవ దేవాలయమును చూచుటతో మన శక్తిని చెదరగొట్టుటయేగాక దృక్పథ విభేదమును, తీవ్ర అసంతృప్తిని గల్గించును. తిరుమల శ్రీవారి ఆలయములో నిప్పుడు గర్భగృహమునకు ముందున్న శయనమంటపములో శ్రీవారి మూర్తితో సమమయిన రజత మూర్తిని పరిమాణములో నతి చిన్న దానిని తయారు చేయించి స్వర్ణాభరణములచే దాని నలంకరించి పేరిందేవిగా ప్రసిద్ధిగన్న 'సామవాయి' మహారాణి సంప్రదాయానుసారముగా, వైఖానసాగమ శాస్త్రవిధానముచే క్రీ. శ. ౯౬౬ వ సంవ

త్పరములో ప్రతిష్ఠింపఁజేసెను. ఈ చిన్న విగ్రహమే భక్తులకుఁ దమ యంతరంగములను దృష్టిపఱచునట్టిదియును, ఆళ్వారులు వర్ణించిన భగవన్మూర్తిత్వమును హృదయానుపూర్వముగా నున్నట్టిదియును నయి పూజాదులొనర్చుట పీఠొనంగెను. ఒక వంద సంవత్సరము లిట్లు జరిగిన తరువాత శ్రీరామానుజు లవతరించి యనేకాభివృద్ధికరమగు మార్పులు చేసెను. ప్రాంతీయ పాలకులగు యాదవరాయల వంశము దేవాలయాభివృద్ధికిఁ గావలసిన ధనమును సమకూర్చి పెట్టుట యను ముఖ్యమయిన బాధ్యతను స్వీకరించెను. అనాదికాలమునుండి దేవాలయ పూజా విధాన మంతయు వైఖానసాగమ విధానముగానే నుండి యున్నదని చెప్పనగును. ఆళ్వారుల ప్రతిమలుగాని, గోదాదేవి ప్రతిమకాని శ్రీవారి ఆలయములో నెచ్చటనులేవు. అంతేకాక తిరుమల దేవాలయమునకు వెలుపలగాని లోపలగాని ఎచటను వీరికెట్టి సన్నిధులునులేవు. భగవద్రామానుజుల విగ్రహము మాత్రము దీనికి విపర్యయము. ఆయనకును దేవాలయములో ప్రత్యేకపూజాదు లెవ్వియును లేవు. ఇప్పటికిని దేవాలయములో జరుగుచున్న ప్రత్యేక పరిస్థితి యిదియే. తిరుపతిలోకూడ తిరుమంగై ఆళ్వారు, నమ్మాళ్వారు, ఆండాళ్ళ సన్నిధులు పదుమూడవ శతాబ్దాంతమున నేర్పాటయినవేగాని యంతకు పూర్వమివియేవియును లేకుండెను. దేవాలయపరిచారకుల నిమిత్తమే దానికి సరిపడినంతమేరకు శ్రీవారికి అన్న ప్రసాదములు నివేదింపబడుచుండెడివి. రోగార్తులకుగాని, యాత్రికులకుగాని ప్రసాదములు పంచిపెట్టు కార్యక్రమమెద్దియును నాడు లేకుండెను. ఆగమశాస్త్రములలో అధమాధమ దేవాలయమునకు నిర్ణయింపబడిన అతిచిన్న దేవాలయమునకెంత అన్న ప్రసాదము నిర్ణయింపఁబడెనో అంతే నివేదనము చేయఁబడుచుండెను.

రెండు విషుసంక్రమణములు, రెండు అయన సంక్రమణములు, ముక్కోటి ద్వాదశి, బ్రహ్మోత్సవము, తరువాత కొంతకాలమునకు

ఉత్థాన ద్వాదశి, తప్ప వేఱుయిశరములగు పండుగలు దేవాలయములో జరుపబడియుండలేదు. క్రీ శ. 1310 సంవత్సరములో మాలిక్ కాఫరు చేసిన దండయాత్ర, మహమ్మద్‌బీన్ తుగ్లక్ దండయాత్రలు దేవాలయపు చరిత్రలో కొన్నిముఖ్యమయిన మార్పులుతెచ్చిపెట్టినవి. హోయసాల వీరభల్లాలుని సేనాధిపతి, మంత్రియగు సింగయ్య దండ నాయకుఁడు కొన్నిమార్పులను తెచ్చిపెట్టెను. ఈ సింగయ్య దండ నాయకుఁడు మైసూరు వీరవైష్ణవమునకు చెందినవాఁడు. వీరిపూర్వులు శ్రీరామానుజునకు శిష్యులై యుండి యుందురు. ఈతఁడొక గుప్త జీవితమును గడుపవలసి వచ్చెను. దాని నీతఁడు దక్షిణభారతములో గడిపియుండును.. నందవనములు, మఠములు ఈతడు నెలకొల్పి యుండెను. పాండ్యరాజుల ప్రాబల్యము తగ్గిన దానిని పునరుద్ధరించిన యాదవరాయలకుఁ దోడ్పడుటకు అచట రాజకీయ పరిస్థితులను జక్క పఱచుటకు సింగయ్య దండనాయకుఁడు తిరుపతికివచ్చెను. యాదవ రాయలీతని పరముగా క్రీ.శ. 1328 వ సంవత్సరములో నొక గ్రామ మును శ్రీవారికి అన్నప్రసాదముల సమర్పణమునకయి దానమొసంగెను. అదే సమయములో ననగా, క్రీ.శ. 1339 వ సంవత్సరములో శ్రీవారి యుత్సవమూర్తులు, ఉభయ దేవేరులతో లభించినట్లు శాసనములవలన తెలియుచున్నది. కొన్ని కొన్ని క్రొత్తయుత్సవములు ప్రవేశపెట్టుట, అన్నప్రసాదము లిదివఱకటికంటె నెక్కుడు పరిమాణములో చేయబడి వచ్చిన తైర్థికులకు పంచబడుటయను మార్పు ప్రవేశపెట్టబడెను. తిరుమలలో పూర్వపు వైఖానసార్చనమున వీనికి అనగా నుత్సవము లకు, తావు లేకుండె నన్నట్లు గానవచ్చును. తిరుపతిలోకూడ నిపు డున్నన్ని యుత్సవములు పూర్వమునలేవు. నేడు మనము పిలుచు కొనెడి 'మలయప్ప స్వామివారు' నాడు 'మలయకునియనిన్రాన్'గా తెలియబడినట్టివారు. ఈ మార్పులు ప్రధానముగా తమిళ, చోళ, పాండ్య దేశములలో జరిగెడి యుత్సవములను మార్గదర్శకముగా నొనరించు కొని చేయబడిన మార్పులయి యుండనగును.

ఈ మూడింటిలో ప్రధానమైనది యాస్థానోత్సవము. రెండవది సంధి సమర్పణము. ఆస్థానోత్సవములనగా కొన్ని కొన్ని ప్రత్యేక శుభదినములందు శ్రీవారి యుత్సవ మూర్తులను సువిశాల మంటప మందు వేంచేపుచేసి అచట నన్న ప్రసాదములను సమర్పణము చేయు నుత్సవము. సంధి సమర్పణమనగా దినమునకు గల యామముల లెక్కన ఆగమ శాస్త్రానుసారము ప్రతిసంధికాలములోను శ్రీవారికి ప్రసాదములను సమర్పించుట. మాలిక్ కాఫర్ దండయాత్రా ఫలితముగా ప్రత్యక్షముగనో పరోక్షముగనో దక్షిణదేశమునందలి శ్రీ వైష్ణవులు కొందఱు తిరుమలకుఁజేరుట యనివార్యమయ్యెను. 14 వ శతాబ్దము చివరి భాగములో తిరుమలలో 'తిరువాయిమొజి' పఠనము ప్రారంభ మయినది. అంతకు నొక శతాబ్దమునకు ముందే అనగా 13 వ శతాబ్దము చివరి భాగములోనే తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి సన్నిధిలో 'తిరుప్పావు' పఠనము ప్రారంభమయి యుండును. ప్రారంభములో నున్న అఱశనాలయము – నందవనము జీయరుమఠముగా నుండి తరువాత వనశఠగోపనందవనము అహోబిలమఠముగా మలచబడినట్లు మనము తెలిసికొనగలుగుదుము. తిరుమల శ్రీవారి ఆలయములోని కొన్నిభాగములు, అనగా గోపురాదులు క్రీ. శ. 1250 ప్రాంతములో నిర్మింపబడిన విషయములు, సన్నిధి గోపురాదుల పునరుద్ధరణము, ముక్కోటి ప్రదక్షిణ నిర్మాణము దానిని వెంటనే మూసివేయబడుట, విమానమునకు మొదటగా బంగారు పూత పూయబడిన విషయము ముందు ముందు చర్చింపబడును.

తిరుకుకనూరులోని 'శ్రీ కార్యకర్తలు' ధర్మకర్తల (సభై యారులు) నుండి 1209 వ సంవత్సరములో మొదటి యాదవరాయల యధికారము క్రిందగల స్థానికసభవారి వరకు నున్న ఆలయ పరిపాల నము – దాని యంత్రాంగములోని మౌలిక విషయములను గుఱించి విచారింతము. క్రీ. శ. 1398 లో ఒక స్వతంత్రమైన దేవాలయ పరి

పాలక సంస్థ యొకటి యేర్పాటు చేయబడెను. అందులో తిరుపతి గ్రామమునకుఁ బ్రాతినిధ్యము వహించు నలుగురు ప్రతినిధులు, తిరుమలక నూరు సభవారి కమిటీ నుండి ముగ్గురు, అర్చక ప్రతినిధులు ఒకరు, ఇద్దరు జీయరులు, క్రొత్తగా నేర్పఱుపబడిన లెక్కల తనిఖీదారులనుండి యిద్దరు, వీరందఱును కలిసి పంద్రెండుగురు. ఇది స్వతంత్రాధికారము గలిగిన సంఘమేయయ్యెను. రాజుయొక్క సర్వాధికార పరిమితికి లోనగునదే. కాలక్రమమున నీ సంఘపు నైతికస్థితి దిగజారుట, చేయబడిన అన్నప్రసాదములు స్థానిక సభవారిచే కైంకర్యము చేయబడుట జరిగినది. ఈ యవినీతిని సాళువ నరసింహరాయలు, విజయనగర రాజులు అరికట్ట యత్నించి రామానుజ కూటములు, మఠముల ద్వారమున యాత్రికులకు నిరతాన్నదాన సౌకర్యములను కల్గించిరి. కాని యీ యవినీతి యిచ్చటను ప్రవేశించి యాత్రికులకు మూల్యఫలితమే అన్నప్రసాదమయ్యెను. ప్రసాదములమ్మువారికి, అర్చకులు, జీయరులు, స్థానికసభవారు, తమ తమకు వచ్చు ప్రసాద భాగములను ఇచ్చి సొమ్ము రాబట్టుకొనుచుండిరి. అన్న ప్రసాదములకు దాతలు విరివిగా నిచ్చిన సందర్భములో స్థానత్తారు దాతలను తత్ప్రసాదములను నేతితో తయారు చేయించుటకుగాను హెచ్చు పదార్థములను తయారు చేయించి తనకు వచ్చు హెచ్చు భాగమును తవకనువగు సమయమున నమ్ముకొనుటకు వీలు కల్పించుకొనెను. వీని యన్నిటి ఫలితముగా క్రీ. శ. 1547 వ సంవత్సరములో ఆరవీటి కొండరాజుచే తిరుపతిలో నిరతాన్నదాన సత్రమొకటి నమ్మాళ్వారు సన్నిధిలో నిర్మింపబడి దినమునకు 2000 మంది శ్రీవైష్ణవులకు కుల ప్రసక్తి లేక మృష్టాన్న భోజనము చేయుటకు వీలు కల్పింపబడెను, తగు సమయములో నీ విషయము మరింతవివరముగాఁ జెప్పబడును. పెద్దమొత్తము అగు ప్రసాదములను తగు మూల్యముల కమ్ముటతో గల కష్టములను గ్రహించి దేవాలయమే వివిధ యుత్సవముల సందర్భమున స్థానత్తారు

నుండి చివరి యుద్యోగి వరకుగల దేవాలయోద్యోగులకు వారి వారి భోగములకు వచ్చెడి ప్రసాదములకు ధనమిచ్చెడిది. 'భోగములకు ద్రవ్యప్రదానము' అన్నపద్దుల క్రింద ఖర్చువ్రాసి యీ ధన మొసంగెడివారు. దేవాలయోద్యోగులపయి అదనపు పనిభారము పడు టచే నీవిధమయిన యదనపుచెల్లింపులు సమర్థనీయములై యొప్పెడివి.

## నిత్య వేదపారాయణమునకుఁ దగుయేర్పాటులు

రెండవ దేవరాయ మహారాజు (క్రీ.శ. 1430) కాలములో తిరుమల శ్రీవారి ఆలయములో 'తిరువాయిమొజి' ప్రబంధ పారాయ ణముతోబాటు నిత్యము వేదపారాయణము జరుగుటను గుఱించి యేర్పాటు చేయబడెను. దీనిని బట్టి అధ్యయనోత్సవములు, తిరువాయి మొజి ప్రబంధ పారాయణాదికములు ఏర్పాటు కాఁబడిన చాలకాలము నకు మాత్రమే వేదపారాయణము తిరుమలలో శ్రీవారి సన్నిధిలో నేర్పాటు గావింపబడినదని మనము విశ్వసింపవచ్చును. ఈ దేవరాయ మహారాజే శ్రీస్వామి పుష్కరిణీ తీరమున మహాజన సమక్షములో శ్రీస్వామివారి కైంకర్యపరులకు సంవత్సరపు జీతము లేర్పాటు చేయుటకు నిర్ణయించినట్లు గంభీరమగు ప్రకటనమును గావించి కైంకర్యపరుల కత్యంత ప్రీతి పాత్రుఁడయ్యెను. తిరువీధి సానులెట్లు శ్రీవారి ఆలయ మున బ్రవేశించిరో, ప్రభువుకంటె, నొక యాచార్య పురుషుని కంటె నెంతటి యత్యున్నత గౌరవఖ్యాతులు సంపాదించుకొనిరో, అంత యకస్మాత్తుగ మరల వారెట్లు కనుమఱుగయిరో – ఆ విషయములను గుఱించి దేవాలయ శాసనము లాధారముగ సమగ్రమగు వివరము లొసఁగఁబడును.

## శ్రీవారి అన్నప్రసాదముల పెంపుదల

ప్రాచీనమున ఆలయమున సామాన్యపుటన్నము; పెసరపప్పు, పెరుగు, నేయితో గూడిన ప్రసాదములనుండి క్రమక్రమముగా బహు

రుచ్యంబులగు భక్ష్యంబులు, పప్పుతో చేయఁబడిన ప్రసాదము (పడుప్పు వియల్) తిరుప్పోణకమ్ (పాయసము), దధ్యోదనము, చక్కెరపొంగలి, అతిరసము, అప్పము, వడ, ఇడ్లీ, సుఖియాన్, గోధికాసిక్కె, భెల్లెక్కై, పాల్కొలంబు, ఇంకను ననేక విధములయిన ప్రసాదములుగ రూపొందినట్లుగ శాసనములందు పేర్కొనఁబడినది. ఈ పాకములన్నిటిలో యాత్రికునకు నిజమయిన పారమార్థిక చింతనముకంటె రుచ్యవంతములగు పాక సంపత్తికే ప్రాధాన్యమిచ్చి నట్లయినది. శ్రీవారి ఆలయమున కనుబంధముగా తిరుపతిలో పెరిగిన ఆలయములకు ధర్మకర్తల నిధులనుండి అన్నప్రసాదముల యేర్పాటునకు వెచ్చింప బడెడిది. ఒక ముఖ్యమయిన విషయమేమన తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనములలో నేటి రాజకీయ, చారిత్రిక విద్యార్థి కుపయుక్తమగు ననేక విచిత్రములగు విషయములున్నవి. ప్రాచీన గ్రామ పంచాయతీలు పనిచేయు విధానము, వానిలోని లోటుపాట్లను విశదముగాఁ బరిశీలించుటకుగాను నియమింపబడిన పరిశీలక సంఘములు, వానిని సరిచేయుటకు తీసికొన్న శీఘ్రకాలపు చర్యలు - ఇవి యన్నియు విపులముగా శాసనములలో వ్రాయబడి యున్నవి. ప్రభువునుండి యేదైనా సలహా సంప్రతింపుల విషయము వచ్చినచో దానివి సామూహిక గ్రామపంచాయతీ నాయకులు ఏకైకనిర్ణయమెట్లు చేసెడివారో దీనియందు లిఖింపబడి యున్నది.

మొదట నిర్ణయించిన అన్న ప్రసాదముల పరిమాణము మారనప్పటికి వెలలు నానాటికి అధికమగుచుండుటతో నదే ప్రసాదములకు దాతలు హెచ్చుగా ద్రవ్యము చెల్లింపవలసి వచ్చెడిది. 16వ శతాబ్దము మధ్య భాగమునుండి వస్తువుల టోకు, చిల్లర ధరలు నమోదు చేయబడు చుండెడివి. శాసనాధారముగానివి, దీనికి సంబంధించిన మరి యనేక విషయములు నమోదు చేయబడుచుండెడివని తెలియుచున్నది. దేవాలయములో నిర్వహింపబడు అనేక సేవలకు ధనమూలముగాగాని,

గ్రామములను దానమిచ్చుటచేగాని జరుపబడెడి యాయా ప్రత్యేక సంద ర్భములు వాని ప్రత్యేకతలతో నాయాశాసనములందు వ్రాయబడెడివి. నిధులలో కొంతభాగమొకప్పుడు రాజకీయపుటనిశ్చిత పరిస్థితి చేతగాని, మఱియొకప్పుడు ధర్మకర్తల హస్తలాఘవము చేతగాని గుప్తధన మయ్యెడిది. ఇంక న్యాయ విచారణమునకయ్యెడి వ్యయము, అభివృద్ధి కరములగు నితర కార్యములు, పునరుద్ధరణములు, నూత్నములగు నీటి పారుదలకు చేయవలసిన వ్యయములు, చేయవలసి వచ్చుచో దాతలే ఆ వ్యయమును ధనమూలకముగనో ధాన్యరూపకముగనో వచ్చెడి విధమున చెల్లించెడివారు. అనిశ్చిత రాజకీయ పరిస్థితులున్నప్పుడు యిట్టి మార్పులు చాలవఱకు నమోదు చేయబడియుండలేదు. ప్రాథ మిక దశలో దానమొసంగినపుడు ఆగ్రామముల మొత్తము ఒకప్పుడును, సంవత్సరపు టాదాయము మరియొకప్పుడును నమోదుచేయబడెడివి. కాని పెక్కు శాసనములందు ఆలయములో నిర్వహింప బడెడి సేవలు మాత్రమే పేర్కొనఁబడుట విశేషము. దానము వలన వచ్చెడి సాంవ త్సరికపుటాదాయము శ్రీ కృష్ణదేవరాయల పరిపాలనాకాలమున, ఆ కాలము తరువాతనుండి విధిగానన్ని శాసనములందును పేర్కొన బడెడిది. కాని యిదికూడ ధరవరల హెచ్చుతగ్గులతోను, ధర్మకర్తల యవినీతి పరాకాష్ఠతోను క్రమముగా ప్రతి సంవత్సరము లెక్కలలో పేర్కొనఁబడెడిదికాదు. తాళికోట యుద్ధానంతరము, సాలుసరి ఆదా యమేగాక, ఆ భూమినుండి వచ్చెడి ధాన్యపరిమాణము మాత్రమే లిఖింపబడెడిది. ధరవరల హెచ్చుతగ్గులుకూడ నింతకు పూర్వము వలెనే వ్యత్యయములకు లోనయ్యెడివి. ఒక్కొక్కప్పుడు శాసనము లలో నీయఁబడిన వంశక్రమముగూడ సవ్యముగా నుండదు. పాండ్య వంశ వృక్షము తరువాత విజయనగర వంశవృక్షము పూర్తిగా నెల కొనని కొంత కాలము గలదు. అదియును పేర్కొనబడలేదు. రాజుల వరుస క్రమములో ననుసరింపబడిన శకము శాలివాహనశకము. పాండ్యులు పతనమయిన తరువాత వచ్చినకాలము మాలిక్ కాఫర్

దండయాత్రల కాలము శకకాలముగాఁజెప్పఁబడినది. కాని యీ కాల మున బాలించు రాజుల నామము లెవ్వియును బేర్కొనలేదు. సాళువ నరసింహరాయల బాహుబలముచే విజయనగర రాజుల సామ్రాజ్యాధి కారము స్థాపింపబడినప్పటికి వంశ వృక్షముయొక్క చరిత్రకంటె శక సంవత్సరముల క్రమమునకేఁగట్టువడి యుండుట యతని సిద్ధాంతమయి నట్లు కానవచ్చును. అచ్యుతరాయల కాలమునుండి మాత్రము శక సంవత్సరముతో దానికి సమముగాఁబాలించిన రాజుపేరు కూడ వ్రాయఁ బడుట సంప్రదాయ మయ్యెను. రాజ్యమునకు వచ్చువారి క్రమములో నేయవకతవక జరిగినను ఆరాజు పేరు వ్రాయఁబడకుండెడిది. దాత కోరిక ప్రకారము దానముయొక్క లక్ష్యము మాత్రమే ధర్మ కర్తల సంఘమువారు తమ రికార్డులందు నమోదు చేసికొనెడివారు. దీని వలన ధర్మకర్తల సంఘమువారి ప్రాధాన్యమెంత యున్నతమయినదో తెలియవచ్చుచున్నది.

ఇందులకు సంబంధించిన మఱియొక విషయమిట విపులీకరింపఁ బడును. విజయనగరరాజులు దేవాలయ పరిపాలనా నిర్వహణములో వారిలో వారి పూర్వులకంటె వారి వారి వ్యక్తిగత భావములకు తా వీయుక మత విషయములో కొంతపట్టుదల సడలినవారు. ఇది పూర్తిగా శ్రీ కృష్ణదేవరాయల వారి కాలములో కానవచ్చును. ఆయన శ్రీవారి కిచ్చిన కానుకల వివరములను మనమూహించినచో వాని మూల్య మును గుఱించి కంటె నాయనకు శ్రీవారిపైగల భక్తి విశ్వాసములకు మన మబ్బురము చెందక యుండము. ఈ కానుకల ప్రదానమాయన వ్యక్తిగత యనుభూతులకు చెందినట్టిది. కాని విచార్య మేమన ఆ యిచ్చిన కానుకలు, ఆ యమూల్య ధనసంపత్తిని గుఱించి తరువాత వారు కనీసము తలంచినట్లయినను కానరాదు. ఇది యట్లుంచి దేవా లయమునకు సంబంధించినట్టి ఏ వైష్ణవునకును ప్రత్యక్షముగనో పరోక్ష ముగనో నెట్టి ప్రత్యేకతను జూపించినట్లు మనము నిర్ణయింపలేము.

కాని అచ్యుతదేవరాయ మహారాజు వ్యవహారము వేఱు. ఆయన తనకుగల ప్రత్యేక వైష్ణవ మతాభిమానము బుజువుపఱచుకొన్నట్టి వాడు. ఈయన దేవాలయ పరిపాలనములో నెట్టి విధమయిన జోక్యము కల్పించుకొనలేదు. సదాశివమహారాయలు చాల అనుభవ గల భక్తశిఖామణి. రెండుమూడు పర్యాయములకంటె నెక్కుడుగా శ్రీవారిని సేవించినవాఁడుకాదు. శ్రీవారి కాతఁడు స్వయముగా నెక్కువ కానుకలను సమర్పించి యుండలేదు. కాని శ్రీవారి ఆలయమునకు దానములిచ్చెడి మహాదాతలను హృదయపూర్వకముగా ప్రోత్సాహ పఱచెడివాడు. యాత్రికులకు ఆయన కల్పించిన అత్యంత వాత్సల్య పరిపూరితమగు సౌకర్య సౌఖ్యములకంతులేదు. ఈ సౌకర్యముల నన్నింటిని తాను వ్యక్తిగతముగా గాక వ్యవస్థలద్వారా తన పాలనా కాలములో వైయక్తిక రంగములో జరిపించెడివాడు.

వైయక్తికరంగములోని, దానములను పేర్కొనవలసినప్పుడు ఆకాలములో తిరుపతి, చంద్రగిరి నగరవాసులు, వారు నిర్వహించిన అత్యంత శ్లాఘనీయమైన పాత్రను విస్మరించుటయన్న, శ్రీవారిని విస్మరించుటయే. అంతటి మహత్తరమైన సేవను వారన్నివిధముల స్వామిని సేవించుటయందును, స్వామిని సేవించు వారిని సేవించుట యందును వారికి సౌకర్యములొదగూర్చుటయందును ఒక ప్రత్యేకతను నిలబెట్టుకొనిరను విషయము నిర్వివాదము. అర్చకులు, తిరుమలనంబి, అనందాళ్వారు, వేయిసంవత్సరములకుఁ బూర్వము తిరుమలపై విశేషమయిన కృషిచేసియుండిరి. ఇతర ఆచార్య పురుషులును వారి పూర్వులు గావించిన కృషిని నిరంతరముగాఁ గొనసాగించిరి. అంతేగాని వీరెవ్వరును దేవాలయమునకు చీడపురుగులుగా ప్రవర్తించ లేదనెడి విషయము శాసనములనుబట్టి స్పష్టము. విప్లవ కాలములలో రాజనెడివాడు లేక, ప్రజారక్షణమును నిర్వహించువాఁడు లేని సమయములో తిరుపతినగరవాసులు, పరిసర నగరగ్రామములకు

గల సభవారను పేరటనున్న ధర్మకర్తల సంఘములు, దేవాలయమునకు నియమింపఁబడిన శాశ్వత మఠాధికారులు దేవాలయనిర్వహణమును తమభుజస్కంధములపై నుంచుకొని నిర్వహించిరి. ప్రాంతీయ పాలకులచేత, సైనికాధికారులచేత, నత్యున్నత గౌరవమొసఁగఁబడి, తమకుఁ గల పౌదుపుధనములో విశేషముగా దానమీయఁబడుట, వారిచేఁ బ్రభావితులు కాఁబడిన యితరదాతలను విశేషముగా దానరూపమున ధనమును సమర్పించుట, శ్రీవారిపేరన ప్రచారము సలిపి, ధనమును గ్రహించి, దేవాలయమును, తమ కార్యనిర్వహణా వైపుణ్యమును ప్రాకట్యమును బొందించుట, వరుసగా జరిగిన విషయములు. వారు, వీరిచ్చిన దానములు, దాతృత్వమునుగూర్చిన వైశిష్ట్యమునుగూర్చి విపులముగా వేరొకచోట వివరింపబడును దాతృత్వము నెఱపినవారిలో ప్రముఖులు 'కొత్తైకావిలిదాసర్' 'మల్లనగల్ లేక మాధవసాగర్' (చంద్రగిరి) తిరుక్కాళికన్ని దాసర్, 'అలగిప్పిరానార్' సొత్తై తిరుమల నంబి కుటుంబములోని తోళప్పారయ్యంగారు, కుమార తాతయ్యంగారు, శ్రీనివాస తాతయ్యంగారు, కోటికన్నికదనమ్ కుమార తాతయ్యంగారు, అనందాళ్వారు, 'కోయిల్ కందాడై అణ్ణన్, కందాడై రామానుజయ్యంగారు, కందాడై దొడ్డయ్యంగారు (షోళింగరు) ప్రతివాది భయంకర అణ్ణన్, చక్రవర్తి కుటుంబములోని వారయిన అలిగియ మనవాళ జీయర్, మూల తిరువేంకట జీయరు, ఎంబెరుమానారుజీయరు, వారి పరంపరలోనివారు, వన శఠగోపజీయరు, వారి పరంపరలోని వారగు అహోబిల మఠములోనివారగు నారాయణజీయరు, శ్రీవ్యాసతీర్థ శ్రీపాద ఉడయివరు, అర్చక కుటుంబములోని దేవరాజ భట్టరువారు, ఇంకను తిరుపతి వర్తక కుటుంబములోని యనేకులు శ్రీవారి నిమిత్తమై అనేక దానము లొసఁగిరి. దేవాలయపు లెక్కల తనిఖీదారులు నాడు తిరునిన్డ్రఉర్ ఉడయిర్ పేరుతోఁ బేర్కొనఁ బడిరి. దేవాలయమున కనుబంధముగానున్న తిరువీధి సానులు విపత్కర పరిస్థితులలో దేవాలయము, రాజ్యము నున్నప్పుడు అత్యంతముగా దేవాలయ నిర్వహణ

ములో సహాయపడుటయేగాక ధనమును దానరూపములో నొసంగుట ప్రత్యేక విశేషము.

సమాజములోని విభేదములు, విరోధములను తొలంగంజేయుటకు వీరిచే నైదు శతాబ్దముల క్రితమే యొక దొడ్డ ప్రయోగము జరుపంబడెను. తిరుమలలో బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులచేత శ్రీరామానుజుని సన్నిధిని 'తిరువాయిమొళి' ప్రబంధ పారాయణము సమానముగాఁబరిగణింపఁబడెడిది. క్రీ. శ. 1467 లో వలె ప్రసాదముల భాగముల పంపిణీ విధానము సమముగనే యుండునట్లు ప్రవేశపెట్టబడి యమలు పఱచఁబడినది. బ్రాహ్మణేతరుల ప్రాతినిధ్యము వహించిన చాత్తాద శ్రీవైష్ణవులచే పరిపూర్ణమయిన సర్వసమగ్రములయిన పరికరములతో 'పరిమళము' అనుపేరుతో శ్రీవారి నిత్యపూజ కైంకర్యము జరిగెడిది. తిరుమంజనోత్సవమునకు వీరి ప్రాజాపత్యమే ప్రముఖ విషయము. వీరు తెచ్చిన పవిత్ర పరిమళద్రవ్యములతో శ్రీవారికి 'తిరుమంజనోత్సవము' అనెడి పవిత్రస్నానవిధి నిర్వర్తింపఁబడెడిది. వీరికి అభిషేకాంతమున తగు విధమగు మర్యాదలు గౌరవములు, మూల్యములు చెల్లింపఁబడెడివి. ఈ యుత్సవముతో సమముగా జరిగెడి మరొక యుత్సవము ఏ దేవాలయమునందును గానమని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఈ విషయములో కూడ పూర్తివివరములు ముందు చర్చింపఁబడును.

తాళికోట యుద్ధానంతరము కాలములోనున్న శాసనములలో ఆలయమునకు రాచరికపుటభిమానము పూర్తిగా తగ్గుట, అదృశ్యమగుట కూడ ప్రత్యేకముగా కానవచ్చును. కాని, తిరుపతి కాళహస్తి, నందలూరు, తిరువళ్లూరు, కంచి పట్టణములలో ననేక గోపురములు, దేవాలయములు కట్టించి, అనేకాన్న సత్రముల నిర్మించి, దానములు కూడ వ్రాయించినట్టి మట్లకుమార అనంతరాజు దాతృత్వమిందుల కపవాదము. తరువాత కాలములో నీయబడిన దానములన్నియు వైయక్తిక దానములు.

అందులోను, ఆచార్యపురుష కుటుంబములలోని వారిచేతనే ఎక్కువగా సమర్పింపఁబడినట్టి దానములు గాననగును. ఈ కాలమునందు ధనము కొఱతగానుండుట, ఉన్నపంట కాల్వలకు దాతలు మరమ్మతు చేయ వలసివచ్చుట, క్రొత్త పంట కాల్వల త్రవ్వకము, దీనికి బదులుగా దాతల తృప్తికొఱకు ధర్మకర్తలు పయిమరమ్మతుల ఫలితముగా వచ్చిన పంటల యధికదిగుబడిని యనుసరించి కొన్ని నూత్నమగు సేవలు శ్రీవారికి జరుపుట జరిగెడివి. క్రీ. శ. 1684 వ సంవత్స రములో 'దబీర్ షా' అనునొక దాత ధనమునకు బదులుగా నొక బంగారపుకంటె నాటి మార్కెటు విలువకు తగినట్లుగా శ్రీవారికి దాన మొసఁగెను. ఇదికాక యీయన కొన్ని గ్రామములను గూడ స్వామి వారి కైంకర్యము నిమిత్తమై దానమొసఁగినట్లు శాసనములున్నవి.

గ్రామ దానములను గుఱించి పేర్కొనవలసి వచ్చుచో దేశపు నలుమూలలనుండి యీయబడిన గ్రామములు దాదాపుగ రెండువంద లకు పైబడి ధర్మకర్తల సంఘము అధీనములో నున్నవి. 15 వ శతా బ్దము మధ్యభాగమునుండి ధాన్యరూపములో నుండెడి యీవరుమాన మును యిన్ని గ్రామములనుండి వసూలు చేసికొనుటలోనున్న కష్ట మును దానిని సమర్థవంతముగా నిర్వహింపలేని ధర్మకర్తల యశ క్తత్వము పూర్తిగా గుర్తింపబడినది. తత్ఫలితముగా 'దేవాలయమున కనుబంధింపబడిన ప్రజాపనుల వినియోగ నిధి' నొకదానిని తిరుప్పాణి భాండారమను పేర ప్రారంభింపబడినది. ఈ కమిటీలోని సభ్యత్వమున కర్హత యెట్టిదో, యెవరర్హులో మనకు తెలియరాదు. ఇది యొక ప్రత్యేక విభాగముగా మాత్రము పనిచేయుట ప్రారంభించి 'దేవాలయపు ప్రధాన ధనాగారము'తో సమన్వయము కలిగి యుండెడిది. ఈ 'శ్రీభాండారమే' తరువాత దేవస్థానపు ఆర్థిక విభాగముగా పరిణ మించినది. 'తిరుప్పాణి భాండారము' ప్రజాసంబంధ కార్యములు, భవన నిర్మాణములు, పంటకాల్వల నిర్వహణము, భూములపై వచ్చు

ఆదాయమును వసూలు చేసెడి కార్యక్రమము నిర్వహించు భాగముగా రూపొందెనని చెప్పవచ్చును. 15వ శతాబ్దము చివరకు బంగారము, నగలు, పాత్రలు, వస్తువులు, విలువగల వస్త్రములు, వాని నిర్వహణము, రక్షణములకై మఱియొక శాఖయేర్పాటు చేయవలసిన యావశ్యకత కలిగెను. దీనిని 'పోర్ భాండారము' అని పిలిచిరి. ఇట్లెన్ని శాఖోప శాఖలు పెంపొందినప్పటికిని దేవస్థానమునందు నిత్యపూజా విధానములు, ఉత్సవములు, మొదలయినవి యొక క్రమ పద్ధతిలో నడిపించెడి యొకానొక పర్యవేక్షక మతాధికారశాఖ యొకటి రూపొందింపబడలేదు. మత సంప్రదాయమగు విధి విధానముగానుండెడి కార్యక్రమములందు పాల్గొన్నను, లేకున్నను శ్రీ వైష్ణవులు వారి సమైక్యాను కూల్యతలను ప్రతివిషయములోను ప్రదర్శించుట గమనింపదగినది. ఇంతకుముందుగనే బేర్కొన్నట్లుగా శ్రీ వైష్ణవులు ద్విజులు ద్విజేతరులు, వారొనర్చెడి దేవకార్యములందు సమభాగస్వాములగుట, వరుమానములుగూడ సమభాగములుగా ననుభవించుట దీనికి హేతువు. కాని యిది శ్రీ వైష్ణవుల సమాజముననే పరిమితమయినట్లు గానవచ్చును. ఇంకను ఇతరులయిన (శైవ) ద్విజులు శాస్త్ర సమ్మతము లగు శ్రీవారి యుత్సవ కార్యక్రమములో పాల్గొన దలంచినప్పటికిని వారి కోర్కెను, వారి ప్రవేశముకూడ తమ పాండిత్యముతో, వేవేకముతో అనాయాసముగా నణచివేసినట్లుగాఁ దోచును. ఈ కారణము చేతనే 'తిరుమల' లో శ్రీవారి సన్నిధానములో చాలకాలమువరకు వేదపారాయణము కొలూనినట్లు కానరాదు. ప్రబంధపారాయణదారులకు నుదారముగా వరుమానములు, ప్రసాద భాగములునుండెడివి. కాగా వేదపారాయణ దారులకు ప్రసాదములోభాగము నిషేధింపబడినది. ఈ దేవాలయములో నిది యొక ప్రత్యేక విషయము.

ఈ విధమయిన ప్రాథమికాంశములనుచెప్పి ముగించుటయే గాక మరికొన్ని ముఖ్యవిషయములును చెప్పవలసియున్నది.

తిరుమల శ్రీవారి ఆలయములోని ఆవరణమునందు వరదరాజ స్వామి, రంగనాథస్వామి, నరసింహస్వామి వార్లకు ప్రత్యేకమయిన సన్నిధులు గలవు. వీనిలో రంగనాథస్వామివారి సన్నిధి తాత్కాలిక మైనది. ఇపుడా సన్నిధి వేఱుకార్యక్రమముల కుపయోగపడుచున్నది. గర్భగృహములో శ్రీరామునివారికి, శ్రీకృష్ణులవారికి స్థానములు కల్పింపఁబడినవి. ప్రత్యేకముగా దేవాలయములుగల కంచి శ్రీవరద రాజస్వామివారి ఆలయములోగాని, అట్లే శ్రీరంగములోని రంగనాథ స్వామివారి ఆలయములోగాని శ్రీవేంకటేశ్వరస్వామివారికి స్థానము కల్పింపబడకుండుట ఇట పాఠకుడు ప్రత్యేకముగా గమనింపవలసిన విషయము. దీనికిఁ గారణమూహించుట సులభమే. 14 వ శతాబ్దము రెండవభాగములో 'మాలిక్‌కాఫర్' 'మహమ్మద్‌బీన్‌తుగ్లక్' పాల నలో దేవాలయములలోని విగ్రహములు, శిల్పములను నాశనమొనర్చెడి యౌద్ధత్యము మిన్నుముట్టగా నా సమయములో శ్రీ వరదరాజ, శ్రీనర సింహ, శ్రీరంగనాథ ఆలయములు నిర్మితములయినవి. తిరుమలలో శ్రీరంగములోని రంగనాథస్వామివారి యుత్సవులు మూడునాలుగు దశాబ్దములకాలము ప్రవాసముండిరను నైతిహ్యము కలదు. క్రీ.శ 1350 వ సంవత్సరము ప్రాంతములో వరదరాజస్వామివారి ఆలయము శ్రీవారి ఆలయము ఆవరణలో నిర్మితమైనప్పటికిని కంచి శ్రీవరద రాజస్వామివారు ఇక్కడ ఆశ్రయముకోరినట్లు కానము. క్రీ. శ1481 వ సంవత్సరములో ముస్లిముసేనలు కాంచీపుర వరదరాజస్వామివారి ఆలయము తలుపులు పగులగొట్టి నగలను కొల్లగొట్టి దోఁచుకొని శ్రీవైష్ణవుల నక్కడ సూదకోతకోసిరన్నట్లు తెలియవచ్చును. అహో బిల నారసింహుని ఆలయముకూడ నిట్టి విపత్తుకా కాలములో గుఱియయియున్నది. అప్పుడు తిరుమలలో బహుశః కొంతకాలము అహోబిల నారసింహుడుకూడ తలదాచుకొనియుండును. సంప్రదాయ పునైతిహ్యము ననుసరించి ఆదివనశఠగోపస్వామి 'మంత్రశాలి నరసింహస్వామి' విగ్రహమును గ్రహించి తరువాత గొని పోయినట్లు

అహోబిలమఠముయొక్క యునికిలేని కాలములోని చరిత్రవలన మనకు తెలియుచున్నది.

తిరుమలలోని శ్రీవారి ఆలయము ఇతర ప్రసిద్ధమగు విష్ణు క్షేత్రములలోని ఆలయములందలి స్వామివారలకు కష్టకాలములో శరణాలయముగాఁగూడ నుపయోగపడినదని తెలియజేయుటకే పాఠకుల కీవృత్తాంతము వివరింపబడినది.

ఇపుడు శ్రీవేంకటాచలమాహాత్మ్యమునుగుఱించి సంగ్రహముగాఁ దెలుపఁబడుచున్నది. క్రీ. శ. 1491 వ సంవత్సరము ప్రాంతములోనిది యుద్భవించియుండనగునని యూహించుచున్నారు. ఇది పలు పురాణముల నుండి సేకరింపఁబడి కూర్పబడిన పుస్తకము. కర్త వసిండి 'వేంకటత్తురయివర్' అనువారు. వారిచే నీ గ్రంథము 1491 వ సంవత్సరములో వైవశాసనములో పారాయణము చేయబడినట్లు తెలియుచున్నది. తిరుశుకనూరులోని పద్మావతీ దేవాలయమును గుఱించిగాని, ఆ విగ్రహ ప్రతిష్ఠాపనమును గుఱించిగాని పురాతనముగానున్న శాసనము లేవియుగానరావు. ఈ విషయములో తిరుమల-తిరుపతి దేవస్థానముల శాసన పరిశీలకుని యూహలు, మౌలికమగు తమిళగ్రంధములోని పదముల కటనట నీయనచేయు యనువాదములు, చేయువ్యాఖ్యలు సత్యసమ్మతములుగావు, శాసనములో అలమేలుమంగాదేవి శ్రీవేంకటేశ్వరస్వామివారికి దక్షిణ వక్షస్థలమున వసించు భూదేవిని గుర్తుచేయుచున్నదని తెలుపబడినది. క్రీ. శ 1477 వ సంవత్సరములో మొట్టమొదటగా 'నలమేలుమంగాదేవి' యన్నపదము, అమ్మవారి సన్నిధినిగూర్చి శాసనములో పేర్కొనబడినది. అంతకుముందుగా నీ దేవిపేరు ఎచటను యే శాసనములోను పేర్కొనబడియుండలేదు. తిరుమలలోని శ్రీవారికి అభిషేకము అంతకు చాలకాలమునకు ముందుగనే పేర్కొన బడినది. ఈ యభిషేకము శుక్రవారమే జరుగుటకుగల హేతువులు వేరుగా వివరింపఁబడును. ఆగమశాస్త్రములు నైతము

విశేషించి భృగుసంహిత' యను వైఖానసాగమ గ్రంథములో 'సహ లక్ష్మ్యభిషేకస్తువాసరే భార్గవే హరేః। సాన్నిధ్యకారీ సతతం సమృత్రి దాయకః॥ అని చెప్పియున్నది. విష్ణువునకు లక్ష్మీదేవితోగూడి శుక్రవారమునందు పవిత్రస్నాన మొనర్పజేయుట శ్రీహరి సాన్నిధ్యమును కలుగజేయుటయేగాక సమస్తసంపదల ననుగ్రహించునని పై శ్లోకమునకు భావమయియున్నది.

తిరుపతిలోని 'ఆళ్వారుతీర్థము' కపిలతీర్థము, కపిలేశ్వరస్వామి సన్నిధిగా గుర్తింపబడుచున్నది. క్రీ. శ 1865 వ సంవత్సరము కాలములోగాని మనకుఁ గపిలతీర్థమనుపేరు శాసనస్థమయినది కానబడదు. మహంతులలో నొకరగు ధర్మదాసజీయను నాయన నీ కపిలతీర్థమును బరిచయము గావించిన వానిగాఁబేర్కొనవచ్చును. 1563 వ సంవత్సరములో 'కపిలేశ్వర నాయనార్' అను పేరుతో నటగలస్వామివారు బేర్కొనబడిరి. ఈ కాలమునకు బూర్వము అదేవాలయమా పేరుతో నున్నట్లుగా గాని, అచటి జలపాతమును గుఱించిగాని, అచట గల సరోవరమునకుఁ గపిలతీర్థమను పేరున్నట్లుగాని మనకెట్టి యాధారములును తెలియరావు. ఇఁటఁగల ఆళ్వారు సుదర్శనాళ్వారుగాని చక్రత్తాళ్వారుగాని యై యుండును. శాసనములో నొకదానిలో శ్రీరామానుజునిచే నిర్ణయింపఁబడిన యొకయుత్సవములో శ్రీ గోవిందరాజస్వామివారు, ఉభయదేవేరులు, చక్రత్తాళ్వారును యీ తీర్థమునకు వచ్చి యీ జలమును పవిత్రీకరించినట్లుగలదు. ఈ విషయమై ముందు విచారింపబడును. శాసనములలోగల ముఖ్య విషయములను గుఱించి యిందు సంగ్రహముగా వివరింపఁబడినది. ఈ దేవాలయమునకు గల చరిత్రముతో సంబంధించిన కొన్ని ముఖ్య సంఘటనములను గుఱించి తెలుపవలెననెడి యాసక్తి యస్లే యున్నది. ఇప్పుడవి వివరించబడును.

ప్రాచీనములో, శ్రీవారు కొండపైనుండుట, మహారణ్య పరివృతుడై యుండుట, నేడుగల యనేక సౌఖ్యకరములగు సౌకర్యములు

నాడు లేకుండుట – యీ హేతువులచే నాడు శ్రీవారు సామాన్య జను నకేగాక, ప్రముఖులకును చేరరానివాఁడయ్యెను. క్రీ. శ. 826 వ సంవత్సరము పల్లవరాజగు విజయదంతి విక్రమవర్మ కాలమగుచున్నది. ఈయన కాలములోనే 'తిరుశుకనూరు' గ్రామములో 'తిరువిలాన్ కోయిల్' అను ఆలయము నిర్మింపబడి తిరుమలలోని శ్రీవారి బింబమునకు ప్రతిబింబమొకటి యందు ప్రతిష్ఠితమయ్యెను. ఇది యాళ్వారులలో తిరుమంగై ఆళ్వారుకాలము. దీనియందు అనంత విజ్ఞాన జ్యోతి కెనయగు తిరుమల శ్రీవారి ఆలయములోని దీపమునుండి యుద్భవించిన యఖండ దీపమొక దానిని నెలకొల్పిరి. క్రీ. శ. 900 సంవత్సరములో పల్లవులు పతనమయిరి. క్రీ. శ 960 వ సంవత్సరము కాలములో శ్రీ నాథముని మనుమడగు యామునాచార్యుఁడు శ్రీ వైష్ణవ మతమును తీర్చి దిద్దినవాఁడయి, శ్రీ వైష్ణవ వేదాంతమగు విశిష్టాద్వైతమును, వైష్ణవాగమములను బూర్తిగా నేర్చినవాడయి, తన కీర్తి ప్రతిష్ఠల నత్యున్నత పథమున ప్రయాణము చేయించిన సమయములో శ్రీ తిరువేంగడనాథుని' (శ్రీ వేంకటాద్రి నాథుని) చిన్న విగ్రహమును ఆయన యుండవలసిన స్థానములో అనగా తిరుమల శ్రీవారి ఆలయములో నుంచుటయే సరియగు పద్ధతిగా నిర్ణయించి, మత వైషమ్యములకుఁదావులేని విధానముగా దీనిని విశ్వసించి శ్రీవారిని యథాస్థానమునకుఁజేర్చి విజయుఁడయ్యెను. 'తిరువిలాన్ కోయిల్' స్వామి తిరుమలలోని శ్రీవారికి ప్రతినిధివంటివాడేగదా! శ్రీవారి మూర్తికి సమమగు రజిత విగ్రహము తయారు చేయబడి వైఖానస ఆగమ శాస్త్రవిధానముగా ప్రతిష్ఠింపఁబడి నిత్యపూజా విధానమును ఆయాగమ శాస్త్ర విధానము చేతనే యమలు పఱుపఁబడి సంవత్సరమునకు రెండు బ్రహ్మోత్సవములు యథావిధిగా జరుపబడుచు కొన్ని కొన్ని ముఖ్యమగు నుత్సవములును నెరవేర్పబడెడివి. ఇది 966 వ సంవత్సరమునకు సమమగు కాలము. ఈ కాలములో శ్రీ అళవందారు, ఆతని మనుమడగు 'తిరుమలనంబి' శ్రీ వైష్ణవ మతమున

కైకైకనాయకులుగా ప్రకాశించిరి. క్రీ. శ. 1017 వ సంవత్సరములో మాత్రమే శ్రీరామానుజుఁడవతరించినట్లుగాఁ జరిత్ర చెప్పుచున్నది. గమించుటత్యంత కిష్టమగు పర్వతము మీదనున్న శ్రీవారి ఆలయము, అతిస్వల్పమగు వసతులున్న శ్రీవారి ఆలయ ప్రదేశము, ఎంత మాత్రము శ్రీ వైష్ణవులకు విహార భూమి కాజాలదని శ్రీరామానుజుడు గ్రహించి యుండును. ప్రపంచమునకంతటికిని వైష్ణవమే ముక్తి నొసంగగల యేకైక మతమని, ఆ హేతువుచే వైష్ణవభూయిష్ఠము గా నీ ప్రజల నందఱను మార్పవలెనన్న గొప్ప ఆశ అయనకుగలదు. కాని ఆ సమయముననే చోళరాజు చిదంబరములోని శ్రీ గోవిందరాజస్వామిని శ్రీ విష్ణువునకు సరియగు స్థానము సముద్రమే గనుక నాలయములో స్థానము లేకుండ నాయనను సముద్రములో పారవైవవలసినదిగా నాన తిచ్చెను. ఆయన వైష్ణవ మతమునకు బద్ధవిరోధి. అచ్చటనుండి ఆ విగ్రహమును శ్రీమద్రామానుజుని శిష్యులు గ్రహించి తిరుపతిలో శ్రీ పార్థసారథి స్వామి వారి ఆలయమునకుఁగుడివైపుగా శ్రీ గోవింద రాజస్వామి వారిని ప్రతిష్ఠించిరి. శ్రీ గోవిందరాజస్వామివారిని ప్రతి ష్ఠించిన ప్రదేశమే ఆయన యటకు శరణార్థియై చేరినట్లుగా చెప్పును. కాని తిరుపతి, ఈ దేవాలయము, తిరుమల శ్రీవారి ఆలయముతో మొట్టమొదటినుండి - యీ పట్టణ నిర్మాణమునాటి నుండి యను సంధిం పఁబడుటతో ప్రాముఖ్యము గల్గినవైనవి. శ్రీవారినిజూడ తిరుమలకేగు యాత్రికునకు తిరుపతియే ప్రథమ స్థావరమయినది. అంతేకాక అనేక దేవతలను శ్రీ మద్రామానుజుల శిష్యులు తిరుపతిలో నెలకొల్పిరి. కాని వీరి ముఖ్యోద్దేశము తిరుమల శ్రీవారి ఆలయముతో దీనికి ముఖ్యమగు ననుబంధమును చేకూర్చుటయేయని చెప్పవలెను. కాలక్రమమున నొకానొక వివేక సంపన్నుఁడు, దూరాలోచనగలవాడు చేసెడి పని యొకటి నిర్వర్తింపఁబడినది. శ్రీవారి ఆలయమునుండి ప్రసాదములు, అనగా, చందనము, వస్త్రము. అప్పపడి (ప్రసాద విశేషము), తీర్థము మొదలగునవి దిగువున యే ఆళ్వారునకు 'శాత్తుమొఱ' జరుగునో అనగా

ఏ ఆళ్వారు దివ్య తిరునక్షత్రపుగునో ఆదినమున సర్వసమగ్రోపకరణము లతో సకల గౌరవ మర్యాదలతో, అధ్యాపక, వేద పారాయణ గోష్ఠులతో, గజాదులతో నూరేగింపుగా సమర్పణము చేయుట యన్న కార్యక్రమము ఏర్పాటు చేయబడెను. నాడు చేయబడిన యీ మేధావిలసిత కార్యము నేడు గూడ నట్లే జరిగించుట యొకటి, రెండవది శ్రీవారి ఆలయముతో తిరుపతిలో ప్రతి చిన్న దేవాలయమునకు నాడు పెనవేసిన సంబంధము నేటికిని అట్లే కొనసాగుట - ఈ రెండును పాఠకుడు గమనింపవలసియున్నది. యాత్రికుల కిది కన్నుల పండువయై, వేడుకగ నుండుటయేగాక తిరుపతి పట్టణవాసులకును నిదియొక మహోత్సవమువలె భాసిల్లినది. తిరుమల తిరుపతి పట్టణములకు సన్నిహిత సంబంధమును కూర్చిపెట్టుటయే యిట్టివానిలోని ముఖ్యోద్దేశము. శ్రీరామానుజుని కాలములో నిట్టివి సమగ్రముగా నాకృతి వహించి యుండలేదు. శ్రీరామానుజుని కాలములో నిజమునకు ఆళ్వారు లెవ్వరిని తిరుమలలోగాని తిరుపతిలోగాని నెలకొల్పి యుండుట జరుగని విషయము. క్రీ. శ. 1200 సంవత్సరము నాటి వరకు నింతటి ప్రశస్తియు కానరాదనెడు విషయములో ననుమానములేదు.

క్రీ. శ. 1160 వ సంవత్సరము కాలము తరువాతనే తిరుమలలోను తిరుపతిలోను గోపుర నిర్మాణాదుల, ప్రాకారముల నిర్మాణములు ప్రారంభింపబడియుండును. మనకు మిక్కిలి ప్రాచీనమయిన ప్రాకారపు శాసనములలో 1180 వ సంవత్సరములో తిరుమల లోపలి గోపురము యొక్క పునాది వేయబడిన విషయము. తెలియవచ్చును. ఆ కాలములో నారాయణవనములోని 'యాదవరాయ రాజులు' ఈ దేవాలయమునకు ముఖ్య ప్రాపకులుగా నుండినట్లు తెలియుచున్నది. వీరిలో ప్రముఖులు వీరనరసింగయాదవరాయలు. ఈయన కాలములోనే తిరుమల శ్రీవారి ఆలయము గర్భగృహము జీర్ణోద్ధారము విస్తృత వైభవనోపేతముగా జరుగుట, విమానమునకు బంగారుపూత పూయబడుట, శ్రీవారి ఆనంద

నిలయ విమానమునకు బంగారు శిఖరమును ప్రతిష్ఠించుట జరిగినవి. ఈ తిరుమల దేవాలయము నాడు మేరు పర్వతమునకు సమ స్థాయి చేరుకొనునట్లుగా చేసినవి. ఆయన పర్యవేక్షణమునందే తిరుపతి శ్రీ గోవిందరాజాలయము కూడ తగు ప్రాశస్త్యము పొంది దేవాలయ విమానమునకు బంగారు కలశము ప్రతిష్ఠించుట, రథ నిర్మాణము మొదలగునవి జరిగినవి.

ఈ కాలములోనే 'మాలిక్ కాఫరు' సేనలు హిందూదేవాలయములను, అందలి విగ్రహములను, శిల్ప సౌందర్యమును నాశనము చేయ విజృంభించినవి. ఇప్పటి వరకు తిరుపతి దేవాలయములో బ్రహ్మోత్సవములు మాత్రమే జరుగుచుండెడివి. మొత్తమివి 7 ఉత్సవములు. తిరుపతిలో రెండు జరిగెడివి, మిగిలిన ఐదు తిరుమలలో జరిగెడివి. ఇవికాక మఱికొన్ని పర్వదినములలో కొన్నియుత్సవములు జరిగెడివి. దక్షిణదేశములో నీ విధమయిన తురకల సేనల దాడుల వలన దేవాలయ వినాశము మూకుమ్మడిగా జరుగుటతో తిరుపతి, తిరుమలచేరి శ్రీవారిని సేవించుకొనెడి యాత్రికులకు భయముతోబాటు ఈ విషయ మశని పాతమయ్యెను. కాని మేలేమన తిరుమల తిరుపతులలో నిట్టి భయము కొంత తక్కువ. అందువలన భక్తులు, భక్తులు కాని యితరులును ఈ ప్రదేశములకు పారిపోయిరి. ఇది శ్రీవారి మహత్తరశక్తియే. ఆ శక్తియే తురుష్కుల నీ ప్రదేశమును తేరిచూడ నీయలేదు. ఇది క్రీ. శ. 1300 నుండి 1360 వరకు జరిగిన మహా దారుణ క్రమము. 1336 వ సంవత్సరమునకు బూర్వము మలయప్ప స్వామివారు (ఇపుడు శ్రీవారి ఆలయములోనున్న ఉత్సవమూర్తులు) దేవేరులు శ్రీవారి ఆలయములోనున్నట్లుగా మనకే శాసనాధారమును లభించదు. కాని ఆ కాలమునకు తరువాత జరిగిన యన్నియుత్సవములు వీరితో జరుపబడినట్లు శాసనాధారములను జూడగలము. ఊరేగింపులు, అస్థానములు తిరువోళకమ్ (భక్తులకు అన్న ప్రసాదములు

వినియోగించుటకుగాను జరిగెడి యొక ప్రత్యేక ఉత్సవము)- ఇట్టివి బహుళములయ్యెను. దక్షిణ తమిళదేశములోని దేవాలయములలో జరిగెడి కొన్నియుత్సవముల నమూనాలు కొన్ని యిచట ప్రవేశపెట్టఁబడెను. ఉదాహరణమునకు (బారువేట ఉత్సవము, ప్లవోత్సవము (తెప్ప) ఊంజల్ సేవ (ఊయల), పవిత్రోత్సవము (ఆగమనిర్దేశము) పది నుండి ఇరువది రోజులవరకు జరిగెడి తిరువాయిమొజి దివ్య ప్రబంధకాలక్షేపమును చెప్పెడి అధ్యయనోత్సవములు, కల్యాణోత్సవము సహస్ర నామోత్సవము (తోమాలసేవ), సహస్ర కలశాభిషేకము, సంక్రమణోత్సవములు, విష్ణుపంచక దినోత్సవములు, మొదలగునవి ద్విగుణీకృతములు కాబడినవి. ఆళ్వారాచార్యులవారి దివ్య తిరునక్షత్రములు, పుణ్యతిథులు, శాత్తుమొరలు జరుపబడుచుండెడివి. ఇవ్విధమున 17 వ శతాబ్దము నాటికి 365 రోజులలో 429 ఉత్సవములయ్యెను. రెండవ దేవరాయ మహారాజుకాలము నాటినుండియే వేదపఠనము నిత్యముగా ప్రతిఫలాపేక్షలేక క్రమబద్ధముగా, సంప్రదాయానుసారముగా జరుపబడుచున్నది. ఈయన కాలము క్రీ. శ. 1443 వ సంవత్సరము.

ముస్లిముల దండయాత్రల ఫలితముగా నీ యాదవరాయలు, పాండ్యులు నిర్మూలింపబడిరి. విజయనగరరాజులధికారములోనికి వచ్చిరి. 1365 వ సంవత్సరములో బుక్కరాయలు తిరుమల శ్రీవారి ఆశీస్సులు పొందినట్లు ఆధారములున్నవి. ఈయన ఒక సంధికాలములో శ్రీవారి అన్నప్రసాదముల నివేదనమునకు దానమిచ్చెను, బ్రహ్మోత్సవము నొకదానిని ప్రారంభించిన వాఁడయ్యెను. బుక్కరాయల ప్రాళియగాండ్లలో నొకడుగా చంద్రగిరిలోనున్న సాళువ మంగిదేవుఁడు రెండవ పర్యాయము 1409 లో శ్రీవారి ఆలయమునకు బంగారుపూత వేయించెను. 1429 వ సంవత్సరములు దేవరాయలు మిగుల యుదారతతో తగినంత అన్నప్రసాదముల వినియోగమున కేర్పాటులు

గావించెను. క్రీ. శ. 1485 వరకు విజయనగరరాజులకడ మంత్రిగను, సేనాధిపతిగను నుండి, అత్యంత విశ్వాసపాత్రుఁడయిన సాళువ నరసింహుఁడు ఈ దేవాలయాభివృద్ధి విషయమై కడుంగడు శ్రద్ధచూపెను. కందాడై రామానుజయ్యంగారు అను శ్రీ వైష్ణవ బ్రాహ్మణుని సలహా సహకారములతో తిరుమల దేవాలయమును తమిళ దేశములోని యే యితర దేవాలయములకంటె తక్కువ స్థితిలో నుండకుండునట్లు మార్పు గావించెను. నాట్యకత్తెల ప్రవేశముకూడ నిషేధింపబడలేదు. పైపెచ్చు వారికి ప్రత్యేక గౌరవాదరములు సౌకర్యములు సమకూర్చబడినవి.

క్రీ. శ. 1450 నుండి 1494 వరకు హెచ్చుతగ్గులనేకము లున్నప్పటికి హెచ్చులే పెచ్చుగానుండెను. సమముగా జరిగిన కాలములో చెప్పుకొనదగ్గ విశేషములేవియు నుండకుండుటచే వీరప్రతాప వీరకృష్ణ దేవరాయల కాలమునకు మనము చేరుదము. అతని కాలము మతవిద్వేషముల కతీతమయి, స్వాతిశయముగల మతప్రభావములకు లోనుగాక, మతస్వేచ్ఛా ప్రాతినిధ్యములుగలిగి, సాటిలేని దాతృత్వౌదార్యములతో, ఉత్తమ భారములతో నాతనికాతడె సాటియని చెప్పదగిన కాలమిది. ఈ మహారాజు బంగారము నగలు, పీతాంబరములు, విలువ గలిగిన పాత్రలు, దానమిచ్చెను. మరల విమానమునకు బంగారు పూత వేయించుట జరిగెను, భగవంతుని పేరిట నిర్వహించుచున్న ధనమునకులెక్కలలో కుడియెడమలు చూడని వాఁడీ యుదారపురుషుఁడు. తనకున్న యొకేయొక కుమారుని కోల్పోయి నప్పటికిని శ్రీవారిపై యచంచల విశ్వాసము రవంతయైనను చెదరగొట్టుకొనని ధీరుఁడు. తాను, రక్తపూరితమయిన తన కత్తి రామేశ్వరము కడనున్న సేతువులో మునిగినంత మాత్రమున తన పాపపరిహారము జరుగదని గుర్తెరింగిన మహాపండితుఁడు. విజయనగరరాజులలో మనము విచారించినచో శ్రీకృష్ణదేవరాయలుకాక యితరులలో ఆ దేవాలయము నభివృద్ధి చేయుటలో నాసక్తి చూపినవారు తక్కువ. తక్కువయని చెప్పుటకన్న 'నాస్తి'

పదమే మిక్కిలి యుచితమయినది. తక్కువ అని చెప్పుటయేలనగా, డంబములేని, సదాశివ మహారాయలు, అళియరామరాయలను చెప్పవలసి వచ్చుటయే. కాని శ్రీకృష్ణదేవరాయలు మాత్రమాతఁడు చేసిన కృషి కాతఁడేసాటి.

వ్యక్తిగతమయిన దానవిశేషములు లెక్కకు మిక్కుటముగనే ఈ ఆలయమునకు సమర్పింపబడుచుండెడివి. ఒక అత్యాశ్చర్య కరమయిన విషయమిట చెప్పవలయును. ఇట్టి పెక్కువైయక్తిక దానములు అధికారుల పర్యవేక్షణనుండి తప్పించుకొనెడివి. అవియెట్లు జరిగెడివో-బ్రహ్మరహస్యము. పెక్కుశాసనములలో శాసనమంతయు నుండి గ్రామనామము వరకుండెడిలిపి యులితోఁ చెక్కియుండును. అనగా గ్రామనామము గానరాని దానశాసనమన్నమాట. ఇది అధికార దుర్వినియోగమునకు మారుపేరుగా చెప్పుటలో తప్పులేదు.

దానములు దాతలొసంగినవి, వారికోర్కెలమేరకు యే యుత్సవ మునకో, అన్నప్రసాద సమర్పణమునకో సరిపడియే యుండును. ఒకొక్కప్పుడు ఆ ద్రవ్యము దాతకోర్కె నిబంధింపబడిన కార్యమునకు సరిపోనియెడల అదనపు దానమును సమర్పింపవలసినదిగాఁ గోరుటయుగలదు.

ప్రాథమికముగా మొదట పూజాసేవ (నేటి తోమాలసేవ) సర్వ దర్శనమై యుండెడిది. ఏవిధమయిన రుసుమును వసూలు చేయబడి యుండలేదు. యాత్రికులకందఱకు అన్నప్రసాదము, ఇతరములగు వసతి సౌకర్యములు నుచితములే యైయుండెను. ముస్లిముల దండ యాత్రల ఫలితముగా నీ దేవాలయ నిర్వహణమునకు ప్రతినిధి సంఘము నొకదాని నేర్పాటుచేయుట, ఆ ప్రతినిధి ఆ దేవాలయ నిర్వహణమునకై రుసుమును యాత్రికులనుండి వసూలుచేయుట, కొంత నిర్వహణము నకు తానుంచుకొని మిగిలిన దానిని పాలకునకు సమర్పించుట

జరిగెడిది. ఇది ఈస్టిండియా కంపెనీవారు పాలనములోనికి వచ్చి నప్పుడు దేవస్థానము ఆదాయమును సంరక్షించు విషయములో వెలుగు లోనికి వచ్చినది. మహారాష్ట్రులు, ఫ్రెంచివారు చేసిన దోపిడుల సాకుగా దేవాలయమును ఆర్కాటునవాబు ఈస్టిండియా కంపెనీవారికి తాకట్టుపెట్టెను. ఈ దుష్టవ్యవహారములు సమసిపోయినప్పటికి దేవాలయ సక్రమనిర్వహణ నెపముతో రుసుము వసూలు చేయుటకొనసాగింప బడుచునేయుండెను. ఇక మహంతుల పాలనము, తరువాత దేవస్థానము ధర్మకర్తలబోర్డువారి ఆధ్వర్యములో నీరుసు "మింతింతై వటుడింతై" అన్నట్లుగా ఆకాశప్రమాణమునకెగిరి ఈ దేవాలయపుటాదాయము ప్రపంచసంస్థలలోని ఆదాయములకంటె మిన్నయైనది. దానితోబాటు దేవస్థానమువారు అనేక ప్రజోపయోగకరమగు కార్యములును చేపట్టిరి.

విజయనగరరాజుల పతనానంతరము వరుసగా దేవాలయము మూస్లిముల దండయాత్రలవరకు ప్రయివేటు వ్యక్తుల పరిపాలనలో నుండెను. అప్పటినుండి మహారాష్ట్రులు, తుదకు 'జాన్ కంపెనీ' వారు దీనికి యజమానులైరి. ఈ కాలములోని సమగ్రచరిత్ర మనకలభ్యము. ఆంధ్రప్రదేశ్, మద్రాసు ప్రభుత్వములవారి సమష్టిబాధ్యతతో నిది పరిశీలింపదగిన అంశము.

*

# 5 వ అధ్యాయము

## తిరుమల - తిరుచుకనూరు - ప్రాథమిక చరిత్ర

శ్రీ వేంకటాద్రి పయికి శ్రీ వైష్ణవుల భక్తిమార్గమును, ఆ భక్తి మార్గము ననుసరించెడు విష్ణుపూజానిరతులకు ఎట్లు సునాయాస ప్రవేశము కల్గెనో, ఆ విషయమును గూర్చి యీ యధ్యాయములో తెలుపఁబడును. ఆను వంశికముగా, పరంపరాగతముగ వచ్చుచున్న యతి విశిషమయిన వైఖాన సాగమము, పాంచరాత్రాగమ విధానములే విభాగములలో భేదించుచున్నవో కూడ నీయధ్యాయములో వివరింపఁబడును. ఈ వైఖానసపాంచరాత్రములను క్రైస్తవ మతము లోని ఆంగ్లికన్, రిఫార్మ్డ్ చర్చికిఁగల భేదవిధానములతోఁబోల్చనగును. లేదా, రోమను కాథలిక్కు మతాను యాయులు, ప్రోటస్టాంటు మతాను యాయులకుగల భేదములతోనైనను బోల్చవచ్చును. విద్య, సంస్కారము, శీలము కలిగిన యే బ్రాహ్మణునకైనను పాంచరాత్రాగమము ప్రవేశమిచ్చి అర్చకత్వమున కర్హుని చేయుచుండగా వైఖానసుల విషయమున వారివంశములో జన్మించిన వైఖానసునకే యిట్టి యర్చకత్వము, శాస్త్రాధ్యయనము పరిమితముచేయబడెను. సర్వవైష్ణవ కార్యకలాపముల నమలుపఱచు కేంద్రముగా 'తిరుచుకనూరు' గ్రామమెన్నుకొన బడెను. కారణమేమన, నాటికి తిరుపతి పట్టణ పుటునికియేలేకుండుటచే నిట్టి స్థితి యేర్పడినది. తిరుచుకనూరులో పై తిరుమల కనుబంధముగా నొక దేవాలయము నిర్మింపబడ పైనగల ఆలయములోని శ్రీవారి వలెనే వారి ప్రతిబింబము నొకదాని నేర్పఱచి ప్రతిష్ఠించిరి. శైవులను గూడ వైష్ణవులుగా మార్పు చెందించుటకొఱకు మఱియొక ప్రతిమ ప్రతిష్ఠింపబడినది. ఆ ప్రతిమ సన్నిధిలోనే ఈ మతము మార్పిడి కార్యక్రమము నిర్వహించెడివారు. దీనిని పూర్తిగా నాశమొనర్చుటకు శైవులు ప్రత్యేకముగా నాగ్రామములోనే పరాశరేశ్వరస్వామివారి ఆలయమును

ప్రతిష్ఠించిరి. దీనిని తట్టుకొనుటకు ఎట్టకేలకు తిరుమలలోని శ్రీ వైఖానస అర్చకులతో నొక యొడంబడికకు వచ్చి వైష్ణవులు తమ మతపు కార్యక్రమములను తిరుమలపైకి మార్చుకొనిరి.

'తొల్కాప్పియమ్' అనునది తమిళములో తొలిగ్రంథము. తెలుఁగులో దీనిని 'తొలికావ్య' మందురు. ఇందు శ్రీవారు వసించిన కొండ యొక్క ప్రసక్తియున్నది. దానిలో నీ కొండపేరు 'వేంగడ' మని రచయిత పేర్కొనెను. సంగమ కవి యగు 'మామూలనార్' ఈ కొండ విషయములో 'తొల్కాప్పియమ్' రచయిత పేర్కొన్నట్లే 'వేంగడ' మనియేపేర్కొనెను. కాని పై కొండనున్న దేవునిపేరు శ్రీ వేంకటేశ్వరస్వామిగా నీ యిరువురిలో నెవరును బేర్కొని యుండ లేదు. ఈ పేరుగాక మరియింకొక పేరుగల దేవతామూర్తిగాని దేవా లయముగాని యున్నట్లే యిరువురు గ్రంథ కర్తలలో నెవరును పేర్కొనలేదు. 'మామూలనార్' కవి యచ్చట జరిగెడి యుత్సవ ములను, సంతలను, త్రాగుబోతుల విలాసములను, ఇచ్చిపుచ్చుకొను వస్తుమార్పిడి చేయు సంగతులను పేర్కొనెను. తమిళసాహిత్య గ్రంథ మగు 'శిలప్పది కారము' 'వేంగడమ' ను కొండను గుఱించి, వేంక టాద్రి నాథుని గుఱించి, ఆ విగ్రహము విష్ణువు అవతారమనెడు సంశ యరహిత నిర్ణయమును గుఱించి విపులముగా వర్ణించినది. ఈ గ్రంథ ములో మొదట చెప్పినట్లు శైవస్వరూపముగా వర్ణించిన ఆళ్వారుల ప్రసక్తికూడ చేయబడినది. ఈ విషయముల వివరములు 8వ శతాబ్దము లేక తత్పూర్వమునకు సంబంధించినవిగా భావించనగును.

ఇప్పుడు మనము పై విషయములను గుఱించి తిరుమల, తిరుళుకనూరులలోని శాసనములు ఏమి వివరించునో విచారింపవలసి యున్నది. తిరుపతికంటె ప్రాచీనమై, తిరుమల యంతటి ప్రాచీనము గాని నగరము తిరుళుకనూరు. వేంకటాద్రిలోని భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠ జరుగునంతవరకుగల కాలములోని వివరములు మనకు

తిరుమలలోగాక తిరుళుకనూరు గ్రామములోని శాసనముఅందు లభించును. ఈ నిర్ణయమున కపవాదముగా తిరుమల శ్రీవారి ఆలయమున కెదురుగా విసరినట్లున్న ఒకే ఒక బండరాతిమీద చెక్కబడిన యసమగ్రపు శాసనమును చెప్పవలెను. ప్రాంతీయ బాణరాజుల పాలకులలో నొకరగు విజయాదిత్యుని జననమును స్మృతికిఁదెచ్చుచున్న విషయమీ శాసనములో కలదు. ఈ విజయాదిత్యుఁడు క్రీ. శ. 790 సంవత్సరము ప్రాంతములో జనన మొందియున్నవాఁడు. ఈ కాలమునకుఁ దరువాత కాలములోనే 'మనవాళప్పెరుమాళ్' (భోగ శ్రీనివాసమూర్తి) ప్రతిష్ఠాపనము జరిగినట్లు ముందు పేర్కొను ఆధారములను బట్టి తెలియును. భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాకాలమునకును పైన పేర్కొనినట్టి విజయాదిత్యుని జననకాలమునకును రమారమి 175 సంవత్సరముల అంతరమున్నది. ఈ మధ్య కాలములో జరిగిన యే విశేషములనయినను తెలియుటకు తిరుమల కొండపై మనకెట్టి శాసనములు ఆధారముగా లేవు.

అయినను మనకు ఈ కాలములో 'తిరువేంగడత్తుప్పెరుమానడిగళ్' స్వామివారికి సంబంధించిన ఆలయవివరమును చెప్పెడి శాసనములు తిరుళుకనూరులో గలవు. ఈ కాలమునకు సంబంధించిన శాసనములు మొత్తము 8 ఉన్నవి. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానముల శాసన పట్టికలలోని 1 వ వాల్యూములో 1,2,4,5,6,7,12,13 శాసనములుగా నమోదు చేయబడియున్నవి. వీనిలో లేని 3 వ శాసనము తిరుమలలోని విజయాదిత్యుని జననకాలమును తెలిపెడి శాసనము. మనము విజయాదిత్యుని కాలమును నిర్దుష్టముగా నిర్ణయింప గల్గినచో ఈ శాసనము తేదీని మనము సులువుగా నిర్ణయింప గలుగుదుము. క్రీ.శ. 790 వ సంవత్సరము కావచ్చు నన్నది యూహామాత్రమే. శిలప్పదికారము' అను తమిళగ్రంథము ఈ కాలమునకు సుమారుగా నలుబది సంవత్సరములకు పూర్వము వ్రాయబడినది. అనగా శిలప్పదికార

రచనాకాలము క్రీ. శ. 750 వ సంవత్సరమని తెలియును ఈ గ్రంథములో తిరుమలలోని శ్రీవారి వర్ణనము చేయబడియున్న సంగతి ఇంతకు పూర్వమే తెలుపబడినది. ఈ వర్ణనమువలన నాటికే శ్రీవారికి ఆలయము వంటిది యొకటి యుండెనని, ఆ యాలయమంత సమగ్రమయినది కాదనియు, సూర్య చంద్రులిర్వురకు నందు ప్రవేశముండెననియు మనము నిశ్చయించుకొనవచ్చును. అట్లు కాకపోయినను 750 నుండి 796 వ సంవత్సరము నడిమికాలములో నొక దృఢమైన ఆలయనిర్మాణము జరిగి యుండెనన్న విషయముకూడ మనము నిర్ణయించలేము. దీనికి హేతువేమన, ఒకవేళ అట్టి గట్టి కట్టడముగా శ్రీవారి ఆలయమే నాటికి రూపొందియున్నచో విజయాదిత్యుని జననకాలము నిశ్చయముగా నా గట్టికట్టడపు గోడలపయి వ్రాయబడి యుండెడిది. దానికి కారణమేమన 'తిరువేంకటాద్రి' వీరు పరిపాలించెడి ప్రదేశములోని యంతర్భాగమగుటయే.

తిరుచుకనూరులో మిక్కిలి ప్రాథమికమయిన శిలాశాసనము కోవిజయదంతి విక్రమార్కుని 51 వ సంవత్సరము పరిపాలనాకాలము నాటిది. ఇది క్రీ. శ. 826 వ సంవత్సరమునకు సమమగు కాలము. ఇందు తిరుచుకనూరులోగల 'తిరువిలాన్ కోయిల్' నందు తిరుమల శ్రీవారికి ప్రతినిధిగా 'తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్' వేంచేసినట్లు స్పష్టముగా వ్రాయబడియున్నది. (నెం. 219 G, T.) (T. T. D. శాసనములు Vol I) ఈ యభిప్రాయము తిరుమల తిరుపతి శాసన పరిశీలకుని యభిప్రాయము. తమిళములోనున్న ఈ శాసనమును సమగ్రముగాఁ బరిశీలించితిమేని తిరుచుకనూరులో 'తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్' వేంచేసియున్నట్లును, వీరికి తరువాత 'తిరువిలాన్ కోయిల్ పెరుమానడిగల్' (ఉత్సవమూర్తిగా) చేరినట్లు స్పష్టముగాఁ బేర్కొనబడినది. ఇంకను నీ శాసనములో తిరుమలలోని శ్రీవారికి బదులుగ నొక నకలు బింబమును నెలకొల్పుట, అట్టి యాల

యము నొకదానిని నిర్మించుట జరిగినట్లు మనము గ్రహించవలసి యున్నది. ఈ యాలయము, లేక స్వామిని నెలకొల్పినదాతకు యిది ప్రాచీన దేవాలయముగాదని, యిందలి స్వామి పైకొండనున్న శ్రీవారి వలె స్వయంవ్యక్త సంభూతుఁడుగాడని తెలియును. కొందఱియూహలో తిరుఞకనూరులో నెలకొల్పిన స్వామియే వేంకటేశ్వరస్వామి అనియు, తిరుమలలోగల స్వామి సుబ్రహ్మణ్యేశ్వరుడనియు నూహింతురు, ఇది శాసనములో నుపయోగింపబడిన పదముల గారడీ ఫలితము. తిరుఞకనూరులోని 'తిరువేంగడత్తుప్పెరుమానడిగళ్' పదము తిరుమల లోని శ్రీవారి స్వయంవ్యక్తమూర్తిగుఱించి కాదని, ఆ స్వామికి నకలు మూర్తియే యనియు, తరువాత కొంతకాలమునకు తిరుఞకనూరులోనే శ్రీవేంకటేశ్వరస్వామికి యనుబంధముగా మరియొక మూర్తి 'యుత్సవ మూర్తి'గా నెలకొల్పబడి యుండెనని పై శాసన మాధారముగా చెప్ప వచ్చును. ఆ కాలమునాటికే తిరుమలలోని శ్రీవారికి నకలు బింబ ములు ఆ పరిసరప్రాంతములలో వెలసియున్నవి. 'సోలనాత్తు ఉలగ ప్పెరుమానాల్' అనునాయన బంగారము రూపములోను, కొంత ధనముగాను, తిరుఞకనూరులోని యుత్సవమూర్తి (తిరువిలాన్‌కోయిల్ పెరుమానడిగళ్) కి దానమొనర్చినట్లు శాసనమున్నది. ఈ ధనము అఖండదీపము కొఱకయి యిచ్చినదానము,

ఈ రెండు మూర్తులకు తోడుగా మూడవ విగ్రహమొకటి విజయాదిత్యునిచేఁ జేయఁబడిన దానశాసనమునఁ బేర్కొనఁబడినది. ఆయన 'తిరుమంత్రశాల పెరుమానడిగల్' (మతముమార్పిడిచేయు మందిరముననున్న స్వామి). ఇది క్రీ. శ. 826 వ సంవత్సరము తరు వాత నెలకొల్పబడి యుండును. ఈ విజయాదిత్యునకుఁ బూర్వమొక శాసనమున్నది. శాసనమునకుఁ బూర్వభాగము మాత్రము కాన రాకుండుటచే దీనికాలము స్పష్టముగా నెఱుఁగరాకున్నది. ఆ కార ణముచే దీనిని కొంతకుముందు కాలమునకు మనము నెట్టవచ్చును.

విజయాదిత్యుడే పాలకుఁడు గాన తనయధికారము (బయ్యాన్‌కాల్)ను వినియోగించి స్వామికి తాను దానమిచ్చిన ధనమునకుఁ బ్రత్యేకపు లెక్కలనుంచియుండును. ఈ శాసనములో (ఉర్-నియోగమ్) గ్రామ సంఘమున్నట్లు, ఈ దేవాలయము కోయిర్కాన్ (ట్రస్టీలు) అను వారి అధీనములోనున్నట్లు, నేూధికారులను, దేవాలయపు నౌకర్లను 'వాళ్ల వాకోన్' అనియు పిలుచుచున్నట్లు పేర్కొనఁబడెను. ఇప్పుడు వరుస క్రమముగా నేర్పాటయిన విగ్రహముల నిట్లు చెప్పవచ్చును. శ్రీవారి మూలమూర్తికి నకలు మూర్తిగానున్నవారు 'తిరువేంగడత్తుప్పెరుమా నడిగళ్', వారికి యుత్సవమూర్తి, 'తిరువిలాన్ కోయిల్ పెరుమానడి గళ్'. మఠముమార్పిడి ప్రదేశమందిరమున నేర్పాటు చేయబడిన స్వామి 'తిరుమంత్రశాల పెరుమానడిగళ్' అనువారలు.

ఇర్పుగోలక్కాను అను మారునామముగల గుణవాన్ అపరాజి తన్ అను నాతడు పల్లవుల అధికారములోగల ముఖ్యాధికారులలో నొకఁడు. ఈయన 'తిరుమంత్రశాలస్వామి' కి దానమిచ్చినట్లు శాసన మొకటియున్నది (220 G. T. Vol. 1.). దీనిలోని విషయము బ్రాహ్మణులకు సమగ్రమయిన భోజన సమర్పణమును గుఱించినట్టిది. వైష్ణవులు కానివారు నూతనముగా వైష్ణవమత స్వీకారముచేయుటకు ఏర్పాటయిన దివ్యసన్నిధియని, అష్టాక్షర, ద్వయమంత్రోపదేశములు జరిపెడిప్రదేశమనియు, తిరుమంత్రశాలార్థము. ఆ కారణముగనే తిరు మంత్ర స్వీకారము, వైష్ణవమత స్వీకారము జరిగినయనంతర మానాడా భక్తునకు మృష్టాన్నభోజనము సమకూర్పఁబడుటకు సమర్పింపబడిన దానశాసనముగా పై శాసనమును బేర్కొనవచ్చును. మఱియొక విషయమిందున్నదేమన, ఆ వైష్ణవమత స్వీకారమునకు బ్రాహ్మణుఁడే కానక్కరలేదు. బ్రాహ్మణేతరుఁడయినను ఈ యుపదేశమున కర్హుఁడే యగుచున్నాడు. అపరాజితన్‌తో పల్లవరాజ వంశము తరించినది కనుక నీ దానశాసనము బహుశః క్రీ. శ. 900 సంవత్సరములోగాని

అంతకుఁబూర్వముగాని జరిగించియుండును. పల్లవ వంశమంత రించుటతో చోళుల రాజ్యావతరణమునకు మధ్యకాలములో 'తిరువిలాన్ కోయిల్'కుగల ప్రశస్తియెటు తగ్గినదో శక. సం 824 నకు తగిన 902 క్రీ. శ. సంవత్సరములో వేయబడిన శాసనమునుబట్టి గాంచనగును. తిరుకుకనూరు గ్రామనిర్వహణాధికారులగు 'అయిరక్కాడి' 'ఉరాచి' అను వారు నిర్వహణరూపమున వచ్చెడి మొత్తమురాబడితో సంప్ర దాయబద్ధమయిన, మరి యితరములయిన వ్యయములుపోను మిగిలిన మొత్తమును ఇక్కడగల 'తిరువిలాన్ కోయిల్' స్వామికై వ్యయ పెట్టవలెనని నిర్ణయించుకొనిరి. సాధారణ పరిపాలనము సయితము కుంటుపడునట్లుగా వారు తీసికొన్న ఈ నిర్ణయము సాహసోపేతము. అత్యవసర పరిస్థితులలో తిరువిలాన్ కోయిల్‌స్వామి నిర్వహణబాధ్యత ఈ గ్రామాధికారుల భుజస్కంధముల పయివేసికొన్న వీరిసాహసమభి నందనీయమని చెప్పవలెను.

ఇప్పుడు మనము 'తిరుమంత్రశాలా' వసరము, అది పని చేయు తీరు తెన్నులు సమగ్రముగా నెఱుంగవలసియున్నది. దేవా లయములలో వైఖానసాగమముగా జరిపించెడి సంప్రదాయమున కను కూలముగా 'పంచబేర' విధానముండుట మనము పెద్ద దేవాలయము లలో చూచుచున్నాము. మూలమూర్తి ధృవమూర్తిగానున్న చలన రహితమగుమూర్తి. దేవేరుల సహితముగానున్న యుత్సవమూర్తి యొకటి. ఇది యుత్సవమూర్తి. కౌతుక, స్నపన బలిబేరములనెడు మరిమూడు ఇతరమూర్తులు వాని వాని ప్రత్యేక విధినిర్వహణములో నుపయోగపడుటకు నెలకొల్పబడెడివి. రామానుజులకుఁ బూర్వము, ఆళవందారునకుఁ బూర్వము విష్ణుపూజయున్నట్లు ప్రాచీన శాసనములే తెలుపుచున్నవి. ఇప్పటి వైఖానసాగమ పూజావిధానముతోబాటు మరికొంత చేర్చిన నేటిపూజా విధానము ఆళవందారుచే కల్పితమయిన దిగా మనము గ్రహింపవచ్చును.

ఈ 'తిరుమంత్రశాలగాని' 'తిరువిలాన్‌కోయిల్' గాని విజయాదిత్యుని, గుణవాన్ అపరాజితన్ వారలకాలములోనేగాని తరువాత దీని ప్రస్తావన శాసనములలో జరిపించినట్లు కానబడదు. అసలయిన శ్రీవేంకటేశ్వరస్వామికి నకలుగా నేర్పాటు చేయబడిన 'తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్‌కు' కట్టబడిన ఆలయమే 'తిరువిలాన్ కోయిల్'గా నూహింపవచ్చును. అయిన నీ 'తిరువిలాన్ కోయిల్' బాలాలయమువంటిది మాత్రముకాదు. బాలాలయమనగా, ప్రధాన దేవాలయములో నేదైనను జీర్ణోద్ధార కార్యము కొనసాగింపవలసి వచ్చుచో స్వామివారినుండి కళాకర్షణముచేసి. సమీపములో నొక మంటపము వంటిది తాత్కాలికముగా నిర్మాణముగావించి, అందుస్వామివారి నకలు రూపును ప్రతిష్ఠించి, అక్కడ కళాకర్షణము చేయుట ఆగమ శాస్త్రములు చెప్పినవి. అట్లా జీర్ణోద్ధార కార్యక్రమము పూర్తిఅయినంతనే, శ్రీ స్వామివారికి పునః బాలాలయమునుండి కళాపకర్షణము చేయబడిన తీర్థముతో నసలు స్వామికి కళాకర్షణము చేయుదురు. దీనితో బాలాలయముయొక్క యునికి పూర్తిఅయినది. ఇది స్థూలముగా బాలాలయ విషయము. కాని క్రొత్త మూర్తిని ప్రతిష్ఠింపవలసినచో బాలాలయ ప్రసక్తియేలేదు. క్రొత్తమూర్తిని ప్రతిష్ఠింపవలెనన్న నొక క్రొత్త మూర్తితోబాటు నొక ప్రత్యేకాలయమును కట్టి దానియందు ప్రతిష్ఠింపవలెను. నకలుమూర్తిగానో, లేక అసలు మూర్తికిఁ బ్రత్యామ్నాయముగానో ప్రతిష్ఠించు నుద్దేశ్యముతో దాత దానిని వేరుగా నిర్వహింప నుద్దేశము గల్గినచో అప్పుడు 'తిరువిలాన్‌కోయిల్' ప్రసక్తి గలుగును. దీనినిబట్టి 'బాలాలయము' తిరువిలాన్ కోయిల్‌తోఁ బోల్చఁదగినదికాదు. 'తిరువిలాన్‌కోయిల్' నాలుగువైపుల గోడలతోను, ఒకే ద్వారయుతమగు దేవాలయాకృతిని బొందనవసరములేదు. ఒక మంటపాకృతిని బొందియుండనగును. ఒకచో రెండువైపుల గోడలుకల్గి ముందువెనుకలు ఇనుప కటకటాలతో మూయవచ్చును. తిరుపతిలోని గోవిందరాజస్వామివారి గర్భ గృహపు ఆకృతిని జూచి

నచో 'తిరువిలాన్‌కోయిల్' ప్రణాళిక స్పష్టపడును. మంటపమునకు ప్రదక్షిణపు గోడలుండుట, మంటపము కేవలము గోడలలోకాక యినుప కటకటాలతో మూయబడియుండుటను దీనికి యొక ప్రత్యేకలక్షణముగాఁ జెప్పనగును. స్నపనము మొదలగు కొన్ని ప్రత్యేక ఉత్సవములకు నుత్సవమూర్తి ఉభయ దేవేరులతో ఈ మంటపమును బర్యవేక్షింతురు. ఆ యుత్సవ కాలములో నా మంటపము తిరువిలాన్ కోయిల్‌గా భాసించును. తిరుమల దేవాలయ విషయములో స్నపన మంటపమే 15 వ శతాబ్దము వచ్చువరకు 'తిరువిలాన్ కోయిల్'గా రూపొందెను. 15 వ శతాబ్దమునాటికిగాని 'తిరుమామణి' మంటపము కట్టబడి జరిగియుండలేదు. బ్రహ్మోత్సవము జరిగెడి కాలములో నంతయు నుత్సవమూర్తి దీపావళి ఆస్థానము జరుగునంతకు నెలలతరబడి తిరుమామణి మంటపములోనే యుత్సవమూర్తులు తీర్చియుందురు. ఇది ఆ దినములలో 'తిరువిలాన్‌కోయిల్'గా బేర్కొనవచ్చును. ఇటీవలికాలములో 'కళ్యాణమంటపము' తిరువిలాన్ కోయిల్‌గా ప్రసక్తమగుచున్నది. కోయిలాళ్వారు (గర్భగృహము) వంటి పవిత్రస్థలమే 'తిరువిలాన్ కోయిల్' కానక్కరలేదు. అతిస్వల్ప సంప్రోక్షణాదులచే నే చిన్న మంటపమయినను తాత్కాలికముగా తిరువిలాన్ కోయిల్‌గా రూపొందనగును.

తిరుమంత్రశాలస్వామి: వైష్ణవమతాధికారుల ప్రధానమయిన కార్యక్రమము మొదటగా శైవమతస్థులను వైష్ణవులుగా మార్చుట. అష్టాక్షర, తిరుమంత్రోపదేశములకు పూర్వరంగముగా శంఖ చక్రముల ముద్రణములను రెండు బుజములపయిని ఆ మార్పు నంగీకరించు భక్తునకు ముద్రింతురు. ఈ కార్యక్రమమును జరుపుటకు మఠాధిపతులచే గుర్తింపబడిన యాచార్యపురుషుఁడై యుండవలెను. తిరుమలనంబి తనయిద్దరు కుమార్తెలకు వివాహముచేయ నిశ్చయించుకొని, పెండ్లి కుమారులకు అష్టాక్షర తిరుమంత్రోపదేశములు చేయుటకుఁ బూర్వమే

వారి బుజములపయి శంఖచక్ర ముద్రణముల నమరించి వివాహమొనర్చె నని యైతిహ్యముకలదు. ఈ యిరువురిలో రామానుజుని తండ్రి యొకరు. రామానుజుని కాలములో శ్రీరామానుజులే 72 మంది మహా సింహాసనాధిపతుల నేర్పాటుగావించి వారికీమతము మార్పిడి కార్యక్రమములో పాల్గొని నిర్వహించుటకుగాను పూర్తిస్వేచ్ఛ నొసంగి యుండెను. కాని మన ఈ విషయస్థకాలము రామానుజునకుఁ బూర్వము కనీసము రెండు శతాబ్దములనాటిది. తిరుమంత్రశాలలోనున్న స్వామి వారి సన్నిధిన నాడీ కార్యక్రమము జరుపబడు చున్నట్లుగాఁ దెలియు చున్నది. శ్రీవారితో వారిసన్నిధిలోనే సుదర్శనము, పాంచజన్యము యథావిధిగా ప్రతిష్ఠనొంది నిత్యవిధియగు పూజా కార్యక్రమములో వినియోగింప బడుట నర్హతగలిగినట్టివి. అట్టి ప్రతిష్ఠావిధిచేఁ బూత మయి, నిత్యపూజా కార్యక్రమము నొందుచుండిన శంఖ చక్రము లీ కార్యక్రమములో పాల్గొనుట కర్హత గలిగినట్టివి. నిత్యారాధనము పూర్తియయిన వెనుక నీ కార్యక్రమము జరిపించెడివారు. అన్ని విధములయిన వైష్ణవ మతములలోను శ్రీవారి సన్నిధిలోనే నీ యీ శంఖచక్రములుగూడ ప్రతిష్ఠింపబడి పూజాదులనందు కొనెడివి. ఈ ఆచార్యపురుషులుకూడ ఈ కార్యక్రమము నెరవేర్చుచుండెడివారు. ప్రతినిత్యము తన మందిరములోనున్న మూర్తిని యారాధించుచు, ఈ శంఖ చక్రాదులకుగూడ స్వామి సన్నిధిలో స్థానమును గల్పించి పూజించు చుండెడివారు. శ్రీరామానుజులవారు సింహాసనాధిపతుల నేర్పాటు గావించినతరువాత దేవాలయములలో నీ తిరుమంత్రశాలావశ్య కత సన్నగిల్లినది. కాని ఈయనకుఁ బూర్వము కొద్దిమంది మాత్రమే గుర్తింపబడిన ఆచార్య పురుషులుండిరి. కనుకనే ఆ కాలములో దేవా లయమే పవిత్రమగు సంకేతస్థలమయ్యెను.

పల్లవుల రాజ్యపతనానంతరము చోళుల రాజ్యస్వీకారమునకు గల నడిమి కాలమున మూడు మూర్తులున్న మూడు ప్రత్యేక ఆలయము

లనుగాని లేక ఒక, రెండు ఆలయములుగాని తిరుచుకనూరులో నుండి నట్లు మన యొక నిర్ణయమునకు పై విషయములనుబట్టి రాగలము.

ఒక సంశయాత్మకమైన వివరమునిచ్చెడు తిరుచుకనూరు శాసనములు రెండున్నవి. ఇవి రెండును చోళుల ప్రాథమిక పరిపాలనా కాలమునాటివి. క్రీ. శ. 935, క్రీ. శ. 937 సంవత్సరములలో వివిగా వీని నూహింప వచ్చును. 1 వ పరాంతకుడుగా పేరుగాంచిన కోపరకేసరివర్మ యొక్క 29 పరిపాలనా సంవత్సరములో నీశాసనము వ్రాయబడినది.

(No. 12 in Vol. I) ఈతని 29 వ పరిపాలనాకాలము క్రీ. శ. 935 తో సమమైనట్టిది. మలైనాడులోని 'కొడుంగోలురాన్' అను నాతఁడు దీని నిర్వహణమునకుగాను తిరుచుకనూరులోని సభవారికిచ్చి నట్లున్నది. విషయమేమన, 40 కొలంజుల బంగారము తిర్వేంకట నాథునకు అఖండ దీపమును వెలిగించుటగాను వ్రాయబడిన దానశాసనము. 'తిరువేంకట' అన్న పదముచోట శిలాశాసనము చెదరగొట్టబడియుండు టతో నీయన కొండపైనున్న శ్రీవారో తిరుచుకనూరులోని శ్రీవారో తెలియరాదు. ఈ అనుమాన మేల ప్రసక్తమయ్యెననగా 935 సంవత్సరమునకు పూర్వమున్న ఆలయ నిర్వాహకులు, దానములు స్వీకరించుటకు ప్రతినిధులుగా నున్నవారు, తిరుచుకనూరులోని ఆలయముల నిర్వహణమునకు మాత్రమే స్వీకరించుట జరిగెడిది. ఆ సంప్రదాయమునాటి కట్లే యున్నది. ఆలయ నిర్వాహకుల బాధ్యతలు తిరుచుకనూరులోని ఆలయ నిర్వహణము వరకు మాత్రమే పరిమితము చేయబడెను. సభవారల పేరిచట కానవచ్చుటచే వారి పరిమితి కేవలము తిరుచుకనూరులోని ఆలయములకు మాత్రమే కాక యితర ప్రదేశములలోని ఆలయముల పయినను వీరి పరిమిత బాధ్యతలుండుటచే నిది తిరుచుకనూరు వెలుపల గల దేవాలయమునకు గల దానశాసనమేమోయని శంకింప వలసి వచ్చుచున్నది. ఇక వేరు వేంకటాచలపతి కొండ మీఁది దేవుఁడే కదా! దేవాలయ నిర్వాహకులలో సభవారు కలిసి

యుండిరి గనుక, 8, 9 నెంబరుల శాసనములును చోళుల కాలమునాటివే గనుక, సభవారు, ఆలయ నిర్వాహకులు ఒకరి వెనుక నొకరు బేర్కొనబడిరి గనుక మనమీ యూహచేయుట కవకాశము గలిగినది. ఈ యూహయే నిజమగుచో క్రీ శ. 935 సంవత్సరములో మొట్టమొదటి సారిగా శ్రీ వేంకటాచలపతి (కొండపైన గలస్వామివారిని) ని బేర్కొన్నట్లయినది. అక్కడనే యీ యఖండ దీపమునెట్టి ప్రతిబంధకము లేక వెలిగింపబడి యుండెననియు భావింపనగును. సభవారుకూడ ఆ కొండపయి శ్రీవారి ఆలయ నిర్వాహకత్వము చేపట్టిరనియు నూహింప వచ్చును.

ఇప్పుడు చెప్పిన శాసనములోకంటె మరి చెప్పబోవు శాసనములో మనకుఁగొంత స్పష్టమగు వివరము లీ విషయముపై కానవచ్చును. అఖండ జ్యోతి వెలిగించుటకు దానమొసంగిన విజయాదిత్యువి దాన శాసనములో 'ఎంబెరుమానడియోర్' అన్న పదము చెదరిన పరిస్థితిలో గానవచ్చుచున్నది. ఈ పదము దానశాసనమును పాలించు నొకానొక ప్రతినిధి వర్గమును నిర్దేశించుచున్నదేమో స్పష్టము కాదు. ఈ శాసనకాలము 1-12-935 క్రీ. శ. ఎంబెరుమాన డయార్ రక్ష అను పదమును జూచినచో దానమును రక్షించువారను నర్థమునకు సమమయిన పదమగును. ఈ పదము స్పష్టముగా ఎంబెరుమానార్ భక్తులను, అనగా విష్ణుపూజావిశారదులను గూర్చి నిర్దేశించుచున్నది. ఇంకను స్పష్టముగా శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తుల నిమిత్తమనియు మనము విశ్వసింపవచ్చును. ఒకప్రక్క ఈ పదము వైష్ణవ చరిత్రను నిర్దేశించుట యగుచున్నది. ఈ కాలమునకు ఒక పాతిక సంవత్సరముల తరువాత ఈ పదమే 'వైష్ణవరక్ష' గా రూపొంది క్రీ. శ. 966 సంవత్సరములో 'సామవాయి' మహారాణి మనవాళ ప్పెరుమాళ్ (రజితభోగశ్రీనివాసమూర్తి) ను తిరుమల శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠించినదగుచున్నది. క్రీ. శ. 972 లో గల శాసనము కొండపయిగల ఆలయమును నిర్దేశించుచున్నది.

మనము తిరుచుకనూరు శాసనములను విమర్శించుచుంటిమి. అసమగ్రములగు శాసనములు, మనకందుబాటులో నున్నవానిని పరిశీలించుట జరిగినది. 15, 17 నెంబర్లుగల శాసనములు 'రాజరాజమూవేందవేలన్' అను నాతఁడొసఁగిన దానశాసనములు. ఇవి ప్రకృతిచే నసమగ్రములగుటచే వీనినుండి మనమెట్టి వివరమును గ్రహింపజాలము. 1 వ రాజరాజచోళుడు రాజ్యమేలుచుండగా ఏర్పడిన దానశాసనములు గనుక నివి తప్పక క్రీ. శ. 985 నుండి 1013 వ సంవత్సరములోపున వేయబడి యుండును. ఈ దానశాసనములుకూడ తిరుచుకనూరులోని శివకేశవులలో నెవరికి చెందినట్టివో చెప్పఁజాలము. మూడవ రాజరాజు నాలుగవ సంవత్సర పరిపాలనా కాలములో అనగా 1220 క్రీ. శ. నకు సరియగు సంవత్సరములోనున్న శాసనము మనకుకొంత వివర మొసంగ గల స్థితిలోనున్నను నిదియు సమగ్రమగు శాసనము కాదు. ఈ శాసనము ప్రకారము వొక్కారన్ పాండియరాయన్ అనురాజు తిరుచానూరులోని సుందరరాజస్వామివారికి (అళగియపెరుమాళ్) ఫాల్గుణోత్సవ నిమిత్తమై ఇచ్చిన దానశాసనము. ఇంతకుఁబూర్వమున్న శాసనము నకును ఈ శాసనమునకు గల మధ్యకాలము 200 సంవత్సరములు. ఈ కాలమునకేఁజెందిన మరియొకశాసనము క్రీ. శ. 1225 వ సంవత్సరములోనిది. ఇదియు నసమగ్రముగా నున్నట్టిదే. కాని యిందులో కొంత విషయమున్నది. ఇది 'ఆండరు' కుమారుఁడయిన వొక్కారన్ పాండియరాయడు 'పెరుమబానప్పాడి' గ్రామ పరిసరములోని కొంత భూమిని 'తిరువిలాన్ కోయిల్' కు 'నారాయణ' అను వానియాత్మశాంతికై దానము చేసినట్టిది. ఈ 'నారాయణ' అను నాతఁడు యాదవరాయని కొఱకు పోరాడి చరిత్ర ప్రసిద్ధమగు 'ఉరాట్టి' యుద్ధములో మరణించెను. ఇది రమారమి 1223 క్రీ. శ. ములో జరిగినట్టిది.

ఇంకను అసమగ్రములయిన శాసనములిదే కాలమునకు చెందినట్టివి 'పాండియదరైయార్' తిరుచుకనూరులోని శివాలయమునకు

'ఫౌక్స్కారన్' మేనేజరుగా నున్న కాలమిది. ఈ శాసనములు 1 వ వాల్యూములోని 95, 96, 97, శాసనములు. ఇందులో 95 97 శాసనములు పద్మావతీ ఆలయములోని వాహనమంటపములోని తూర్పు పడమర గోడలమీద కలవు. 96 వ నెంబరుగల శాసనము గోపురమున కనుసంధించిన తూర్పు ప్రాకారపు గోడపై గలదు. ఇవి క్రీ. శ. 1230-1240 సంవత్సరముల నడిమికాలములోనివి. 95 వ నెంబరు శాసనములో 'ఎంబెరుమానార్' నిత్యోత్సవ కార్యక్రమ నిర్వహణార్థము సమర్పించిన భూమి దానమునకు సంబంధించిన శాసనము. భూమి సరిహద్దులు నిర్దుష్టముగా, స్పష్టముగా నీయబడినవి. 96 వ నెంబరు గల శాసనము సమగ్రముగా చదువ వీలుగాకున్నది. 97 నెంబరు శాసనములో 'పాండ్యదరాయన్' తిరువిలాన్ కోయిల్‌కు ధనధాన్య రూపములలో 'ఎంబెరుమానడియార్' మరి నాలుగు గోత్రములవారు పంగుని యుత్సవములలో (ఫాల్గుణ) పాల్గొని సక్రమ నిర్వహణ మొనర్చుటకుగాను సమర్పింపబడినది. 1 వ వాల్యూములోని 108 వ నెంబరు శాసనములో పల్లవరాజు, యాదవరాజు విల్లుపరాజు, సోల విల్లుపరాజు, త్రికార్తరాయుడు కలిసి సామూహికముగా నొసంగిన ఉదయములకు సంబంధించిన దానశాసనము. (అన్న ప్రసాదములు) ఇప్పటి వరకు శ్రీ భాండాగారము అను పేరుతో దేవాలయ ధనాగారము పిలువబడినది. ఇది 'శ్రీ వైష్ణవరక్ష' ప్రాదుర్భావముతో దీనిపేరు అట్లు పిలుచుట జరుగలేదు. ఈ శాసనకాలము నిశ్చయముగా 1240 వ సంవత్సరము తరువాతిది కావచ్చును.

ఈ విధముగా మనము 1000 వ సంవత్సరము తరువాత 'తిరువిలాన్ కోయిల్' తిరుకుకనూరు ప్రశస్తి తగ్గిపోయినదని యూహించుట కవకాశము కలదు. అయితే తిరువిలాన్‌కోయిల్ భవనము లేక ఆలయము కొనసాగుచునేయున్నది. క్రొత్తగా సుందర రాజస్వామివారి ఆలయము, మరికొంత కాలము తరువాత వరదరాజ స్వామివారి ఆలయములు క్రొత్తగా తిరుకుకనూరులో ప్రవేశము కల్పించుకొన్నవి.

*

# 6 వ అధ్యాయము

## తిరుశుకనూరులోని పరాశరేశ్వరాలయము.

'తిరువిలాన్ కోయిల్' తిరుశుకనూరులో కట్టఁబడిన యనంతర కాలములో శ్రీ పరాశరేశ్వరస్వామివారి ఆలయము నిర్మింపబడెను. దీనితో శైవ వైష్ణవులకు విభేదములు పొడసూపునన్న శంకతో రజిత భోగ శ్రీనివాసమూర్తి విగ్రహము తిరుమల శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపబడెనన్న విషయమింతకు పూర్వపు అధ్యాయములలో నివేదింపబడినది. తిరుశుకనూరులోని శైవవైష్ణవులకా కాలములో నెట్టి విభేదములు పొడసూపెనన్న విషయమున కాధారము లేవియును లేవు. చరిత్ర కారులట్టి విషయముల నేమియు చెప్పియుండక పోవుటయే మన మనుకొనవలసినమాట. శాసనములు విశతముగాఁబరిశీలించినచో అక్కడగల వైష్ణవ ఆలయము మతము మార్పిడిచేయు శంఖ చక్రాది ముద్రణమును జరుగుచు (చక్రాంకణము) దానితోబాటు శైవ, వైష్ణవ భేదములేక భోజన సౌకర్యము సమకూర్పబడెడిదని తెలిసికొని యున్నాము. ఈ కారణముగా శైవులతో జరుగబోయెడి భవిష్యత్సంఘర్షణములను ముందుగనే వైష్ణవమతాధికారులూహించి ఇట్టి యవకాశము లేకుండ చూచుటకుగల అన్ని అవకాశములను బరిశీలించిరి. శ్రీరామానుజుని కాలమువరకు నట్టి సంఘర్షణములు జరుగునవకాశమే లేకపోయినది.

కాని తిరుశుకనూరులోని శివకేశవాలయములకు సంబంధించి నంతవఱకు ఒకరికొకరు విభేదము పడినట్లుగా చెప్పదగిన సంఘటన మొకటికలదు. తిరుమల శ్రీవారి ఆలయములో నిత్యము 24 జ్యోతులు వెలిగించుట కొసంగబడిన దానమునకు తిరుశుకనూరునకు సమీపమున గల తిరుముణ్ణియాన్ గ్రామములోని సభవారు ధర్మకర్తృత్వము నెఱప

నిర్దేశింపఁబడిరి. కాని యీ కార్యమును సక్రమముగా నిర్వర్తింపక పోవుటతో నాటి చోళరాజేంద్రునిచే వీరు విచారింపఁబడిరి. వీరి పయి నక్రమమగు చర్యగూడ గైకొనబడినది. ఇది జరిగిన కాలము క్రీ. శ. 1013 వ సంవత్సరము. బహుశః ఈ తిరుముణ్ణియాన్ సభవారు శైవమునకు సంబంధించినవారుకాగా తిరుశుకనూరు సభవారు వైష్ణవ మునకు సంబంధించియుందురు.

క్రీ. శ. 1225 లో శ్రీ పరాశరేశ్వరాలయ ధర్మకర్త తిరుశుక నూరు సభవారిని క్రీ. శ. 1008 లో అదే దేవాలయమునకు సంబంధించిన సేవలకు దానమీయబడిన 26 కొలంజుల బంగారమునకు సరియగు నిర్వ హణము లేకపోవుటతో శిక్షించెను. వారి సాధనమును చెల్లింపవలసినదిగా నిర్ణయించి శివాలయపు ధర్మకర్తలే దీనిని నిర్వహించుటకు నిర్ణయించెను. ఈ రెండు సంఘటనము లెఱుక పఱుచు శాసనములు పూర్తిగా నష్టపఱుపబడినవి.

ఇంతకంటె వేరైన విభేద సంఘటనలు జరిగినట్లు మనకు తెలియరావు. ఇంతకుఁబూర్వము తెలిపినట్లుగా వైష్ణవ మతాధికారులు తమ కార్యక్రమములను శ్రీవారి ఆలయమునకు మార్పుచేసికొనుటకు గల కారణము తిరుశుకనూరులో శైవవైష్ణవ ఆలయముల మధ్య సఖ్యత కొనసాగబోదనెడు యూహతో మార్పిడిచేసికొన్నట్టిదని తెలిసి కొనదగును. మనము వైష్ణవుల విజయమునుగూర్చి సమగ్రముగా నెఱుంగ గోరినచో పరాశరేశ్వరాలయ చరిత్రను సంపూర్ణముగా తెలిసి కొనవలెను.

తిరుశుకనూరులో క్రీ. శ. 826 సంవత్సరమునాటికి శ్రీ వైష్ణ వుల ప్రాబల్యమును సూచించుటకోయన్నట్లు 'తిరువిలాన్ కోయిల్' నిర్మింపబడియుండును. ఇచట నున్న శివాలయము విషయమై ఆ దేవా లయము గోడలపై మొట్టమొదట దొఱకిన శిలాశాసనము రాజకేసరి

రాజరాజదేవర 23 వ పరిపాలనా సంవత్సరమునకు సరియగు 1008 వ సంవత్సరములో పేర్కొనబడినది. ఈ రెండు సంఘటనములకు గల నడిమి కాలము సరిగా 182 సంవత్సరములు. కనుక నీ నిర్మింపబడిన శివాలయము క్రీ. శ. 1008 సంవత్సరమునకు కొంత కాలము ముందుగా నిర్మింపబడియుండును. ఇక్కడి శాసనముకూడ అసమగ్రమే. కాని 3 వ రాజరాజు దేవర పాలించిన 9 వ సంవత్సరము కాలమునకు సరియగు క్రీ. శ. 1225 వ సంవత్సరములో వేయబడిన శాసనములో క్రీ. శ. 1008 వ సంవత్సరములో వేయబడిన శాసనములో వ్రాయబడిన దంతయు మఱల వ్రాయబడినది. ఈ శాసనములో వీర నరసింగ యాదవ రాయల యెదుట తిరుళుకనూరు సభవారిని గూర్చి, తిరుమంజనమునకు సమకూర్చవలసిన వస్తు సంభారమును గుఱించి ఉత్తరాయణ సంక్రమణ కాలములో సమకూర్చబడలేదని ఫిర్యాదుచేయబడెను. దాత కోర్కె ప్రకారము ఉత్తరాయణ సంక్రమణ కాలములో బియ్యము, చింతపండు, పెరుగు, తేనె, ఆకులు, వక్కలు, పసుపుకొమ్ములు, చందనము, కొబ్బరికాయలు, పంచదార, పెసలు, తిలలు, మిరియాలు, 108 ముంతలు ఈయవలసియుండెను. క్రీ. శ. 1008 లో ఆలయమునకు ఏదైనా ప్రాముఖ్యమున్నచో ఉత్తరాయణ సంక్రమణమునకు వలెనే దక్షిణాయణ సంక్రమణమునకును ఇట్టి దానశాసనము, మరిరెండు విషు సంక్రమణములకాలములందు మరియొక దానశాసనము సమర్పింపవలసియుండెను. క్రీ. శ. 966 వ సంవత్సరములో శ్రీవారి ఆలయములో సామవాయి మహారాణిచేసిన భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠలో ఈ విధమయిన దానశాసనమే వ్రాయబడియున్నది.

దక్షిణదేశ చరిత్రలో క్రీ. శ. 900 సంవత్సరములో 1 వ ఆదిత్య చోళుడు పల్లవులను జయించినట్లు తెలియుచున్నది. చోళులు వైష్ణవుల ఆలయములకుగాని, శైవుల ఆలయమునకుగాని, ప్రత్యక్ష దానమేమియు నొసర్పనప్పటికిని తిరుళుకనూరులోని వారి కార్యకలాపములకు

ప్రోత్సాహమిచ్చు చుండినట్లు తెలియును. ఈ కారణముననే నచ్చట వైష్ణవాలయములుకూడ వెలసియుండును. కాని పరాశరేశ్వరస్వామి వారి ఆలయము విషయమై క్రీ. శ. 1008 నుండి 1073 వరకు నట్టి ప్రోత్సాహమే కానరాదు. కాళహస్తీశ్వరుని గుఱించి మనకు ప్రాచీన మగు శాసనస్థపుటాధారములేవియు లేనప్పటికిని, అది చాల పురాతన మయిన ఆలయమని 11 వ శతాబ్దములో నదిమంచి స్థితిలో నప్పటికే యుండెనని చెప్పగలము. వైష్ణవ సంప్రదాయజ్ఞులు చెప్పునట్లుగా శ్రీమద్రామానుజుని సోదరుడగు గోవిందభట్టరు వైష్ణవమునుండి శైవ మునకు మార్పుచెంది శ్రీకాళహస్తిలో ననేక సంవత్సరములు నివసిం చెను. తుదకు తన మేనమామయగు తిరుమలనంబిచే వైష్ణవమత మును మరల స్వీకరించెను. అంతవరకు నాయన కాళహస్తిలోనే యున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1008 తర్వాత 70 సంవత్సరముల వరకు శ్రీపరాశరేశ్వరస్వామివారి కెట్టి దాన శాసనమును వ్రాయబడి యుండలేదు. క్రీ. శ. 1073 లో వ్రాయబడిన శాసనములో 1 వ కులో త్తుంగుడు వీర రాజేంద్రచోళుఁడు, వేంకటనాథ పురందరుడు ఇత్యాది బిరుదాంకితుడు. శివభక్తునివలెనే వేంకటాద్రినాథుని భక్తుడయినట్లును ఈ శాసనములో మంజుప్పాడి (నేఁడిది ముళ్లపూడి) యింతకు పూర్వమే పరాశరేశ్వరునకు దానమిచ్చిన గ్రామము కాగా, నారనదేవుడు 'వత్తి కాసు' 'తిరుగుకాసు' వంటి పన్నులకు దేవాలయమున కీయబడిన గ్రామమనెడు దృష్టితో రద్దుగావించెను. 1 వ కులోత్తుంగచోళుని 24 వ పరిపాలనా సంవత్సరమునకు సమమగు క్రీ. శ. 1094 వ సంవత్సర ములో 'తిరుచ్చి బాలనంబి' అను నాతఁడు పరాశరేశ్వరాలయ వంశ పరంపరార్చకులును గురుక్కు_ల్‌లును నగు కొందరు శైవ బ్రాహ్మణు లకు 128 గోవులను, 4 నందా దీపములు నుంచుటకు వలయు నేతిని సరఫరా గావించుటకుగాను దానమిచ్చినట్లు గలదు.

మఱియొక శాసనములో రాజునకు పన్నుకట్టెడిభూమిని దేవ దానముగా మార్పిడి చేయు విధానమునుగూర్చి కలదు. ఒకభూమిపై

చెల్లింపవలసిన 5 మాడల రుసుము చెల్లింపబడక పోవుటచే దానిని ముందుగా చెల్లింపఁజేసి రాజుయొక్క మౌనాంగీకారముతో రాజగార వార్థము దానిని పన్నులు రద్దు కాబడిన భూమిగాచేసి దేవదానము గావించుట యను పదతి యొకటియున్నది. ఈ శాసనములో తిరుభుకనూరు లోని 'సభవారి' కిట్టి విషయములలో సహాయ పడుటకు 'గణత్తారు' అను సభ శైవబ్రాహ్మణులతో గూడిన దొకటి కలదనెడి విషయ మెఱుకపఱుచుచున్నది. క్రీ. శ. 1134 లో విక్రమచోళుని 16 వ సంవత్స రపు పరిపాలనాకాలములో వేయబడిన శాసనములో మొట్ట మొదటగా వైకాసి ఉత్సవ మొకటియున్నదని, ఆ వైకాసి తిరునాళ్ళకు దీపములు వెలిగించుటకు తైలము మొదలయినవానిని సమకూర్చుటకు ప్రయత్నము జరిగెనని తెలియుచున్నది. కనుక నీ వైకాసి ఉత్సవము 1105 క్రీ. శ. నుండి 1134 వ సంవత్సరముల నడిమి కాలములో నమలు లోనికి వచ్చియుండును. 3 వ రాజరాజు 7 వ సంవత్సర పరిపాలనా కాలమునకు సమమగు క్రీ. శ. 1223 వ సంవత్సరము వరకు ఈ ఆలయములో ఉదయము సాయంత్రములందు సమర్పింపవలసిన అన్నప్రసాదముల కెట్టి శాశ్వతమగు ఏర్పాట్లును గావింపబడలేదు. సాగులోనున్న కొన్నిభూములను కొని స్వామికి అర్చనచేయుచున్న మూడు అర్చక కుటుంబముల వారికి పాండియాదరాయర్ అనునాతడు యురాట్టి యుద్ధములో (క్రీ. శ. 1223) అసువులుబాసిన తనకుమారుని ఆత్మశాంతి కొఱకయి దానమిచ్చిన శాసనమొకటియున్నది. భట్టరులచే నిత్యపూజా విధికి యొసగినట్టి ద్రవ్యముల జాబితాకూడ దీనిలో నీయబడినది. అనగా నాటికే వంశ పారంపర్యపు గణకులుగూడ దేవాలయమునకు నియమింపబడినట్లు భావింపవచ్చును. తిరుభుకనూరు సభవారలు ఈ శాసనపు దాన పాలకులుగాక పైన తెలిపిన భట్టరులు దీనికి ధర్మకర్తృత్వము నెఱపుట గమనింపదగిన అంశము. ఇప్పుడు మనకు వైష్ణవ సభవారలు, శైవ నిర్వహణాధికారులగు భట్టరులవేర్పాటు తెలిసినదికదా!

1225 వ సంవత్సరము వచ్చువరకు నీ ఆలయమునకు ప్రత్యేక స్థానత్తారు శ్రీ మహేశ్వరుల సంఘము దీని కనుబంధముగా నుండెడిది.

1 వ సంపుటిలోని 30 వ శాసన మాధారముగా తిరుచుకనూరు సభవారలను గూర్చి శైవాలయ నిర్వాహకులై భట్టరులు వీరనరసింగ యాదవరాయల యెదుట క్రీ. శ. 1008 వ సంవత్సరములో ఫిర్యాదు చేసిరి. అట్టి శాసనమే లేదని సభవారు బుకాయించిరి. రాజు విచారణ జరిపిన యనంతరము శివాలయస్థానత్తారునకు సభవారు ఆ దానపు విలువయగు 28 కొలంజుల బంగారమిచ్చివేయ వలెనని స్థానత్తారే అప్పటినుండి ఆ దాన శాసనపు పాలకులుగా నుండవలెనని తీర్పు నొసంగిరి. ఈ సంఘటనలాధారముగా వైష్ణవులు శైవాలయమును స్థాపించిన యనంతరము మతైక్యతను సాధించుట అనివార్యమని భావించిరి. కనుకనే వారి మతము మార్పిడి కలాపములను, యితర వైష్ణవమత సంబంధమయిన వ్యవహారములను తిరుచుకనూరునుండి శ్రీవారి ఆలయమునకు మార్చిరి.

ఏది యేమైనప్పటికి దీనికి సంబంధించిన, లేక ఈ మార్పులను తలపెట్టుటకుగల హేతువుల గురించి తెలిపెడు శాసనములేవియును తెలియవచ్చుటలేదు. చోళరాజ్యమభివృద్ధిలోనుండుట వారు శైవ మతానుయాయులగుట, యొక కారణముగా మనమూహింపవచ్చును. ఆ కారణముననే తిరుచుకనూరులో శ్రీవైష్ణవులకెట్టి విజయము సంప్రాప్తమగుట అసాధ్యము. ఆకాలములో వైష్ణవులుచేపట్టిన ప్రముఖ కార్యకలాపములవలననే వారి ప్రాశస్త్యము నెన్నుచున్నాము. శ్రీ ఆళవందారు తమిళ దేశములో వైష్ణవమతపు నావను నడపు నావికుఁడుగా నుండి యతఁడే తిరుచుకనూరులోగల తన వైష్ణవబృందమునకు వారి కలాప కేంద్రమును తిరుమలకు మార్పుచేయవలసినదిగా సలహా నొసంగి యుండును.

మనమీ పలాశరేశ్వరాలయ చరిత్రను ముగింపబోవుటకుముందు చోళరాజులు దీనిని నిర్వహణములో జూపిన వింత విషయములు తెలిసికొందము.

ప్రతి మండలమునకును ఒక అధికారియుండెడివాడు. ఆ యధికారియే తన పరిమితిలోగల మండలమునకు న్యాయాధిపతి గూడనగుచున్నాడు. వివాదములపయి అప్పటికప్పుడే విచారించుటకు సమనులు జారీచేయుట, ఉభయపక్షముల వాదములు వినుట, సాక్షులసాక్ష్యములను వినుట జరిగించును. న్యాయమునుకూడ అప్పటికప్పుడే వినిపించును. రాజు యేదైనా భూమిని దేవమాన్యముగా నంగీకరింపచేసినను దానికనుబంధితమగు అధికారి ఆ భూమి క్రింద రావలసిన పూర్తి బాకీలను వసూలుచేసికొనియే రాజాజ్ఞమేరకు ఆ భూమిని దేవమాన్యముగాఁ బ్రకటించెడివాఁడు.

'మాడాపత్యము' చేయుటకు శైవాలయములో నొక నిర్వాహకుడుండెడివాఁడు. ఈయనగాక స్థానత్తారు, గణత్తారు, 'తిరు-ఉణ్ణలికయి భట్టరు' నిర్వాహకులుగా నుందురు. శ్రీ స్వామివారి ఆలయములో నిత్యజ్యోతి వెలిగించుటకుగాను 24 కొలంజుల బంగారముగాని 32 గోవులుగాని దానమీయవలెననునది నియమము.

*

# 7 వ అధ్యాయము

## శ్రీ వేంకటాచలము – శ్రీవారి ఆలయము

ఒక దేవాలయమును గురించి చదువుటగాని, వినుటగాని తట స్థించినప్పుడు ఒకరాతి కట్టడము దేవాలయాకృతితో కట్టుట, శిలా విగ్రహమొకటి యే యాగమ శాస్త్రానుసారముగానైనను ప్రతిష్ఠించుట, అనుభావము మన బుద్ధికి గోచరమగును. కాని తిరుమలలోని శ్రీవారి ఆలయము ప్రసక్తమయినప్పుడు మాత్రమీ విషయములో వేరు భావ ముల విశ్వసింపవలసియుండును. అనగా ఆలయముగాని, (పురాతన మందిరమని) విగ్రహముగాని మానవునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది కాదను విషయమే విశ్వసింపఁదగినది. ద్వాపరయుగాంతమునందు శ్రీ మహా విష్ణువు తనకుతానే వైకుంఠమునువీడి స్వయంవ్యక్తరూపమగు విగ్రహ ముగా రూపొంది శ్రీ వేంకటాద్రిపై, శ్రీ స్వామి పుష్కరిణీ తీరమున నివసించుట కిచ్చగించెనను నైతిహ్యము గలదు. దీనికి మన పురాణ వేత్తలు చెప్పునదేమన: పూర్వయుగములలో మానవులు అద్భుత శక్తులను సాధించుటకు యోగాభ్యాసములను చేసెడివారు. యోగా భ్యాసమునకు తగిన భౌతిక శక్తుల సాధించుటకు తపో యోగముచేసి వాని వలనకూడ శరీరదార్ఢ్యము, మనోనైర్మల్యమును సాధించెడివారు. దీనినే ఆత్మను తెలిసికొనుట, లేక ఆత్మావలోకనమనియు చెప్పవచ్చును. ఇదికాక వేరు మార్గము బ్రహ్మావలోకనము. దీనినే భగవంతుని తెలిసికొనుట యనిగూడ చెప్పుదురు. ఆత్మావలోకనమత్యుత్తమమే. కాని అదియే అంతిమ లక్ష్యము కాజాలదు. ఆత్మావలోకన శక్తియే అంతిమమని, అంతకంటె తెలియదగిన దెద్దియు లేదనెడు అహం కార భావమును కల్గించి అంతకంటె యత్యున్నతమైన భగవచ్ఛక్తిని విస్మరింపజేసినచో నది పతన హేతువుగానగును. ఆత్మావ

లోకన సాధనములో విజయము సాధించియు, భగవచ్ఛక్తి సాధనములో నపజయమును పొందినవారగు హిరణ్యకశిపుడు, బలిచక్రవర్తిని మన మీ విషయములో నుదాహరణములుగా గొనవచ్చును. బ్రహ్మావలోకన మొక్కటియే భగవంతుఁడు సర్వశక్తి సాధనమనెడు విశ్వాసమును గల్గించును. కలియుగములో భగవదవలోకనమును అల్పులగు మానవులు పొందుట కొరకు సూక్ష్మమగు నుపాయమును భగవంతుని చేతనే ప్రతిపాదింపబడి తనంతతానే శిలాస్వరూపుడయ్యెను. దీనినే భగవంతుని అర్చా స్వరూపమందురు అర్చాస్వరూపములో, అత్యంతాప్తత, ప్రేమతో మానవుని సర్వశక్తులు కేంద్రీకృతముగావింపబడి భగవంతుని యర్చించుటలోఁ జూడనగును. ఆండాళ్ళు (గోదాదేవి) అట్టి మనో నిశ్చయము తోడనే, ప్రేమ ప్రవాహములోన నీది భగవంతుని సమాశ్లేషించిన విధమును వైష్ణవ మతానుయాయులు ఈ సందర్భములో పేర్కొందురు. శ్రీ వేంకటాద్రిస్వామి తిరుమలపై వెలసిన శ్రీమన్నారాయణుని దివ్యస్వరూపమేయనియు, శ్రీ వేంకటాద్రి కలియుగ వైకుంఠమని కొలిచెడు భావము పూర్తిగా మానవుని యచంచల విశ్వాసము తాదాత్మ్యముపై నాధారపడి యున్నది.

## ప్రాథమికాన్వేషణము

ప్రప్రథమముగా తిరుమలపై శ్రీవారు మానవునిచేఁ గనుఁగొనఁబడినపుడు, శ్రీవారుగాని, శ్రీవారి ఆలయముగాని మనమీనాడు వీక్షించెడి రీతిలో నున్నదనుకొనుట నేలవిడచి సాముచేయుటవంటిది. అత్యంత ప్రాచీనమున శ్రీవారొక వల్మీకములో కప్పబడినట్లుగా చూచినవారు చెప్పినది యైతిహ్యములో వ్రాయబడియున్నది. ఈ కథాకాలములో అనగా, మొదట నీ విగ్రహము కనుగొనబడిన సమయములో నీకొండపయి, పసులకాపరులు కొందఱు నివసించుచుండిరని, వారీవిషయమును, వారి గోవులు పాలనెక్కడో పిదికి వట్టిపోయిన పొదుగులతో నింటికి

చేరుచుండెనని తెలిసి, ఆ గోవులను వారనుసరించి పోగా నచటగల మట్టిపుట్టమీద నా గోవులు తమంతతామే పొదుగులనుండి పాలు పిదుక బడుటగాంచిరి. ఆశ్చర్యముతో నా ప్రాంతీయ రాజునకీ యత్యాశ్చర్య కరమగు విషయమును విన్నవించిరి. ఆరాజుపేరు తొండమానుచక్రవర్తి. ఆ రాజ్యము తొండమండలము. రాజు వినినవాఁడై ఆశ్చర్యపడి వారితో నా కొండకేగి యా దృశ్యమును గాంచెను. అపుడు కొంత స్వస్థతనొంది, ఆ విగ్రహమునకు రక్షణమునకుగాను గుడికట్టించెను. కొందఱు చరిత్రకారులీ తొండమానుఁడు క్రీ. పూ. 1 వ శతాబ్దమునాటి వాఁడనియు, మరికొందరు క్రీ. శ. 1 వ శతాబ్దములోని వాఁడనియు పేర్కొనుచున్నారు. వారియూహ ప్రకారమైనచో నీ మొట్ట మొదటగా కట్టించిన ఆలయము ఒకటవ శతాబ్దమునాటిదే యైయుండును. అయిన నా దేవాలయము కట్టబడినది రాతితోడనో, ఇటుకలు, సున్నముతోఁ గట్టఁబడినదో, మట్టికట్టడమో లేక కొయ్యతోగావింపబడిన నిర్మాణమో మనకు తెలియుట కాధారములులేవు. ఆ వల్మీకములో నా శ్రీ మహా విష్ణువెంత యనంతకాలమునుండి యుంచెనో తెలియరాదు.

మనము విశ్వసించుచున్న యిట్టివేయగుకొన్ని లోకములోని యుదాహరణములచే నిది పూర్తిగా సత్యదూరమని త్రోసిపుచ్చలేము. క్రైస్తవ, యూదుల ప్రపంచములో నభివ్యాప్తమయిన లసంఘటనలలో 'మోసెస్' అనువానికి 'సినాయ్' కొండపయి భగవంతుడు ప్రత్యక్షమయి దశా దేశముల (Ten Commandments) నొసఁగిన విషయము, వానిని రెండు శిలాఫలకములపై అప్పటికప్పుడే వ్రాయబడి 4′×2½′ కొలతలుగల బంగారపురేకుతో కప్పఁబడిన కొయ్యపెట్టెలో భద్రపఱుపఁ బడిన విషయము, ఆ పెట్టెయొకజ్యోతిగా భావింపఁబడి యూదులకు పూజావిధానమయ్యెనన్నది యూదులలో జగద్వ్యాప్తమయిన విశ్వాసము. హిందువులుకూడ మారుపలుకక శ్రీవారి ఆలయమున్న తిరుమలపై నిట్లిదే యొక అధి భౌతిక (Supernatural) మగు సంఘటన జరిగి

ఒత్ఫలితముగా తొండమాను(నాలయమును నిర్మించి యుండెనని భావిం చుటలో తప్పులేదు. కాని, మనమీనాడు చూచెడి ఆలయము మాత్రము నాడు తొండమానునిచే నిర్మితమయినట్టిదికాదు. ఈనాడు మనము చూచుచున్న భగవానుని ఆలయము చెక్కడపు రాతితో పల్లవుల శిల్పరీతిలో నిర్మాణము గావింప బడినట్టిది. తలుపులు మాత్రమే కొయ్యతోనున్నవి. శాసనకర్తలు దక్షిణ దేశములో చెక్కడపు రాతి కట్టడములు 6 వ శతాబ్దము తరువాతమాత్రమే ప్రభవిల్లినట్లూహించు చున్నారు. ఇంతకు బూర్వమున్న రాతిగుహాలయములు మాత్రము దీనికి మాతృకలుగావచ్చును. ఈ సిద్ధాంతమును విశ్వసింపజేయునవి అనేక శాసనములున్నవి. తొండమానునిచే కట్టబడిన ఆలయ మీ కారణములచే శాశ్వత ప్రాతిపదికపయి నిర్మాణమయినది కాదని నిర్ణయము చేయవచ్చును.

## శిలప్పదికారములోనున్న శ్రీవారి ఆలయచరిత్రము.

అతిప్రాచీన తమిళకావ్యమగు శిలప్పదికారమునందు శ్రీవారి ప్రశంసకలదు. ఈ కావ్యరచయిత శ్రీ వేంకటాద్రినాథుని భక్తుడుగాడు. చారిత్రకులచే నాతడు జైనుడుగా( బేర్కొన(బడెను. కావ్యములో నొక వైష్ణవయాత్రికునినోట ఈ మాటలు పలికించెను. ఆ యాత్రికుడు పడ మటి కనుమలలోనుండి 'మాంగాడు' అను గ్రామమునుండి ప్రయా ణించెడి సమయములో శ్రీవారి ప్రశంస చేయుచెను. మరియొకసారి శ్రీరంగనాథుని ప్రసక్తి కావ్యములో తే(బడెను. ఈ వర్ణనములో శ్రీ వేంకటాద్రినాథుడు విష్ణువునకు ప్రాతినిధ్యము వహించిన మూర్తిగా( బేర్కొనబడెను. ఆయనచే 'సెన్‌గన్ నెడియోన్'గా బేర్కొనబడెను. సూర్యచంద్రులిరువురు శ్రీవారికి తమ కిరణములను ప్రసరింప(జేసిరట. ఇది నిజమగుచో శ్రీవారి విగ్రహము కప్పులేకుండనయిన నుండ వలయును. లేదా ఆ పైనున్న కప్పుపూర్తిగా అచ్ఛాదితము గాక

నయినను యుండవలయును. ఈ యనాచ్ఛాదిత మంటపము రాతిదైనను కావచ్చును. లేదా కొయ్యదైనను గావచ్చును. ఈ యూహాజనిత భావమునకెట్టి విప్రతిపత్తియుండబోదు. కారణమేమన, 16 వ శతాబ్దమున తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనములాధారముగా మంటపముల లోనే విగ్రహముల ప్రతిష్ఠాపనము జరుగుచుండెనని తెలియవచ్చును. మనము నేటికిని ఆంజనేయస్వామి, వినాయకుల విగ్రహములు మంటపములలోనే ప్రతిష్ఠించుట చూచుచున్నాము. భక్తులా దేవతలను వరప్రసాదులుగానెంచి మ్రొక్కులిడుటను గనుచున్నాము. 8, 9, శతాబ్దములలో ప్రభవించిన ఆళ్వారులు తిరుమలలోని శ్రీవారిని కీర్తించుట అనునది శ్రీ మహావిష్ణు స్వరూపముగా సాక్షాత్కరించెడి తిరుమల కొండనుద్దేశించియే గావచ్చును. వారి కీర్తనలందు అట్టి దేవాలయమొకటి యున్నట్లుగా వారు పేర్కొనలేదు. అచట నాటికి దేవాలయమే యున్నచో నా విషయమేదో రీతిగా శిలప్పధికార రచయితపొందు పఱచియేయుండును. ఆతఁడే గావించిన శ్రీరంగములోని శ్రీరంగనాథుని వర్ణనలో నాయన శయనస్థితిని సమగ్రముగా వ్రాసెను. అంతేగాక ఆయన 'రంగవిమాన' ప్రసక్తియుగలదు. శిలప్పధికార రచయిత, ఆళ్వారుల కాలములు కొంచెమించుమించుగా సమమయిన కాలములే. దీనిచే తొండమాను చక్రవర్తి నిర్మించిన ఆలయము క్రీ. శ. 750 వ సంవత్సరమునకు చాలపూర్వమే శిథిలమయియుండునని యూహింపవచ్చును. ఈ కాలమునకు తరువాతనే మరియొక ఆలయము పునర్నిర్మాణము గావింపబడెననియు తలంపవచ్చును. పల్లవుల శిల్పపు కట్టడపురీతులు బాగుగావిలసిల్లి సామాన్య సమతలప్రదేశములందు దేవాలయనిర్మాణము విస్తృతముగా ప్రచారమయిన కాలములో దీని పునర్నిర్మాణము గూడజరిగియుండెనని యూహింపగలము. అంతేకాక, ఇప్పుడున్న దేవాలయమంతయు నొకేమారు కట్టబడియుండెనను నిర్ణయమును చేయజాలము. శ్రీవారి సన్నిధి లేక గర్భగృహము, దానికి

ముందున్న ముఖమంటపములేక శయన మంటపము ఒకే సమయములో నొకే భాగముగా 9 వ శతాబ్దాంతమునకుగాని 10 వ శతాబ్దము ప్రారంభ మునగాని నిర్మింపబడియుండును. దీని వెనువెంటనే ప్రథమావరణమగు ముక్కోటి త్రోవయేర్పాటు గావింపఁబడియుండును. దీని తరువాత క్రీ. శ. 966 వ సంవత్సరములో 'తిరువిలాన్‌కోయిల్' నిర్మాణ మయ్యెను. శాసనములాధారముగా నీ విషయములను గుఱించి ముందు విచారింపఁబడును.

దీనితరువాత 1 వ రాజేంద్రచోళునినుండి 2 వ రాజరాజు పరి పాలించిన చోళుల కాలమువరకు విశేషమగు సంఘటనము లేవియు జరిగియుండని కాలముగా నెన్నవచ్చును. చోళుల ఆధిపత్యము బాగుగా క్షీణించిన తరువాత యాదవరాయలు, ఇతర పాళియగాండ్లు స్వతంత్రాధి పత్యము లభింపఁజేసికొని ఈ దేవాలయాభివృద్ధి నిమిత్తము తాము మిక్కిలి శ్రద్ధవహించిరి. ఇది 1160 వ సంవత్సరము నుండి 1190 వ సంవత్సరము వరకుగావచ్చును. అనగా నిది రామానుజులు అవతారము చాలించిన తరువాత కాలము. తిరుపతి శ్రీ గోవింద రాజస్వామివారి ఆలయము శ్రీమద్రామానుజులవారే నిర్మించినట్లు చెప్పు దురు. ఈ విగ్రహమును క్రీ. శ. 1130 వ సంవత్సరములో పునఃప్రతి ష్ఠించినట్లున్నది. ఇంత మాత్రముచే నీయన గోపురము ప్రాకారాదులు నిర్మాణము చేయించెనని చెప్పవలను పడదు. తిరుమలలోని గోపురాదులు కూడ నీయన కాలములోనే నిర్మితమయ్యెననిఁజెప్ప వీలులేదు. 15 వ, 16 వ శతాబ్దములందుకూడ తిరుమల ఆలయము, తదితరములయిన యనుబంధపు కట్టడములు నిర్మాణములగుచుండినట్లు శాసనములు తెలుపుచున్నవి. క్రీ. శ. 1482 వ సంవత్సరములో సాళువనరసింహ రాయలు 'దుర్గసముద్రమ'ను గ్రామమును, తిరుమలలోని శ్రీవారి ఆలయ గోపురములు, తిరుపతిలోని గోపురములు, నరసింహరాయ మంటపము నిర్మించుటకు అత్యవసర నిధులను సమకూర్చుటకు దాన

మొసంగెను. తాళ్ళపాకం తిరుమల అయ్యంగారు శ్రీ స్వామి పుష్కరిణి మెట్లను, పదునారవ శతాబ్దములో గోపురములతోబాటు కట్టించినట్లు తెలియుచున్నది, 16 వ శతాబ్దాంతమున తిరుమలరాయ మంటప మొకటి నిర్మాణము చేయబడినట్లుకూడ తెలియుచున్నది. ఈ నిర్మాణములన్నియు ఒక ప్రణాళిక ప్రకారము జరిగినట్టివికాదు. దాతల యభీష్టాను సారము, వారి సూచనల మేరకు ముందుచూపు లేక అను సంధించుకొనిపోయిన కట్టడములుగా వీని నూహింప వచ్చును.

## గర్భగృహము - శయనమంటపము

ఈ రెండు కట్టడములు నొకదాని నొకటి యనుసంధించుకొని ఒకే పర్యాయము నిర్మాణము చేయబడినట్టివి. ఈ విషయమై తిరుమలలోగాని, తిరుపతిలోగాని నిర్మాణ కాలమును గురించి పేర్కొను శాసనాధారము లెవ్వియునులేవు. కొన్ని శాసనములున్నను అవి అన్నియు తమిళ భాషలోను, తమిళ లిపిలో నుండి ఈ కట్టడ నిర్మాణమును సూచించుకాలమును సత్యముగా తెలియజేయ జాలకున్నవి. ఇందులో నొక శాసనములో బాణరాజు ప్రాంతీయ ప్రభువు. అతని పేరు విజయాదిత్యుడు. ఈయన శ్రీవారికి మూడు వేర్వేరు సేవల కొసంగిన దానశాసనము. నొక సేవ శ్రీవారి ఆలయములో నిత్యదీపమునకు సంబంధించినది. ఇది క్రీ. శ. 830-850 సంవత్సరముల నడిమి నాటిది. ఇది ప్రత్యేక శిలాఫలకమయినందున దీనిని నేటికిని తిరుకుకనూరు పద్మావతీ అమ్మవారి ఆలయము నందలి యొక వేదికపయి భద్రపఱుపఁబడి యున్నది. ఒకే ఒక దీపమును రాత్రింబవళ్ళు వెలిగింప నిచ్చగించిన దానమగుటచే నప్పటి కీ తిరుమల ఆలయము చాల చిన్నదిగా నుండి యుండునని యూహించుటలో పొరపాటేమి యునులేదు. గర్భగృహము, శయన మంటపము మాత్రమేయుండి యుండును. భక్తుఁడు నిలబడి శ్రీవారిని సేవించు కొనుటకేర్పడినదీ

శయనమంటపము. పైన పేర్కొనఁబడిన బాణరాజు జన్మదినము తో ననుబంధితమగు యొక శాసనము శ్రీవారి ఆలయమునకు ముందుగా విసరివేయబడినట్లున్నదని యిదివరలోనే పేర్కొనబడినది. ఈతని జన్మ కాలము 8 వ శతాబ్దాంతము. చోళులచే నాక్రమింపఁబడిన యనంతరము 927, క్రీ. శ. 936 సంవత్సరములందు వేయబడిన రెండు శాసనములు 1 వ పరాంతకుని కాలములోనివి గలవు. ఇందులో నొకటి మలైనాడు లోని ఆరంగనూరునివాసి 40 కలంజుల బంగారము తిరుళుకనూరు సభవారికి రాజగు 1 వ పరాంతకుని 29 వ పరిపాలనా సంవత్సరమునకు సరియగు క్రీ.శ. 936 లో దానమొసగినట్లు గలదు. ఇట్టిదే మరియొక ప్రయోజనము కొఱకు ఈ 1 వ పరాంతకుని 20 వ పరిపాలనా కాలము లో మరియొక శాసనము ద్వారా దాన మొసగియుండుట జరిగి యుండ వగును. ఈ శాసనము ముక్కలు ముక్కలై పూర్తిగా అసమగ్రముగా నుండి తిరుళుకనూరులో వాహనమంటపము పటమటి గోడలకు అతుక బడియున్నది. ఈ సేవలు తిరుమలలో జరుగవలసి యున్నప్పటికి దాని నిర్వాహకులైన ధర్మకర్తలు తిరుళుకనూరు గ్రామవాసులగుటచే నివి యిక్కడనే స్థానము సంపాదించుకొని యున్నవి. ఈ ధర్మ కర్తలు లేక సభవారు తిరుళుకనూరు నుండియే ఆయా దాతల కోర్కెల మేరకు తిరుమలలోని శ్రీవారి సేవలను జరిపించిరనునది సమమగు కారణము. రెండవది శాసనము చెక్కెడి శిల్పులను అనంతమైన శ్రమతో కొండపై కెక్కించి వారికి వసతులను గూర్చి కొండమీఁద శాసనములు వ్రాయించుట మిగుల క్లేశతరకార్యముగా నుండియుండును. లేక తిరుమల ఆలయపు గోడలు నాటి కిట్టి శాసనములు చెక్కుట కనువ యిన రీతిలో నుండియుండక పోవచ్చును.

క్రీ. శ. 1013 వ సంవత్సరమునకు సరియగు 1 వ రాజేంద్ర చోళుని 7 వ దిన పరిపాలనా కాలములో, తిరుమల దేవాలయములోని ముక్కోటి ప్రదక్షిణ మంటపములోని ఉ తరకుడ్యము పయి నొక శాస

నము గలదు. ఈ శాసనము వలన తిరుమలలోని శ్రీవారికి 24 నూనె దీపములు, కర్పూర నీరాజనము, నిత్యము జరుపుటకుగాను 'తిరు మందియామ్' గ్రామములోని సభవారు ధర్మకర్తలుగా నుండి యీ సేవలు జరిపించుటకు నియమింపబడిరను విషయము తెలియుచున్నది. సమగ్రముగా నీ సేవ లొనర్చుటలో వీరు విఫలులైరి. రాజ ప్రతినిధి ఈ లోటుపాట్లను తనిఖీలో గ్రహించి ఇందులకు సంబంధించిన వారిని విచారించి సభవారి నుండి రాబట్ట వలసిన ధనమంతయును స్వీకరించెను. ఈ ధనమును శ్రీవారి ధనాలయమునకు జమచేసి, అచటగల దేవాలయాధికారులకు సరియగు విధమున జ్యోతులను వెలిగించుటలో శ్రద్ధచూపవలసినదిగా నుత్తర్వుల నొసంగెను. ఈ 24 జ్యోతులు వెలిగించుటయనగా ప్రదక్షిణ మంటపములో నాలుగు వైపులా నొకే వరుసలో నమర్చబడి వెలిగింపఁబడియుండును. గర్భగృహములోని జ్యోతి మాత్రము ఆవునేతితో వెలిగింపబడి యుండునుగాని నూనెతో మాత్రము కాదు. అధికారి యొక్క యుత్తర్వులో ఇతర సంభారములతోబాటు నూనెకూడ దిగువనుండి ప్రతి దినము సరఫరా చేయవలెనని యుండెను. ధర్మకర్తృత్వ సంఘమనునది, దాతయొక్క బంధు జనము వారి అనుయాయులు పూర్తిగా లుప్తమైనప్పుడు మాత్రమే ఏర్పాటు చేయబడెడిది. కనుక నీ దానములు క్రీ. శ. 1013 సంవత్సరమునకు పూర్వము కనీసము 50, 60 సంవత్సరములనాడు చేయబడియుండునని యూహింపవచ్చును. అనగా, క్రీ. శ. 950 ప్రాంతములో నన్నమాట. ఈ కాలమునకు శ్రీవారికి గర్భగృహము, శయన మంటపము దాని ననుసరించి కప్పుచు ముక్కోటి ప్రదక్షిణము వరకు నిర్మింపబడి యున్నది.

## భోగశ్రీనివాసమూర్తి — తిరువిలాన్ కోయిల్

తిరువిలాన్‌కోయిల్ ఆకృతి స్నపనమంటపము యొక్క ఆకృతిగాఁ జెప్పనగును. ఈ మంటపములోనే 'సామవాయి' మహారాణి

శ్రీవారి మూలబేరమునకు నకలుమూర్తిని రజితముతో తయారు చేయించి ప్రతిష్ఠించి అనేక దానములనొసఁగెను. ఈ దానములకు సంబంధించిన శాసనములు తి. తి. దేవస్థానముల శాసనపత్రిక 1 వ సంపుటిలో 8, 9 నెంబర్లుగలవిగా గుర్తింపఁబడినవి. ఈ రెండు శాసనములు మనకు బహు విషయములు తెలుపుటచే నత్యంతమగు విలువకలిగినట్టివి. ఇది ముఖ్యముగా నీ దేవాలయ ప్రాశస్త్యమును గుఱించి, ప్రాచుర్యమును గుఱించి పట్టియిచ్చునవి. ఇవి మొదటి ప్రాకారములోని ఉత్తరపు గోడ వైపు గలవు. ఇవి కొప్పాట్ర మహేంద్రపాన్‌మార్ 14వ సంవత్సరపు పరిపాలన కాలమునాటివి. ఈతఁడు కో-పార్థివేంద్రవర్మన్‌గా గుర్తింపబడిన సుందరచోళుఁడు లేక రెండవ పరాంతకుని కుమారుఁడు. ఈతఁడు తొండమండలమునకు ప్రత్యేకాధికారిగా చేయబడియున్నట్లు తెలియును. క్రీ. శ. 950–970 వ సంవత్సరముల ప్రాంతములో 2వ పరాంతకుని పరిపాలనాకాలము. 970వ సంవత్సరములో తండ్రియగు 2వ పరాంతకుని మరణముతో కో-పార్థివేంద్రవర్మ రెండవ ఆదిత్యునిగాఁ ప్రసిద్ధిచెంది రాజయ్యెను. ఈ వివరములు మనకు శాసనకాలములను నిర్ణయింప వీలొసంగును.

1) తి. తి. దేవస్థానముల శాసన సంపుటి 1 వ వాల్యూములోని 8, 9 నెంబర్లుగల శాసనముల కాలము (2) మొదటి పురటాసి తిరునాళ్ల (భాద్రపద మాసము) మనవాళ పెరుమాళ్ల (భోగ శ్రీనివాసమూర్తి) అవతరణము.

953 వ సంవత్సరము తొండమండలమునకు కో-పార్థివేంద్రుఁడు రాజప్రతినిధిగా నియమింపఁబడిన మొదటి సంవత్సరము కావచ్చును. ఇది సుందరచోళుఁడు రాజ్యసింహాసనము నధిష్ఠించిన తరువాత జరిగిన కార్యక్రమము. దీనినుండి 14 సంవత్సరములు అనగా 966 వ సంవత్సర కాలమునాటి వీ శాసనములయి యున్నవి. కొందఱు చరిత్రకారులు కో-పార్థివేంద్రుఁడు రాజప్రతినిధిగా పదవినందిన నాటినుండి 14

సంవత్సరముల కాలమును లెక్కపెట్టవలెనందురు. కాని కో-పార్థివేంద్రుడు సింహాసన మెక్కిన యనంతరము 14 సంవత్సరములు గడవకుండుటచే నీ వాదము సరికాదు. అంతేగాక 14 వ సంవత్సరముగా వీరి లెక్కప్రకారమే అనుసరించినచో నాటికి కో-పార్థివేంద్రుడు రాజయినచో అతనికిగల బిరుదులు, కీర్తులన్నియు అనగా నాదిత్యకరి కాల మొదలయిన వానితోఁ నాతవిని బేర్కొనియుండెడివే. కనుక శాసన కాలము తప్పనిసరిగా క్రీ. శ. 968 వ సంవత్సరమే యగును. 8వ నెంబరు శాసనములోని విషయమాధారముగానయినను ఈ విషయమును స్పష్టపఱుపవచ్చును. ఈ శాసనములో తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవమున ప్రారంభమగు అంకురార్పణము ప్రసక్తియున్నది. ఇది చిత్తా నక్షత్రమందు జరిగెను. ఆ నాటి నుండి 9 రోజుల వరకు నుత్సవములు, నూరేగింపులు తీర్థవారి పర్యంతము జరుగును. చిత్తానక్షత్రమునుండి పదియవరోజు ఎల్లప్పుడు తప్పని సరిగా శ్రవణానక్షత్రము (తిరువోనమ్) కాబోదు. చిత్తానక్షత్రమునకు శ్రవణము 9 వ నక్షత్రము గనుక నారోజు తీర్థవారి యుత్సవము లేక అవభృథోత్సవము జరుగవలెను. అంకురార్పణము నుండి లెక్కపెట్టి పదవరోజున తీర్థవారి జరుగునట్లును, ఆ దినమున తప్పనిసరిగా శ్రవణా నక్షత్రముండగా జరుపబడుట అనునది మార్పజాలని సాంప్రదాయము. ఈ విషయములో వైఖానసాగమ శాస్త్ర నిర్ణేతలగు మహర్షులందఱిది ఏకైకవాక్యము. శ్రీ వేంకటేశ్వర స్వామివారి జన్మనక్షత్రము శ్రవణానక్షత్రము. జన్మనక్షత్రముగాని, ప్రతిష్ఠానక్షత్రముగాని, లేక యజమాని జన్మనక్షత్రముగాని లేక పౌర్ణమిగాని అవభృథముగా నిర్ణయించుకొని ఆహ్నికదీక్షావిధానముతో నుత్సవమాచరింపవలెనని శాస్త్రకారుల మతము. దీనికై చాల సంవత్సరములు శ్రీవారి బ్రహ్మోత్సవములు హస్తానక్షత్రముతో నారంభించి తీర్థవారి రోజున శ్రవణానక్షత్రముండుటగాఁ జూచుకొని యుత్సవము జరిగించుకొనుచుండిరి. క్రీ. శ. 966 లో నంకురార్పణము చిత్తానక్షత్రమున జరుపబడెను. 967, 968 సంవత్సరములలో నట్లు జరుప వీలుపడక

పోయెను. క్రీ. శ. 966 లో నున్నవిధముగా మరల క్రీ. శ. 983 వ సంవత్సరములోగాని జరుగలేదు. ఆ నాటికి కో-పార్థివేంద్రరాజు బ్రతికి యుండలేదు. క్రీ. శ. 966 ఆగష్టు (భాద్రపదము) 21 మంగళవారం నాడు సూర్యోదయాది 6 ఘడియలకు చిత్తానక్షత్రము ప్రారంభమయ్యెను. ఆ కారణమున నా రాత్రి చిత్తానక్షత్రముండుటచే నంకురార్పణమా రాత్రి జరిగియుండనగును. అప్పటినుండి పదవరోజునకు సరిగా లెక్కవేసినచో నాగష్టు 30వ తేదీ గురువారమునాడు శ్రవణానక్షత్రము సూర్యోదయాది 8 ఘడియల 24 విఘడియల పర్యంతముండుటతో తీర్థవారి ఆయుదయమున జరిగియుండును. అంకురార్పణము జరిగిన తరువాత మరల బుధవారము వరకు మొత్తము 9 రోజులు ఊరేగింపులు, ఉత్సవములు జరుపబడియుండును. దక్షిణాది పంచాంగముల ప్రకారము అనగా సౌరమానము ప్రకారము క్రీ. శ. 966 అక్షయ సంవత్సర మయ్యెను. కనుక సామవాయి మహారాణిచే మొదటి శ్రవణానక్షత్రము ప్రాధాన్యముగల తిరునాళ్లు క్రీ. శ. 966 లో అక్షయనామ సంవత్సరములో జరిగించుట ప్రారంభమయ్యెను.

'మనవాళప్పెరుమాళ్' (భోగ. శ్రీనివాసమూర్తి) ప్రతిష్ఠను గూర్చి యిక విచారింతము. మనకు శాసనాధారము లీవిషయమై నిర్ధారింపనీయవు. కాని యితరమైన కారణము లాధారముగా మన మీ విషయమును నిర్ణయింపగల్గుదుము. భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనము, పురటాసి (భాద్రపద) తిరునాళ్లు, రెండును ఒకే శాసనములో నుదహరింపబడినవి భాద్రపదపుతిరునాళ్లు, భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనము ఒకే సంవత్సరమున జరిగినట్లు తెలియజేయుటకీ సంఘటనము మనకు మిక్కిలిగా నుపకరించుచున్నది. జ్యోతిశ్శాస్త్రాధారములవలన నీ భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపన మెప్పుడు జరిగియుండునో మనకుఁ దెలియపిలుగల్గును. ఉత్తరాయణములోని మాసమై (తమిళ మాసములలో ఒకటైయుండును) యుండవలయును. ఇది తమిళుల

ఆణి (జేష్ఠ్యము) మాసము యుక్తమైనగా చూపును. మనమిట్లు జ్యోతి శ్శాస్త్రపు లోతులలోనికిఁ బోవకయే ఈ ప్రతిష్ఠాదినమును అక్షయసంవత్స రము, జ్యేష్ఠమాసము (అణి) 16 వ రోజు బహుళ తృతీయా శుక్రవా రము శ్రవణానక్షత్రయుక్తమయిన దినమున భోగశ్రీనివాసమూర్తి నెలకొల్పబడియున్నట్లూహింపనగును. శ్రవణానక్షత్రము శ్రీ వేంకటేశ్వర స్వామివారికి శ్రీ వరాహస్వామి వార్లకుగూడ నవతార నక్షత్రము. ఈ శాసనములో మొదటగా శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి నిత్యార్చనము జరిపి తరువాత శ్రీ భోగ శ్రీనివాసమూర్తికి సకలాభరణముల నలంక రించి అభిషేకము జరిపిన యనంతరమే వైఖాన సాగమానుసారము ప్రతిష్ఠాకార్యక్రమము నిర్వహింపబడినట్లున్నది. ఆ శుక్రవారమున శ్రవణానక్షత్రము సూర్యోదయాది 8 ఘడియలవరకు నున్నది. శ్రవణా నక్షత్రము మొదటి పది ఘడియలు శుభముగాలేనందునను, ప్రతిష్ఠాప నము ధ్రువణానక్షత్రాది 18 ఘడియలకు సూర్యోదయానంతరము జరిగి యుండును. ధృవబేరమునకు నిత్యార్చనము సరిగా నదేసమయమున జరిగిన యనంతర మభి షేకముకూడ జరిగియుండును. ఆ దినము నకుఁ బూర్వము అనగా గురువారం రాత్రి పూలతోడి యలంకరణము జరిగియుండును. అదియే నేటివరకు మనము ప్రతి గురువారము రాత్రి దర్శించుచున్న పూలంగిసేవ. 966 వ సంవత్సరము జూన్ 8, శుక్రవారం నాడు మనవాళప్పెరుమాళ్ లేక భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనము జరిగిన దినమని నిర్ణయముచేయవచ్చును. జ్యేష్ఠమాసములో నీ రోజు అత్యంత శుభదినమగుటచే భోగ శ్రీనివాసమూర్తికి నయనోన్మీలన ప్రక్రియ తత్పూర్వదినమందు జరిగించి యీ దినమున ప్రతిష్ఠామహోత్స వము జరిగినట్లు నిర్ణయించుటసమంజసము.

## ప్రతిష్ఠాస్థానము - తిరువిలాన్‌కోయిల్

భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనము, అంతకుఁ బూర్వమున జరిగిన యభిషేకాదులు 'తిరువిలాన్ కోయిల్' మంటపము లేక ఉపా

లయములో జరిగినవి. గర్భాలయములో సంప్రదాయ బద్ధముగా, శాస్త్ర విధానముగా ప్రతిష్ఠావిధి నిర్వర్తింపఁజేయని విగ్రహమునకు స్థానము లేదు. అప్పటికియున్న ఆలయమునకు అనుబంధముగా నొకనూతన మంటపము, అప్పటి కట్టిదిలేకున్నచో క్రొత్తగా నిర్మాణము చేయబడి యుండును. ప్రతిష్ఠానంతరము ధృవమూర్తికడకు రజితమూర్తిని చేర్చుట కెక్కువ సమయము పట్టకుండెడి యుద్దేశ్యముతో నీ గర్భాలయాను బంధ మంటపనిర్మాణము జరిగియుండును. దీనికి హేతువేమన ప్రతిష్ఠ యయిన వెంటనే ధ్రువమూర్తికడచేర్చి ధ్రువమూర్తిశక్తిని రజితమూర్తి యందు ప్రవేశపెట్టుటయే లక్ష్యము. స్వతంత్రమూర్తిగా నీ భోగ శ్రీని వాసమూర్తికి ప్రేరేపణాత్మకమగు దైవికశక్తి ఎట్టిది లేదని మనము జ్ఞప్తిపెట్టుకొనవలయును. అప్పటికి ధ్రువమూర్తికి నమర్చబడిన గర్భా లయము, ముఖమంటపము ప్రదక్షిణావర్తులమున కనుబంధముగా ముఖ మంటపమునకుముందు ఈ తిరువిలాన్ కోయిల్ నిర్మాణము చేయబడి యుండును. ఈ భోగశ్రీనివాసమూర్తిని ఆగమోక్తముగా మూల మూర్తిలో బంగారపుతీగతోడను, (సంబంధకూర్చ) పట్టుదారములతోను సంబంధము తగుసమయములో కల్పింతురు. తిరువిలాన్ కోయిల్‌నుండి యీ రజితమూర్తిని శ్రీవారి సన్నిధిని జేర్చునంతదనుక యీ సంబంధ మట్లేయుండును. అనగా నేడు బంగారువాకిలిగా పిలువబడుచున్న ద్వారమే స్వామిసన్నిధినిజేర్చు మొదటిద్వారము. ఈ బంగారువాకిలి, గోడలు వాని నిర్మాణములను గుఱించి తరువాత చర్చింపబడును. ఈ ప్రతిష్ఠాకార్యక్రమము ముగిసిన యనంతరము తిరువిలాన్ కోయిల్‌నుండి యీ రజిత భోగ శ్రీనివాసమూర్తి నేఁడు మనము చూచుచున్న ప్రదేశము లోనే శ్రీవారి సన్నిధిలో ప్రవేశపెట్టబడియుండును. ఈయన కౌతుక మూర్తిగాఁ బిలువబడుచు ధ్రువమూర్తికి సరియగు నకలుగా ప్రతి బింబించును.

ఈ రజితమూర్తి ప్రతిష్ఠా సందర్భములో ఒక్క పట్టుదారముతో ధ్రువమూర్తి ననుసంధించుట తప్ప శ్రీవారికిందు వేదప్రమేయము

గానము. శాసనములో చెప్పబడిన విధమున శ్రీవారికి నిత్యవిధియగు నిత్యార్చనము నెరవేర్చబడిన యనంతరమే శ్రీవారికి యభిషేకము. రజితమూర్తి మంటపమునందు వేంచేపుచేయుట, అభిషేకము, ప్రతిష్ఠా కార్యక్రమము అనుసరింపబడి యుండును. (ఆంగ్లగ్రంథములో కర్మార్చనమని పలు తావుల పేర్కొనబడినది.) మరీచి సంహిత ప్రకారము నిత్యపూజావిధికి కర్మార్చనమని పేరుగలదు. ఇది వైఖానసాగమ సంబంధమయిన ప్రతిష్ఠాపనము.

## భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠావశ్యకత

ధ్రువమూర్తియగు శ్రీవారి కంటె స్వరూపములో చిన్నదియగు మరియొకమూర్తిని అర్చాస్వరూపము నర్చించు వారందఱకు వైఖానసాగమ శాస్త్రానుసారముగాఁ బ్రతిష్ఠించుటలో సమంజసమున్నది. అర్చావిధిలో వైఖానసాగమ విధానముగా షడాసన విధానపూజగలదు. మన్త్రాసన, స్నానాసన, అలంకారాసన, భోజ్యాసన, యాత్రాసన, శయనాసనములని వానిని బేర్కొందురు. ఇట్టివానిలో నన్నివిధులకు ధృవమూర్తి పాల్గొనుటయన్నది యసంభవము ప్రతి దినమభిషేకము కూడన సంగతమగుకార్యమే. గర్భాలయములోనికి ఎక్కువ ప్రమాణముగల నీరుతెచ్చుట, పెద్దశిలావిగ్రహము నభిషేకించి, దానియనంతరమానీటిని త్రోవలేని యాగర్భాలయమునుండి తోడిపోయుట కష్టసాధ్యము. అన్న ప్రసాదముల సమర్పణములోకూడ నొకపెద్దయిబ్బంది కలదు. ఈ యిబ్బందులను తొలగించుకొనుటకు తప్పక యొకచిన్నమూర్తిని ప్రతిష్ఠించు ఆవశ్యకత ఎక్కువయినది. సకలోపచార సేవలు ఈ చిన్నమూర్తి కర్పించినంతనే అవి ధ్రువబేరమున ప్రతిఫలించును. పెద్దమొత్తములలో నన్నప్రసాదములు సమర్పింపబడినపుడు (తిరుప్పావడ) బంగారు వాకిలి వద్దకు రజితమూర్తిని వేంచేపుచేసి (అనగా నిదివరకు ప్రతిష్ఠాపనస్థానమునకు) గొనిరాబడిన యనంతరము అచట వైఖానస అర్చక

స్వామి అన్నప్రసాదములను శ్రీవారికి నివేదించును. ధ్రువమూర్తి వీక్షణాపరిధిలోనే యీ యన్నప్రసాదములన్నియు నుంచబడి తలుపులన్నియు తెఱచియుంచబడును.

ఈ కారణములచేత మూలమూర్తికి తగు ప్రాతినిధ్యమన్ని విషయములలోను వహించుటకు భోగ శ్రీనివాసమూర్తి (కౌతుక) ప్రతిష్ఠ ఆవశ్యక మయ్యెను.

## మన వాళప్పెరుమాళ్ (భోగ శ్రీనివాసమూర్తి) కుగల ఆభరణ విశేషములు.

భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాకాలములో నా రజత విగ్రహమునకు తిరువాభరణమ్మలను (మంగళాలంకారములు) సామూహిక నామముచే పేర్కొనెడి కొన్నియాభరణముల నలంకరించిరి. ప్రాచీనమయిన సంప్రదాయముననుసరించి అర్చాస్వరూప విగ్రహమునకు కొన్ని ఆయుధములు, భూషణములు, ఆగమశాస్త్రములు చెప్పినవి. ఆ యాగమశాస్త్ర విధానము ననుసరించియే శాసనములోను ఆభరణములు ఈ రజత విగ్రహమునలంకరించినవి చెప్పబడినవి. ఆ యాభరణములు పేర్కొనుటలో శాస్త్రసంప్రదాయమొకటి, నాటి నాగరికతాసంప్రదాయములు తెలియుటయు రెండవలక్ష్యము. ఆ ఆభరణముల వివరములివి;

1. తిరుముడి (కిరీటము) 23 వజ్రములు 16 పెద్దముత్యములు. 2 పెద్దగోమేధికములతో తాపడముగావించిన బంగారు కిరీటము,
2. కర్ణాభరణములు 2 (బంగారు మకరకుండలములు.
3. కంఠాభరణము: నాలుగు వరుసలగొలుసు 14 వజ్రములు 3 గోమేధికములు 11 పెద్దముత్యములు అనేక చిన్న కెంపులతోగూడినది
4. బంగారు ఒడ్యాణము.

5. బంగారపు నడుముపట్టెడ 4 గోమేధికములుగలది.

6. ఎగువ బాహు వలయములు (వంకీలు) 2. ప్రతి వలయమునకు రెండు చెక్కడపు గోమేధికములున్నవి.

7. దిగువ నాలుగు చేతులకు వంకీలు 4, ప్రతిదానికి రెండు గోమేధికపు రాళ్ళు.

8. కంఠమునకు పట్టెడలు 4.

9. రెండు బంగారు కాలి అందెలు

10. వెండి మకర తోరణము. మధ్య పెద్దమాణిక్యము. మొత్తమీ ఆభరణములలోని బంగారము విలువ 47 కొలంజులు. ధ్రువమూర్తికి శిలలోనే చెక్కబడినట్లున్న అభరణముల కివియన్నియు నమూనాలు మాత్రమే.

ఇప్పుడు భోగ శ్రీనివాసమూర్తికీయాభరణ విశేషములన్నియు నున్నవాయన్న విషయము తర్కమునకు సంబంధించిన విషయము. ప్రతిష్ఠాపర్యంతము విగ్రహమునకివి యున్నను ఆ తరువాత ఆయన వీని నుండి వేరు చేయబడెనని యూహింప నగును. శ్రీవారి ముఖమండలమందు ప్రతిష్ఠాకాలమునాటికే ధృవమూర్తి కున్నట్లుగా వర్తులాకారపు టూర్ధ్వపుండ్రము కలిగియుండును.

ఈ 8, 9, శాసనములలోనే భోగ శ్రీనివాసమూర్తికి ఈయబడిన భూమి దానవివరముల సయితముకలవు. ప్రజలవద్ద కొనుగోలుచేయబడిన భూమిమొత ము నాడు దానమొసగినది నేటికొలతలకు సరియగు 24 ఎకరములభూమి. తిరుకుకనూరులోని తిరువిలాన్ కోయిల్ నిర్మాలింప బడుటలో ఆ కోవెలకు సంబంధించిన భూములు కొనుగోలు చేయబడి తిరుమలలో ఏర్పాటుచేయబడిన మనవాళప్పెరుమాళ్ (భోగ శ్రీనివాసమూర్తి) కు దానశాసనము వ్రాయబడినట్లుతోచును. 'పెరుంబాణ'

చెరువు ప్రసక్తియుండుటచే నీ ప్రదేశమంతయు నాడు బాణరాజుల యధీనములోనున్నట్లు తెలియుచున్నది. అక్కడనే మఱియొక చోళుల రాణులలో నొకరితయగు 'పంచవనమహాదేవేరి' పేరున నొక చెరువు పేర్కొనబడుటతో చోళుల రాజ్యపాలన ముచ్చస్థితిలో నున్నట్లూహింప నగును. చోళులుగాని పల్లవులుగాని రాజ్యముచేసిన ప్రదేశములలో పంటకాల్వల నిర్మాణమునకేమి వ్యవసాయాభివృద్ధికేమి మంచికృషి యొనర్చినట్లుతోచును. తి. తి. శాసనములలో 1 వ సంపుటిలోని 4, 12, 8, నెంబరులుగలవానిలో క్రీ. శ. 936 సంవత్సరమువరకు విష్ణుపూజా నిరతులగు భక్తులు 'ఎంబెరుమానడియార్' పేరుతో పిలువబడుచుండిరి. ఆ తరువాత కాలములోనే వీరు శ్రీ వైష్ణవులుగా బిలువబడిరి 'శ్రీ వైష్ణవుల రక్షణార్థమనియే' ఈ కాలము తరువాతనున్న అన్నిశాసనముల లో నీయబడిన దానములను గుఱించి పేర్కొనుటయే యిందులకుఁ గారణము. లక్ష్మీదేవియే పురుషకారమని మొట్టమొదటగా గ్రహించిన అళవందారు సకల విష్ణుభక్తులకు దానిని గూర్చి ప్రచారమొనర్చి సకల వేదాంతములలోని లక్ష్మీవైశిష్ట్యమును బోధించి 'శ్రీ వైష్ణవులు'గా వైష్ణవులను (ఎంబెరుమానార్) మార్చిన విషయమిట అనుసంధింప దగినది.

ఇక్కడ ఒక రహస్యవిషయమును బహిర్గత మొనర్చుచున్నాము. భోగశ్రీనివాసమూర్తి పీఠమునందొక యంత్రమున్నది. ఇది కేవల మర్చకస్వాములు, వారితోడి సంబంధమున్నవారు మాత్రమే తెలిసికొన గలరు. అట్టిదే ధ్రువబేరపీఠమునందు నుండియుండును. నేడు ధ్రువబేర పీఠము పూర్తిగా కప్పివేయబడుటతో దానియునికి తెలియ నసాధ్యము. వైఖానస, పాంచరాత్ర ఆగమ శాస్త్రానుసారముకూడ నీ యంత్రస్థాపన విషయమునందు గట్టి ప్రమాణములున్నవి.

## తిరుక్కోడి తిరునాళ్

తిరుక్కోడి తిరునాళ్ ఉత్సవములను వసంతోత్సవము లేక వేసఁగియుత్సవములని పేర్కొనవచ్చును. ఈ యుత్సవ దినసంఖ్య

వరిగా పదిదినములుండవలెననెడు నియమము పేర్కొనఁబడలేదు. ద్వాదశీ తిథితో నంతమగు నుత్సవము ఏడుదినముల పర్యంతమే అని గ్రహింపనగును. ఈ దినములలో నుదయ సాయంత్రములందు శ్రీవారి ఉత్సవమూర్తికి రాజవీధిలో నలువైపుల నుత్సవము జరుగును. వైఖానసాగమములో 3, 5, 7, 9 దినములలో జరుపు నుత్సవములు పేర్కొనబడినవి. ధ్రువబేరముతో నిర్విరామముగా ననుసంధానము చేయబడిన భోగశ్రీనివాసమూర్తి (కౌతుకమూర్తి) ని యుత్సవమూర్తిగాఁ జేసిరనుటకు అవకాశము లేదు. అతి ప్రాచీనముగా గర్భగృహములో 'వేంకటత్తురైవార్' (ఉగ్రశ్రీనివాసమూర్తి) విగ్రహమున్నట్లుగా తెలియుచున్నది. ఇదియే నాటి యుత్సవమూర్తిగా మనము భావించుటకు వీలౌనంగుచున్నది. ఈ ఉత్సవ విగ్రహమునకు దేవేరులు లేరు. ఒక విగ్రహమే. ఇదియును సర్వవిషయముల శ్రీవారి ధ్రువమూర్తిని బోలియేయున్నది. ఈ విగ్రహముయొక్క చరిత్ర తరువాత అధ్యాయములో చర్చింపబడును.

క్రీ. శ. 966 సంవత్సరములోనే భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠానంతరమే తిరుమల శ్రీవారి అసలు చరిత్ర ప్రారంభమగుచున్నది. ముక్కోటి మంటపపు దక్షిణకుడ్యములమీద వ్రాయబడిన శాసనములు తరువాత కాలములోనివి. భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠానంతర మాయనకీయబడిన దానములు, ఆభరణములు, బహూకరణములు మొదలగువాని వివరములు దేవాలయ కుడ్యములపయి వ్రాయబడినవి. చోళరాజులు ప్రత్యక్షముగా నెట్టి శాసనములు వ్రాయించలేదు. కాని వారి రాణులలో కొందఱు శ్రీవారికి దానములొసంగినట్లు శాసనములున్నవి. అవి కొన్ని చెదరి, పగిలిపోయి శిథిలావస్థలో దర్శనమిచ్చుచున్నవి. వీరరాజేంద్ర పాన్మర్ (1 వ రాజరాజు) పదునారవ సంవత్సర పరిపాలనాకాలములో సుందరచోళని భార్యయగు పరాంతకదేవి అమ్మాణి (క్రీ. శ. 1000) తనభర్త గతించిన యనంతరము 52 కొలంజుల బంగారుపట్ట

మును - 6 మాణిక్యములు, 4 వజ్రములు, 28 ముత్యములు తాపబడిన దానిని-దానమొసంగినది. అదేకాలములో 1 వ రాజరాజు సతీమణి 'ఉలగ మహాదేవి' 29 కొలంజుల బంగారమును ఆలయములో నందా జ్యోతి వెలిగించుట కొసంగిన దాన శాసనమున్నది. (సంపుటి 1-18) ఈ శాసనము శిథిలావస్థలో నుండుటచే దీని సరియగు కాలమును గ్రహించుటకు వలను పడలేదు. 1 వ రాజరాజు కుమారుఁడగు 1 వ రాజేంద్రచోళుని 7 వ రోజు పరిపాలనా కాలమునకు సరియగు 1013 వ సంవత్సరములో రాజాధికారి యొకరు అఖండదీప నిర్వహణ కార్యము సక్రమముగా లేకుండుటచే 'తిరుమండియూన్' సభవారిని క్రొత్తగా ధర్మ కర్తలుగా నియమించినట్లు తెలిసికొనియున్నాము. క్రీ. శ. 1013 వరకు శాసనములందు దహరించినస్వామి తిరుమల శ్రీవారు కాదని, తిరుకుకనూరులోని వేంకటేశ్వరస్వాములు ముగ్గురులో నొకరనియు కొందరు పై శాసనములోని విషయ మాధారముగా చెప్పబూనుట దుస్సాహసము. ఏలనగా, ఈ శాసనములోనే తిరుమల శ్రీవారి ఆలయ ప్రసక్తి, ఆలయములో నఖండదీపము వెలిగించు ప్రస్తావన, క్రీ. శ. 1013 వ సంవత్సరమునకుఁ బూర్వమే జరిగినట్లు శాసనము స్పష్ట పఱచుచున్నది.

1 వ రాజరాజు కాలములోనే రాజాధికారియగు 'రాజరాజమూ వేందవేలన్' అను నాతడు రెండు దానము లొనర్చి శాసనములు వ్రాయించినట్లు తెలియుచున్నది. అందులో నొకటి 40 కొలంజుల బంగారము శ్రీవారి ఆలయములో నఖండ జ్యోతి వెలిగించుటకును, రెండవది కావేరి దక్షిణ తటమున నగల 'షోళనాడు' లో 'అవురుక్కు-రమ్' లోని కొంత భూమిని దానమొసంగు విషయమును గుఱించి చెప్పబడినది. ఇవి యన్నియు తిరుకుకనూరులోని ఆలయములలోని గోడలపయి వ్రాయబడి యుండుటచే నివి యిచ్చట దేవునకేనని యూహింప నగును. ఈ దానశాసనముల నిట జూపుటలో నుద్దేశ్యము చోళుల పరి

పాలనా కాలములో వారి యధికారులు విష్ణ్వాలయములకు దానము లొసంగిరను విషయము తెలియుటకేనని పాఠకులు గమనింపవలెను. క్రీ. శ. 1013 వ సంవత్సరములోని శాసనము తప్ప చోళులలో రాజేంద్రుఁడుగాని. వారి యధికారులుగాని శ్రీవారి ఆలయమునకెట్టి దానశాసనములు వ్రాయించినట్లుగా మనకాధారములు లేవు. 1 వ కులోత్తుంగని కాలమువరకు అనగా రెండవ రాజేంద్రచోళుని కాలమువరకు రాజవంశములో నయితమెట్టి దానశాసనమును వ్రాయించినట్లుగా తగు ఆధారములు చూపలేము. 1 వ కులోత్తుంగుఁడెట్టి దానశాసనము వ్రాయించలేదు. కాని ఆయన రాణి 'అవనిములుదైయాల్' మాత్రము కొంత పెరుగు, పాలు సరఫరా యొనర్చుటకుగాను దానమొసంగినట్లు శాసనమున్నది. ఈశాసనము పూర్తిగా ఛిద్రముకాబడి మొదటి ప్రాకారములో పశ్చిమపు నడవలో నేలపై అతుకబడినది. ఇది శ్రీవారి ఆలయము గర్భగృహము, విమానము క్రీ. శ 1250 లో జీర్ణోద్ధారము జరిగిన యనంతరము చేయబడి నేలచదును చేయబడిన సందర్భములో దీని నిక్కడ అతికించియుందురు. ఈ శాసనములో తిరుమల శ్రీవారెంత వాత్సల్యముతో పేర్కొనబడిరో ఆ పదజాలమునుబట్టి గ్రహింపగలము. మా 'తిరువాయిప్పాడి తిరుమలై ఆళ్వార్' అనునది ఆ పదము. ఈ విషయము శ్రీవారు వల్మీకములో నున్నప్పుడు గోవులు తమపొదుగుల నుండి తమంతట తామే పిదుకబడి వట్టిపోయిన పొదుగులతో గృహోన్ముఖమయిన విషయమును మనకు స్మృతికిఁదెచ్చును. ఈకాలమునాటివే మరి నాలుగు ఛిద్రశాసనములున్నవి. రెండు ముక్కోటి ప్రదక్షిణపు గోడలపయినున్నవి అందులోనొకటి 'తిరుక్కో' గ్రామము దేవదానముగా తిరుమల శ్రీవారి ధనాగారమునకు దానమిచ్చిన శాసనము. రెండవది మూడవ ప్రాకారము ఉత్తర కుడ్యముపై నున్నది. దీనిలో ఉత్సవమధ్య దినములలో శ్రీవారి అన్నప్రసాదములకుగాను కాశ్యపుడను వానిచే చేయబడిన సమర్పణమునుగురించి యున్నది. ఇది మూడవప్రాకారమున కెట్లు చేరినదో యూహించుటకు వీలుగానిది.

మిగిలిన రెండు ప్రత్యేకమైన శిలాఫలకములవయి యున్నవి. వీనిలో ఒకటి 'తిరునాకై విల్లి' ఇచ్చిన దానశాసనము. రెండవదానిలో 'సోలవలనాడు' లోని కొంతభూమిని దానమొసంగిన దానశాసనము. ఈ ఛిద్రశాసనము లన్నింటిని బేర్కొనుట 'మనవాళప్పెరుమాళ్ ప్రతిష్ఠానంతరమే శ్రీవారి ఆలయమునకు ప్రాముఖ్యము గలిగినదని నిరూపించుటకే నని గమ నింపవలెను చోళలకును వైష్ణవముపై నెట్టి విద్వేషము లేకుండెనవియు దీనివలనమనము గ్రహింపవచ్చును.

*

# 8 వ అధ్యాయము

## 1-వ భాగము

### తిరుమల దేవాలయము - పరిసరములు

జరిగిన యధ్యాయములో భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనమును గుఱించి సమగ్రముగా వివరింపబడినది. ఆ ప్రతిష్ఠాకాలములో గర్భ గృహము దానికిముందు ముఖమంటపము వీనివిచుట్టి అంతర్మండలము లేక ప్రదక్షిణము నిర్మితమైయుండనగును. ఈ గర్భగృహమునకు ముందు శయనమండపము ఆ శయనమంటపమునకుముందు నేడు స్నపనమంటపముగా పిలువబడుచున్నది నాడు 'తిరువిలాన్ కోయిల్'గా రూపొందియుండెను. అందే భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠితుఁడయ్యెను. ఇప్పటి దేవాలయ మనేక ప్రాకార గోపుర మంటపాదులతో నతి విస్తృతమయినప్రణాళిక గలిగినట్టిది. ఈ వైశిష్ట్యమునుగూర్చి ముందు చర్చింపఁబడును. దీనికి ముందుగా తిరుమల ఆలయ పరిసరములను గుఱించి యెఱుకపఱచుట ఆవశ్యకమయి యున్నది.

కాలినడకన ప్రయాణించు యాత్రికుఁడయినను, మోటారుశకటముపయి ప్రయాణించు యాత్రికుఁడయినను కొండపై దేవాలయ సమీపమునకే చేరును. దేవస్థాన విచారణకార్యాలయమును దేవస్థానధర్మ వైద్యశాల మొదటగా నితనికి గన్పడునవి. నేడు అచట పెద్దపెద్ద ఉచిత ధర్మసత్రములను దేవాలయమువారు నిర్మించినారు. కేంద్రీయ విచారణ కార్యాలయము నొకదానిని నేర్పాటుచేసిరి. అనేక వసతిగృహములు నిర్మాణమయినవి, వానికి పేటలుగా నామములుంచిరి. అవి గరుడాద్రి, నారాయణాద్రి, పాతపుష్కరిణి, ఆళ్వారుచెరువు మొదలయిన పేళ్లతో నాయాప్రదేశములను బిలుతురు. రహదారిబంగళా కలదు. వీని విషయమటుంచి యాత్రికుడు నాడు మొండిగోపురముగా పేరుబడి యే విధమ

యిన మరమ్మతులులేక పడియున్న దానిని నేడు ఆత్యాధునికముగా జీర్ణోద్ధారము గావింపబడి పైకప్పు గలిగిన గోపురమును దర్శించును. ఇది దక్షిణముఖముగా నున్నది. ఈగోపురమును దాటినతరువాత యాత్రికుఁడు తూర్పుపడమరలుగానున్న సన్నిధివీధిని గాంచును. ఇక్కడనుండి శ్రీవారి ఆలయపు ప్రధానద్వారము లేక మహాద్వార గోపురము లేక పడికావలి గోపురమును చూడగలఁడు. ఈ వీధికి తూర్పుచివరను బేడిఆంజనేయస్వామివారి ఆలయమున్నది. ఇది శ్రీవారికభిముఖముగానున్న ఆలయము. ఈ వీధికెడమచేతివైపున వేయికాళ్లమంటపమున్నది. ఇది నేడు కొంత నివాసములకును, కొంత ఆర్షసంస్కృతి సదస్సు నిర్వహణమునకు నేర్పాటుచేయబడినది. ఈ వీధి కుత్తరముగానున్న వీధిలో పెద్దజియ్యంగారిమఠము కొన్నిదుకాణము లేర్పాటుచేయబడినవి. గోపురమున కభిముఖముగా పశ్చిమముననున్న చిన్నమంటపము ప్రాచీనకాలములోనుత్సవాదుల కుపయోగించెడివారు. ఈ మంటపముపయినుండి ఆ వీధి చివరివరకు మెట్లుకలిగి ప్రధానగోపురమున కెదురుగానంటి ఉత్తర దక్షిణములుగానున్న తూర్పుమాడ వీధిలోనికి వెళ్లుటకు దిగుడు మెట్లు గలవు.

యాత్రికులు ముందుగా దేవస్థానములోని నివాస గృహములకు సంబంధించిన యుద్యోగులను కలిసిగాని లేక యితర యేర్పాటులవలన గాని ముందుగా వసతిసౌకర్యమును బొందుదురు. దీని తరువాత యాత్రికుఁడు ఆలయములో శ్రీవారిని దర్శించుటకుఁ బూర్వము పాటించవలసిన సంప్రదాయములను గూర్చి ముందు ముచ్చటించబడును. ఆలయము నకుత్తరదిశ నలువైపులా చెక్కడపు మెట్లుగలిగి, మధ్యలో మంటపమున్న యొక తటాకము గలదు. ఆ మంటపము పేరు నీరాళి మంటపము. ఆ తటాకమే 'స్వామిపుష్కరిణి' లేక 'తిరుక్కోనేరు' అనుపేరు గలిగి యున్నది. ఈ స్వామి పుష్కరిణి ప్రాశస్త్యమేమన, ముక్కోటిద్వాదశి పవిత్రదినమున మూప్పదిమూడు కోటుల పవిత్ర తీర్థ

ములు సృష్ట్యాదినాటివి ఈ పుష్కరిణీతీర్థములో స్ఠానమును పొంద యత్నించునట. ఇచట యాత్రికుఁడు దేవస్థానము వారి పురోహితుని సహాయముతో సంకల్పపూర్వక స్నానమును నిర్వర్తించుకొనును. ఇప్పుడు యాత్రికుఁడు వరాహస్వామిని జుట్టియున్న నాలుగువీధులు అనగా శ్రీవారి ఆలయమును జుట్టియున్న నాలుగువీధులతోగూడి 'మహా ప్రదక్షిణ' మాచరించును. ఉత్తర మాడవీధి నానుకొనియే, పుష్కరిణీ తీరమున అనగా పశ్చిమోత్తర పుష్కరిణీతీరములు కలియుచోట శ్రీ వరాహస్వామివారి సన్నిధియున్నది. ఈయనను 'జ్ఞానప్పిరాన్' అని గూడ పిలిచెదరు. ఈయనను ప్రధానముగా ముందుగా సేవించుటలోని యుద్దేశమేమన, వీరిని సేవించి వీరిద్వారా ఆధ్యాత్మిక జ్ఞానమునుపొంది శ్రీవారి దర్శనమునకుఁదగు అర్హతను సంపాదించుకొనుటయే. మహా ప్రదక్షిణములో నుత్తర దక్షిణ మాడవీధులు 800′ పశ్చిమమాడవీధి 900′. కాని తూర్పుమాడవీధి అనగా పుష్కరిణి నంటుకొని మహా ద్వారము నంటుకొని ఉత్తర దక్షిణములుగానున్న వీధి 750′ మాత్రమే. ఈ ప్రదేశము పడమట మిట్టగానుండి తూర్పు వైపున పల్లముగా నున్నట్టిది. ఈ వీధీ పరివృతమైయున్న భూమి యితరములగు భవన వాటికలున్న ప్రదేశముల కంటె మిగిలిన యిండ్లు వేయబడిన స్థలము కంటె సుమారుగా 15′ పల్లములో నున్నట్లు భావింప వచ్చును. ఈ భూమిచుట్టు స్థలము అన్నివైపుల మహోన్నతమేయని చెప్పవచ్చును. ఇది రమారమి 16 ఎకరముల భూమి. ఇందు శ్రీవారి ఆలయము, శ్రీ స్వామి పుష్కరిణి, పాత పుష్కరిణి, వరాహస్వామి వారి ఆలయము ఇమిడియున్నవి. ఈ పాత పుష్కరిణి అన్నది, 16 వ శతాబ్దములో నచ్యుతరాయ మహారాజుచే నిర్మాణము గావింపఁబడినది. కాని 19 వ శతాబ్దములో మహంతులచే నిది పూడ్పింపబడినది. ఇపుడు స్వామి పుష్కరిణీ ప్రదేశమునకు దేవాలయమునకు వెనుక భాగమున అనేకమైన చిన్న వీధులు, గృహములు గలవు. కాని నాడివి యన్నియు దేవాలయమున కను బంధమయిన పూఁదోఁటలు. వీని

నుండియే శ్రీవారికి నిత్యము పుష్పముల, ఫలముల సమర్పణ జరిగె డిది. లోతైన త్రవ్వకముల చేత మిక్కిలి పల్లముగాఁజేయఁబడిన స్వామివారున్న దేవాలయ ప్రదేశము పల్లమనెడి యనుభూతి దేవస్థాన పుటధికారులు గుర్తించుటతో 'ఉచ్చియల్‌నిన్‌ఱాన్' (కొండకోనపైనున్న స్వామి) అను పేరును 'మలైకునియనిన్ఱాన్' (కొంతవంగిన ప్రదేశ మున నిలిచినస్వామి) గా మార్చినట్లు కన్పించుచున్నది. మొత్తము 16 ఎకరముల స్థలములో శ్రీవారి ఆలయమే 2.20 ఎకరములు ఆక్ర మించియున్నది. శ్రీ స్వామి పుష్కరిణి 1.50 ఎకరములు, పాత పుష్కరిణి 2.50 ఎకరములు, మిగిలిన పది ఎకరములు అన్ని సందుల తోను వానిలోని యిండ్లతోను, మఠములతోను ఆవరింపబడియున్నది. ఇవి యన్నియు పూర్వము స్వామివారి కైంకర్యమునకు సమర్పింప బడెడి పుష్పఫల భరితములగు పూఁదోఁటలు. ఇప్పుడు దక్షిణమాడ వీధిలో దక్షిణ ముఖముగా గల అహోబిల మఠము పూర్వము అనగా 14వ శతాబ్దముల ప్రాంతములో మఠముతో నున్న పూఁదోఁటయే. నాడు దీనికి 'వన శఠగోప తిరునందవనమ్' అని పేరు.

ఈ ఆలయావరణ ప్రాముఖ్యమేమన, 10 వ శతాబ్దము చివరి భాగములో తిరుమల నంబి నివాసమీవీధి మొదటిలోనుండినది. ఇది మొదటగాఁగట్టఁబడిన గృహమనవచ్చును. రాతి మంటపము చుట్టును మట్టిగోడలతో కప్పబడి, దక్షిణమాడవీధిలో ఉత్తరపువైపు ముఖముగా నున్నట్టిది. ఈ యింటికి సమీపముననే ఉత్సవ దినములలో శ్రీవారి ఉత్సవమూర్తి మొదటగా నాగి వేదపారాయణము ప్రబంధ పారాయణ మును ప్రారంభింపఁబడి శ్రీవారి ఆశీస్సులతో బయలుదేరును. వన శఠగోపన్ మఠము, లేక, అహోబిల మఠము ఈ వీధిలోనే కొంత దూరము తర్వాత పడమటగా దక్షిణ ముఖముతోనున్నది. ఈ వీధిలోనే ప్రాత బడ్డవియగు ఆచార్య పురుషుల గృహములను కొన్ని గలవు.

2) దక్షిణమాడవీధి, పశ్చిమమాడవీధి కలియుచోట శ్రీవారి పూలతోఁట, 'ఇల్లు' గలదు. ఇచటనే శ్రీమద్రామానుజుల శిష్యుఁడును ప్రఖ్యాతి నొందిన అనంతాళ్వారు 11 వ శతాబ్దపు టంతమున నివసించిరని తెలియుచున్నది. ఇచట వాయవ్య దిశగా నున్న త్రోవ చంద్రగిరినుండి వచ్చు కాలిబాటను కలుపును. ఈ కాలిబాట, దీనినుండి వెడలిన త్రోవ కలియుచోట నొక మంటపము కలదు.

3) పశ్చిమమాడవీధిలో అనేక సత్రములు తూర్పువైపు మొగముగా నుండి పడమటన నెలకొనియున్నవి. ఉదా: మైసూరు మహారాజా వారి సత్రము, పూర్వము పిఠాపురం రాజావారి సత్రము (ఇది ఇప్పుడు దేవస్థానమువారే యాజమాన్యము వహించి యున్నారు). నూత్నముగా నెలకొల్పబడిన వైఖానసాశ్రమము, వసంత మంటపము, ఆర్యవైశ్య సత్రము. ఇంక ఈ వీధిలో నూత్నముగా నెలకొల్పబడిన మఠములును గలవు. కొందఱు ఆచార్య పురుషుల గృహములు, తిరుకనూరు సభవారి వసతి ఈ వీధిలోనే గలదు. క్రీ. శ. 1843 వ సంవత్సరము తరువాత హాత్తీరాంజీ మఠము, వారి మహంతులు, దేవాలయపు విచారణ కర్తలుకూడ నగుటతో అధికమగు స్థలములు వారి వశములో నుండినవి. దక్షిణమాడ వీధిలోను ఇంకను నితర వీధులలోనుగల రాతిమంటపములు ప్రాచీనములు. ఇవి తరువాత మట్టిగోడలు స్తంభముల నడుమ నమర్పబడిన వసతి గృహములుగా రూపొందినవని గుర్తుంచుకొనుట అవసరము. ఇవి దేవాలయాధికారులచే నిర్మాణము గావింపఁబడి సేవకులకుచితముగా నిచ్చిన నివేశనములుగా నూహింప వచ్చును.

4) ఉత్తరమాడవీధిలో శ్రీస్వామి పుష్కరిణి దాని వెనుక పాత పుష్కరిణి విశాల స్థలములుగా నెన్నవచ్చును. ఈ వీధి కిరువైపుల శ్రీవారి వైఖానసార్చక స్వాముల నివేశనములుగలవు.

శ్రీస్వామి పుష్కరిణీ తీరమున వాయవ్య దిశగా అర్చక నివేశనముల సమీపమున శ్రీవరాహస్వామి సన్నిధి యున్నది. క్రీ. శ. 1524 వ సంవత్సరములో శ్రీమాన్ వ్యాసతీర్థ శ్రీపాద ఉడైయార్‌కు శ్రీ కృష్ణ దేవరాయిలవారొక అర్చకునినుండి నివేశన స్థలమును స్వాధీనము చేసికొని మధ్వ మఠమును నిర్మించుటకుగాను బహూకరించెను. దీని నానుకొనియే భారతీయ తొలి గవర్నరు జనరలు, బహు ప్రజ్ఞా వంతుఁడునగు స్వర్గీయ చక్రవర్తుల రాజగోపాలాచారిగారి నివాస ముండెనట. ఈ రెండు వీధుల ననగా తూర్పుమాడవీధి ఉత్తర మాడవీధులు కలియుచోటనే పడమరనుండి తూర్పునకు పల్లముగా నుండుట వలన శ్రీవారి కొయ్య రథము ఉత్సవమునందు ఏమాత్రము చాకచక్యములేక నడిపినచో మిక్కిలి భయంకరమయిన ప్రమాదమును కల్గించును. ఇది అతి కష్టము మీద కేవలము శ్రీవారి అనుగ్రహము చేతనే నిచట వచ్చెడి వేగము నిరోధింప వీలగును. ఈశాన్య దిక్కు ననేగల 'కత్తేరు' మంటపముననే విజయనగరరాజుల కాలములో 'ఊంజల్ ఉత్సవములు' (ఊయల) జరుగుచుండెడివి. వాయవ్యదిశగా బోవు త్రోవ భాకరాపేటనుండి దేవాలయమునకుగల త్రోవ. ఈ త్రోవ వచ్చి కొండపయి కలియును. ఈశాన్య దిశలో మామండూరు త్రోవ వచ్చి కలియును. ఆకాశగంగ, పాపవినాశనమునకు నీదిశాత్రోవయే గమ్యము.

5) తూర్పు మాడవీధిలో శ్రీస్వామి పుష్కరిణి, దాని ప్రక్కనే శ్రీవారి ఆలయ ముఖద్వారము పడమట దిశగా నుండును. ఈ వీధిన గూడ కొందఱాచార్య పురుషుల నివేశనములు గలవు. నేడిది ప్రధాన ముగా నంగడులుండుతావు అయినది. ఇచటనే బ్రహ్మతంత్రస్వామి మఠము (పరకాల మఠము) గలదు. ఇచటనే దేవస్థానపు దివాణ మంటపము, రథమునకు నివేశనము, వాహన మంటపము మొదలయిన వన్నియు గలవు. దక్షిణపు కొనవైపున వేయి స్తంభముల మంట

పశ్చిమ పడమర భాగమును గాంచనగును. ఇచట ముఖ్యముగాఁజెప్ప వలసిన దేమన తూర్పుమాడవీధికంటె తూర్పు పడమరలుగా నున్న సన్నిధివీధి మిక్కిలి యిరుకై అంగడులతో కిక్కిరిసియున్నది. కొంత కాలము క్రితమేవిధముగా తూర్పుమాడ వీధిలో నెట్లు దేవస్థానపుటధి కారులు అంగడులను విశేష శ్రమతో తొలగించిరో యిచటను అట్టి కృషియే దేవస్థానపు టధికారులు యత్నింపవలసి యున్నది. ఈ స్వామి పుష్కరిణీ తీరమును కడుచక్కగా నిర్మించినది సాళువ నరసింహరాయలు, ఇతరభక్తులు. ప్లవోత్సవ సందర్శనార్థమయి యీ యేర్పాటులు గావింపబడినవి.

## వేయి స్తంభముల మంటపము

ఇక్కడగల వేయికాళ్ళమంటపము, పొడవు వెడల్పుల కొలతలచే దీర్ఘ చతురస్రాకృతి. దీనికి పడమరభాగము తూర్పుమాడ వీధికిని ఉత్తరభాగము సన్నిధివీధికిని గలుపబడినది. తూర్పున క్రొత్తగాజీర్ణోద్ధారము గావింపఁబడిన గోపురమునకుఁజేరు త్రోవకుఁగలుపఁబడినది. హత్తీరాంజీమఠము మిట్టపయి వేయిస్తంభముల మంటపముతో సమాన మయిన ఎత్తుగల ప్రదేశములో నెలకొనియున్నది.

గోపురముల నిర్మాణము, ప్రాకారముల గోడలు, మంటపముల నిర్మాణములకుగాను క్రీ. శ. 1472 సం॥లో సాళువ నరసింగరాయలు దానమిచ్చిన దుర్గసముద్ర గ్రామముపై వచ్చిన ఆదాయముండిను నిర్మింపబడినది. వీని నిర్మాణమునకు మూలమగు నుద్దేశము నేడు పూర్తిగా అనుసరింపబడి యుండలేదు. ఇందు ఆర్షసంస్కృతి సదస్సును నేడు దేవస్థానమువారు ఒకభాగములోనిర్వహించుచున్నారు.

## శ్రీ హత్తిరాంజీమఠము

శ్రీవారి ఆలయముతో మతపరముగా నెట్టి సంబంధము లేనప్పటికి ఈ మఠము తిరుమలలో మిక్కిలి ప్రాముఖ్యము వహించిన మఠముగానే చెప్పవలయును. అయితే దీని ప్రాచుర్య ప్రాముఖ్యములు 1933 వ సంవత్సరములో విచారణకర్త మహంతువారిస్థానములో ఎండోమెంటు కమిటీవారి కమిటీస్థాయి నిర్వహణము ప్రవేశపెట్టబడిన నాటినుండి మఱుగున బడిపోయినది. అయినను మహంతు ఈ కమిటీలో వంశపారంపర్యపు సభ్యుని హోదా నెఱపుచు గణనీయమగు అధికారము నెఱపఁజొచ్చెను. క్రీ. శ. 1843 వ సంవత్సమునుండి విచారణ కర్తలుగా నున్న మహంతులు దేవాలయ నిర్వహణబాధ్యతను స్వీకరించినప్పటినుండి అనేకయవకతవక వ్యవహారములు, అసమర్థపు పరిపాలనము, దేవాలయనిధుల దుర్వినియోగము మొదలగు కృత్యములకు పేరెన్నిక గాంచిరి. 1966 చట్టములో వీరికిఁగల వంశపారంపర్యపు హక్కును దొలఁగించిరి.

క్రీ. శ. 1933 లో మహంతుల స్థానమున దేవాలయ కార్యకలాపములను నిర్వహించుటకు గవర్నమెంటువారు ఒక ధర్మకర్తలబోర్డు నేర్పాటుగావించిరి. ఇది దేవాలయనిధులను వేరు పనులకు వినియోగించుటకు నిషేధించుటలో నెట్టిన్యాయ సంబంధములయిన అధికారము పొందియుండలేదు. 'దళారీలు' వారి వారి వ్యాపారమును చాటుగానే గాకబహిర్గతముగనే సాగించుచుండిరి. సామాన్యమయిన, అమాయకుడయిన యాత్రికుఁడు 'దళారీల' చే నొత్తిడిచేయఁబడి మఠమునకు గొనిపోవఁబడును. మఠమునకుఁ గొంతధనమును దానమిచ్చుటచే శ్రీవారికి మిక్కిలి తృప్తి గల్గించినవాడగునని యాత్రికుని విశ్వసింపఁజేసి ఎంతో కొంతధనమును మఠమున కిప్పించెదరు.

పూర్వము తిరుపతి, తిరుమలయాత్రలు మిగుల కష్టములు, బాధలు గలిగియుండెడివి. ధనవంతులు యాత్ర కొనసాగించుచో వారి మంది మార్బలములను వెంటగొని, రక్షణార్థమై యొకరికొకరు సహాయముగా వెళ్ళెడివారు. ఢిల్లీ సుల్తాను, అతని ప్రతినిధులయిన నబాబులు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు—వారి పోరాట కాలములోని రాజకీయ పరిస్థితి, విజయనగరరాజుల కాలములోని రాజకీయపరిస్థితికంటె మిక్కిలి హీనముగానుండెను. 1 వ అధ్యాయములో యాత్రికులను బ్రహ్మోత్సవము సందర్శించుటకు వీలుగా నేవిధముగా నాంగ్లేయులు హిందూసిపాయిలను నియమించి రక్షించినది చర్చింపబడినది. ముస్లిములుగాని, ఆంగ్లేయులుగాని హిందువుల మతవిశ్వాసమునకు భిన్నముగా నెట్టి పరిస్థితిలోనుకొండపయికి అడుగిడియుండలేదు. క్రీ. శ. 1843 లో దేవాలయ నిర్వహణము మహంతులచేతిలో పడిన యనంతరము ప్రాంత సంప్రదాయములనుండి వైదొలఁగవలసిన పరిస్థితియేర్పడెను. మహంతుల మఠముల పరిమితిలోనున్న ప్రదేశములలో నయితము జరిగిన దురన్యాయములు హెచ్చగుట, మఠమువారు హెచ్చురుసుమును వసూలుచేయుట, ప్రభుత్వమువారు దుర్నీతిపరులను పట్టి శిక్షించుటలో మహంతు మఠము వారెట్టి సహకార మీయకుండుట—ఇవి ప్రభుత్వము వారిచే నొక పోలీసు కేంద్రమును క్రీ. శ. 1872 లో స్థాపించి న్యాయ సంరక్షణముకు చేయుట వీలుకల్పించెను. న్యాయాధికార పదవులుగల ఆంగ్లేయాధికారులు, పోలీసువారు, ఎక్సైజువారు కొండపయికెక్కుట కనుమతింపఁబడిరి. ఇతరఅధికారులెవ్వరికి, హిందువులు గానివారికి ప్రవేశము కల్పింపబడలేదు. అయితే మహంతు విచక్షణాధికారము పయి నితరుల విషయమును సమయమునుబట్టి ఆలోచింపఁ బడెడిది.

నేడున్న రహదారి బంగళా మొదటగా ఆంగ్లేయాధికారులలో రాష్ట్రగవర్నరుగారి నుద్దేశించి నిర్మితమయినట్టిది. దేవస్థానము కమిటీవారిచే నీ బంగళా అత్యాధునిక స్థాయికి తేఁబడినది. సంప్ర

దాయము ప్రకార మేపర్వతము సకల పాపములను దహించివేయునో ఆ పర్వతముపైననే అనేకమరన్యాయములు జరుగుచున్నవి. ఒక ఆంగ్లేయపరిపాలనాధికారికిని స్వాగతమిచ్చినది. ఈ రహదారి బంగళా ఒక రమణీయమయిన ప్రదేశములో నిర్మింపబడి ఆహ్లాదకరమగు అనంతాళ్వారు చెఱువుపయినుండి వచ్చెడు శీతలవాయువులతో నింప బడుచు దూరముగాఁ జంద్రగిరి దుర్గముఁకుఁ ద్రోవచూపించుచు అత్యానందదాయకముగా యాత్రికులకు దర్శన మొసంగును.

*

# 8-వ అధ్యాయము

## (2-వ భాగము)

## తిరుమల దేవాలయము — గోపుర ప్రాకారములు, ప్రదక్షిణములు — ఇతరమంటపములు.

దేవాలయ మన్నివైపుల మూడు ప్రాకారములచే నావరింపఁబడి యున్నది. అనగా దేవాలయము మూడు ఆవరణలతో గూడియున్న దని చెప్పవచ్చును. ఈ మూడు ఆవరణములలో మొదటి యావర ణముకన్న రెండవయావరణము, రెండవయావరణముకంటె మూఁడవ యావరణము విస్తృతిలో నుత్తరోత్తరాధికము. ప్రతిప్రాకారములోనికి నొకే ప్రవేశద్వారము, అదియును తూర్పువైపునకే గలదు. బయటి రెండు ప్రాకారముల ప్రధానద్వారములవద్ద గోపురములు నిర్మింపఁ బడినవి. ప్రతి ప్రాకారమునకు మధ్యగల స్థలమును ప్రదక్షిణమనియు నంతర్మండలమనియు, ప్రాకారావృత ప్రదేశములనియు బిలుతురు. ఈ పేళ్ళు ఆగమ శాస్త్రములును పేర్కొన్నట్టివియే. గర్భగృహము నకుఁ జుట్టియున్న ప్రదక్షిణము 8 శతాబ్దములక్రితమే మూసివేయ బడినది. భక్తుల ప్రదక్షిణ ప్రయోజనమునకై నేటికిని సంవత్సర ములో వైకుంఠపకాదశి, ముక్కోటిద్వాదశి దినములలో మాత్రమే తెఱచి యుంచుదురు. సంవత్సరములో మిగిలిన యన్నిదినములు భక్తులకొఱకై దీని వినియోగము లేదు.

మహాప్రదక్షిణమును అనగా తూర్పు, పశ్చిమ, దక్షిణ ఉత్తర మాడవీధుల ప్రదక్షిణము గావించిన తరువాత యాత్రికుఁడు ప్రధాన ప్రవేశద్వారమును బ్రవేశించును. సరిగా నీ ప్రధాన గోపురమునకు 120′ లోపలకు అంతరప్రాకారము దాని గోపురముతో రెండవ ప్రవేశ ద్వారమున్నది. ఈ గోపురములనుండి 4′ మందముతో మొత్తము

దేవాలయమునే కప్పివేయుటకుఁ జాలినంత ఎత్తుతో ప్రాకారములు నిర్మింపఁబడినవి.

## 1. మహాద్వారగోపురము

ప్రధాన ద్వారమువద్ద నిర్మింపఁబడిన యున్నత గోపురమునే మహాద్వార గోపురమనియందురు. దీనినే 'పడికావలి' గోపురమనియు నందురు. ద్వారమునకు రెండు వయిపుల ద్వారభిత్తికలు చెక్కడపు రాతితో నేర్పాటుచేయఁబడినట్టివి. ఇవి ప్రాచీన సంప్రదాయానుసారము మలచబడినవి. రెండు పెద్ద కొయ్యబోరుతలుపులు తయారుచేయబడి వానికి యినుప గుబ్బలమరించబడినవి. దేవాలయ కార్యక్రమములు పూర్తియయిన తరువాత రాత్రిపూట నీ తలుపులు మూయబడును. లోపలి నుండి తాళమువేయుట దీని ప్రత్యేకత. కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భములలో పెద్ద తలుపులు తీయకనే యెడమవయిపునున్న యీ తలుపు లోననే యమర్చబడిన చిన్నతలుపు తీయబడును. దేవాలయ నిర్వహణావసరమున వచ్చెడి యుద్యోగులు, అర్చకులకు మాత్రమే దీనిలోనికి ప్రవేశముండును. ప్రాకారము గోడలు తూర్పుపడమరలు 414', ఉత్తర దక్షిణములు 263' పొడవు నాక్రమించియున్నవి.

ఈ గోపుర నిర్మాణము, ప్రాకార నిర్మాణము తెలుపునట్టి శాసనములేవియునులేవు. వీని నిర్మాణకాలమును గుఱించి కొంత యూహ చేయ వీలుకలుగును. బోరుతలుపు నానుకొనియున్న గోడకు కుడివైపున త్రిభువన చక్రవర్తి 12 వ సంవత్సరపు పరిపాలనా కాలమున శ్రీ యాదవరాయ వీరనరసింగదేవర 62 గోవులు, 2 కోడెలును శ్రీవారి ఆలయములో రెండు అఖండ దీపారాధనముల నిమిత్తమయి దానమిచ్చినట్లు వ్రాయబడియున్నది. ఇది క్రీ. శ 1217 సంవత్సరమునకు సమమగు సంవత్సరము. ఈ శాసనము వ్రాయబడిన ప్రదేశమాధారముగా నీ బాహ్య గోపురమానాటికే నెలకొనియున్నట్లు నిశ్చయించుకొన

వచ్చును. దీని తరువాత కాలములో వ్రాయబడిన యొక శాసనమున్నది. అది సంస్కృత భాషతోకలదు. దీనిలో వీరనృసింహ దేవనృపతి తన శత్రువులను జయించి ప్రసిద్ధుఁడయిన కారణముగా తనకు లభించిన బిరుదములనన్నింటిని ప్రస్తుతించుకొని రాజతీవి వెలార్చెడి వస్తుసంచయ పరివేష్టితుఁడై బంగారముతో తులాభారముతూగి, ఆ బంగారముతో శ్రీవారి ఆలయమునకు బంగారుపూత వేయించి ఆ ఆలయమును మేరు శిఖరమునకెనయగు దానినిగా మెఱపించెను. ఇది క్రీ. శ. 1260 సంవత్సరము ప్రాంతము నాటిది కావచ్చును. తరువాత కాలములో వేయబడిన శాసనము లీగోపురముననే కొన్నికలవు. మొదటి అంతస్థులో వేయబడిన శాసనము వీనిలో పేర్కొనఁదగినది. క్షేమాసురుఁడను గణపతి...గ్రామబహిష్కారము చేయబడినట్లు ఈశాసనములోగలదు. ఈ శాసనము సమగ్రముగాలేని ఛిన్నశాసనము. ఈ పదములు క్రీ. శ. 1251-75 సంవత్సరముల మధ్య సుందరపాండ్యుని పాలనమును గుఱించి, ఆతని విపరీత కార్యములనుగుఱించి తెలియఁజేయుచున్నవి. ఈ శాసనకాలము క్రీ. శ. 1260 సంవత్సరముగా నూహింపవచ్చును. దీనినిబట్టి బాహ్యగోపురము 1217 వ సంవత్సరమునకు పూర్వమే నిర్మాణమయియుండుననుట స్పష్టము. క్రీ.శ. 1260 వరకు నొంటికప్పు మాత్రమే యుండెనని అప్పుడుమాత్రమే మహాద్వార గోపురపు రెండవ యంతస్థు నిర్మాణము గావింపబడి యుండెనని యూహింపనగును. ఒంటి పైకప్పుగల ఈ ప్రధానద్వారము మొదటి యాదవరాయలలో ఘట్టిదేవుఁడుగాని, రాజమల్లుఁడుగాని, లేక వీరనరసింగరాయలుగాని నిర్మించి యుండనగును. ఇక్కడగల జటావర్మ సుందరపాండ్యునకు సంబంధించిన శాసనములన్నియు లోపలిగోపురపు కుడియెడమల పునాదుల భాగములపైనున్నట్టివి. ఈయన క్రీ.శ. 1251వ సంవత్సరమునుండి దక్షిణదేశమునకు ఏకైక ప్రభువుగాఁ భావించినట్టివాఁడు. తి. తి. దేవస్థానముల శాసనసంపుటి 1 లో క్రీ. శ. 1264 వ సంవత్సరములోనున్న 51 వ శాసనములో ఈ రాజు కంచిలో సింహాసన మధిష్ఠించుటనుగూర్చి

ప్రసంగించబడినది. ఒక శాసనపు తునుక బాహ్యాగోపురపు మొదటి యంతస్థులోని గూటిలో నుండుటచేబట్టి పాండ్యుల శాసనములు తునుకలయి పోవునంతకాలమువరకు బాహ్యాగోపురపుటంతస్థుల నిర్మాణము జరిగియుండలేదనియు నా తరువాత నిర్మించిన హేతువుచేతనే యీ తునుకల నటనట సమకూర్చిరనియు తెలియుచున్నది. క్రీ. శ. 1472–1482 సంవత్సరముల మధ్యకాలములో సాళువ నరసింగ దేవుఁడు దుర్గసముద్రమను గ్రామముయొక్క సాలుసరి రాబడిని దేవాలయ ప్రాకారగోపురముల అత్యవసరపు కట్టడములకు వినియోగించుటకు శాసనము చేసెనని యిదివరకటి అధ్యాయములో ప్రసంగింపబడినది. ఆ కాలములోనే యీ యంతస్థుల నిర్మాణము జరిగియుండనగును. అంతస్థుల నిర్మాణమునకుఁ బూర్వమే ప్రాకారపుగోడలు, గోపురముల నిర్మాణము ముందుగా జరిగియున్నది.

శ్రీరంగములోని రంగనాథస్వామి ఉత్సవులు తిరుమలకుఁ జేర్చబడుటకు పూర్వమే అనగా క్రీ. శ. 1320–1330 ప్రాంతములోనే బాహ్యాగోపుర ప్రాకారములుండియుండును. దక్షిణ ప్రాకారము నానుకొనియే శ్రీరంగనాథుని సన్నిధియున్నది గనుక దీని నట్లూహింపవచ్చును. 15 వ శతాబ్దాంతమునుండి 16 వ శతాబ్దము ప్రారంభమువరకు ఈ కుడ్యములపయినెట్టి శాసనములను వ్రాయబడలేదు. ఒక సుస్పష్టమయిన విషయమిక్కడ మనము చెప్పవలెను. తూర్పువైపు ప్రాకార కుడ్యముపయి గోపురపు దక్షిణ భాగమున శ్రీకృష్ణదేవరాయల సొంతమయిన చెక్కడపుఁ బనివాడు (శాసనము చెక్కుశిల్పి) చెక్కిన శాసనమొకటి యున్నది. ఇది సంస్కృతపు భాషలో గద్యపద్యాత్మకమయి తెలుగు లిపిలో వ్రాయబడినట్టిది. ఇందులో చంద్రునినుండి యీ రాజు వంశక్రమము వ్రాయబడినది. క్రీ. శ. 1513 వ సంవత్సరములో (తి. తి. శాసనముల సంపుటి శాసనము నెం. 65) నీ చక్రవర్తిచే నొసఁగఁ బడిన దాన శాసనమునకిది యుపోద్ఘాతము. మూడుగ్రామ

ములలోని సాలుసరి రాబడిని శ్రీవారిబ్రహ్మోత్సవముల నిమిత్తమయి తనతండ్రియగు నరసనాయకుని, తల్లియగు రాజనాగమ్మగారల సంస్మృతికయి నీయబడినట్లు ఈ శాసనములోనున్నది. దీనికిఁ గన్నడ లిపిలో ననువాదము రెండవప్రాకారములోని దక్షిణకుడ్యముపయి వ్రాయబడియున్నది. రెండవ ప్రాకారము నిర్మింపబడిన చాలకాలమునకు బాహ్యప్రాకారపు కుడ్యములు శాసనములువ్రాయుట కుపయోగించినట్లు దీనివలన నిర్ణయింపనగును.

## 2. సంపంగి ప్రదక్షిణము

బాహ్యగోపుర విషయవివరణము పూర్తియైన యనంతరము శ్రీవారిని దర్శింపవచ్చిన యాత్రికుఁడు 36′ × 36′ విస్తీర్ణముగలిగినదియు, బాహ్యగోపురములోపు ననుసంధించినదియునగు పదునారు స్తంభముల మంటపములో తానున్నట్లు గ్రహించును. దీనికి ముందుగా నిట్టిదే మరియొకమంటపములోపలి గోపురము వెలుపల ననుసంధించి మొదటి మంటపమునకు 50′ దూరముననున్నది. ఈ విషయమై తరువాత ప్రస్తావింపబడును. ఈ రెండు మంటపముల నడుమగల ఖాళీస్థలము సంపంగి ప్రదక్షిణము తూర్పువైపు త్రోవయగును. ఇది తూర్పుభాగమున 120′ వెడల్పుగలిగి విశాలమయియుండి మిగిలిన మూడువైపుల 50′ వెడల్పుమాత్రమే గలిగియున్నది. ఈ ఆవరణములోని కట్టడములను గుఱించి యిపుడు ప్రస్తావింపఁబడును.

### 1. కృష్ణరాయమంటపము

ఇదికూడబాహ్యగోపురము ననుసంధించి లోపలికున్న మంటపము. ఈ మంటపములోనున్న యనేక విగ్రహములు త్రోవకిరువైపుల గోపురమునకు పడమటివైపున నానుకొని యున్నవి. ఇవియన్నియు పశ్చిమముఖములయి యున్నవి. ఈ విగ్రహములన్నియు మహారాజుల,

వారి రాణుల విగ్రహములు. ఇవి కేవలము అధఃకాయమునకు మాత్రము ధరించిన వస్త్రములుగల విగ్రహములు. దేవాలయములో దేవుని పూజార్థమై వెడలుభక్తున కుండవలసిన వస్త్రమేదియో, అదియే ఈరాజులును ధరించిరి. ఆ విధముననే ఈ విగ్రహములు నిర్మితములయినవి. గోపురపు టుత్తరదిశనుగల మూడుకంచు విగ్రహములు నిలువెత్తున నున్నవి. ఇవి శ్రీకృష్ణదేవరాయలు, తిరుమలదేవి, చిన్నాదేవులనుగా నెఱుంగదగిన విగ్రహములు. దీనిలో చక్రవర్తియగు శ్రీకృష్ణదేవ రాయల విగ్రహమునకు మలచిన కిరీటము రాజుయొక్క సూచన ననుసరించియే నిర్మితమయినట్టిదిగా దోచును. ఇట్లే దక్షిణపువైపున రాగివిగ్రహముగానున్న మొదటిది వేంకటపతిరాయలను సూచించును. మిగిలినవానిలోగల పురుషవిగ్రహము అచ్యుతరాయ మహారాజునకు చెందినది. రెండవది ఆయన రాణియగు వరదాజిఅమ్మణిది. ఇవి రెండును శిలావిగ్రహములు. ఈ రెండు శిలావిగ్రహములును దేవస్థాన శాసన పరిశీలకులు తిరుమలరాయని, ఆతని రాణి తిరుమలాంబగా గుర్తించిరి. కాని యదియంత సమ్మతముగాని నిర్ణయము.

ఈయన శాసనములేవియును ఈయన రాణితో గూడినట్టివి, శ్రీవారికి సంబంధించినవి కానరాకుండుటయే దీనికి తగిన హేతువుగాఁజెప్పవచ్చును. ఈ రాజు కిరీటమున క్రిందగల నుదుటి పయి 'వడగల' నామమున్నది. అచ్యుతరాయ మహారాజు శ్రీవైష్ణవ మతాభిమానియని చెప్పుటలో నెట్టి విప్రతిపత్తిలేదు. చంద్రగిరి కోటనుండి విముక్తుఁడయిన వెంటనే ఆతఁడు తిరుమలలోని శ్రీవారి పుష్కరిణిలో పవిత్రీకృతస్నాతుఁడయ్యెను తరువాత నీతఁడు శ్రీ భోగ శ్రీనివాసమూర్తి యభిషేక తీర్థముచేఁబ్రోక్షితుఁడయినట్లు తెలియుచున్నది. ఈయనకు మొదటిసారిగా పట్టాభిషేక మహోత్సవము తిరుమలలో శ్రీవారి ఆలయమునందే జరిగినట్లు తెలియు చున్నది. శంఖముచేత శ్రీవారి తీర్థమును ప్రోక్షించిన కార్యక్రమము

ఈయన కనువగు నాచార్య పురుషునిచే నొవర్పబడి యుండును. ఆకాలములో ఎట్టారుసొత్తై తిరుమలనంబి తోళప్పారయ్యంగారి కుమారుడగు కుమార తాతయ్యంగారు ప్రముఖమయిన వడగల సంప్రదాయము ననుసరించుచుండిన యాచార్య పురుషునిగఁ బేర్కొన వచ్చును. సహజముగ నీయనయే అచ్యుత రాయల పట్టాభిషేక కార్యక్రమమును నిర్వహించి యుండనగును. ఇచట అచ్యుతరాయ మహారాజు తాను తలంచిన పూజా విధానము ననుసరించి స్వయముగా సహస్రనామార్చనము స్వామివారికి గావించుట, అర్చక స్వామిచే నామములు చదివించుట చేసియుండెనని యైతిహ్యము గలదు. ఇదియే నిజమగుచో నీతని వైష్ణ మతాహంకార మెంతటిదో మనము నిర్ణయించుకొనగలుగుదుము. ఇటుఁగల విగ్రహ మీయన వడగల సంప్రదాయమునకుఁ జెందినట్లు తెలుపుచున్నది. ఈయనచే వేయబడిన మరియొక శాసనములో తిరుమలలో లక్ష్మీదేవి యుత్సవమును జరిగించుటను గుఱించి యున్నది. అందీతఁడు తన పేరును వీర అచ్యుత రాయలని గాక స్వామి అచ్యుత రాయలనియు, తనరాణిపేరు స్వామి అమ్మాణి దేవిగను పేర్కొనెను. శ్రీ వైష్ణవమత గౌరవార్థము నామమునకు మొదటగానుంచెడి నామకరణము 'స్వామి' అను పదము. ఈ పై చర్చననుసరించి ఈ రెండు శిలా విగ్రహములు వీర అచ్యుత రాయ మహారాజుగను, ఆయన దేవేరి 'వరదాజీఅమ్మణి' గను నిర్ణయించుకొనవచ్చును. శ్రీ కృష్ణదేవరాయ విగ్రహమునకెట్టి నామము నుదుటి పయి చెక్కఁబడియుండలేదు. అట్లే వేంకటపతి రాయలకును తిరునామమేదియు చెక్కఁబడలేదు వేంకటపతి రాయల కంఠమునుజుట్టి యొకమాల తూపొందినది. అది తామర పూసలది కావచ్చును లేదా తులసి పూసలయినను గానగును. అచ్యుత, కృష్ణదేవరాయలు వారలు కంఠమున కంటె ధరించితి. కాని శ్రీ కృష్ణదేవరాయల కంఠమధ్యమున నొక రుద్రాక్షపూసవంటిది గలదు. ధ్వజస్తంభ మంటప సమీపమున మరియొక మూడు విగ్రహములు ఉత్తర

ముఖముగా నున్నవి గలవు. ఇవి రాగి విగ్రహములు. అవి తోదరు మల్లు, వారి కుటుంబము మాతా మోహనదే, పితా బీబీ అను వారలు. ఈ విగ్రహము లిపుడు పశ్చిమ ముఖస్థములై యున్నవి.

## 3. రంగ మంటపము:

బాహ్యప్రాకారమునకు లోపల నైఋతి దిశననుసంధించు అనగా ప్రాకారపు గోడల తూర్పు దక్షిణదిశల ననుసంధించియు. కృష్ణరాయ మంటపమునకు దక్షిణముగను, గల మంటపము రంగమంటపమని యందురు. ఇది మిగులయెత్తగు పునాదిపైన నిర్మింపబడినట్టిది. దీని తూర్పు పడమరల కొలత 60' ఉత్తర దక్షిణముల కొలత 108' లును పొడవుగలిగియున్నది. దీనికి దక్షిణభాగపు చివరన 12" చతురము వైశాల్యముగల నొక చిన్న పవిత్రపుదేశము సన్నిధిగలదు. అది చాల కాలము క్రిందటనే మూయబడినది. క్రీ. శ. 1320–60 సంవత్సరముల నడిమి కాలములో శ్రీ రంగనాథుఁడు తిరుమలకు శరణార్థిగా వచ్చి నపుడు ప్రతిష్ఠింపబడిన స్థలమిదియే. ఇటనుండి శ్రీరంగనాథుని విగ్రహము తిరిగి శ్రీరంగము తరలింపఁబడిన యనంతరము ఈ సన్నిధి పూర్తిగా మూసివేయఁబడినది. ఈ మంటపమునకు తూర్పు పశ్చిమ భాగములు గిడ్డంగులుగా మార్చబడినవి. ప్రాంతీయ పాలకుఁడగు శ్రీరంగనాథ యాదవరాయలచే శ్రీరంగములోని రంగనాథుని తాత్కాలిక నివాసముకొఱకు నిర్మితము. తురుష్కుఁడగు మాలిక్ కాఫరుచే 1310-1320 ప్రాంతములో శిలావిగ్రహములను నాశమొనర్చెడు దుష్కార్యములకు బలిగానీక నిట నీ రంగమంటపమున వేంచేపుచేసి పూజాదులు చేయు చుండెడివారు. ఈ రంగమంటపములోని సన్నిధి విస్తృతిలో తక్కువ యయినదగుటచే నుత్సవమూర్తిని మాత్రమేయిటకుఁ గొనివచ్చిరని చెప్పనగును. ఆ తరువాత నిచటనే స్థానికముగా నొక శిలాబేరమును తయారు చేయించి మూలమూర్తిగా దానిని ప్రతిష్ఠించియుందురు.

ఇఁక మంటపము మాత్రము సువిశాలమగునది యగుటతో శ్రీరంగము నుండి యుత్సవమూర్తితోఁ బాంచరాత్రాగమజ్ఞులు శ్రీరంగనాథుని పూజాదుల నెరవేర్చుటకు వచ్చినవారిని భరించుటకుఁ జాలియుండెను. శ్రీవారి నర్చించు వైఖానసాగమ విధానముకంటె నిది వేరైనది గావున శ్రీరంగమునుండి వీరువచ్చియుండుటలో సామంజస్యమున్నది. ఇక్కడ శ్రీరంగనాథుని అర్చనావిధానము పాంచరాత్రమగుటచే ననేకులు శ్రీ వైష్ణవులగు వారికిందు స్థానములభించి బహువైభవముగా పూజావిధు లను నెరవేర్చియుండెడి వారనుటలో నెట్టి సందేహమున కాస్కారము లేదు. ఈ కారణముచేత శ్రీ వైఖానస విధానమునకు నూత్నమైన అనేకోత్సవములు శ్రీరంగనాథునకు జరిగించెడివన్నియు తిరుమల శ్రీవారి సన్నిధానములోను ప్రవేశపెట్టబడియుండును. శిలప్పదికార ములో వ్రాయబడినట్లుగా క్రీ. శ. 756 లో ఇట్టి బృందపూజ శ్రీరంగ ములో జరుగుచున్నట్లు తెలుపఁబడినది.

## 4. తిరుమలరాయ మంటపము

లోపలి గోపురపు ప్రాకారమునుండి బయటకు తూర్పువైపుగా 12' దూరములో మ్మరియొక సువిశాలమయిన మంటపమున్నది. ఇది తూర్పు పడమరలు 40' లును, ఉత్తర దక్షిణములకు 80' లును పొడవు కలిగియున్నది. ఇది అత్యంత విశాలమయిన మంటపము. ఇది రెండు భాగములుగానుండి రెండు వేర్వేరు కాలములందు కట్టబడి నది. దక్షిణపువైపు భాగము 40'$\times$45' పొడవు వెడల్పులు గలిగి తరువాత కట్టబడిన దానికంటె ఎత్తుగా నిర్మింపబడినది. ఇది 15 వ శతాబ్దములో నడిమి కాలమందు 'అన్నా ఊయేల తిరునాల' శ్రీవారికి జరుపబడుటకుగాను సాళువ నరసింహరాయలచే నిర్మితమయినట్టిది. తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనముల 2 వ సంపుటిలోని 79 వ శాసనము ఈ విషయమునే బేర్కొనుటచే నిదియే నరసింహరాయ

మంటపమని చెప్పుటకు హేతువగుచున్నది. మంటపము నేడున్న విధముగాఁ బెంపుచేయఁబడుటకు 16 వ శతాబ్దము చివరి భాగములోనున్న ఆరవీటి బుక్కరాజరామరాజ శ్రీరంగరాజు, తిరుమలరాజు హేతువయ్యెను. తిరుమలరాజు కాలములో నీ మంటపమందు వసంతోత్సవాద్యనేకోత్సవములు జరిగెడివి. ఈ మంటపమునందలి స్తంభములు మంచి చెక్కడపు పనితనమును గలిగియున్నవి. ప్రతి స్తంభము ఏనుగపైఁబెట్టిన వెనుక పాదములుగల గుఱ్ఱము, దానిపై నెక్కిన వీరయోధుని ప్రతిమ చిత్రింపబడినది. ప్రతి బ్రహ్మోత్సవారంభమున జరిపెడి ధ్వజారోహణ సమయములో నా కార్యక్రమమును వీక్షించుటకు శ్రీ మలయప్పస్వామివారు (ఉత్సవమూర్తులు) ఈ మంటపమున ఆస్థానమునకు వేంచేయుదురు. ఈ సందర్భమున భక్తులకు వినియోగం అచెడి ప్రసాదమును తిరుమలరాయల పొంగలి ప్రసాదమందురు. ఇది మిక్కిలి రుచ్యమయి యాత్రికులకు చవులూరించును. తిరుమలరాయ లొసంగిన దాన విషయము కనుమఱుగయ్యును నట్టి ప్రసాద నివేదనము నేటికిని బ్రహ్మోత్సవారంభ సమయమున జరుగుచునేయుండుట గమనింపదగినది. ప్రాఁతకట్టడపు మంటపము మధ్యభాగములో స్వామివారు వేంచేయుటకనువయిన రాతి సింహాసన మమరించబడినది. ఒక విధముగా ధ్వజస్తంభమంటపము ఈ మంటపము నొకవైపున తాకుచునేయున్నది. ఈ మంటపమున కీశాన్యభాగమున నొక ఎత్తు వేదికగలదు. ఆ వేదికపయిన బ్రహ్మోత్సవదినములలో నాకాశగంగా జలపాతమునుండి పవిత్రతీర్థము కనక కలశముతో గ్రహించి ఆలయపు టేనుగపయినుంచి తిరువీథుల నూరేగింపు జరిపిఱుట నా యేనుగు వంగినపుడు ఆ కలశమును శ్రీవారి అర్చకులు గ్రహింతురు. దీనికి యుత్తరపు వైపున నొక మంటపమున్నది. ఇది 42′ చతురపు మంటపము. ఇది చాల ఎత్తగు స్థలముమీఁద నిర్మాణము చేయబడినది. దీనిలో నొక గదికూడ నమర్చబడియున్నది. ఈ గదినే 'అయినా మహల్' అని పిలచెదరు. ఇదియే అద్దాలమేడ. ఇది తరు

వాత కాలములో నిర్మింపబడినది. దీనికి ముందుభాగములో నేడు దేవస్థానమువారు ప్రసాదములు విక్రయించుచున్నారు. క్రీ. శ. 1831 వ సంవత్సరములో రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారికి ఈ జిల్లాలోని పెద్ద యధికారి యొకరు వ్యాసమును సమర్పించిరి. అందులో నీ యద్దాల మహాలు పేర్కొనబడెను. ఇందు శ్రీవారి యుత్సవమూర్తులకు శయనాగారమై అద్దాలమంటపముగా నిరూపొంది యిట్టి యుత్సవము లిక్కడ జరుపబడుచుండెడివని వ్రాసెను. ఈ మంటపములోని మహాలునందు నిలువుటెత్తు అద్దములంతటను బిగింపబడియున్నవి. దాని హేతువుచే నిది యద్దాలమేడ' గా బేర్కొనబడినది.

## 5. పూల బావి

ఈ యద్దాలమేడకుత్తరపువైపున నొక దిగుడుబావి కలదు. దీనిని పూలబావియందురు. శ్రీవారి సేవార్థముపయోగింపబడిన పుష్పముల నిర్మాల్యమును నీ బావిలో పడవైచెదరు. సంప్రదాయమేమన నిక్కడ కొండపయిగల పుష్పములన్నియు శ్రీవారి సేవార్థమేగాని మానవ ఉపయోగార్థము మాత్రముకాదు. అన్ని ఆగమశాస్త్రములును దేవతా నివేదిత పుష్పములను అనుపయోగమైనంత మఱియొకచోట నిక్షిప్త పఱుపవలెనేగాని తిరుగుతావులందు పారవైచుట దోషమని చెప్పుచున్నవి. అందువలననే తిరుమలపయిన స్త్రీలుగాని పిల్లలుగాని పుష్పములను తలలందు తుఱుముకొనరు. అది దోషముగా భావింతురు.

## 6. ధ్వజస్తంభమంటపము

బ్రహ్మోత్సవ కాలములో ధ్వజారోహణోత్సవ కార్యక్రమము జరుపు సందర్భములో తగు రక్షణార్థమయి ఈ మంటపము నిర్మింపఁబడి యుండును. ఈ బ్రహ్మోత్సవములు సెప్టెంబరు మాసములో జరుగుచుండుటతో నా కాలము వర్షకాలమైనందున నిట్టి రక్షణార్థ

మేర్పాటు గావింపఁబడిన మంటప మావశ్యకమయియున్నది. లోపలి గోపురమున కెదురుగా 15' తూర్పు పశ్చిమముల కొలతకలిగి మంటపమునకు మధ్యభాగములో నీ ధ్వజస్తంభమున్నది. దానికి ముందుగా బలిపీఠమేర్పఱుపఁబడియున్నది. ఈ బలిపీఠము వైఖానసాగమ శాస్త్రానుసారమయి చెక్కడపురాతితో ధ్వజ స్తంభమునకు ముందు భాగమున క్రింద వెడల్పుగను పైకివచ్చు సరికి క్రమానుగతముగ వైశాల్యము తగ్గుచు 5½' వైశాల్యమగ్రభాగము నుండునటుల నిర్మిత మయినది. ధ్వజస్తంభము, బలిపీఠము ముందుగా రాగిరేకులతో నావరింపఁబడినవి. వానికి తరువాత బంగారపురేకుతాపడము చేయ బడినది. ఈ ధ్వజస్తంభమునకుఁగల ధ్వజపీఠము చెక్కడపు శిలతో ననుసరించబడినది, దానికిని రాగిరేకులతో ముందుగా అమరించి తరువాత బంగారపు మాలామా చేయబడినది.

ఈ రెండును లోపలి గోపురపు వెలుపలి భాగమున గానవచ్చుట, అనగా మూడవ ఆవరణములో గాననగుట, (అనగా రెండవగోపురము, మొదటిగోపురమునకు మధ్యప్రదేశము) అసామాన్యమయినవిషయము. ప్రాథమికముగా నీ దేవాలయము ఏకావరణావృతము అనగా గర్భగృహమును జుట్టియున్న యొక ఆవరణమేతప్ప ప్రాచీన కాలములో నిన్నియావరణములులేవు. వైఖానసాగమ సంప్రదాయానుసారముగా ప్రధానమైన గర్భగృహము దానికిగల ప్రథమావరణమునందే గరుత్మంతుఁడు, దానివెంట ధ్వజము దానివెంట బలిపీఠము నుండవలయును. మొదటిఆవరణములో ముందరిభాగమును నాలుగు భాగములుగాచేసినచో రెండవభాగములో గరుత్మంతుఁడు, ధ్వజస్తంభములస్థానములువచ్చును. మూడవ సమభాగములో నుండునది బలిపీఠము. రెండవ యావరణము గూడ నున్న ఆలయములందు లోపలి గోపురమునకు మొదటి ప్రాకారమునకుగల మధ్యభాగమును నాలుగు సమభాగములుచేసి గరుడుని ద్వితీయ సమభాగములోను, ఆవరణములోని మూడవ సమభాగములో

ధ్వజమును బలిపీఠమును నుంచవలెను. రెండవ అవరణము శ్రీవారి ఆలయములో క్రీ. శ. 1190 సంవత్సరము ప్రాంతములో నిర్మించబడినది. క్రీ. శ. 1417 సంవత్సరము ప్రాంతములో తిరుమామణి మంటపము నిర్మింపబడునంతదనుక ధ్వజస్తంభము బలిపీఠముకూడ రెండవ యావరణములోనే నుండియుండును. కాని తిరుమామణి మంటపము కట్టుటతో స్థలము చాలినంత లేకపోవుటతో ధ్వజ, బలిపీఠముల రెండును మూడవ యావరణములోనికి మార్చబడియుండును. వైఖానసాగమములందు వీనికి కనీసావకాశముక్రింద స్థానమిచ్చియున్నారు. కాని స్థానముమాత్రము మూడవ సమభాగములో నుండవలెనుగాని నేడున్నట్లుగా ప్రథమభాగములో మాత్రముండుట శాస్త్రవిరుద్ధమే.

## సంపంగి ప్రదక్షిణములోని యితరదిశలు

సంపంగి ప్రదక్షిణములోని పూర్వభాగమునుగురించి తెలిసికొంటిమి. ఇక దక్షిణ పశ్చిమోత్తర దిశలయందున్న విశేషములను గమనింతము. ప్రాకారకుడ్య నిర్మాణములతో నివి యారు బయలు స్థలములయినవి. కాలక్రమమున ఈ ప్రాకారకుడ్యముల నానుకొని యెత్తైన పునాదులతో స్తంభయుతముగా మంటపాకృతులుగల శాలలు నిర్మింపబడినవి. దక్షిణపువైపునగల శాలలు 17′ నుండి 18′ వెడల్పు గలిగియున్నవి. 30′ వెడల్పు గల ప్రదేశము ప్రదక్షిణమునకు వదలబడినది. ఇప్పుడొక దక్షిణపు వైపునగల ప్రదేశమున శాలలు నిర్మించి ఆర్జితసేవలు చేయించు దాతలు వేచియుండు స్థలముగా మార్పుచేసియున్నారు. ఇంక శాలా మంటపములు ఇటీవలగదులుగా నేర్పాటుచబడియందు దేవాలయోపకరణములు, కొన్ని రథమునకు సంబంధించినవి తెప్పలకు సంబంధించిన సామానుల నుంచెడి గదులుగా రూపొందింపబడినవి. పడమట వైపున మూడు వరుసలుగలిగిన స్తంభములతో నిర్మితమయిన శాల లున్నవి. శాల వెడల్పు పడమటివైపున 26′లు,

ఇందులో చాలభాగము దేవస్థానపుఉగ్రాణము(గిడ్డంగులు)గా మార్పు చేయబడినది. ఇందు శ్రీవారికి ప్రసాదములు తయారుచేయుటకు అన్న ప్రసాదములకు వలయు వస్తు సంభారములన్నియు నిలువచేయబడి యున్నవి. అనగా బియ్యము, పప్పులు, నేయి, బెల్లము, పంచదార, నూనెలు మొదలగు నవి నిలవయుంచబడును. ఇవి సామాన్యముగా టెండరులు పిలువబడి, టోకుగా కొని నిలువయుంచబడును. ఇచట సరకులను పర్యవేక్షించు దాని నిటీవలివరకు 'పారుపత్యదారు' పదవి స్వీకరించువారు నిర్వహించిరి. తరువాత ఈ పదవికంటె తక్కువ దియగు 'పోటుఇన్స్పెక్టర్లు' దీనిని పర్యవేక్షించుచున్నారు. మొదటగా నీ పర్యవేక్షణ క్రీ. శ. 1390 ప్రాంతములో జియ్యంగార్లచే జరుపబడినది. అపుడు యీ పదవి జియ్యరుగారికి అనువర్తింప జేయుచు 'కోయిల్ కెల్వి' అను పేరుతో పిలువబడెడిది. ఉగ్రాణములో వస్తువులు నాణ్యమును బరిశీలించుట, వానిని సక్రమముగా నిత్యము కావలసినంతవరకు సమకూర్చుట నీయుద్యోగి విధులు. ఈయన యనుమతి లేనిదే యే వస్తువు స్వీకరించుటగాని, దత్తము చేయుటగాని జరుగ వీలులేదు.

క్రీ. శ. 1831 వ సంవత్సరములో రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారికి సమర్పింపబడిన వ్యాసములో జియ్యంగారు, తన శిష్యులను సహాయముగొని దేవస్థానపు పారుపత్యదారు (దేవస్థానపు ప్రధానాధికారి) ఉత్తరువు మేరకు ఉగ్రాణాధికారిగా నుండెనని వ్రాయబడినది. నేడు పారుపత్యదారువంటి యున్నతోద్యోగి 'పేష్కారు' పదవి గలదు. ఉత్తరపు వైపున గల శాలా మంటపముగూడ ననేక గదులతో గలదు. ఇటగల పెద్దశాలలో రామానుజ కూటమున్నది. ఇందులో తయారు చేయబడిన ప్రసాదములో కొంత భాగము యాత్రికులకుచితముగా భోజనముగా సమకూర్చబడుచున్నది. దీని ప్రక్కనున్నదియే 'పాడి పోటు'. ఇచటనే దేవాలయములోని శ్రీవారికి సమర్పించెడి అన్ని ప్రసాదములు తయారుచేయు విభాగము. దీనికి ప్రక్కగల ప్రదేశ

ములో శ్రీవారికి సమర్పించెడి పూలదండలు ధ్రువబేరమునకు సరిగా నమరియుండెడి విధముగా తయారుచేయబడును. ఇతర దేవతలను గూడ (ఉత్సవ, స్నపన, బలి బేరములకు) నమరియుండెడి కొలతలతో తయారుచేయబడును. దీనిని 'యామునత్తురై' అను పేరుతో పిల చెదరు. యామునాచార్యుల కాలములో నీ విధమయిన పుష్పమాలా సమర్పణ కార్యక్రమము జరుగుట నారంభింపబడియున్నందున దీని కిట్టి పేరమరియున్నది. దీని ప్రక్కనున్నగది తెప్పకు సంబంధించిన వస్తు సముదాయముతోనున్నది. ఇక్కడనేడు ప్రసాదముల విక్రయిం చెడి స్థలముగా దేవస్థానమువారు అమరించియున్నారు. ఈ శాల మంటపములు శ్రీవారికి తిరు వీధ్యుత్సవము వర్షాదులచే నాటంక పఱుప బడినప్పుడు ఈ మంటపములలో నుత్సవములను జరిగించెడి యేర్పాటు లక్ష్యముతో నిర్మింపబడినట్టివి. అంతేగాక, యాత్రికులు విపరీత మయిన శీతబాధ నెదుర్కొన వలసివచ్చుచో నీ మంటపములందు వారు తలదాచుకొన వీలయ్యెడిది. నేడనేక సత్రములు గృహములు, మరి యితరములగు సదుపాయములు హెచ్చగుటతో వీని యావశ్యకత లేకపోయినది. ఉత్సవ ప్రయోజనముకూడ యిటనెరవేరుట లేదనెడి విషయము నిర్వివాదాంశము.

## 7. సంపంగి ప్రదక్షిణములోని సాళువ నరసింగరాయని నాలుగు మంటపములు.

ఈ సంపంగి ప్రదక్షిణములో నాలుగు మూలల నాలుగు మంట పములున్నవి. ఇవి చతురముగానుండిన చతురస్ర మంటపములు. నాలుగు స్తంభములతో నిర్మింపబడిన యీ నాలుగు మంటపములు, కొల తలు 10′ చతురము కలిగినట్టివి. ఇవి క్రీ. శ. 1470 సంవత్సరములో సాళువ నరసింహరాయలుచే తనపేర, రాణిపేర తన యిరువుర కుమా రుల పేర నిర్మాణము చేయబడినవి. శ్రీవారి యుత్సవ మూర్తులు

ప్రతి యుత్సవములోను నీ నాలుగు మంటపములలోను ఆస్థానము జరిగి ప్రతి మంటపములోను ప్రసాదములు నివేదన గావింపబడిన యనంతర మక్కడి కక్కడే ప్రసాదములు భక్తులకు వినియోగము చేయబడెడివి. ఈరోజునకును యుగాది దినమాదిగా నలుబది దినములు జరిగెడి వసంతోత్సవములలో నీ మంటపము లీ కార్యార్థమై వినియోగపడుచున్నవి. ఈ ప్రదక్షిణమును తమిళ శాసనములో 'సంబగచ్చుట్రు' అని తమిళములోఁ బేర్కొనఁబడినది. తమిళములో 'సంబగము' నకు చంపకము, సంపెగ అనునవి సమానార్థకములు. పూర్వమిచ్చట యనేక సంపెంగ వృక్షములుండి నిత్యము శ్రీవారి కీ సంపెంగ పుష్పముల యలంకరణము జరిగి యుండుటచే ఈ ప్రదక్షిణమునకీపేరు గలిగి యుండును. శ్రీ కృష్ణ దేవరాయ మహారాజు 'ఆముక్తమాల్యద' అన్న కావ్యమును రచించెను. అట్టి కావ్యము ఆంధ్రమునందు మఱియొకటి లేదన్నట్లుగా, రాదన్నట్లుగా రచించెను. దానిలో శ్రీ 'విల్లిపుత్తూరు' నగర వర్ణనము చేసెను. అందు దేవాలయము చుట్టును సంపెగ వృక్షములున్నట్లు వర్ణించెను.

చ. మలయపుగాలి రేలు వనమాలి విమాన పతాక ఘల్లుమం
చులియఁ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కిమి
న్నులము తదీయ హేమవరణాంచల చంపక శాఖలందుఁబ
క్షులు రొదనేయ, వేగెనని కూడుదు రల్కలు దీఱి దంపతుల్

ఈయన తిరుమల శ్రీవారి ఆలయములోని చంపక వృక్షములను దృష్టినిడు కొనియే రచెంచెనని నా భావము.

## రెండవ గోపురము

యాత్రికుఁడు సంపంగి ప్రదక్షిణమును పూర్తిచేసిన యనంతరము రెండవ గోపుర ద్వారము కడకు వచ్చును. ఈ గోపురము

యొక్క నేల కొలతలు తూర్పు పశ్చిమముల వైపు 24′, ఉత్తర దక్షిణముల వైపు 36′ నున్నవి. ద్వారము వెడల్పు 9′ కలదు. ఆకృతిలో నిది పెద్ద గోపురముకంటె చిన్నది. దీని నంటిన ప్రాకారములు చెక్కడపు రాతితో నిర్మింపబడినవి. ఈ గోడల మందము 3′ లు గలిగియున్నవి. ఈ గోడల కిరువైపుల ననేక శాసనములు గలవు. పునాది కిరువైపులను గోపురము గోడల పయినను గూడ శాసనములున్నవి. ప్రాచీన శాసనములన్నియు పునాది కట్టడము పయినను, గోపుర కుడ్యముల పయినను, తరువాత శాసనములన్నియు లోపలి, వెలుపలి ప్రాకారపు గోడల పయిననున్నవి. వెలుపలి ప్రాకారపు గోడల పయినగల శాసనములు 15, 16 వ శతాబ్దముల నాటివి.

ఈ గోపుర నిర్మాణ కాలపు ప్రసక్తి యేశాసనములందును లేదు కాని యీ గోపురము యొక్క పునాది పయినగల శాసనములనుబట్టి, గోపురముపైనగల శాసనములనుబట్టి, అంత నిర్దుష్టముగా గాకున్నను ప్రాయశః వీని నిర్మాణ కాలమును మన మూహించు కొనవచ్చును. కాని అసలు చిక్కు ఏమన ఈ శాసనము లన్నియు నసమగ్రములు, మరికొన్ని ఛిద్రములు. అతి ప్రాథమిక మయిన సమగ్ర శాసనము గోపురముయొక్క దక్షిణపు పునాది భాగమున లోపలి ఎడమ వైపున గలదు. ఈ శాసనము తిరుక్కళత్తి దేవ మహారాజు 19 వ సంవత్సరపు పరిపాలనా కాలము నాటిది. దీనిలో నీయన 'కుడవూరు' గ్రామముపై వచ్చు రాబడి మొత్తమును శ్రీవారి నిత్యారాధనమునకు, అన్న ప్రసాదముల నివేదనమునకు గాను దాన శాసనమును వ్రాయించెను. మరిరెండితర శాసనములలో నొకటి వీరనరసింగ యాదవ రాజుల 34 వ సంవత్సరము పరిపాలనాకాలము నాటిది. రెండవ యసమగ్రపు శాసనములో విక్రమశకము పేర్కొనబడినది. వెలుపలి ప్రాకారపు ఉత్తర భాగమునగల పునాదిరాయిపై చెక్కబడిన శాసనములో ఒకానొక గ్రామము (గ్రామముపేరు చెదరిపోయినది) వీర

నరసింగ నయనార్‌పిళ్లై దానముచేసిన విషయము పేర్కొనఁబడినది. ఇది 1220-21 వ సంవత్సరమునకు సమమగు సంవత్సరము. క్రీ శ. 1209 వ సంవత్సరమునాటికి లోపలి గోపురము నిర్మాణము జరిగినట్లుగా మనము నిశ్చయించుకొనవచ్చును. అనేక శాసనములు ఈ గోపుర ముపయిన వ్రాయబడినవి మిక్కిలి అసమగ్రముగను, ఛిన్నా భిన్నముగను నున్నప్పటికిని 1160 - 70 వ సంవత్సరము నాటికి లోపలి గోపురము పూర్తిగా గాకున్నను కనీసము పునాదుల వరకయినను నిర్మింపబడి యుండుననుటలో నెట్టి సంకోచము లేదు. ఈ శాసనములన్నియు నుత్తర దిశా ప్రాకారమున నుండి ప్రాకారపుగోడ మందముచేఁ గొంత భాగము కప్పబడి యున్నవి. ఆ కారణముచే గోపురము నిర్మాణమయిన తరువాత చాలకాలము వరకు ప్రాకారము కట్టబడి యుండ లేదని నిర్ణయము చేయవచ్చును.

## విమాన ప్రదక్షిణము

ఈ ప్రాకారమునకు లోపల, లోపలి గోపురమునుదాటిన యనంతరము నాలుగువైపులనున్న ప్రదక్షిణమునే విమాన ప్రదక్షిణమను పేరుతోఁ బిలిచెదరు. నాలుగు వైపుల దీర్ఘ చతురముగలిగి లోపలి గోపురపు రెండవ ప్రాకారము ననుసంధించుకొని సన్నిధి నావరించుకొనిన మొదటి ప్రాకారమునకు మధ్యగలిగినట్టి ప్రదేశము విమాన ప్రదక్షిణముగాఁ బేర్కొనఁ బడినది. లోపలిగోపురపు ద్వారమున కెదురుగా గానవచ్చు మంటపమే తిరుమామణి మంటపము లేక ముఖమంటపముగా బేర్కొనఁబడుచున్నది. ఈ మంటపము వైశాల్యము 18' లు చతురముగల్గినది

శ్రీవారి సన్నిధిని ఆవరించి, విమాన ప్రదక్షిణము ననుసంధించుకొని పెక్కురాతి చెక్కడములు, మంటపములు, చిన్న చిన్న దేవతల సన్నిధులు గలవు. వీని యన్నింటిచే శ్రీవారి సన్నిధి నావరించిన ప్రదక్షి

ణపు త్రోవ మొదటిప్రాకారపు స్థలముకంటె మిక్కిలి తక్కువయై యున్నది,

## అంగప్రదక్షిణము

ఈ ద్వితీయావరణములోనే భక్తులు శ్రీవారి సన్నిధిలో, ఈ ప్రాకారమునందు లేక విమానప్రదక్షిణ మార్గమందు అంగ ప్రదక్షిణము చేయుదురు. అత్యంత క్లిష్టపరిస్థితిలోగల మానవులు శారీరక మానసిక వ్యాధులు పొడసూపిన సమయములో కరుణాస్వరూపుడయిన శ్రీవేంకటేశ్వరుని ప్రార్థింతురు. వారా కష్ట పరిస్థితిని శ్రీవారి యనుగ్రహముచేఁ దొలఁగఁజేసికొన్న యనంతరము స్వస్థతనొంది, తిరుమల శ్రీవారి కొండకుచేరి అతి పవిత్రవంతమగు శ్రీ స్వామి పుష్కరిణిలో స్నానమొనర్తురు. ఆ తడిగుడ్డలతోనే శ్రీవారి ఆలయమునకుచేరి లోపలి గోపురపు లోపల మధ్య భాగమునుండి సాగిలపడి దొర్లుచు మ్రొక్కుచు దేవాలయము చుట్టును గోవిందనామ స్మరణముతో మనో వాక్కాయములచే శ్రీవారిని స్మరించుచు ప్రదక్షిణముచేయుదురు. దీనినే అంగ ప్రదక్షిణమని పిలచెదరు. ఈ ప్రదక్షిణములో నీ భక్తుని యొక్క సర్వాంగములు విమాన ప్రదక్షిణములోని పవిత్ర స్థలమును తాకును. ఇట్లుచేయు భక్తునకు వారి బంధువులలొ నొకరు సాయముగా నుండి మూలలందు సరియగు ప్రదక్షిణము జరుగునట్లు తోడ్పడుదురు.

ఇప్పుడు రెండవ ప్రాకారము ననుసంధించియున్న విశేషములను గురించి తెలిసికొనవ యత్నింతము.

## శ్రీ వరదరాజస్వామివారి ఆలయము.

ఈ ఆలయములోపలి గోపురమునుండి లోపలిభాగమున దక్షిణముగా నేడడుగుల దూరములో తూర్పు ప్రాకారపు గోడననుసంధించి 2′ అడుగులదూరములో యున్నది. ఇది 20′ పొడవుతోను 15′ వెడల్పు

తోను నిర్మింపఁబడినట్టి చిన్న దేవాలయము. ఇది శ్రీవరదరాజస్వామి వారి సన్నిధి అంగ ప్రదక్షిణమునదప్ప శ్రీవారిని సేవించు భక్తులు ఈ ఆలయమును చుట్టియే వెళ్లవలెను.

ఈ ఆల యపశ్చిమోత్తర కుడ్యముపయినున్న శాసనమువలన శ్రీ రంగనాథ యాదవరాయని 16వ సంవత్సర క్రీ.శ. 1354-55 పరిపాలనా కాలమునకుముందే యిది నిర్మింపఁబడియుండెనని తెలియుచున్నది. మాలిక్ కాఫరు దండయాత్రనుద్దేశించి దానిని తప్పించుకొను ఉద్దేశముతో కంచిలోని శ్రీ వరదరాజస్వామిని గూడనిట ప్రతిష్ఠింప నుద్దేశించి యుందురు. కాని యిది జరిగినట్లుగా మనకెట్టి యాధారములును లేవు. ఆలయమునకు దక్షిణముగా నాగ్నేయమునుండి ప్రారంభమయి వంట శాలగలదు. ఇది 2½′ ల ఎత్తుగల పునాది పయి 61′ × 38′ వైశాల్యముతో నున్నది. ప్రతిదినమున నివేదనమునకగు అన్ని అన్నప్రసాదములు ఇటనే తయారు చేయబడును. క్రొత్త మట్టికుండలు మాత్రమే ప్రతిరోజు యిట నుపయోగింతురు. ఒకసారి యుపయోగింపబడిన మృత్పాత్రలు తిరిగి యుపయోగింపబడవు. వీనిని నిత్యముగా సరఫరా యొనర్చుటకు 'కుమర స్వరూపము' నకు హక్కుదారుఁడగు మిరాశి దారుగలఁడు. అడవినుండి నిత్యము వంటచెఱకును సరఫరాచేయుటకు నొక మిరాశిదారుఁడు గలడు. నేడు మాత్రము ప్రభుత్వపుటడవులనుండి దేవస్థానమువారు చేసికొనెడి యొప్పందము ననుసరించి యీ వంటచెఱకు సరఫరా జరుగుచున్నది. ఇది ప్రభుత్వపుటటవీశాఖవారి పర్యవేక్షణక్రింద జరుగును. ఇచట వంటశాలలో బాగుగా లోపలిభాగమునందు ఒక చిన్న ఆలయమున్నది. ఈ ఆలయములోని దేవేరి వంటశాలా పర్యవేక్షణమున కధినేతృత్వమును వహించును. ఈమెను 'మాడ పులినాచ్చియార్' అను పేరుతోఁబిలిచెదరు. ఈమెయే వకుళమాలికయని చెప్పుదురు. శ్రీకృష్ణావతారములో నీమె యశోదయందురు. శ్రీవారు కొండపయి వెలసినపుడు పద్మావతితో వివాహమునకను సంధానము చేసినదీమెయే.

శ్రీవారు శిలారూపము దాల్చినపుడు ఈమె మాలయై శ్రీవారిలో లీనమయిన దని పురాణములు చెప్పుచున్నవి. ఈ వంటశాలకు ముందు భాగమున మంటపము నానుకొని పశ్చిమదిశగా 'బంగారు బావి' గలదు ఇది చాల పవిత్రవంతమయిన బావిగా భావింతురు. ఈ బావి నుండియే దేవాలయమునకు వలయుతీర్థము వంటశాలకుఁగావలసిన తీర్థమును గ్రహింతురు. ఈ బావి యీ వైపున నుండుటయు ఆగమశాస్త్ర విహితమైనది. ఈ బావిని 'రంగదాసు' అను భక్తుఁడు త్రవ్వించెనని యైతిహ్యము.

ఈ మంటపము వంటశాలనుండి సాగి దక్షిణమునుండి పడమరకు తిరుగును. ఒక వైపున నీ నడవ రెండవ ప్రాకారముతోడను రెండవవైపు రాతిస్తంభములచేతను నిర్మాణము చేయబడినది. ఈ మంటపములో రెండువరుసల స్తంభములున్నవి. ఈ నడవ వెడల్పు 15' లు. ప్రాకారపుగోడనుండి 7' దూరములో మరియొక స్తంభముల వరుసయున్నది.

## కల్యాణమంటపము

పడమటదిశనుగల నడవను ఒకపెద్ద మంటపముగామలచిరి. ఈ మంటపము 80 × 36' లు కొలతలు గలిగి కల్యాణమంటపముగా రూపొందినది. దీని నిర్మాణకాలము నూహింపవలయు గాని ఆధారము గానము. 16 వ శతాబ్దాంతమున నిది నిర్మాణమయినట్లుగా నూహింప వచ్చును తిరుమలరాయ మంటపమునగల శిల్పరచనయే యిందును గానవచ్చును. ఈ మంటప స్తంభములు అత్యుత్తమ శిలాసంపద చేతను, శిల్పకళచేతను ప్రసిద్ధమయినవి. ఈ మంటపము పైకప్పు మధ్యభాగము చక్కటి చిక్కని చెక్కడపు కళానైపుణ్యమును వెలార్చుచు చూపరుల హృదయమున యానాటి కళాపోషకుల పారలౌకిక దృష్టిని, కళాత్మక హృదయమును నిరూపించును. దీనికిఁ బశ్చిమపు

దిశను నొక ఆలయమున్నది. అది పరిమాణములో నతిచిన్నది. దీని కొక మంటపము చుట్టియున్నది. ఇది యపురూపమని చెప్పనగును. స్తంభములన్నియు నతిమనోహరముగాఁ జెక్కఁబడి శిల్ప సౌందర్యముచేఁ, జూచువారల కన్నుల మోహింపఁజేయును. ఈ యాలయమునకు వెనుక యాగశాలగలదు. దీనియందు బ్రహ్మోత్సవ దినములలోను, నితరయుత్సవముల దినములలోను హోమాదులు జరుగును. ఇట కల్యాణోత్సవము జరుపబడుటచే దీనికిఁ గల్యాణమంటపమని పేరు కలిగినది. యాత్రికులలో భక్త్యుత్సాహముచేతను, మ్రొక్కుబడుల వలనను ఎవరయినను కల్యాణోత్సవము జరిపింప నిచ్ఛగించుకొన్నచో శ్రీమలయప్ప స్వామివారిని, ఉత్సవదేవేరులను ఇటకు గొనివచ్చి వారి కోర్కె మేరకుఁ గల్యాణోత్సవము దేవస్థానమువారు అర్చకుల సాయముతో జరిపింతురు. ఈ యుత్సవమును భక్తుల రద్దీ యెక్కుడగుటతో నేడిక్కడ జరిపించుటలేదు. ఇది నేడు భక్తుల సౌకర్యార్థము రంగ (నాయక) మంటపములో వేలాది భక్తజనుల సమక్షములో నిత్యము జరుపబడుచున్నది.

ఈ మంటపమున కల్యాణోత్సవమునకేగాక శ్రీవారి బ్రహ్మోత్సవములందును, అధ్యయనోత్సవములలోను ఎక్కువదినములు శ్రీవారి యుత్సవమూర్తులయిన మలయప్పస్వామివారు, దేవేరులగూడి యిట వేంచేయుదురు. ఆ దినములలో నిదివరకున్న ఆలయములో శ్రీ స్వామివారినుంచి, ముందున్న మంటపములో నలంకారములు, ఆస్థానములు జరిపెదరు. ధ్వజారోహణమునుండి మరల దీపావళినాటి ఆస్థానము జరుగు పర్యంతము శ్రీ స్వామివారి ఉత్సవమూర్తులిట వేంచేసియుందురు. డిసెంబరుమాసములో అధ్యయనోత్సవ కాలమయిన 23 రోజులు మరల నిట వేంచేసియుందురు. ఆ దినములలో నాస్థానోత్సవ మీ మంటపములోనే జరుగును.

## పడమటనడవ

ఇది దక్షిణమునగల నడవవలె దానితోఁబోల్పఁదగినట్టిదే. కాని దానికంటె నిది కొంత వెడల్పుతక్కువ. వాహనములనుంచుట కిట యనేక యేర్పాటులు జరిగినవి. కాని నేడీ వాహనములన్నియు రంగ మంటపమందే యేర్పాటు చేయబడినవి. అటనే కల్యాణోత్సవ మయి నంత, భక్తులు వాహనోత్సవములు జరుపనెంచుచో వారి సౌకర్యార్థమా యుత్సవములటనే జరుపబడుచున్నవి. ఒక చిన్నగదిలో తిరుమల నమూనా చిత్రములుగలవు. ఇట వాహనోత్సవమును గుఱించి వివ రింపఁబడును. భక్తుఁడెవరయినను గరుడోత్సవమును చేయించవలె నని భావించుచో, ఆ నిర్దిష్టదినమున వాహనముపయి స్వామినుంచి తిరువీధ్యుత్సవము జరుప సాధ్యముగాకపోవచ్చును. ఆ సమయమున ప్రదక్షిణమున వాహనముంచి స్వామి నలంకరింతురు. మేళము చేయ బడును. హారతిసమర్పణము జరుగును. భక్తునకొక వెండిబెత్తము నిచ్చి స్వామితోఁగూడిన వాహనము చుట్టు సరి ప్రదక్షిణములు చేయిం తురు. ఇపుడీ యుత్సవములన్నియు నిట జరుపబడక రంగమంటప మునందే జరుగుచున్నవి. వీధీ ఉత్సవములు భక్తులకు జరిగెడు సంప్రదాయము నేడు పాటింపఁబడుటలేదు. ఈ నడవలో నేడు చతుర్వేద పారాయణము నిత్యము వేదవిదులు జరుపుచున్నారు.

## ఉత్తరపు నడవ.

ఇతర దిశలనడవలకంటె దీనికున్న ప్రాధాన్యమెక్కుడు. పశ్చిమదిశాంత భాగమునగల నడవలో ఆధ్యాత్మిక జీవనాపరులు పారా యణ గ్రంథములను పఠింతురు. మధ్వ మతస్థులు ఇట్టి సంప్రదాయ మును ప్రత్యేకముగా పాటించుటగాంచనగును. ఉత్తరపు నడవలో విమానపైభాగమున సరిగాదృష్టినిలిపినచో నట విమాన వేంకటేశ్వరుని దర్శనమగును. ఈ విషయమును దేవస్థానపుటధికారులు భక్తుల

ప్రయోజనముకొఱకు ఆ ప్రదేశమున వ్రాసిపెట్టినారు. ఉత్తరదిశా ప్రాకారమున చోళులకాల మందలి అతి ప్రాచీన శాసనములు సమగ్రము లయినవి, శ్రీ కృష్ణదేవరాయల దానశాసనములను గాంచవచ్చును. ఇచట గల గదులలో దేవస్థానపు సేవకులు కొందరు పూర్వము నివసించెడివారు. నేడట్టి నివాసమునకు తగిన విధముగా నీ ప్రదేశములేదు. ఇందులోనున్న యొకయరలో శ్రీ తాళ్లపాక అన్నమాచార్యస్వామివారి, వారి వంశజులచే రచింపబడిన సంకీర్తనలున్న రాగిరేకులు భద్రపఱుపఁబడినవి. ఈ సంకీర్తనలన్నిటిలో శ్రీవారి దివ్యమంగళ స్వరూపము వారి లీలలు కీర్తింపబడినవి.

## శ్రీరామానుజ సన్నిధి

దీని తదుపరియున్నది శ్రీరామానుజుని సన్నిధి. వీరు గొప్ప వైష్ణవాచార్యస్వామి. వీరి సన్నిధి ననుసంధించి ఒక ముఖ మంటపమున్నది. శ్రీ వైష్ణవు లందఱు వీరి నర్చించి తీర్థమును శఠారిని గ్రహింతురు. శ్రీ ఆచార్యస్వామివారికి ప్రత్యేకమయిన పూజ యెట్టిదియును లేదు. శ్రీవారికి సమర్పింపబడు అన్న ప్రసాదములలో ముందుగా కొంత భాగమిట నివేదనార్థము పంపఁబడును. అనేక పర్వ దినములందు గోష్ఠిలో శ్రీవారికి సమర్పింపఁబడిన ప్రసాదములు ఇట శ్రీవైష్ణవులకు పంచ బడును. శ్రీరామానుజులకు కొన్ని కొన్ని ప్రత్యేక గౌరవములు, ఆయన ఈ దేవాలయములో చేసిన సేవా సహాయములకుగాను నేటికిని జరుపబడుచున్నవి. ఇతర దేవాలయములలో పూజా విధానము జరుపబడుచున్నను యిక్కడ ఏ యితర ఆచార్య పురుషులకు గాని ఆళ్వారులకుగాను, ప్రవేశములేదు. శ్రీ రామానుజుని పాంచరాత్రాభిమాన మీ ఆలయములో నెట్టి ప్రాధాన్యము గొనక, ఏ ఆలయ సాంప్రదాయమైన వైఖానసాగమమునకే పట్టాభిషేకము చేయుట గమనింప దగినది.

## శ్రీ నృసింహస్వామివారి ఆలయము

శ్రీ మద్రామానుజుల శ్రీ వరదరాజస్వామివార్ల ఆలయముల కంటె నిది చాల కాలము తరువాత వచ్చినట్టిది. ఈ ఆలయమున్న ప్రదేశమును, పరిసరములనుబట్టి ఇది యేదో అవాంతర పరిస్థితిలో ఆతురతతో తరలించుకొని రాబడినట్టిదిగాఁ దోచును. ఈ విషయము తరువాత చర్చింపఁబడును.

పడమటివైపునగల అరలలోనే పరిమళపు అర, చందనపు అరలున్నవి. ఇందు నిత్యము శ్రీవారికి సమర్పింప బడెడు చందనము కొయ్యతో నరుగఁదీయఁబడి శ్రీవారికి సమర్పింపఁబడును. పరిమళపు అరలో నిత్యము శ్రీ భోగ శ్రీనివాసమూర్తికి అభిషేకార్థము వలయు పరిమళపు ద్రవ్యములు, వారమున కొకసారి ప్రతి శుక్రవారము శ్రీవారికి జరుపు నభిషేకార్థము వలయు పరిమళ ద్రవ్యములు పునుగు, జవాది, పచ్చ కర్పూరము, కుంకుమ పువ్వు, కస్తూరి, పసుపు, తైలములు తయారు చేయఁబడి సమకూర్పఁబడును. భక్తులెవ్వరైనను అభిషేక సేవ నిర్వహించ దలఁచినచో వారికి వేర్వేరు వెండి గిన్నెలలో నీ పరిమళ ద్రవ్యము తీయఁబడి విమాన ప్రదక్షిణము చేసిన యనంతరము గర్భగృహములోనికి గొంపోవబడును. ఆ తరువాత నీ గిన్నెలలోని పరిమళ ద్రవ్యములను వినియోగించి స్వామివారి యభిషేకమును బ్రారంభింతురు. ఈ సేవకు భక్తులు దానికి నియమించిన ద్రవ్యమును చెల్లించవలెను.

పవిత్రమయిన పణ్యారపు వస్తువులలో (ప్రసాదములలో) మనోహర మతి ప్రశస్తి వహించినట్టిది. రాష్ట్రాధికారులు, ముఖ్యమంత్రులు దేశ ప్రధానులు, రాష్ట్రపతి మొదలగు గొప్పవారుగాని, ఉన్నత పీఠాధిపతులుగాని విచ్చేసినపుడు వారి గౌరవార్థము దేవస్థానపు టధికారులు వెండి పళ్లెరమందు చందనము, శ్రీపాదరేణువు, మనోహరము

నుంచి యిత్తురు. ఇది మినుములు బాగుచేయబడి నేతితో వేగించి, చూర్ణము చేయబడి బెల్లముతో కలుపబడి బంతులువలె తయారుచేయ బడెడు ప్రసాదము. ఇతర మధుర ప్రసాదములు వాని వాని ప్రత్యే కతలతో నుండినను ఈ ప్రసాదము గొప్పతనము ప్రాచీనతదీని దేనని చెప్పనగును.



# 8 వ అధ్యాయము

## 3-వ భాగము

## తిరుమల శ్రీవారి ఆలయము

## శ్రీవారిసన్నిధి

ఈ యధ్యాయములోని యీ భాగములో నీ దిగువఁ బేర్కొన్న విషయములు వివరింపఁబడును,

1. అతి ప్రాచీనమగు శ్రీవారి ఆలయపు కుడ్యముల నావరించి శిల్ప చాతురీమహిమను వెలయించు క్రొత్తగోడలు గర్భగృహము నావరింపఁ జేసికొని నిర్మించిన విషయము.

2. విమాన నిర్మాణము - బంగారుపూత

3. మొదటిప్రాకారపు గోడల నిర్మూలనము. తత్ఫలితముగా నవు రూపము, అత్యంత విలువలు గలిగిన శాసనముల వినాశనము. మొదటిప్రాకారపు గోడల పునర్నిర్మాణము, ప్రాఁతశాసన ఛిద్ర శిలలు ప్రాకారపులోపలివైపు గోడలనమర్చుట.

4. ప్రదక్షిణ పురోభాగమును 'రామర్ మేడ' (రాములవారి మేడ) గదిగా మార్చుట.

5. మిగిలిన మూడువైపులనున్న ప్రదక్షిణమును నిత్యోపయోగము లేక మూసయుంచుట, స్నపనమంటపమును ఖజానాగదిగా మార్చుట. దీనికి ముందుగా తిరుమామణి (ముఖ) మంటపమును నిర్మించుట.

6 గరుడాళ్వారు సన్నిధిని, ధ్వజస్తంభమును, బలిపీఠమును ప్రాచీన స్థానములనుండి తప్పించి ఇపుడున్న ప్రదేశములకు మార్చుట.

7. శ్రీరామానుజసన్నిధి, శ్రీవరదరాజ శ్రీనరసింహసన్నిధులు.

సత్యవిషయ సంపత్తి కాలగర్భమున నంతరించుట యన్నది లోకపురీతి. ఇంతేకాక పరిస్థితుల ప్రాబల్యమునకూడ కొన్ని సంప్రదాయములుకూడ పూర్తిగా లుప్తమగును. కాని సంప్రదాయములు కొన్ని తప్పని సరియగు నలవాట్లుగమారి వదలి వేయుటకు వీలు లేనంతటి శక్తిని సంపాదించు కొనును. నేడే కాదు నాడును. ఉదాహరణమునకు నొక సామాన్య మానవునకు శ్రీవారిని దర్శించి తన మ్రొక్కులను చెల్లించు కొనుటలో నెంత క్లేశమున్నదో తెలియని విషయముకాదు. అనుభవమునకురాని విషయమును కాదు. దీని కింకను చెప్పవచ్చును. పూర్వపు నిజాము రాజ్యములోని ఆర్థిక మంత్రియగు రాజారఘూత్తమరావు అంతటి అధికారికూడ శ్రీవారిని దర్శించి తనకుఁగావలసిన మ్రొక్కుబడులను, పూజలను జరిపించుకొనుటకు క్లైవు ప్రభువు సహాయము పొందవలసిన వాడయ్యెను. పూజానంతరము లార్డుక్లైవునకు సందేశము పంపుచు సామాన్య మానవుఁడు శ్రీవారిని దర్శించుటలో కష్టమెట్లు తగ్గించుకొన గలడన్న విషయమున పలుసూచనలు చేసియుండెను.

ఆరోజులలోకూడ నేడున్న విధముననే భక్తజనులను అదుపు చేయుట యనునది దేవస్థానపుటుద్యోగులకు ఒక తీరని సమస్యగా పరిణమించెను. ఇది క్రీ. శ. 1933 వ సంవత్సరమునాటి మాట. నేటికీ పరిస్థితి యిబ్బడి ముబ్బడి యయినది. ఈ భక్తజన సమూహమును నాడు క్రమ పద్ధతిలోనుంచుట కొక విచిత్రమయిన ప్రయోగము జరిపెడువారు. వీరిని అదుపులోనుంచుటకు శ్రీవారి సన్నిధిలో నాడు దర్శనమయినంతనే బయటకుఁదొలఁగుటకుగాను ఒక లేడి చర్మముతో

తయారయిన పట్టా (Belt) వంటి దానితో నా భక్తుని సున్నితముగాఁ గొట్టుట జరిగెడిది. కాని యిది యొక విచిత్రమగు సంప్రదాయముగా మారి, రాను రాను నీ తాకించుట జరుగని భక్తుఁడు శ్రీవారి గుర్తింపును తాను పొందలేదనెడు యభిప్రాయమునకు వచ్చెడి పరిస్థితి యేర్పడినది. అధికారులు సన్నిధిలో భక్తుల రద్దీని తగ్గించుటకు, వారిని క్రమ పద్ధతిలో నుంచుటకు నుపయోగించెడి వస్తువునకెట్టి ప్రాతినిధ్యము వచ్చెనో, ఎట్టి యభిప్రాయమునకుఁ దావొసఁగెనో దీనివలన పాఠకులు గమనింపగలరు. దీని తరువాత బాలభటసంఘములు పోలీసువారు రంగమున ప్రవేశించిరి. క్రీ. శ. 1876 వ సంవత్సరము వచ్చువరకు కొండపయికి పోలీసువారిరాక నిషేధింపఁబడినది. కాని నేడీతడే తన పోలీసు దుస్తులతో, టోపీతో శ్రీవారి సన్నిధిలో క్రమశిక్షణా నిర్వహణనెపముతో నధికారము సలుపుచున్నాఁడు ఆగమములన్నియు మానవుని పూర్వదేహము ఊర్ధ్వభాగమున (పైభాగమున) దుస్తులను భగవద్దర్శనము సమయమున నిషేధించినవి. ఈ రోజులలో భగవద్దర్శనమునకు మనకు సాయపడువారు ఆచార్యపురుషులుగాక పోలీసు పురుషులని చెప్పుటలో నాశ్చర్యమునకుఁ దావులేదు. నేడీ ఆగమసూత్రములను పాటించెడి భక్తులెందరున్నారు? చొక్కాలులేని విధముగా శ్రీవారిని దర్శించుటకు సన్నిధిలో ప్రవేశించువారొక్కరైన నున్నారా?

తిరుపతిలోకూడ నేటికిని యొక ప్రబలమగు సంప్రదాయమున్నది. అక్కడ గంగమ్మజాతర ప్రతి సంవత్సరము జరుగును. ఈమెను గ్రామదేవతగాఁ జెప్పుదురు. ఈ దేవతనర్చించెడి పూజారికి మతాదార్యునకున్న ప్రాధాన్యమున్నది. ఈ జాతరదినములలో నీ పూజారి వీధివీధుల నొకచేత చీపురు, చేటపట్టుకొని తిరుగును, ఉదయసాయంత్రములందు తిరుపతి వీధులలోని యిండ్లయందు తమ బిడ్డలతో తల్లులు ఈ పూజారిరాకకయి నిరీక్షింతురు. ఆ పూజారి తన కడనున్న చీపురు చేటను ఆ పిల్లల తలపయినంటించును. ఇది తాకుటచే నా క్షుద్రదేవతా

ప్రభావముగాని, ప్రవేశముగాని ఆ బిడ్డల కుండదనియు, ఎట్టికీడును ఆ దేవతవలన వాటిల్లదని వారి విశ్వాసము. అట్టి ప్రాముఖ్యమును నేడు శ్రీవారి సన్నిధిలోని శఠారికికూడ నిచ్చుటలేదని మన మచట పరిస్థితులను గమనించినచో గ్రహింపగలము, ఇక ప్రకృతమునకు వత్తము.

తిరుమల దేవాలయము యొక్క స్పష్టమయిన ఆకృతి అతి రహస్యముగనేయున్నది. సంప్రదాయములు, ఆచారములు, ఆకృతులకు సంబంధించిన వయియున్నను, వానిని గురించి ప్రశ్నించుటకుగాని విచారించుటకుగాని ఎవరును సాహసింపరు. వంశపారంపర్యముగా దేవాలయముతో సంబంధముగలవారు, ఇతర దేవస్థానపుటుద్యోగులు, అతిసమీపమగు సంబంధముగలవారు గూడ నీ విషయమును గుర్తించియుండబోరు. దేవాలయ సంప్రదాయములు నేడున్న సంప్రదాయములకు సంబంధించిన వానిని ఆలయ కుడ్యములపయినగల శాసనములను బట్టియు, సన్నిధిలోని ఆకృతుల కొలతలనుబట్టియు ఈ వివరములు గ్రహింపనగును. గణిత సంబంధమయిన నిర్దుష్టపుటంకెల కొలతలు మన మూహింపలేము. ఈ కొలతలు దేవాలయము నిత్యవిధుల కాటంకము గల్గింపకుండ గ్రహించుటకు వీలయినట్టివిగావు. మరికొన్నిటిని అతిపవిత్రమంతములుగా మనము భావించుచున్నందున మరియొక వైపున వీనికొలతలను గ్రహించుటయున్నది అపచారమే యగును. శ్రీ వారిని కొలుచుటకుగాను చేపుగాని, దారమునుగాని బట్టి యామూర్తి ఒడ్డు పొడవులను ఎవరుకొలతవేయ సాహసించును? ధ్రువబేరము ననుసరించియే దేవాలయాకృతి విమానాకృతియు నెలకొనియున్నవి.

## గర్భగృహము ముఖమంటపములద్వారాకృతులు

ప్రప్రథమముగా మనము తెలిసికొనవలసిన సంగతి శ్రీవారి గర్భగృహము, దాని ననుసంధించియున్న ముఖమంటపము ద్వారా

కృతి యనువిషయము. రెండుస్పష్టమయిన వేర్వేరు గోడలీ గర్భ గృహము దాని ననుసంధించిన ముఖమంటపములకున్నవి. ఇందు లోపలి గోడలు ప్రాచీనములు. వీని నావరించి వెలుపలకు శిల్పకళామయ మయిన క్రొత్తగోడలు నిర్మించబడినవి. లోపలిగోడలకు వెలుపలి గోడలకు బహుశః మధ్యఖాళీస్థలముండి యుండనగును. ఉన్నచోఁదది చాల తక్కువ స్థలముగా నుండును. ఇది యంతర్మండలముగా నగును. విమానము క్రొత్తగోడల నాధారముగా గొనియే అనగా గర్భగృహము వెలుపలి గోడలననుసరింపయే క్రీ . 1244-50 సంవత్సరముల నడుమ నిర్మించబడినది. ప్రాచీనకుడ్యములపయి క్రీ. శ. 966—1013 ప్రాంతముల నడుమ వేయబడిన తమిళ శాసనములు గనీసము నాలుగైనసుండవలయును. ప్రాంతగోడల నావరించి క్రొత్తగోడల నిర్మాణము జరుగు సమయములో ఈ శాసనముల నకళ్ళను వ్రాయించిరి. ప్రాచీనాలయమునకొక ప్రదక్షిణముండెడిది. దాని నావరించి యొక ప్రాకారముకూడ నుండెడివి. ఆ ప్రదక్షిణము లోనే వడవలో నిత్యము సాయంత్రము 20 నూనె దీపములు వెలిగింపబడుటకుగాను వ్రాసిన దానశాసనములున్నవి. ఆ తరువాత గర్భగృహపు గోడలు పెంపుచేసి క్రొత్తవి నిర్మించుటకుగాను తప్పని సరిగా నా ప్రాచీన ప్రాకార కుడ్యములు ప్రదక్షిణము వెడల్పు చేయుట కొరకయి నిర్మూలింపబడెను. ఈ ప్రాకారములు నిర్మూలము చేయుటలో పని వాండ్రు, అధికారులు జూపిన నిర్లక్ష్య భావముచేత ఆ గోడలపయి చోళులు, వారి రాజ ప్రతినిధులు వారి అనుయాయులు వ్రాయించిన పెక్కు దానశాసనములు సమూలముగా నాశమొనర్పబడి కాలగర్భములో కలిసిపోయినవి క్రొత్తప్రాకారపుగోడలు ఈ క్రొత్తగా కట్టిన గర్భగృహమునకు నిర్మింపబడినవి. ఆ ప్రాకారపు గోడల లోపలి భాగమున ఆ ప్రాచీన శాసనములను, అసమగ్రములయినవి, ఛిద్రమయిన వానిని సమరించితిమన్న సంతృప్తితో నాటి యధికారులు, శిల్పులుగూడ తృప్తిబడి చేతులుగడిగికొనిరి. ప్రాకారపు బాహ్యముఖములు గర్భ

గృహము ప్రాంతగోడలనుండి తీసిననాలుగు శాసనములు తప్ప ఇంకెట్టి శాసనములులేక వట్టిపోయిన రీతిగానున్నవి.

సుందర పాండ్యుడు పాండ్యరాజు. ఆయన రాజ ప్రతినిధులలో మిక్కిలి ప్రసిద్ధిగన్నవాఁడు వీరనరసింగ యాదవరాయలనువాఁడు. ఈయన ఆదేశపు ప్రాంతీయ పాలకుఁడు. ఈ గర్భగృహము, ముఖ మంటపము, ప్రాకారముల పునర్నిర్మాణములో మిగుల శ్రద్ధ వహించినవాఁడు. ఈతఁడు రాజప్రతినిధినుండి తన్నుతాను రాజుగాఁ బ్రకటించుకొనిన ధైర్యశాలి. తనను బంగారముతో తులాభారమును గావించుకొని యా బంగారముతో శ్రీవారి విమానమును మేరు శిఖరమున కెనయగు దానిగా రూపొందించినట్లు పూర్వపుటధ్యాయములలో గ్రహించితిమి. అనగా నీవిమానము నిర్మింపఁబడిన యనంతరము ఈయన బంగారపుఁబూత వేయఁబడిన రాగిరేకులను విమానమునకు తాపడము వేయించినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1262 ఈయన ప్రభువగు సుందరపాండ్యుడే బంగారముపూత వేయబడిన శిఖరమును విమానమున నుంచెను. క్రొత్తగా నిర్మాణమయిన మొదటి ప్రదక్షిణము కొన్నియేళ్ళవరకుపయోగములోనుండి తదుపరి ప్రజల యుపయోగార్ధము నిషేధింపబడి మూయబడినది. తూర్పువైపునగూడ కుడ్యనిర్మాణము చేపట్టబడినది. ఇది ముఖమంటపమునకు ముందుభాగము. దక్షిణ కుడ్యమునగల రెండుశాసనములనుబట్టి ఈ మాయబడుటయను కార్యక్రమము క్రీ. శ. 1265–1285 సంవత్సరముల నడుమ జరిగియుండెనని యూహకలుగును. ఇఁక మిగిలిన దక్షిణ పశ్చిమోత్తర భాగములుగల ప్రదక్షిణము ముక్కోటి ప్రదక్షిణముగా బిలువఁబడుచున్నది. ఉత్తర దక్షిణ దిశలలో తూర్పువైపునకు రెండుద్వారములనుంచి ముక్కోటి ఏకాదశి ముక్కోటి ద్వాదశీదినములు రెండు రోజులును భక్తులకొఱకు తెఱచియుంతురు. మిగిలిన సంవత్సరకాలమంతయును మూసియే యుండును.

ఈ ప్రదక్షిణముయొక్క విస్తృతి అన్ని వైపుల సమమైనది కాదు. ఉత్తరభాగమునగల వెడల్పు పశ్చిమ దక్షిణములవైపుకంటె ఎక్కువ వెడల్పుగలిగినది. ఉత్తరభాగమునగల మధ్య వరుసస్తంభ ముల యునికినిబట్టి యీ మార్పు ఆకస్మిక పరిణామ హేతువుగా నిశ్చ యింపవచ్చును. ఈ ఉత్తరపువైపుననే గర్భగృహమునుండి వెలుపలకు నీరువెడలుటకు 9′ మందముగల రాతితో నిర్మాణమైన గోముఖము కలదు. ఇది పూర్వము మూసియేయుండి నీరు వెలుపలికిరాక ఎత్తి పోసికొనవలసిన యవస్థయర్చకస్వాములకు గలిగెడిది. కాని కొద్ది సంవత్సరములక్రింద ఈ గోముఖముపయోగములోనికి వచ్చి శ్రీవారి సన్నిధిలోని అభిషేక తీర్థము యితర విధములయిన నీరు ఈ గోముఖము నుండి వెడలుచున్నది. ఈ తీర్థము శ్రీస్వామి పుష్కరిణిలోనికి వెడలు టకు దేవస్థానము అధికారులు సదుపాయముచేసియున్నారు.

పశ్చిమ దక్షిణపు ప్రాకారపుగోడలు శిల్పి యులిబారి పడకుండ 130 సంవత్సరములు అనగా క్రీ. శ. 1250 నుండి 1380 వరకు నిలబడగల్గినవి. అట్లే ఉత్తరపు ప్రాకారపు గోడకూడ క్రీ.శ. 1446 వ సంవత్సరమువరకు నెట్టి శాసనముగాని వ్రాయబడినదికాలేదు. ఈ కాలములోనే విజయనగరరాజులు, వారి ప్రతినిధులు, వారి సేనాధి పతులు వ్రాయించి యిచ్చిన దానశాసనములు రెండు గోపురపు గోడల మూలలలోను, చిన్న ఆలయముల పయినను వ్రాయబడినవి. ఈ విధానమునకుఁగారణములు మనమూహించి వివరించవలసి యున్నది. దేవాలయమును మార్పుచేసిన విధానములో స్నపనమంటపమును నిధి గృహముగా మార్చుట యొకటి. ఈ స్నపన మంటపము తరువాత కట్టబడిన క్రొత్తమంటపము తిరుమామణి మంటపము పేరుతో పిలువ బడుచున్నదాని నిర్మాణము, ధ్వజస్తంభము మొదలయినవాని స్థాన ముల నుండి వానిని వేరుచేసి మరియొకచోటు యేర్పాటు చేయువిషయ ములను మనము తెలిసికొనవలసియున్నది.

## శ్రీవారి ఆలయము ద్వైరాకృతి

ప్రాచీనాలయపునేల కొలతలు, నవీనాలయపు కొలతలను మన మిట గమనింపవలయును.

గర్భ గృహముయొక్క గోడలమందము 7′ 2″ లు. శిల్పకారుని పరిభాషలో నిది పంచహస్తప్రమాణము. గర్భాలయము లోపలిభాగము 12′ 9″ లు చతురము కలిగియున్నది. ఇది నవహస్తప్రమాణము. ఆగమము లందీయబడిన కొలతల ప్రకారమిది అధిక తమ ప్రమాణముగాఁ జెప్పవలెను. ఇది యీ యాలయములో ననుసరించుటకు శ్రీవారి ధ్రువమూర్తి మిక్కిలి ఎత్తగుటయే కారణము. గర్భాలయము లోపలి వైశాల్యమును, కట్టబడెడి విమానము మూలకొలతల ననుసరించి గర్భాలయముయొక్క గోడలమందము స్థిరపఱుపఁబడును. ఈ మందము అట దొఱకు రాతివైశిష్ట్యమునుబట్టికూడ మారుచుండును. శిల్పి ప్రతిభ, శిల్పియూహా శాలితకుఁగూడ నిందుప్రాధాన్య మీయవలయును. వీనియన్నింటి యాధారముపైననే దేవాలయము గోడల మందమును నిర్ణయింపబడును. ఇది సామాన్యముగా $\frac{1}{3}$ లేక సగముండును. ఇతరములగు సంబంధము లిట్లుండును. $\frac{1}{3}, \frac{1}{2}, \frac{3}{5}, \frac{4}{7}, \frac{5}{9}, \frac{6}{11}$ మొదలగు భాగములు. దీనికి వైఖానసాగమ శాస్త్రగ్రంథమగు మరీచి విమానార్చన కల్పములో

'విమానవిస్తారమ్ త్రిచతుష్పంచ సప్త నవైకాదశభాగం।
కృత్వా, యథాక్రమేణ, ఏక,ద్వి,త్రి, చతుష్పంచ షడంశం
గర్భగృహ విస్తారమ్, అనియున్నది.

అనగా విమానము కట్టుభాగమును 3, 4, 5, 7, 9, 11 భాగములుగా విభజించి అనుక్రమముగా 1, 2, 3, 4, 5, 6 భాగములు గర్భాలయ వైశాల్యముండనగునని దీని తాత్పర్యము. దీనిలో $\frac{1}{3}$ భాగమును శిల్పియమరించుట యనునది యాతనిపని నైపుణ్యము లేని

తనమును, అక్కడ వస్తుసదుపాయము లేమిని విశదీకరించును. కాని సామాన్యముగా నిది $\frac{1}{4}$ గా నుండి సర్వాంగీకారముగా నున్న పద్ధతి యగుచున్నది. ప్రాచీనపు గోడలపయి విమానమున్నదని యూహించుచో, శ్రీవారి ఆలయపు విమానపు మూలకొలతలు $(2\times12.''9\times12.'9''')$ 324 చతురపు అడుగులు. ఇప్పుడు విమానముయొక్క ప్రతివైపు మూల కొలతలు 18″ లుండియుండును. దీనివలన గోడల మందము $2\frac{5}{8}''$ లుగాని $31\frac{1}{2}'''$ లు గాని యగుచున్నది. దీనికిఁ గావలసిన యసలు మందము 2 హస్తములకంటె తక్కువ ప్రమాణమేయయి యున్నది. ఇది శాస్త్రాంగీకారము. శిల్పి 2 హస్తముల ప్రమాణమును గోడలమందముగా పెట్ట దలఁచియుండవచ్చును. మొత్తము గోడల మందము 7′2″ లు లేదా పంచహస్త ప్రమాణముకంటె కొంత యెక్కువగాని యుండును. గర్భగృహమునకు రెండు గోడలు ఒక దాని నావరించి మరియొకటి యున్నదనుట స్పష్టమే. ఇందు లోపలి గోడలమందము 2 హస్తములకంటె కొంత తక్కువగా నున్నది. వెలుపలిగోడల మందము 3 హస్తములకంటె కొంత యెక్కువగా నున్నది. లెక్కల ప్రకారము 4′ లు మందము లేదా $2\frac{3}{4}$ హస్తముల ప్రమాణము గల్గిన గోడలమందము విమానమునకు మిక్కిలి రక్షణను కలుగజేయునన్న విషయము స్పష్టమగుచున్నది. పంచహస్తముల మందము ఈ రెండు గోడల మందమగునట్లు నిర్మించుటలో శిల్పి మిగుల శ్రద్ధ వహించి ఈ రెండవగోడను కేవలము 6″ అంతర్మండలమును వదలి దగ్గరకు తీసికొనివచ్చుటలో కృతకృత్యుఁడు కాఁగలిగియుండును. ఈ విషయమే తి. తి. దేవస్థానముల శాసనసంపుటిలోని 1 వాల్యూములోని 88 వ శాసనము స్పష్టపఱచుచున్నది. 'కోయిల్ ఆళ్వార్' అను తమిళ పదము ప్రాచీనాలయమునకు వాడబడినది రెండవయాకృతికి అనగా వేరుగా ననుసంధింపఁబడిన గోడలకు వాడబడిన పదము 'కోయిలాళ్వార్కుకోయిల్' అనగా ప్రాచీనాలయమునకు ఏర్పాటు

కాబడిన ఆలయమని యర్థము వచ్చుచున్నది. ఈ యూహయే నిజమగుచో రెండవ ఆలయము గోడలు నిర్మాణము కానంతవరకు విమానము నిర్మాణము జరిగియుండలేదని చెప్పవచ్చును. ఈ కాలమును 1244, 1250—1262 వ సంవత్సరమునడుమ జరిగిన నిర్మాణము. రెండవ సారి గోడల నిర్మాణము చేయుటలో ప్రాచీనాలయ ప్రతిపత్తికెట్టి భంగము కలుగజేయబడలేదు. ఆ ప్రాచీనాలయము దేవతానిర్మాణమని అతి పవిత్రవంతమయినదని తలంచుటయే దీనికిఁ గారణము.

## జీర్ణోద్ధారము యొక్క ప్రధానోద్దేశము.

ప్రతిభావంతులయిన శిల్పులు దేవతావిగ్రహములను రూపొందింతురు అంతకంటె నత్యంతసుందరములగు దేవాలయములును నేర్పరులగు శిల్పులచే నిర్మాణము చేయబడును. ఇట్టి మానుషములయిన ఆలయములు దేశమందెల్లెడలగలవు. కాని తిరుమల శ్రీవారిమూర్తి విషయమిందులకు భిన్నము. ఏ మానవుని చేతను ఈమూర్తి స్వరూపము చెక్కఁబడలేదు. శ్రీవారిది స్వయంవ్యక్త స్వరూపము. అత్యంత పవిత్రమును, సర్వపాప దహన స్వరూపముగాఁ బ్రసిద్ధికెక్కిన వేంకటాద్రిపైన యదృశ్యముగా నల్పమగు దేవాలయములో నున్నవారు శ్రీ వేంకటేశ్వర స్వామి. ఇంతయ్యు నీమూర్తి మహనీయులచే నాకర్షితమయ్యెను. ప్రాత దేవాలయపు గోడలపైగల యతి ప్రాచీన శాసనములచే దీని పావిత్ర్యమును, ప్రాచీనతను నిర్ణయింప వచ్చును. నిజమునకీమూడు వైపులనున్న గోడలెట్టి శిల్పకళాప్రావీణ్యమును సంతరించుకొనియుండలేదు. అతిసామాన్యముగా నున్నట్టి కుడ్యములు. దీని పయి, ప్రారంభములో నెట్టివిమానమును నుండి యుండదు. క్రీ. శ. 1262 వ సంవత్సరము కాలమువరకు శాసనములలో నీ విమాన ప్రసక్తి చేరియుండలేదు. ఈ సంవత్సరములోనే పాండ్యరాజగు సుందర పాండ్య మహారాజు విమానముపై, కనక కలశమును (బంగారు

శిఖరమును) స్థాపించెను. యాదవరాయలవంశ మీయాలయమున మితముగా నభిమానించినది. వీరిలో శ్రీవీరనరసింగయాదవరాయల యభిమాన మింతింత యనరానిది. ఈతఁడు సామాన్య రాజ ప్రతినిధి పదవినుండి స్వయముగా రాజయి తనహృదయమునే శ్రీవారి పాదముల చెంతనుంచి తన ప్రతిష్ఠా వైశిష్ట్యమునకు తగిన విధమున నాలయమును పునర్నిర్మాణము గావించెను. తానేగాక తనరాణియును, ఆధ్యాత్మిక జీవిత సోపానముల నధిగమించి స్వామివారి యనేకసేవల కొఱకయి పైండిపల్లి గ్రామమును దానముగా సమర్పించెను. రథనిర్మాణమును బంగారుపూత కలశమును తయారు చేయించెను. ఇవి వారి వితరణ శీలమునకు శ్రీవారిపయి వారికిగల మిక్కిలి భక్తి ప్రపత్తుల కుపపత్తిగా నెంచవలసి యున్నది. శ్రీవారి నూతనాలయ నిర్మాణము తరువాత శ్రీవారి అర్చకులు తామొక యపూర్వ గౌరవాదరమునకుఁ బాత్రులయి నట్లు భావించుకొనిరి. ఆగమ శాస్త్రానుసారము ఆలయనిర్మాణము చేయించుట, విశేషించి వైఖానసాగమమును రాజులు విశేషముగా నభిమానించుట, కనీస దేవతల ప్రతిష్ఠాపనము జరిగించుట — ఇవియన్నియు వీరి యీ సంతృప్తికి హేతువులుగా నూహింపవచ్చును.

ప్రాచీనములో నా రోజులలో నిత్యపూజా విధానము శ్రీవారికి నిర్వర్తించుటలో శ్రీ వైఖానస అర్చక స్వాములకే ప్రాతినిధ్యముగాని యితరులకెవ్వరికిని ఎట్టి ప్రాతినిధ్యము లేకుండెడిది. ఈ కాలమునకు తరువాత (క్రీ. శ. 1262) సుమారు 150 సంవత్సరములనాటికి శ్రీవారి ఆలయ పరిసరములలో జీయరు స్వాముల ప్రసక్తివచ్చినది. తమిళ ప్రబంధ పారాయణములు నాడు పూజా సందర్భమునఁ బఠింపఁబడుట యన్నదిలేదు. ఇక్కడనేకాక మరెక్కడను తిరుమలలో నీ ప్రబంధ పారాయణమునకు స్థానము లేకుండెను. తిరుమంగై ఆళ్వారు సన్నిధి తిరుపతిలో మొట్టమొదటగా క్రీ. శ. 1234 సంవత్సరములో నేర్పాటు చేయబడినది. ఇది ప్రత్యేక ప్రతిపత్తిగల దేవాలయమగుటతో తిరుమల

స్థానిక సభవారే ధర్మకర్తృత్వమును నిర్వహించుట కంగీకరించిరి. దీనికి 50 సంవత్సరముల తరువాత అనగా క్రీ. శ. 1287 లో ఆళ్వారు తీర్థమునకు సమీపమున 'నమ్మాళ్వారుసన్నిధి' నెలకొల్పబడినది.

తిరుపతిలో క్రీ. శ. 1259 వ సంవత్సరములో బ్రహ్మోత్సవ సందర్భముననే 'తిరుమోళి' పారాయణము జరిగెడిది. నిత్యపూజా విధానములో తిరుమలనంబి కుటుంబములోని సభ్యులలో నెవరో యొకరు పాల్గొని శ్రీవారికి మన్త్రపుష్పము (సంస్కృతము) పఠించెడివారు. ఇదియొక్కటియే వైష్ణవులు శ్రీవారిసేవలో పాల్గొనెడి పూజా కార్యక్రమము. వైఖానసాగమముగాని, పాంచరాత్రాగమముగాని, 'శిలప్పదికారము' లో చెప్పఁబడినట్లుగా, శ్రీరంగములో క్రీ. శ. 756 సంవత్సరమునకీ సంప్రదాయముగానుండిన పూజావిధానమును తిరుమల శ్రీవారిఆలయములో ననుమోదించలేదు. సామూహిక వేదపఠనమును గుఱించి, ఉత్సవ దినములలో పారాయణ మొనర్చుటనుగూర్చి ప్రాచీన శాసనములో నెచటను ఉదహరింపఁ బడలేదు. 15 వ శతాబ్దపు పూర్వ భాగములో శ్రీ వీరప్రతాప వీరకృష్ణదేవరాయ మహారాజు 20 మంది మహాజనులను ఏర్పాటుచేసి ప్రతినెలకు ఇరువురను వంతులవారీగా ఈ సేవార్థమునియమించిరి. తిరుమలనంబి అనుయాయులు, అనందాళ్వారు, దేవాలయపు ఆచార్య పురుషులుగా నుండుటచే వారు మాత్రమే అర్చకులతో సన్నిహితముగానుండి శ్రీవారి నిత్యపూజలో సహాయకారులుగానుండిరి. ఈ కారణముచేతనే శ్రీవారి ఆలయ జీర్ణోద్ధార కార్యక్రమములో చాలవరకు వైఖానసాగమ విధానమే తన ప్రభావమును జూపినది.

## గర్భగృహము — జీర్ణోద్ధార కార్యక్రమము

తి. తి. దేవస్థానముల శాసనపట్టీ 1 వ వాల్యూములో 88 వ శాసనము ననుసరించి ప్రాచీనాలయము 'కోయిలాళ్వారు' గా పేర్కొనఁబడి

నట్లు తెలియుచున్నది. జీర్ణోద్ధార కార్యక్రమము కోయిలాళ్వారుకు దేవాలయనిర్మాణముగాఁ బేర్కొనఁబడినది. ఇది ఒక నూత్నభావము. పాఁతక్రొత్త గోడల నడుమ విరామ స్థలముండెనో, లేదో. తెలిసికొనుటకు గాని, తెలిసికొన్నందులవల్ల వచ్చెడి ప్రయోజనముగాని మరేమియు నుండబోదు. ఆలయ విమానమును గుఱించి యది పాఁత గోడల నాధారము చేసికొని కట్టఁబడినదో లేక క్రొత్త గోడలు కట్టిన తరువాత వీరనరసింగరాయలచే నీ నిర్మాణము గావింపబడెనో శాసనములలో తెలుపబడలేదు. విమానము మూలకొలతలు, ఎత్తుకొలతలు గ్రహించినచో విమాన నిర్మాణమును గుఱించిన నిర్దుష్ట విషయములు తేట తెల్లమగును.

ప్రాచీనదేవాలయమునకుగూడ నన్నివైపుల తూర్పునగాక నడవ యొకటి దించబడినది. ఆ నడవ మూయబడిగాని, మూయబడకగాని యుండవచ్చును. విమానముపైనుండి కాని లేక పైకప్పునుండి కాని వర్షపునీరు గోడలకు ప్రక్కగా ప్రవహించుటకు కాలువయుండెడిది. క్రొత్తదేవాలయము నిర్మింపనెంచి నపుడివి యన్నియును పూర్తిగా పగులగొట్టబడియుండును. క్రొత్త దేవాలయ నిర్మాణసందర్భములో పాఁతప్రాకారపు గోడలు పగులగొట్టఁబడిన విషయమును గుఱించిగాని ఎట్టి విస్పష్ట ప్రకటనము చేసియుండలేదు. పాఁత దేవాలయపు గోడల మీఁద నుండెడి ప్రాచీన శిలాశాసనము నమూనాలు వ్రాయించి క్రొత్త దేవాలయపు గోడలు కట్టునపుడు వానిని మొదటి ప్రాకారపు ఉత్తర కుడ్యము మీఁద చెక్కించినటుల తెలుపుచున్న శాసనమున్నది. ప్రదక్షిణముతోకూడి పాతప్రాకారపు గోడయుండినటులు అటగల యనేక తునకలు, నసమగ్రములు నగు శాసనములతో నిర్మాణము గావించిన క్రొత్త ప్రదక్షిణము లోపలి వైపు భాగమును గమనించినచోఁ దెలియును. క్రొత్త ప్రదక్షిణపు లోపలి ప్రాకారపు గోడలు ఉబ్బెత్తుగానుండి, నున్నగా చెక్కబడని శిలలని మనము చూడగనే గ్రహించ గలుగుదుము. ఇది

శిల్పకళా నైపుణ్యమును ప్రదర్శించిన తావునుగాదు. క్రొత్త ప్రదక్షిణము దాని ప్రాకారముతోగూడ నిదియొక 'ఆలయమని' ఒకశాసనములో పేర్కొనఁబడినది. 'కోయిల్ ఆళ్వారు'కు అనగా దేవాలయమునకే యిది దేవాలయమని శాసనములోనున్నది. మొదటి ప్రదక్షిణము దేవాలయముగా భావించుట అసమంజసము. ఒకదేవాలయములో నొక విగ్రహముంచుటయన్నది సామాన్యమగు విషయము. ఈ క్రొత్త ప్రదక్షిణము మరికొన్ని విగ్రహములను పూజార్థమై యుంచుటకుగాను నిర్మించినట్లూహింపనగును. క్రొత్త గర్భాలయమునకుగల వెలుపలి భాగము పైకప్పు క్రిందగల ప్రదక్షిణపుటంతరాలమును మూసియుంచుట ఈ యూహను బలపఱచును. దక్షిణపు ప్రదక్షిణపుగోడ నిర్మాణప్రణాళిక, పెంపుదలను గమనించినచో గోడమధ్యభాగమున నొక గూడునిర్మాణము చేయబడెనని తెలియును. ఇట్టి గూడులే పశ్చిమోత్తర కుడ్యములందును గలవు. తూర్పువైపునను వాకిలికిదక్షిణముగా నిట్టిగూడు నిర్మింపఁబడి యుండును. ఇది మందమగు గోడలచేఁ గప్పబడి తరువాత రాముల వారి మేడగా రూపొందుటకు హేతువయినది. ఉత్తరదక్షిణ దిశలలో కట్టబడిన ఈ రెండు చిన్నగోడల పర్యవసానముగా క్రొత్త ప్రదక్షిణమునకు తూర్పుభాగముగా భాసించినది. దీనికి మరల గోడలుకట్టబడి తూర్పు ప్రదక్షిణము మూయఁబడినది. ఇట్టి గూడులతో నేర్పాటుచేయబడిన ప్రదక్షిణపుగోడలుగల గర్భాలయములు పాంచరాత్రాగమ సమ్మతములు. వైఖానసాగమమును వీనిని సమ్మతించినది. ఇవికాక దక్షిణ పశ్చిమోత్తరపు మూలలందు పైన పేర్కొన్నవి గాక మరి మూడుగూడు లుండనగును. వీని యన్నింటియందును విగ్రహములనుంచుటయే లక్ష్యము. పైనుండి వర్షపు చినుకులను తప్పించుటకుగాను అంతరాళము పైభాగము అచ్చటచ్చట కొద్ది వెలుతురును జొఱజేయ వీలొసంగుచు మిగిలినదంతయు మూయబడినది.

## ఉత్తరపువైపుప్రదక్షిణము

దక్షిణ దిశను, పశ్చిమపు దిశనుగల ప్రదక్షిణపు కొలతలకంటె ఉత్తరపువైపు ప్రదక్షిణపు వెడల్పు ఎక్కువ. ఇదియెందుకు ఎక్కువగా నుండునట్లు నిర్మింపబడినదో మనమూహింపఁజాలము. అన్ని దిశలలో పైకప్పు ఒకవైపు ప్రాకారపు గోడలపయికి గలదు. రెండవ వయిపు వర్తులాకారముగానున్న స్తంభముల పయిననున్న రాతి దూలము పయినానియున్నది. అతి చక్కని చెక్కడపు రాతితో నిర్మాణము చేయబడిన శ్రీవారి సన్నిధి గోడల వెలుపలి భాగము ప్రక్కన నీ స్తంభములు, నీ దూలములెట్టి శిల్పకళారామణీయకతలేక వెల వెల బోవుచున్నవి. ఉత్తరపువైపు కప్పునకు వీనికితోడు మధ్యవరుసలో మరికొన్ని రాతిస్తంభములు పూర్వమున్నవానికి సహాయభూతముగా నుండుట కమర్చబడినవి. ఇవి మొత్తము 7 స్తంభములు వరుసగా నున్నవి. ఇవి పరిమాణములో మిగిలిన వానికంటె చిన్నవై, క్రిందయెత్తు సరిపడుటకు తగిన రాతి కట్టడపు దిమ్మెలు యేర్పాటు చేయబడినవి. ఈ కారణము చేతనే ఈ యుత్తరపువైపు ప్రదక్షిణము వెడల్పు పెంపుచేయుట, చివరలో నాకస్మికముగా జరిగిన యాలోచనా ఫలితమని చెప్పుటకు వీలొసంగుచున్నది. వరుసలోని స్తంభములు పరిమాణములో చిన్నవగుటతో నప్పటికి ఆ కొలతగల స్తంభములు నిర్మాణములో లేకుండియుండును. అప్పటికి యందుబాటులో నున్న వాని నీ పెంపుదలకు వినియోగించియుందురని యూహించవచ్చును.

ఉత్తర దిశను 9' పొడవు గల గోముఖ నిర్మాణముగూడ యాకస్మికాలోచనా ఫలితమేయని చెప్పవలసియున్నది. గోముఖము గర్భగృహముయొక్క లోపలిభాగమును ప్రదక్షిణముతో కలుపుచు అల్పమయిన పరిమాణము కలిగి లోపలినుండి యుపయోగింపఁబడిన నీరు, తదితర అనవసర పదార్థములు ఎట్టి అడ్డులేక వెడలనడిపెడి చిన్నకాలువగా రూపొందుట దీని లక్ష్యము. 9' పొడవుగల రంధ్ర

మున శ్రీవారి గర్భగృహము లోపలిరంధ్రమునుండి సుమారు 12 పాదవుగల రంధ్రముతో కలిపి త్రోయుట యాచరణలో నసాధ్యము. బయటనుండి యిట్టిది సాధ్యమేమోయని విచారించుచో 10' వెడల్పున్న ప్రదక్షిణపు నడవయున్ననేగాని సాధ్యముగాని విషయమిది. లోపల అసలు స్థలము లేని విషయము చెప్పనే చెప్పుచున్నది. అడ్డుతగిలెడి బరువు పదార్థములను త్రోయవలెనన్నచో నదియసలే సాధ్యముకాదు. ఈ కారణముచేతనే నాడు గోముఖమును చివరి యభిప్రాయముగా మూసివేసియుందురు. ఇప్పుడు మాత్రమీ గోముఖము సక్రమముగాఁ బనిచేయుచున్నది. తీర్థము లోపలినుండి నిరాటంకముగా బయటకు వచ్చుచున్నది. ఉత్తరపు ప్రదక్షిణపు నడవలో ప్రాచీనమున నా స్థానములు శ్రీవారి యుత్సవులకు నిర్వహించెడివారు. ఆకాలములోనే యితర మంటపములు అందు బాటులో నేర్పఱుపబడి యుండని కారణముచే దీనిని ఆస్థానములకు వినియోగించెడివారు. స్నపన మంటపము కేవలము స్నపన విధికి మాత్రమే వినియోగింపఁబడెడిది.

## మొదటి ప్రదక్షిణము మూయబడుట

మొదటి ప్రదక్షిణమెంత సాహసముతో, నెంతత్వరితముగా నిర్మింపఁబడినదో అంతత్వరితముగనే మూయఁబడినది. రాములవారి మేడ దక్షిణపుగోడకు దక్షిణముఖముగాగల రెండు శాసనములను బట్టి క్రీ.శ. 1262 వ సంవత్సరమునకుఁ బూర్వమే అనగా సుందర పాండ్యుడు బంగారు శిఖర ప్రతిష్ఠ చేయించినకాలముననో ముఖ్యముగా వీరనరసింగ యాదవరాయలు శ్రీవారి ఆలయ విమానమునకు రాగిరేకులపయి బంగారపు పూత పూయించినప్పుడో ఈ ప్రదక్షిణము మూయబడి యుండునని తెలియుచున్నది. ఈ రెండు శాసనములలో నొకటి విజయగండ గోపాలుఁడను తెలుగు పల్లవ సైన్యాధిపతి వ్రాయించినది. ఈతఁడును వీరనరసింగ యాదవరాయనివలె సుందర పాండ్యున కనుచరుఁడు. క్రీ.శ. 1250-1285

ప్రాంతములోనీయన రాజుగా నుండెను. కాని యీయన రాజకీయ జీవిత మీ కాలమునకుముందునుండియే ప్రారంభమయియుండును. ముక్కోటి ప్రదక్షిణముగోడలపయి కొన్ని ఛిద్రశాసనములున్నవని తెలిసికొంటిమి. వానిలోనీయన క్రొత్తప్రాకారము, క్రొత్తప్రాకారపు గోడలు కట్టకమునుపు కాలములోనే కొన్నిదానశాసనములు వ్రాయించి నట్లు తెలియుచున్నది. పైన చెప్పిన రెండుశాసనములలో నొకటి సమగ్రమయినది. ఇది రాములవారి మేడగలగోడ కట్టఁబడిన తరువాత వ్రాయబడిన శాసనము. ఇది విజయగండ గోపాలుని వితరణ వైశాల్యమును వివరించిన శాసనము. ప్రతిమనుష్యుడు ఆయనచేత మేలుపొందిన వాఁడేయన్న విషయమును, అపొందిన ప్రతిమనుష్యుఁ డాతనికి మిక్కిలి కృతజ్ఞుఁడయినట్లు వ్రాయబడియున్నది. రెండవ శాసన మసమగ్రము, ఛిద్రము. ఇందు విజయగండ గోపాలునిరాణి 'దేవరాశి' శ్రీవారి ఆలయములో మూడు అఖండదీపములు వెలిగించుటకు గోవులను దానమిచ్చినట్లున్నది. ఇట్టి అసమగ్రశాసనములు తరువాత కాలములో నొక క్రొత్తగోడపయి చూడబడినచో ఈ శాసనము మరియొకచోటనుండి యిపుడున్న ప్రదేశమునకు గొని రాబడియుండునని యూహచేయుట సమంజసము. ఈ శాసనము మొదటగా క్రొత్త ప్రాకారపు దక్షిణపుగోడపయి తూర్పుగోడ కలియు ప్రదేశమున నుండవలయును. రాములవారిమేడ నిర్మాణమునకయి ఆ గోడ పగులగొట్టఁబడి రాళ్లుపెకలింపఁబడియుండును. ఆ తరువాత తీయబడిన రాళ్లను రాములవారిమేడ గోడ నిర్మాణములో నుపయోగించి యుందురు. ఈ శాసనమున్న శిల తీయబడుట, మరల నతికింపబడుటలో ఛిద్రమయియుండును. దీని సారాంశము చెప్పఁబోవునదే మన రాములవారి మేడ నిర్మాణకాలము క్రీ. శ. 1262 – 1285 ప్రాంతము లోనయి యుండునని చెప్పుటయే. ఈ నిర్మాణ సందర్భములోనే ఉత్తర దక్షిణ ప్రాకారపుగోడల తూర్పువయిపు కొనభాగము పగులగొట్టఁబడి యుండును. ఈ నిర్మాణము పూర్తి అయిన తరువాత తూర్పు ప్రదక్షి

ణము పూర్తిగా మూయబడినను కొన్నినాళ్లు మిగిలిన మూడువయిపుల ప్రదక్షిణమునకు తెరువబడియుంచును ఇప్పుడు గోదలచే, ద్వారము లకు తలుపులచే పూర్తిగా ప్రదక్షిణ మార్గము మూయబడుట అనంతర కాలములో జరిగినది.

ఈ ప్రదక్షిణమును నిర్మించుటలో మొదటి ప్రదక్షిణముగూడ నాలయముగా భావించుట, నాలుగు అదనపు మూర్తులను నాలుగువైపుల నుంచుట యే నిర్మాతల యుద్దేశము. రాములవారిమేడను నిర్మించు టతో నీ పథకము విఫలమయినది. అయ్యును తరువాత కొంతకాలము వరకు మిగిలిన మూడువైపుల భక్తులకు ప్రదక్షిణ నిమిత్తమై తెఱచి యుంచిరి. తూర్పువైపు ప్రదక్షిణమార్గము లేకపోవుటతో మిగిలిన మూడువైపుల ప్రదక్షిణమున్నను నది ప్రదక్షిణమార్గమను పదమున కన్వయము కాజాలదు. ఈ ప్రదక్షిణమార్గమును మూసివేయుటలో మరియొక ప్రయోజనము సాధింపఁబడినది. పాంచరాత్రులు వారి శాస్త్రానుసారము చతుర్మూర్తుల ఆలయముగా శ్రీవారి ఆలయమును రూపొందింపజేయుటకు ప్రయత్నము నిరోధింపబడినట్లయినది.

## ముక్కోటి ప్రదక్షిణము మూసియుంచుటకు రాములవారిమేడ రూపొందుటకుఁగల కారణములు

క్రొత్త దేవాలయ నిర్మాణపురీతులు వైఖానసాగమ విధానము నకుఁ గావలసినంత యెక్కువగా నుపయోగపడినవని చెప్పవచ్చును. వైఖానసాగమ విధానమున కనువయిన మూర్తులే విమానమందున్నవి. ప్రథమ తలమునందు పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధ మూర్తులు ప్రతిష్ఠింపఁబడి యున్నారు. ఇవి ప్రాగాది చతుర్దిశలయందున్నవి. ఇట మనము లోతులకువెళ్ళి పరిశీలింప నవసరములేదు. దానిపైతల ములో పూర్వదిశలో విష్ణువు, పశ్చిమమున నారసింహామూర్తి, ఉత్తర

మున వారాహమూర్తి, దక్షిణమున దక్షిణామూర్తి ప్రతిష్ఠింపఁబడిరి. ఆలయము క్రిందిభాగమునగల గోడలలో గూడులు నిర్మాణమయినవి. అందు సత్యమూర్తి, అచ్యుతమూర్తి, అనిరుద్ధమూర్తులు పురుషమూర్తి ఉంచబడి ప్రతిష్ఠింపబడి యుండెడివి. ప్రదక్షిణ నిర్మాణమే యీ లక్ష్యము నెరవేర్చుటకయి యున్నది. ఆదర్శమగు వైఖానసాలయము తొమ్మిది మూర్తులుగలిగి యుండవలెను. పై మూర్తులతోబాటు నరనారాయణ, వారాహము, నృసింహమూర్తులు ప్రతిష్ఠింపబడుచో నది పూర్తిగా వైఖానసాగమవిధానముగా నిర్మించినట్టి యాలయమయ్యెడిది. పాంచ రాత్రాగమమును పంచమూర్తి విధానము నంగీకరించును, గాని వారు మానుషవ్యూహములైన వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ మూర్తులను ప్రతిష్ఠించుటలో నెక్కువ శ్రద్ధవహింతురు. వీరుదీనితో నాగక గర్భగృహమందే బ్రహ్మ, శివ, మార్కండేయ, భృగువులను ప్రతిష్ఠింపదలంతురు. వీనిని వైఖానసాగమమును సమ్మతించును. రెండవద్వారముకడ విఖనసమహర్షి స్థానమును శాస్త్రములు నిర్దేశించి నవి. వీరెవ్వరును నేడు శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపఁబడనప్పటికిని వారికి నేటికిని మానసికపూజ ఆలయములో జరుగుచుండుననియే నా విశ్వాసము. ఒకసారి నూత్న విగ్రహములను ప్రతిష్ఠించుటకు యత్నించినచో నిక వరుసగా వీనినన్నింటిని ప్రతిష్ఠింపవలసియుండును. గణేశుఁడు, దుర్గాదేవికూడ యీ కోవలోనికేవత్తురు. శ్రీమద్రామాను జుల అనుయాయులుగాని, ఆళ్వారుల భక్తిసిద్ధాంత ప్రవర్తకులుగాని యీ రాగల సంభావ్య విషయములనుగుఱించి నాడు సంతృప్తితో గమ నించి యుండిరా?

దేవాలయ పూజావిధానమెట్టి మార్పులతో ప్రయాణించు చుండెనో సమీక్షించుటయే ప్రస్తుతముచేయవలసినది.

ఈ ముక్కోటి ప్రదక్షిణము వీరనరసింగయాదవరాయల కాల ములో జరిగెనో లేక తరువాత జరిగెనో చెప్పుటసాధ్యముకాదు.

ఈ ప్రదక్షిణమును పూర్తిగామూసి యుంచుటలో, మౌలికమయిన పూజా విధానములో మార్పుతెచ్చుటకుద్దేశించిన నిర్మాణ చిహ్నములనుండి ప్రజల దృష్టిని మరల్చుటయే లక్ష్యముగానుండెనని చెప్పవచ్చును. తెలుగు పల్లవరాజయిన విజయగండగోపాలుడు తఱచుగా తిరుమలకు వచ్చి శ్రీవారిని సేవించు మహాభక్తుడు. ఈతఁడు తిరుమల తిరుపతులలో జరుగు నుత్సవముల సమయములో యాత్రికులకు భోజనవసతిని యుచితముగా సమకూర్చుటకు దానశాసనము వ్రాయించిన యుదారుఁడు. ఆ కారణముచేతనే యీయన శ్రీవైష్ణవుల కతిప్రియమయినవాఁడయ్యెను. రాములవారిమేడకడ వ్రాయించిన శాసనములో నీయన వితరణా వైశిష్ట్యమును పెద్దగాచేసి చెప్పఁబడిన విషయమును మనము గమనించ గలము. ఈ రాములవారిమేడకు ఏర్పాటుచేయఁబడిన గోడలవలననే దేవాలయ పూజావిధానములో విపరీతమయిన మార్పులను ప్రవేశ పెట్టెడి యత్నము నిర్మూలింపఁబడినది. ఈ కాలములో విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులగు ప్రముఖాచార్యులు కంచి 'అప్పుళ్ళార్' 'నడదూరు అమ్మాళ్' మొదలయినవారు విజయగండగోపాలుని హృదయములో నీ వైష్ణవభక్తి బీజములను నాటియుందురనుటలో సందేహము లేదు. ఈయనకు తిరుమలతో ఆనుబంధము ఈ విషయముగ నెక్కువ యయినది. ఇంకను వీరనరసింగరాయని మరణముతో నది మరింత హెచ్చయినది. కనుకనే ఈతని తిరుమలయనుబంధమున కీకాలములో నత్యంత ప్రాధాన్యమును జెప్పవచ్చును.

ఇతరములగు మూర్తులు ఈ యాలయమందు ప్రతిష్ఠింపఁబడక యుండుటయే ఈ దేవాలయముయొక్క ప్రత్యేక ప్రాధాన్యముగా చెప్ప నగును. ఇందు వరదరాజస్వామి, నరసింహస్వామి వారల సన్నిధు లున్నప్పటికిని వానికి ప్రత్యేక పూజలేదు. గర్భాలయములో శ్రీరామ శ్రీకృష్ణ విగ్రహములున్నవి. వారికిని శ్రీవారితో జరిగెడి పూజయే గాని ప్రత్యేకపూజలేదు. పూర్వమునుండికూడ శ్రీ రామ నవమి,

శ్రీజయంతి, నృసింహజయంతి మొదలగు పర్వదినములందుగూడ ప్రత్యేక ప్రసాదములు శ్రీవారికి సమర్పించుటయే సంప్రదాయముగాని ఆయా పర్వదినములతో సంబంధించిన దేవతలకుగాదు. తిరుమలలో యే యితర దేవాలయ నిర్మాణము ననుమతింపబడకుండుటయు నీ కారణముచేతనే. ఇతర దేవతలకు సంబంధించిన పర్వ దినములందు జరిగెడి ప్రత్యేక యుత్సవములుగాని ఆచార్యపురుషుల యుత్సవాదులుగాని నీ దేవాలయమందు జరుపుట యనెడిది యసంప్రదాయము. జరుగని పని. వైష్ణవాళ్వారులకుఁగూడ వారి వారి ప్రత్యేకతాదినములలో నీయాలయములో గుర్తింపు లభింపదు. కాని నేడు ప్రాచీన సంప్రదాయములు వాని ప్రత్యేకతలు పూర్తిగా లుప్తమయ్యెనని చెప్పవచ్చును.

## విమాన ప్రదక్షిణము :

## మొదటి ప్రాకారపు గోడల బాహ్యముఖములు

ఈ యధ్యాయములో నీ విషయమును గుఱించి ప్రథమముగా లోపల ప్రాత గర్భగృహపు గోడలకు గల నాలుగు తమిళ శాసనములన కళ్ళు వ్రాయించి వానిని మొదటి ప్రాకారపు ఉత్తర కుడ్యముల పయి చెక్కించినట్లు, ఇది క్రీ. శ. 1250 వ సంవత్సరము ప్రాంతములోని సంఘటనముగను, దీని తరువాత రమా రమి 130 సంవత్సరముల వరకు దక్షిణ పశ్చిమ కుడ్యముల పయి నేవిధమయిన శాసనములు లిఖింపబడనట్లు తెలుపబడినది. ఉత్తరపు గోడపయి క్రీ. శ. 1446 వ సంవత్సరములో అనగా మొదటగా శాసనములు తిరుగ వ్రాయబడిన కాలమునకు సుమారు 200 సంవత్సరములకు తరువాత మరియొక నూత్న శాసనము వ్రాయబడినది. దీనికిఁ గొంత వివరణమిట నవసరము.

క్రీ. శ. 1250 - 1380 సంవత్సరముల నడుమ మహా ప్రభువులచే, నితర ప్రముఖులచే నీయబడిన దానముల వివరములు శాసనములుగా

దేవాలయమున నితర ప్రదేశములలో లిఖింపఁబడినవి కాని ప్రథమ ప్రాకార కుడ్యము పయిని వ్రాయబడలేదు విమాన ప్రదక్షిణపు గోడల పయి యింత దీర్ఘకాలము వరకు శాసనములు వ్రాయబడకుండుట కేదియో కారణముండకపోదు ఈ 130 సంవత్సరముల కాలములోను మొదటి ప్రాకారపు గోడలు మాత్ర ములిచెక్కుడు బారిఁబడక యున్నవి. శాసనము లేవేని యున్నచో నవి మూరు మూలలనున్నవి. హిందూమత మును సంరక్షించుటకయి ముస్లిముల దురాగతములవణచిన వీరవరులచే నీదానశాసనములు వ్రాయించబడినవి. రాజులగు బుక్కరాయలు, సుందర పాండ్యుఁడు యాదవరాయ మహారాజులు. మంగిదేవ మహా రాజు, కుమారవీరకంపన్న మహానాయక రాజసోదరులు తిరుమలను దర్శించికి వీరందరును శ్రీవారినర్చించి యభీష్టములను బడసినవారే. భగవచ్ఛక్తియే తానయియున్న శ్రీవారు ఈ దురాగతముల నణచుటలో వీరి హృదయములోనిలిచిరి. తత్కృతజ్ఞతా సూచకముగా వారు దాన శాసనములను వ్రాయించిరి. ఏ కారణముచేత వారు ప్రాకార కుడ్యముల పయి దానశాసనములు వ్రాయించక ఖాళీగానుంచియుండిరో మనమూ హింపవలసి యున్నదేగాని ఇది నిశ్చితమని చెప్పవీలులేదు.

తాను నిర్మాణమును చేసిన దేవాలయమును గురించిగాని, విమానమునకు బంగారుపూత వేయించిన కార్యము వలనగాని, సుందరపాండ్యుఁడు బంగారు కలశమును విమానముపయి ప్రతిష్ఠించి నందులకుగాని వీరనరసింగ యాదవరాయలు సంతృప్తిపడియుండడు. క్రొత్త ప్రదక్షిణములో నుంపఁబడిన ప్రాఁత స్తంభముల వరుస యే శిల్పకళా ప్రావీణ్యము జూపక నిశితముగాఁ జెక్కఁబడక నుంపబడిన విధ మీయూహకు బలము చేకూర్చును. లోపలి ప్రాకారములో శిథిలమయిన శిలాఫలకముల ఛిద్రముల నేర్చి కూర్చి కవికరముతో వాని నాప్రాకారపు లోపలి భాగముననే నమర్పఁజేసియుందురు. చివరి క్షణములో ఏకమూర్తి ఆలయ సంప్రదాయము ననుసరించి క్రొత్త

దేవాలయ నిర్మాణము జరిగియుండలేదనియు తెలిసికొనియుండును. ఆ కారణము చేతనే ప్రదక్షిణము మూయఁబడ, తన జీవితకాలములోనే రాములవారిమేడ నిర్మాణమును జరిగించి యుండును. అతని మరణము తరువాత నేమి మార్పులు జరిగెనో! అతని తరువాత రాజులయినవారి దానశాసనములవలనను, ఆ మహనీయులు శ్రీవారిని దర్శించిన విధమును తెలిసిననేగాని మనము నిర్ణయించుకొనలేము ఆయన తరువాత రాజుగానెవ్వరైరో తెలియదు. శ్రీవారి విమానమునకు బంగారు పూత పూయుటకు తాను స్వయముగా తులారోహణమును తూగి సమర్పించిన దానమును నాటికాలములోని బుద్ధిమంతులు గర్హించిరనియు, ఇది సవ్యమైన వ్యయముగా వారంగీకరింపలేదనియు తెలియుచున్నది. భగవంతుని చేయుసేవ యతినిరాడంబరమై యుండవలెనని వారి యూహ. ఈ నిరాడంబరత యనునది తాను తులాహరణము గావించుకొన్న సందర్భములో తగిలించుకొన్న రాజ బిరుదముల ప్రసక్తితో వ్యర్థమయ్యెను. ఈయన తరువాత క్రీ. శ. 1264 నుండి 1320 వ సంవత్సరము వరకు సమర్థుఁడయిన ప్రభువు రాజ్యమునకు వచ్చినట్లుగా భావింపఁజాలము. క్రీ. శ. 1320 వ సంవత్సరములో మాత్రమే సమర్థుఁడయిన రాజుగా పేరెన్నిక గన్న తిరువేంకటనాథ యాదవ రాయలు రాజయినట్లు వినుచున్నాము. తాను రాజ్యము నా శ్రీవారి ప్రభావముచేతను, వారి యందలి యచంచల విశ్వాసముచేతను చేయుచున్నట్లు తెలుపుటకే తిరువేంకటనాథుని పేరు ధరించి యుండెను.

నాడు దక్షిణ భారతదేశమే మిక్కిలి విపత్కర పరిస్థితిలో నుండెను. సుందరపాండ్యుఁడు కృష్ణానది వరకు దండెత్తుట వలన గాని, శ్రీవారి విమానము పయినను, కంచి, చిదంబరము, శ్రీ రంగములలోని ఆలయముల పయినను బంగారు కలశముల స్థాపనము వలనగాని, దేశములో నాడు శాంతి స్థాపింపఁబడలేదు. తన పరిసరములలోని రాజ్యముల వలననే తనకు మనశ్శాంతి లేకుఁడపోయెను

తన బంధువులను సంతృప్తి పఱచుటకొఱకయి వారికి రాజోద్యోగము లీయవలసివచ్చెను. క్రీ. శ. 1253 వ సంవత్సరములో జటావర్మ వీరపాండ్యరాజీ విధముగ నియమింపఁ బడినవాఁడే. క్రీ. శ. 1268 లో కులశేఖర మారవర్మ చక్రవర్తియయ్యెను. క్రీ.శ. 1276 లో రెండవ జటావర్మ సుందరపాండ్యుడు రాజుగాఁజేయఁబడెను. క్రీ.శ. 1283 లో రెండవ విక్రమ పాండ్యుడు, క్రీ. శ. 1291 లో జటావర్మ శ్రీవల్లభుఁడు, 1296 లో రెండవ వీరపాండ్యుడు, 1310 లో మూడవ జటావర్మ సుందర పాండ్యుఁడు ఉప ప్రభువులుగాఁజేయబడిరి. క్రీ.శ 1310-11 లలో మారవర్మ కులశేఖర చక్రవర్తి హత్యగావింపబడెను. అదియే 3 వ సుందర పాండ్యునకును 2 వ వీరపాండ్యునకును నంతర్యుద్ధమును తెచ్చిపెట్టినది. వీరిలో నొకరు మహమ్మదీయుల సహాయము కోరిన ఫలితముగ మాలిక్కాఫరు దక్షిణ దేశమునకు దండయాత్ర వెడలెను. ఈ సంఘటనముల ప్రభావము తొండమండలము పయినను బడినది. 13 వ శతాబ్దపు టంత్యభాగములో తిరుమల ప్రాంతము ఎవరి పర్యవేక్షణక్రింద గాని, ఎవరి హక్కుభుక్తములోను గాని లేకుండినది. క్రీ. శ. 1264 నుండి 1328 మధ్యప్రాంతములో (శ. సం. 1230) అనగా క్రీ శ. 1308వ సంవత్సరములో వేయబడిన ఒకే ఒక శాసనమున్నది. ఇది తిరుపతిలో ఆండాళ్ళు సన్నిధి (గోదాదేవి) ఉత్తరపు గోడపయి గలదు. కొన్ని ప్రత్యేక పర్వదినములలోవచ్చు యాత్రికులకు భోజన వసతులను సమకూర్చుటకుగాను దానమిచ్చిన శాసనము. ఈ శాసనములో ప్రభువుపేరుగాని రాజు పరిపాలనా సంవత్సరముగాని వేయబడలేదు. ఇట్టిదే దీనికి చాల పూర్వకాలమునాటిది మరియొక శాసనమున్నది. ఇది శక సంవత్సరము 824 నాటిది. అనగా క్రీ. శ. 902 నాటిది. కాలపుశాసనము. పల్లవుల పాలనమంతరించి చోళులపాలన మింకను స్థిరపడని కాలమునాటి శాసనముగా దీనినెన్నవచ్చును. తిరుకుక నూరు సభవారు తమస్వీయ బాధ్యతపయి పన్నులద్వారా వికరపొబడిని శ్రీవారి ఆలయ నిర్వహణమునకయి వెచ్చించిన విషయమిందున్నది.

ఇంపుశక సంవత్సరము మాత్రమున్నది. ఈ శాసనము తరువాత మరి 400 సంవత్సరముల కిట్టిదే మరియొక శాసనము కననయినది. పాండ్యుల పరిపాలన మంతరించినను తిరుమలలో వీరి ప్రభావము కలదు. ప్రాంతీయ పాలకుడు లేకుండుటతో నాతని పేరుగాని, పరిపాలనాకాలము గాని శాసనదాతలు వేయవీలైనది కాదు. కనుకనే శక సంవత్సరము మాత్రమే వేయబడినది. దేశమునకుబట్టిన ఈ దురవస్థ యంతటికిని వీరనరసింగ రాయలు చేసిన పనులనుబట్టి, అనగా శ్రీవారి పాతదేవా లయమును మూసి క్రొత్తదేవాలయమునుగట్టుట, ప్రాంత, గోడలను పగులగొట్టుట, క్రొత్త ప్రాకారములను నిర్మించుట యివియన్నియు ఈ దురాగతమును దెచ్చిపెట్టినవని నాటి జనులు విశ్వసించిరి. నేటి కాలములోను మూర్ఖులయిన ప్రజలు కొందఱు వర్షాభావము దేశ దారిద్ర్య పీడనము మొదలయినవి పాలకుల దుష్పరిపాలనా ఫలితమేనని భావించుట వినుచున్నాముకదా!

ముస్లిము దండయాత్రలు దేవతా కోప చిహ్నమని నాటి ప్రజల, కొందఱు పాలకుల భావనకూడ నైయున్నది. మాలిక్కాఫరు దామల చెఱువుమీదుగా గాని శాళహస్తిమార్గమునగాని వచ్చినచో నాతనికి తిరుమల క్రొత్తబంగారుపూత విమానము, బంగారపు శిఖరములు మొదటగా నాతని సొత్తయ్యెడివి. అట్టి విధమున గాకుండుట శ్రీవారి సంకల్పమేయని చెప్పవచ్చును. ఈతని పాలఁబడి యూచముట్టగఁ గొల్లకొట్టబడిన మొదటి దురదృష్టవంతుఁడు హోయసాల వీరభల్లాళ చక్రవర్తి. కాని వెంటనే యాతఁడు తెలివిగా క్రీ. శ. 1313 లో ఢిల్లీ సుల్తాను అల్లావుద్దీను ఖిల్జీతో శాంతియొప్పందమును చేసికొనెను. మాలిక్కాఫరు దక్షిణదేశములోని ఇతర దేవాలయములను కొల్లగొట్టి ఢిల్లీకి మరలవలసివచ్చెను. ముబారక్ ఢిల్లీ ప్రభువయిన తరువాత క్రీ. శ. 1316 లో మరియొక దండయాత్రను జరిపి దేవగిరిని తనరాజ్య మున గలుపుకొనెను. ఆ కారణముచే వీరభల్లాలుడు మరల ఢిల్లీసుల్తా

మతో దండయాత్ర జరుపుటకు సర్వసన్నాహములు సమకూర్చుకొన వలసి వచ్చెను.

తిరుపతికొండలకు పోయెడి త్రోవను కాపాడుట యాతనికిఁ బ్రథమకర్తవ్యమయ్యెను. దానికయి తనమంత్రియు, సేనానాయకుఁడునగు సింగయ్య దండనాయకుని తిరుపతికిఁ బంపెను. అతఁడు అక్కడగల ప్రాంతీయ పాలకునకు సైనిక రక్షకునిగా నుంచబడెను. తి. తి. దేవస్థానపు శాసనములోని 1 వ సంపుటిలోని 162, 99 శాసనములలో నీ విషయము పేర్కొనఁబడినది. అందు 99 వ నెంబరుగల శాసనములో సింగయ్య దండనాయకుఁడు సుశిక్షితుడయిన సైనికుడేగాక చక్కని ఆధ్యాత్మికోన్నతి గలిగిన విష్ణుభక్తునిగా, శ్రీవైష్ణవునిగా బేర్కొనఁబడినది. ఇచటగల ప్రాంతీయ పరిపాలకుడయిన తిరు వేంకటనాథ యాదవరాయలను ఒక గ్రామమును శ్రీవారికి 'శీతకర గండసంధి' లో జరిగెడి అన్నప్రసాదములకు దానమీయవలసినదిగాఁ బ్రోత్సహించెను. యాదవరాయలు తనకు తానుగా అట్టి సంధికాలములో జరిగెడి అన్నప్రసాదముల నివేదనార్థము తనకుఁ బూర్వుఁడయిన యాదవనారాయణుని యుత్తమగతులకయి శాసనము వ్రాయించెను. ఇది క్రీ. శ. 1332 వ సంవత్సరకాలము నాటిది. వీరు వ్రాయించిన రెండుశాసనములను శ్రీవారి ఆలయము రెండవ ప్రాకారపు గోడపయి చెక్కించిరి. తిరుపతిలోకూడ నీ శాసనములున్నవి.

ఈ ముస్లిముల దండయాత్ర హేతువుచేతనే శ్రీరంగములోని రంగనాథస్వామివారి యుత్సవబేరమును మాత్రము రహస్యమార్గము ద్వారా తిరుమలకుఁ జేర్చిరి. తిరుమలలో శ్రీరంగనాథస్వామివారి ఉత్సవబేరమునకు వారి పాంచరాత్రాగమానుసారము పూజావిధానమును జరిగెడిది. క్రీ. శ. 1360 వరకు నిట్టి యేర్పాటులు కొనసాగినవి. తరువాత యీ యుత్సవబేరము దండయాత్రల భయమంతమగుటతో శ్రీరంగమునకుఁ దిరిగి చేర్చబడెను. ఆ కాలములో మతాచార్యులలో శ్రీ

వైష్ణవ ప్రముఖుఁడగు వేదాంతదేశికులవారు 'దయాశతకము' ను తమ శ్లోక గ్రంథములో శ్రీవేంకటేశ్వర స్వామివారిని ప్రశంసచేసెను. అంతేకాక సుల్తానుల పతనానంతరము శ్రీరంగములోని రంగనాథుని ఆలయములో నభీతిస్తవముచేసెను. విజయనగరాధిపతియగు 'కుమార వీరకంపన' నాయకత్వమున జరిగిన హిందూరాజుల సమ్మేళనము హిందువులకు విజయము చేకూర్చి పెట్టెను. ఆయారాజుల నామములు విజయము లభించిన సందర్భమున కృతజ్ఞతా సూచకముగా శ్రీవారికి సమర్పించిన దానశాసనములనుగూర్చి యింతకుముందు అధ్యాయము లోనే ప్రశంస చేయఁబడినది. అయినను మొదటి ప్రాకారపుగోడ-ను ఉలి చెక్కడములను శాకకుండుటకు దాని నిర్మాణమే యీ దుస్సంఘటన ములకు హేతువను అపప్రథకు జనము అలవాటుపడి యుండుట చేతను గావచ్చును లేదా అతి పవిత్రముగా దానిని భావించుట చేత నయినను గావచ్చును. మొదటి ప్రదక్షిణము మూసివేయఁబడి యుండు టతో నితరులకిది ప్రవేశమునకు అవకాశ మిచ్చియుండకపోవుట చేత నయినను గావచ్చును.

## క్రీ. శ. 1360 వ సంవత్సరము తరువాత

క్రీ. శ. 1360 వ సంవత్సరము తరువాత యెట్టకేలకు యీ నిస్తబ్దత తొలఁగినది. యాదవరాయలలో చిట్టచివరి వాఁడగు రంగనాథ యాదవరాయలకు వారసుఁడు లేదయ్యెను. దేశములో రాజకీయ పరిస్థితుల ప్రభావముచే దక్షిణ భారతమునకు విజయనగర ప్రభువులు చక్రవర్తులయిరి. తొండమండలమునకు రాజ ప్రతినిధిగా మంగిదేవ మహారాజు నియమింపఁబడెను. క్రొత్తస్థానిక సభాసదుల సంఘము శ్రీవారి ఆలయమునకు ధర్మకర్తృత్వము నెఱుపుటకు అమలులోనికి వచ్చెను. వారు తిరుపతి నివాసులు. శ్రీవారి ప్రాఁత, క్రొత్త ఆలయపు గోడలలో నెట్టి దోషము లేదనియు నది అపప్రథమాత్రమేననియు వీరెఱుఁగుదురు.

అలగప్పిరనార్ తిరుక్కలై కన్ని దాసర్ అనునాయన ఈ కాలములో తిరుపతిలోని శ్రీవైష్ణవులకు నాయకుఁడు ఈతనిదే తిరుమలలో ప్రథమ ప్రాకారపు ప్రదక్షిణపుగోడపై క్రీ. శ. 1380 వ సంవత్సరములో వ్రాయబడిన ప్రథమ శాసనము. ఈయన తరువాత క్రీ. శ. 1390 లో మ్యాల్లై తిరువేంకటజీయరు నాయకుడయ్యెను. ఈయన అరిశనాలయ నందనవనము, మఠములకు విచారణకర్త మరియు దేవాలయ నిర్వహణ భాగస్వామ్యమునుకూడ స్వీకరించెను. వీని తరువాత నితరులచే వ్రాయించిన శాసనములున్నవి. కాని ఉత్తరపు ప్రాకారపు గోడ మాత్రము క్రీ. శ. 1416 వరకు నెట్టి శాసనములు వ్రాయఁబడకయున్నది. ఈ సంవత్సరములోనే పెరియమల్లయ దేవమహారాజు ప్రాచీన చోళ శాసనముల ప్రక్కనే తన దాన శాసనమును వ్రాయించెను. ఈ ఉత్తర ప్రాకారకుడ్యముననే సాళువ నరసింహరాయల శాసనములుకూడగలవు. వీరప్రతాప వీరకృష్ణదేవరాయ మహారాజు ఈ ఉత్తరకుడ్యమును తను స్వయముగా వ్రాయించు శాసనములన్నింటిని ఇచటఁ బ్రకటించెను. అనేక శాసనములీగోడపయిని వ్రాయించెను. ఈయనచేసిన దాన సమర్పణములు, స్వామివారికి సమర్పించిన భూషణ వివరములు ఉత్తర కుడ్యమునను, రాణులచే సమర్పింపబడిన దానశాసన వివరములు కొన్ని యుత్తరపు గోడపయినను మరికొన్ని దక్షిణపు గోడపయినను వ్రాయింపఁ బడెను. ఈ గోడల బాహ్యముఖములు, అంతర్ముఖములు క్రీ. శ. 900 సంవత్సరమునుండి 16 వ శతాబ్దము వరకుగల మహత్తరమయిన విలువగల సమాచారమునుబట్టి యిచ్చుచున్నవి. ఈ శాసనములను వర్షాతపములనుండి సత్వర రక్షణకై దేవస్థానపుటధికారులు చర్యలు తీసుకొనవలసి యున్నది.

## స్నపన మంటపము :

బంగారు వాకిలి దాటిన వెంటనే మనమడుగిడు అంధకారమయ మగు గదియే నాటి స్నపన మంటపము. సంవత్సరములో వచ్చెడి ప్రత్యేక

పర్వదినములందు జరిగెడి ప్రత్యేక స్నపనాదులకు దీనినుపయోగించు టకు నిర్మాణమయినది. ఇది యిప్పుడిట్టి ప్రయోజనమునకై వినియోగింపఁబడుటలేదు. నేడిది 'శ్రీభాండారము' క్రింద వినియోగపడు చున్నది. శ్రీవారి జవహరీ, నగలు, సొమ్ములు, యితరములగు విలువయిన పట్టు వస్త్రములు ఈ గదిలో నుంచుచున్నారు. ఈ గదికి నాలుగు వయిపులనున్న నాలుగు చెక్కడపు స్తంభములచే దీనిని మంటప మనవచ్చును. గోడలలో రెండువరుసల స్తంభములున్నవి. ఇది 16 స్తంభములుగల మంట పాకృతి. ఈ స్తంభములుకూడ ప్రాచీనమయినవికావు. క్రీ. శ. 960 వ సంవత్సరములోనున్న స్తంభములు వర్తులాకృతులు. ఇది మనము ముక్కోటి ప్రదక్షిణములో నున్న స్తంభములతో పోల్చదగినవి. కాని నేడున్న స్తంభములు చక్కని శిల్ప విశేషములతో నమరింపబడినవి. చెక్కడపు రాతి కంబములు. చతురస్రాకృతులు. ఇవి హోయసాల, విజయనగర రాజుల కాలములో సాంప్రదాయక మైనట్టివి.

ఈ మంటపమే 966 వ సంవత్సరములో శ్రీ భోగ శ్రీనివాస మూర్తి ప్రతిష్ఠాపన సందర్భములో 'తిరువిలాన్ కోయిల్' గా నుండినది. ఇక్కడనే శ్రీ భోగ శ్రీనివాసమూర్తి కభిషేకము ప్రతిష్ఠాదులు నిర్వహింపబడినవి. పడమటివైపుగోడ, రాములవారిమేడకు త్రోవ, నూతన ఆలయము ప్రాకారపు గోడలతోపాటు నిర్మింపబడి యుండును. ఈ మంటపమునకు పడమటివైపున దప్ప మిగిలిన మూడు వైపులనాడు మూయబడి యుండదు. కారణమది యొక్కటియే మంటపమగుట, స్నపన (తిరుమంజన) ఉత్సవములు, ఇతర పర్వదినములలో నేవైనా యుత్సవములు జరిగించుటకై జనము చూచుటకు వీలుగానుండుటయే దీనిలోని యుద్దేశము. కాని అతిత్వరలోనే దీనిని దేవాలయమునకు సంబంధించిన విలువగల భూషాంబరాదుల నుంచెడి నిధానపుగదిగా మార్పుచేయుట యావశ్యకమని అధికారులు గుర్తించి యుందురు.

ఇపుడు ఈ మంటపమునకున్న ఉత్తర, దక్షిణ, తూర్పు ప్రాకారపుగోడల పయిన చెక్కిన శాసనములను బట్టి చూచినచో నేడున్న ముఖమంటపము అనగా బంగారు వాకిలికి వెలుపలనున్న ముఖమంటపము లేక తిరుమామణి మంటపము నిర్మింపబడక పూర్వమే ఈ స్నపన మంటపము 15 వ శతాబ్దము ప్రారంభములోనే నిధానపు గదిగా మార్చబడి యుండు నని తెలియుచున్నది.

ఈ మంటపమునకు తూర్పువైపునగల వాకిలిని నేడు బంగారు వాకిలియని పిలుచుచున్నారు. ఇటుగల ఉత్తర దక్షిణములలోనున్న వృత్తాకారపు స్తంభముల స్థానములో ననంతరము చతురస్ర స్తంభములు నెలకొల్పబడినవి. క్రీ. శ. 15 వ శతాబ్దము నుండి యీ నిధానపుగది పర్యవేక్షణకయి ' పోర్ భాండారి ' నిర్వాహకుల నేర్పాటుచేయుటతో దీని ప్రయోజనము సిద్ధించినట్లయినది. నేడు హుండీ (కొప్పెర) లో వేయబడిన కానుకలన్నియు నా గంగాళముతోబాటు ఈ స్నపన మంటపములో నీళ్ళువేసియుంచుచున్నారు. దానితో నిది శ్రీవారి వీక్షణ ప్రసారముల బడినట్లయినది. ఇప్పుడు మాత్రము గంగాళమొకటికి రెండు సార్లు తీయవలసి వచ్చుటచే పెట్టెలలో ఆ ధనమునుంచి సీళ్ళువేయు చున్నారు.

## తిరుమామణి మంటపము :

ఈ మంటపము నాలుగు వరుసల నాలుగు స్తంభములున్న పదునారు స్తంభములపై నెలకొల్పబడినది, చుట్టును మూడు వైపుల ఇనుప కటకటాలు ద్వారములతో నుండినట్టిది. ఈ మంటపమునకు పడమటి వైపున మధ్యలోనే బంగారు వాకిలి గలదు. ఇది ముఖ మంటపమగుటచే నాస్థానమంటపముగ నిది యుపయోగపడుచున్నది. ఈ మంటపముయొక్క వైశాల్యము 43′ × 40′ అడుగులు ఇది నాలుగు వరుసలలో నాలుగు స్తంభములుగా నుండి మూడు భాగములుగా

చేయఁబడినట్టిది. తూర్పు వైపునగల మధ్యభాగములో గరుత్మంతుని సన్నిధియున్నది. ఈ మంటపములో పడమటనున్న బంగారువాకిలి కిరువైపుల జయవిజయుల (ద్వారపాలకుల) స్థానములున్నవి. విగ్రహ ములునున్నవి. ఈ మంటపమున కిరువైపులనున్న భాగములలో నితరములగు కార్యక్రమములు జరుగుచున్నప్పటికి మధ్యభాగములో దేవస్థానమునకు సంబంధించిన నిత్యపూజా కార్యక్రమములు కొందఱు ప్రముఖుల సమక్షములో జరుగుచున్నవి. మధ్యభాగమును ప్రముఖులు వచ్చినపుడు దర్శనార్థము కొంచెముకాలము వేచియుండుటకును, లేన పుడు భక్తులు వరుసలో నిలబడి శ్రీవారిని దర్శించుటకు వెళ్ళు మార్గముగను కూడ దీనిని వినియోగించుచున్నారు. ఈ ప్రదేశములో నిత్యము శ్రీవారిని సుప్రభాత సేవలో సేవించుటకు భక్తాదులు బారులు తీరి నిలుచుందురు. ఇక్కడ సుప్రభాతమును పఠించు సమయములో బంగారు వాకిలి మూయబడును. లోపల అర్చక స్వాములు భోగ శ్రీనివాసమూర్తిని యూయల నుండి వేఱుపఱచి గర్భగృహములో శ్రీవారికడనున్న వీరి స్థానములో జేర్తురు. దీపములు వెలిగింతురు. సుప్రభాతమును పఠించు సమయములో వీనినన్నిఁటిని నిర్వర్తింతురు. తిరుమామణి మంటపు మధ్య భాగములోని చతురస్ర స్థలములో బలి బేరమగు కొలువు శ్రీనివాసుని విగ్రహమును వేంచేపుచేసి దర్బారు చేయింతురు. ఇది ఉదయము శ్రీవారి పూజా కార్యక్రమానంతరము అనగా తోమాలసేవా కార్యక్రమము పూర్తియయిన తరువాత దీనిని నిర్వర్తింతురు. పంచాంగ శ్రవణము జరుపుదురు. ఇప్పుడే మాత్రాదాన మును నిర్వహింతురు. మాత్రాదానమనగా ఒక కాంస్యపాత్రలో తండు లములనుంచి అందులో సగము గాని నాలవ భాగముగాని తిలలనుంచ వలయును. కదళీఫలములు, సువర్ణ తాంబూలాదులును సమర్పించవలెను. దానిని శ్రీ స్వామివారికి ప్రదర్శించవలెను. అట్లు ప్రదర్శించుచున్న అర్చక స్వామిని అధికారులు సమాశ్వాసించి ఆయనద్వారా దేవుని తాక జేయుట, మరల శ్రీవారినుండి దానిని అర్చకస్వామి గ్రహించుట— ఇవి

కార్యక్రమములు. ఇది శ్రీవారు నిత్యము అర్చక స్వామికి యొసంగెడి నిత్యకట్టడి. ఇది పూర్తియైన తరువాత, వేయించిన నువ్వులపొడితో బెల్లమును కలిపిన ప్రసాదము శ్రీవారికి నివేదింపఁబడును. తరువాత నటనున్న భక్తులకు వినియోగపఱుపఁబడును.

ప్రతి సంవత్సరము జరిగెడు బ్రహ్మోత్సవారంభము నాటి సాయంత్రమున ఉత్సవమూర్తి దేవేరులతో సహా అలంకరింపబడి తిరుచ్చిలో నిట వేంచేయుదురు. బ్రహ్మోత్సవమునకు రుసుము చెల్లించిన ఆర్జిత దాతలకు కుడి మణికట్టుకు ఎఱ్ఱని పట్టుదారములతో కంకణములు కట్టబడును. దీనినే దీక్షాకంకణమనియు నందురు. తరువాత సంప్రదాయ బద్ధముగా వెండి బెత్తముతో ఉత్సవమూర్తులతో వీధ్యుత్సవములో పాల్గొందురు. ప్రారంభములో కల్యాణ మంటపమే యనునది లేకున్న సమయమున, దినముల తరబడి దీపావళి ఆస్థానము వరకు శ్రీ మలయప్పస్వామివారు దేవేరులతో (ఉత్సవమూర్తులు) నీ మంటపములో వేంచేసియుండెడివారు. మార్గశిరములో జరిగెడి అధ్యయనోత్సవముల సందర్భములోకూడ 22 నుండి 23 దినములవరకు శ్రీవారి యుత్సవుల వేంచేపు ఇక్కడనే యుండెడిది. శ్రీ జయంతి నాటి రాత్రి మంటప మధ్యమున శ్రీ కృష్ణస్వామివారి కిక్కడనే అభిషేకాదులు, ఆ సమయముననే యుగ్ర శ్రీనివాసమూర్తి కభిషేకము, ద్వాదశారాధనములు ఈ మంటప మధ్యభాగమునకుఁ దూర్పునగల చతురశ్ర మంటపములో గరుత్మంతుని సన్నిధికెదురుగా జరుగును. ఈ ద్వాదశారాధన మీ సమయమున జరుగుట యన్నది విపరీతమే. ఇది నిజమునకు బ్రహ్మోత్సవానంతరము పదియవ రోజునాటిరాత్రి జరుగుట శాస్త్రసమ్మతము, కాని దీనిని నేడు పాటించుటలేదు. 'తిరుప్పావడ' అను అన్నప్రసాదములను శ్రీవారికి సమర్పించుకాలములో ఈ మంటప మధ్యభాగములోనే అనేక ప్రసాదములుంపబడి భోగ శ్రీనివాసమూర్తిని బంగారు వాకిలికడ వేంచేపుచేసి వీనిని శ్రీవారికి భోగ శ్రీనివాసమూర్తి పరముగా

సమర్పింతురు. పరిసర గ్రామములోని బీదలీవిషయమును (నాటి బహ్వాన్న ప్రసాద సమర్పణమును) ముందుగనే పసిగట్టి ఆ యన్న ప్రసాదమంతయు గ్రహించి పోవుదురు. ఇది చాల వ్యయముతో గూడినసేవ. తిరుమలలో శ్రీవారు బీదల నీ రూపమున కటాక్షింతురు. ఒక ప్రత్యేకాభిషేక సేవ 'సహస్రకలశాభిషేక' మన్న పేరుతో 1008 వెండికలశములందు తీర్థముంచి వానికావాహనాదులను సమర్పించి ఆ తీర్థము నిట వేంచేపు చేయబడిన మలయప్పస్వామివారు, దేవేరులు, విష్వక్సేనుడు, భోగ శ్రీనివాసమూర్తుల కభిషేకింతురు. భక్తులీ యుత్సవమును చేయించుటకయి యమితమగు ధనమును శ్రీవారికి సమర్పింతురు. ఇది కన్నుల పండువుగా నుండెడి యార్జితసేవ. శ్రీ రామానుజులకు జరుగు 12 రోజుల యుత్సవములో 'శాత్తుముఱ' (మంగళాశాసనము) నాటిరాత్రి యుత్సవమూర్తులిట యలంకరింపబడి శ్రీమద్రామానుజమూర్తికి స్వాగతము నెఱపుదురు. కౌశికపురాణము, ఇతర పురాణములిట పారాయణము చేయబడును. శ్రీవారి యుత్సవులతో నాస్థానము నిర్వహింపబడును. సంవత్సరములో ప్రధానమగు యుగాది, ఆనివర (దక్షిణాయన పుణ్యకాలము), దీపావళి, పునర్వసు సంక్రమణ ఆస్థానములు—నాలుగును ఇచటనే జరుగును. ఆనివర ఆస్థానము వీనిలో చాల ఆసక్తికలిగించెడు ఆస్థానోత్సవము. ప్రాచీన సంప్రదాయములను వెలువరించు నాటకములవలె నిది మిక్కిలి మనోహరముగా కన్నుల పండువుగానుండును. ఆలయ ప్రధానాధికారులు వంశపరంపరార్చకులతో సహా తమ తమ పదవులను శ్రీవారి పాదములకడ సమర్పణము చేయుదురు. మరల తమకుతాము అర్హులని నిర్ణయింపబడి యా పదవులను శ్రీవారి పాదములకడ నుండి స్వీకరింతురు. శ్రీవారికి ప్రత్యేక కల్యాణమండప నిర్మాణము జరుగబడని కాలములో శ్రీవారి కల్యాణోత్సవ మీ మంటపముననే జరిగెడిది.

ఈ మంటపమునకుత్తరభాగములో నిత్యము జరిగెడి ఆర్థిక సంబంధములయిన వ్యవహారములు జరుగును, దీనికి పశ్చిమమునగల చతురస్ర మంటపములోన కాన్వాసుగుడ్డచే నావరింపఁబడిన యొక పెద్ద యిత్తడి గంగాళమును నొకత్రాడుతో పైన వ్రేలాడదీయుదురు. ఇట దేవస్థానపు సేవకులు రక్షణార్థమై కాపుందురు భక్తులు తాము సమర్పించెడి అన్నివిధములయిన కానుకలు ఈ గంగాళములోనుంతురు. దీనికి 'కొప్పెర' అనిపేరు. ఇందు మ్రొక్కుబడులయిన స్త్రీ పురుషుల శిరోజములనుండి వజ్ర వైడూర్యాద్యాభరణ విశేషములు కరెన్సీనోట్ల కట్టలు బంగారము, వెండి, రాగి నాణెములు వరకునుండును ఒక్కొక్కప్పుడు స్త్రీలు తమ ప్రాణప్రదముగా నెంచుకొన్న తమ మేని యాభరణములన్నియు నొక్కొక్కటిగాఁ దీసికొని పసుపుగుడ్డతో కట్టి యత్యుత్సాహముతో కొప్పెరలోనుంతురు. ఇది అతి మనోహరమైన దృశ్యమేగాక ఆస్తిక్యమును హృదయమునుండి లేవదీసెడి భావవీచికగాఁ జెప్పగును. హృదయార్ద్రముకూడ. వీరు 'కొప్పెర'కు నమస్కరించి తరువాత ప్రదక్షిణము సలిపి ఆ నగలమూట నందుంచి యత్యంత తృప్తితో వెడలుటజూడ శ్రీవారి కరుణాదృష్టి యెంత దొడ్డదియో యని చూచువారలకుఁ దోపఁగాఁజేయును. మ్రొక్కుబడులు లేనివారు సైతము ఈ హుండీలో తమకుఁ దోచిన దెంతయైనను రూపాయిగాని అంతకు చిన్నదగు ఏ చిన్ననాణెమైనను నుంచుటగాంచెదము 'కొప్పెర' పయి ప్రత్యేకదృష్టి నెఱపుటకు వీలుగా దీనికి ప్రక్కనగల హాలులోనే దేవస్థానపు ముఖ్యాధికారి 'పేష్కారు, పారుపత్యదారు హుండీలోని ధనము లెక్కించు సమయములో నుందురు. మిగిలిన సమయములలో నితర యధికారులుండి పరిశీలింతురు. 'కొప్పెర'ను ప్రతిమధ్యాహ్నము తీసి అనగా రెండవఘంట యయిన తరువాత నివేదనానంతరము, సర్వజనుల సమక్షములో అధికారుల సమక్షములో లెక్కింతురు. దీనిని 'పరకామణి' అందురు. కొందఱు ప్రముఖ వ్యక్తులను లెక్కవిధానమును బరిశీలించుట కాహ్వానింతురు. లెక్కపెట్టుట పూర్తిఅయిన

తరువాత వారి హాజరును సమర్థించు సంతకమును గ్రహింతురు. తదుపరి పారుపత్యదారు, పేష్కారు సంతకములు చేయుదురు. ఆర్జిత సేవలకు టిక్కెట్లు నిచ్చుట మొదలయిన ఆర్జిత సేవా సహకారభాగముకూడ యిందుండెడిది. కాని నేడిది రంగమంటపములో నొక గదియందు నిర్వహించు చున్నారు. ఇక్కడనే దేవస్థానపు అధికారులైన పేష్కారు వారి కార్యాలయముకూడ నిందులో నొక భాగమందున్నది.

మంటపము దక్షిణభాగములో పశ్చిమమున జంటగంటలు ఒక పొడుగాటి కొయ్యదూలమునుండి రెండు ఇనుప కమ్మీలమర్చబడి అపై దూలమునకు వ్రేలాడఁగట్టబడినవి. ఇవి మ్రోగింపఁబడునపుడు వాని ధ్వనిలో నొక రమ్యత, శ్రవణపేయముగాఁ జేయును. ఈ జంటగంటలు మ్రోగించబడిన వన్నచో నది శ్రీవారికి నివేదన సమయమనియో లేక అన్ని ప్రసాదముల నివేదన సమయమనియో యూహింప నగును. సన్నిధిలోని అన్నిద్వారములు ఈ సమయములో మూసియుంచబడును. అర్చకులొక్కరే ఈ సమయములో శ్రీవారి సన్నిధానములో మెలగ గలిగిన మహాపుణ్యమూర్తులు. ఇతర ఆలయములలో సమర్పింపఁబడు ప్రసాదముల పరిమాణ మల్పమగుటచేత గాబోలు నా యా యాలయములలో నుపయోగింపఁబడు గంటలు చేతి గంటలు మాత్రమే యగు చున్నవి.

ఈ మంటపమునుండియే (సర్వధర్మ) దర్శనమునకుఁ ద్రోవయని యింతకుఁ బూర్వమే చెప్పబడినది. ఈ మంటపనిర్మాతయగు 'మల్లన్న' ఆత్మ నిత్యమత్యంతోత్సాహముతో నీమంటపముచుట్టును తిరుగాడు చుండును భోగశ్రీనివాసమూర్తి నొసంగిన మహాతల్లి 'సామవాయి' శ్రీనివాసమూర్తితోనే గర్భగృహములో నేక భూతమయిన పుణ్యమూర్తి ఈ యుగములోని మరియొక ఆండాళ్లు.

## నరసింహస్వామివారి ఆలయము

ఈ నరసింహస్వామివారు శాసనములలో రెండు వేర్వేరు పేళ్లతోఁ బేర్కొనఁబడినారు. 'అలగియసింగర్' (సుందరమయిన సింహము) అని ఒక శాసనములో నున్నది. 'వేంకటాత్తరి' (వేంకటేశుని సింహము) అని మరియొక శాసనములో నున్నది. ఈ దేవాలయ నిర్మాణమునుబట్టి యీ యాలయ మత్యంతాతురముతోఁ గట్టినట్లుగాఁ దోఁచును. దీని నిర్మాణ కాలము క్రీ. శ. 1330 నుండి 1360 మధ్య ప్రాంతముగా వచ్చును. మహమ్మదీయులు జరిపిన విగ్రహ విధ్వంస కాండనుండి హిందూ విగ్రహములను సంరక్షించుటకుగాను 'షోళింగర్' పురములోని నారసింహునకుగాని లేక అహోబల నారసింహునకుగాని యుద్దేశించినదయియుండును. కాని అట్టి ప్రయోజనము సిద్ధింపలేదనియే మనకిచట యేశాసనములు లభింపని కారణముగా నూహింపవలసి వచ్చుచున్నది. శ్రీవారి అర్చకులకు నారసింహునిమీఁద ప్రత్యేక శ్రద్ధ యున్నది వైఖానసాగమములో నవమూర్తి ఆలయములో నారసింహ వారాహమూర్తులకు ప్రత్యేక స్థానము, పూజాదులుండుటయే దీనికిఁ గారణము. అహోబలమఠమునకు శ్రీ నారసింహమూర్తి ఆరాధ్యదైవము. ఈ మఠమునే వన శఠగోప మఠమనియు బేర్కొనుచున్నారు. క్రీ శ. 1469 లో కందాడై రామానుజయ్యంగారు మొట్టమొదటి దాన శాసనమీ స్వామివారిపేర వ్రాయించిరి. అది ఈ స్వామికి ఫాల్గుణమాసములోని అమావాస్య దినమున, వసంత పౌర్ణమిరోజున అన్నప్రసాదములను (ఒకతిరువోలక్కమ్) నివేదించుటకుగాను వ్రాయఁబడిన దానశాసనము. క్రీ.శ. 1493 లో వన శఠగోపజియ్యరు శిష్యుడు, కొనకొంటి వాస్తవ్యుడు దత్తిరాజ తిమ్మయ్య దానశాసనము చేసెను. అందులో ధనుర్మాసము (తిరుప్పళ్లి ఎళుచ్చి) జరుగు 30 దినముల కాలములోను అన్నప్రసాదములను, అతిరసప్పడి ప్రసాదమును శ్రీజయంతి, వసంతపౌర్ణమి, శ్రీరామనవమి, శ్రీవారి బ్రహ్మోత్సవములో ప్రతి యేడవరోజున,

నివేదించుట కేర్పాటుచేయఁబడినది. ఇవి అన్నియు శ్రీనరసింహ స్వామివారి గౌరవార్థము శ్రీవేంకటేశ్వర స్వామివారికే నివేదింపఁ బడును. పాతకీయబడెడి ప్రసాదభాగములు తన ఆచార్యస్వామి కిచ్చు నట్లుగా నీ దానశాసనములో వ్రాయించెను. తిరుమల ఆలయములోని ఇద్దరు గణకులచే నుత్థాన ద్వాదశీదినమున కైశికీ పురాణ పఠన సమయమున అన్నప్రసాదములు నివేదించుటకుగాను శాసనము వ్రాయబడెను. ఈ శాసనములో శ్రీవరాహస్వామికి, నరసింహస్వామికి వరదరాజస్వామికి ప్రసాద వినియోగార్థమయి ప్రత్యేకముగా వీలుకల్పింపఁ బడినది.

## తిరుమలలోని శ్రీమద్రామానుజుల సన్నిధి

రెండవప్రాకారపు ఉత్తరకుడ్యపుటంచున శ్రీరామానుజుని సన్నిధి యున్నది. తిరుమామణి మంటపమునుండి విమాన ప్రదక్షిణ మీ సన్నిధిని వేరుచేయుచున్నది, ఆలయము 15′ × 12′ కొలతల విస్తీర్ణము గలిగినట్టిది. దీనికి 20′ పొడవుగల ముఖమంటపమున్నది. రెండవ ప్రాకారములోని ఉత్తరపు గోడనానుకొనియున్న యీ సన్నిధి రెండవ ప్రాకారమునసుసంధించిన నడవలోని భాగముగాఁ బేర్కొనవచ్చును. కాని ప్రాకారపుగోడకంటె నీయాలయ నిర్మాణము ముందుగా జరుగ లేదని నిర్ణయించుటలో క్లేశములేదు. ఇది యిదివరలో ప్రాకారమును గురించి చెప్పునపుడు చెప్పిన విధముగా 15 వ శతాబ్దము మధ్యకాలము నాటిది. కాని యీ యాలయ నిర్మాణ కాలవిషయములో శ్రీవైష్ణవు లీయభిప్రాయమును మన్నించరు. దీనివిషయమైగల కొన్ని శాసనములు, సంప్రదాయములు, అభిప్రాయములు ఇప్పుడు పాఠకుల ముందుంచబడును. వారే యీ విషయములో దీనినిబట్టి నిర్ణయమునకు రానగును.

తిరుపతి తిరుమలలలో రామానుజాలయములు మొత్తము మూడు న్నవి. వీనిలో నొకటి తిరుపతిలోకలదు. రెండవది త్రోవలో మోకాళ్ళ

పర్వతముపై గలదు. మూడవది తిరుమలలోనున్నది. తిరుమలలోని ఆలయ విషయములో నేదేని నిర్ణయమునకు వచ్చుటకుఁ బూర్వము మిగిలిన రెండు ఆలయముల విషయములో తగిన సమాచారము లభింప జేసికొన్నచో ఈ ఆలయముల నిర్మాణమును గురించి ఒక నిర్ణయము నకు రాగలుగుదుము.

## తిరుపతిలోని శ్రీరామానుజుని సన్నిధి

తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనముల 1 వ సంపుటిలో 89 వ శాసనములో తిరుపతిలోని రామానుజుని సన్నిధినిగూర్చి కొంత సమాచారమున్నది. ఈ శాసనము తిరుపతి శ్రీరామానుజాలయమునకు దక్షిణ పశ్చిమములకున్న పునాది గోడలపయి వ్రాయబడినది. ఇది విక్రమ సంవత్సరములోని శ్రావణ మాసమునకు సరియగు వీర నరసింగ యాదవ రాయలనాటి 15 వ సంవత్సర పరిపాలనాకాలమునాటిది. దీనిలో కొందరు శ్రీ వైష్ణవులు 'ఎంబెరుమానార్' (శ్రీరామానుజులు) ఆలయమునకు దీపములకు, స్వామికిఁ బుష్పములు తెచ్చుటకు వ్రాయించిన విషయము కలదు. ఇది క్రీ. శ. 1220 సంవత్సరమునకు సరియగు కాలము. తరువాత కాలములో శ్రీరంగనాథయాదవరాయల 3 వ సంవత్సర పరిపాలనా కాలములో వేయబడిన శాసనమొకటికలదు. దానిలో ఈ ఆలయమునకుఁ గొంత భూమియున్నట్లు ఆ భూమియంతయు బీడై మొక్కలు మొలిచి ఫలసాయమునకు యోగ్యము కాక పోయియుండగా తిరుపతిలోని పెద్ద చెఱువు నుండి నీరు సరఫరా చేయబడి సాగుచేయబడినట్లుగా వ్రాయబడిన విషయము కలదు. (1.103) దీని కాలము క్రీ. శ. 1339 వ సంవత్సరము. ఇది రెండవ గోపురము (తిరుపతి) లోపలి కుడివైపు క్రిందుగా గల గూడులో వ్రాయబడిన శాసనము. ఇంకమూడవ శాసనము తిరుపతిలోని రామానుజాలయము ముఖమంటపములోపల ఎడమవయిపు గోడమీఁద గలదు.

దానిలో రామానుజుని ఆలయ నిర్వహణమునకు సంబంధించిన యొక ప్రత్యేకనిధి, అధికారియున్నట్లు, ఆ రామానుజుని సంవత్సరోత్సవము ప్రతి చైత్రమాసములోను జరుగుచున్నట్లు, ఆ ఉత్సవ నిర్వహణ నిమిత్తమీ దానశాసనము 'అన్నన్ తిరువెంకటయ్యన్' అను భక్తునిచే వ్రాయించబడినది. నాలుగవ శాసనము 20–10–1475 వ తేదీ నాటిది. ఇది ఆలయమునందలి ముఖ మంటపము తూర్పు గోడపయి వ్రాయబడినది. ఇది ముదలియార్ శఠగోపదాసర్ నరసింహరాయ మొదలియార్ అనునాతడు తిరుపతిలో శ్రీ వైష్ణవ నాయకుడుగా నుండిన కాలములో శ్రీరామానుజునకు చైత్ర మాసోత్సవ సందర్భముగా శాత్తుమొర నిర్వహణమునకు దానమొసంగినట్టి వివరమున్న శాసనము. 9-5-1476వ తేదీన గల మరియొక దానశాసనములో నీ దాతయే కందాడ రామానుజయ్యంగారి పేరుమీద తిరుపతి శ్రీ రామానుజుల సన్నిధిన అన్న ప్రసాదముల (దినసరి 'తిరుప్పోనకం') నివేదనమునకయి సమర్పించిన విషయమున్నది

దీనిని గ్రహించిన తరువాత మరల తిరుమలలోని రామానుజుని సన్నిధికేగుదము. శఠగోపదాస నరసింహరాయలు అను నాతడు తిరుమలలో ననేక సందర్భములతో వివిధ ప్రయోజనముల కొఱకుగాను అన్న ప్రసాదములు సమకూర్చుటకుగాను దానశాసనము సమర్పించెను. తిరుమల ఆలయములో దీనికి సంబంధించిన శాసనము లో ముఖ్యమైన శాసన మిది యొకటి. రెండవ ప్రాకారము దక్షిణపు గోడపయి నీ శాసనమున్నది. ఇది తిరుమలలోని శ్రీ రఘునాథస్వామివారికి నిత్యమొక అన్న ప్రసాద సమర్పణమునకు సంబంధించిన శాసనము. ఇదియే ప్రప్రథమముగా తిరుమలలో శ్రీ రఘునాథుని యునికిని స్పష్టపఱచిన శాసనము. అంతేకాక ఈ శాసనములోనే శ్రీరామానుజుని సన్నిధియున్నదని ఆ సన్నిధిలో చైత్రమాసములో జరిగెడి 12 రోజుల అధ్యయనోత్సవముల గుఱించి ప్రసక్తి తేబడినది. ఇదిగాక 11 నెలలలో

11 అన్న ప్రసాదముల (తిరువోలక్కమ్) నివేదనము కొఱకుగాను దానము సమర్పింపఁబడినది మఱియు 12 మంది ఆళ్వారులకు వారి వారి తిరునక్షత్రముల సందర్భములో నన్నప్రసాదముల సమర్పణమునకు, వారిచే రచింపఁబడిన దివ్య ప్రబంధములను రామానుజుని సన్నిధిలో పారాయణముచేయుటకు వీలు కల్పింపఁబడినది. ఇంకను ఈ శాసనములో నొక ప్రత్యేకత యున్నది. బ్రాహ్మణేతరులయిన చాత్తాద శ్రీ వైష్ణవులు దివ్యప్రబంధములను బ్రాహ్మణ (చాత్తిన) శ్రీ వైష్ణవులతో శ్రీరామానుజుని సన్నిధిలో చైత్రమాసములో 12 దినములలో జరుగు అధ్యయనోత్సవములో పారాయణము చేయుచున్నట్లు చెప్పబడినది. ఈ వినూత్న పరిణామమునకు శ్రీకందాడ రామానుజయ్యంగారు మూల హేతువని చెప్పవచ్చును. శ్రీరామానుజుల సన్నిధి తిరుపతిలో క్రీ. శ. 1220 ప్రాంతమునుండి యుండినటు, తిరుమలలో రామానుజుని గుఱించి అతి ప్రాచీనమయిన శాసనము క్రీ శ. 1476 వ సంవత్సరము నాటిదిగా గుర్తించి యున్నాము. కనక తిరుమలలో రెండవ ప్రాకారము నను సంధించుకొని ఈ రామానుజ సన్నిధి 15 వశతాబ్దములోని మధ్యకాలము నుండియే అవతరించియుండును. ఈ శాసనములో శఠకోపదాసరు తిరుమలలో రామానుజుని సన్నిధి నిర్మించినట్లులేదు కాని ఈతఁడు తిరుపతిలో శ్రీ కోదండరామస్వామివారి ఆలయమును క్రీ. శ. 1481 వ సంవత్సరములో కట్టించినట్లుగలదు

తిరుపతిలోను తిరుమలలోను శ్రీరామానుజుని సన్నిధి ఒక పర్యాయము నిర్మాణమయినట్లు ఐతిహ్యమున్నది. శ్రీ రామానుజుని అస్తమయానంతరము ఈయన జ్ఞానపుత్రుఁడయిన 'తిరుక్కురుకైప్పిరాన్ ప్పిళ్లాన్' అను నాయనచే శ్రీరంగములోని శ్రీరంగనాథుని ఆలయమందు శ్రీరామానుజుని సన్నిధి యేర్పాటు చేయబడినది మరియొక శిష్యుఁడయిన 'ముదలియాండన్' అను నాయన శ్రీ పెరంబుదూరులో నొక ఆలయమును గట్టించెను. ఇది శ్రీరామానుజుని అవ

తార స్థలము. కిడాంబి అచ్చాన్, నల్లాన్, మరి యితరులు కలిసి తిరు నారాయణ పురములో శ్రీరామానుజున కొరక సన్నిధిని ఆళ్వారులతోఁ గలిపి నిర్మించిరి. 'నడదూర్ ఆళ్వార్' కాంచీపురములో రామాను జుని విగ్రహమును ప్రతిష్ఠించెను. తిరుమలనంబి పిళ్ళై తిరుపతిలో నొకటి, రెండవది దోవ భాష్యకార్ల సన్నిధిలోను అనగా తిరుమలకుపోవు త్రోవలోను, మూడవది తిరువేంగడ ముడయాన్ (తిరుమల శ్రీవారి) సన్నిధిలోను ప్రతిష్ఠించెను — ఈ ఐతిహ్యమట్లుంచి ఆనందాళ్వారు, ఆతని కుమారుఁడు రామానుజులకుఁ బ్రియ శిష్యులు. ఆనందాళ్వారు మనుమడు ఆనందాళ్వారు వెంకటత్తురైవన్ అను నాయన ఒక శాస నము వ్రాయించెను. ఇది అసమగ్రమయినది. తిరుమలలో నిది మొదటి గోపురపు ఉత్తరపుఁబునాది గోడలపయినున్నది. తమిళ శాసనమునకు తెలుగు నేఁత (1—172)

మార్గశిరమాసము — సంవత్సరములో
— తాళ్వాను మనుమడు
దయాపూర్వకాంగీకారము కొఱకు — సమర్పించెను.

— అముదు పడి — శాత్తుప్పడి కొఱకు

ఇందు అముదుప్పడి అనగా అన్నప్రసాద నివేదనములు, 'శాత్తు ప్పడి' అనగా పుష్పాలంకరణము, మంచి గంధము లేపనము కొఱకని చెప్పవచ్చును. ఇంకను అసమగ్రములగు శాసనములు రెండున్నవి. ఇవి కేవలము 'ఆనందాళ్వారు వెంకటత్తురైవర్' అను నాయన రామానుజులవారి నందవనమును, ఇతర ధర్మములను నిర్వర్తించుటకు శపథమును తీసికొనుటను గూర్చి మాత్రమే వ్రాయఁబడినవి. బహుశః ఈ శపథములీయన తండ్రి యంత్యకాలములో నున్నప్పుడాయననుండి గ్రహించి యుండనగును.

తిరుమల ఆలయమునకు ప్రాచీనకాలములో నిత్యపూజా సామాగ్రి, అన్న ప్రసాదములతో గూడ తిరుమలకు తీసికొని వెళ్ళుటకు దిగువున తగు యేర్పాటులుండెడివిగావు. ఈ విషయము నాడు నాటి ధర్మకర్తలు తిరుక్కాళత్తి దేవరాయలవారికి నివేదించిరి. ఈ ఫిర్యాదు ఈ రాజు తిరుపతికి సమీపములో 'ఆవిలాలి' అను ప్రదేశములో విడిదిచేసియున్నప్పుడు చేసిరి. ఇది ఈయన 19 వ సంవత్సరము పరిపాలనాకాలమునకు సరియగు క్రీ. శ. 1209 వ సంవత్సరము. అపుడీ మహారాజు నీటిపారుదల సౌకర్యములు కలిగినట్టి మెట్ట మాగాణి భూములను 'కుడవూరు' గ్రామమునకు నాలుగు సరిహద్దులలోగల వానిని వానిపయి పన్నులతో సహా ఈ పూజా సామాగ్రిని, తదితరములగు అన్న ప్రసాదములను పైకి చేర్పించుటకుగాను దానము చేసెను. శ్రీవారికి ధనుర్మాసములో అన్న ప్రసాదముల సమర్పణము, పుష్పముల అలంకరణముకై పుష్పములు, చందనాదులు కావలసియుండును. ఈ కారణమున శ్రీరామానుజులే స్వయముగా తన శిష్యులచే నీపై చెప్పిన అముదుప్పడి, శాత్తుప్పడులను నిత్యము శ్రీవారి ఆలయములో సమకూర్పబడవలయునని రాజు నడిగి యుందురని యూహించుట సహజము. ఆకాలములో శ్రీమద్రామానుజుల విగ్రహము శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపబడి యుండెననెడి వాదము విశ్వసింప దగినది కాదు. కాని యైతిహ్యమున మాత్రము తిరుమల తిరుపతులలో శ్రీమద్రామానుజుల విగ్రహము లొకేపర్యాయము ప్రతిష్ఠించినట్లు వినుచున్నాము. తిరుపతిలో క్రీ. శ. 1220 వ సంవత్సరమునాటి కిట్టి ఆలయము నిర్మింపబడినట్లు తెలియుచున్నది. అట్లే తిరుమలలో నాకాలమునాటికే యొక చిన్న ఆలయనిర్మాణము, విగ్రహ ప్రతిష్ఠాపనము జరిగియుండుననుటలో నెట్టి అసమంజసము నుండబోదు. ఈ విగ్రహము తరువాత కాలములో అనగా క్రీ. శ. 1476 వ సంవత్సరము నాటికి నేడు మనము చూచుచున్న ఆలయములోనికి మార్చబడి యుండునని యూహించుట లెస్స. నాటినుండి ఈ ఆలయ నిర్వహణములో తగు శ్రద్ధ చూపబడినది.

నిజమునకెట్టి నిర్వహణావశ్యకత దీనికి లేదు. శ్రీమద్రామానుజునకు నివేదింపబడు నుద్దేశము వెలిబుచ్చినదాత సమర్పణమును సైతము ముందుగా తిరుమలలో శ్రీవారికి నివేదింపఁబడిన తరువాతనే రామానుజులకు సమర్పణము జరుగవలెనని యెంచెను. ఇది తిరుమలలో నమలులో గల సాంప్రదాయము. తిరుమలలో శ్రీరామానుజుని సన్నిధి యేర్పడకపూర్వము తిరుపతిలో నిట్టి సన్నిధియొకటి కలదనెడు వాదము విశ్వసింపఁదగినదికాదు.

## దీనికి సంబంధించిన యితర వివరములు :

శ్రీరామానుజునకు తిరుమలతో గల సంబంధము బహు విస్తృతమైనట్టిది. రామానుజుని తండ్రియగు కేశవసోమయాజికి తిరుమలనంబి వైష్ణవ మతమునిప్పించెను. ఆ మత స్వీకారానంతరమే భూపిరాట్టితో వివాహము జరిగెను. ఈ రామానుజుడు యాదవ ప్రకాశుని కడకునేగి కాంచీపురములో సంస్కృత విద్య నభ్యసించుచుండెను. కాని యాదవ ప్రకాశుడు తన శిష్యునకు విశిష్టాద్వైత ప్రతిపత్తి గలదని తాను బోధించు గ్రంథముల కాఁదన్వయించు విధానమునుబట్టి త్వరలోనే గ్రహించెను. ఈ విభేదములతో తానికవిద్యను బోధింపనెంచ లేదు. రామానుజులు తల్లి సలహాకోరెను. వెంటనే యామె తిరుమల నంబికడకేగి యాతని యడుగు జాడలలో నడువుమని యాజ్ఞాపించెను. ఆయన శ్రీ వరదరాజస్వామి నిత్యాభిషేకమునకయి 'శాల' నుండి నీటిని తెమ్మని రామానుజుని యనుగ్రహించెను. తిరుమల నంబి తిరుమలలో నుండినప్పుడు శ్రీమద్రామానుజులు రామాయణ విశేషార్థములను, అనేక వేదాంత ప్రతిపాదక విషయములను తెలిసికొనెను. ఆ తరువాత నీతఁడే తిరుమల తిరుపతులలో శ్రీ వైష్ణవ మతాచార్యునిగా గుర్తింపఁబడి దక్షిణదేశమంతయు సంచారమొనర్చెను. ఈయనను తిరుమల నంబి మోకాళ్ళ పర్వతముకడ నేడున్న దోవ

భాష్యకారుల సన్నిధిని అసామాన్యమగు నాలయ మర్యాదలతో నాహ్వానించెను. తిరుమలనంబి రెండవ కుమారుడగు తిరుక్కురకై ప్పిరాన్ పిళ్ళాన్' శ్రీరామానుజునిచే జ్ఞానపుత్రునిగా నంగీకరింపఁబడెను. తిరుమల ఆలయములో శైవ ప్రాధాన్యమును గుఱించి శైవులు పోరాడినపుడు రామానుజులు శ్రీవారు విష్ణుస్వరూపులని నిర్ణయించిన యైతిహ్యము మనము గమనింపఁదగినది. ఈయనచే రచింపబడిన బ్రహ్మసూత్ర భాష్యమునకు మొదటగా ప్రార్థించిన స్వామి పరమ బ్రహ్మమగు శ్రీనివాసుని గూర్చియే. తార్కిక జ్ఞానముకంటె మిన్నయగు భక్తిని ప్రసాదింప వలసినదిగా నాయన ప్రార్థనా శ్లోకములోని సారాంశము. దానిలో పరంబ్రహ్మ స్వరూపుఁడు తిరుమలలో శ్రీనివాసునిగా రూపొందినట్లు నిర్ద్వంద్వముగాఁబలికెను. తిరుపతిలో నాయనకు గల సంబంధముకూడ దీనికిఁ దార్కాణము. 1 వ కుళోత్తుంగ చోళునిచే గావింపఁబడిన అరాచకమువలన చిదంబరములోని శ్రీ గోవిందరాజ స్వామి మూల విగ్రహము సముద్రములో పారవేయబడనుండెను. శ్రీరామానుజులీ విగ్రహమునే తిరుపతికిఁజేర్చి ప్రతిష్ఠింపఁజేసెను. ఈ ఆలయములకు పరిసరముల నొక చిన్న గ్రామమేర్పాటుగావించెను. దానికి చాలకాలము వరకు రామానుజ పురమనియేపేరు. తిరుమలతో సంబంధమున్న ప్రతివారికి తిరుపతి యొక స్థానిక కేంద్రమగునట్లుగా తరువాత నాయన రూపొందించి చిన్న పట్టణముగా తిరుపతిని మార్చు చేసెను. ఇది తి. తి. దేవస్థానము శాసన సంపుటి 124 నెంబరుగల శాసనములోనున్నది ఇది ఛిద్రశాసనము. తిరుపతి తిరుమలల ప్రాశస్త్యము రామానుజుడు పెంపుచేసిన కృషికి ఫలితముగా నాతనికి తిరుమలలో క్రీ. శ. 1200 సంవత్సరము వరకు నాలయములేకుండుట ఆశ్చర్యమే. శాసనములొక్కటియే యిట్టి విషయములలో నాధారముగా గొనరాదు. తిరుపతిలో శాసనములున్నవి. ప్రతి ఆలయము, సన్నిధి యొక ప్రత్యేక దానశాసనము కలిగి దేని కదియే నిర్వహింపఁబడుటకుఁ దగిన సామర్థ్యమును గలిగియున్నవి. తిరుమలలో నట్లుకాదు.

శ్రీరామానుజుని సన్నిధి అది నెలకొల్పబడిన నాటినుండి శ్రీవారి ఆలయముతో నదియొక విడదీయరాని అంతర్భాగముగా నున్నట్టిది. ప్రాచీనకాలమునుండియు గూడ శ్రీవారి ఆలయముతో ననుసంధింపఁ బడిన వేఱొక సన్నిధియున్నట్లు సంప్రదాయముగాని ఆచారముగాని లేదు. ఈ సంప్రదాయమునుండి ఆచారమునుండి శ్రీ వరాహస్వామి వారి ఆలయ మొక్కటి మాత్రము మినహాయింపు గలిగియున్నది. ఈ కారణముచేతనే తిరుమల శ్రీవారి ఆలయములో నేయితర దేవతలకు ప్రత్యేకపూజలేదు, ఆళ్వారుల ప్రతిష్ఠాపనముకూడలేదు. వైఖాన సాగమ విధానములో నీయాళ్వారులకు స్థానములేకుండుట, ఆ విధానము ననుసరించియే శ్రీవారికి పూజావిధానము జరుగుటచేతనే ఆళ్వారుల ప్రతిష్ఠ ఈ ఆలయములో జరిగియుండదు. ఈ వైఖాన సాగమ విధానార్చనము మనకు శాసనములలో క్రీ. శ. 967 నాడు భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాకాలము నాటికే యున్నట్లు తెలియుచున్నను అంతకు పెక్కు వందల సంవత్సరములకు పూర్వమే నీ యర్చనా విధానమిట కొనసాగుచుండినట్లు పురాణములు ఇతిహాసముల వలన తెలియుచున్నది.

ఏమైనప్పటికిని ప్రముఖభక్తులు, ప్రభువులు అనేక దానశాసనములు శ్రీవారికై వ్రాయించిరేగాని శ్రీ రామానుజునికై యేయొక దాన శాసనమును క్రీ. శ. 1476 వరకు వ్రాయించలేని కారణమును మనము విచారించవలసియున్నది. క్రీ. శ. 1476 వ సంవత్సరములో చైత్ర మాసములో జరిగెడు 12 దినముల యుత్సవమునకు (అయన నక్షత్రోత్స వము). ఆ సంవత్సరములో 11 రోజులకు, ద్వాదశాళ్వారుల వారివారి జన్మనక్షత్రముల దినమున వారిచే రచింపబడిన ప్రబంధములను శ్రీరామానుజుని సన్నిధియెదుట పారాయణమొనర్చుటకు, తగు ప్రసాదములను నివేదనా సమర్పణమునకు సంబంధించిన దానశాసనమిది. శ్రీవైష్ణవాలయములలో నధ్యయనోత్సవముల సందర్భమున జరిగెడు

ప్రబంధపారాయణములను గుఱించి పాంచరాత్రాగమమే జవాబీయవలెను. విధింపబడిన వేదాగమానుసారముగా వర్చనము జరుపు విష్ణు దేవాలయములలో అర్చకులు, శ్రీరామానుజుల, ఆళవందారు మత సిద్ధాంతములను వారి యాళ్వారుల దివ్య ప్రబంధములను పారాయణముచేయుట నమలుపఱచినచో వారు తీవ్రమయిన విమర్శనమునకు గురియయ్యెడివారు. పవిత్రాలయ సన్నిధిలో నే సమయములోనయినను ఈ ద్రవిడ వేదమును పారాయణ మొనర్చుట మతాపచారముగా పరిగణింపఁ బడెడిది. ఇట్టి సంకుచిత దృష్టిని గుఱించి వేదాంత దేశికులవారు మొదటగా తన 'శతదూషణి' అను గ్రంథములో 65 వ శ్లోకములో వెలువరించిరి. ఇది మాలికాఫరు దక్షిణభారతదేశ దండయాత్ర జరుపుటకు పూర్వము రచింపఁబడిన గ్రంథము, ఆ తరువాత మహమ్మదీయుల దండయాత్ర దేశములో నుద్రిక్త పరిస్థితిని తెచ్చిపెట్టినది. శ్రీరంగనాథుని యుత్సవ విగ్రహమును రహస్యమార్గముద్వారా తిరుమలకు జేరవేసిరి. ఇవి యొకదానివెంట నొకటి జరిగిన సంఘటనలు. ఈ యుద్రిక్త పరిస్థితి యుపశమించి శ్రీరంగములోనికి రంగనాథాలయములోని రంగనాథస్వామి చేర్చబడునంతవఱకు విజయనగర సైన్యాధిపతి అన్ని యుత్సవములను రద్దుపఱచెను. ఈతని పేరు 'గోపన్న'. క్రీ. శ. 1348 లో అధ్యయనోత్సవములు తిరిగి ప్రవేశపెట్టబడినప్పుడీ ప్రతిఘటనలు వచ్చినవిగాని వాని నెదుర్కొని సమన్వయింప జేయుటకై గోపన్నచే నొక సమావేశమేర్పాటు చేయబడెను. ప్రముఖమయిన పాంచరాత్ర ఆగమ విధాన పూజాకేంద్రమగు శ్రీరంగములోనే ఆళ్వారుల ప్రబంధములు పారాయణము చేయు సంప్రదాయమున్న చోటనే నీ వివాదములు తలయెత్తెను. తిరుమలలో నాగమము వైఖానసమగుటచే ఈ శాస్త్రములో చెప్పబడిన విధానముగాక నన్యవిధాన మేమాత్ర మంగీకరింపని కారణముచే నిట నీ వివాదము తీవ్రస్థాయిలో నుండెను. ప్రబంధ పారాయణము మాట అటుంచి ఆళ్వారులలో దివ్యత్వమున్నదనియు వీరంగీకరింపరు. శ్రీరామానుజుఁడు నైతమీవివాదమును దీర్పజాలఁడయ్యెను. తిరుమల

నంబి మాత్రము శ్రీవారి కభిషేకార్థము తీర్థము నాకాశగంగనుండి తెచ్చుట, పూజామంత్రపుష్పములలో దానికి సంబంధించిన మంత్రపఠ నము, తుళసీ సమర్పణము మొదలగు విధి నిర్వహణముతోఁ దృప్తి నొందెను, ఈ విధులన్నియు వైఖానసాగమమునుబట్టి వైఖానస కులము లోనివారు చేయవలసినట్టివే. అర్చకేతరులకు సంబంధించినట్టివిగావు. శాసనముల ప్రకారము క్రీ.శ. 1360 వ సంవత్సరము వరకు తిరుమలలో నే ప్రదేశమందును ప్రబంధపారాయణము జరుపబడెడిదికాదు. ఈ సంవ త్సరములోనే ప్రధాన గోపురమునకు ముందు నమ్మాళ్వారు తిరువాయి మొళి బ్రహ్మోత్సవ సమయమందు శ్రీవైష్ణవులచేఁ బఠింపఁబడు ప్రయత్నముచేయబడెను. ఉత్సవమూర్తులు ఊరేగెంపు జరిగిన తరు వాత దేవాలయమునకు తిరిగి వేంచేయునపుడీ కథనడచినది. పారాయ ణము దేవాలయములోకాదు. పాంచరాత్రాలయములలో నిట్టి ప్రబంధ పారాయణము జరుగుటగాంచి దానిని తిరుమలలో ప్రవేశపెట్టవలెనని హృదయపూర్వకముగా శ్రీవైష్ణవులు ప్రయత్నించిరి. తిరుపతిలో నీ ప్రబంధ పారాయణము మొదటిసారిగా క్రీ. శ. 1475 లో శ్రీరామా నుజుల సన్నిధిని జరుప యత్నింపఁ బడెను. ఈ కాలములోనే 9–7–1475 న ఒకటి, 20–10–1475 న ఒకటి, రెండు వేర్వేరు శాసన ములు అన్నన్ తిరువేంకటయ్యన్, శఠగోపదాసర్ మొదలియార్‌లచే వ్రాయింప బడినవి. ఈ శాసనములు శ్రీరామానుజుల జన్మనక్షత్రమగు చైత్రమాసములో ఆరుద్రానక్షత్రము నాడు జరిగెడి అధ్యయనోత్సవ ములు 12 దినములలో నన్నప్రసాదముల సమర్పణమునకయి నిర్దేశించి నవి. ఈ శాసనములలో ద్వాదశాళ్వారుల ప్రబంధ పఠనమునుగూర్చి యెట్టి ప్రశంసయులేదు. ఇదే ప్రయత్నము క్రీ. శ. 1476 వ సంవత్సర ములో తిరుమలలో శ్రీరామానుజుని సన్నిధిన మరల చేయఁబడినది. బ్రాహ్మణేతరులయిన చాత్తద వైష్ణవులు బ్రాహ్మణవైష్ణవులతో గలిసి శ్రీరామానుజుని సన్నిధిలో ప్రబంధపారాయణమును గావించిరి. దీనిని వైఖానసార్చకు లెవ్వరును అనుమోదించి యుండలేదు. శ్రీవైష్ణవ

మతానుయాయులుగాని వైష్ణవులును దీని నామోదింపలేదు. వీరికి శ్రీ వేంకటేశ్వర సన్నిధానములో ఈ ప్రబంధపారాయణము జరుగలేదన్న తృప్తియే మిగిలినది. ఆ సమయముననే శ్రీవైఖానసార్చకులపై దేవాలయములలోని బంగారు ఆభరణములు పోయినవన్న నెపముపై ఫిర్యాదు చేయబడెను. ఇది రామానుజ మతానుయాయులకు మిక్కిలి అనుకూలించిన సమయము. కనుకనే వారిచే నీ ప్రబంధపారాయణ ప్రయత్నము చేయబడినది. క్రీ. శ. 1500 ల సంవత్సరము తరువాత నీ ప్రబంధ పారాయణమునకు మిక్కిలి ఆదరణముతోబాటు గుర్తింపును లభించినది. ఈ శాసనముచే (క్రీ. శ 1500) రఘునాథ విగ్రహము గూడ శ్రీవారి ఆలయములోనున్న విషయము వ్యాప్తమయ్యెను.

## తిరుమలలోని శ్రీవరాహస్వామి-వారిఆలయము

తిరుమలలో శ్రీవరాహస్వామివారి ఆలయము స్వామిపుష్కరిణీ తీరమునకుఁ బశ్చిమమునను, వాయవ్య దిశలోను నెలకొన్నది. శ్రీవరాహస్వామివారినే 'జ్ఞానప్పిరాన్' అనికూడ నందురు. ఈయనయే తిరుమలలో శ్రీహరికంటె పూర్వము వేంచేసిన స్వామివారని చెప్పెడి యైతిహ్యములున్నవి. కాని క్రీ. శ. 1380 వ సంవత్సరమునకుఁ బూర్వమీ దేవుని యునికిని గూర్చి తెలిపెడు శాసనము లేవియును లేకుండెను. కాని శ్రీవరాహస్వామియే తిరుమలలోని ప్రాచీన దైవతమనియు, తిరుమలకు ప్రధానుఁడనియెడు సంప్రదాయగాథలు ప్రచారములోనున్నవి మనపురాణములననుసరించి మనము సప్తమమనువుకాలమగు వైవస్వత మన్వంతరములో శ్వేతవరాహకల్పములో నున్నాము. మహాప్రళయము సంభవించినపుడు భగవంతునిచే సృజింపఁబడిన వేదవేదాంగములు, సర్వజీవులు ఆ పరమేశ్వరునిలోనే లీనమగునని పురాణములు పలుకుచున్నవి. ఆ సమయమున మహాంధకారపరీతాంబుధి దక్కనన్యమేమియు నుండదు. ఈ ప్రళయసముద్రములోనే వేదములు లయ

మందును. పునః సృష్టి ప్రారంభింపఁబడినపుడు సర్వేశ్వరుడు వరాహ మూర్తి అవతారములో, సర్వజీవసృష్టిలో స్థితినిగూడ గల్గించి తదంతర్లీనమగు వేదముల నుద్ధరించును. ఈ కారణముచేతనే శ్రీవరాహస్వామి నీకొండమీఁదగల యాదిదేవునిగఁ బేర్కొనియుందురు. పురాణములాధారముగా తిరుమల శ్రీవారు తిరుమలకు వేంచేయుట శ్వేతవరాహ కల్పములోని వైవస్వత మన్వంతరములోని కలియుగాదియని చెప్పనగును. ఈయన అర్చావతారము అంతకు పూర్వమున్న ఆదివరాహ మూర్తి యవతరించిన స్థితిని గల్గియుండెను.

ఈ విషయమును గుఱించి వివరముగా నెఱుంగుటలో నితర విధానములను మనము గమనింపవచ్చును. తైత్తిరియోపనిషత్తులోని భృగువల్లిప్రకారము దేహియైన ఆత్మ ఆధ్యాత్మికానుభవములో నైదు స్థాయిలలో పయనించును. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములే, ఆ స్థాయిలు. తిరుమలకుఁజేరు యాత్రికుఁడు అన్నమయ కోశములోఁ బ్రవేశించును. కొండనుఁజేరును. దిగువునగల స్వామి పాదతీర్థముగా నూహింపబడుచున్న ఆళ్వార (కపిల) తీర్థమందు స్నానముచేసి నమ్మాళ్వారు బోధనలయందు అమిత విశ్వాసము గలిగినవాడయి, యచటనే గల నమ్మాళ్వారును సేవించును. కొండయెక్కుటకుఁ బ్రారంభించుటతో ప్రాణమయకోశము లోనికిఁబ్రవేశించును. మోకాలి పర్వతము చేరుసరికి మనోమయకోశము లోనికిఁ బ్రవేశించును. ఇట యాత్రికుఁడు హృదయమున మనస్సున అన్నివిధములయిన యూహలకు తావురానీయడు. ఈ ప్రదేశములో నున్న రామానుజుని సన్నిధి ఈ విషయములో యాత్రికునకు సహాయభూతమయి ప్రకృతి, జీవాత్మ పరమాత్మల సంబంధమును గురించి భావింపఁజేయును. కొండకుజేరి శ్రీస్వామి పుష్కరిణిలో స్నానమొనర్చిన యనంతరము యాత్రికుడు ఆ పవిత్రతీర్థమహిమాతిశయము చేత శ్రీవరాహమూర్తి దర్శనముతో జ్ఞానప్ఫిరాన్‌గా ప్రసిద్ధి నొందిన

దాని మహిమచే విజ్ఞానమయ కోశములోఁబ్రవేశించును. ఇఁక చివరి స్థాయి శ్రీవారిని ఆనందనిలయ విమానమును దర్శించుటతో నానంద మయ కోశములోనికి యాత్రికుఁడు లీనమయినట్లయినది. శ్రీ వరాహ స్వామివారి సేవయే విజ్ఞానమయమయి, అదియే శ్రీవారి సేవకు ఆనంద మయ కోశప్రవేశమునకు వీలు కల్పించును. తిరువేంకటనాథుడు వరాహ స్వామివారి స్థలము నాక్రమించినాడన్న విషయమున కిదియే హేతువు. ఒకమారు ఆనందమయమైన ఆత్మ తిరిగి వెనుక స్థాయియగు విజ్ఞానము నాశించదు. ఆ కారణముచేతనే శ్రీవారి దర్శనమునకుఁబూర్వము 'జ్ఞానప్పిరాన్' గాఁ బ్రసిద్ధుఁడయిన వరాహస్వామిని దర్శింపవలెనని దేవస్థానపు అధికారులు ఇతరులు చెప్పుటకు హేతువగు చున్నది. ఆళ్వారులెవ్వరును శ్రీ వరాహస్వామివారి సన్నిధిని గుఱించిగాని దేవుని గుఱించిగాని ప్రశంస చేసియుండలేదనుట నిర్వివాదము, గమనార్హము.

తిరుమల శ్రీ ఆదివరాహ క్షేత్రముగా బేర్కొనబడినది. తిరుపతి తిరుమల పరిసరములలో సంకల్పము చేయునపుడు ప్రతివారును 'వరాహక్షేత్రే' 'ఆనందవిమానచ్ఛాయాయాం' అని సంకల్పింతురు. ఇది సంకల్పము చేయుటఁకు బూర్వము తానున్న స్థలమును నిర్దేశించుట కిట్లాచరించుట సంప్రదాయము.

ఈ తత్వసంబంధమును శ్రీ వరాహస్వామివారికి శ్రీ వేంక టేశ్వరస్వామివారికి జరిగెడి నివేదనా సమర్పణ సమయములో గాన వచ్చును. వంట శాలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నివేదనమున కొఱకు తయారుకాబడిన ప్రసాదములో కొంత భాగమును శ్రీవరాహ స్వామివారి ఆలయమునకు బంపుదురు. శ్రీ వరాహస్వామివారి ఆలయ ములో నివేదనా సంబంధమగు ఘంటమ్రోగిన తదుపరి ఆ విషయము నెఱింగి తిరుమలలోని శ్రీవారి ఆలయములో నివేదనాకార్యక్రమమును సూచించు ఘంటమ్రోగును. అనగా నివేదన మీ రెండు ఆలయముల లోను నొకే పర్యాయము జరుగుటకు సూచింపఁబడినది. ఇంకను

శ్రీ వరాహస్వామి, శ్రీ వేంకటేశ్వరస్వామివార్ల అవతార నక్షత్రము ఒకటియే అది శ్రవణా నక్షత్రము. శ్రవణానక్షత్రము విష్ణుదేవతాకము.

శ్రీ వరాహస్వామివారి ఆలయము క్రీ. శ. 1380 లో మాత్రమే యున్నట్లు మనదృష్టికి వచ్చును. ఆ సంవత్సరములో ' అలగప్పిరనార్ తిరుక్కలైకన్రిదాసర్ ' అను తిరుపతిలోని శ్రీ వైష్ణవనాయకుడు (1.184) (31—1—1380) 400 పణములను నిధిగానేర్పఱచి దానిపై వచ్చు వడ్డీతో తిరుప్పొలకమ్ (అన్నప్రసాదమును) ప్రతి సంవత్సరము మలైకునియనిన్దాన్ పెరుమాళ్ (శ్రీవారి) భోగమూర్తి బ్రహ్మోత్సవ దినములలో రెండవనాడు సమర్పణమునకు పెరియపెరుమాళునకు (శ్రీ వేంకటేశ్వరస్వామివారు) శ్రీ వరాహ నయినార్ స్వాములకును చెరి యొక ' కురిణి ' పరిమాణముగల అన్నము, నివేదనార్థముగా శాసనమువ్రాయించెను. దీని తరువాత మరియొక శాసనము సుమారు 96 యేండ్లకుగాని లేదు. అనగా క్రీ. శ. తేదీ 2—3—1476 (2—68)న శ్రీ శఠగోపదాస నరసింహరాయ మొదలియారు 5200 పణముల ధనమును అనేక విధములయిన అన్నప్రసాదములను శ్రీవారి వివిధ ఉత్సవ పరంపరలలో సమర్పణమునకుగాను దానశాసనము వ్రాయించెను ఈ ప్రసాదములలో నొకటి సూఖియాన్‌పడి (ఇది ఒక విధ మయిన మధుర పదార్థము. నేటి మైసూరుపాక్ వలెనుండు బోలి యుండును.) మలైకునియనిన్ద పెరుమాళ్ (భోగ శ్రీనివాసమూర్తి) ప్రతి బ్రహ్మోత్సవములో నారవనాడు శ్రీవరాహస్వామివారి ఆలయములో పద్మ మంటపములో నుండగా నీ సమర్పణము జరుగవలెను. ఇది శ్రీవరాహస్వామివారికుద్దేశింపఁబడిన సమర్పణముగాదు. ఈస్వామి క్రీ. శ. 1380 వ సంవత్సరములో వరాహనయినారుగను 1476 వ సంవత్సరములో జ్ఞానప్పిరాన్ గను బేర్కొనబడినాడు ఇక్కడ నీ వరాహ స్వామివారు ' జ్ఞానప్పిరాన్ ' అను పేరుతోడనే మిగులప్రాచుర్యము వహించెనను విషయము గమనార్హము.

—*—

# 8 వ అధ్యాయము

## 4-వ భాగము

## శ్రీవారిమూర్తి స్వరూపము

శ్రీవారి ఆలయములో గర్భాలయమందు శ్రీవారి మూర్తితో కలిపి పంచ బేరములున్నవి. ఇవి వైఖానసాగమోక్తముగా నున్నట్టివి.

ఇవికాక శ్రీవారి గర్భాలయములో శ్రీరామ శ్రీకృష్ణుల యుత్సవ బేరములున్నవి.

పంచ బేరములనగా నైదు విధములయిన విగ్రహములని. అవి ధ్రువ, కౌతుక, ఉత్సవ, స్నపన, బలి బేరములనునవి.

షడ్బేర యుక్తము పాంచరాత్రాగమానుసారము.

పైన చెప్పిన అన్ని విగ్రహములు శ్రీవారి ధ్రువమూర్తి నావరించుకొని గర్భాలయములోనున్నవి. ధ్రువమూర్తి శిలాబేరము. కాని దీని విషయములోకూడ మన మిదమిత్థమని చెప్పవీలులేదు. ఐతిహ్యమేమన ఇట తిరుమలలోని శ్రీవారు తనకు తానుగా నిర్మించుకొనిన స్వరూపమేగాని మనుష్యమాత్రుఁడయిన శిల్పకారుఁడు ఉలిచేఁజెక్కి మలచిన విగ్రహముకాదు. తనుతానేయను రీతిగా నున్నవిషయమును మానవుఁడు గుర్తెఱుంగునట్లుగా రూపొందినస్వామి. అచేతన పదార్థముతో నీ బహిరాకృతి రూపొందినట్లుగా మనముగ్రహింప వచ్చును. మనము మాత్ర మీ విగ్రహమును దైవశక్త్యాత్మకమని విశ్వసింతుము. మన మిట్టి విగ్రహములను ప్రతిష్ఠించిన దేవాలయములలో పూజింతుము. ఇంతటితో సంతృప్తి నహించక స్వర్ణ, రజత, తామ్రలోహములలో నేదేని లోహముతో తయారు చేయఁబడిన విగ్రహములు ఇండ్లలో పెట్టి పూజింతుము. ఈ విషయమునిట్లే యాచరింపవలెనని భగవాన్ మహర్షి విఖనసాచార్యులవారు నెలవిచ్చి యున్నారు.

'గృహే, దేవాయతనేవా భక్త్యా భగవన్తం నారాయణ
మర్చ యేత్. తద్విష్ణోః పరమం పదం గచ్ఛతి'

గృహమునగాని, దేవాలయమునగాని భక్తితో నారాయణుని అర్చించినచో శ్రీ విష్ణుపదమును జేరునని యిందు చెప్పబడినది.

ఆ విగ్రహ స్వరూపములు మనలను సర్వదా రక్షించువారుగ పరమాత్మయగు శ్రీమన్నారాయణునకు నకలు బింబములుగ నెంతుము. ఇది రాతి మ్రొక్కులు, వృక్షపూజలు, ప్రకృతి నారాధించుట వంటిది గాదు. విగ్రహారాధనము అర్చావతార పూజయే ననెడు తాత్త్విక సమర్థనమున్నది. దేవాలయ ప్రతిష్ఠాపనము, విగ్రహముల ప్రతిష్ఠాపనము, ఉపవిగ్రహముల స్థాపనము ఇవియన్నియు తాత్త్వికవిధానోద్దిష్టమై, సంప్రదాయక విశ్వాసమగు ప్రవృత్తి, సృష్టి, జీవసంచయము వాని లీలలు ఇవియన్నియు గుర్తుచేయును.

ఈ విషయములను గుఱించి యీ యధ్యాయములో వివరించుచు, ప్రధానముగా మహాశక్తి సమన్వితుఁడగు శ్రీవేంకటేశ్వరుని మూర్తి స్వరూపమును గుఱించి వివరించుటకు యత్నము చేయఁబడును. మనకుఁ బ్రత్యక్షవిషయ పరిశీలనావకాశము సాధ్యపడని విషయములో మనకుగల పరిమిత జ్ఞానముతో నిర్ణయము చేయజాలని చోటుల శాస్త్ర పరిశీలనమును, ప్రముఖ వేదాంతులు మతాచార్యులుపొందిన యనుభూతులను మనము విశ్వసింప వలసియున్నది.

## శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్యావిర్భావము
## అర్చాస్వరూపము నర్చింపుటకు దివ్యాజ్ఞ

కలియుగావతరణమునకుఁ బూర్వయుగములలో భగవంతునిఁ బ్రత్యక్షీకరించు కొనుటకు, తీవ్రతపోదీక్ష, మానసిక కేంద్రీకరణము, ఆత్మావలోకనమని చెప్పబడు యోగమార్గములు ప్రధానముగా నవలం

ఖింపబడెడివి. వీనిని సాధించెడు మార్గములో నపుడపుడు సంభవించెడి యపమార్గములు గలవు. అవి యూహింపరాని మాయాశక్తులు. ఈశక్తులు సాధకులకు వశ్యమగుటతో నవి భగవంతుని ప్రసాదముగనే భ్రమించి వానికి లొంగి మార్గపతితులగుదురు. మన తాత్వికదర్శనములు, ఇతిహాసములు, పురాణములు నీ మార్గపతితులయిన వారి చరిత్రలను విస్తరముగా వివరించినవి. ఇన్నియున్నను భగవంతుని తేలిక మార్గములో తెలిసికొనవలెననెడి వాంఛ మానవునకుండనే యున్నది. భగవచ్ఛక్తి యీ యభీష్టమునకు ద్వాపరయుగాంతమున, కలియుగాదిన సమాధానము చెప్పినది.

అధర్మము ద్వాపరయుగాంతమున భూమిపయి కాలిడ, దైవమే మానుష రూపుడై భూమినవతరించి మానవునివలెనే నటనా స్వభావమును నెఱపి యుద్ధరూపమున మృత్యువై విచ్ఛిన్నకరశక్తులను రూపుమాపెను. కృష్ణుడే ఆదైవ—ఆపరమాత్మయును. ఈ యవసరానంతరమున తనయిచ్ఛా స్వరూపమును అతిసామాన్యముగనే అనగా మానవ సహజముగనే నిర్గమింపజేసెను. త్రేతాయుగములో లోకములోని దోషములను నిర్మూలించుటకయి శ్రీరాముడవతరించెను. రాముడు వృక్షము వెనుకనిలిచి వధించుట రామావతార సంఘటనములలో నొకటి. కారణము వాలి తన కెదురునిలిచి వధించవచ్చిన శత్రుబలాహరణశక్తుడగుటయే. రాముని బాణముతో వాలికి మరణ మాసన్నమయ్యెను అప్పుడు వాలి రామునియకృత్యమును, దశరథసూనినివంటివాని కీయధర్మాచరణమునందలి యనౌచిత్యమును గర్హించెను. భగవంతుని దృష్టిలో వాలిశిక్షకు పాత్రుడే అయినను వాలిని జరయను వేటగానిగా, ద్వాపరయుగాంతమున జన్మింపజేసెను. శ్రీకృష్ణావతారానంతరము తన మానవశరీరమును విసర్జింపదలంచి యొక మహారణ్య మధ్యమున వృక్షాధోభాగమున కుడికాలును ఎడమకాలిపై నుంచి శయనించెను. జరుడాయరణ్యమార్గమున బోవుచు

నాహారముకొఱకు పొంచియున్న జంతువుగా నా కాలి బొటనవ్రేలి నాడిం చుటగాంచి భ్రమపడెను వెంటనే మారణాయుధముగానున్న బాణమును వదలెను. ఆ బాణమున కొక యుక్కు ముక్క తగిలింపఁ బడెను అది దూర్వాసునిచే శపింపఁబడి సాంబుఁడను యాదవునకు ముసలముగాఁ బుట్టి కృష్ణుని యుపదేశమున నది యరుగఁదీయఁబడెను. అరుగఁ దీయఁబడిన రజమంతయు సముద్రములో పాఱవైచిరి కాని యొక్క ముక్క మాత్రము మిగిలియుండెను. మిగిలియున్న యాయత్యల్ప ముసలలేశమును బాణమునకు తగిలించుకొన్న జరయను వేటకాఁడు కృష్ణునిఁ గొట్టెను. శ్రీకృష్ణుఁడు మరణించెను. కృష్ణునిఁజూచి యా జరుఁడు తానొక మానవునియెడ మహాపచార మొనర్చితినని ఆదియును లోకోత్తర పురుషుఁడగు కృష్ణునిగుఱించియనియు తెలిసికొని మిక్కిలి క్లేశపడెను. ఆ మానవుఁడైన శ్రీకృష్ణుఁడు చతుర్భుజుఁడై జరునెదుట దర్శనమొసంగెను. శ్రీకృష్ణుని పాదములబడి రక్షింపుమని వేఁడుకొనెను. శ్రీకృష్ణుఁడు రక్షించుటయేగాదు, జన్మరాహిత్యమగు మోక్షమిచ్చెను. ఈ పైకథ విగ్రహారాధన దివ్యాజ్ఞా ప్రయుక్తమని సిద్ధాంతీకరించుటకుఁ దయారుచేయఁబడిన పీఠికమాత్రమే.

## విగ్రహారాధనమునకు శ్రీవారి యనుమతి (మహావిష్ణువు)

దేవతలు, ఋషులు బ్రహ్మదేవుని గలిసికొని యాసమయమున నొకచో సమావేశమై శ్రీకృష్ణుని దుష్టశిక్షణాకార్యమును బ్రశంసించిరి. కాని శ్రీకృష్ణుని యవతార పరిసమాప్తితోఁ దాము శ్రీకృష్ణుని దివ్యత్వముతో సాన్నిహిత్యము గోల్పోవుచున్నందులకు, శ్రీవైకుంఠమున మానవదేహముతో నాతని దివ్యత్వముగాంచలేనందులకు దుఃఖించిరి. శ్రీదేవీయుక్తఁవక్షస్థలుఁడయిన తద్దివ్యశక్తిని పరమభక్తితో పుష్పములతోఁ బూజించిరి. ఇట్లు పూజించుచుండగనే ఆ శ్రీకృష్ణుని దివ్యశక్తి స్వర్గమును భూమినిఁ బ్రకాశింపఁజేయుచు పైకెగయుచుండెను. సూర్య

మండలమును ప్రవేశించి చతుర్భుజాకృతిని వహించియు చైతన్య రాహిత్యము నొందెను. ఆదేసమయమున క్రిందగల దేవ ఋష్యాదుల కొరక యశరీరవాణి విన్పించెను. 'ఆ యాకృతి నెమ్మదిగా పయనించి మరల భూమికిచేరు నీ రూపము శాశ్వతముగా నా ప్రదేశమున వసించును. ఆ స్వరూపమును బూజింపనగును". ఇదియశరీరవాణి సందేశము ఈ సంఘటనము అర్చాస్వరూపావిర్భావమునకు, తదర్చనమునకు దైవ సమ్మతి ననుగ్రహింపఁజేసినట్టిది. శ్రీమద్వేదాంతదేశికులు తన తమిళగ్రంథమగు 'శ్రీమత్తత్త్వమాతృక'లో మౌసల పర్వమున (మహాభారతమునందు) భగవంతుఁడే చెప్పిన వాక్యముల నుదహరించెను. 'భూమౌగతం పూజ్యతామప్రమేయమ్' అను వాక్యము భగవానుడిది. బ్రహ్మాది దేవతలకు ఋష్యాదులకు వారు ప్రార్థించిన దానికి సమాధానము. అనుష్ఠేయకార్యము కావున పూజాదులు ఇతరసేవలు నా స్వరూపమునకు నిర్వర్తించిన యది ముక్తిదమగును. దైవసమానులగు మన ఆచార్యపురుషులచేతను నీయనుమతి యనుగ్రహింపఁబడినది. కాననే విగ్రహముల నిర్మాణము గావించి అనేక ప్రదేశములలో ఋషులు, దేవతలు, ఇతర ప్రముఖులు ప్రతిష్ఠించిరి. తరువాత మహనీయులగు ఋషులు విగ్రహనిర్మాణ విధులను ప్రపంచించిరి. విగ్రహముల కొలతలు, వాని ఆకృతులు. విగ్రహము తయారు చేయుటకుపయోగించెడి శిలా, దారు, లోహాదుల ఉత్తమ మధ్యమాధమ భేదములు, దేవాలయ నిర్మాణము, వాని భేదములు, విగ్రహ ప్రతిష్ఠాదులిందులో కొన్నిభాగములు. క్రమబద్ధముగాని, నియమ సంబద్ధముగాని విగ్రహాదులు శుభమును చేకూర్పలేవు సరికదా యవి గ్రామాదులకు, ప్రజాళికి నొక్కొక్కప్పుడు అశుభమునే చేకూర్చును. ఆలయాకృతి యెట్లుండవలెను? విగ్రహములేవి ప్రతిష్ఠింపనగును? వాని స్థానములు, విధానము, ప్రతిష్ఠాకాలము, పూజాకాలములగూర్చి ఆగమ సంహితలు పూర్తిగా సంగ్రహపఱచినవి. విష్ణుపూజా విధానాదులనుగురించి చెప్పిన శాస్త్రములు శ్రీవైఖానస పాంచరాత్రాగమములు రెండును తమ ప్రాచీన

తను గురించి నిర్ధరించుకొనుటలో వారి విశ్వాసము వారికున్నది. తిరుమలలోనున్న విగ్రహమునకు సంబంధించినంతవఱకు ఈ యాగమములెవ్వియు వాని యర్హతనుగురించి ప్రసంగింపఁబోవు. కారణ మద్ది మానవనిర్మిత విగ్రహము కాకుండుట, స్వయం వ్యక్త స్వరూపమగుట. కాని యితిహాసములాధారముగా నత్యంత ప్రాచీనకాలమునుండి అనగా శ్రీవారియునికితోబాటే వైఖానసాగమ మనుష్ఠింపఁబడు చున్నట్లు తెలియుచున్నది. కాని ప్రాచీనకాలమునుండి చాలకాలమువరకు నొక క్రమపద్ధతిలో నిరంతముగా ననుసరించెడి యుత్సవాదుల పద్ధతియున్నట్లు గానము.

## శ్రీవారిమూర్తి స్వయంవ్యక్తబ్రహ్మము

మనము భగవానుఁడే స్వయముగా మహాభారతములో తాను సర్వమానవులకు నందుబాటులోనుండి సులభముగా మానవులచే పూజాదుల నిర్వర్తింపఁ జేయుటకును, దేవాలయాదులచే దైవశక్తి కతిసన్నిహితముగా మానవుని యునికిని గల్గించి తద్వారా యాతనిలో నుత్తమ గుణముల నభివృద్ధిపఱచుటకు, పర వ్యూహాదులలో ఉత్తరోత్తర సులభమగు అర్చావతారమును దాల్చితినని పలికియున్నసంగతి నెఱింగితిమి. మహాభారతేతిహాసమందు విశ్వాసమున్న ప్రతివ్యక్తియు నీ అర్చావతార ప్రతిపాదనమును విశ్వసింపవలసియేయున్నది.

దీనితరువాత నమ్మాళ్వారు 'పరమము' తిరుమలకు తన దివ్య లోకమునుండి మన ఆధ్యాత్మిక తత్త్వాతిశయమునకు మనచే కోరబడిన యెట్టి ప్రార్థనకు బదులుగా గాక స్వయముగా తనంతతానే దిగి వచ్చెనని మనకు ధైర్యమొసంగెను. ఇట్టి విషయమును విశ్వసించుటకు, ప్రాచీనకాలములోను, ద్వాపరయుగములోను జరిగిన రెండుసంఘటనలను మనకుదాహరించెను.

గోవర్ధన పర్వతమునెత్తి మూగజీవులను శీత, శిలావర్షాదుల బారినుండి తప్పించుటకుఁ జేపట్టినవిధానము, రెండవది మహాబలిని యాచించి యాతని కోర్కెనుదీర్చిన విధము.

ఈ రెండు సంఘటనములు స్వామి భక్తానుకంపమును ప్రకటన మొనర్చుచున్నవి.

మనము నేడు పూజించుచున్న విధముననే ప్రతినిత్యము బ్రహ్మ దులైన దేవతలు శ్రీవారి నర్చించు చున్నారనియు తెలిపెను. ఇంచు మించుగా నాళ్వారులందఱును నీ వాక్యములను బలికినవారే। ఇఁక శ్రీరామానుజులు తమ శ్రీభాష్యములో మంగళశ్లోకమున సూక్ష్మముగాఁ జెప్పనెంచినను, ప్రకృతిని, పరమేశ్వరతత్త్వమును ఆయన పతితజీవో ద్ధరణ చింతనమును. వారి ముక్త్యన్వేషణమునకై చేయు ప్రయత్నము, రక్షదీక్ష నివియన్నియు వివరించెను. బ్రహ్మమును శ్రీనివాసునితో సమముకావించెను. 'బ్రహ్మణి శ్రీనివాసే' అను వాక్యమును ప్రయోగిం చెను. కనుక శ్రీవారు పతితులమైన మన యాత్మోద్ధరణమునకే దిగివచ్చె నని యాయనను పరంబ్రహ్మ స్వరూపముగా మనము విశ్వసింతము.

ఈ మూర్తి యిపుడు మానవనిర్మితముగాదనెడు విషయమును గుఱించి విచారింపబడుచున్నది. పూజార్థము మానవులచే శిలా. దారు లోహ, మృత్తులతో తయారుచేయుట కాగమ శాస్త్రప్రమాణములున్నవి.

ఒక ఆలయముగాని మంటపమువంటిదిగాని నిర్మాణముచేసి దానియందు మూర్తిని ఆగమములలో నేదేని యొకదాని ననుసరించుచు ప్రతిష్ఠింతురు. విగ్రహములుండవలసిన తీరునుగుఱించి, వాని కొలతలను గుఱించి, ఆకృతి, భుజములు, ఆయుధధారణము, ఆభరణములున్న విధానము చెక్కవలసిన మలచవలసిన తీరునుగుఱించి శాస్త్రములలో నిర్దుష్టముగా నిర్వచింపఁ బడినది. శాస్త్రరీతిగాఁ జెక్కఁబడక లేక శాస్త్రవిరుద్ధమయిన ఆకృతిని మలచిన విగ్రహము ప్రతిష్ఠకనర్హముగాఁ

జేర్చు నేఱపును. కనుక నవి స్వార్థప్రయోజనముగలిగి పరిత్యాగమునకు హేతువుగూడనగును శ్రీవేంకటేశ్వరస్వామివారి మూర్తిని ఆగమ శాస్త్రములలో నియమింపబడిన నియముల నాధారముగాగొని యేస్వరూపముక్రిందకు వచ్చునో పరిశీలింతము.

## ఆగమములలో విధింపఁబడిన ధ్రువమూర్తులు

ఈ ధ్రువమూర్తులు మూడువిధములయిన భేదములు గలిగి యున్నవి. అవి స్థానకాసన శయనమూర్తులు. స్థానకమనగా నిలబడి యుండునవి. ఆసనమనగా కూర్చుండినట్టివి. శయనమనగా పండుకొన్న స్వరూపములు. ఇవి మరల యొక్కొక్కటి యౌపచారికభేదము చేత నాలుగువిధములు. యోగ, భోగ, వీరాభిచారికాదులు. పరిసరము లే మూర్తి ప్రతిష్ఠావశ్యకమయిన నా భేదములను నిర్ణయించును. యోగమార్గమునభిలషించు నారాధకులు యోగమూర్తిని ప్రతిష్ఠింపవలెను. ఇట్టివి గ్రామబాహ్యప్రదేశములందును, అరణ్యమధ్యము లందును, పర్వతశిఖర ప్రదేశములందును, నదీతీరములందును, నదీ సంగమ స్థలములందును ప్రతిష్ఠింపవలయును. ఈ యోగమూర్తిని గ్రామమధ్యములో ప్రతిష్ఠించరాదు. అట్లయినచో నది గ్రామ వినాశ హేతువగును. ఇంక భోగమూర్తిని గ్రామ, పట్టణములమధ్యములోనే ప్రతిష్ఠింపవలెను. వీరమూర్తిని గ్రామసరిహద్దులలో ప్రతిష్ఠింపనగును, చివరిదియగు నాభిచారిక మూర్తిని అరణ్యములందును పర్వతము లందును, కోటలలోను, రాష్ట్రసరిహద్దులలోను, శత్రుప్రవేశమార్గాభిముఖముననను ప్రతిష్ఠింపవలెను. తిరుమల ఆలయము అరణ్యమధ్యములో పర్వతశిఖర ప్రదేశమునగలదు. అట నొక కోట కట్టబడినట్లుగాని, లేక నచట పూర్వమేదైన గ్రామమున్న సమాచారమునుగాని మనము వినబోము. ఒకదేశమునకు మరియొక దేశమునకు నిది రాజకీయముగా సరిహద్దు రేఖగా నగును. కనుక నీ విగ్రహము వీరముకాదు, భోగమూర్తి

యనుట కవకాశములులేవు. కనుక నిది యభిచారికమూర్తియైనను, యోగమూర్తి యయినను గాసగును.

ప్రతి పరిస్థితి సంఘటనముల కనువగు మూర్త్యాకృతులను గురించి వాని విధానములను గురించి యాగమములు నిర్వచించినవి. ఉపదేవతామూర్తులపై దేవాలయములు మూడు విధములుగా రూపొందింప బడినవి. ఇవి ఉత్తమ, మధ్యమాధమములు. ఉత్తమ విధమయిన దేవా లయములో ప్రధానమూర్తి ఉపదేవతా సమావరణుడై యుండును. వీరు బ్రహ్మ, శంకర, మార్కండేయ, సనక, సనందన, సనత్కు మారులు మొదలగువారు. ఇంక మధ్యమాలయములో బ్రహ్మశివులు దక్క నన్యులుండరు. అధమాలయములో బ్రహ్మశివులు గూడ నుండరు. కేవలమొక మూర్తిమాత్రమే ప్రతిష్ఠితుడై యుండును. ఈ నియమము యోగ, భోగ, వీర మూర్తుల విషయములో మాత్రమే వర్తించును. ఆభిచారక మూర్తి విషయములో ఒక విధమయిన ఆలయమే కానవచ్చును. అధమాలయమే యిటప్రసక్తము. కనుక ప్రధాన దైవతమొక్కటియే ప్రతిష్ఠింపబడును. పైన చెప్పిన మూర్తు లకు సంబంధించిన ఆలయములకు విమానములుండును. ఈ అభి చారిక ప్రతిష్ఠాసమయము మిగిలిన మూర్తుల ప్రతిష్ఠాసమయము వేర్వే రుగా నుండును. మిగిలిన మూర్తుల ప్రతిష్ఠాకాలము స్థిరలగ్నమయి, సుముహూర్తమయి యుండవలెనని నిర్దేశింపబడుచు చరలగ్నమెట్టి పరి స్థితిలోనుండరాదనెడు నిషేధవాక్యము బలుకగా, అభిచారిక మూర్తి ప్రతిష్ఠమాత్రము విమానముండక చరలగ్నమందు ప్రతిష్ఠయగుచున్నది. దీనికి శుభముహూర్తముతో నిమిత్తములేదు.

ఆగమములో మూర్త్యాకృతులుల్లేఖింపబడినవి. ఆకృతులను బరిశీలించుటకుబూర్వము శ్రీవారే వర్గీకరణము క్రిందకు వత్తురో ఆ విగ్రహమును మానవ కల్పితముగా నూహించుకొని విచారింతము. పర్వతముపై నుండుట, అరణ్యమధ్యమగుట, పూర్వమున నట

నే గ్రామముగాని, పట్టణముగాని, కోటగాని లేకుండుటచేతను, ఈ మూర్తి నిలుచుండిన మూర్తియగు చుండుటతో యోగాధమ, ఆభిచారిక, లేక వీరాధమమూర్తి కావచ్చును. కాని ప్రాచీనమున నీయన భోగమూర్తిగా నుండి యుండదు. ప్రారంభమునుండి ఆలయములో శ్రీవారిమూర్తి యొక్కటియే యుండుటతో నిది అధమాలయమని చెప్పవలసివచ్చును. అధమమగు నిలుచుండిన యోగమూర్తి చతుర్భుజుండై పై రెండు చేతుల చక్రశంఖములు ధరింపవలెను. కుడివైపుక్రిందిచేయి అభయ హస్తముగాను, ఎడమ హస్తము కట్యవలంబిత హస్తముగను నూహింపవలెను. హృదయమందు శ్రీదేవిని గురించి యెట్టి విస్పష్ట ప్రకటనమును శాస్త్రములు చెప్పలేదు. కాని శ్రీవారి ధ్రువమూర్తిలో దక్షిణ వక్షస్థలముపై శ్రీదేవి యాకృతి విస్పష్టముగానున్నది. ఇది విగ్రహ గతమేగాని, తరువాత శ్రీవారిమూర్తి పైనే శిల్పియు చెక్కిన ప్రతిమముకాదు. క్రిందకుడిచేయి అభయ హస్తముకాదు. వరదహస్తము అనగా వరదుండనియు, వరముల ననుగ్రహించుస్వామియనియు నర్థము. శంఖము చక్రము పై రెండు హస్తములందున్నవి. కాని యవి విగ్రహ గతములుకావు. మరల్చుటకు వీలైనవి. కనుక నీ విగ్రహమును యోగమూర్తిగా భావింపవీలులేదు.

స్థానకాభిచారిక మూర్తికి రెండుగాని నాలుగుగాని బాహువు లుండనగును. కాని హస్తములందెట్టి ఆయుధములు నుండరాదు. బాహువుల స్థితియెట్లుండవలెనో నిర్ధరింపలేదు. ఇతరాంశముల్లా తలున్న ప్పటికి శ్రీవారి నీ స్థానకాభిచారికమూర్తిగా నెన్నవచ్చును. అభిచారిక మూర్తికి ముడుచుకొనిన గడ్డము, శరీరముతో సహా నితరయంగము లన్నియు నతిసన్నముగ నుండవలయును. తమోగుణమును ప్రదర్శిం చెడి దగు నూర్ధ్వదృష్టి గలిగి యుండవలెను. కాని శ్రీవారి మూర్తి అత్యంత సుందరసముపేతము. బాగుగా కుదిరిన అంగసౌష్ఠవముచే దివ్యాయుధోపేతుండై అలంకరింపబడిన పరవాసుదేవుని వర్ణనమున

కమరిన దివ్యమూర్తి. విగ్రహ గతమయిన శ్రీదేవి దక్షిణ వక్షస్థల స్థితయయినది. కనుక నీ యాభిచారిక విగ్రహ లక్షణమునకు సంబంధించిన విగ్రహము శ్రీవారిదికాదు అను నిర్ణయము మనము చేయ వచ్చును.

ఇది వీరమూర్తియునుకాదు. వీరమూర్తికి శంఖ చక్రములు విగ్రహగతములుగా నుండవలెను. విగ్రహగతమైన శ్రీదేవి యునికి దీనిలో ప్రసక్తముకాలేదు. అధోబాహువుల స్థితి యీ విగ్రహ లక్షణములో నెట్లుండవలెనో పేర్కొనబడలేదు.

ఇంక మనము శ్రీవారి మూర్తిని చివరకు భోగమూర్తిగా గ్రహింతమన్నను, శంఖ చక్రములు విగ్రహగతములయి యుండుట, శ్రీదేవీ భూదేవులు వక్షస్థలమందు విగ్రహ గతములయి యుండుట, క్రిందనుండు దక్షిణ హస్తము వరద ముద్రాకృతిగా నుండుటయను లక్షణములలో నొక్క వరద హస్తము మాత్రము సమన్వయపడినది. వామహస్తము కట్యావలంబితముగా నుండవలెనన్న నియమమీ మూర్తికిలేదు. కాని శ్రీవారి మూర్తిలో నీ లక్షణమున్నది. కనుక నీ విగ్రహ మే మూర్తి లక్షణమునకును సమన్వయ పడదని చెప్పుటయే సారాంశము.

దీనితో ఆగమ శాస్త్రములు విధించిన యే స్వరూప వర్ణనమునకు శ్రీవారి విగ్రహము సమన్వయము కాదనుటయే పిండితార్థము. ఈ విగ్రహము మానవ నిర్మితమేయయినచో అది ఆగమ శాస్త్రముల యావిర్భావమునకు బూర్వమే నిర్మాణమయి యుండవలెను.

ఇంక వైకుంఠమున పరవాసుదేవుని స్వరూపమును వర్ణించిన లక్షణమును సమన్వయ పఱచుట యొక్కటి మిగిలినది. వివిధ సంహితలు వైకుంఠములోని మహావిష్ణు స్వరూపమును వివిధములుగా వర్ణించి పెట్టినవి. భృగు సంహితలో నీ వర్ణనము 33 వ అధ్యాయములో

నున్నది. ఆయనకు నాలుగు చేతులుండును. పంచాయుధములను ధరించును. శరీరమున కిరువంకల నరితూచినట్లు, సమగ్ర సౌంద ర్యము పేరబడిన్నట్లు, ఆమర్చబడిన అంగసౌష్టవమును కలిగియుండును. దివ్యాభరణములను ధరించును. శ్రీదేవి యాయనను విడువక సేవిం చెడి పురాణమహిషి. ఈయన అనంత కల్యాణ గుణాకరుడు. షడ్గుణపరిపూర్ణుడు, కోరికలు లేనివాడు. ఈ వర్ణనము సమగ్ర మయినను కాకున్నను మనకు శ్రీవారి మూర్తిని సమన్వయము చేసి కొనుటలో పై వర్ణనము ఏ విధముగను దోహదముచేయదు. పాంచ రాత్రాగమములో పరవాసుదేవుని స్వరూప వర్ణనమున్నది. కాని అది దివ్యసర్పమగు ననంతుని యధిష్ఠించిన స్వరూపము. ఇదియును మనకు ప్రయోజనమును సమాధానించలేదు.

విష్ణుపురాణములలోని యాదవ వంశములో నేడవ యధ్యాయ ములో శ్రీ మహావిష్ణువుయొక్క మూర్తి స్వరూపవర్ణన మిందుగలదు. ఇది తాత్విక చింతనులకు మాత్రము యోగ్యమయినట్టిది ఇందు ధ్యానము పంచదశలలో పేర్కొనబడినది. ప్రథమ దశలోని ధ్యాన మూర్తి యీ విధముగాఁ బేర్కొనియున్నది. సర్వాభరణ భూషితుడు, సర్వాయుధోపేతుడునయి, అష్ట లేక చతుర్భుజుడుగానున్న స్వరూప మును ధ్యానింపవలెను. ద్వితీయదశలో దివ్యాయుధములను విస్మరించి మూర్తి ధ్యానమును చేయవలెను. తృతీయదశలో దివ్యాయుధములేగాక, సర్వాభరణములనుగూడ విస్మరించి ధ్యానము సల్పవలెను. తరువాత దశలో ప్రధానాంగములగు శరీరము ద్విబాహువులు, మొదలగువాని నుద్దేశించి ధ్యానింపవలెను. ఇట్టి వర్ణనములో ప్రసన్నవదనము, తామరపూరేకులవంటి సుందరనేత్రములు, దివ్యకర్ణములు, విశాల ఫాలము, కర్ణాభరణములు, దక్షిణావర్తశంఖము నుపమించుకంఠము, విశాలవక్షము, శ్రీవత్సచిహ్నము, త్రివళీయుతోదరము, నిమ్ననాభి, దీర్ఘమైన అష్ట లేక చతుర్బాహువులు, బాగుగా నేర్పరుపబడిన (సమ

పీనమైన) యూరువులు, మచ్చలేని పచ్చని పట్టువస్త్రము, కిరీటహార, కేయూర, కటక, పాదాంగుళీయక, కరాంగుళీయములు, శార్ఙ, శంఖ, చక్ర, గదా, ఖడ్గాయుధములు గల పంచహస్తములు, షష్ఠమహస్త మందక్షమాల, సప్తాష్టమ హస్తములందు వరదాభయముద్రలు కలిగిన శ్రీమహావిష్ణువును తత్పురాణము వర్ణించినది. ఒకవేళ నాలుగు చేతు లున్న మూర్తినే ధ్యానింప నెంచిన శంఖచక్ర గదా పద్మయుతుఁడగు మూర్తిని చింతనచేయవలెను. ఈ వర్ణనము శ్రీవారిమూర్తికి సమన్వ యింపజాలము. పంచమదశలో ఆయుధములన్నియు విస్మరింపఁ బడును. అప్పుడు నాలుగుచేతులు ఆయుధములు లేక విశ్రాంతిగై కొన్నట్టి వయినవి. భూషణములు, అలంకారములు మూర్తి నావరించియే యుండెను. సామాన్యముగా జూచినచో నీలక్షణములు శ్రీవారి మూర్తిలక్షణముతో సరిపోల్చుటకు వీలు నిచ్చుచునే యున్నవి. అధో బాహువులకొక నిర్దుష్టమైన స్థితియున్నది. దక్షిణమున వరదహస్తము, వామహస్తము కట్యవలంబితము. ఇది రెండవదశలోని ధ్యానమున మూర్తిలక్షణముతో సమన్వయింపఁ దగినదిగా నున్నది.

ఆగమశాస్త్రములో మరియొక్క విషయమును మనము గమ నించి ముందుకు సాగిపోవుదము.

అత్రిప్రోక్తమయిన సమూర్తార్చనాధికరణమునందు మూర్తి లక్షణములలో విరహమూర్తినొక ప్రత్యేకలక్షణముగాఁ జెప్పియున్నాఁడు. దానికి

"శ్రీభూమిభ్యాం మునిభ్యాంచ రహితం విరహం విదుః।
రహితం శంఖ చక్రాభ్యాం కేవలం దేవమేవచ॥"

(20 అధ్యాయము 17 శ్లోకం)

'శ్రీభూదేవేరులు, భృగ్వాదిమునులు, శంఖచక్ర రహితమై కేవ లము విష్ణుమూర్తియుండెడు ప్రతిమయే విరహమూర్తిగా నెఱుంగ

వలయును' అనియున్నది. ఈ మూర్తి శ్రీవారికి మూర్తి కావచ్చును. ఆగమశాస్త్రములో శ్రీవైఖానసములో నీ విషయములోదక్క నన్యవిధముల శ్రీవారిమూర్తిని సమన్వయింపజాల కున్నాము.

ఇఁక నీమూర్తి ఆగమములు పుట్టక పూర్వమేయున్నదని భావించుకొన్నచో నదియొకమార్గము. భాగవతములో నొక వర్ణనమున్నది. దానిని బరిశీలింతము. శ్రీకృష్ణుఁడు జననాంతరము తన తండ్రియగు వసుదేవునకు దర్శనమిచ్చెను. శ్రీమద్భాగవతములో వ్యాసమహర్షి యీ స్వరూపవర్ణనము గావించెను. ఆ శ్లోకమిది.

"తమద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజం శంఖగదార్యు
దాయుధమ్।
శ్రీవత్సలక్ష్మం గళశోభికౌస్తుభం పీతాంబరం సాంద్రపయోద
సౌభగమ్॥"

ఈ శ్లోకములోనున్న శ్రీమహావిష్ణువునకు చతుర్భుజములున్నవి. శంఖగదాద్యాయుధములున్నవి. శ్రీవత్సచిహ్నము, కౌస్తుభమున్నది. పీతాంబరధారణమున్నది. మెఱపులీనెడు కిరీటమున్నది. కుండలములున్నవి. స్వర్ణకట్యాభరణధారుఁడు, ఇంకననేకాభరణములు ధరించి నట్లున్నది. ఈ శ్రీకృష్ణుఁడే తనదివ్యస్వరూపముతో దేవతలకు సూర్యమండలమునుండి కాన్పించి ప్రస్తుతింపబడినవాఁడు. ఇట్లు స్తుతింపబడిన యీ దివ్యశక్తియుతుని శార్ఙ్గధరునిగాగూడ దేవతలెఱింగిరి. ఆ దివ్యస్వరూపమే భూమిపయి తిరుమలకొండలలో శ్రీవేంకటేశ్వరునిగ నవతరించెనన్నచో మనము శ్రీవారి మూర్తిస్వరూపములో శ్రీకృష్ణునను సంధించెడి కొన్ని చిహ్నములను గుర్తింపవచ్చును. సూర్యమండలములోనున్న యీ దివ్యశక్తిస్వరూపమును కడుదూరమునుండి దేవతలు గాంచిరి. దివ్యాభరణములనేకములుండి యున్నను దేవతలు వానిని గుర్తించియుండనందున వాని చిహ్నములను సరిగావర్ణింపకపోయిరి. కాని ఆయుధములేవియును లేకుండుట మాత్రముగమనించిరి. ఆ దివ్య

స్వరూపము సూర్యమండలాంతర్గతమగుటకుఁ బూర్వమే ఆ దివ్యశక్తికి గల శార్ఙ్గమునుగాంచిరి. శిలప్పదికారములోఁగూడ శంఖ, చక్ర, శార్ఙ్గములు శ్రీవారికమరించుటకు వీలున్నట్లుగనే శ్రీవారిస్వరూప వర్ణనా సందర్భమున వర్ణించబడెను. అనగా నా యాయుధములు విగ్రహ గతములుగా నిది స్పష్టముగనే చెప్పినది. నమ్మాళ్వారుగూడ శ్రీవత్సము శ్రీదేవిగలిగిన శ్రీవారిని, హస్తమందు శార్ఙ్గమును వర్ణించెను. మరి యొక ఆసక్తికరమగు విషయమేమన శ్రీవారి ఇరుబుజముల మెడ యెముకనుండి దిగువకు బాహుమూలముల ననుసరించుచు నిత్యము శార్ఙ్గము, అమ్ములపొదిని ధరించుటచే గలిగిన యొఱపిడిగుర్తులున్నవి, ఈ చిహ్నములు శ్రీవారిమూర్తితో శ్రీరామావతారమునకుగల సన్నిహితత్వమును తెలుపుచున్నవి. కృష్ణావతారవిషయ మిదివఱకే చర్చింప బడినది. గర్భాలయములో శ్రీవారితో శ్రీరామ శ్రీకృష్ణుల యునికిని గూర్చి ప్రాచీనకాలములో నీపై సంబంధమును సూచింపజేసినట్లుగా నతి దృఢముగా విశ్వసింపబడినది. మార్గశిరమాసమందు భోగశ్రీనివాస మూర్తికి బదులుగా శ్రీకృష్ణుని విగ్రహమును ఏకాంతసేవలో పాల్గొన జేయుదురు. అనగా శయనబేరమగుచున్నది. శ్రీకృష్ణున కిచ్చట మార్గశిర (ధనుర్మాసము) ములో ప్రాధాన్యమొసంగుట శ్రీవారితో శ్రీకృష్ణునకుగల సన్నిహితత్వమును సూచించుటకేయని చెప్పవలెను. శ్రీవారి ఆలయములో నిత్యము పఠింపబడెడి మన్త్రపుష్పములో పఠింపబడు మన్త్రములు మనకు శ్రీవారికిని రామకృష్ణాద్యవతారములకును గల సంబంధమును స్పష్టపఱచుటలో మిక్కిలిగా సహాయపడును.

సంగ్రహముగా నీ మన్త్రపుష్ప పఠనాక్రమమిది.

1. నాలుగు వేదములలోని ప్రారంభ ఋక్కులు

2. నారాయణోపనిషత్తులోని అష్టాక్షరమన్త్రము.

3. శ్రీరామావతార ప్రశంస తెలుపు శ్లోకము.

4. శ్రీకృష్ణావతార ప్రశంస (మహాభారత యుద్ధ విషయము)

5 శ్రీకృష్ణుడు తానెవరైనది తండ్రితో తన్నెఱింగించుకొన్న వృత్తాంతము.

6. వైకుంఠములోని శ్రీమన్నారాయణుని దివ్య స్వరూపము.

7. శ్రీ మహావిష్ణువునుండియే సకలసృష్టి స్వరూపము వెలువడిన వృత్తాంతము.

8. శ్రీ వేంకటాద్రిపై శ్రీవారి యవతార శ్లోకము.

9. శ్రీ నమ్మాళ్వారుల శ్లోకము.

10. శ్రీ ఆళవందారు, శ్రీరామానుజుల గ్రంథముల నుండి ఒక్కొక్క శ్లోకము.

ఇవి శ్రీమన్నారాయణుడును శ్రీవారును ఏక స్వరూపులేయని ఋజువు పఱచుచున్నవి. తిరుమల నంబిచే సమకూర్పబడియుండునని తలంచు నీ మన్త్రపుష్పము తిరుమల శ్రీవారి ఆలయములో నొక ప్రత్యేకత సంతరించుకున్నది. ఇది శ్రీ వైఖానస పాంచరాత్ర అగమములు నిర్దేశించు మన్త్రపుష్ప విధానమునకు విరుద్ధమయినది. శ్రీరామానుజ విరచితమగు నిత్యగ్రంథములోని విషయమునకు నిది విరోధమే. ఈ మన్త్రపుష్పములో కేవలము రామకృష్ణాద్యవతారములు మాత్రమే ప్రశంసచేయబడుట గమనార్హము. గర్భగృహములో నేతత్సంబంధమగు నుత్సవమూర్తులు మాత్రమే నెలకొనియున్నవి. ప్రాచీనమునుండి శ్రీ వేంకటేశ్వరుని మూర్తి స్వయంవ్యక్తమను విశ్వాసముతోబాటు శ్రీవారికి రామకృష్ణాద్యవతారములతోనుఁ బ్రత్యక్ష సంబంధమున్నదను విషయము విశ్వసనీయమే అయ్యెను. ఈ విషయము మహాభారతములోని మౌసలపర్వములోని శ్రీకృష్ణభగవానుని

వాక్యములచే సమర్థింపబడినది. బ్రహ్మ దేవుడు శ్రీవారిని నిత్యము పూజించుననెడి యైతిహ్యము నేడును ఆకాశగంగా తీర్థముతో నైదు బంగారు కలశములతో నింపి వానితో నింకను పూజార్థము ప్రయోగించెడి సామాగ్రిని గర్భగృహములో నుంచుటతో విశ్వసనీయమైనది. బ్రహ్మదేవు డుపయోగించిన పూజానంతర తీర్థమే ప్రాతఃకాలమున నేడు విశ్వరూప సందర్శనార్థమై వచ్చు భక్తులకు శ్రీవారి తీర్థముగా వినియోగింపబడుచున్నది.

మనము శ్రీవారి ధ్రువమూర్తికి గల ప్రత్యేక లక్షణములను గుఱించి చర్చించి యున్నాము. శ్రీవత్సలాంఛనమున దక్షిణ వక్షస్థలమున శ్రీదేవీ నివాసము, భుజములపై యేర్పడిన రాపిడి గుఱుతులు, స్వేచ్ఛగానుండి సులువైన భంగిమలోనున్న రెండు ఊర్ధ్వబాహువులు (తరువాత వీనియందు శంఖ చక్రము లమరించబడినవి), అధోదక్షిణ హస్తము వరద భంగిమముగానుండుట, అధో వామహస్తమున కట్యవలంబిత భంగిమ,—ఇవి శ్రీవారి విగ్రహమున గల ప్రత్యేక లక్షణములు. దీనిలో నొక విషయమై మరికొంత వివరింపవలసి యున్నది. స్థానక మూర్తి లక్షణములలో వరద హస్తమును గూర్చి ఆగమముల ద్వారమున సమన్వయింప జాలము. హస్తములు, హస్తాంగుళులు చక్కగా విస్తరింపబడి అధోముఖమై కుడి పాదమునకు సమముగా కేంద్రీకృతము గావింపబడియున్నవి. భక్తుడు కోరెడి వరముల నెట్టి యడ్డగింపు లేక యథేచ్ఛగా నొసంగెడు లక్షణము నిది సూచించుచున్నది. వ్రేళ్ళయొక్క స్థానము వామహస్తములో బొటనవ్రేలు తుంటి భాగమునకు నూరువునకు తగిలియుండుట వింటిని లేక వింటి నారిని శ్రీరామచంద్రుడు ధరించియున్నట్లు సూచించుచున్నది. ఇదియే స్వరూపమును నమ్మాళ్వారు మహాశయుడు తన 'తిరువాయిమొళి' గ్రంథములోను వర్ణించినాడు. మరియొక ముఖ్యలక్షణము ప్రలంబ సూత్రము, కటి సూత్రముండుట. మొదటిది యజ్ఞోపవీతము రెండవది మొలత్రాడు.

ఈ లక్షణములు నిర్ద్వంద్వముగా నీ విగ్రహము పురుష విగ్రహమే కాని స్త్రీ విగ్రహము కాదని ఋజువు చేయుచున్నవి. వక్షస్థల మధ్యమున కౌస్తుభము వ్రేలాడుట విష్ణు విగ్రహ మిదియని స్పష్టీకరించుచున్నది. శిలప్పదికార గ్రంథములోను ఈ విగ్రహ మిట్లే వర్ణింపబడినది.

ఇఁక మిగిలిన ఆభరణములు, అలంకరణములు రజతకౌతుక బేరమగు భోగ శ్రీనివాసమూర్తి కున్నట్టివే. ఈ ఆభరణములన్నియు శ్రీవారిపై నున్నట్టివే. ధ్రువబేరమునకు సరియగు నకలు కౌతుక బేర మని ఆగమములు స్పష్టముగా నిర్వచించినవి. ధ్రువ బేరమునకు బదులుగా ప్రాతినిధ్యము వహించగలట్టిది కౌతుక బేరమే. ఈ విషయ మును గుఱించి పూర్తిగా 7 వ అధ్యాయములో వివరింపబడినది. మన మిక్కడ పేర్కొనవలసినది నాగాభరణము వంటి ఆభరణములు ధ్రువ మూర్తిపై విగ్రహ గతమని చెప్పుటకు వీలులేదనియే. బంగారు ఆభ రణము రేకు రూపములో బుజములను చుట్టి ధరింప వీలుగా తరువాత కాలములో నొకా నొక భక్తునిచే సమర్పింపబడిన కానుకయయి యున్నది. ఆది శేషుఁడు విష్ణువునకు విడదీయరాని సన్నిహితత్వము గలవాఁడనెడు విషయ మందఱు నంగీకరింతురు. మన్త్రపుష్పములో పొయిగై ఆళ్వారు పాశురము నిత్యము నీ సందర్భములో పఠించుట నిచట గమనింపవలెను. గర్భాలయములో సర్పరూపమెచటను చిహ్నితమగుటలేదు. శ్రీవారి బేరమునను ఇట్టి చిహ్నము గానము. కిరీటము మీద యెట్టి యన్త్రమునులేదు. అనేకములగు అభూత కల్పన లున్నవి. అవి విన్నవి, వినిపించినవి, పుక్కిటి పురాణములు జనవ్యాప్తము లైనవి గలవు. వానిని గుఱించి యీ యధ్యాయము చివర ప్రసంగింపఁ బడును.

# ధ్రువబేరమునకు సమగ్ర స్వరూపము నొసంగెడి యితర బేరములు

## కౌతుక, స్నపన, ఉత్సవ, బలిబేరములు.

### భోగ శ్రీనివాసమూర్తి (కౌతుక బేరము)

క్రీ. శ. 966 వ సంవత్సరములో 'సామవాయి' మహారాణిచే దాన సమర్పణముగా నీ రజత విగ్రహము శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠింపఁబడినది. ఇది యేడవ యధ్యాయములో విపులముగాఁ జర్చింపఁబడినది. భోగ శ్రీనివాసమూర్తి విగ్రహములోని ఊర్ధ్వ హస్తముల కున్న శంఖ చక్రములు శాశ్వతమైనట్టివే. విగ్రహ గతములే. ఇట్టి చిన్న విగ్రహమున కీవిధమయిన యాకృతి యుండుట సహజము. కౌతుక బేరముగాఁ బేర్కొనఁబడుచున్న ఈ రజత భోగ శ్రీనివాసమూర్తి యీ విధముగా మలచబడినప్పటికి, అనగా నా సమయమునకే శ్రీవారి ధ్రువమూర్తిలో నూర్ధ్వహస్తములకు శంఖ చక్రము లమరింపబడి యున్నట్లు మనమితర విధములయిన యాధారములచే నెఱింగి యున్నాము. మరియొక ప్రత్యేక లక్షణము ధ్రువమూర్తికి ఉన్నట్లే ఈ భోగ శ్రీనివాసమూర్తికి నున్నది ఇది ధ్రువీకరింపబడుట నేడు అసాధ్యము. కౌతుక బేరము పాదముక్రింద పీఠముపైన షట్కోణ యంత్ర మొకటి యున్నది. ఇందు రెండు సమబాహు త్రిభుజము లొకదానిలో నొకటి దూర్చినచో నెట్లుండునో అట్లు ఈ యన్త్ర ముండును. ధ్రువబేరమునకూడ నీ భాగమందే యీ యంత్రముండి తీరవలయును. నమ్మాళ్వారు తన తిరువాయి మొజిలో శ్రీవారి ధ్రువబేర పాదములను గుఱించి -తి రహస్య వివరణ మొకటి యిచ్చెను. (3-4-4)




షాడ్గుణ్యయంత్రము యొక్క ఆకృతి

ఈ వివరణము తిరుమాల్-ఇరమ్-సోలై లోని తిరుమాల్ పాదముల వర్ణనముతో సరిపోల్చవగున. (3–1–1.) దీనిలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి పాదముల క్రింద ప్రకాశముచే వెలుంగుచున్న, భుజములున్న (కోణములున్న) చిత్రమున్నది అని గలదు ఇతర విషయములో అనగా రెండవ గ్రంథములో పద్మముపై పాదములున్న విగ్రహమును గురించిన వర్ణనము గలదు. ఈ ప్రకాశవంతమైన వెలుగులీను కోణములు షట్కోణాకృతియే గావలయును. పాఠకులు విషయము నెఱుంగుటకు తమిళములో నీ శ్లోకము లీయబడుచున్నవి

తిరుమల శ్రీవారినిగూర్చి (3–4–4)

పజ్జయక్కణ్ణనెన్గో? పవళచ్చెవ్వాయ నెన్గో?
అజ్‌కది రడియ నెన్గో? అఞ్జనవణ్ణనెన్గో?

ఇచట 'కదిర్' అను పదమే ప్రకాశవంతమైన షట్కోణా కృతిని గురించి చెప్పుచున్నది.

తిరుమాల్ – ఇరమ్ - శోలై – గురించి (3–1–1.)

ముడిచ్చోదియాయ్ ఉవదు ముకచ్చోది మలర్న్దదువో?
అడిచ్చోది నీనిన్ద తామరై యాయ్ అలర్న్దదువో?

మనవాళ్‌ప్పెరుమాళ్ (భోగ శ్రీనివాసమూర్తి) ప్రతిష్ఠా కాలమునకు రెండు శతాబ్దములకు పూర్వమే నమ్మాళ్వారు ఈ ధ్రువమూర్తి వర్ణనము గావించెను. అప్పటికి అవలంబింపబడుచున్న ఆగమము వైఖానసమే గనుక నాయాగమ శాస్త్రానుసారమే నాటికి ధ్రువబేరము నావరించి యొక పీఠముండియుండును. ఈ విగ్రహము మామూలుగా నాలుగు పలకల కూర్పు లేక త్రిచతురస్రము లొకదానికంటె నొకటి వివృతిలో తక్కువయైనవియుండి పై చతురస్రమున శ్రీవారి పాదపీఠముండి యుండవలెను చతురస్రాకృతి తాత్త్విక సంబంధమును గుర్తు చేయు నట్టిది. ధర్మ, జ్ఞాన, ఐశ్వర్య, వైరాగ్యములు వాని ప్రతిబింబములు. ఈ పీఠముపయి 8 గాని 16 గాని రేకలు గల పద్మ మమరింపబడియుండును. దీని మధ్యభాగమున నా షాడ్గుణ్యయంత్రము చెక్కబడియుండును. ధ్రువ బేరమునకు సంబంధించినంతవరకు నీ యంత్రము పద్మముచే నావరింపబడి యున్నది. పీఠవిచ్ఛిన్నము జరిగిననేగాని నేడు అర్చకస్వాములయినను నీ యంత్ర దర్శనముచేయజాలరు.

కాని ఆలయ నిర్మాణముతో బాటు నీ పీఠ నిర్మాణమును జరిగియుండును. అంతకుపూర్వ మీ పీఠము నిర్మింపబడియుండదు. ఇది యెట్లు నిర్ధరింపబడినదన్నచో నీ పీఠము, వేది, ఆలయపు గోడలు స్థానక మూర్తిని బట్టి యొకదాని కొలతలతో నొకటి అనుబంధితమైనవి. కనుక నీ ఆలయము క్రీ. శ. 900 కు పూర్వమే నిర్మింపబడియున్నదని చెప్పవీలులేదు. ఈ విషయము 5 వ అధ్యాయములో తెలుపబడినది. శ్రీవారి పాదముల యడుగున యంత్రమున్నచో నది క్రీ. శ. 966 లో తెలిసిన విషయమే యయ్యెడిది. అట్టి యంత్ర మొకటి యుండెనని యూహింపబడి కౌతుక బేరము పయి వ్రాయబడి యుండును.

ఈ కౌతుక బేరము నిత్యాభిషేకము ఇతర విధములగు నర్చనలు జరిపించుటకు చరబింబమావశ్యకమయినందున ప్రతిష్ఠింపబడినది. ధ్రువమూర్తి నొకసిల్కు దారముతో ననుసంధింపబడి యీ కౌతుక

బేర ప్రతిష్ఠ జరిగియున్నది. ధ్రువ బేరమునకు ప్రాతినిధ్యము వహించుటకు, సన్నిధి నుండి బాహ్యస్థితికి వచ్చినపుడు ప్రత్యేక పర్వదినోత్సవములయందు ఒక సన్నని బంగారపు తీవతోను సిల్కుదారముతోను ధ్రువమూర్తికి సంధానింపబడును. ధ్రువమూర్తికి గల అన్ని శక్తులు, సర్వ్హతలు నీ కౌతుకమూర్తికిగూడ నుండును.

## ఉగ్ర శ్రీనివాసమూర్తి :

ఈయన మొదటగా 'వేంకటత్తురైవార్' అను పేరుతో పిలువబడుచుండెను. భోగ శ్రీనివాసుని ఆలయ ప్రవేశమునకుఁ బూర్వమే యీయన యాలయములో నున్నట్లు ఈ పదముచే తెలియుచున్నది. మలయప్పస్వామివారు ఉభయ దేవేరులతో శ్రీవారి ఆలయములోనికి ప్రవేశింపక పూర్వమీయనయే యుత్సవమూర్తిగా నుండి యుండును. ఈయన నేడు మూడు ఉత్సవములలో మాత్రమే పాల్గొనును. ఉత్థానైకాదశి, ముక్కోటి ద్వాదశి, ద్వాదశారాధనమనెడివి ఆమూడు వుత్సవములు.

## కొలువు శ్రీనివాసుడు :

వీరిని బలిబేరమనియు నందురు. ప్రతినిత్యము తోమాలసేవయనంతరము తిరుమామణి మంటపములో నొక ప్రత్యేకోత్సవము జరుగును. ఇట నీ కొలువు శ్రీనివాసుని రజత పీఠముపై వేంచేపుచేసి బంగారు గొడుగు నమర్తురు. ఇచటనే పంచాంగ శ్రవణము జరుపుదురు. గత దినము హుండీయందు కానుకల వలన లభించిన ఆదాయము వాని వివరములను పలువుర సమక్షముకో చదువుదురు. ఇందులో ప్రతి చిన్న నాణెముల మొత్తము వేఱ్వేరుగను, రాబడిన విలువగల రత్నములు, బంగారు నగల వివరములు విస్పష్టముగా ప్రకటింతురు. సంప్రదాయాచారముగా నర్చకస్వాములు స్వీకరించు మాత్రాదానము (బియ్యము వగైరాలు) ఇటనే ఇత్తురు. ఈ ఆచారము సంప్రదాయము ఏనాటి నుండి ప్రారంభమయ్యెనో, ఈ మూర్తి యే విధముగా శ్రీవారి ఆలయ

ములో ప్రవేశించెనో చెప్పజాలము. ఈయనకు బలిబేరమన్న సంకేత మున్నప్పటికి పూజానంతరము జరిగెడి బల్యుత్సవములో నీయన యెప్పుడును పాల్గొని యుండలేదు. ఈయనను దర్బారు శ్రీనివాస మూర్తియనియే వ్యవహరించుచున్నారు.

## ఉత్సవమూర్తి (మలయప్పస్వామివారు శ్రీభూదేవులు)

ఈ మూర్తి మొదటి సారిగా 'మలైకునియ నిన్రాన్' అను పేరుతోఁ బేర్కొనఁబడెను. ఈయన విషయము మొదటగా క్రీ శ. 1339 ప్రాంతములో ప్రస్తావింపఁబడినది. ఈయన ప్రవేశము వరకు అన్ని విధముల నుత్సవమూర్తిగా నంతకుముందు శ్రీవారి ఆలయములో నున్న ఉగ్ర శ్రీనివాసమూర్తియే వ్యవహరించెను. ఆయన ధ్రువమూర్తి వలె నేక మూర్తియే. చక్రమును ప్రయోగ స్థితియను ప్రత్యేక విధానములో దాల్చెను. ఆ మూర్తిని గాంచినచో చక్రము ప్రయోగ సన్నద్ధమయినట్లుగాన్పించును.

వేంకటత్తురైవార్ అను పేరు గల్గిన నీయుగ్ర శ్రీనివాస మూర్తిని 'మలైకునియ నిన్రాన్', అను పేరు గల్గిన మలయప్పస్వామి వారే రీతి నాక్రమించిరో తెలిపెడి యైతిహ్యమొకటి అర్చకులలో ననూచానముగా వచ్చుచున్నది. బ్రహ్మోత్సవములో నొకానొక సందర్భములో తిరుమల వీధులలో నీ మూర్తితోడనే యుత్సవము జరుగుచుండెను. ఆ సమయములో గ్రామములో మహాగ్నిజ్వాల చెలరేగి గ్రామ మంతయు నాహుతి యయ్యెను. అర్చకులుగాని, నట యాతికులుగాని యీ హఠాత్సంఘటనమునకు గారణమేమియో నూహింపఁ జాలరైరి. తమ విధినిర్వహణము దోషమేదైన నున్నచో క్షమింపుమని స్వామిని వేడిరి ఆ సమయములో నొకనికి పూనిక వచ్చెను. కాలము మారినదనియు, తన్నెప్పుడు నింక యుత్సవ మూర్తిగా నుపయోగింపరాదనియు నుపయోగించినచో నిట్టి బాధలు తప్పవనియు నావేశపూరితుఁడయి పలికెను. ఇంకను నా పర్వత

మైదానములో నొక మూర్తిగలదనియు నా మూర్తిని వెదకి యుత్సవ మూర్తిగా నుపయోగింప దగుననియు చెప్పెను. అప్పటినుండి ఉగ్ర మయిన యీ మూర్తిని యుగ్ర శ్రీనివాసమూర్తిగాను, వెదుకగా లభించిన మూర్తి దేవేరులతో నుండినవారిని మలయకునియనిన్ర పెరుమాళ్ (పర్వతమైదానమందు లభించినస్వామి) అనియు పిలిచిరి తరువాత కాలములో నీ పేరు సంగ్రహముగా మలయప్పస్వామిగా నయినది. ఈ మూర్తులు లభించిన పర్వత మైదానము 'మలయప్పకోన' అని పిలువబడినది. ఆవేశముగా వచ్చిన వాక్కుల యందలి భగవదాదేశమును అర్చకులు తీవ్ర విషయముగా భావించిరి. ధ్రువమూర్తి ఏకమూర్తి గనుక దేవేరులలో నున్న మలయ పెరుమాళ్లను ఉత్సవ మూర్తిగా గుర్తించుటకు కనుమతింప లేరైరి. ఈ సంఘటనము కొంచెమించుగా శ్రీ రంగనాథస్వామివారి యుత్సవమూర్తులు తిరుమల లోనే ముస్లిముల దురాగతముల బారినుండి తప్పించుకొనుటకై ఆశ్రయము పొందిన కాలములోనే అనగా క్రీ. శ. 1339 వ సంవత్సర ప్రాంతములో జరిగియుండును ఈ మలయప్పస్వామివారు పూర్వము తిరుకుకనూరులో పాంచరాత్రజులచే వ్యవహరింపబడిన తిరువిలాన్ కోయిల్ పెరుమాళ్ళుగను, కొలువు శ్రీనివాసమూర్తి తిరుమంత్రశాల పెరుమాళ్ళుగను మన మూహింప వీలునిచ్చుచున్నది. దేశము విప్లవ పరిస్థితులలో నుండినప్పుడు భద్రత కొఱకై యా విగ్రహముల నీ పర్వతమైదాన ప్రదేశమునందు జేర్చియుందురు. ఉత్సవమూర్తి దేవేరులతో నిట ప్రసక్తమగుట నూత్నమగు విషయముగనే పరిగణింప వలెను.

సంప్రదాయానుసారము ధ్రువబేరమునకు ప్రాధాన్య మీక్రింద వరుస క్రమములో మిగిలిన బేరములు నిర్వహించును. భోగ శ్రీనివాసమూర్తి, దేవేరులతో గూడిన మలయప్పస్వామివారు, ఉగ్ర శ్రీనివాసుడు, కొలువు శ్రీనివాసుడు. ఆగమ పరిభాషలో వీని క్రమ

మిట్లుండును. కౌతుక, ఉత్సవ, స్నపన, బలిబేరములు. ధ్రువబేరముతో ప్రత్యక్ష శక్తిపాతము కౌతుకమూర్తికే జరుగును. కౌతుకమునుండి యుత్సవమూర్తికి శక్తిపాతము జరుగును. ఉత్సవమూర్తినుండి స్నపన బేరమునకు, స్నపనబేరమునుండి బలిబేరమునకు ఈ శక్తిపాతము ఒకదాని వెంబడి ఒకదానికి జరుగుట వైఖానసాగమ శాస్త్ర పద్ధతి. కాని శ్రీవారి ఆలయములోని ధ్రువమూర్తి స్వయం వ్యక్తమగుటచే నది యెవరిచేతను ప్రతిష్ఠావిధి నిర్వర్తింపబడినదికాదు. శ్రీవారి ఆలయములో వైఖానసాగమ విధానముగా జరిగిన మొదటి ప్రతిష్ఠ భోగ శ్రీనివాసమూర్తిదే. ఇది క్రీ. శ. 966 వ సంవత్సరములో జరిగినది. శ్రీవారి ఆలయములో సంతకుముందుగనే నొక చంబింబ మున్నది. అది 'వేంకటత్తురైవార్' (ఉగ్ర శ్రీనివాసమూర్తి) విగ్ర హము. ఈ విగ్రహము ఆగమ శాస్త్రానుసారము ప్రతిష్ఠ జరిగించు కొనియే గర్భాలయమందు ప్రవేశించెనో లేదో తెలుపుటకే యాధారము లునుగానరావు. ఈ విధమయిన ప్రతిష్ఠ భోగ శ్రీనివాసమూర్తి కావశ్యక మగుటలో నింకొక విశేషమున్నది. ఉగ్ర శ్రీనివాసమూర్తి స్వరూపము సరిగా ధ్రువబింబమునకు నకలు కాకపోవుటయే దీనికి హేతువుగాఁజెప్పనగును. అకారణముననే మనవాళప్పెరుమాళ్ విగ్ర హము వెండితో తయారు చేయబడి ప్రతిష్ఠింపఁబడియుండును. కనుక ఆగమ విధానములో మనవాళప్పెరుమాళ్ కౌతుక మూర్తిగా నయినది. 'వేంకటత్తురైవార్' తరువాత ప్రాధాన్యము లభించి యుత్సవ మూర్తిగా నయినది. ఇది క్రీ. శ. 1330 ప్రాంతమువరకు కొనసాగ బడి 'మలైకునియనిన్రాన్' ప్రవేశముతో నీయన యుత్సవ మూర్తి త్వము అంతర్హితమైనది.

ఈ విధముగా నపుడపుడు విగ్రహములను ప్రవేశపెట్టు పద్ధతి శాస్త్ర విరుద్ధము. కావుననే 'మలయకునియనిన్రాన్' ఉత్సవమూర్తు లను, శాసనము లేవియును ఉత్సవమూర్తులుగా బేర్కొనలేదు. భోగ

శ్రీనివాసమూర్తిని కౌతుక మూర్తిగాను చెప్పలేదు. వేంకటత్తురైవార్ మూర్తి కొలువు శ్రీనివాసమూర్తులు స్నపన, బలిబేరములుగానే శాసనములు బేర్కొనియుండలేదు. కారణము స్పష్టమే. ఇవి యేవియును ఆగమశాస్త్ర విధానమున ప్రతిష్ఠింపబడలేదు. ఒక్క భోగ శ్రీనివాస మూర్తి మాత్రమే ప్రతిష్ఠింపబడినదిగాని అదియు కౌతుకమూర్తి భావముతో ప్రతిష్ఠించినట్లు కానరాదు. చరబింబములన్నియు వానికి గల ప్రచారనామములతోడనే పిలువ బడినవి. ఆగమ పరిభాషానామములతోఁ బేర్కొనఁబడలేదు.

## సుదర్శనము చక్రత్తాళ్వారు :

సన్నిధిలోనున్న విగ్రహములలో చక్రత్తాళ్వారుగూడ గలదు. వీరికి సంబంధించిన ప్రత్యేకోత్సవములు గలవు బ్రహ్మోత్సవములోని అంకురార్పణ సమయములో ధ్వజస్తంభము కడకును, తీర్థవారి యుత్సవములో స్వామి పుష్కరిణీ తీరమునను వేంచేయుదురు.

ఇక శ్రీరామ శ్రీకృష్ణులు శ్రీవారి సన్నిధిలో నుండుటను గుఱించి వివరించబడుచున్నది.

## శ్రీ రఘునాథ, శ్రీ కృష్ణులు :

సన్నిధిలోనున్న శ్రీరామకృష్ణ విగ్రహముల ఉనికిని గుఱించి ఒకేసారి చర్చింపబడుచున్నది. శ్రీవారి గర్భగృహములో ఈ మూర్తుల యునికి తర్కమున ఒంటినది. కనుక వారి విషయమై సమన్వయించుకొనవలెను. శాసనస్థమయిన విషయమేదియును దీనిని సిద్ధారించునది లేదు. శ్రీ కృష్ణుని విషయములో మాత్ర మొక ఛిద్ర శాసనముగలదు. దానిలో 'అవణిములు దుద్దైయాల్' అను నామె 1 వ కులోత్తుంగ చోళుని భార్యయై యుండెను. ఆమె 'మా తిరువాయిప్పడి ఆళ్వాన్' కు పాలు పెరుగు సమర్పించిన దానశాసనమిది. ఇది 'తిరుమలై ఆళ్వాన్'

అని కూడ చదువబడినది. ఈ ఛిద్రశాసనము మనకెట్టి సమగ్ర సమాచార మందించనప్పటికిని తిరువేంగడనాథుని సన్నిధిలోనున్న తిరువాయిప్పడి ఆళ్వాన్ (శ్రీకృష్ణులు) కు పాలు పెరుగును సమకూర్చుటను గురించి యని తెలిసికొనవచ్చును. ఇది క్రీ. శ. 1100 సంవత్సరపు శాసనము (1-27). తిరుమలలో నొక ప్రాచీన సంప్రదాయమున్నది. ధనుర్మాస సేవలో నెలరోజులును ఏకాంతసేవాసందర్భములో శ్రీకృష్ణుని విగ్రహమే భోగశ్రీనివాసమూర్తివారి స్థానము నాక్రమించును. మిగిలిన పదునొకండు నెలలు భోగశ్రీనివాసమూర్తియే శయన విగ్రహము

శ్రీరఘునాథ విగ్రహమును గురించి క్రీ. శ. 1476 సంవత్సరము వరకు శాసనములలో నెట్టిప్రస్తావనయులేదు. ముందుగా దీనినిగురించి విచారింపబడును. సన్నిధిప్రదక్షిణములోని కొంతభాగము ఒక గదిగా రూపొందింపబడి గోడలు ఏర్పరుపబడినవనియు, అదియే రాములవారి మేడగా బేర్కొనబడినదనియు తెలుపబడినది. ఈకాలము క్రీ. శ. 1245-1250వ సంవత్సరము. ఈ రాములవారిమేడలో క్రీ శ. 1250వ సంవత్సరం నాటివరకు ఈ శ్రీరామాది విగ్రహములు ప్రవేశింపలేదనియే చెప్పవచ్చును. ఆ కాలమునాటికే ఒకవేళ శ్రీరామ శ్రీకృష్ణులున్నను మలయప్ప స్వామివారుగాని లేక కొలువు శ్రీనివాసమూర్తిగాని ఆలయములో ప్రవేశించియుండరు. ఈ మూర్తుల ప్రవేశకాలము 1330 వ సంవత్సర కాలమని యిదివరకే చెప్పబడినది తిరుపతిలోకూడ శ్రీరఘునాథుని సన్నిధిగాని ఆలయముగాని క్రీ. శ 1481 వ సంవత్సరమువరకు లేదు. తిరుపతిలో 29-10 1481 (ప్లవసంవత్సర తులామాస శ్రవణానక్షత్ర సప్తమీ సోమవారం) నాడు శ్రీ వైష్ణవమతనాయకుడగు శఠగోప దాస నరసింహమొదలియారు (2-73 క్రీ. శ. 1474) ఆలయమును నిర్మించి రఘునాథుని ప్రతిష్ఠించెను. ఈ దాతయే (2-68) (23-11-1476) తిరుమలలో శ్రీమద్రామానుజుల అధ్యయనోత్సవముల పర్వదినముల

లోని పండ్రెండు రోజులు అన్నప్రసాదముల సమర్పణమునకు సంబంధించిన దానశాసనము వేయించెను. ఈ సమర్పణములో నొకటి శ్రీవారి ఆలయములోనున్న రఘునాథునకు నిత్యనివేదనమునకు సంబంధించినట్టిది. ఈ శాసనములో తిరుమలలో నియనగాని మరియొకరుగాని రఘునాథుని ప్రతిష్ఠించినట్లుగాఁ జెప్పలేము.

దానసమర్పణములో నూత్నముగా ప్రతిష్ఠించిన విగ్రహమునకయినచో శాసనములో నా విషయము విస్పష్టముగాఁ బేర్కొనఁబడెడిది. తిరుపతిలోని శ్రీరఘునాథునిప్రతిష్ఠ (శ్రీరామానుజాలయములోనిది) (2-88, 12-8-1488), శ్రీరఘునాథాలయములోని రామానుజప్రతిష్ఠ (2-37, 3-6-1487) దీనికి యుదాహరణములు. రామానుజుని ప్రతిష్ఠయెచ్చట జరుగునో అటతప్పక రఘునాథుఁడుగూడ ప్రతిష్ఠింపబడెడివాడు. అన్నప్రసాదముల సమర్పణము శ్రీరామానుజులకు ప్రత్యేకముగా సమర్పింపబడెడిదికాదు. శ్రీ రామానుజులకు సరియగు దైవమూర్తి శ్రీరఘునాథులవారుగా భావింపబడెడిది. దానికికారణము రామానుజుడు లక్ష్మణావతారమేనను సంప్రదాయముండుటచేత గావచ్చును. ఈ కారణముచేత తిరుమలలో క్రీ. శ. 1476 వ సంవత్సరములో శ్రీరామానుజునకు అన్నప్రసాద సమర్పణపు శాసనములో తిరుమలలోని రఘునాథునపేర దానము అనుషంగికముగా పేర్కొనుటకు సరియగు నొకే కారణమును చెప్పవచ్చును. శ్రీరామానుజుని శ్రీప్రతిష్ఠాకాలము నాటికే రఘునాథుడు తిరుమలలో నుండి తీరవలెను. 1476 వ సంవత్సరము శాసకాలమయ్యును శ్రీరఘునాథుడు శ్రీవారిసన్నిధిలో నున్నట్లు ప్రసక్తి శాసనములోలేదు. కాని క్రీ. శ. 1504లో మరియొక దానశాసనము వ్రాయబడినది. (3-1) (4-9-1504). ఇది తిరువేంకటాద్రినాథుని సన్నిధిలోనున్న రఘునాథునకు సమర్పింపబడిన నందాదీప విషయమునకు సంబంధించిన దాన శాసనము. మనము రామానుజుని ఆలయము కట్టబడునాటికి శ్రీరఘునాథునియునికి శ్రీవారి ఆలయములో గలదని

పిడివాదము చేయబోము. ఉదాహరణమునకు తిరుపతిలో శ్రీరామానుజుని సన్నిధి క్రీ. శ 1200 వ సంవత్సరమునాటికే గలదు. కాని యట రఘునాథుని ప్రతిష్ఠించినది క్రీ. శ. 1488 లోనే యని గ్రహింప వలయును (2-88, 12-8-1488). శ్రీరామానుజునిప్రక్క రఘునాథుని ప్రతిష్ఠింపఁజేసినవాడు 'విఘ్నేశ్వర శ్రీమాఱ' అన్న పేరు గలవాడు. శ్రీరఘునాథునకుఁ బ్రత్యేక ఆలయ నిర్మాణము, శ్రీరామ విగ్రహ ప్రతిష్ఠాపనము తిరుపతిలో క్రీ. శ. 1481 లో మాత్రమే సంభవించినది.

హిందువులలో నేమతమువారికిని రఘునాథ శ్రీకృష్ణులను శ్రీవారి ప్రక్కన ప్రవేశపెట్టుటయన్న విషయములో నెవరికిని యెట్టియభ్యంతర ముండదు. శ్రీవారు వైకుంఠమునుండి యవతరించిన నారాయణ స్వరూపులు ఇఁక రామకృష్ణులన్ననో వారి యవతారములే యుక్తిసహజమైన సంబంధము శ్రీరామ, శ్రీకృష్ణులతో శ్రీవారికిగలదని మనమిది వరకే విచారించితిమి ఈ యుద్దేశ్యము ననుసరించియే శ్రీవారికి ధ్యానింపఁబడు మన్త్రపుష్పములో శ్రీరామ, శ్రీకృష్ణావతార ప్రశంసగలదని చూపితిమి. ఇంకొక్క కారణమును జూపెదము శ్రీమాఱనాథమునికిని శ్రీయామునాచార్యులవారి జీవితమును ననుసంధించు రెండు గాథలుగలవు. అవియే తిరుమలనంబి శ్రీరామ శ్రీకృష్ణుల మూర్తులను తనకుగలట్టి మానసిక భావగర్భితమైన కారణములచేత శ్రీవారి సన్నిధిలో ప్రతిష్ఠించుటకు దోహదము కల్పించియుండును. ఐతిహ్యమేమన నాదముని 340 వ సంవత్సరముల కాలము జీవించిన తరువాత నొకపర్యాయము శ్రీరామునికడనుండి యూహింపని పిలుపువచ్చెనట. ఉదయమే ప్రాతఃకాల స్నానార్థమేగినపుడు ఇద్దరు వేటకాండ్రు ఒకస్త్రీ, వానరముతో నాతని నివాసమునకువచ్చిరి. నాథమునికుమార్తె తండ్రిస్నానార్థ మేగెనని వివరించెను, ఆతనిఁజూచుటకు వచ్చితిమన్న సందేశముగల జాబును ఇంటివద్ద విడిచి యటనుండివారు వెడలిరి. నాథముని యింటి కడకువచ్చి వృత్తాంతము నెఱిఁగి సందేశమును జదివికొని యుక్త

త్తుఁడై వారి వెదుకబోయెను. అతి ప్రయత్నముమీఁద తుదకొక యరణ్యమధ్యమున వారి దర్శనమునుబొంది ముక్తియనుగ్రహింప బడెను ఇది నాథమునిగాథ

ఇఁక యామునాచార్యుల (ఆళవందారు) గాథ యిటున్నది. ఈయన యోగమార్గమున బ్రవేశించవలెనన్న యతిదృఢమైన కోర్కెచే ప్రేరితుడై గొప్పగురువైన 'తిరుక్కురకైపిరాన్'ను కలియ నేగెను. ఆ సమయములో నాయనయొక విగ్రహమును ముందిడుకొని గొప్పధ్యానములో నుండెను. ఆయనకు యోగభంగము కలిగింపరాదను నుద్దేశముతో ఆళవందారు గోడప్రక్కన దాగుండెను. సొట్ట కుటుంబము లోని యంకురమేదైనగలదా! యని యాగురువు వెంటనే ప్రశ్నించెను. యామునుడు ముందునకు వచ్చెను. సాష్టాంగనతుఁడై తనయునికిని వృత్తాంతమును నివేదించెను. యోగిని తనవృత్తాంతమెట్లెఱింగితిరంచు ప్రశ్నించెను. తనకు ముందున్న శ్రీకృష్ణవిగ్రహము గోడవైపునకు తిరిగినదని యట్లుతిరుగుట యనునది సొట్టకుటుంబములోని వారెవ్వర యిన నన్నప్పుడే జరుగునని యోగి జవాబొసంగెను. అంతేకాక శ్రీకృష్ణుఁడా కుటుంబమునకు కులదైవమనెడు విషయము నెఱింగిం చెను యామునాచార్యులు తిరుమలనంబి తాతగారు. తిరుమలనంబి ఆయనకడ వేదాంతసారము నభ్యసించెను. నమ్మాళ్వారు ప్రబంధము నందలి శ్రీ వేంకటేశ్వర వైభవములోని కొంతభాగమునకర్థవివరణము పొందినతరువాత తిరుమలనంబి శ్రీవారిపదములచెంతకువాలి శ్రీవారి సేవకు తనకు తాను సమర్పణమయ్యెను. యామునాచార్యుని తాతగారే నాథముని. ఈయనయే భక్తిసిద్ధాంతమును ప్రపంచించినవారు. ఈయన సిద్ధాంతమునేగాని శ్రీరామానుజుఁడు తన శ్రీభాష్యమున విశేషముగా వ్రాసెను తిరుమలనంబి శ్రీమద్రామాయణమందలి రహస్యార్థములను వెలికితీసినవారు, శ్రీరామానుజులాయనపదముల చెంతనుండి సంవత్స రముపాటు ఆ యర్థములను అవగతము గావించుకొనెను. ఇపుడీయనకు

గ శ్రీరఘునాథుని శ్రీకృష్ణుని యభిమానము, భక్తిపారవశ్యములవ లీలగా గ్రహింపగలము. ఆమోదింపగలుగుదుము.

కనుక తిరుమలనంబి తన కాలములోనే శ్రీరామ శ్రీకృష్ణ విగ్రహములను, అంతకు పూర్వము నెలకొల్పబడనప్పటికిని శ్రీవారి గర్భగృహములో అర్చక స్వాముల యనుమతితో సమర్పించెనని నిర్ణయమునకు రావచ్చును.

తిరుమల శ్రీవారి సన్నిధిలోవి యారెండు మూర్తులకు ప్రత్యేక పూజాదు లేవియునులేవు. వీరును శ్రీవారి నిత్యార్చనలో భాగస్వామ్యము వహించవలసినవారే. అన్ని ప్రసాదములన్నియు గర్భగృహములో శ్రీవారికే ముందు నివేదింపబడును. అవి శ్రీ రఘునాథస్వామికిని, శ్రీకృష్ణస్వామికిని ప్రత్యేకముగా సమర్పింపబడవలసినవి యైనను నిట్లే జరుగును. ఆస్థానములలోను, ఉత్సవములలోను, గర్భగృహమునకు వెలుపల జరుగు విశేషోత్సవములలోను మాత్రమే నిర్దేశింపబడిన మూర్తికి ప్రసాద సమర్పణము జరుగును. ఈ విధానము విస్పష్టముగా (2-88; 12-8-1486) క్రీ. శ. 1486 లో వ్రాయబడిన శాసనములో పేర్కొనబడినది. ఇందులో 'ఆలయము వెలుపలి భాగమున సమర్పణమున చేయు ప్రసాదములు శ్రీకృష్ణస్వామివారికి ప్రత్యేకింపబడినవి'. అని గలదు

## ఆలయము – ప్రత్యేకతలు

ఆలయము ఏకమూర్తి ఆలయము. సంహితలు విస్పష్టముగా పేర్కొనిన ఇతర దేవతా మూర్తుల ప్రతిష్ఠాపన మిచట పూర్తిగా నిషేధింపబడినది. ఈ మూర్తి ఆగమ విహితముగాని స్వరూపము. మొదటి ప్రదక్షిణములో గల గోడలగూడులలో మూర్తుల నమరించు విధానమెట్లు సఫముగాలేదో వివరింపబడినది. ఇవికాక యితర ప్రత్యేకత లిట పేర్కొనబడును.

ఈ క్రింద పేర్కొన్న ఆగమ శాస్త్రానుసారమైన బింబములను వాని వాని స్థానములలో శ్రీవారి ఆలయములో గానము:

ద్వారపాలకులగు ధాత్రి విధాతృలు. ఇందు ధాత్రి ఉత్తర ముఖమై దక్షిణప్రక్కగా నుండవలెను. విధాత్రుడు దక్షిణ ముఖమై ఉత్తరపు ప్రక్కగానుండవలెను. భువంగము గడపయి శయితమై దక్షిణపు తలయుండియూర్ధ్వ ముఖమై యుండవలెను. పతంగము ద్వారోర్ధ్వ పట్టికపై ఉత్తరపు తలయుండి యధోముఖమై యుండవలెను మొదటి ద్వారమున ద్వారపాలకు లిరువంకల మణికుడు సంధ్య, ముఖమంటప ద్వారమున విఖనసుడు, తాపసుడు. మొదటి ఆవరణములోని ద్వారపాలకులు కిష్కింధ తీర్థులు, రెండవ యావరణములోని ద్వారపాలకులు వక్రతుండ నాగరాజులు-ఇవి యన్నియును గానచో నందులో నే యొక్కటియునుగాని శ్రీవారియాలయములో వాని స్థానములలో నెలకొల్పబడ లేదు పై వానికి తోడు అధమాధమాలయ లక్షణములో విష్వక్సేనుడు గరుడుడు వారి వారి స్థానములో నున్నారు మిగిలిన శ్రీ భూత, న్యక్ష, భూత పీఠాదులు మాత్రము వాని స్థానములలో లేవు. మొదటి ఆవరణములో సోపానముపయినుండవలసిన శ్రీ భూతము లోపలి గోపురము వెలుపల ధ్వజస్తంభ బలిపీఠముల నడుమ వేయబడిన పంచశిలలో నమరించబడెను. న్యక్షవిగ్రహములేదు. ఇంద్రాద్యష్ట దిక్పాలకులు, భాస్కర, చక్ర, శంఖాదులు పైవానికంటె నధికమగు వధమ మధ్యమాలయములో నుండవలెను. కాని యీ యాలయములో దిగ్దేవతలను ఊహించుకొనవలసినదే. భాస్కర చక్రశంఖాదులు పైన చూపిన పంచ శిలలలోను కలిపివేయబడినవి.

విష్వక్సేనుడు, గరుడుడు, ధ్వజము, బలిపీఠము అన్ని వర్గీకరణములలోని దేవాలయములలోను సామాన్యముగానుండు లక్షణములు. పాంచరాత్రము వైఖానసము, ఇతర ఆగమములు వీనిని పేర్కొన్నవి. దేవతలు, దిక్పాలకులు వైఖానసాగమములో విధిగానుండవలసినవారు

ఈ దేవతలకు బలిసమర్పణము చేయుటకు శ్రీవేంకటేశ్వరస్వామి బలి బేరము నిత్యము బయటకుఁదీసికొని రాబడును. (నేడీసాంప్రదాయము కానవచ్చుటలేదు). పల్లకీలో వేంచేపు చేయబడిన బలిబేరము వెంట కాహళ ధ్వనులు మ్రోగును. గీత నృత్యవాద్యములుండును. ఇది ప్రతి దిగ్దేవతా సమక్షములో నుండు సందర్భము. ఇది నిత్యోత్సవము. ఇది వైఖానస పాంచరాత్రాగమాలయములలో సామాన్యవిషయము. ఇట్టి యుత్సవ మీ యాలయములో నే కాలమందును జరిగినట్లు ఆధారములు లేవు. మన్త్రపుష్పవిధాన మీదేవాలయములో ప్రత్యేకముగా సమరించ బడినదని యిదివరకే చెప్పబడినది. ఇదియే యాగమములోను చెప్ప బడలేదు. రాత్రులందు జరిగెడి బ్రహ్మారాధనము మరియొక ప్రత్యేక విషయము. ఇది నిత్యము జరిగెడి ఆగమ విధానార్చనలోని కట్టుబాట్ల ననుసరింపవలెనన్న నియమము సడలింపజేసినట్లు గానవచ్చును ఆనాది కాలమునుండి శ్రీ వైఖానసులే శ్రీవారికి అర్చనము జరుపు చున్నట్లుగా ఆధారములున్నవి. ప్రత్యేకోత్సవాదులందు. కల్యాణోత్స వములందు ఇతర విధములయిన శాస్త్రక్రతువులందు పెద్దలను పండితు లను పిలిపించెడి సంప్రదాయమున్నది. వారు సహజముగా నితరుల కంటె నెక్కుడు సదుపాయములు, ధనగౌరవాదులు పొందెడివారు అది యునుగాక శాస్త్ర విధానముగా పూజా విధానములు జరుపదలపెట్టినచో దానికి సమయమెక్కువయి దర్శనార్థమయి వేచియుండెడి భక్తులకు సమయము సంగ్రహమయ్యెడిది.

## ఇతర బేరముల చరిత్ర

కౌతుక బేరమునకు దక్క అన్యబేరములకు అన్నప్రసాద సమర్పణములను గురించి కొన్ని విషయములు వివరింపవలెను. ధ్రువ బేరమునకు సమర్పింపబడు ప్రసాదమునుండి అన్ని బేరములకు వారి స్థానము ననుసరించి భాగము లభించును. ధ్రువబేరమునకు సమర్పించు ప్రసాదము 1 శేరు పరిమాణము గలిగియున్నచో ½ శేరు అమ్మవారికి,

కౌతుకబేరమున కర్ధశేరు, ఉత్సవ, స్నపన, బలిబేరముల కొక్కొటి కర్ధశేరు చొప్పున ప్రసాద సమర్పణము జరుగును. అనగా 3½ శేర్ల ప్రసాదములకు వంతులివి. దీని కదనముగా పగలు గుడము రాత్రి పాయసము ప్రసాదముగా సమర్పింపబడును. ఆలయము ప్రప్రథమముగా నిర్మాణము చేసినపుడు ఈ మూర్తుల నన్నింటిని యొకేసారి ప్రతిష్ఠించి యీ విధమున కనీసము పగలు ప్రసాదమున కయినను భాగనిర్ణయము చేయవలెను. సామవాయి మహారాణి కౌతుకబింబ ప్రతిష్ఠాపనము గావించినపుడు ఒక ద్రోణ ప్రమాణముగల ప్రసాదము (4 నాళలు) నిత్యము సమర్పణ మగునట్లు నిర్ణయించెను. నాటికి యుత్సవమూర్తి లేదు. క్రీ. శ. 1339 లో గాని ఉత్సవమూర్తి యగు మలయప్పస్వామి వారు ప్రవేశింపలేదు. ఈ యుత్సవమూర్తుల కెవరును అన్నప్రసాద సమర్పణములకయి దానశాసనములు వ్రాయించినట్లులేదు. మరియితర బేరముల విషయములోను ఇట్లే కాననగును. భోగ శ్రీనివాసుడు ఒక ద్రోణ ప్రమాణముగల ప్రసాదమును నివేదనము పొందినచో ధ్రువ బేరము 8 నాళలు ప్రసాదము, శ్రీదేవి 4 నాళల ప్రసాదము మొత్తము 12 నాళల ప్రసాదమును పొందుచుండెను. ధ్రువ బేరమునకు సమర్పింపబడిన అన్నప్రసాదమునకు సంబంధించిన వివరములుగల శాసనము దీనిని నిర్ధారించుటకుండగావలెను. క్రీ. శ. 1234 వ సంవత్సరములో (1-86) వ శాసనములో పైడిపల్లి గ్రామములోని సగభాగపు శిస్తురాబడి శ్రీవారికి సమర్పింపబడినట్లున్నది. అర్చక కుటుంబములలో నొక కుటుంబమువారు పైడిపల్లివారు. వీరిని పైడిపల్లి దీక్షితులనియు బిలుతురు. పైడిపల్లి గ్రామములోని సగభాగపు శిస్తు రాబడిని ఈ కుటుంబములోని వారనుభవించెడివారు. ఆ గ్రామములోని రాబడినుండి శ్రీవారికి నిత్య మన్నప్రసాదము నివేదనము గావించి యా ప్రసాదమనుభవించి యుండిరి. దైవ ప్రతిష్ఠాపనము జరిగించు సమయము ననే, అర్చక స్వాముల కుటుంబములకు సుఖసంతోషముల విషయములో నెట్టిలోటులేక జీవితమును నడుపు కొనుటకు గాను తగినంత

భూమిని దానమునొసంగు భారమును, ఆ ప్రతిష్ఠాదాతపైన యుండినట్లు దీని వలన మనకు తెలియును. ఆగమ శాస్త్రములు ఈ విషయములో నిట్లే ధ్రువపఱచినవి. తరువాత ప్రవేశించిన యితర మూర్తులకు ఇతరములగు ప్రత్యేక సమర్పణములున్నట్లుగానము. వైఖానసశాస్త్ర దృష్టిలో నివి తరువాత జొరబడినవేగాని శాస్త్రవిధానముగా ప్రతిష్ఠాపనము జరిగినవికావు. ఈ విషయముచే నీ ఆలయము పాంచరాత్ర వైఖానసాగమ విధానములలో నే యాగమశాస్త్ర విధానముచేతను నిర్మాణ మయినట్టిది కాదనెడు విషయము బలపఱచవచ్చును.

## కొన్నియసత్యములయిన అభిప్రాయములు — వానిపరిష్కృతులు.

పై విషయముల ననుసరించి తిరుమలలో వేంచేసియున్న ధ్రువ మూర్తి విష్ణుస్వరూపములలో నొకదానిని బేర్కొనుచున్నదని నిర్ణయింపబడినది. కాని కొందఱు, వారతి తక్కువసంఖ్యలోనైనప్పటికి నీమూర్తిని సుబ్రహ్మణ్యస్వామిగను, దుర్గాదేవిగను, లేక నేదేని యితర శక్తిస్వరూపముగా భావించి ప్రచారముచేయుచున్నారు. ఇవి అసత్యమైన యభిప్రాయములు. ఇతరులెవ్వరైన తమకిట్టి అభిప్రాయములను మనసులో దూర్చుటచే కలిగిన మనోవికారముకావచ్చును. శంకరాచార్యుని బోధనలు, వారివాక్యములు ఆధారముగానైనను గావచ్చును. లేక యేదో ఒక చిహ్నముచేత వచ్చినయభిప్రాయమునైనగావచ్చును. ఆ చిహ్నము అన్ని దేవతలకు సమానమైనట్టిదియై అది ఈ స్వామికి యమరియుండుటతో మరింత బలపడియుండుట వలనను కావచ్చును. పదవీ విరమణము గావించిన ఒక తహసీలుదారు ఈ యభిప్రాయములు క్రోడీకరించి యొక పుస్తకమును ప్రచురించిరి. ఆ విషయములిట సంగ్రహముగా వివరింపబడి వానికి సమాధానము లొసంగబడు చున్నవి.

## 1. ఉత్తరాదివారు శ్రీవారిని బాలాజియని పిలుతురు.

దుర్గకు బాలయనియు పేరుగలదు. 9 సంవత్సరములుగల యప్పుడు 'బాల'యని దుర్గనందురు. ఆకారణముచే శ్రీవేంకటేశ్వరుడు 'బాల' అయ్యేనట ఇదియెంత యర్థరహితముగానున్నదోగనుడు! ఉత్తరాదివారు తిరుమల శ్రీవారిని సేవించుట ప్రారంభించినదియెప్పుడు? 17 వ శతాబ్దము మధ్యకాలమైన శివాజీకాలమునుండియేకదా! కాని యిట శ్రీకృష్ణుడు తనజనన సమయమున తండ్రియగు వసుదేవునకు దర్శన మొసగిన విషయము దానిని వ్యాసులు భాగవతమున శ్రీకృష్ణుని దివ్య సౌందర్య స్వరూపమును 'తమద్భుతం బాలకమంబుజేక్షణం' అనుశ్లోక మును వర్ణించిన తీరునుగనుడు. ఈ అవతారమునకును శ్రీవారిమూర్తి స్వరూపమునకుగల సమీపసంబంధము ననేకోపపత్తులచే నీవరకే గ్రహించితిమి. ప్రేమానుమోదమై పుష్టియుతమగు శరీరముగలిగి సర్వా భరణ సంశోభితుడైన స్థానకమూర్తికి సమన్వయముగా 'బాలక' యని పేర్కొనబడినది.

## 2. తిరుమల పవిత్రప్రదేశమును దేవ్యాకృతులలో నొకటియగు మేరుచక్రముగా కొందరు భావింతురు.

తనయొక్క యూహాబలపరిమితే తనకు లక్ష్యముగానయి తా నుపాసించు దేవతయట్లే ప్రత్యక్షమగుచో నట్టివారియెడ మనము అభ్యంత రము చూపనవసరములేదు. కాని ఈ పర్వతముల వరుస ప్రాచీనము నుండియు 'వేంగడ' మను పేరుతో బిలువబడినది. తొల్కాప్పియ తమిళ గ్రంథములో నిట్లేగలదు. శేషాచలమను పేరును తరువాతదే. పురాణా ధారముగా నున్నట్టిది. ఈ పర్వతము పాపములన్నింటిని దహించునని, దానిపైనున్న దేవుని పూజించుట, కొండనెక్కుట, పవిత్రస్నానము చేయుట తడిబట్టలతో స్వామిని దర్శింపనేగుట నివియన్నియు సన్మార్గ ములుగా భావింతురు. ఈ తహశీల్దారుగారు భక్తులు తమ ప్రార్థనలు

నెరవేర్చుకొనుటకు పసుపు వస్త్రములను ధరించి వెళ్లుటను దుర్గాదేవిని తృప్తిపఱచుటకేయన్న భావన చేయలేదు-సంతోషవిషయము.

## 3. గాలిగోపురము సరియగు పేరు కాళిగోపురమను అభిప్రాయము.

క్రీ. శ. 1628 లో మాత్రమే యీ గాలిగోపుర నిర్మాణము జరిగినది. ఇది బహుశః యీ రచయిత యెఱింగియుండడు. శ్రీ వైష్ణవ భక్తుఁడగు మట్ల అనంతరాజుచే నిర్మింపబడిన గోపురమేగాన నితర విధములయిన అభిప్రాయమునకిందు తావులేదు.

## 4. శక్తికి వాహన చిహ్నమైన సింహములు విమాన మధ్యతలమున పైభాగము మూలలందు నిర్మింపబడినవి.

ఆ విషయములో మనకు భేదాభిప్రాయములులేవు. కాని వైఖానసపాంచరాత్రాగమములు మూలలందు విమానమునకు సింహాకృతులు గాని గరుడాకృతులుగాని యుండవలెనని నిర్దేశించినవి.

భృగుసంహితలో విమానదేవతాధ్యాయములో
"సుఖాసన సమాయుక్తం సర్వాలంకారసంయుతమ్
వ్యాళోర్ధ్వకోణకంచైవ పీఠంవాఽథమృగేశ్వరమ్"

అని చెప్పి యింకను

వక్రతుండంచ దుర్గాంచాఽప్యగ్రమంటపభిత్తిషు
స్థితమేవం సుపంస్థాప్యయథాలాభం సమర్చయేత్"

అనియుండుటచే కేవలము విమానపు పైభాగమున మూలలందేగాక మంటపకోణములందును వీనిలో నేవేని నెలకొల్పనగునని ప్రమాణము. రాజశత్రునిబర్హణమునకయి యట్టియవసర ప్రయోజనమును సిద్ధింపఁజేసికొనుటకా ప్రదేశములందాలయములను నిర్మించి వానిపై కోణములలోనుంచెడి విగ్రహములను సింహాకృతిగా నెన్నుకొనిరి.

ఆధ్యాత్మిక సాంస్కృతిక పుటభివృద్ధికై గరుడుని నిర్ణయించిరి. వీర నరసింగయాదవరాయలు నిర్మించినదీ విమానము. కనుకనే తలయెత్తు కొని పండుకొన్న సింహ విగ్రహములు యెన్నుకొనఁబడెను. ఆగమ శాస్త్ర విధానముగా గణేశుని, దుర్గావిగ్రహమును విమానదేవతలుగా నెలకొల్పవలసి యున్నను నవి నెలకొల్పబడకపోవుట విచార్యమే. అయ్యవికూడ విమానముపయి నెలకొనియున్నచో నీరచయితవాదమున కింకను బలమువచ్చెడిది.

## 5. సింహలలాటము - జట - శ్రీచక్రము కిరీటము, గల మూర్తియన్నవాదఖండనము.

ఈ మూర్తి శిరముపయిజటలేదు. ఆ విషయమిదివరకే స్పష్ట పఱుపఁబడినది. కిరీటముపై శ్రీచక్రమునులేదు. ఈ రచయితకు ధ్రువ బేరసమీపమునకుబోవుటకుగాని, ఆ విషయములు పరిశీలించుటకుగాని యేమాత్రము అర్హత, అవకాశములులేవు. ఆచార్యపురుషాదులైనను అట్టి అదృష్టమునకు నోచుకొనరు. అర్చకత్వము నెఱపు అర్చకస్వామి అయినను మిక్కిలిపొడగరియైననే గాని ఈ విషయములను అతి సూక్ష్మముగా బరిశీలించి తృప్తినొందఁజాలడు.

స్త్రీపురుషుల మూర్తిస్వరూపములలో మర్మావయవములను గప్పుటకు సింహలలాటమును ఆయాప్రదేశముల నుంచెడి యాభరణ ములపయి జెక్కుదురు. ఇది నిశితముగాఁ జెక్కఁబడక నొక రేఖా మాత్రముగా నయ్యెడు చెదరు చిత్రమే. ఇవి స్త్రీపురుష విగ్రహము లనేకములపై కానబడును. దీనికి ప్రత్యేకత యేమియు నీయనక్కర లేదు.

## 6. శక్తిపూజావిధానము:

ఇచటను ఈ తహశీలుదారు రావుగారు తప్పటడుగువేసిరి. శ్రీవారిని ధరింపజేసెడివస్త్రముయొక్క పొడవునుబట్టి యీ విగ్రహమును

దుర్గలేక శక్తిగా నీయన నిర్ణయించెను. ఈ దీర్ఘవస్త్రధారణమన్నది క్రొత్తగా యేర్పాటయినట్టిది. అనేకాభరణములు, ఆయుధములధరింప వీలుకలిగించుటకుగాను ఇట్టి వస్త్రధారణ మావశ్యకమయినది. ఈ అలంకరణములు, ఈ ఆభరణములు విగ్రహముపై నెలకొనుటకు వెనుక తట్టున గట్టి పట్టు యుండవలెననుట సామాన్యవివేకము. వీనిలో ననేకములు సున్నితమగు నంచులుగలవి. అవియేమాత్రమును మూర్తిపై నలంకరించుటచే దెబ్బతినరాదు. వస్త్రమును ధరింపఁ జేయుటలో నెన్ని మడతలు వేయుట జరుగునో, నెంతజాగ్రత్తవహింపబడునోయన్న విషయమా ధరింపఁజేయు అర్చక స్వామికే యెఱుక!

## 7. నాగాభరణము:

ఇది మూర్తిస్వరూపములో నిమిడియున్న ఆభరణము కాదని యిదివరకే తెలుపఁబడినది. విష్ణువుతో నిత్యసన్నిహిత సంబంధముగల వాఁడనంతుఁడు. ఇఁట శ్రీనివాసునకుఁ బాదములచెంతగాని, ఆసనముగా గాని యనంతుని యదృశ్యమద్వితీయమైన విషయమే. నాగాభరణము నలంకరించుటలో నిఁట ప్రత్యేకమగు ప్రతిపత్తి సాధించినదేదియులేదు. ఈ నాగాభరణములను ఒక మహారాజు తన రామేశ్వర యాత్ర ముగించుకొని తిరిగివచ్చినపుడు శ్రీవారిని సేవించుకొని సమర్పించె నన్న వృత్తాంతముకలదు.

## 8. సుగంధపుముద్దలు:

ఇది 15వ శతాబ్దములో ప్రవేశపెట్టబడినది. శాసనములే ఈ విషయములో నాధారము. గంధమునూరి ఆ పిండితో తయారుచేయబడిన యుండలు బిళ్ళలుగాఁజేతురు. ఈ చందనపుబిళ్ళలను రాత్రియందు శ్రీవారి వక్షస్థలమందున్న లక్ష్మీదేవి కలంకరింతురు. ఇదికాక ప్రత్యేకముగా ధ్రువబేరపాదములచెంత రెండుబిళ్ళలనుంతురు. భోగశ్రీనివాసుని కడ నొక ½ బిళ్ళనుంతురు. విష్ణువునకు చందనమత్యంత ప్రీతిపాత్రము.

అభిషేకమునుగుఱించి దాని పుట్టుకను గుఱించి భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాపనా విషయసందర్భమున వివరింపబడినది. శ్రీవారికి పసుపునీటి యభిషేకము శుక్రవారమునాడులేదు. గాఢమైన పచ్చనిరంగుగల కుంకుమపువ్వును తీర్థముతోఁజేరుతురు. స్నపనములందు విష్ణుమూర్తులకు పసుపువిడదీయరాని సామాగ్రియే. అభిషేకానంతరము వడగాని పాయసముగాని నివేదనముచేయరు. రెండవఘంటాకాలములో 'పోళి' నివేదింతురు. ఇదియును క్రొత్తగా నెలకొన్న సంప్రదాయమే. దీనికిఁ బ్రాచీనతను గానము.

## 9. బంగారపు అలర్ మేల్ మంగ తాయారునకు అభిషేకము.

శ్రీవారి మూర్తిగతముగానిదీ చిహ్నము. భక్తులెవరో యీ బంగారపు చిహ్నమును శ్రీవారి కాభరణముగా సమర్పించిరి. ఇది నిత్యము శ్రీవారికి ధరింపజేయఁబడును. ఈ యమ్మవారి యభిషేకార్థమై దాన మొసంగబడిన శాసనమున్నది. అభిషేకము ఈ మూర్తికి ప్రత్యేకముగా ధ్రువమూర్తినుండి వేరుచేయబడిన యనంతరమే జరుపుదురు. దీనికి కారణము లీ చిహ్నము విగ్రహాగతము గాకుండుట. శ్రీదేవీ సమము గాకుండుట అను నభిప్రాయములు గానున్నవి. భక్తులెవ్వరును దీని యమరికలుగాని, సడలింపులుగాని కనలేరు. ఇది తెరమఱుగు విషయము.

## 10. మేరు చక్రము

భోగ శ్రీనివాసమూర్తి పీఠమెట్టి మేరుచక్రముచేతను చిహ్నితముగాలేదు. దానికి పూజయునులేదు. పూజయంతయు ధ్రువబేరమునకు, భోగమూర్తికి, నితర మూర్తులకు మాత్రము. ఏదైనా తెర వేయబడినచో నది భోగమూర్తిని స్నపన పీఠమునుండి అర్చాపీఠమునకుఁ దిరిగి ప్రవేశపెట్టుటకు మాత్రమేయని తెలియవలెను.

ఇట్టి పూజాకార్యము లెవ్వియును ప్రజల సమక్షమున జరుప బడవు. ఆగమము లీ సందర్భమున తిరస్కరిణీ (తెర) భావమొకటి కల్పించినవి. భోగ శ్రీనివాసమూర్తి పీఠముక్రింద నున్న యంత్రమును అట్టి యంత్రమే మరియొకటి ధ్రువబేర పాద పీఠమునందుండియుండు నన్న విషయమునీవరకే చర్చింపబడినవి. శ్రీ ఆళవందారు జీవితకాలము లోనే క్రీ.శ.966వ సంవత్సరములో ప్రతిష్ఠింపబడెన యు చెప్పబడినది.

## 11. బిల్వపత్రము

నిత్యపూజాక్రమములో నంగీకరింపబడెడి యెనిమిది పుణ్య పుష్పము లోను నీ బిల్వ పుష్పమొకటి.

వైఖానససంహితలో భృగువు (185 పేజీ భృగు సంహిత)

"నంద్యావర్తంచ పద్మంచ తు-సీ విషు వరి కా
బిల్వంచ కరవీరంచ పద్మం కుముద మేవ చ
అష్టవై పుణ్యపుష్పాణి గ్రాహ్యాణి తు యథాక్రమమ్"

వైఖాన సాగమమేగాక పాంచరాత్రాగమానుసారమైనను నీ బిల్వపుష్పపూజ సమర్థనీయమే. ఈ ప్రశ్న యట్లుగాక మఱియొక విధముగా వేయవలసియున్నది. ప్రతి నిత్యము తులసితోకూడ నీ బిల్వపత్రమును పూజలో నెందుకుపయోగింపరాదు ? అనునది యీ ప్రశ్న. విష్ణువుగాక నితరమగు దేవతగా నీ విగ్రహమును భావించుట, కవకాశమీయ కుండుటయే దీనిని నిత్యవిధిలో వాడకుండుటకు హేతువు గావచ్చును

## 12. బ్రహ్మోత్సవము

పురటాసి (ఆశ్వయుజ) బ్రహ్మోత్సవమని పిలిచెడి విషయ మును ఈ రచయిత శ్రీరావుగా రెఱింగి యుండరు. ఆ నెలలో తీర్థ వారి శ్రవణానక్షత్రమందున్న సమయమున జరుగునట్లు ఈ ఉత్సవ

మారంభింపఁబడును. అధిక మాసమున్నచో రెండవ బ్రహ్మోత్సవము దసరా దినములలో జరిగెడిది. ఇది నాలుగు సంవత్సరముల కొక పర్యాయము వచ్చును. సౌరమాన చాంద్రమాన పంచాంగముల ననుసరించు వారి సౌకర్యార్థము వారి తృప్తికొఱకై విజయనగర రాజగు సాళువ నరసింగ రాయలు రాజ్యమునకు వచ్చినప్పటినుండి మొదలయినది.

## 13. గర్భగృహమధ్యమున శ్రీవారి ధ్రువమూర్తి యుండుటచే నది శివస్థానము కనుక నిది శైవమూర్తి యనెడు అభిప్రాయము

ఇదియును తెలియకచేసిన పొరపాటే. స్థానకాసన శయన భేదములతో నున్న విష్ణుమూర్తులను ప్రతిష్ఠించు విధానమును తెలిపెడు ఆగమశాస్త్ర నియమములను కూలంకషముగా నెఱింగినచో నీయన తన తప్పును గ్రహించియుండెడివారు. ఆలయా కృతిని వివరించు సందర్భములో శ్రీవారి స్థానమును గుఱించి ప్రసక్తమయినది. విష్ణ్వాలయ గర్భగృహములో శివునిస్థానము ఆఱయ కుడ్యముల ననుసంధించి యుండును. ఇది పైశాచభాగముగా ఆగమములు చెప్పినవి. దైవిక భాగమును ధ్రువబేరముండు స్థానముగా నిర్ణయించిరి. శ్రీవారి ధ్రువ మూర్తి దైవిక స్థానములోనే యున్నది.

## 14. గర్భాలయము ఏనాడును ఎత్తుచేయబడలేదు

ధ్రువబేరపీఠముయొక్క ఎత్తు ఎదురువాకిలి గడపఎత్తు కొలతలకు తగిన పరిమాణ పరిధిలోనే యున్నది.

## 15. శ్రీ వత్సము

శ్రీవారి దక్షిణ వక్షస్థలమందు బుజములకు సమీపమున శ్రీవత్స చిహ్నమును గుఱించి చెప్పుచు ఇది తరువాత శిల్పులచే మలచబడిన

అనాలోచితమైన అస్పష్టమైన కల్పిత చిహ్నమని రావుగారు వ్రాసిరి. సామాన్యముగా విష్ణ్వాలయములలో మూర్తులకు నీ చిహ్నము దక్షిణ వక్షస్థల మధ్యమందుండును. ఇటఁ నీయన తన యసమగ్ర జ్ఞానమును వెలిబుచ్చుటయేగాక శ్రీవారి ధ్రువమూర్తిపై తరువాత వారెవరో చేయినుంచి మలచినట్లు అతి సాహసముగాఁ బ్రకటించిరి. యోగ లక్ష్మీ నివాస శ్రీవత్సములస్థానములు కూడి యున్నట్లు భృగు సంహితలో నీ క్రింది శ్లోకముల వలన తెలియుచున్నవి. ఈ విషయమును చర్చించిన భాగము లక్ష్మీకల్పము. ఇందు నూత్నాలయములు నూత్న విగ్రహముల ప్రతిష్ఠాపనములను గుఱించి చర్చింపబడినది.

" అథవక్ష్యే సవిశేషేణ లక్ష్మీస్థాపన ముత్తమమ్
అష్టధా ప్రోచ్యతే లక్ష్మీః ప్రథమా త్వనపాయినీ
విష్ణోర్వక్షస్థలే కార్యా సర్వాలంకార సంయుతా
దక్షిణ స్తన స్యోర్ధ్వభాగే వహ్న్యశ్రే దివ్యమండలే
పద్మమధ్యే సమాసీనాం పద్మద్వయకరాంచితాం
వరదాభయ హస్తాం చ మన్దస్మితముఖాంబుజామ్
ఏవంరూపాంప్రకుర్వీత యోగలక్ష్మీస్తు సా మతా "

లక్ష్మీదేవి దక్షిణ వక్షస్థలోర్ధ్వ భాగమున వహ్న్యశ్ర మండలములో శ్రీవత్సచిహ్నమునకు పై భాగమున నుండు విషయము ప్రతి శ్రీవైష్ణవునకుఁ దెలియును. ఇంకను ఈ శ్లోకమును గాంచుడు.

'యోగ లక్ష్మీం ప్రతిష్ఠాప్య శ్రీకామస్సమ్యగర్చయేత్
కృత్వా శ్రీవత్సరూపంతు ధారయే ద్విష్ణుమవ్యయం
తత్తద్బింబాను రూపంచకుర్యాత్ శ్రీవత్సలక్షణమ్'

ఇందులో శ్రీవత్స చిహ్నము మూర్తి ననుసరించి యుండును గాని యెల్లమూర్తులకు సమానముగా నుండదు. శ్రీవత్సము మూల ప్రకృతిని, శ్రీదేవి యధిష్ఠాన దేవతను ప్రతిబింబింప జేయును.

## 16. స్ఫటిక లింగము

తిరుమలలో ఆలయములో నెచటను స్ఫటిక లింగములేదు శ్రీ విద్యారణ్యుడు చెప్పినట్లుగా శ్రీరావుగారూహించిరి. 14 వ శతాబ్దములోని పూర్వభాగములోను 13 వ శతాబ్దాంతమున నున్న వేదాంత దేశికులవారికి సమకాలికులు శ్రీమద్విద్యారణ్యులు. అన్ని వైష్ణవాగమములు శ్రీ మహావిష్ణువును ప్రతిష్ఠించుటతోబాటు ఆలయములో కపిలుడు, భృగువు, గణేశుడు, దుర్గ, శివుడు, బ్రహ్మ మొదలగు దేవతలుగూడ ప్రతిష్ఠింపబడవలెనని నిర్ణయించినవి. కాని అగమానుసారము శ్రీవారు ప్రతిష్ఠింపబడకుండుట, శ్రీవారు స్వయం వ్యక్త స్వరూపులగుటచేతగూడ నీ పయిదేవత లెవ్వరికిని ఆలయములో స్థానములేదు.



# 9 వ అధ్యాయము

## తిరుమల శ్రీవారి ఆలయములో నిత్యార్చనా క్రమము.

తిరుమలలో శ్రీవారి ధ్రువమూర్తి మానవ నిర్మితముగాక మానవకృత ప్రతిష్ఠాదులన్వయింపఁబడకయున్న కారణమున నొక నిర్దుష్టమగు పూజావిధానము అతిప్రాచీన కాలమునుండి లేదని మనము పూర్వ అధ్యాయమునుండి గ్రహించి యున్నాము. ఆళ్వారులలో నొక రగు 'తిరుప్పాణ ఆళ్వారు' పేర్కొన్న రీతిని శివవిష్ణువులేక రూపముననున్న ద్వైమూర్తికి పూజావిధానములే యాగమములు పేర్కొనలేదు. తిరుప్పాణాళ్వారు 'అమలనాద పిరాన్' అన్న గ్రంథములో 3 వ పద్యములో వేంకటాద్రిపై నున్న స్వామికి అర్చనలు స్వర్గనివాసులు, బ్రహ్మాదిదేవతలచే రాత్రియందు నిర్వహింపఁబడుచుండె నని వ్రాసెను. 'శిలప్పదికారము' లోని వర్ణనముకూడ నిత్యపూజా విధానమును తెలిసికొనుటలో దోహదమొనర్పదు. ఆగమములన్నియు పేర్కొన్న విధముగా, ప్రత్యేకముగా వైఖాన సాగమము ప్రకారము ధ్రువమూర్తి కొలతల ననుసరించి గర్భగృహ నిర్మాణము జరిగియున్న దని మాత్రము నిశ్చయింపనగును. చెక్కడపు రాతి నమర్చి కట్టబడిన ఆలయము ప్రాథమిక ఆలయము క్రీ. శ. 800 సంవత్సరపు ప్రాంతములో నని చెప్పవచ్చును. తి. తి. దేవస్థానముల శాసన సంపుటిలోని 1—8 వ శాసనములోని పదముల క్రమమును బట్టి క్రమ పూజావిధానము క్రీ. శ. 966 వ సంవత్సరమునకు పూర్వమే యున్నట్లు అది భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠతో నిలద్రొక్కుకొన్నట్లు తెలియుచున్నది. ఆగమ విధానపూజను నిలద్రొక్కుకొనజేయుటకై మాత్రమే యీ భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠజరిగియుండనగును. శ్రీ వేంకటాచల పవిత్రత శ్రీవారి ఆలయ నిర్మాణమునకుగాని అందు మనుష్యపూజా విధానమునకు మాత్రము ముడిపడి యుండలేదు. భగవంతుఁడే స్వయం

కాదు. భోగ శ్రీనివాసుఁడు శయనస్థలి నలంకరించుటకయి రాత్రి జరుప బడు కార్యక్రమము. పాలు, పాయసము, పండ్లు, వక్కాలు మొదలి గునవీ సందర్భమున నివేదింతురు. మధుర సంగీతము వినిపింపఁబడును. రాత్రి బ్రహ్మచే జరుపబడు అర్చనములో న్యాయముగా నీ భోగ శ్రీనివాసమూర్తి శయనస్థలి వేంచేయుట, ఆ పూజాక్రమము అనావశ్య కముగాఁదోచును.

## 2) షట్కాల పూజాప్రయోజనములు

మన ఐహిక ప్రయోజనమే షట్కాల పూజారహస్యమని ఆగమములు పేర్కొన్నవి. ఉషఃకాలములోని పూజ ప్రజాభివృద్ధిని గల్గించును. పశువృద్ధిని గల్గించును. ప్రాతఃకాలపూజ జపహోమా దులను వృద్ధిపఱచును. మద్యాహ్నపూజ రాజరాష్ట్రాభివృద్ధిని కల్గించును. అపరాహ్ణపూజ దైత్య వినాశనమునకు దోహదము గల్గించును. సాయం కాలపూజ సస్యాభివృద్ధికి మార్గము. అర్ధరాత్రిపూజ పశుగణాభివృద్ధి కొఱకు ప్రయోజనముగా చెప్పబడినది. ఇది వైఖానసాగమోక్తము. కాని అన్ని ఆలయములలోను షట్కాలపూజ సాధ్యమయ్యేడి విషయము గాదు. ఆ కారణముచేతనే ఈ యాగమము కనీసపు పూజాకాలములను గూడ పేర్కొన్నది.

'షట్కాలం వా త్రికాలం వా ద్వికాలకమ్
ఏకకాలం వా పూజనం దేవదేవస్య'

యాత్రికులు, భక్తులసంఖ్యాకముగా వచ్చెడి యీ యాలయములో నీ షట్కాలపూజ ప్రతినిత్యము బహువిశ్రాంతిగా జరుపబడుట యసాధ్య విషయము. తిరుమలలో నిత్యము నిజమునకు రెండుపూజలు మాత్రమే జరుగుచున్నవి. తోమాలసేవ కనుబంధముగా నొకపూజ జరుగును. దీనికి భక్తుల ప్రవేశమున్నది. ప్రత్యేకరుసుమును దీనికై దేవాలయ ములో చెల్లింపవలెను. రెండవది సాయంకాలపూజ. అది అతిరహస్యము.

కేవల మర్చకస్వాములు ఆచార్యపురుషులు ఇతర దేవస్థానపుసిబ్బంది మాత్రమే పాల్గొందురు. అపరాహ్ణవేళలో మరియొకపూజ జరుగును. లక్షలమంది శ్రీవారి దర్శనార్థమైపోవు యాత్రికులలో పూజావిధానము ప్రాథమిక సూత్రములైనను తెళిసినవారొక్కరైన నుండరేమో. ఈ కారణముచేతనే యీ పూజాక్రమముల కాగమశాస్త్రపరిభాషా పదములు పేర్కొనబడలేదు. వీనినే సేవలని పిలిచిరి. అవి విశ్వరూప సేవ, తోమాలసేవ, మొదటిఅర్చన, కొలువుసేవ, నివేదనము, శాత్తుమొఱ, రెండవఅర్చనము, రెండవనివేదనము, ధర్మసేవ, ఏకాంతసేవలు, ఇందులో ధర్మసేవ, విశ్వరూపదర్శనము మాత్రముచితము. శాత్తుమొఱ వైష్ణవస్వాముల కుచితము. వైఖానసార్చకస్వాములు మాత్రమే నివేదనసమయములో శ్రీవారి సన్నిధిలో నుందురు. తోమాలసేవ, ఏకాంత సేవలు ఆర్జితములు. యాత్రికుఁడా సేవలలో పాల్గొనుటలేదు. దర్శనము మాత్రమే అనుభవించును. అర్చనలో రుసుముచెల్లించువారి గోత్రనామములు అర్చనాంతమున శ్రీవారికి నివేదింపబడు సంప్రదాయము పూర్వముండెడిది. నేడదియును లేదు. ఎవరి గోత్రనామములు వారే చెప్పికొనవలెను. టిక్కెట్లు కొన్నవారికందఱకు సన్నిధిలోనిలబడి అన్ని సేవలు దర్శించుటకు వీలయినంత స్థలములేదు. ఆకారణముచే నిటీవల ఆసంప్రదాయము విరమింపబడినది.

కొంతమందికయినను ఆలయములో జరిగెడి నిత్యపూజను గుఱించి తెలిసికొనవలెననెడు ఆసక్తియుండును. ఆ కారణముచే దీనిని వివరముగా నిట ప్రసక్తము చేయఁబడును. నిత్యపూజావిధి ప్రధానముగా వైఖానసాగమానుసారము. సంప్రదాయబద్ధమయిన వైఖానసపూజా విధానము ననుసరించి జన్మచేత వైఖానసుడుగానివాడు పూజానిర్వహణ మున కనర్హుఁడు. పరిహరింపరాని సమయములో నన్యుడు నిర్వ హించును. అతడు దేవలక నామకుఁడగును. తిరుమల తిరుపతి ఆలయ ములలో పరిచారకుడు సన్యాసి. ఈతడు దీక్షను స్వీకరించుటగాని

వైఖానస దీక్షితునియొద్ద నుపదేశమును బొందుటగానిలేదు. మన్త్ర పుష్పమును నిర్వహించు నితరుఁడాచార్యపురుషులలో నొకరు. పరిచారకత్వము సన్యాసినెఱపు చుండెనను విషయము క్రీ. శ. 1380 వ సంవత్సరములో అరిశనాలయ మఠమునకు విచారణకర్తగానున్న మూల తిరు వేంకట జీయరుకాలమువరకు శాసనస్థ ప్రమాణములేదు. క్రీ. శ 1390 లో స్థానత్తారుగాకూడ నీయన యుండెనని ప్రమాణములున్నవి. ఈయనయే తన విచారణకర్త-విధినిర్వహణముతోబాటు మఠనిర్వహణ మును, పరిచారకత్వము నదనముగాస్వీకరించిన ప్రథమసన్యాసియగును. ఈ ఆలయములో పరిచారకవిధి నిర్వహణముకొఱకు తమయనుయా యులుగలరన్న వైఖానసుల మనవికి ఈ యాలయములో నెన్నడును గుర్తింపుకలుగలేదు.

## 3. నిత్యార్చనా కార్యక్రమము

ప్రతినిత్యము ఉషఃకాలముననే అర్చకస్వామి స్నాన సంధ్యా ద్యనుష్ఠానములు నిర్వహించిన తరువాత సన్నిధియన్త్రికలకు (తాళపు చెవులకు) నమస్కారమిడి వానిని శిరమున నిడికొని ఆలయమునకు బయలుదేరును. పరిచారకుడు, దివిటీ వెంటనుండును. ఆలయమర్యాద లును వీరి ననుసరించును. ఆలయప్రదక్షిణము నెఱపిన యనంతరము సాష్టాంగనమస్కారము ద్వారదేవతలకు గావించును. బంగారువాకిలిని యన్త్రికలతో దానికి సంబంధించిన మన్త్రముతోతెఱచి సన్నిధిలో ప్రవేశించును. శ్రీవారిని సమీపించి సాష్టాంగనతుఁడై 'అతోదేవా' మన్త్రమును పఠించును. పరిచారకుడు దీపమువెలిగించు కార్యమున మగ్నుఁడగును. భోగశ్రీనివాసుఁడు శయనస్థుడుగానుండినప్పుడే అర్చక స్వామి ఆదర్శమును (అద్దమును) జూపును. గాయకులు, పుణ్యస్త్రీలు, గుఱ్ఱములు, గోవులు మొదలగునవి దేవునకెదుట నిలుచును. బ్రాహ్మ ణులు వేదములును పఠింతురు. నృత్యస్త్రీలు నృత్యమును గావింతురు. గాయకులు గీతములను విన్పింతురు. వీరందఱు ముఖమండపమున

నుందురు. శ్రీవారికి హారతిసమర్పింపబడిన యనంతరము పిదుకబడిన గోక్షీరము, నవనీతము, పంచదార నివేదింపఁబడును. ఇపుడు భోగశ్రీనివాసమూర్తిని శయనస్థలినుండి వేఱుపఱచి జీవస్థానమగు శ్రీవారిపీఠ సమీపమునకుఁజేర్తురు. ఇది నాఁటు జరిగెడు పద్ధతి. ఇఁక నేఁడు జరిగెడి పద్ధతి. ఉషఃకాలమనునది 3-00 గం॥ నుండియే ప్రారంభము. అర్చక స్వామిరాకలో మార్పులేదు. తలుపులుతెఱచి అర్చకుడు, పరిచారకుడు, గొల్ల లోనికి ప్రవేశించినంతనే బంగారువాకిలి తలుపులుమూయబడును. పరిచారకుడు సమ్మార్జనముచేయగా, గొల్ల దీపములు వెలిగించు కార్యములో నిమగ్నుడగును. మూయబడిన తలుపులకుముందు తిరుమామణి మంటపములో స్వామివారి కభిముఖముగా నిలిచి శ్రీవారిసుప్రభాతమును పఠింతురు. భోగశ్రీనివాసమూర్తిని ఈ సమయములో శయనమునుండి వేఱుపఱచి జీవస్థానముకడకుఁ (శ్రీవారిసన్నిధికి)జేర్తురు. ఇపుడు దర్శనము లేవియులేవు. బ్రాహ్మణుల వేదపఠనము, సుప్రభాతసేవయయిన తరువాతనే జరుగుచున్నది. హారతి, నవనీతము భోగమూర్తిని శ్రీవారి పీఠముకడకుచేర్చిన యనంతరమే నివేదింపఁబడును ఆయన శయితుఁడై యున్న సందర్భములో మాత్రముకాదు.

## శ్రీవారి విశ్వరూపసేవ

భక్తులా తరువాత ధ్రువమూర్తితోజేరిన భోగశ్రీనివాసమూర్తిని దర్శింతురు. దీనిని 'విశ్వరూపసందర్శన సేవ' యని పిలుతురు. ఇది కౌతుకబేరమునకు సుప్రభాతము కల్పించుటతో నయినసేవ. రాత్రి బ్రహ్మార్చనముతో నీసేవ యనుబంధితమగును. దర్శనములో భాగముగా బ్రహ్మాదులు గావించిన పూజాతీర్థమును భక్తుల కనుగ్రహింతురు. శుక్రవారమునాడు తప్ప ఇతరదినములలో నీసేవ యుచితము. ఈసేవకు నేడు కాలక్రమమున నదనముగా జోడింపబడినవి గలవు పెద్దముద్దగా చేయబడిన చందనపుముద్దనుండి కొందరు ముఖ్యభక్తులకు కొంచెము

కొంచెముగా నిత్తురు. శ్రీవారి శేషవస్త్రపుభాగమును కొందరకునిత్తురు. మొదటిది భక్తులు నుదుట నలంకరించుకొనుటకు, రెండవది కండ్లకద్దుకొని తిరిగి యిచ్చివేయుట కుద్దేశింపబడినవి. ఇవి రెండును గతరాత్రి శ్రీవారి పాదములతో నిత్యసన్నిహిత సంబంధము గలిగినట్టివి. రాత్రి ఏకాంత సేవలో భోగశ్రీనివాసమూర్తి వక్షస్థలముపై సుగంధపూరితమగు చందనపుముద్దలో నర్ధభాగముంతురు. (అర్ధభాగమొక టీకప్పునకు సమానము). అలర్ మేల్ మంగ నాచ్చియార్ పై నొక పాతికబిళ్ళనుంతురు. ఈమె ధ్రువబేరవక్షమున వ్రేలాడబడునట్లలంకరింతురని ఇంతకుముందే చెప్పబడినది. మిగిలిన పాతికభాగపుబిళ్ళను బ్రహ్మపూజార్థముంచెదరు. ఇదిగాక అదనముగా రెండుబిళ్ళలు పాదములపైనున్న బంగారుకవచమును తొలగించి, వానిని పునుగుతైలముతో మర్దించి పైనచెప్పిన శేషవస్త్రముతో తుడిచిన తరువాత శ్రీవారి పాదములపై నుంతురు దీనినే 'శ్రీపాదవస్త్రము'నియు నందురు ఉదయము శ్రీవారి విశ్వరూపసేవా సందర్భమున వీనిలోనుండి కొంతకొంతభాగము భక్తుల కొకప్పుడొసంగుదురు. ఒక్కొక్కప్పుడు బిళ్ళను భక్తుల కొసంగ వారు కన్నులకద్దుకొని తిరిగిఇచ్చివేయుదురు. ఈ సంప్రదాయము ప్రాచీనమునుండెడిదికాదు. 15వ శతాబ్దము మధ్యభాగములో నీ సంప్రదాయము వచ్చినది. (2–40 క్రీ. శ. 1469) ప్రాంతములో పునుగునూనె 'తిరుక్కాలి కన్నిదాసర్ అలగప్పిరానార్' ఆతరువాత సాళువనరసింగరాయలు, కందాడరామానుజయ్యంగారు యీ సంప్రదాయమును ప్రవేశపెట్టి కొనసాగించిరి. విశ్వరూపసేవ శాసనములో కన్పించదు. యాత్రికుల సౌకర్యార్థమేదోరూపమున ఉదయకాలమున శ్రీవారి దర్శనము చేయించుటయే దీని లక్ష్యము. 16వ శతాబ్దము మొదటిభాగములో శ్రీకృష్ణదేవరాయ పరిపాలనాకాలములో తిరుమలలో శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులవారి మధురగీతములు గానము చేయబడియుండును. వేదాంతదేశికుల జీవిత చరమకాలములోనున్న ప్రతివాదిభయంకరం అన్నన్ గారిచే కూర్పుచేయబడిన మధురాతి

మధుర సుప్రభాత శ్లోకములపఠనము మొదటగా 14వ శతాబ్దము నంత మునగాని, 15 వ శతాబ్దము ప్రారంభము నుండిగాని ప్రారంభింపఁబడి యుండును. తాళ్ళపాక వంశము వారిలో మొదటగా తిరుమల అయ్యంగారు తిరుమలను తన నివాసముగా జేసికొని 16వ శతాబ్దములో జీవించియుండెను. 15వ శతాబ్దమునకు బూర్వము ఉదయపు మేలుకొలు పులు ఎట్లుండెడివో యూహించుట కష్టము. 1430వ సంవత్సర కాలము నాటికి వీరప్రతాపవీర మహారాయలు వేదములను పారాయణము చేయు టను ప్రవేశపెట్టినకారణమున నంతకుముందు వేదపారాయణ సంప్ర దాయములేనట్లు స్పష్టమగుచున్నది. క్రీ. శ. 1476కు పూర్వము తమిళ ప్రబంధములును దేవాలయములో పారాయణము గావించుటయులేదు. తాళ్ళపాక అన్నమయ్య మేలుకొలుపులతోగాని, సుప్రభాతముతోగాని తిరుప్పళ్ళి ఎళుచ్చి (ఆండాళ్లుసప్తపది లేక గోదాదేవి తిరుప్పావు) లోని మేలుకొలుపులఁ పఠించుట జరుగలేదు. తోమాలసేవ ప్రవేశపెట్టిన యనం తరమే తమిళప్రబంధపారాయణ మమలులోనికి వచ్చెను. ఇవి శ్రీనివా సుని ప్రశస్తివిగాక రంగనాథుని ప్రశస్తిని తెల్పుశ్లోకములు. ప్రారంభకాల ములో నుదయపుసేవలు మిక్కిలి తక్కువగానుండెడివి క్రీ. శ 1434లో మొట్టమొదటగా నుషఃకాలసంధిలో (అరుణోదయమున) ప్రసాదసమ ర్పణము జరుగుటకు ప్రయత్నము జరిగినది.

క్రీ. శ. 1330 నుండి 1360 వరకు శ్రీరంగనాథుఁడు తిరుమలలో ప్రవాసమున్నప్పుడు ఆయన సమక్షమున గోదాదేవి సప్తపదులు పఠిం చుట వవి ప్రాతఃకాలమున మేలుకొలుపులఁగా పరిగణించుట జరిగెడిది. ఇదియే శ్రీవారిని ప్రశంసించుచు వ్రాసిన సుప్రభాతశ్లోకముల యావిర్భా వమునకు హేతువై యుండును. దీని తరువాత మరియొక శతాబ్దమునకు గాని శ్రీ తాళ్ళపాకవారి మేలుకొలుపులు అవతరించలేదు అని నిర్ద్వంద్వ ముగా చెప్పవచ్చును.

విశ్వరూపసేవ యన్నది శాసనములలో గావరాకున్నను దీనికి కొన్ని శతాబ్దముల చరిత్రగలదనియే మనము భావింపవచ్చును.

## పగటిపూట ప్రధానపూజ - తోమాలసేవ

తమిళపదమగు 'తోమాలై' యనునది పూలదండలతో స్వామి నలంకరించుట యను నర్థమొసగును. తిరుమల ఆలయములో శ్రీవారి ధ్రువబేరమును పూలదండలతో నలంకరించుటయన్నది ప్రత్యేక లక్షణము. పూజాంతమందు నిర్వర్తించెడి యీ పూలదండల యలంకరణములో యాత్రికునిదృష్టి లగ్నమగునట్లు చేయును పూలదండలు అన్నివిధముల ఆకృతులలో చిన్నవి, పెద్దవియుండి యొక్కొక్క ప్రత్యేకభాగములో నలంకరింపఁబడుటయే నీ తోమాలసేవ లక్షణము. ఇట్లు చేయుటవలన నలంకరించు నర్చకులకు కాలము వృథాగాబోదు. ఒక క్రమపద్ధతిలో నలంకరింప వీలుపడును.

విశ్వరూపసేవా సందర్శనానంతరము యాత్రికులు దర్శనముపూర్తి చేసికొని బయటకు పోదురు. అప్పుడు బంగారువాకిలికి తెరవేయ బడును. శుద్ధి కార్యక్రమము నడచును. ఇందులో గతరాత్రి వాడబడిన పూలదండలు ధ్రువమూర్తినుండి వేరుచేయుదురు. పూజాసామగ్రి నంతయు కడిగి, తుడిచి, శుభ్రపఱతురు. ధ్రువమూర్తినుండి వేరుచేయ బడిన కొన్నిదండలను విష్వక్సేనునకువేయుదురు. దీనికి శాస్త్రమున్నది.

> 'దివ్యనిర్మాల్యశేషేణ విష్వక్సేనం విభూష్య చ
> అన్య నిర్మాల్యమాదాయ శుచిస్థలేఽ ప్యవాక్షిపేత్'

మిగిలిన నిర్మాల్యమంతయు ప్రోవుచేసి యొక బావిలో నిక్షిప్త పఱతురు. దీనినే 'పూలబావి' యని పిలుతురవి ఇదివఱకెతెలింగింపఁ బడినది. దేవనిర్మాల్యములో నే భాగమును మనుష్యులుపయోగించుట, ఇతరదేవతల కలంకరించుట నిషేధము. కాని ఆమలులో విష్వక్సేను నకును నిర్మాల్య ముపయోగించుట గానము. బహుశః, విష్వక్సేనుని

కడకు సన్నిధినుండి వెంటనే సమీపింప వీలుకాకుండుట యొక్క కారణము గావచ్చును. ఆయన ఏ కారణముచేతనో శ్రీవారి సన్నిధినుండి వేరు చేయబడి క్రీ. శ. 1250 ప్రాంతములో మొదటి ఆవరణములోని ఆలయములో ప్రవేశపెట్టబడెను. ఆ కారణముచేతను నిర్మాల్యమీయనకు వెంటనే చేరుట కవకాశములేని కారణముచే నా ప్రయత్నము విరమింపబడియుండును. ప్రాతఃపుష్పములను శ్రీవారి నలంకరించిన దండలను వేరుచేయు కార్యక్రమమునే 'నిర్మాల్యశోధన' మని యందురు

ఈ సమయములోపనే ఆదినము పూజాకార్యక్రమము నిర్వహించుటకు గావలసిన తీర్థమాకాశగంగనుండి తెత్తురు. తిరుమల తిరుపతులలో ప్రథమాచార్యపురుషులను నెంకొల్పిన తిరుమలనంబి కుటుంబములోని వంశపరంపరలోని వారికిది విడదీయరానిదిగ నిర్ణయింపబడిన విధి. వీరు మూడు పెద్దకలశములలో నీరు ఆకాశగంగనుండి శ్రీవారి పూజార్థము తెత్తురు. ఒకటి ఉదయపూజకు, రెండవది అపరాహ్ణపూజకు, మూడవది రాత్రిన బ్రహ్మారాధనమునకు నుపయోగింతురు. బ్రహ్మారాధనమునకు ఉపయోగించెడి కలశములోనున్న తీర్థమును రాత్రి తలుపులు మూయుటకు ముందు ఐదుకలశములలో నింపుదురు. వైఖానస సంహితలలో నిత్యము పూజార్థము తెచ్చెడి తీర్థమును సమంత్రకముగా నేనుగుపైనుంచి మంగళవాద్యములతో తేవలయునని చెప్పబడినది. కాని యిది ప్రతినిత్యము పాటింపఁబడక కేవలము బ్రహ్మోత్సవదినములలో మాత్రమే పాటింపఁబడుచున్నది. అయ్యును ఆ గజానీత తీర్థము పూజాదుల కుపయోగించుటలేదు. బ్రాహ్మణులు శిరసున నుంచుకొని తెచ్చిన తీర్థమును మాత్రమే పూజాదుల కుపయోగించుచున్నారు. భృగుసంహితలో నేనుగుపై తీర్థమును తేవలసినదిగాఁ జెప్పినను మరీచిమహర్షుల వారు బ్రాహ్మణానీత తీర్థమునకే ప్రాధాన్యమొసంగిరి.

## పూజాక్రమము

పాతకునకుగాని, పూజను దర్శించువారికిగాని పూజాక్రమమున ప్రత్యేక ప్రత్యయముగల వారైనచోగాని ఆసక్తి జనింపదు. పూజాక్రమ మైదువిధములుగా విభాగింపబడును.

1) మన్త్రాసనము 2) స్నానాసనము 3) అలంకారాసనము 4) భోజ్యాసనము 5) యాత్రాసనము 6) శయనాసనము.

**మన్త్రాసనము :** మన్త్రాసనములో శ్రీవారికి అర్ఘ్యపాద్యాచమనము, తాంబూలము, ఆసనము ఇవి ఐదు ఉపచారములు. పాద్యము పాదశుద్ధికొఱకు, అర్ఘ్యము హస్తశుద్ధికొఱకు, ఆచమనము ముఖము కడుగుకొనుటకు వెండి యుద్ధరిణితో స్వామి కర్పణముచేయు నుపచారములు.

స్నానాసనము : స్నానాసనములో ప్రతినిత్యము ధ్రువబేరమున కభిషేకముచేయుట సాధ్యముకాదు. కాన ఆగమశాస్త్రము కౌతుకబేరమునకే నిత్యాభిషేకము నిర్ణయించినది. ఈఆలయములో శ్రీవారిధ్రువబేర పాదముపైనున్న కవచమునుదీసి వేఱుగానుంచి పాదాభిషేక మొనర్తురు. ఇటగల యనేక సాలగ్రామములుకూడ శ్రీవారి పాదములతోబాటు అభిషేకమును స్వీకరించును.

భోగశ్రీనివాసుని శయనస్థలినుండి వేఱుపఱచి జీవస్థానమునకుం జేర్చి స్నపనపీఠమున నుంతురు. ఇది జరుగుటతో ధ్రువబేరముతో కౌతుకమూర్తికి కలుపబడిన బంగారుతీవను వేఱుపఱతురు. సూక్ష్మ వస్త్రము నొకదానిని కౌతుకమున కలంకరింతురు. అపుడభిషేకమును ప్రారంభింతురు. పురుషసూక్తాదులను పఠింతురు. మొదట విగ్రహమునకు సుగంధపుష్పతైలానులేపనమును గావింతురు. ఆ వెనుక నీటితో వీనిని కడుగుదురు, అంత గోక్షీరము, గంధోదకము, మధువు, హరిద్రోదకముతో వరుసగా నభిషేక మొనర్తురు ఒక్కొక్క అభిషేకాంత

మున నొక శుద్ధోదకస్నానము సమర్పింతురు. సహస్రధారాయుక్తమగు పళ్లెరము (నేటి తుంపురులస్నానము బోలినట్లు (Shower bath)) నుప యోగింతురు. తరువాత ప్లొడిగుడ్డతో కౌతుకబేరమును దుడిచి పుష్పాం జలిని సమర్పించి జీవస్థానముకడకుఁ జేర్తురు. ఇఁక మిగిలినది ధ్రువ బేరముల పాదములకు జరిగెడి పుష్పన్యాసము.

ఈ పుష్పన్యాసము మూడు ఆవరణములలోనున్న దేవతలనుద్దే శించి జరిగెడు పూజ. ప్రతిఆవరణములోను పూజ ప్రాగాదిక్రమము ననుసరింపబడును. ఇక్లే కౌతుకబేరము నావరించి మూడు ఆవరణము లలోగల దేవతలనుద్దేశించి పూజ జరుగును. ఈ తరువాత మార్కం దేయ, భృగువు, బ్రహ్మ, శంకరులకు, ద్వారదేవతలకు, ద్వారపాలకులు విమానపాలకులు, అంతమున గర్భగృహముయొక్క ద్వారపట్టికలకును పూజ జరుగును. అపుడు గర్భగృహపుగడప రెండువైపులను శుద్ధి చేయబడి ధర్మజ్ఞాన ఐశ్వర్యములకు పూజ జరుగును.

ఇది తిరుమలలో జరుగుట దుర్లభము. నియమింపబడిన దేవతా విగ్రహములేనిచో నా పూజ ధ్రువబేరమునకు జరుగవలెనని ఆగమ వాక్యము. తిరుమలలోని దేవతలెవ్వరు విగ్రహరూపమునగాని, చిత్ర రూపమునగాని లేరు. న్యాసమున చెప్పబడిన దేవతలకు సంబంధించిన పుష్పములన్నియు శ్రీవారి పాదములమధ్య నుంపబడును. ఈకారణము చేతనే మనకు శ్రీవారి పుష్పములుగాని, తులసిగాని ప్రసాదముగానీయరు. ఈ దేవతలందఱు ఎవరికి వారు వారి స్థానములలో నుండినచో వారి పుష్పములు వారికిచేరి మిగిలిన పుష్పములు శ్రీవారి పాదములకడ నున్నవి ఆయన ప్రసాదముగా భావింపవచ్చును. ఇతరదేవతల ప్రసాద ముల నంగీకరింపవలెనన్న ఆయాదేవతల నుపాసించి తమ కోర్కెల సాధనములో ప్రయత్నించు వారికే అది ఉపయోగము. కాని శ్రీవారినే అర్చించు వారికవి నిషేధము. ఇఁక శ్రీస్వామివారి నలంకరించిన పుష్పములు విష్వక్సేను నలంకరింపవలెను.

## అలంకారాసనము

ఈ ప్రక్రియలో వస్త్రము, భూషణము, ఉత్తరీయము మొదలగు వాని చేతను, ఊర్ధ్వపుణ్డ్రధారణము, యజ్ఞోపవీత సమర్పణము వాని వాని మన్త్రములచే శ్రీవారికి సమర్పణమగును. ఇది క్రీ. శ 1465 వ సంవత్సర ప్రాంతములో మొదలయియుండును. తిరుమలలో శ్రీవారికి యూర్ధ్వపుణ్డ్రముగా పచ్చకర్పూరము కస్తూరిని యుపయోగింతురు. దీని తరువాత మన్త్ర పుష్పము పఠింపబడును. ఈ క్రమమిదివరకే ప్రస్తావింపబడినది. అలంకారాసనాంతమున మాత్రాదానమును భృగు మహర్షి చెప్పెను. పూజాక్రమమును క్రమబద్ధము చేయబడుచున్న సాంప్రదాయమిట కలదు, కొలువు యుత్సవములో నొక భాగముగా దీని నిచ్చట జరిగింతురు.

## కొలువు - దర్బారు

ఉదయము ఆలయములో జరిగెడి యీయలంకారాసనప్రక్రియయే ఒక దర్బారుగానుండును. భృగుసంహితలో చెప్పిన మాత్రాదాన మిచ్చటనే జరుగవలయును. కాని ఇది నాటినుండి సన్నిధి వెలుపల ముఖమంటపములో (తిరుమామణి మంటపములో) జరుగుచున్నది. మాత్రదానమును పూర్వమునుండి వచ్చిన పూజాక్రమములోని భాగము కాదని తరువాతనే యిది ప్రారంభమయినదని దీనివలన తెలియుచున్నది ఈ ప్రక్రియా నిర్వహణమును గురించి యింతకు పూర్వమే వివరింప బడినది. ఈ యుత్సవమునకు బలిబేరముగాఁ బేర్కొనఁబడుచున్న కొలువు శ్రీనివాసుని ముఖమంటపమున వెండి సింహాసనముపై నలం కరింపఁజేతురు. అర్ఘ్యపాద్యాచమన సమన్వితమైన లఘ్వర్చనము జరు గును. వేయించిన పిండిచేయబడిన నువ్వులు, బెల్లము శొంఠికలిపి ఇట స్వామికి నివేదింతురు. తరువాత ప్రసాదము లక్కడగలవారికి వినియో గింతురు. పంచాంగ పఠనము జరుగును. గతదినపు రాబడిని వేర్వేరుగా

వద్దులలో చదువుదురు. ఇట్టి యుత్సవము జరుపు సంప్రదాయమును తెలుపు శాసనము లెవ్వియునులేవు. బ్రిటిషువారు ఆలయ పరిపాలనమును నిర్వహించుట ప్రారంభమయిన తరువాత అనగా క్రీ. శ 1800 సంవత్సరము తరువాత ఆలయ భూముల్స్నియు మరల యథాస్థితిలోనికిఁ దెచ్చినపుడు అర్చకులకు తమ ఆదాయము కోల్పోయిన కాలములోని రాబడిని పూడ్చు నిమిత్తము కొంత అదనపు సామాగ్రిని యేర్పాటుచేసి ఆ సామాగ్రిని బహిరంగముగా నర్చకులకొసంగు సంప్రదాయము కల్పించినట్లున్నది. ఈ సమయముననే రోజువారి ఆదాయము ప్రజల కెఱుకపఱచువిధానము నమలుపఱచియుందురు

## శ్రీనివాస సహస్రనామార్చనము

ఇది నిత్య కార్యక్రమములోని దయినను భక్తులకుకూడ అవకాశమీయబడినది. భక్తులెవ్వరైనను తమ యైహికాముష్మికములగు వాంఛలను దీర్చుకొను నిమిత్తము దేవస్థానము వారికి రుసుములు చెల్లించిఈ అర్చనము నిర్వర్తింప జేసికొందురు. కొందఱు భక్తులు సంవత్సరమున కొకే పర్యాయము చెల్లింతురు. మరికొందఱు శాశ్వతముగా చెల్లింతురు ఇట ప్రత్యేకత యేమనగా విష్ణుసహస్రనామము పఠింపఁబడక శ్రీ వేంకటేశ్వరుని సహస్రనామములే పూజసమయములో పఠింతురు. ఈ సహస్ర నామార్చనమునే అచ్యుతదేవరాయలు తానుగా నిర్వహించి శాస్త్రసంప్రదాయములకు తీవ్రమైన కళంకమునాపాదించెను. రుసుము చెల్లించిన భక్తులకు పూజాంతమున దర్శనము చేయింతురు. భక్తులు ఎవరి గోత్రనామములను వారే చెప్పుకొనవలసి వచ్చుట యిటీవల కాలమున జరిగినమార్పు. ఇది త్వరితగతిని దర్శనము కొనసాగించుటకై యేర్పాటు కాబడిన సౌలభ్యము.

## భోజ్యాసనము - నివేదనము

శుద్ధి కార్యక్రమము జరిగిన యనంతరము, తయారయిన ప్రసాదము లన్నింటిని గర్భగృహమునకు ముందున్న ముఖమంటపము

కడకు జేర్తురు. ఈ ప్రసాదములను గంగాళములలో దెత్తురు. బంగారు వాకిలి మూయబడును. లేదా తెరవేయబడును. అర్చకులుమాత్రమే లోపల నుందురు. మంటపములోని రెండు ఘంటలు చెవులు గింగురుమనునట్లు మ్రోగింతురు. తలుపులు, తెరవేయకముందే అందఱును ముఖమంట పము నుండి వెడలుదురు హవిర్నివేదనమునుగూర్చి యింతకు పూర్వము మధుపర్కమును స్వామికి సమర్పింపవలెనని భృగు సంహితలో చెప్పబడినది. ఇటీవల దీనిని నమలుపఱచుటకు యత్నించిరి గాని మరేలనో విరమింపఁబడినది. మధుపర్కమనగ భృగువు ఇట్లు చెప్పెను.

'ఘృతంమధుగుడంచైవ పయో దధిసమన్వితమ్
ప్రస్థమాత్రంతు సంగృహ్య మధుపర్కమిహోచ్యతే'

నేయి, తేనె, బెల్లము, పాలు, పెరుగు కలిసిన ప్రస్థమాత్ర ప్రమాణ మయిన దానిని మధుపర్కమందురు.

## హోమము

నైవేద్యము తరువాత శాస్త్రము హోమమును గుఱించి చెప్పినది. ఇది దినమునకు మూడు పర్యాయములు లేక కనీస మొక్క పర్యాయ మైనను చేయనగునని చెప్పబడినది. తిరుమల ఆలయములో దీని ప్రసక్తి శతాబ్దముల పర్యంతము నుండి యున్నట్లుగానము. కాని యిటీవల నూతన ఆస్థానపండితులవారి ప్రేరణచే నీ హోమ నిర్వహణము పునరుద్ధరింపబడినది.

## యాత్రాసనము - బలినివేదనము

ప్రాకారములను చుట్టియున్న దేవతలందఱకు బలి సమర్పణ మును చేయుటకు కొలువు శ్రీనివాసుని పల్లకిలో నుంచుకొని ఆలయ మర్యాదలతో సంగీత నృత్యగాన విధులతో బయలు వెడలవలెను. రాగము తాళము, అభినయములతో నీ కార్యక్రమము నడుపవలెను.

ఒక్కొక్క దేవత కొక్కొక్క రాగమునందు, గీతమునందు వాద్యమునందు అభిమానమెక్కువ. వాని నభినయించి యా దేవతను దృప్తినందించి బలిని సమర్పింతురు. కొన్ని దేవతలకు పుష్పతోయములతో సరిపుత్తురు. కొన్నింటికి కేవలము నీటిని మాత్రమే సమర్పింతురు. బలియనగా ముద్గాన్నము. (పెసరపప్పుతోనుడికించిన అన్నము) ఇట్టి విధాన పూర్వకమయిన యుత్సవము తిరుమలలో శ్రీవారిఆలయములో జరుగుటలేదు. ఏకమూర్తి ఆలయమగుట యొక కారణము. మొదటి ఆవరణము పూర్తిగా ఛిద్రము చేయబడి పునర్నిర్మింపబడుట రెండవ కారణము. అది మూసియుంచుట దానిలో నుత్సవము జరుగుట యసాధ్యమగుటయు కారణమే. అర్చక పరిచారకులు విమాన ప్రదక్షిణమును జుట్టి విష్వక్సేనునకు గరుడునకు వారి స్థానములలోను ధ్వజమునకు యూథాధిపునకు నొసంగి మిగిలినది బలిపీఠమునకు ధ్వజమునకు మధ్యగల ఐదు శిలా ఫలకముల మీదనుంతురు.

## శాత్తుమొఱ (మంగళాశాసనము)

బలియనంతరము అర్చకుడు ఆలయము ప్రవేశము గావించిన తరువాత శ్రీవైష్ణవులు జియ్యంగారిని ముందిడుకొని సన్నిధిలోనికి ప్రవేశింతురు. అచట జియ్యంగారు చేతితో పుష్పముల నొసంగ అర్చకస్వామి శ్రీవారికి పూజయొనర్చును. ఈ సందర్భములో నట బారులుతీరి నిలుచున్న శ్రీవైష్ణవ శిఖామణులు ప్రబంధమును పఠింతురు. ప్రబంధ పారాయణము ముగియగానే వీరందఱకు అర్చక స్వాములు చందనము, తీర్థము, శఠారిని మర్యాదలతో నిత్తురు. ఈ యుత్సవముకూడ శాసనములలో నెచటను పేర్కొనబడియుండలేదు. 18వ శతాబ్దాంతము వరకు నిట్టి ఏర్పాటున్నట్లుగా వినియుండము. మొదటగా క్రీ. శ. 1467 సంవత్సరములో శ్రీరామానుజుల యెదుట నీ యాళ్వారుల దివ్య ప్రబంధ పఠనము జరిగినట్లు శాసనము గలదుగాని శ్రీవారి సన్నిధిలో

నీసంప్రదాయము మనముచూడము. ఈ శాత్తుమొఱ (మంగళాశాసనము) ఎక్కడ జరిగినను ప్రాతి విధము శ్రీవైష్ణవులదే. మధ్యాహ్నపూజ (తోమాలసేవ) శాత్తుమొఱతో పూర్తియగును.

## ధర్మ (సర్వ) దర్శనము

ఇది అయిన తరువాత ఉదయకాలములో దర్శనముగాని వారలకు, రుసుమును కట్టి స్వామిని దర్శనము చేయశక్తిలేని వారల సౌకర్యము నిమిత్తమై శుక్రవారము తప్ప మిగిలిన యన్ని దినములలో దర్శనము చేయింతురు. ఇది యుచిత దర్శనమనియు, సర్వదర్శనమనియు, ధర్మదర్శనముగాను పేళ్లు గలిగియున్నది. ఈ ధర్మదర్శనములో బీద, బిక్కి, ధనవంతుడు, దరిద్రుడు, చిన్నపెద్ద, స్త్రీ పురుష, బాల, వృద్ధ భేదములేక యెల్లరకును దర్శనము లభించును. ఇది నేడు రాత్రి 10 గంటలవరకు పొడిగింపబడినది.

## అపరాహ్ణపూజ

ఇది రెండవ ఘంటాకాలము. సంగ్రహపూజ జరుగును. ఈ అర్చనకూడ పూర్వమార్జితమే. నేడు పరిమితము. దీని యనంతరము తిరుమామణి మంటపములోనున్న రెండు ఘంటలు మ్రోయును. నివేదనము జరుగును. రెండవ ఘంట యనంతరము పగటి కార్యక్రమము పూర్తియైనట్లు భావింపవచ్చును. పూర్వమీ కార్యక్రమానంతరము పగటిపూట తలుపులు మూసివైచెడివారు. కాని నేడీ సమయమున ధర్మ దర్శనమునకై వినియోగించుచున్నారు.

## రాత్రి పూజ

రాత్రిపూజ ఉదయపు తోమాలసేవను బోలియుండును. ఇది పూర్తిగా నితరులకు ప్రవేశములేనిది. ఆ సమయములో విధులను నెరవేర్చువారుదప్ప నితరులెవ్వరును ప్రవేశింప నవకాశమీయరు. ఇచట

నివేదింపబడు అన్న ప్రసాదములు పరిమాణములోను పరిమితిలోను ఉదయముకంటె చాలతక్కువ.

నేడు ఈ పూజాకాలములో మాత్రము ధర్మ దర్శనము కొంత తడవు ఆపి మరల ధర్మదర్శనమును కొనసాగించుచున్నారు.

## నిశిరాత్రి పూజ

ఇది అర్ధయామ పూజయందురు. ఇది లఘువుగను సంగ్రహము గను జరుగును. మధుర పదార్థములు పాయసము నివేదింపబడును.

## పర్యంకాసనము

ఇందు భోగ శ్రీనివాసమూర్తిని శయన స్థలికిఁజేర్తురు. మార్గశిర మాసము (ధనుర్మాసము) లో దప్ప మిగిలిన పదునొకండు నెలల కాలములోను ఈయనయే శయనమూర్తి. మంచిగంధపు చెక్కతో చేయబడిన యుయ్యాలమంచమునకు వెండిగొలుసులు తగిలించి లోన మెత్తటిపట్టుపఱుపును దిండుల నమరింతురు. ఈ గొలుసులను తగిలించుటకు శయనమంటపముపైన నొక ఇనుప బద్దెయున్నది. దీనికి శయనమంటపమనిపేరు. ఈ సేవ దర్శించుటకు వచ్చుభక్తులు రుసుము చెల్లింపవలెను. దీనికి ఏకాంతసేవ యనిపేరు. తీయనివేడిపాలు, పండ్లు, బాదము పలుకులు శ్రీవారికి నివేదించినవి భక్తులకు ప్రసాదముగా నిత్తురు.

ధ్రువమూర్తి పాదముల పైనున్న బంగారు కవచమును తొలఁగించి యా పాదముల మధ్యను 4 కప్పుల పరిమాణముగల రెండు చందనపు బిళ్లలనుంతురు. భోగ శ్రీనివాసమూర్తి హృదయముపై సుగంధయుతమగు చందనములో నొక సగముబిళ్లనుంతురు. ధ్రువ మూర్తి హృదయమందున్న అలర్ మేల్ మంగాదేవి పయి ఒక పాతిక బిళ్లనుంతురు. వీనికి సంబంధించి చేయుచున్న ఈ విభాగనిర్ణయ

మేళాసనమునందును గానము. అయినను ఇది ఇటీవలి సంప్రదాయము మాత్రముకాదు. ప్రాచీనమునుండి అనుసరింపబడుచున్నట్టిదియే.

ఈ ఏకాంత సేవకు ఒక్కొక్కటి 374తూకములు గలిగిన రెండు బంగారు గిన్నెలను శ్రీకృష్ణదేవరాయల భార్యలగు చిన్నాదేవి తిరుమల దేవులు చెరియొకటి పాలను నింపుటకుగాను సమర్పించిరి. ఇది క్రీ. శ. 1513వ సంవత్సరమునాటి సంఘటనము. ఓబలనాయక రామనాయకుడు శ్రీకృష్ణదేవరాయల సేనానులలో నొకరు. అయన క్రీ. శ. 1514 వ సంవత్సరములో అర్ధయామము సేవకై శ్రీవారికి ఒక నళికొలతగల 'పాలెదుకోళంబు' ప్రసాదమును సమర్పించుటకుగాను 200 ఆవులు దానమొనర్చెను.

## పూలంగిసేవ

ప్రతి గురువారము మధ్యాహ్నకాల పూజానంతరము శ్రీవారికి గల సర్వాభరణములను సడలింతురు. కేవలము ధోవతి ఉత్తరీయము (మేల్‌సాత్, ఉల్‌సాత్) లను మాత్రమలంకరింతురు. పచ్చకర్పూరముతో నమర్చబడిన నామమును కస్తూరిని కేవలము చిహ్నముగానుంచి మిగిలినదంతయును తీయుదురు నాడు సర్వదర్శనము సా॥ 5 గంటల వరకు మాత్రమేయుండును ఆ తరువాత శ్రీవారిని పూలంగిసేవకు సన్నాహమొనర్తురు శుద్ధికార్యక్రమము ముగియును. చక్కని సన్నాయి మేళము మ్రోగుచుండగా శ్రీవారిని ప్రత్యేకముగా తయారుచేసిన దండల నలంకరింతురు. ఈ అలంకరణములో ధ్రువబేరమునంతయు పూలతో కప్పజేయుటచే దీనిని పూలంగిసేవగా వ్యవహరించుచున్నారు. ఇది యెపుడు ప్రారంభమయ్యెనో తెలియదు. దీనికిఁ గారణముకూడ తెలియదు. కాని శిలప్పదికారమున శ్రీవారిమూర్తిని వర్ణించు సందర్భమున ఈ సేవ వర్ణింపబడినది. తమిళపదమగు పూవాడై అను పదమునకు సరియగు తెలుఁగుపదము పూలంగి ఆకారణమున నీసేవ క్రీ.శ. 756 వ

సంవత్సరము నాటికే అమలులో నున్నట్లు స్పష్టపడుచున్నది. ఇది యిట్లుంచి శుక్రవారము జరుపబడబోవు అభిషేకమునకు పూర్వరంగమే యీ సేవలోని యంతరార్థమని గూడ చెప్పనగును. అభిషేకమునకు ముందే యీసడలింపు జరుగవలె నన్నచో నది మిక్కిలి క్లేశకార్యము. ఈ కారణముననే నీ ఆభరణములు, అలంకారములు గురువారముననే సళ్లింపు చేయుదురు.

## శుక్రవారాభిషేకము

శ్రీవారికి నిత్యాభిషేకము లేకుండుటతో వారమున కొకతూరి అదియును శుక్రవారమునాడు యీయభిషేకము జరుగుచున్నది. పులుగు కాప్పు అనగా పునుగుతైలమును తయారుచేసి దానిని శ్రీవారి ధ్రువ బేరము ముఖమునకు లేపనము చేయుటయే. కాని నేడు ఈ సుగంధ తైలమును శ్రీవారి అంగములన్నిటికి పట్టించుచున్నారు ఈ శుక్రవారాభిషేకమునకు చాల ప్రాచీనత గలదు ఈ విషయమును గురించి భోగ శ్రీనివాసుని అభిషేక ప్రతిష్ఠా సందర్భము శ్రీవారి ధ్రువమూర్తికికూడ అభిషేకము జరుపవలసివచ్చుటయను సందర్భమున ప్రస్తావన తేబడినది. తిరుమలదేవాలయములో నిట్టిది యేకైక సంఘటనము. ఆదినము శుక్రవారమయినది. ఆ తరువాత వచ్చేడి శుక్రవారము, శుక్రవారముల నాడు వచ్చేడి ప్రత్యేక పర్వములందు శ్రీవారికి అభిషేకము జరుపుట సంప్రదాయమైయుండును. ఈపునుగుతైలమును శ్రీవారికి లెపనముచేయుటకు ముదలియార్ తిరుక్కలికన్ఱిదాసరు అలగప్పిరానార్ అను వైష్ణవ నాయకుడు ఈ తైలమును సరఫరాచేయుటకు (1-207. 16-7-1484) దానశాసనము వ్రాయించెను. దక్షిణాయనములోని 6 మాసముల లోను ప్రతిరోజు ముఖలేపనమునకుగాను దీనిని సమర్పించడమయినది. ఇక్కడ చెప్పవలసినది యేమన పూర్వమీతైలము ప్రతిదినము శరీర మంతయు లేపనము చేయబడెడిదికాదు. ముఖమునకు మాత్రమే లేపనము చేయబడెడిది. ఇపుడు జరుగుచున్నది ప్రతినిత్యము పాదములకు

లేపనముగాని ముఖమునకుమాత్రము కాదు. ఈపునుగు నుపయోగించుట పూజాసామగ్రికి సుగంధత్వమును కల్పించుటకుగాను క్రీ. శ. 1429 (1-192) లో దేవరాయ మహారాజుచే ప్రవేశపెట్టబడెను. ఇది పునుగు తైలమువంటి వస్తువు కాదు.

ఈ పునుగుతైలము నుపయోగించుట యేలనోయనునది యూహ కందనివిషయము. కాని కొన్ని కొన్ని దేవాలయములలో చందనాది తైలములవంటి వానిని ధ్రువమూర్తులకు లేపనముచేయుట కలదు. ఇ ) బహుశః మూలబేరములను బొద్దింకలుమొదలగు నితర పురుగులనుం‌ తప్పించుటకు గావచ్చును. ఇట్టిది సంవత్సరములో నొకటి రెండు పర్యాయములు మాత్రమే జరుగును. పునుగుతైలము చందనపుతైల మును సాధించుటవంటిది కాదు. పునుగుతైలమును అనేక పునుగు పిల్లులను చంపుటచేగాని తీయలేము. కందాడై అప్పాచి అన్నాఅయ్యం గారిచే ప్రతి రెండవశుక్రవారమును పులుగుకాప్పునకు క్రీ. శ. 1496 న ఈయబడిన దానశాసనము కలదు. దీనిలో రెండవ శుక్రవారమున పులుగుకాప్పు ధ్రువబేరమున కుపయోగించబడుటకు అని గలదు. ఈ సందర్భములో సమర్పింపబడెడు అన్నప్రసాదములకు సంబంధించిన విషయముగూడ నిందున్నది. ఈ సమయములో పునుగుతైలము శరీర మంతయు లేపనము చేయబడెడిదో లేక ముఖమునకు మాత్రమేనో తెలియదు. దీనిలో ఆ విషయము మాత్రము వ్రాయబడలేదు.

అలగప్పిరనార్ శాసనము క్రీ. శ. 1434 వ సంవత్సరములోనిది కాగా అప్పాచి అన్నాఅయ్యంగారు శాసనము క్రీ. శ. 1496వ సంవత్స రములోనిది. కనుక నీ సంప్రదాయము నాటినుండి యున్నదనవచ్చును. క్రీ. శ. 1506 లోని ఒక శాసనములో పులుగుకాప్పు లేపనము ధ్రువ మూర్తికి అభిషేకానంతరము మాత్రమేసనియు, అలర్ మేల్ మంగ నాచ్చియార్‌కు కేవలము అభిషేకము మాత్రమేననియు తెలియచేయ బడినది. ఇది నేటికిని అమలులో గలదు.

శ్రీకృష్ణదేవరాయల కాలమునుండి ఈ యభిషేకము, పులుగు కాప్పు సేవ వారోత్సవమయినది. ఆయన గుడగూర్‌నాడు గ్రామమునుండి (క్రీ. శ. 1517) ఒక వేయివరహాలసుంకమును ప్రతి శుక్రవారాభిషేకము నకు, పుఖుగుకాప్పుసేవకు ప్రత్యేకించెను. కనుక నీ శుక్రవారాభిషేకము జనవరి 1517 నాటికే సంప్రదాయమైనట్లు చెప్పవచ్చును. ఈ శాసన ములో నభిషేకములో నుపయోగించెడి వస్తుసామగ్రినిగుఱించి పేర్కొన బడలేదు. కాని క్రీ. శ. 1583 లోనున్న ఒక శాసనములో నీవివరములు గలవు. దీనిని సమర్పించినవారు ఎట్టూరు తిరుమలకుమార తాతయ్యం గారు.

| | |
|---|---|
| గంబూర పచ్చకర్పూరము | 4 కుడిరములు |
| | 200 వరాహముల తూకము |
| పునుగు సంచులు | 200 |
| పన్నీరు పాత్రలు | 12 |
| కుంకుమపువ్వు | 30 పణముల తూకము |

ముఖమును తుడుచుటకొాక తెల్లనివస్త్రము 7 గజములది 1.

నేడు సంప్రదాయములోనున్న కస్తూరిపసుపు దీనిలో లేదు.

ఇపుడు అభిషేకము శుక్రవారమునాడు జరిగెడు దానికి భక్తులు రుసుము చెల్లింతురు. రు. 450, 250, 100, ఈ రేట్లలో భక్తుని శక్తిని బట్టి చెల్లింతురు. 7 గంటలకే అభిషేకము ప్రారంభింతురు. పూర్తి యగునప్పటికి మొత్తము 9-30 గంటల వరకు అగును. దేవాలయాధి కారులే గిన్నెలలో ఆయా అభిషేకద్రవ్యములను అర్జితసేవాభక్తుల కొసం గుదురు. మేళముతో విమానప్రదక్షిణము గావింతురు. సన్నిధిలోనికి ప్రవేశించి శ్రీవారి సన్నిధిలో సమర్పింతురు. కేవలము ధ్రువమూర్తికే గాక శ్రీవారివక్షమందు తగిలింపబడిన అలర్‌మేల్ మంగాదేవికి గూడ జరుగును. ఇది నిజముగా నొక మనోహరమగు దృశ్యము. ఈ కారణ ముచే దీనిని విస్తరించి చెప్పుట అవసరము. ఈ సందర్భములో నుపయోగించు వస్తుసామగ్రి యిది :

| | |
|---|---|
| గంబూర పచ్చకర్పూరము | 84 తులములు |
| పునుగు సంచులు | 7½ కుంచ శేర్లు (1½ వీశె) |
| కుంకుమపువ్వు | 36 తులములు |
| కస్తూరి | 3 వరాహముల తూకము |
| పసుపు | 7 తులములు |

అభిషేకమునకు సర్వము సన్నద్ధమయి యుండునట్లు చూచు కొన్నయనంతరము భక్తులనందఱను కూర్చుండునట్లు చేయుదురు. మొదట శ్రీస్వామివారికి కౌపీనము మాత్రము ధరింపజేయుదురు. క్షీరాభిషేక మొనర్తురు. క్షీరాభిషేకానంతరము కౌపీనముగూడ తీసివేయుదురు. పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, రక్తచందనపుపొడి మొదలయిన వానితో తయారుచేయబడిన పిండితో శ్రీస్వామివారి సర్వాంగములను రుద్దుదురు. మరల నీటితో నభిషేకింతురు. హారతి యొసంగుదురు. వస్త్రసమర్పణము చేయుదురు. మరల హారతి యొసంగి దర్శనము చేయింతురు.

## పసుపుముద్ద

భోగశ్రీనివాసమూర్తికి ప్రతినిత్యముపసుపు అభిషేకము నందుప యోగించుచున్నను వారము వారము ధ్రువబేరమునకు జరుగు నభిషేకములో ప్రాచీనమునుండి లేదు. క్రీ. శ. 1465 లో కందాడ రామానుజయ్యంగారిచే నీ సంప్రదాయము ప్రప్రథమముగా ప్రవేశపెట్టబడినది. నాటికి ధ్రువమూర్తి వక్షస్థలమున అలర్ మేల్ మంగతాయారు నెలకొనబడియుండలేదు. 22–5–1477లో (2–69) మొదటగా నీమె విషయమై ప్రస్తావింపబడినది. ఆ దేవికి ఒక సంధిసమయములో అన్నప్రసాద సమర్పణమునకు సంబంధించియిందున్నది. మరల ఈదేవి ప్రస్తావనము 31–8–1495 లో వచ్చును. 21–12–1496 వ (2–136) సంవత్సరము నాటి శాసనములో నీమెకు మొదటగా శుక్రవారం అభిషేకానంతరము

వారము విడిచి వారమున కన్నప్రసాదముల సమర్పణమునకు సంబంధించిన విషయమున్నది. 1-?-1506 న గల శాసనములో ధ్రువమూర్తికి అభిషేకము జరిగిన యనంతరము ఆ దేవికి అభిషేకము జరుగుటను గూర్చి గలదు. ఇది యిరువేడు కమలున నెల్లె యున్నది. 7 తులముల పసుపు ఈమెను గుఱించియే యయియున్నది. క్రీ. శ. 1583లో కుమార తాతాచార్యులుగారు పసుపును గుఱించి సామగ్రిలో ప్రస్తావనము చేయలేదు. ముదురురంగుగల కుంకుమపువ్వు ఎక్కువ అందించుటలో నీమెకు అభిషేకద్రవ్యమును అందు కలిసియేయుండెనని యూహింపవచ్చును. ధ్రువమూర్తికి పసుపు నుపయోగింతురను తప్పు అభిప్రాయమును తొలగించుటకే దీని ప్రస్తావనము చేయవలసివచ్చినది.

## పచ్చకర్పూరము

అభిషేకము పులుగుకాప్పు అయిన తరువాత పచ్చకర్పూరము, కస్తూరి యీ రెండు ద్రవ్యములను అలంకరణములో నుపయోగింతురు. దీనిని తిరుమణికాప్పు లేక ధ్రువబేరమున కూర్ధ్వపుండ్రము ధరింపజేయుట అందురు. ప్రతి శుక్రవారం 16 తులముల పచ్చకర్పూరముతో శ్రీవారియూర్ధ్వపుణ్డ్రము నలంకరింతురు. బ్రహ్మోత్సవదినములలో దీని పరిమాణము రెట్టింపు అనగా 32 తులములుండును. ఇది ప్రాచీనసంప్రదాయముగా గాన్పింపదు, 15 వ శతాబ్దము మధ్యభాగములో నిది వచ్చియుండును. ఇది మొదటగా నుత్సవమూర్తికి వాడిరి, క్రీ. శ. 1380 వ సంవత్సరములో నొక శాసనములో తిరుమంజనము మలయప్పస్వామి వారికి దేవేరులకు జరుపుటకు నువ్వులనూనె, చందనపుకాప్పు, కస్తూరికాప్పు, కర్పూరకాప్పు, కుంకుమకాప్పు వస్తువులను సరఫరా చేసిరి. ఈ సమయముననే పచ్చకర్పూరము, కస్తూరి ఉపయోగించుట మొదలయ్యెను దీనినిగుఱించి కొంత వివరింపబడును. 1000 వ సంవత్సరప్రాంతములో ముద్దకర్పూరము హారతిగా నుపయోగించిరని పేర్కొనబడినది. క్రీ. శ. 1380 లో మాత్రమే పచ్చకర్పూరము హారతి కుపయోగించుట మొదల

యినదని పై శాసనమువలన తెలియుచున్నది. ఆ కారణముచే నలంకరణమునకు, పూజార్థముపయోగించెడి తీర్థమందు దీనివినియోగము తరువాత కాలములోనని యూహింపవచ్చును. మూడువిధములయిన కర్పూరములున్నవి.

ఫార్మోజా కర్పూరము, బోర్నియో కర్పూరము, బ్లూమియా కర్పూరములు. వీనిలో బోర్నియో కర్పూరము పచ్చకర్పూరము. అధికమైన వెల కలది. సుమిత్రాదీవులలో కాంఫొరావృక్షపు కొమ్మలనుండి ఇది తయారగును. ఇది సన్నిధిలో నెక్కువ పరిమాణములో వాడబడుటయు, మండెడు స్వభావముకలదియు నగుటతో హారతి యనంతరము నీటిలో వైతురు. నేటికిని యిట్లే శ్రీవారి ఆలయములో కొనసాగుచున్నది. ఈ కారణముగా నిక నెట్టి నిప్పంటుకొను నవకాశము నుండదు.

## కస్తూరి

ఇది కస్తూరి మృగముయొక్క నాభినుండి లభించును. ఇందు మూడు విధములు గలవు. కామరూప కస్తూరి, ఇది నల్లగానుండి మంచి విలువకలిగినది. చైనా, టిబెట్లలో దీని యుత్పత్తియెక్కువ. నేపాలు కస్తూరి. ఇది మధ్యమవిధము. కాశ్మీరపు కస్తూరి ఇది అధమస్థాయికి చెందినది. ఇదికాక కస్తూరి వృక్షములు పంజాబులోను, హిమాలయములోను, పశ్చిమ టిబెట్టులోను పెరుగును. ఈ వృక్షముల కుండు నాకులు గాఢమగు కస్తూరి వాసన కలిగియుండును. దీనిని విగ్రహముల కుపయోగింతురు. శ్రీకృష్ణుడు కస్తూరీతిలకాంచితుఁడు గదా. ఇది వారమునకు 1½ తులములు శ్రీవారి నామములో నుపయోగింతురు. బ్రహ్మోత్సవ సమయములలో దీని పరిమాణము రెట్టింపు. అనగా 3 తులములన్నమాట.

## అన్నప్రసాదములు

అభిషేకానంతరము నివేదించెడి అన్నప్రసాదములకు సంబంధించిన కొన్ని శాసనములున్నవి.

(1) 1496 లో అప్పాచి అన్నా అయ్యంగారు రెండు అతిరసప్పడులకు సమర్పించిన శాసనము.

(2) క్రీ. శ. 1506 లో శిత్తముశెట్టి 'నాయిగతశిగై' 1. అప్పాపడి 1. వీనికి సమర్పించిన శాసనము,

(3) క్రీ. శ. 1534 లో బండారము శిరుతిమ్మయ్య 1. వడపడికి సమర్పించిన శాసనము.

(4) క్రీ శ. 1558 లో రాయసము కోనప్పయ్యర్ 2 అతిరసప్పడులకు సమర్పించిన శాసనము.

(5) క్రీ శ. 1583 లో కుమార తాతాచారియార్ సమర్పించిన అప్పాపడి (1) వడపడి (1) గోడిపడి (1) ఇడ్డిలిప్పడి (1) శాసనము.

ఈ అభిషేక సమయములోను నివేదనములకు అనేక సమర్పణములుండెడివని దీనివలన తెలియుచున్నది.





శ్రీ వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవము

# తిరుపతి చరిత్రము

## 2-వ భాగము



# దిగువ తిరుపతి





రుక్మిణీ, సత్యభామాసమేత శ్రీపార్థసారథిస్వామివారు

# 10 వ అధ్యాయము

## 1. తిరుపతి—గోవిందరాజస్వామివారి ఆలయము

శ్రియః పతియగు శ్రీనివాసుఁడు వైకుంఠమునుండి సర్వజీవుల కాముష్మిక ఫలప్రాప్తినందింప నిర్ణయించి, తానుగా సర్వపాప దహన స్వరూపముగా భువిపై వెలసిన వేంకటాచలముపై నెలకొన్న విషయమును, శ్రీవారి సత్యస్వరూపమును, ఆయన వైభవమును సంపూర్తిగా నెఱింగియున్నాము. దీని యనంతరము దిగువ తిరుపతి చరిత్రము, నటఁగొలువున్న దేవతామూర్తుల వైశిష్ట్యమును నిఁకనీ యధ్యాయమున తెలియ బోవుచున్నాము.

9 వ శతాబ్దములో పల్లవులు దక్షిణదేశమును బాలించిన సంగతి తెలిసికొని యున్నాము. వీరి తరువాత చోళులు వీరి రాజ్యమాక్రమించిరి. పల్లవులు వైష్ణవ మతాభిమానులుకాగా చోళులు శైవము నభిమానించిరి. ఆ సమయములోనే తిరుచ్చకనూరులో నున్నట్టి 'తిరువిలాన్‌కోయిల్‌లో' నుండి శ్రీవారి మూర్తికి ప్రాతినిధ్యము వహించుచున్న విగ్రహము యునికికి శైవులచే ప్రమాదమును శంకించిన వైష్ణవులు తమమతము మార్పిడి కార్యకలాపములను తిరుమలకు మార్చుకొన నిశ్చయించిరి. వీరి ప్రయత్నమునకు దైవము తనకు తాను తోడ్పడినట్లుగా మఱియొక సంఘటన జరిగినది. 966 సంవత్సరములో 'సామవాయి' మహారాణి అను నామె రజిత భోగ శ్రీనివాసమూర్తిని తిరుమలలోని శ్రీవారి ఆలయములో ప్రతిష్ఠించుటయే ఆ సంఘటన. ఆ ప్రతిష్ఠాకార్యక్రమము శ్రీవైఖానస శాస్త్రవిధానమున జరిగినదను విషయము పాఠకులు తెలిసికొనియేయున్నారు. ఇది యట్లుంచి 'తిరుచ్చకనూరు' (తిరుచానూరు)లో నున్న తిరువిలాన్‌కోయిల్‌స్వామి, మతము మార్పిడి స్థలములో నున్న విగ్రహము, 'తిరువేంగటనాథుని ఈ విగ్రహము అన్నియు నొక విధ

ముగా వైష్ణవులచే పూజాకార్యక్రమములలో పాల్గొనబడుచు తిరుమల శ్రీవారి స్వరూపమునకు ప్రాతినిధ్యము వహించునవి వే. కాని వీని ప్రతిష్ఠావిధానము వేఱు. ఇది పాంచరాత్రాను సారము. అప్పటికి ప్రఖ్యాతిలో నున్న వైష్ణవ మతాచార్యుఁడగు ఆళవందారుచే అనుసరింపబడిన విధము ననుసరించియే ప్రతిష్ఠ, పూజాదులు నిర్వర్తింపబడెను. తిరుమలలో వైఖానసముండుటతో నీ రెండు మతముల నడుమను ముందు ముందునెట్టి విభేదములు పొడచూపు నోయని శంకించిరి. దీనితో ముందుగనే తమ కలాపములను తిరుమలపై నిర్వర్తించుటలో కొండ పైగల యర్చకులతో కొంతరాజీమార్గమునుకూడ రూపొందించుకొని యుందురనుటలో సందేహములేదు. దీనికి తోడు తిరుమలలో రజిత భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠింప బడుటతో తిరుచుకనూరులోని ఆలయములకు ప్రాధాన్యము సహజముగనే తగ్గజొచ్చినది. 1000 వ సంవత్సరములో 'రాజరాజమూవేంచవేలన్' 1 వ రాజరాజు కాలమున సమర్పించిన దాన శాసనము తప్ప తరువాత కాలములో నీ యాలయములకు మఱి యితర సమర్పణములు జరగియుండలేదు. 1220 వ సంవత్సరములో 3 వ రాజ రాజు నాలుగవ సంవత్సర పరిపాలనా కాలములో సమర్పించిన యొక దాన శాసనమున్నది కాని అది తిరుచుకనూరులోని కృష్ణస్వామి వారికి సమర్పించినట్టిది.

ఇంతకు పూర్వము యాత్రికులు తిరుమల కేఁగక కేవలము తిరుచుకనూరులోని 'తిరువిలాన్‌కోయిల్' లోగల శ్రీవారిని దర్శించి, యాతదుపరి కొండ మొదటనున్న అడిపడికి నొక్క మ్రొక్కువెట్టి తమ యాత్ర సంపూర్తియయినట్లు సంతృప్తివహించెడివారు. తిరుచుకనూరులోనిఆలయములలోని కార్యకలాపములు, వాని విగ్రహముల మార్పులు నివి యన్నియు తిరుమలకొండకేఁగు యవసరము యాత్రికులకు తెచ్చి పెట్టినవి. దీనికితోడు తిరుమలలో రజిత శ్రీనివాసమూర్తి విగ్రహము నూతనముగా ప్రతిష్ఠాపితమయ్యెను. ఇదియును యాత్రికులు తప్పని

సరిగా తిరుమలను దర్శింప నవసరము గల్గించినది. ఏ తత్ఫలితముగా తిరుమలయాత్రను ప్రోత్సహించుట, తిరుమల పావిత్ర్యమును రక్షించుట యివి తక్షణావసరములయ్యెను. ఒక క్రొత్తగ్రామమును కొండ దిగువన స్థాపింప నావశ్యకత కల్గెను. కాని అంతకు పూర్వమే తిరుమలకొండ దిగువన నేడు ఆళ్వారు తీర్థముగాఁ (కపిల) బిలువబడుచున్న ప్రదేశమునకు సమీపమున కొత్తూరు అను గ్రామమున్నది. ఈ గ్రామమునకు దక్షిణముగా నాడు శ్రీ పార్థసారథిస్వామి ఆలయముకలదు. ఈ గ్రామమునకు సమీపముననే తిరుమలలో శ్రీవారికి అర్చకత్వము నెఱపుచున్న వైఖానసార్చకస్వాముల గృహములు నుండెడివి శ్రీపార్థ సారథిస్వామివారికిని వీరే అర్చకత్వము నెఱపుచుండెడివారు.

దీని వలన 'తిరుపతి' పట్టణ నిర్మాణావశ్యకత యెట్లు కలిగినది తెలిసికొని యున్నాము.

## 2. తిరుపతిపట్టణ స్థాపనము

శ్రీమద్రామానుజుఁడు తిరుమలనంబికి మేనల్లుఁడు. ఈయన ఆళవందారుకు ప్రియతమ శిష్యుఁడు. సకలశాస్త్రపరిజ్ఞాతుఁడు వైష్ణవ మతమునకు విస్తృతప్రాతినిధ్యమును రాజకీయముగా, నాధ్యాత్మికముగా సమకూర్చిపెట్టిన మహామహుఁడు శ్రీమద్రామానుజుఁడు. ఇట్టి విశేష గుణవిఖ్యాతుఁడైన ఈయనకు 1130 వ సంవత్సరమునందొక క్లిష్ట పరిస్థితి యేర్పడెను. చిదంబరములో నతిప్రాచీనముగా ప్రతిష్ఠింపబడిన శ్రీగోవిందరాజస్వామివారి ఆలయము కలదు. నాఁడు దక్షిణదేశమును 1 వ కుళోత్తుంగచోళుఁడు పరిపాలించుచుండెను. ఈయన శైవమతాభిమాని. ఆ కారణముగా చిదంబరములోని గోవిందరాజస్వామి విష్ణు స్వరూపమగుటచే నాయనకు క్షీరసముద్ర (పాలకడలి) శయనుఁడని పేరుండుటతో తగినప్రదేశ మాయనకు సముద్రముగా నిర్ణయించి, యా విగ్రహమును సముద్రమున త్రోయించెను. ఆ విగ్రహమును రహస్య

ముగా తిరుపతిలోనున్న రామానుజుని కడకు చేర్చిరి. కాని రామానుజులు శిష్యులతో, తన కూరిమి శిష్యుఁడగు 'కురత్తాళ్వారు' చోళ రాజుచేఁ బీడింపబడి యుపద్రవములకు గుఱిచేయబడుటచే, చోళదేశమును వీడి హోయసాల (మైసూరు) రాజులకడ ప్రవాసముండుట తటస్థించినది. ఈ కారణముగా నీ విగ్రహమును వెంటనే ప్రతిష్ఠించుటకు వారికి వీలుకాలేదు. చోళరాజు మరణించునంతవరకు తిరిగి రామానుజులు తన శిష్యులతో దక్షిణదేశమునకు రాలేదు.

రామానుజులవారు ప్రవాసములో నుండినప్పటికిని గోవిందరాజ స్వామివారి ప్రతిష్ఠాకార్యమును జరిపించుట కనువగు ప్రదేశమును గుఱించి యాలోచించుచునేయుండెను. ఆయనకు అప్పటికి గ్రామముగా నున్న కొత్తూరుకు సమీపములోని శ్రీపార్థసారథిస్వామి ఆలయ ప్రాంతము సరియగు స్థలముగాఁ దోఁచెను. కులోత్తుంగచోళునిమరణము తరువాత దీని ప్రయత్నము సలుపుటకు రామానుజుల కవకాశముచిక్కినది. అదియుఁగాక తిరుమలచేరెడి యాత్రికులు ఈ క్రొత్తగా నిర్మింపబడనున్న గ్రామమునఒకటి రెండు దినములాగి స్వామివారిని సేవించుకొనవచ్చును. ఇచటనే భోజన భాజనాదులను నిర్వర్తింపవచ్చును. ఆళ్వారు (కపిల) తీర్థమున పవిత్రస్నానపూతులును గావచ్చును. ఇట్టివి యాత్రికుల ప్రయాణములో వివిధదశలుగా నుండగలవని భావించెను. ఈప్రయత్నమునకు తిరుమలలో భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠానంతరము రమారమి 175 సంవత్సరములకాలమునకు శ్రీరామానుజుఁడు హేతువు గావలసివచ్చెను. ఈ నూత్నగ్రామమునకు నాలుగు రాజవీధులు, ఒక ఉత్తరమాడవీధి, ఒక సన్నిధివీధి యుండునటుగా నీయనయే ప్రణాళిక రచించెను. కనుకనే కాలోలు దీనిని మొదటగా 'రామానుజపురమ'ని పిలిచిరి. దీని విషయమై యేవిధమయిన శాసనప్రమాణముసు కానరాదు. కాని 1224 లో తిరుపతిలో శ్రీరామానుజునిసన్నిధి ఆలయపుఁ బునాది దక్షిణపశ్చిమపు గోడలపైగల శాసనమును బట్టియు, తిరుమలనంబి

సన్నిధి తరువాత సీతనిసన్నిధియుండుటఁ బట్టి, తిరుపతిలోని ఆలయపు లోపలి ప్రాకారపుగోడలు, గోపురము, ప్రధానాలయము—ఇవియన్నియు రామానుజుని కాలములోనే నిర్మింపబడినట్లూహింపవలసి యున్నది. ఇఁక సీశాసనములో ప్రత్యేకించి రామానుజునిసన్నిధిలో దీపములువెలిగించుటకు పుష్పములనుదెచ్చుటకు మాత్రమే ఈరామానుజుల శిష్యులు వితరణముగా సమర్పించిన దానశాసనమువలె నున్నది. ఈ కారణముచే నిది ప్రధానాలయమునకు సంబంధించిన సన్నిధికాదని ఋజువుపఱచుచున్నది. తిరుమలనంబిఆలయమునకు ప్రత్యేకముగా నాలయనిర్వాహకుఁడున్నట్లే రామానుజుని సన్నిధికివి ప్రత్యేకముగా నిర్వాహకుఁడున్నట్లు దీనివలన స్పష్టమగుచున్నది. పార్థసారథిఆలయమున శ్రీవైఖానసార్చనమగుటచే శ్రీగోవిందరాజస్వామి ప్రతిష్ఠలోగాని, నిత్యార్చనములోగాని శ్రీరామానుజులు పాంచరాత్రమును ప్రవేశపెట్టఁదలంపలేదు. ఈ ప్రణాళిక, ఈ ఆలయనిర్మాణము తిరుకుకనూరులోని ఆలయములను నటగల వైష్ణవుల ప్రాముఖ్యము, నా గ్రామముయొక్క ప్రతిష్ఠను కొంత తగ్గించివేసినవి. కాని యిక్కడ మనయొక్క విషయము గుర్తుంచుకొనవలెను. తిరుకుకనూరులో జలపూరితములైన కాలువలు, స్వర్ణముఖీనది ప్రవహించును. ఈ గ్రామములోనే తిరుమల ఆలయపు ధర్మకర్తలు (సభవారు) ఆ గ్రామములో ఆలయనిర్వాహకులు వసింతురు. 108 మంది పండిత వైష్ణవకుటుంబము లున్నవి. ఈ కారణములచే తిరుకుకనూరుగ్రామముపేక్షించుటకు వీలయినట్టిదిగా నుండదు. ఇది యట్లుంచి తిరుపతి యభివృద్ధికరమగు పట్టణముగా నగుటకు తిరుమలతో సంబంధమున్న ప్రతివ్యక్తియు తిరుపతిలోనుండక తప్పని పరిస్థితి యేర్పడెను. ముఖ్యముగా నర్చకులు, ఆచార్యపురుషులు, పరిచారకులు, వర్తకులు - వీరు ఈ గ్రామములోనుండుట కంగీకరింపక తప్పలేదు. వీరందఱును నిట్టి యొడంబడికకు నంగీకరించినట్లున్న శాసనమున్నది.

ఏ ఆలయమైనను దాని రాబడిపై దాని యభివృద్ధి యాధార పడియుండును అట్లే శ్రీగోవిందరాజస్వామి ఆలయమునకు వచ్చు రాబడిపైననే యా యాలయాభివృద్ధి సిక్షేపింపబడినదనుకొనవచ్చును. వీరనరసింహరాయలరాణి 1219 సం॥లో శ్రీగోవిందరాజస్వామివారి ఆలయములో నఖండదీపమును వెల్గించుటకుగాను 32గోవులను సమర్పించుచు నొక దానశాసనము వేయించెను. తిరుమల ఆలయమును నిర్వహించెడి ధర్మకర్తలే శ్రీగోవిందరాజాలయమును నిర్వహించుచుండినట్లు, ఆ లెక్కలు (ఆదాయవ్యయములు) మాత్రము వేఱుగా నుంచుచున్నట్లు మనకు 1234 వ సంవత్సరములో వేయబడిన శాసనమువలన తెలియుచున్నది. ఈ వీరనరసింగరాయలరాణియే 1234 వ సంవత్సరములో మఱియొక దానశాసనము సమర్పించెను. పైడిపల్లిగ్రామపు సగము ఆదాయమును తిరుమల శ్రీవారికి సమర్పించినట్లును మిగిలిన సగమాదాయమును శ్రీగోవిందరాజస్వామి వారికి సర్వమాన్యము క్రింద సమర్పించినట్లీ శాసనములో నున్నది. ఈ ఆదాయమును శ్రీ గోవిందరాజస్వామివారికి అణి (జ్యేష్ఠ) మాసపు బ్రహ్మోత్సవము జరుపుటకు. తావింతకు పూర్వమే తయారుచేయించిన కొయ్యరథమునకు బంగారు కలశమును ప్రతిష్ఠించుటకు, దాని మరమ్మతులకు వ్యయమొనర్చుటకుగాను నిర్ణయించెను. ఇట్టి శాసనముల వలన మొదటినుండియు నీ దేవాలయమునకు ప్రత్యేకాదాయవ్యయములున్నట్లు నిర్ణయింపవచ్చును. ఈ ఆలయమునకు దినవెచ్చము మిగుల పరిమితముగానున్నట్లు తెలియుచున్నది. పర్వదినములలోను, ఇతర యుత్సవదినములలోను వచ్చెడి యాత్రికుల సంఖ్య మిక్కిలి హెచ్చుగా నుండెను. వారికి భోజనవసతులు తక్కువ. ఆ కారణముచేత గ్రామస్థులు కొంత వితరణబుద్ధి చూపించి వీరినాదుకొనవలసిన పరిస్థితి యేర్పడినది. ఇది తాత్కాలికముగా ననుసరించిన పద్ధతియయ్యెను 1254 వ సంవత్సరములో గ్రామస్థులు దీనిని శాశ్వతమగు పద్ధతిగా జేయుటకు నిర్ణయించిరి. ఆ కారణమున వైకాసి (వైశాఖ) యుత్సవములో రెండవనాటినుండి

యుత్సవాంతమువరకు నున్న 11 రోజులలోను నిత్యము 80 నుండి 100 మంది యాత్రికులకు సరిపోవు భోజనసదుపాయములు కల్పించుటకు వలయు బియ్యము వగైరాలను సమర్పించినట్లును శాసనమును వేయించిరి. 1308 వ సంవత్సరములో 'నెర్కు' గ్రామీణులు 'కైశిక ద్వాదశి', 'ముక్కోటి ఏకాదశి', 'మకరసంక్రమణము' మొదలగు పర్వ దినములలో పరిమిత వైష్ణవులకు భోజనవసతులు సమకూర్చజేయు శాసనము వ్రాయించిరి. ఆనాడు రామానుజకూటములుగాని, మఠములుగాని, కడకు అన్నవిక్రయశాలలుగాని లేకుండెను. యాత్రికుల పెంపుదలతో వారి సౌకర్యము నిమిత్తమిట్టివి రమారమి యొక శతాబ్దకాలము తరువాత నెలకొల్పబడినవి. వీనితో బాటుగా తిరుపతిపట్టణ ప్రాముఖ్యము పెరిగినది.

## 3. శ్రీ గోవిందరాజాలయ నిర్మాణము

కొత్తూరు అనుగ్రామము కొండకుదిగువున తిరుపతి పట్టణమేర్పడుటకు పూర్వమేయుండెనన్న విషయము నిదివరకే తెలిసికొనియున్నాము. ఇపుడు గోవిందరాజాలయ నిర్మాణమునుగూర్చి వివరముగా నెఱుంగుదము.

ఇది గోవిందరాజాలయ మనుటకంటె (ఉపాలయము) సన్నిధి యనుటయే యుచితము. ఇచట నింతకుఁ బూర్వమే శ్రీ పార్థసారథి స్వామివారి ఆలయము కలదు. ఇక్కడగల లోపలి గోపురమీస్వామికి సంబంధించినదే. తిరుపతిపట్టణ ప్రణాళిక నూతినము. 'తిరుపతి' ఈ ప్రదేశమునకు పెట్టబడినపేరు. శ్రీరామానుజులవారి తరువాత నిది ప్రచారములోనికి వచ్చినది. ఆలయ పరిసరములనున్న గ్రామమును రామానుజ పురమని పిలిచిరని యింతకు పూర్వమే తెలుపబడినది. శ్రీ గోవిందరాజస్వామివారీ ప్రదేశమునకు తేబడిన విషయముగూడ చర్చింపబడినది. 1120 సం॥ లో కుళోత్తుంగచోళని మరణము జరిగిన

తరువాతనే యీ యాలయనిర్మాణము జరిగియుండుటయు స్పష్టమే. శ్రీ పార్థసారథిస్వామి ఆలయమునకు ప్రక్కనే నెలకొల్పుటచే నీగోవింద రాజస్వామి ఆలయము ప్రత్యేకాలయముగా నెలకొల్పినట్లుగాకుండెను. దీనికిఁ గారణమిప్పుడున్న ఆలయమును గమనించినచో ప్రధాన గోపురముగాని, ప్రధానద్వారముగాని శ్రీ గోవిందరాజస్వామివారి నుద్దేశించి యుండక పోవుటయే.

## 5. శ్రీ గోవిందరాజాలయ నిర్మాణకాలము

డా॥ యస్. కృష్ణస్వామి అయ్యంగారు తిరుపతి చరిత్రమును రచించెను. అది ఆంగ్లములోనున్నది. అందు 1 వ భాగములోని 11 వ అధ్యాయములో రామానుజుని కాలమునుగూర్చి కొన్ని యసమగ్రపు సమర్థనములు గావించెను. రామానుజునికాలము 1017 నుండి 1137-38 వరకనునది సర్వాంగీ కృతమైన విషయము. కాని ఈయన కొన్ని యితిహాసమాలవాక్యములచేతను, గురుపరంపరావిధానముచేతను నీ కాలమును 1050-1150 గా నూహించెను. రామానుజుల జననకాలమును స్పష్టముగా గుర్తింపజాలకున్నను, ఆయన మరణకాలమును మాత్ర మాతని శిష్యులు తప్పక తమ గ్రంథములందు గుర్తింపుఁజేసికొని యుందురు. వైష్ణవ గ్రంథములాధారముగా నీయన జననకాలము 1017 వ సంవత్సరంనుండి 1137 వరకుగనే డా॥ స్వామికణ్ణుపిళ్లెగారును చెప్పిరి. రామానుజులు విస్తృతలబ్ధ ప్రతిష్ఠుఁడగు కేశవసోమయాజి పుత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. ఇదియుగాక నాటి కాలములో వైష్ణవ లోకములో నతిప్రాముఖ్యము గలిగిన తిరుమల నంబికి మేనల్లుఁడు. రామానుజుడు పుట్టిన సంవత్సరమేదియయినను, చైత్రమానము ఆరుద్రా నక్షత్రములందు జన్మించిన విషయము జగద్వ్యాప్తము. ఇవి శారీరిక సంస్కారములలో ప్రతి సంస్కారమునందును ప్రాతినిధ్యము వహించునవియే. రామానుజుని మరణకాలమును 15 సంవత్సరములు

పొడిగించుటలో కృష్ణస్వామిగారు చెప్పినవాదమేమియు కానరాదు. సాధించిన ప్రయోజనమునులేదు.

ఇదియుగాక తిరుమలలో లోపలి గోపురమున లోపలివైపున తూర్పు ప్రాకారకుడ్యమున దక్షిణపు వైపుగల ఛిద్రశాసనము నీయన పరికించియుండరు. అందుఛిద్రముగా నున్నందున యీ పదములు మాత్రమే స్పష్టముగా గానవచ్చెడిని. ఇందు ఇంగ్లీషునకు తెలుఁగు అనువాదము చూపబడినది

(1) సౌమ్యసంవత్సరములో (2) ఒకానొకదినమున (3) రామానుజ (4) ఎంబెరుమానార్

ఈ పై శాసనమంత స్పష్టముగాలేదు. కాని ఒక ముఖ్యవిషయము మాత్రము తెలియుచున్నది. శ్రీరామానుజులు 'ఎంబెరుమానార్' అను ఉత్తమ బిరుదమును, గౌరవమును సౌమ్యసంవత్సరములో నొకానొక దినమున పొందినట్లు తెలిసినది. 'ఎంబెరుమానార్' అను తమిళపదము నకు మనల నడిపించు మహానుభావుఁడని తెనుఁగులో నర్థము. ఈయన వైష్ణవుల నందఱను నతిజాగ్రత్తగా నొక్కత్రాటిపై నడిపించి యత్యున్నత కీర్తిప్రతిష్ఠలను పొందెను. ఈయన జీవితకాలములో రెండు సౌమ్య సంవత్సరములుమాత్రమే వచ్చినవి. అవి 1069 వ సంవత్సరము, 1129వ సంవత్సరములయినవి 1069 సం॥ నాటికి శ్రీరామానుజునకు 52 సంవత్సరముమాత్రమే. పెద్ద గురుతింపుగల్గిన మహానుభావుకత నీతఁడు పొందియుండక పోవచ్చును. ఈతని జీవితకాలములోనే వచ్చినరెండవ సౌమ్య సంవత్సరము 1129 నాటి కీయనకు 113 సంవత్సరములుండి యుత్తమజ్ఞాన వృద్ధుఁడై, చక్కని యాధ్యాత్మిక సౌష్ఠవము, మతా చార్య పదవి పొందియుండును. తిరుమలలోని లోపలి గోపురము రామానుజుని కాలముతరువాత 1180 లో నిర్మాణమయినది. ఈశాసన కాలము 1129-30 సంవత్సరము. 1180 లోనిర్మింపబడిన గోపురమునకు గల ప్రాకారపుగోడలపయిన నీశాసనముండుటయనునది యసంభవము.

గోపురముముందుగా నిర్మితమయిన ప్రాకారము తరువాత నిర్మింప బడినదని యింతకుపూర్వము శ్రీవారి (తిరుమల) చరిత్రలోచెప్పబడినది. ఇదియట్లుండగా శ్రీరామానుజుఁడు తన 112 వ యేట తిరుమలకు వచ్చి నట్లు తెలియుచున్నది. అది 1129-30 వ సంవత్సరము. ఈ సంవత్స రమే రామానుజునకు ఎంబెరుమానార్ బిరుదము లభించిన సౌమ్య సంవత్సరము ఈ కాలముననే శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయ నిర్మాణము స్వామివారి ప్రతిష్ఠ తిరుపతిలో జరగియుండును. రామాను జుని జనన మరణ తేదీలను మార్చనవసరము లేకుండగనే తిరుమల లోని శాసనము మనకు చక్కని ప్రయోజనము సమకూర్చిపెట్టినది.

ఇంకను మఱియొక నిర్దిష్టమైన యుపపత్తి దీనిని సమర్థించుట గాంచగలము.

శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయములోని మన్త్రపుష్పములోని శ్లోక మొకదానిలో నీ క్రిందివిధముగా నున్నది.

శ్లో॥ ఫాల్గునే మాసి పూర్ణాయాం ఉత్తరార్క్షేందువాసరే ।
గోవిందరాజో భగవాన్ ప్రాదురాసీన్మహామునే ॥

ఇందు గోవిందరాజస్వామి ఫాల్గునమాసములో పూర్ణిమాతిథిని ఉత్తరానక్షత్రయుక్తమైన సోమవారంరోజున తనకుతానుగా నుద్భవించి నట్లు చెప్పబడినది. తిరుపతిలోని యీస్వామిని రామానుజుఁడే ప్రతిష్ఠించె నన్న యూహ సరియగుచో నాయన తన జీవితకాలములోని సౌమ్య సంవత్సరములోనే ఈకార్యమును జరిగించియుండును. పై నక్షత్రము నకు, సంవత్సరమునకు, తిథికి, వారమునకు సరిపడిన ఇంగ్లీషు తేదీ 24-2-1130. క్రీ.శ. 1070 కూడ సౌమ్యసంవత్సర మయ్యును నా దినము ఫాల్గున పౌర్ణమి ఉత్తరానక్షత్రము శనివారము గాన దీనికి సరి యగునట్టిదికాదు. కనుక శ్రీగోవిందరాజస్వామి 24-2-1130 వ తేదీన ప్రతిష్ఠింపబడియుండును. ఆ కారణముగనే నాటినుండి ఫాల్గున పౌర్ణమి రోజున శ్రీ గోవిందరాజస్వామివారికి పూలంగిసేవ జరుపబడుచున్నది.

తిరుపతి ఆలయములోని లోపలిగోపురము, ద్వారములు శ్రీ పార్థసారథిస్వామి వారివిగాని గోవిందరాజస్వామివారివి గాదని మన మీవఱకే తెలిసికొనియున్నాము. తూర్పు పడమరలకు ఈ ప్రాకారపు గోడలు 263' పొడవున్నవి. 'ఉత్తరదక్షిణములకు 186' (పొడవు)గలవు. ప్రధానగోపుర ద్వారము శ్రీపార్థసారథిస్వామివారి ఆలయమున కెదురుగా నున్నది. గోవిందరాజస్వామివారిని ఈ యాలయము ప్రక్కన నెలకొల్పిన యనంతరమే ప్రాకారకుడ్యములు కట్టబడినవో లేక యంతకు ముందే నిర్మాణమయ్యెనో తెల్పుటకేవిధమయిన ఆధారముల గానము. ఏమైనప్పటికిని లోపలి గోపురపు వెలుపలనున్న కుడివైపు బోరుతలుపు నానుకొనియున్న గోడకుగల శాసనమునుబట్టి యీ ప్రాకారకుడ్యములు 1219 సం॥నకు పూర్వమే నిర్మితమయ్యెనని చెప్పగ-ము. గోవిందరాజాలయమున ప్రతిష్ఠాదుల నిర్వర్తింపక పూర్వము శ్రీపార్థసారథిస్వామి వారి ఆలయమునకు ప్రాధాన్యముండుటలో నాశ్చర్యము లేదు. కాని ఈ ప్రతిష్ఠాదులయిన తరువాత కొంతకాలమున కేలనో యీ యాలయపు తలుపులు శాశ్వతముగా మూయబడినవి. కొందఱు చెప్పునదేమన, విగ్రహమునకేదో భిన్నమయినదని ఆకారణముచే నాలయము శాశ్వతముగా మూయబడెనని చెప్పుదురు. దీనికి సంబంధించిన ఆలయపు ధ్వజస్తంభము, బలిపీఠము ఆ స్థానమునుండి తొలగింపబడినవి. నేడీ స్వామికి అర్చనములేదు. ఈఆలయమునకు సంబంధించిన గరుడాళ్వారు విగ్రహము లోపలిప్రాకారమునంటి ప్రత్యేకముగా నుండుటను గమనింపగలము. 1180-1217 సంవత్సరముల నడుమభాగముననే తిరుమల లోని లోపలిగోపురపు కుడ్యములు నిర్మాణమయినట్లుగను దీనికి హేతుభూతుఁడు యాదవరాయలనియు తెలిసికొనియున్నాము. ఆతడే వీని నిర్వహణ బాధ్యతను సైతము స్వీకరించియుండనగును.

తిరుపతిలోని వెలుపలిగోపురపు ప్రాకారకుడ్యములు, వాని గోపురము నిర్మాణకాలము తెలిసికొనవలసియున్నది. 1220 సంవత్సరము నాటికి లోపలిగోపురపు వెలుపలి భాగమున రామానుజసన్నిధి వెలసి

యున్నట్లు ఈ ఆలయమున గానవచ్చెడు శాసనమువలననే తెలియ వచ్చుచున్నది. కాని శాసనము పునాదిగోడలపై నుండుటతో ప్రాకారపు గోడలు కట్టబడిన కాలము నూహించుట కష్టమగుచున్నది. 1220 వ సంవత్సరములో రామానుజుని ఆలయము ప్రత్యేకముగానుండి శ్రీగోవింద రాజాలయమునకు నిర్వహణముతో నెట్టి సంబంధము లేకుండెను.

లోపలిగోపురపు వెలుపలిగోడకుగల శాసనము మనకు ప్రాకారపుగోడలు, గోపుర నిర్మాణకాలమును కొంతవఱకు తెలుపుచున్నది. ఈ శాసనము శాలై (ఉగ్రాణపు అధిష్ఠానదేవత) నాచ్చియారు సన్నిధి కెదురుగానున్న ఉత్తరపువైపు లోపలిప్రాకారమున వెలుపల కనుసంధింపబడిన నడవలో నున్నది. శాసనకాలము 21—2—1457. ఈ సన్నిధికి గల దక్షిణపువైపుగోడ లోపలి వెలుపలి గోపురపు గోడలననుసంధించి యుండుటచే నీ వెలుపలి ప్రాకారపుగోడలు 1457 సంవత్సరమునకు పూర్వమే యమర్చబడినట్లు స్పష్టమగుచున్నది.

దీనినిబట్టి ఈ యాలయము క్రమానుసారిపి నిర్మాణపురోభివృద్ధినందినదన్న సంగతి విస్పష్టముగాఁ దెలియుచున్నది. గోవిందరాజ స్వామి ఆలయప్రతిష్ఠ, స్వామిప్రతిష్ఠాకాలము 1130 వ సంవత్సరము. 1219 వ సంవత్సరము లోపలిగోపురముల నిర్మాణకాలము. రామానుజుని ప్రతిష్ఠాకాలము 1220 వ సంవత్సరము. దీని తరువాత 1230 వ సంవత్సరములకుగాని బాహ్యప్రాకారపుగోడల, గోపురములనిర్మాణము జరుగలేదు. ఇది 1457 వ సంవత్సరమని యింతకు పూర్వమే తెలుపఁబడినది. 1330 వ సంవత్సరము నాటినుండి ఈ ఆలయములకు అన్నప్రసాద సమర్పణములకు సంబంధించిన దానశాసనము లనేకములు గలవు. వీనిలో నుత్సవసంబంధమయిన దానసమర్పణములున్నవి. విజయనగరసామ్రాజ్యము తనకాలిమీద తాను నిలబడగలిగినంతవరకు గల మధ్యకాలములో శ్రీగోవిందరాజస్వామివారి ఆలయములోను, మరి యితర ఆలయములలోను నిత్యపూజ, అన్నప్రసాదములకు సంబంధించినంతవరకు సంతృప్తికరమగుస్థితి యున్నది.

గోపురప్రాకార కుడ్యములతోబాటు ఈ గోవిందరాజస్వామివారి ఆలయమునకు సంబంధించిన యితర విషయములనుకూడ తెలిసికొన వలసియున్నది అవి శ్రీస్వామివారి సన్నిధికి చేరుటకుగాను చిత్రకూట మంటపములోనున్న ద్వారమున కిరువైపులనున్న ద్వారపాలురు, గరుత్మంతుని ఆలయము, ధ్వజస్తంభ బలిపీఠములు హనుమదాలయము, గోవిందరాజస్వామివారి వినియోగమునకై ప్రత్యేకముగా నిర్మాణము గావింపబడిన ఒకటి రెండు మంటపములు ఇవి అన్నియు నేడు మనకు కనపడు స్థానములో పూర్వమునుండి యుండలేదు.

## 4. ద్వారపాలకులు (1549)

శ్రీ గోవిందరాజాలయముతోను, శ్రీస్వామివారి ప్రతిష్ఠావిధితోను ఆ కాలముననే నీ ద్వారపాలకులను నెలకొల్పియుందురని మనము సహజముగా భావింతుము. కాని జరిగిన విధమింకొకటియైనది. ఈ ద్వారపాలకులు శకసంవత్సరము 1470 కు సరియగు కీలకసంవత్సర ఫాల్గున బహుళపంచమి సోమవారం నాడు (1549) ప్రతిష్ఠింపబడినవి దీనిని ప్రతిష్ఠింపఁజేసిన మహానుభావుఁడు నంద్యాల నారాయణప్ప. ఈయనయే అంజూరు మండలములోని (చిత్తూరుమండలము) గుండిపూండి, నగరి సీమలోని పల్లిపట్టుగ్రామములను క్రొత్తగా ప్రతిష్ఠించిన యీ ద్వారపాలకులకు నిత్యము అన్నప్రసాదసమర్పణమునకై సమర్పించుచు శాసనము వేయించెను.

## 5. ప్రాఁత ధ్వజస్తంభము

సిద్దలూరు నివాసియగు రాజా శ్రీ రామజీ మదరసుపంతులు దీనిని నెలకొల్పెను. దీని కాలము పేర్కొనఁబడలేదు. కాని నేడు బంగారపుపూత బూయబడిన క్రొత్త ధ్వజస్తంభమున్నది. ఇది మొదటి ధ్వజము శిథిలముకాగా తరువాత కాలములో వేయబడినది కావచ్చును.

## పెద్దగోపురము (క్రీ. శ. 1628 సం॥)

దేవచోళుల వంశములోని మట్ల కుమార అనంతరాయలు సన్నిధి వీధిలోని ప్రధానగోపురమును కట్టించెను. ఈతని వితరణములలో నిది ఆర్థికముగాను, కీర్తిప్రతిష్ఠలలోను ప్రముఖస్థానము వహించినది.

ఈ మట్ల కుమార అనంతరాయలను గూర్చి మనము కొంత యెఱుంగవలసియున్నది.

ఈతఁడు మట్ల యల్లమరాజు కుమారుఁడు. అమిత శూరుఁడు. 1584—1614 సం॥ నడుమగల రెండవ వేంకటపతిరాయల పక్షమున పెక్కు యుద్ధములలో పాల్గొని తన పరాక్రమమునకు చిరయశస్సు కూర్చిపెట్టుకొనెను. సిద్ధవటశిలాశాసనములో (1605) నీ విషయము లన్నియు నీయన తెలుపుకొనెను తనకు చేసిన సేవలకుగాను కుమార అనంతరాయలకు సిద్ధవటాది గ్రామములను వేంకటపతిరాయలు నాయంకరముగ (పాళెగాడు) నొసఁగెను తిరుపతి నుండి తిరుమలకుబోవు యాత్రికుల కాలిబాటలో మొదటగా గాన్పించెడి గోపురమునకు మట్ల అనంతరాయ గోపురమనియే పేరు. ఈయన ఈ దేవాలయముల అభివృద్ధికై మిక్కిలి కృషిచేసిన వారిలో ప్రాధాన్యము గడించినవాడు చెక్కడపు రాయితో అనంతరాయలు తిరుమలకు మెట్లుపునర్నిర్మించెను.

## హనుమదాలయము (1509)

క్రీ. శ. 1509 వ సంవత్సరములో "కారవాట్టిప్పులి అళ్వారు అప్పాపిళ్లై" అను నాయన దీనిని కట్టించెను. నిత్య అన్నప్రసాదముల సమర్పణములకు నేర్పాటు గావించెను ఇది గోవిందరాజస్వామిసన్నిధి వీధికి చివరన రథమున్నవీధిలో దేవాలయము ఎదురుగా నున్నది.

## వసంతమంటపము (క్రీ. శ. 1494)

క్రీ. శ. 1494 నకు పూర్వము అహోబిలమఠాధిపతియగు వనశఠ గోపజియ్యరు నిర్మించెను. ఇది ప్రారంభములో వసమగ్రము. బాహ్య గోపురమునకు ముందుగానున్నట్టిదీ వసంతమంటపము. దీనిని సమగ్రముగా తరువాత 'నల్లార్ అంగాండి' అను నాయన దేవస్థానమునకు 2000 పణములను నష్టపరిహారముగా చెల్లించి తన సొంతసొమ్ముతో పూర్తిచేసిన మహానుభావుఁడు. దీనితో స్వామివారికి వసంతోత్సవము జరుపుటకు దానశాసనమును సమర్పించెను.

## గోవిందరాజస్వామి ఆలయముముందు మంటపము (క్రీ.శ.1494)

వేదాంతదేశికులవారి సన్నిధికి సమీపమునున్న నాలుగుకాళ్ల మంటపమిది మహామండలేశ్వరేత్యాది బిరుదాంకితులగు నరసరాజ ఉడైవరులు దీనిని కట్టించిరి. ఇందు జరిగెడి ప్రతియుత్సవమునకును అన్నప్రసాద సమర్పణమునకు సంబంధించిన శిలాశాసన మీయన వేయించెను.

## నీరాళిమంటపము (క్రీ. శ. 1506)

హనుమదాలయ నిర్మాణకారుఁడు, శ్రీకృష్ణదేవరాయల వారి సేనానులలో నొకడగు కారవట్టిప్పులియాళ్వారు అనునాయన కుమారుడు, అప్పాపిళ్ళె మొదటి ప్రాకారములోనే వంటశాలకు సమీపమున దీనిని నిర్మించెను. ఈ మంటపముచుట్టును వినియోగింపబడిన నీరు నింపబడుటచే నిదిచూచుటకు నీటిచే నావరింపబడిన మంటపముగా గానవచ్చును. ఆ కారణముననే దీనికి నీరాట్టి (నీళ్లుండెడి) మంటపమని పేరుంచిరేమో! జ్యేష్ఠమాసోత్సవములలోను, (వైశాఖ) వైకాసి యుత్సవములలోను 12 రోజులు ఉత్సవమూర్తులు నీరాట్టి (నీరుండెడి) మంటపమందు అస్థానమునకై ంచేయుదురు. ఆసమయములో సమర్పింపబడు ప్రసాద

నివేదనముల వ్యయమునకు దానశాసనమునుసమర్పించి యీఅప్పాపిళ్లై ధన్యత గాంచెను. ఇది పూర్వముపయోగములో నుండెడిది. దానికి కారణమునాడెట్టి పుష్కరిణిగాని, దానిలో మంటపముగాని లేకుండుటయే. ఇప్పుడీ మండపమందెట్టి యుత్సవములు జరుగుటలేదు. ఇది 1522 వ సంవత్సరము వరకు నుపయోగింపబడెడిది. ఆ సంవత్సరములోనే "గోవింద పుష్కరిణి" యేర్పాటు కాబడినది.

## గోవిందపుష్కరిణి (కృష్ణరాయ కోనేరు) (క్రీ. శ. 1522)

ఈ పుష్కరిణి విషయము మొదటగా 1522లో ఒకశాసనములో పేర్కొనబడినది. సాళువతిమ్మరుసు సోదరుడును, శ్రీకృష్ణదేవ రాయల అధికారులలో నొకరగు రాచిరాజు కుమారుడగు గోవిందరాజు ఒక చిన్నఆలయమును గోపాలకృష్ణస్వామి వారి కొఱకు గోవిందపుష్కరిణీతీరమున కట్టించెను. నిత్యధూపదీప నైవేద్యాదులకు దానశాసనము వ్రాయించెను. క్రీ శ. 1530 లో మార్గశి (మార్గశిర, ధనుర్మాసము) మాసములో శ్రీ ఆండాళ్లకు (గోదాదేవి) ప్రత్యేకముగా నీరాటోత్సవము జరుపుటకుగాను గోవిందపుష్కరిణీతీరమున నొక ప్రత్యేకమంటపమును దేవస్థానము లెఖ్ఖలతనిఖీ అధికారులలో 'విల్లియార్' అను నాయన కట్టించెను. తరువాత శిథిలమయిన యీ మంటపము దేవస్థానము మహంతుల పరిపాలన చివరికాలములో పునరుద్ధరింపబడినది గోవిందపుష్కరిణి, కృష్ణరాయకోనేరు ఈ రెండుపేళ్లు నీ పుష్కరిణికే అన్వయించును.

०

## చిత్రకూట మంటపము (క్రీ. శ. 1493)

० శ్రీ స్వామివారి ఆలయమునకు ముందున్న ద్వారపాలకులు నెల కొన్న మంటపమును చిత్రకూటమంటపమందురు. ఇది తూర్పువైపున గరుడాళ్వారు సన్నిధితో ననుసంధింపబడినది. ఈ మంటపము రెండు భాగములు. సన్నిధికనుసంధింపబడిన భాగము గరుడాళ్వారు

కనుసంధింపబడిన భాగము నేలకంటే ఎత్తుగానుండును. ఇది యే యీ మంటపము రెండుభాగములని చెప్పుటకు, రెండు వేర్వేరు కాలములలో నిర్మింపబడినట్లు చెప్పుటకు వీలగుచున్నది. 1493 లో సన్నిధి కనుసంధింపబడిన మంటపము నొక్కదానినే చిత్రకూట మంటపమనిరో లేక గరుడాళ్వారు సన్నిధిలో నున్నదానినికూడ కలిపి మొత్తముగాఁ జిత్రకూట మంటపమనిరో చెప్పలేము.

## లక్ష్మీదేవి మండపము (క్రీ. శ. 1542)

కార్తికోత్సవములో శ్రీగోవిందరాజస్వామివారి ఉత్సవరులకు దేవేరులతోసహా తిరుమంజనము జరిపిన యనంతరము నివేదన ప్రసాదములకు సంబంధించి గంగురెడ్డి అను నాయనచే 1542లో ఏర్పాటుచేయబడిన దానసమర్పణ శాసనములో నీ మంటపము ప్రసక్తి గలదు. 1537 వ సంవత్సరములో నేముశెట్టి అనునాయనచే గోవిందరాజస్వామి సన్నిధిలో లక్ష్మీదేవి యుత్సవ మేర్పాటుచేయబడినది. కనుక నీమంటపము 1537 వ సంవత్సరము తరువాత నిర్మితమైయుండునని మనమూహచేయవచ్చును. ఇది పూర్వము పేర్కొన్న వసంతమంటపమునకు అనుబంధితమయినదే.

ఈ పైవన్నియు శ్రీగోవిందరాజస్వామివారి ఆలయమునకు అంతరంగమున నున్నట్టివి.

## శ్రీగోవిందరాజస్వామి ఆలయపుటాదాయము (క్రీ. శ. 1130- 467)

1130 వ సంవత్సరములో నీ ఆలయము ప్రతిష్ఠింపబడిన తరువాత 1234 వ సంవత్సరము వరకు నీ యాలయాదాయమును గురించి మనకేమియు తెలియదు. 1219 లో వీరనరసింగయాదవరాయల రాణి. ఆలయములో (నందవిలక్కు) నఖండదీపమునకు గాను 32 గోవులను ఒక

ఎద్దును దానమిచ్చెను. 1234 వ సంవత్సరములో శ్రీవీరనరసింగరాయులు పైండిపల్లి గ్రామములోని సగభాగమునకు వచ్చు ఆదాయమును శ్రీగోవిందరాజస్వామివారి జ్యేష్ఠమాసోత్సవములకు, ఆలయరథమునకు బంగారుశిఖరమునకు, ఇతరమగు మరమ్మతుల వినియోగార్థమై దాన శాసనము వ్రాయించెను. మిగిలిన సగభాగములోని ఆదాయ మింతకు మునుపే తిరుమల శ్రీవారికి సమర్పింపబడిన విషయము తెలిసికొనియే యున్నాము. దీనినిబట్టి నిత్యపూజకు తగినంతస్థితి గోవిందరాజస్వామి వారికి కలిగియే యుండెననియు ఆ స్థితికి తరువాతనే యుత్సవములకై యీ మహారాజు దానశాసనము వ్రాయించియుండెనని యూహింప వీలగు చున్నది. శ్రీగోవిందరాజస్వామివారికి 'పెరియమాంబట్టు' (తిరువిదైయాట్టమ్) గ్రామమును సమర్పించుచు 1255 లో దానశాసనము వ్రాయబడినది. కాని ఈ శాసనమును సమర్పించిన వారెవరో మనకు తెలియుటలేదు.

ఈ ఆలయము సమీపములోని 'నెర్కు' గ్రామస్థులు కైశిక, మార్గశిర ద్వాదశులలోను, మకరసంక్రమణాది పర్వదినములందును యాత్రికులకు భోజనసదుపాయములు సమకూర్చుటకు దానశాసనము వ్రాయించిరి. ఈ శాసనకాలము 1308 వ సంవత్సరము. మార్గశిరమాసములో తిరుమల శ్రీవారి ఆలయములో 'తిరుప్పావు' పఠనమునకును, శ్రీగోవిందరాజస్వామివారి ఆలయములో అధ్యయనోత్సవముల సందర్భముగా పదిరోజులును అన్నప్రసాద కైంకర్యముల నిమిత్తము మూల్లై తిరువేంకటజీయ్యరు అను వైష్ణవుడు దానశాసనసమర్పణము గావించెను. శాసనకాలము 1390. కొల్లికావలిదాసర్ ప్రతినిత్యము గోవిందరాజ స్వామివారికి ఒక తిరుపోణకము ప్రసాదనివేదనమునకు శాసనము వ్రాయించెను. ఈ శాసనకాలము 1387 వ సంవత్సరము. కరుణాకరదాసరు నిత్యము శ్రీగోవిందరాజస్వామివారి అన్నప్రసాద కైంకర్య నిమిత్తమై దానశాసనమును 1442 లో సమర్పించెను.

పై విషయములన్నిటిని పరిశీలించినచో 15 వ శతాబ్దము మధ్య భాగమువరకు తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామి ఆలయమునకు ప్రాముఖ్యమంతగా నున్నట్లు గానరాదు. చోళులుగాని, పాండ్యులుగాని యీ యాలయముపై ప్రత్యేక శ్రద్ధయును జూపలేదు. వీరనరసింగ యాదవరాయలు మాత్రమే కొంత శ్రద్ధను చూపినాడు. 1360 వ సంవత్సరము తరువాత యాదవరాయల కాలమంతరించినది. విజయనగర రాజులుగాని, వారి సేనానులుగాని, అధికారులుగాని యీ ఆలయమును ఒక పర్యాయమయినను దర్శించినట్లులేదు. చంద్రగిరిలో సాళువ నరసింహరాయలు రాజప్రతినిధిగా నిలద్రొక్కుకొన్న యనంతరమే తిరుపతిలోని ఆలయమేదైనా శ్రద్ధవహింప బడినదని చెప్పవలెను. తిరుమల ఆలయమునకు తిరుళుకనూరు సభవారు, కమిటీ మెంబర్లయిన తరువాతనే వీరు తిరుపతిలోని ఆలయములో జరిగెడి కొన్ని యుత్సవములకు దాన శాసనములు వ్రాయించిరి. ఈ కాలము 1445, 1446 సంవత్సరములు. ఎంబెరుమానార్ జియ్యరు (1457), చెన్నకేశవదాసరు (1450–51). కొల్లికాృవలిదాసరు (1387). ఋగ్వేదిహరియప్పార్ (చంద్రగిరి నివాసి) (1454). వీరును ఆయాకాలములలో తలకొక తిరుపోృణకము (అన్నప్రసాదములు) సమర్పణమునకై దానశాసనములు వ్రాయించిరి. 7–3–1464 తేదీన సొట్ట తిరుమలనంబి తోళప్పార్ అయ్యంగారు శ్రీ స్వామివారికి ప్రతిరాత్రి నిత్యభోగమునకుగాను 7000 పణములను సమర్పించుచు దానశాసనమువ్రాయించెను. రాత్రి భోగమునకు (రాప్పడి) ఈసమయము వరకు నెట్టి దానమీయబడకుండుట విశేషము. ఇదియే ప్రథమ శాసనముగా చెప్పవలెను. సాళువనరసింగ దేవమహారాజు మూడు గ్రామములను భోగనివేదనమునకై దానముగ, నిచ్చుచేగాక నీ ప్రసాదమును తమలో తాము పంచుకొనుటకు స్థానత్తారును తిరుమలలో పద్ధతి ననుసరించవలెనని ఆదేశించెను. తరువాత వచ్చిన కందాడ రామానుజయ్యంగారు సాళువ నరసింగరాయలచే ఆలయాధికారము నెఱపు పదవిని స్వీకరించి ఆ పదవికి వన్నెతెచ్చిన వాఁడయ్యెను. ఈయన కాల

ములో నెన్నియో అభివృద్ధికరమగుకార్యములు జరుగుటయే కారణము. తిరుమల చరిత్రలో వీరి విషయము ప్రస్తావింపబడినది.

సాళువ నరసింగరాయలు క్రీ. శ. 1494 సంవత్సరములో మరణించువరకు తిరుపతి దేవాలయములు, ప్రత్యేకముగా శ్రీ గోవిందరాజాలయాభివృద్ధి కొఱకు మిక్కిలికృషి యొనర్చెను. కృష్ణదేవరాయలనుండిగాని అచ్యుతరాయల వలనగాని యీ ఆలయమెట్టి పురోభివృద్ధి నందలేదు; సదాశివ మహారాయల కాలములో మాత్రము ఆయననుండియే గాక పురప్రముఖులనుండి, అధికారులనుండి అన్ని స్థాయిలవారినుండి దాన సమర్పణముల విషయములో గరిష్ఠస్థాయినందుకొన్నది. ఈ దాన శాసనము లన్నియు శ్రీ గోవిందరాజస్వామివారికి సంబంధించినట్టి వేయనుటకు వీలులేదు. ఇవి కొన్ని తిరుమలలో శ్రీవారి దానశాసనములతో కలుపబడినవి. 1467 సంవత్సరము తర్వాత అన్ని విధముల శ్రీగోవిందరాజస్వామి ఆలయమునకు సమర్పింపబడిన ఆదాయములు హెచ్చినవి. అవి విజయనగర సామ్రాజ్యపతనముతో నాగలేదు.



# 11 వ అధ్యాయము

## శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయముతో ననుసంధింపబడిన ఇతర ఆలయములు

శ్రీ గోవిందరాజస్వామి ఆలయపు లోపలి ప్రాకారపుగోడల నను సంధించి కొన్ని ఆలయములున్నవి. లోపలి గోపురపు ద్వారమునగల వీరనరసింగయాదవరాయల 15 వ సంవత్సర పరిపాలనాకాలమున వేయ బడిన శాసనమాధారముగా మనల నీ గోపురము 1219 వ సంవత్సరము నకు పూర్వముండెనను నిశ్చయమునకుఁ దెచ్చివది. ఈ వీరనరసింగ యాదవరాయలే తిరువలలోను ప్రధాన గోపురమగు 'పడికావలి' గోపురమును 1217 వ సంవత్సరములో నిర్మించియుండెను. ఈ కారణ ముల చేతనే శ్రీ గోవిందరాజాలయము, ప్రతిష్ఠాదులు శ్రీ రామానుజుల జీవితకాలములో నిర్వహింపబడెనని (1130 వ సంవత్సరము) నిశ్చ యించుటకు వీలగుచున్నది.

ప్రాథమికముగా నీ లోపలి గోపురము, ప్రాకారముల నడుమ గల ఆవరణములో రెండు దేవాలయములు మాత్రమే నెలకొల్పబడి నవి. అవి శ్రీ పార్థసారథిస్వామివారి ఆలయము, గోవిందరాజాలయ ములు. ఆళ్వారులఆలయము లీయావరణములోనున్నవి తరువాత కాలము లో నెలకొల్పబడినట్టివియే. వీనిలో తిరుమంగై యాళ్వారుసన్నిధి 1234వ సంవత్సరములో వచ్చినది. ఇది ప్రత్యేకముగా తరువాతవచ్చి ఆలయ ములోనే కలియుట చేకాబోలు ఈ ఆళ్వారుకు నివేదన సమర్పణము నకు ప్రత్యేక దాన శాసన సమర్పణము జరిగినది.

### 1. గోదాదేవిసన్నిధి (ఆండాళ్లు)

ప్రధాన ఆలయమున కతి సమీపముగానున్న సన్నిధియే ఆండాళ్ల సన్నిధి. నేడు ఈమెను బీబీనాంచారు, అను అపభ్రంశము

పదముచేఁ బేర్కొనుచున్నారు. ఇది ముఖమంటపములోని భాగమే, గోడలచే వేరుచేయబడినది. క్రీ. శ. 1308 లో వేయబడిన శాసనము ఈ సన్నిధి ఉత్తరపులోపలి గోడల పై భాగములోనుండుటచే దీని నిర్మాణము 1308 కు ముందుగా జరిగియుండునని భావించవచ్చును. 1254 వ సంవత్సరములో శ్రీ గోవిందరాజస్వామి వైకాసి బ్రహ్మోత్సవ సందర్భముగా 'తిరుమొళి' పారాయణము జరుగుట, అన్నప్రసాదని వేదసమర్పణము జరుగుట, దాని నంతయునట జేరిన భక్తులకు పంచి పెట్టుట యను విషయములుగల శాసనము వేయబడినది. ఇది ఆండాళ్ల తిరుమొళిగావచ్చును, తిరుమంగై ఆళ్వారు పెరియతిరుమొళియుగానగును, లేక నమ్మాళ్వారు తిరుమొళిగా వచ్చును లేదా ఈ మూడును గలసినది యైనను గానగును. కందాడై రామానుజయ్యంగారు పోరు భాండారపు నిర్వహణము చేపట్టిన పిదపనే 1495 లో శ్రీ ఆండాళ్లకు నిత్యశుక్రవారం తిరుమంజనోత్సము కేర్పాటుచేయబడినది. ఆ సమయములో ప్రత్యేక భోగనివేదనములును ఏర్పాటు చేయబడెను. ఇవి శ్రీ గోవిందరాజ స్వామివారికిని కలిపియే ఏర్పాటయ్యెను. కందాడరామానుజయ్యంగారు. జన్మదినోత్సవ సందర్భముగా ఆండాళ్ల అమ్మవారిని శ్రీవారి కొండ దిగువకు మత్సవముగా నిర్వహింపబడి అట తిరుమల శ్రీవారి ఆలయము నుండి తేబడిన భోగములు నివేదింపబడెడివి. 1495 వ సంవత్సరము నుండియే యీమె వెలుగులోనికి వచ్చెను.

## 2. నమ్మాళ్వారు సన్నిధి [క్రీ. శ 1287 సం॥]

తిరుమంగై ఆళ్వారు, గోదాదేవి సన్నిధులు ఆలయములోనే యుండగా నమ్మాళ్వారుసన్నిధి ఆళ్వారుతీర్థతీరమున నెలకొల్పబడినది. ప్రాథమికముగా శ్రీ గోవిందరాజస్వామి వారికి ప్రత్యేక పుష్కరిణి యుండెడిదికాదు. ఆ కారణముచే నీ తీర్థజలము ఈ ఆలయములోని నిత్యపూజావిధులకు తేఁబడి వినియోగింపబడియుండును. ఈ ఆళ్వారు తీర్థతీరమున పూర్వముననే ప్రత్యేకముగా నమ్మాళ్వారు ప్రతిష్ఠింపబడిన

కారణముచేతనే యీ పవిత్రతీర్థమును తిరుపతిలోని గోవిందరాజాలయమునకు తీర్థముగాగొనివచ్చెడి సంప్రదాయ మేర్పాటుచేయబడియుండును. ఇట్లే ఆకాశగంగాతీర్థము తిరుమల శ్రీవారి నిత్యపూజాదులకు వినియోగింపబడియుండెను. తుంజాలూరు పల్లవరాయనిచే ఆళ్వారుతీర్థపు నమ్మాళ్వారు ఆలయపు గోపురపు ప్రాకారము, గోడలు, 1287 వ సంవత్సరములో నిర్మాణమయినట్లు కడపజిల్లాలోని నందలూరు శాసనము ద్వారా తెలియుచున్నది. కాని నమ్మాళ్వారుసన్నిధి మాత్రము గోవిందరాజాలయనిర్మాణమునకు పూర్వమే యని చెప్పవచ్చును. అదియుగాక తిరుపతి స్థాపనకు పూర్వము తిరుశుకనూరు నుండి తిరుమలకు చేరెడి కాలిబాటలో దిగువనుండి కొండయెక్కుటకు (కపిలతీర్థము) ఆళ్వారుతీర్థమే ప్రప్రథమముగా గాననయ్యెడి దివ్యతీర్థము.

## 3. కులశేఖరాళ్వారు [క్రీ. శ. 1469]

అలగియ మనవాళజియ్యరు స్వామివారి శిష్యుడును, సాళువ నరసింగమహారాజుచే నియమింపబడిన ఆలయాధికారియునగు కందాడ రామానుజయ్యంగారు 1469 వ సంవత్సరములో తిరుపతి కుత్తరపు దిక్కుననున్న బయలుప్రదేశములోను, కొత్తూరుగ్రామ సరిహద్దులోను కులశేఖరాళ్వారుసన్నిధి నెలకొల్పినట్లు శాసనమువలన తెలియుచున్నది.

ఇక్కడ విశేషమేమన కులశేఖరుని మూలబేరముతోబాటు త్సవబేరమును కలదు. సాళువనరసింహరాయలు క్షత్రియుడు. కులశేఖరాళ్వారు క్షత్రియుడు. ఆయనను సంతృప్తిపరచుటకై కందాడ రామానుజయ్యంగారుచూపిన చాకచక్యముగా దీనినెన్నవచ్చును. 1512వ సంవత్సరములో వేయబడిన శాసనములో "కులశేఖరాళ్వారువీధి" ప్రసక్తి గలదు. ఈ ఆలయమునకు ముందొక మంటపమున్నది. దీనిని కుమారరామానుజయ్యన్ మంటపమని పిలిచెదరు.

## 4. పెరియాళ్వారు సన్నిధి (క్రీ. శ. 1300 సం॥)

ఈ పెరియాళ్వారు సన్నిధిలోని పశ్చిమకుడ్యమున నొక శాసనము తమిళములో నున్నది. ఇది తిరుమలకొండ నెక్కుటకు ప్రారంభమగు ప్రదేశముగా చెప్పబడుచున్న 'అలిపిరి' (ఆదిపడి) వద్దగల సన్నిధిలోనున్న పశ్చిమపు గోడ. ఈ కారణముచే నీ ఆలయము పాండ్యులు లేక చోళులకాలములో క్రీ. శ. 1300 సం॥లో నిర్మాణ మయినదైనన్నవచ్చును. ప్రాచీన సంప్రదాయానుగుణముగ నిట తిరుమలకు బోవు ప్రతియాత్రికుడు ఆళ్వారుతీర్థములో మునింగి పూతస్నాతుడై ఆదిపడిలోనున్న పెరియాళ్వారు ఆశీస్సులనందుకొని తన యాత్ర నారంభించును. 1485 వ సంవత్సరములో సాళువనరసింహరాయలచే నిర్మాణమయినట్లుగా చెప్పబడుచున్న అలిపిరి (ఆదిపడి)వద్ద గల లక్ష్మీనరసింహస్వామివారి ఆలయమునుగూర్చిన శాసనమీ పెరియాళ్వారుసన్నిధిలోని పశ్చిమకుడ్యముపై వ్రాయబడిన శిలాశాసనములో గలదు. ఈ కారణముచే నిది నిశ్చయముగా నాటికి పూర్వమే నెలకొనియున్నట్లు చెప్పనగును. తిరుపతిలోని ఆళ్వారుల 'శాత్తుమొర' (మంగళాశాసనం) ఉత్సవముల సందర్భముగా నీ పెరియాళ్వారు సన్నిధియే తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసాదములను, పరివట్టము మొదలగు వానిని దేవాలయ మర్యాదలతో స్వీకరించు స్థలముగా నెన్నికగన్నది.

తిరుపతిలో నీ పెరియాళ్వారు సన్నిధులు పైన చెప్పినవి కాక మరి రెండు కలవు ఆళ్వారుతీర్థమునకు సమీపముననే 'పెద్దచిముగు కొండ' వద్ద తాళ్ళపాక తిరువేంకటాచార్యుని తల్లియగు పెద్దమంగమ్మ గారిచే నెలకొల్పబడినది యొకటి. రెండవది గోవిందరాజస్వామి దక్షిణ మాడవీధిలోగల లక్ష్మీనారాయణస్వామివారి ఆలయములోను గలదు ఈ రెండును 17 వ శతాబ్దపుటాదిలో నుద్భవించినట్టివి.

## 5. తిరుమంగై యాళ్వారు సన్నిధి (క్రీ. శ. 1234 సం)

1234 వ సంవత్సరములో నీ యాళ్వారుకు ప్రత్యేకముగా నన్న ప్రసాదములు, భోగములు సమకూర్చబడినప్పటికి నీ యాళ్వారు శ్రీగోవిందరాజస్వామి ఆలయములో అంతర్భాగముగా నుండెనో లేక ప్రత్యేక ఆలయమున్నదో తెలియుటకు స్పష్టమయిన సమాచారము లభించదు. తరువాత వచ్చిన శాసన మీ తిరుమంగై యాళ్వారునకు ప్రత్యేకసన్నిధి యొకటి గలదనుచు తెల్పియున్నది. 1328 సం॥లో తిరుమల శ్రీవారి ఆలయములోని లోపలి గోపురపు దక్షిణదిశయందలి తూర్పు ప్రాకారకుడ్యము వెలుపలివైపు వ్రాయబడిన శాసనములో తిరుపతిలోని వీరనరసింహస్వామివారితోపాటు తిరుమంగై ఆళ్వారునకు నిత్యము 4 పడుల బియ్యమును నివేదనమునకుగాను 'పొంగలూరు' గ్రామమునుండివచ్చు సాలుసరి రాబడినుండి మహాప్రధాని సింగయ్య దండనాయకుడు దానసమర్పణము చేసినట్లున్నది. 1547 వ సంవత్స రములో సదాశివమహారాయలు ఇచ్చిన 10,000 కుళుల భూదానములో నెక్కువభాగము ఈ తిరుమంగై ఆళ్వారునకు కులశేఖరాళ్వారుల ఆలయ ముల నిత్యకైంకర్యమున కయియున్నది. ఈయన ఆళ్వారులలో నతి ప్రాముఖ్యము వహించుట కారణముగా నీయనకు వ్రాయబడిన దాన శాసనములు హెచ్చుగనే యున్నవి.

## 6. మధురకవి ఆళ్వారు సన్నిధి
## (క్రీ. శ. 1543 నకు కొద్దికాలము పూర్వము)

ఈమధురకవి ఆళ్వారు సన్నిధి గోవిందరాజస్వామివారి ఆలయపు బాహ్యసరిహద్దులో కూరత్తాళ్వారు సన్నిధి కెదురుగా నున్నది. ఇది యేనాడు నెలకొల్పబడెనో తెలియుట కాధారములులేవు. మనకు లభించు శాసనములలో 'శాత్తుమొర' ఉత్సవములు, నమ్మాళ్వారు, పెరియా ళ్వారు, తిరుమంగై ఆళ్వారు, కులశేఖరాళ్వారు, శ్రీరామానుజుల

సన్నిధులలో జరుగుచున్నట్లు పదేపదే తెలుపబడుచున్నవి. మధుర కవి కృతరచనములు నమ్మాళ్వారుసన్నిధిలో అధ్యయనోత్సవములలో పదునొకండవ దినమున పఠించుచున్నారు. ఇది 1514 వ సంవత్సరములో జరిగిన విషయము. గోవిందరాజస్వామివారి ఆలయములోని, మొదటిగోపురము మూలతలములోగల క్రీ.శ. 1537 శాసనములో శాత్తుమొర జరిపెడి ఆళ్వారులపేళ్లలో మధురకవి ఆళ్వారును పేర్కొనలేదు. కాని 1543 లోని రామానుజుల సన్నిధిలో గల తూర్పుప్రాకారపు గోడపై మధురకవి ఆళ్వారు పేర్కొనబడినాడు. కనుక నీ మధ్య కాలములో నీయన ప్రవేశము జరిగి యుండవచ్చును.

## 7. తిరుమల నంబి సన్నిధి

లోపలి గోపురపు తూర్పు భాగమున ననుసంధిపబడిన యున్నత మంటపములో, గోడలచే వేరుచేయబడిన యొక ప్రదేశములో శ్రీ రామానుజుని మేనమామయగు తిరుమలనంబి సన్నిధి ఏర్పాటు చేయబడెను. శ్రీవారికి శరణాగతిసల్పి నిత్యమాయన తిరుమంజనార్థమై పాపనాశమునుండి కొంతకాలము, తరువాత ఆకాశగంగనుండి నీటిని తెచ్చిన తన మేనమామయగు తిరుమలనంబి యెనలేని భక్తితత్పరత నుద్దేశించి యాతని ప్రముఖమూర్తి స్వరూపమును శ్రీ రామానుజుడే నేడు మనకు కానవచ్చు ప్రదేశములో నెలకొల్పెనని మనము భావించుటలో తప్పులేదు.

## 8. శ్రీరామానుజుని సన్నిధి

ఈ సన్నిధి తిరుమలనంబి సన్నిధికి తరువాత నున్నట్టిది. ఈయన సన్నిధి 1220 వ సంవత్సరము తరువాత నెలకొల్పబడి యుండును. కారణ మాసంవత్సరములోనే నీయన సన్నిధికిగల దక్షిణ పశ్చిమపు పునాదిగోడలపై శాసనము వ్రాయబడినది. ఈ శాసనములో నీ సన్నిధిలోని దీపములు వెలిగించు ప్రసక్తి, పూలనుదెచ్చెడి విషయ

ములు పేర్కొనబడినవి. శ్రీరామానుజుని కూరిమిశిష్యులచేతనే యీ సన్నిధి నెలకొల్పబడియుండెను.

## 9. కూరత్తాళ్వారు సన్నిధి (1433 సం॥ నకు పూర్వము)

ఈ సన్నిధి నిర్మాణకాలమును చూచాయగా నైనను తెలియుటకు ఆధారములులేవు. ఈ ఆలయపు ఉత్తరపు గోడపై నొక శాసనమున్నను దానిలో సంవత్సరము పేర్కొనబడలేదు. కాని దానిక్రిందనే గల పదముల కూర్పునుబట్టి, 1355 శకమునకు సమానమైన 1433 వ సంవత్సరముగా మనము భావించవచ్చును. (ఆపదము 'ఆవనిక్కలరి' (రిజిస్ట్రేషను ఆఫీసు). ఇంకను తి. తి. దేవస్థానముల శాసనములలో 1 వాల్యూము 205 డి, 1 వాల్యూము 204 బి వీని కాధారము).

ఆళ్వారుల సన్నిధులన్నియు లోపలిగోపురపు వెలుపలనే యున్నవి. తిరుమలనంబి, శ్రీ రామానుజుల సన్నిధులు మాత్రము లోపలి గోపురము నానుకొని యున్నవి. ఈ ఆళ్వారుల స్థాపనము క్రమానుగతము పెరియాళ్వారుకు మొదటి ఆలయం కొండ దిగువున మెట్లకడ నున్నది. ఇక మిగిలిన వన్నియు తరువాత కాలములో నొక్కటొక్కటిగా బయలుదేరినట్టివి. ఈయనకేగల ఇతర ఆలయములు తరువాత నిర్మింపబడినట్టివి. వీనిలో కట్టకడపటిది శ్రీ గోవిందరాజస్వామి దక్షిణమాడవీధిలోని శ్రీ లక్ష్మీనారాయణస్వామి ఆలయము లోనిది కులశేఖరాళ్వారునకుగల సన్నిధినిబట్టి ఆ ఆలయము గల వీధికి ఆయనపేరే పెట్టబడినట్లు తెలుపబడియేయున్నది. వీనిలో ఏ ఆలయముగాని వాని నిర్వహణకు కొండపైగల శ్రీ వేంకటేశ్వర స్వామివారిపైగాని క్రింద శ్రీ గోవిందరాజస్వామివారిపైగాని ఆధారపడి యుండలేదను విషయము మనము మఱువరానిది. వీనిలో ప్రతి ఆలయమునకు, వానిరాబడి, ఆరాబడిని సక్రమముగా వినియోగించుటకు ప్రత్యేక ధర్మకర్త యుండుటయు నిట పేర్కొనవలసిన ప్రత్యేక విషయములు.

కాని యివి అన్నియు తిరుమలలోని శ్రీవారి ఆలయమున కనుసంధింప బడినవియే. ఇది ఈ ఆళ్వారుల అధ్యయనోత్సవ కార్యక్రమములో సుస్పష్టమగుట మనము గాంచెదము. 'పరదేశి తిరువేంకటయ్యన్' చే గోవిందరాజాలయపు మొదటిగోపురములోని లోపలిభాగమున దక్షిణము గానున్న పునాదిరాయిపై చెక్కబడిన శిలాశాసనమున వివరింపబడినది.

ఆళ్వారులలో నెవరిదైనా (మంగళాశాసనము) శాత్తుమొర జరుపవలసిన దినమున తిరుమలలో శ్రీవారి ఆలయములో పూజాది నైవేద్యములు ఉదయమున త్వరితముగనే ముగియును. ఇది సంప్రదాయముగా నేడు ననుసరింపబడుచున్న పద్ధతి. ఏ యాళ్వారు తిరునక్షత్రమగునో ఆయన మేళతాళములతో నూరేగింపుగా పెరియాళ్వారు సన్నిధికడకు అనగా కొండదిగువమెట్లకడకు వచ్చును తిరుమల శ్రీవారి ప్రసాదములు, ఆకువక్కలు, చందనము, పరివేష్టము (వస్త్రము) మొదలయినవి ఆలయమర్యాదలతో నాయాళ్వారు గ్రహించును. ఆతరువాత ఏనుగుపై వానినన్నిటినిగొని తిరుపతి రాజవీధులలో నూరేగింపుగా బయలుదేరి ఆ యాళ్వారుస్వామి సన్నిధిలోనికి ప్రవేశించును. ఆళ్వారుల తిరుమంజననోత్సవ సందర్భమున శ్రీగోవిందరాజస్వామి ఉత్సవుబు దేవేరులతో దర్శించి సమాశ్వాసించును. ఆ సాయంత్ర మొక మొక పెద్ద యుత్సవము జరుగును. ఆ యుత్సవమును, శ్రీ గోవిందరాజస్వామి వారికి సమర్పింపబడిన ప్రసాదములోని భాగము నీ యాళ్వారులు నాడు సంగ్రహించుట సంప్రదాయమయ్యెను.

## 10. వీరనరసింగస్వామి ఆలయము (క్రీ. శ. 1328 సం॥)

తిరుపతి మహాక్షేత్రములో కాలక్రమానుగతముగ ఆళ్వారుల సన్నిధులతోబాటు మరికొన్ని దేవాలయములు వెలసినవి. అట్టివానిలో 1328 వ సంవత్సరములోని వీరనరసింగ దేవాలయ మొకటి. ఈ ఆలయములోని స్వామికి మొదటగా సింగయ్యదండనాయకుఁడు నిత్యపూజా

నివేదనములకు దానశాసనము వ్రాయించెను. ఇది వీరనరసింగ యాదవ రాయలచేగాని, తిరువేంకటనాథ యాదవరాయలచేతగాని నిర్మాణము చేయబడియుండును వారే సింగనల్లూరు గ్రామమును సింగయ్యదండ నాయకుని యధీనములోనుంచి కొన్ని వితరణ కార్యములు చేయుట కను మతి నొసంగిరి. శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయములో నివేదనము కాబడిన ప్రసాదములను ఈ స్వామివారి సన్నిధిలో రామానుజ కూట ములో జరిగెడిరీతిని పంపిణీచేసెడివారు. ఇది 15, 16 శతాబ్దముల కాలములోనిమాట. ఈ ఆలయ స్వరూపముగూడ నేడు కానవచ్చుట లేదు. తిరుపతిలోని 'నరసింహ తీర్థమని' చెప్పబడుచున్న ప్రదేశమే యీ యాలయమున్నచోటని యందురు.

## 11. సాలై నాచ్చియారు ఆలయము (క్రీ. శ. 1457 వ సం॥)

ఆలయ గిడ్డంగి ప్రదేశమును (స్టోర్స్) 'సాలై' అని పిలచె దరు. ఈ దేవత ఆలయము గిడ్డంగికెదురుగానున్నది. ఈమె అసలు పేరు 'పుణ్డరీకవల్లితాయారు'. ఆలయపు వరండాయొక్క ఉత్తరపువైపు వెలుపలిగోడపై 2-2-1457 వ తేదీన వ్రాయబడిన శాసనమునుబట్టి ఆలయనిర్మాణకాల మూహింపవలసినదే. ఇదియే, అనగా నీ శాసనమే మొదటిదిగా నున్నట్టిది. శ్రీవైఖానసఅర్చకులే ఈఆలయపు ధర్మకర్తలు, ఇదియు నేడు గోవిందరాజస్వామి ఆలయములోని అంతర్భాగమే. నేడు ఈ యాలయమును గూడ తిరుమల తిరుపతి దేవస్థానమువారే యాజ మాన్యము వహించుచున్నారు.

## 12. అలిపిరి నరసింహస్వామి ఆలయము (క్రీ. శ. 1485 సం॥)

అలిపిరి (అడిపడి) లోని పెరియాళ్వారు సన్నిధిలోని తూర్పు గోడపై 20-4-1485 న వ్రాయబడిన శాసనములో నీ ఆలయమానాడు నిర్మించినట్లుగా గలదు. శ్రీవారి కొండదిగువున శ్రీవీరగుండ క్షితిపతి కుమారుడగు వీరసాళువనరసింహరాయలు ఈ ఆలయమును నిర్మించి నాడు శిథిలమయిన ఆలయములలో నేడు దీనినికూడ చేర్చవచ్చును.

1544 వ సంవత్సరములోని శాసనములో నిది తిరుమల మార్గదర్శక నరసింహాలయంగా పేర్కొనబడినది. తాళ్లపాక తిరుమల అయ్యంగారు కతారి హనుమదాలయములో మరియొక నరసింహస్వామి విగ్రహమును ప్రతిష్ఠించినట్లు శాసనమున్నది.

## 13. శ్రీరామాలయములు

కూరత్తాళ్వారు ఆలయము ముఖమంటపము యొక్క ఉత్తరపు గోడమీద పెరియ రఘునాథాలయ నిర్మాణ ప్రశంసచేయబడినది. దీనిని పెరియ (పెద్ద) రఘునాథాలయమనుటకు కారణము 1488 లో గోవింద రాజస్వామి ఆలయములోనున్న రామానుజుని సన్నిధిని మరియొక రఘునాథుని తరువాత ప్రతిష్ఠించుటయే. పెరియరఘునాథుని ప్రతిష్ఠా కాలము 1481 వ సంవత్సరము. ఈ విగ్రహ ప్రతిష్ఠకు కారకుడు నరసింహరాయ మొదలియారు. సాళువ నరసింగరాయని పరలోక సుఖముల నిమిత్తమై యీయన ఈసమర్పణముచేసెను. ఈకాలము 9—10—1481 ప్లవ సంవత్సర ఆశ్వయుజ శుద్ధసప్తమీ శ్రవణా నక్షత్రయుక్త సోమ వారముగా నున్నది.

తిరుపతి క్షేత్రమునకు పశ్చిమభాగమున 1535 వ సంవత్సరములో రాంభట్టరాయనిచే మరియొక రఘునాథాలయము నిర్మింపబడినది. ఈ ఆలయమునకు పెద్దగా దానశాసనములు వ్రాయబడలేదు

గోవింద పుష్కరిణీ తీరమున నారాయణదాసరి నాయకర్‌చే 1606 వ సంవత్సరములో మరియొక రఘునాథాలయము నెలకొల్పబడినది.

మొదట చెప్పిన పెరియ రఘునాథుని ఆలయమే నేడు ఉచ్ఛస్థితిలో నున్నది. ఇదినేడు కోదండరామస్వామి ఆలయముగా ప్రశస్తివహించినది. ఈ ఆలయమునకు ప్రాకారము, గోపురము, రథము, రథమంటపము, బంగారు ఆభరణ విశేషములు మొదలగునవన్నియు నున్నవి.

ఈ ఆలయము 1480–81 లో కట్టబడినట్లుగా ముందే తెలుపబడినది. ఇందు వైఖానసాగమ విధానముగా నర్చనాదులు నిర్వర్తింపబడుచున్నది. ఈ ఆలయము చుట్టునుగల వీధులలోనే, నేడు శ్రీవేంకటేశ్వరస్వామి వారి పరంపరాగత దీక్షితుల అర్చక నివాస భవనములున్నవి. అర్చక స్వాముల ఇళ్లకు చేరువున విశిష్టాద్వైత స్థాపనకు ఆదిపురుషులైన భగవాన్ శ్రీ విఖనసాచార్యుల ఆలయము కలదు. వీరికి ప్రతిశ్రావణ శుద్ధపూర్ణిమనాడు "తిరునక్షత్రోత్సవము" శ్రీవైఖానసస్వాములచే జరుప బడుచున్నది. సన్నిధివీధితోకూడి ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర వీధు లున్నవి. బ్రహ్మోత్సవములు శ్రీ రామనవమికి జరుగును. తిరుపతి క్షేత్రములో నేడు శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయమును దర్శించిన పిమ్మట శ్రీ కోదండరామస్వామివారిని సేవించుట యాత్రికులు తమ కర్తవ్యముగా భావింతురు.

## 14. తిరుపతిలోని ఆళ్వారుతీర్థము (కపిలతీర్థము)

ఎత్తైన జలపాతమాధారముగా నొక పడియగా రూపొంది దివ్య తీర్థముగా వాసికెక్కిన దీ (యాళ్వారు) తీర్థము. శ్రీనివాసుని కొండ దిగువున మార్గములో యాత్రికునకెదురగు మొట్టమొదటి తీర్థమిదియే. ఇచట నమ్మాళ్వారుసన్నిధి గలదు. అంతకంటె ముఖ్యముగా నిట కపిలేశ్వరస్వామివారి ఆలయమున్నది. వీని చరిత్ర సవివరముగా నీ క్రింద వ్రాయబడుచున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనసంపుటి మొదటిభాగము లోని 20వ శాసనములో నీ విషయము కొంతయున్నది. ముందుగా దీనిని తెలిసికొనెదము. జలపాతమువలన నేర్పడిన పడియతీరమున నొక సన్నిధి ద్వారపట్టికపై గల శాసనమే యిది. ఈ సన్నిధియే నేడు కపిలేశ్వరస్వామివారి ఆలయముగాఁ బేర్కొనబడుచున్నది. ఈ శాసనములో నాలయమున్న విషయముగాని, ఆలయములోని స్వామిని

గుఱించిగాని యెట్టి వివరము లేకుండుట విశేషము. కొత్తూరుగ్రామ ప్రాంతీయప్రభువగు రాజరాజేంద్రుడు నెలకొల్పిన దివ్యధామముగా నీ సన్నిధి పేర్కొనబడినది. ఈ శాసనకాలము మాత్రము పేర్కొనబడ లేదు. కాని ఇది యొకటవ రాజేంద్రచోళుని (1013-1045) నాటిది గాని రెండవ రాజేంద్రచోళుని (1070-1122) నాటిది గాని యగుననుటలో సందేహింప పనిలేదు. 1వ కుళోత్తుంగచోళుఁడే యీ రెండవరాజేంద్ర చోళుఁడు. మొదటివానికంటె రెండవరాజేంద్రుని కాలము నాటిదే యీ శాసనమని అనగా 1070-'75 కాలమునాటిదని చెప్పుట యసంగతము కాబోదు. ఈ శాసనములోని 'దివ్యధామ' మనునది చిన్నమంటపము. 'కోయిలాళ్వారు' పదమునకు సమీచీనముగా నున్నది. కాని దీనిని మరింత వివరముగా నెఱుఁగ వలెనన్నచో ఒకటవ వాల్యూములోని 57వ, 58వ శాసనములవలన తెలియును. ఇవి నమ్మాళ్వారు ఆలయపు గోడలపై నున్నవి. ఈ రెండు ఆలయములును నీ తీర్థతీరముననే గలవు. 57 నెంబరు శాసనము నమ్మాళ్వారు సన్నిధిలోని లోపలి పశ్చిమపుగోడపై వ్రాయబడినది. ఈ ఆలయము పల్లవరాయనిచే జీర్ణోద్ధారము చేయబడినది. ఈయన కాలము నందలూరు శాసన మాధారముగా 1287వ సంవత్సరముగా చెప్పబడినది. కనుక నీ శాసనము మొదట చెప్పిన శాసనముకాలము తరువాత 200 సంవత్సరముల కాలమునకు వచ్చినట్టిది. అందు నమ్మాళ్వారు ఆలయవిమానము, మంటపము, ప్రాకారములు, గోపురాదులు మొత్తము పల్లవరాయని వితరణయే. 58 నెంబరు శాసనము అళ్వారు సన్నిధిలోనే గలదు. ఇది సంస్కృతభాషలో వ్రాయబడినది. ఇందులో 'నాకానాక సరోవర తీరమున కొండదిగువున నాకముని నివసించెను'......ఇట్లు సాగినది. ఈ శాసనము నమ్మాళ్వారు సన్నిధిలో నుండుటచే నా ముని యీ నమ్మాళ్వారుగా భావింపవచ్చునా? బహుశః క్రీ. శ. 1070వ సంవత్సరములో 1వ కుళోత్తుంగుడుగా ప్రశస్తినొందిన రెండవ రాజేంద్రచోళుని కాలములో మునియయాదవరాయన్ నెలకొల్పిన దివ్యధామము ఈయన

గుఱించియే గావచ్చును. ఈ సందర్భమున చెప్పవలసినదేమన నీ తీర్థమును పేర్కొనుటగాని లేక యీ తీర్థమును కపిలతీర్థమని చెప్పుటగాని జరుగలేదు. అంతేకాక ఈ సన్నిధిని కపిలేశ్వరస్వామి ఆలయమనియు పేర్కొనలేదు. 57, 58 వ నెంబర్ల శాసనములందునుకూడ కపిలతీర్థమను ప్రసక్తిలేదు. ఈ చరిత్రమెట్లున్నను శ్రీ గోవిందరాజస్వామి వారి ప్రతిష్ఠ శ్రీరామానుజునిచే జరుపబడిన యనంతరము, శ్రీస్వామివారి నిత్య పూజావిధులను నెరవేర్చుటకు, ఈ తీర్థ మే పేరుతోనైన పిలువ నిండు, వీనితోనే స్వామికి తిరుమంజనాదులును నిర్వహించుటయనునది జగమెరిగిన సత్యము. దీనికి కారణము గోవిందరాజాలయ సమీపమున నెట్టి తీర్థములేకుండుటయే. ఈ తీర్థమునకు నా డెట్టి పేరును పేర్కొనియుండని కారణముచే మనము ఆళ్వారుతీర్థమను పేరు పెట్టుటలో నన్యాయములేదు. ఈ 'ఆళ్వారు' నమ్మాళ్వారుకు చెందినను, సుదర్శనునకు చెందినను చక్రత్తాళ్వారుకు చెందినను అది యిట నప్రస్తుతము.

తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనపత్రిక 2 వ వాల్యూము 29 వ శాసనములో ఉపాకర్మ పర్వదినముగా నూహింపబడుచున్న 1467 మే-జూన్ మాసములో వచ్చు నొక యుత్సవము పేర్కొనబడినది. శ్రీ గోవిందరాజస్వామి వారు ఉభయదేవేరులతో ఈ తీర్థములో స్నపనతిరుమంజనమును జరుపుకొనియుండి యీ తీర్థమును పవిత్ర మొనర్చిరను విషయ మీ శాసనములో నున్నది. ఈ శాసనము గోవిందరాజాలయములో నున్నది. కాని యీ యుపాకర్మోత్సవము నేటికివి ఆళ్వారుతీర్థమందే జరిగించుట ప్రత్యక్షరసత్యము. కాని ఈ శాసనములో తీర్థమని పేర్కొనబడినదే కాని 'ఆళ్వారుతీర్థమ' ని ప్రత్యేకముగా తెలుపలేదు. 1467 వ సంవత్సరములో గోవింద పుష్కరిణి నిర్మాణములో లేదు. కాని 4 వ వాల్యూములోని 8, 9, 10 నెంబర్లుగల శాసనములు 25-6-1531 తేదీ నాటివి మనకు స్పష్టమైన

సమాచారము నందీయగలవు. ఈ శాసనములు శ్రీ వీరఅచ్యుతరాయ మహారాయనికాలము నాటివి. 8వ నెంబరు శాసనము తెలుగులిపిలోను, 9వది కన్నడములోను 10వది తమిళములోను గలవు. ఈ శాసనము లన్నియు సమానవిషయమునే ప్రతిపాదించినవి. అచ్యుతరాయమహా రాజు తన పురుషార్థసాధన నిమిత్తమై ఈ తీర్థమును జీర్ణోద్ధారము గావించెను. చెక్కడపు రాతిమెట్లు నిర్మాణము గావించి సంధ్యావందనమంటపము నొకదాని నేర్పరచెను. నాలుగుమూలల సుదర్శన శిలాస్థాపనము చేసెను. తెలుగుశాసనములో నీ తీర్థము 'తిరువేంకటనాథ దేవుని దివ్య తీర్థమ్, తిరుపతి చక్రతీర్థమ్' అని యున్నది. కన్నడములోనట్లే గలదు. తమిళములోనున్నది ఆళ్వారుతీర్థమని. కాని అన్నిశాసనములలోను తిరువేంకటనాథదేవుని దివ్యతీర్థమనియే గలదు. దాని తరువాత 'చక్రతీర్థ' మని తెలుగు కన్నడములలోను, 'ఆళ్వారుతీర్థ' మని తమిళములోను వ్రాయబడినది. తమిళములో 'ఆళ్వారు' శబ్దమును సుదర్శనసంబంధముగా నిట జెప్పవలెనుగాని నమ్మాళ్వారుకు చెప్పరాదు. పై సవివరణమాధారముగా, శాసనములలో వేర్వేర్వేన్న రీతిగా చక్రత్తాళ్వారు తీర్థమని, చక్రతీర్థమని, ఆళ్వారుతీర్థమని ఈ శాసనముల కాలమునాటి పూర్వము ఈతీర్థము పిలువబడుచుండెడిది. గోవిందరాజాలయ నిర్మాణానంతరమే ఈనామము లీ తీర్థమునకు నిర్దేశించియుండనగును. అప్పటికి దీనిని కపిలతీర్థమను పేరుతోడ పిలిచియుండలేదు.

ఇది కపిల తీర్థమనుపేరుతో మొట్టమొదటగా నెప్పుడు పిలువబడెనో విచారింతము. మట్ల అనంతరాజు బహువితరణ శీలియని మన మెఱింగియున్నాము. ఈయన ఆళ్వారు తీర్థమునందును, శేషాచలమందును షడ్రసోపేతాన్నదాన నిమిత్తమై యొక్కొక యుచిత భోజనశాలను నెలకొల్పెను. క్రీ.శ 30–1–1563 వ తేదీన(దుందుభి సంవత్సర మాఘ శుక్ల సప్తమి శనివారం భరణీనక్షత్రం) నెవ్వసాని అనెడు దేవదాసీ (Dancing girl) 200 పణములు సమర్పించి దానిపై వచ్చు వడ్డీతో

కపిలేశ్వరస్వామివారి నృత్య మంటపములో నున్న విఘ్నేశ్వరస్వామి వారికి నిత్యపూజా నివేదనాదులు, పుష్పములు, సాయంత్రమునందు దీపదానము జరిపించుటకుగాను శాసనము వ్రాయించెను. ఈ శాసనములో నీ సన్నిధిగల తీర్థమును కపిలతీర్థమని పేర్కొనలేదు. ఈ శాసనకాలము తరువాత రమారమి 302 సంవత్సరములకు అనగా పదవతేదీ ఫిబ్రవరి 1865 వ సంవత్సరమునాడు విచారణకర్తయగు మహంతు ధర్మదాసు వ్రాయించిన శాసనములో కపిలతీర్థము, పుష్కరిణి మంటపములు, గోపురాదులు జీర్ణోద్ధారము చేయబడినట్లుగా బేర్కొనబడినది. కనుక మనము 1865–2–10 నాటికిగాని ఆళ్వారు తీర్థము కపిలతీర్థమని పేర్కొనబడినట్లుగా వినలేదు. ఈ కపిలతీర్థమను పేరు అర్వాచీనముగా వచ్చినట్టిదనియు అంతకుముందు శతాబ్దముల పర్యంతము ఆళ్వారు తీర్థమని యే దీనికి పేరనియు, ఆ యాళ్వారు నమ్మాళ్వారు పేరుగాగాక సుదర్శనాళ్వారునకు చెందినదనియు దీనివలన విశ్వసింపనగును. అంతేకాక ఇది శ్రీ వేంకటేశ్వరుని దివ్యతీర్థమనియు తిరుపతికి ప్రవహించునట్టి పవిత్రతీర్థమనియు, శాసనములలో పేర్కొన్న విషయమును గ్రహించితిమి. ఇవి శ్రీవారి పాదములనుండి ప్రవహించుటచే నీ తీర్థము అతి పవిత్రవంతమైనదిగా నయ్యెను. ఆళ్వారు తీర్థమునకెగువగా నీ జలపాతము నొకచోట నాలుగవ గుహలో శ్రీ వేంకటేశ్వరుని విగ్రహమును ప్రతిష్ఠించిరి. అట నుండి యీ జలపాతము క్రిందపడును.

## 15. ఆళ్వారుతీర్థమునందలి శ్రీ కపిలేశ్వరస్వామి సన్నిధి

ఆళ్వారుతీర్థమునకు తూర్పుయొడ్డుననున్న ఆలయమే శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయము. దీని కడనున్నపడియ నిపుడు కపిల తీర్థమనియు పిలుతురు. ఈ ఆలయము పశ్చిమ ముఖముగానున్నది.

ఈ ఆలయమునకు సంబంధించి రెండు శాసనములు మాత్రమే కలవు. ఆలయద్వారపట్టికకుగల శాసన మీవరకే విచారింపబడినది. అది మొదటిది. దీనియందు కాలములేదు. కాని దానిలోని విషయములను బట్టి 1 వ కులోత్తుంగచోళునిగా ప్రశస్తిగన్న రెండవ రాజేంద్రుని కాలమునాటిది. అనగా 11వ శతాబ్దము చివరి భాగములోనిది. ఈ శాసనములోని రాజరాజేంద్రచోళుడు కొత్తూరు ప్రాంతీయ ప్రభువు. ఈయన ఒక దివ్యధామమును (తిరుమాళిగ) నెలకొల్పెను. దేవస్థానము శాసన పరిశీలకులు 'తిరుమాళిగ' అనుపదమునకు అర్చనాస్థలముగా నర్థమును చెప్పిరి. కాని తమిళములో 'తిరుమాళిగ' అనుపదము గొప్ప మతాచార్యునినివేశనమునకు, లేక నొక పరివ్రాజక శ్రేష్ఠుని నివాసమునకుపయోగింపబడును. చాల కష్టముమీద నీ 'తిరుమాళిగ' పదమునకు తాత్కాలిక పూజాస్థలమనియెడు నర్థముచెప్పవచ్చును. కాని యొక ప్రతిష్ఠాకార్యక్రమమును ఆగమ శాస్త్రానుసారముగా నెఱపి చేసెడు అర్చనా వివేశనమని చెప్ప వీలుపడదు.

ఈ కొత్తూరు ప్రాంతీయ ప్రభువగు మునియాదవరాయనిచే ఆలయమే నిర్మాణము చేయబడియుండెనేని దానికి తప్పక తమిళపదములో 'కోయిల్' అను పదము వాడియుండునుగాని 'తిరుమాళిగ' పదము వాడ బనిలేదు. శాసనములలో నన్నింటియందును 'కోయిల్' పదము ఆలయమునకు తమిళభాషలో వాడబడియేయున్నది. పరాశరేశ్వర కోయిల్ తిరుళుకనూరు (1094); శ్రీకాళహస్తీశ్వరకోయిల్ (1111సం॥) యివి శాసనస్థోదాహరణములు.

ఈ పై కారణములను బురస్కరించుకొని నాడుముని యాదవరాయలు దేవునికొఱకై ఆలయమును నెలకొల్పెననుట అసంబద్ధము. కాని ఈభవనము లేక దివ్యధామము బ్రతికియుండిన ముని నివాసార్థమై నెలకొల్పియుండును. కాక ఏదైనా ఒకముని విగ్రహమును నెలకొల్పుటకైనను గావచ్చును. అది నిజమైనచో ఆ ముని కపిలుఁడేయని

మనము ఊహింపవచ్చును. భగవదాలయము సహజముగా నిర్మింప నెంచినచో నేదో ప్రత్యేక కారణము బలీయమై, అనివార్యమైయున్నచో దప్ప తూర్పుముఖముననే యుండునుగాని పశ్చిమముఖమున నుండదు. నమ్మాళ్వారు సన్నిధి పశ్చిమమునకున్నను అది శ్రీ వేంకటేశ్వరు నుద్దేశించి కొండకెదురుగానున్నది. అట్లుండనిచో శ్రీవారికి పృష్ఠభాగ మును దర్శింపజేసినట్లగును. 1070 వ సంవత్సరము శాసనమున్న శ్రీకపిలేశ్వరస్వామివారి ద్వారపట్టిక నమ్మాళ్వారుఆలయ ద్వారపట్టికయే యైయుండును. 1287 వ సంవత్సరములో నందలూరు శాసనమాధార ముగా నీ ఆలయము పల్లవరాయనిచే జీర్ణోద్ధారము గావింపబడినట్లిది వరకే తెలిపియున్నాము. దానిలో నుపయోగింపబడని యీ ద్వారపట్టి కను కపిలేశ్వరస్వామి ఆలయ నిర్మాణము సందర్భములో నుపయో గించియుందురు.

దీనిని మఱియొక కారణముచేతను సమర్థింపనగును. ఈ సన్నిధి పూర్వమునుండి శైవ సంబంధమే యగుచో శైవులుగా పేర్కొన బడిన చోళరాజులు 11, 12, 13 శతాబ్దులందు రాజ్యముచేసిన కాల ములో తిరుశుకనూరులోని పరాశరేశ్వరాలయమునెట్లు తమ దానధర్మా దులచే ప్రోత్సహించిరో అట్లే ఈ ప్రదేశమును తమ వితరణాదులచేఁ బ్రశస్తికిఁదెచ్చియుందురు. కాని 1563 వ సంవత్సరము వచ్చువరకు నీ కపిలేశ్వరస్వామివారి ఆలయ ప్రసక్తి మనకెచట నే శాసనము లోను గన్పింపదు. ఈ విషయమిదివరకే ప్రసక్తమయినది. ఈ శాసన ములోనే ఈ ఆలయము తిరుపతి స్థానిక విచారణకర్తయగు తిరుపతి నయనారుచే నిర్వహింపబడుచు, నయనారు కపిలేశ్వర ముడైయనయ నారు ఆలయముగాఁ బేర్కొనబడెను. ఇట ప్రసక్తమయిన విషయ ములో శ్రీ స్వామివారి పేరు స్పష్టముగా 'కపిలేశ్వరస్వామి' యని పేర్కొనుట గమనార్హము. ఈ కపిలేశ్వరస్వామి పేరునకు ముందు వెనుకల 'నయనార్' అని పేర్కొనుటకు హేతువేమో తెలియదు.

'నయనారు' పదము శివునకు, 'శివభక్తుఁడైన మునికి' కూడ చెందును. కపిలమహాముని చే నర్చింపబడిన శివుఁడనియు నిట మనము ప్రసక్తము చేసి ముందుకు బోవుదము.

1563 వ సంవత్సరములోని 'సెవ్వసాని' శాసనము ప్రసక్తము చేయబడినది కదా! 200 పణములిచ్చినట్లు తెలుపబడినది కదా. అధిక వర్షపాతముచేత ప్రాకారపుగోడలు, ఆలయపు వంటశాల శిథిలముకాగా రాచవీటినాయకులు ఈరెండువందల పణములనే ఋణముగాగొని వానిని బాగుపఱపించెను. ఆలయమునకు ప్రత్యేక నిర్వహణాధికారితో పాటు ప్రత్యేకనిధులు, ఆయ, వ్యయములును చూపబడెడివని 1628 వ సంవత్సరములోని శాసనమునుబట్టి తెలియుచున్నది. ఈ శాసనదానమును కపిలేశ్వరస్వామివారికి గాక, నృత్యమంటపములోని విఘ్నేశ్వరస్వామి వారికని మనమిట ప్రత్యేకముగా గుర్తింపవలసియున్నది.

తరువాత నీ దేవాలయమును గుఱించి ఈస్టిండియా కంపెనీవారు 19వ శతాబ్దపుటాదిలో తిరుమల తిరుపతి దేవస్థానములను స్వాధీనపఱచు కొన్నప్పటినుండి మాత్రమే వినబడుచున్నది. ఈకంపెనీవారు తిరుమల తిరుపతి దేవస్థానములనెడి పద్దుక్రింద 19 పెద్దదేవాలయములను, 17 చిన్న దేవాలయములను స్వాధీనముగావించుకొనిరి. ఈకపిలేశ్వరస్వామి వారిఆలయము పెద్దఆలయములలో నమోదుచేయబడినది. ఈఆలయము నకు సాంవత్సరిక చందా సర్కారువారిది రు. 175–14–0 దీని కే యితర విధములయిన ఆదాయములు లేవు. దీని వ్యయముకూడ రు. 175–14–0 మాత్రమే. తిరుమల దేవస్థానపు ఆదాయముపై నాధార పడక కేవలము సర్కారువారిపైననే ఈఆలయమాధారపడినది. 1843వ సంవత్సరములో మహంతుకు ఈ ఆలయములన్నియు కంపెనీవారు స్వాధీనపఱచినపుడు మహంతులు సర్కారువారి చందా రు 175–14–0 రాబట్టలేక తిరుమల ఆలయము నిధులనుండియే దీనిని చెల్లించుచువచ్చిరి.

అసలు నిజమునకు కంపెనీప్రభుత్వము వారినుండి యే ఆలయమునకు రావలసిన చందానుగూడ మహంతులు వసూలు చేయజాలక పోయిరి. ఇది శ్రీ వేంకటేశ్వరస్వామివారి విషయములో కూడనని చెప్పవచ్చును.

కపిలతీర్థమందలి సంధ్యావందన మంటపము కప్పులో శ్రీకపిలేశ్వరస్వామివారి బలిపీఠము, ధ్వజస్తంభము అమరించియుండుటచే, అచ్యుతదేవరాయ మహారాజుచే ఆళ్వారుతీర్థము చుట్టును చెక్కడపురాతి మెట్లు నమర్చి, సంధ్యావందనమంటపము నిర్మాణమయిన తరువాతనే యివి నెలకొల్పబడియుండుటను సూచించుచున్నది.

ఇప్పుడు ఇది తిరుమల తిరుపతి దేవస్థానములలో నున్న పెద్ద ఆలయములలో నొకటిగానుండి, తిరుపతిలోని వారికి, యాత్రికులకు ముఖ్యముగా శైవమతానుయాయులకు వారి యభీప్సితములను నెరవేర్చుచున్నదనుటలో సందేహము లేదు.





శ్రీ కపిలేశ్వరస్వామి వారి సన్నిధి
( కిందనున్నది సంధ్యావందన మంటపం )

# తిరుపతి చరితము

**3** - వ భా గ ము



# ఆలయములు - ఆగమములు





శ్రీభూసహిత శ్రీమన్నారాయణుడు

# 12 వ అధ్యాయము

## ఆలయములు - ఆగమములు

విష్ణ్వాలయములలోని వివిధమూర్తులను భక్తుల ఇచ్ఛానుసారము ఆగమశాస్త్రములలోని విధులననుసరించి ప్రతిష్ఠనుచేయుట, ప్రతిష్ఠానంతరమా యాయాగమశాస్త్రము లాధారముగనే పూజాది నిత్యనైమిత్తిక విధులను నిర్వర్తించుట, ఏ తత్కారణముగ నా విగ్రహదాతకు, ఆలయాది నిర్మాణప్రదాతకు ఐహికాముష్మిక ఫలములు లభించునని స్మృతేతిహాసములు పలుకుచున్నవి. దాతకు శ్రీవారి మూర్తులయందేమూర్తియందమితమగు మక్కువయున్నదో, ఆ మూర్తినే ప్రతిష్ఠించును. ఎ యే రూపమున తన్ను భజించునో ఆ యా రూపములలో నా భక్తుని యనుగ్రహించుటయే గీతాచార్యుని శపథము. ఈ ఆగమసంహితలనంతములు. వైఖానసాగమమందు భృగుమహర్షి "వైఖానసం పాంచరాత్రం తథా భాగవతాభిధం" — వైష్ణవాగమములను వైఖానసము, పాంచరాత్రము, భాగవతము అని మూడు విధముల పేర్కొనిరి. ఈ అంశమే భాగవతమున ఏకాదశస్కంధమున ఇట్లున్నది. 'వైదిక స్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః.' పై జెప్పబడిన వైఖానస పాంచరాత్ర భాగవత ప్రకారములు మూడును వైదిక తాంత్రిక మిశ్రవ్యవహారము కలిగినివిగా పలుకబడినది. వైఖానస పాంచరాత్రములను భగవచ్ఛాస్త్రమని కూడ పిలుతురు. వైఖానస పాంచరాత్రాగమములు భారతదేశమంతట ప్రాజ్యప్రచారము కలిగియున్నవి భాగవతము మాత్రము మధ్యభారతమందు ఉత్తర భారతమందు మాత్రమే ప్రసిద్ధమై యున్నది కాని, వాని ప్రకృతిచే శ్రీవైఖానస పాంచరాత్రములని స్థూలముగా రెండువిభాగములు జేయనగును.

అన్ని సంహితలును ధ్రువమూర్తి, పరివారమూర్తులను చేతనే నిర్మాణప్రక్రియ నిర్వహించుటను గూర్చి పలికినవి. ఈశిల్పులు మయశిల్పము మొదలుగా గలిగిన శిల్పశాస్త్రములందు అనూచాన సాంప్రదాయ విద్యారహస్యముల నెఱింగి, వానియందు ప్రవీణులై, ఆ విగ్రహస్వరూపములను మొదటగా నంతర్గతమున నుపాసనాశక్తిచే భావన చేసి వానిని మలతురు. ఇట్టి ఈ విగ్రహములను, నిరంతర దైవారాధనా లబ్ధ మహామహిమాన్వితమగు శక్తిచే, అనవరత ఆగమశాస్త్రాధ్యయనా ధ్యాపనాదులచేఁ బండినవారు, యమనియమాద్యష్టాంగశీలురు, తపోజ్ఞాన శీలురునగు అగమశాస్త్రార్చక పండితులు ప్రతిష్ఠావిధి నెరవేర్తురు. ఏ యాగమముచే ప్రతిష్ఠావిధి నిర్వర్తింపబడినదో ఆ యాగమశాస్త్రాను సారమే అర్చనాదులను నిర్వహింప నర్చకస్వాములు నెలకొందురు.

పైన చెప్పిన విధానము మనకు సమీచీనముగా సన్నిహితముగా నెఱుంగదగినది. కాని కొన్ని ఆలయములలోని విగ్రహములు స్వయం వ్యక్తములు. కొన్ని మహర్ష్యాదులచే స్థాపితములు. కొన్ని దేవతాదు లచే ప్రతిష్ఠితములు. మరికొన్ని మానుషకార్యములు. వీనిని గురించి వైఖానసాగమశాస్త్ర ప్రవక్త భగవాన్ శ్రీవిఖనోమునీంద్రులయంతే వాసి మరీచిమహర్షులవారు తమ విమానార్చన కల్పములో నిట్లు చెప్పియున్నారు.

98 వ అధ్యాయములో

"అథాతః స్థల పంచకమ్ వక్ష్యే' : అనంతరము ఇప్పుడు స్థల పంచకము వివరించబడుచున్నది."

'స్వయంవ్యక్తం దివ్య మార్షం పౌరాణం మానుషమితి పంచ స్థానాని భగవతః కృపయానుగృహీతాని'.

భగవత్కారుణాకటాక్షముచే స్వయంవ్యక్తము, దివ్యము, ఆర్షము పౌరాణికము, మానుషము అను నైదు స్థానము లనుగ్రహింపబడినవి.

స్వయంవ్యక్తమనగా :

'యత్ర వా స్థానే భక్తానుకంపయా స్వయమేవాఽఽవిర్భవేత్ తత్స్వయంవ్యక్తం. బ్రహ్మరుద్ర ప్రముఖైః ప్రతిష్ఠితం దివ్యం. ఋషిభిః ప్రతిష్ఠితమార్షం, పురాణసిద్ధం పౌరాణం, మనుష్యైః ప్రతిష్ఠితం స్థలం మానుష మితివదన్తి'.

భక్తవాత్సల్య ప్రపూర్ణతచే ఏస్థానమునందు భగవానుఁ డాతనికై యాతఁడే స్వయముగా నావిర్భవించునో ఆ స్థలము స్వయంవ్యక్తము. బ్రహ్మరుద్రాది దేవతా ప్రముఖులచే ప్రతిష్ఠితమయినది దైవతము లేక దివ్యము. ఋషులచే నెలకొల్పబడినచో నయ్యది యార్షము. పురాణ ప్రసిద్ధమైనది పౌరాణము, మనుష్యులచే ప్రతిష్ఠాపింపఁబడినది మానుషస్థలమనియు - నీ యైదు స్థలముల విశేషమిందు తెలుపబడినది.

వీని మహచ్ఛక్తులనుగూర్చి మరీచి :

'స్వయంవ్యక్తం సర్వలోక సమృద్ధిదం, దైవికం శతయోజన పుణ్యదం, ఆర్షంపంచయోజన ఫలప్రదమ్, పౌరాణం యోజనత్రయ పుణ్యదం, మానుషంయోజనాదర్వాక్ స్థిత జనానామేవ పుణ్యదం."

'స్వయం వ్యక్తమగుస్వామి సర్వలోక సమృద్ధిని, దైవికము శతయోజన పర్యంతమును, ఆర్షము పంచయోజన పర్యంతము. పౌరాణము మూడు ఆమడల దూరమువరకు, మానుషమొక యామడ దూరమువరకుగల జనులకు సర్వసమృద్ధిని కలుగజేయునని చెప్పిరి'

'సర్వత్ర ఏతేషు వైఖానస శాస్త్రోక్తమార్గేణ నిత్యమర్చయన్తః పునరావృత్తి రహితం పరమం పదమాప్నువన్తీతి బ్రహ్మవాదినో వదన్తి' ఈ అన్నిస్థలములందునుగల మూర్తులకు వైఖానస శాస్త్ర విధానముచే నిత్యమర్చనాదులను నెఱపినచో పునరావృత్తిరహితమైన పరమపదముగాఁ జెప్పబడిన శ్రీమహావిష్ణులోకమును చేరెదరవి బ్రహ్మవిదులు చెప్పుచున్నారు.

## వైఖానస పాంచరాత్రాగమములు

ప్రధానముగా విష్ణుపూజావిధిని శాస్త్రవిధానమున, వేద ప్రమాణమును బేర్కొని చెప్పినవిరెండు ఆగమములే. అవి వైఖానసము పాంచరాత్రము. అందు వైఖానస మనేక ప్రమాణములచే నతిప్రాచీనము. వీని ప్రాచీనతను గుఱించి మనకు ప్రస్తుతము విచార్యము కాకున్నను నీ రెండు విధానములను శ్రీమన్నారాయణుడే అంగీకరించినట్లుగా భారతములో శ్రీకృష్ణుఁడే చెప్పినయుదంతమున్నది.

ఈ ఆగమములు ప్రధానముగా దేవాలయ సంబంధమగు ననేక విషయములను చర్చించినవి. కొన్ని వీనిలో ప్రత్యేకముగాఁ జర్చించినవియుగలవు. కొన్ని సంహితలు శిల్పమునే ప్రధానముగాఁ బేర్కొన్నవి. కొన్ని ఆలయభేదములను, ఆలయ వర్గీకరణమును విస్పష్టపఱచినవి. ఏ యే యాలయమునకే విగ్రహముంచదగునో దానిని విపుల పఱచినవి. కొన్ని ఉత్సవాదులను, ప్రతిష్ఠాదులను చెప్పగా, కొన్ని ప్రాయశ్చిత్త కాండనుగూర్చి పేర్కొన్నవి. కొన్ని తత్త్వశాస్త్రమును, జీవునిపరమావధియగు మోక్షము, ఆ మోక్షమార్గమునకు సులభోపాయ మర్చా విధానమనుచు సోపపత్తికముగా నిరూపించినవి. ఇది మనభారతీయ తత్త్వశాస్త్రమునకు మూలభూతము. ఆలయమందు విగ్రహారాధనయే మోక్షోపాయ భూతమని తెల్పిదానిని సమర్థించిన గ్రంథములు, మహర్షులు చెప్పినవి ఆగమశాస్త్రరూపమున ప్రభవించినవి.

## భగవదర్చనా ప్రధానతత్త్వము

బ్రహ్మ తత్త్వమును గ్రహించుట కనేకోపాయములున్నవి. అవి యన్నియు సులభసాధ్యములుగావు. కొన్ని బహుక్లేశానంతర ఫలోదయములు. విఘ్నసంబంధములు. ఇట్టివానిని కలియుగమునందు యాతాయాతక్లేశావ శిష్టుఁడగు మానవుఁడు యత్నించి ఫలోన్ముఖుఁడగుట యనునది యనూహ్యావిషయము. కలియుగములో నాతిక్లేశము, నాతి

దుస్తరము, సులభగమ్యము నగునది పూజావిధియే. భగవదారాధనయే ముక్త్యుపాయమని మహర్షులు చెప్పియున్నారు.

'విష్ణో రర్చా సర్వదేవార్చనా ఫలం లభతి'

శ్రీ మహావిష్ణువు నొక్కనియర్చించుటచే సర్వదేవతల నర్చించిన ఫలమును గలుగునని శ్రీమద్విఖనసాచార్యులువారు నుడివిరి. ఇంకను వారే తాము ప్రపంచించిన కల్పసూత్రములో

'తస్మాద్గృహే దేవాయతనే వా భక్త్యా భగవంతం
నారాయణ మర్చయేత్ తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజాయతః'

యజ్ఞలోపములను విష్ణువు నర్చించుటచే తొలగింపవచ్చును. గృహమునందుగాని ఆలయమందుగాని భక్తితో భగవంతుఁడగు నారాయణుని యర్చించినంతమాత్రమున మానవుడు విష్ణువుయొక్క పరమ ధామమును చేరుచున్నాఁడు, అని శ్రీమద్వైఖానసమహర్షులు సెలవిచ్చిరి.

ఇప్పుడాయా యుపాసనా భేదములను గ్రహింతము.

## 1. నిష్కలోపాసనము

భగవత్తత్వజ్ఞాన యోగమునుగూర్చి మునులు మరీచి మహర్షుల వారి నడిగిరి. ఆయన సంతుష్టుఁడై ఈ విధముగాఁజెప్పెను. 'జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సు లనెడు ఆరుగుణములు భగవంతుని దెల్పును. తత్త్వమనగా 'తస్యభావ స్తత్త్వం' అని చెప్పుదురు. 'తస్య' అనగా పరమాత్మ యని. పరంబ్రహ్మ యగు నారాయణమూర్తి భావమే తత్త్వశబ్దార్థము. 'నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః' అని శ్రుతియు చెప్పుచున్నది.

దీనిని, అనగా పరంబ్రహ్మ తత్వమును తెలియుటయే జ్ఞానము. తెలియబడువాడు పరమాత్మ, ఆయనజ్ఞేయము. తెలిసికొన నిచ్ఛగల

వాఁడు జీవుడు జ్ఞాతయగుచున్నాడు. శ్రుతియేజ్ఞానము. అని యీ విధముగా బ్రహ్మవేత్తలు పలుకుదురు. నారాయణతత్త్వము సకల నిష్కలములని రెండు విధములు. నిష్కలస్వభావమును ముందుగా తెలిసికొనవలసియున్నది.

నిష్కల స్వరూపము. భగవంతుని కంటె నన్యమయినదేమియు జగత్తునందులేదు. ఆతడు ఆకాశ శరీరుఁడు. లోపల, వెలుపల ఆ తత్త్వమే ప్రకాశించును. 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' దీనికి ప్రమాణముగా మరీచి మహర్షులవారు

క్షీరేసర్పి స్తిలే తైలం, పుష్పేగంధః, ఫలేరసః, కాష్ఠేఽగ్ని రివాఽన్తర్బహిశ్చ తత్సర్వ వ్యాప్యాఽకాశోపమః.

క్షీరమందు వెన్నవలెన, తిలలందు తైలమువలెను, పుష్పమందు వాసన వలెను, ఫలమందురసమువలెను, కట్టెయందు నిప్పువలెను సర్వత్ర భగవంతుడు వ్యాపించియున్నాడు. ఆకాశము లేనిచోటెట్లులేదో అట్లే తత్త్వశబ్ద వాచ్యుఁడగు భగవానుడుండనిచోటులేదు.

విశ్వవ్యాపన శీలత్వముచేత నీయన యే విష్ణువని బేర్కొన బడుచున్నాఁడు. ఈయన దృశ్యుఁడు, అదృశ్యుఁడుకూడను. అమలుఁడు, నిత్యుడు, అచిన్త్యుడు, అప్రమేయుడు నిర్గుణుడు, నిశ్చలుడు, 'నిరవయుడు. నిరాద్యన్తుడు, నిర్వికల్పుడు, నిర్ద్వంద్వుడు నిర్వచనుడు, అతీన్ద్రియుడు, సుసూక్ష్ముడు, అనిర్దేశ్యుఁడు, అసత్తు, సత్తు-యిట్టి స్వరూప రాహిత్యమైన నిష్కల స్వరూపుడు శ్రీమన్నారాయణుడని బ్రహ్మవాదులు పలుకుచున్నారు.

'అణోరణీయాన్ మహితో మహీయాన్' శ్రుతి, మహత్తులలో మహచ్ఛబ్దవాచ్యుఁడు' అణుశబ్దవాచ్యుడుకూడను. ఆ కారణముననే

ఈయన యునికినిగూర్చి

"తస్మాద్ధృదయ కమలాన్తరాకాశోపలబ్ధ వైశ్వానరశిఖాయాం త్రిగుణాత్మకో విష్ణుః పరమాత్మా తిష్ఠతి" అనిరి. అనగా ఆకారణముచేతనే హృదయ కమలాంతరమున, నాకాశోపలబ్ధమగు, వైశ్వానర శిఖాతతమగు యీసత్త్వరజస్తమో గుణాత్మ కమగు శ్రీమహావిష్ణువు నెలకొని యున్నాఁడు.

'అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః' అని గీతాచార్యుని నిర్వచనము.

'తస్యాశ్శిఖాయా మధ్యేపరమాత్మా వ్యవస్థితః సబ్రహ్మాస్సశ్శివః సోఽక్షరః' ఇది శ్రుతివాక్యము. దీనిని నిష్కల స్వరూపమందురు. ఈ రూపమును ధ్యానము చేయుటయే నిష్కలోపాసనము.

## 2. పరమాత్మయొక్క సకలస్వరూపము

పరమాత్మ నిర్గుణుఁడేగాక సగుణుఁడుకూడ నని యీ సకల స్వభావము చెప్పుచున్నది. ప్రథమస్థితి యనంతరమిది కొంత క్రిందకు దిగివచ్చినట్టిది. గుణములులేని వానికి గుణముల నారోపించుట యీ సకల స్వరూపముయొక్క లక్ష్యము. దీనిని గుఱించి మరీచి మహర్షి యిట్లు చెప్పెను:

'కాష్ఠేఽగ్నిర్మంథనాదుజ్జ్వలన్నివ నిష్కలాఽత్మకో విష్ణుర్ధ్యాన మథనేన భక్త్యా సంకల్పనాత్ సకలో భవతి'

కాష్ఠమును మంథనము చేయుటచే అగ్ని స్వరూపముకానవచ్చు నట్లుగనే భక్తుల నిరంతరధ్యాన మథనముచే, సంకల్పమాత్రముననే శ్రీమహావిష్ణువు సకల స్వభావుడగుచున్నాఁడు.

'తస్మా దగ్నేర్విస్ఫులింగా ఇవ బ్రహ్మేశానాది దేవతారూపైర్భిన్నత్వాత్సకలాల చక్రస్థమృదో ఘట శరావాది భేదా ఇవ యద్రూపః మనసా భావితం తత్త ద్రూపో భూత్వా విష్ణుః ప్రకాశతే'.

అగ్నినుండి వెడలిన విస్ఫులింగకణములవలె బ్రహ్మేశానాదులు వివిధరూపములతో విలసిల్లుదురు. కుమ్మరి చక్రముచే మట్టి వివిధ పాత్రల స్వరూపమును పొందియు 'మృత్తిక' యనెడి మూలపదార్థమే యంతట యెటు ఆవరించెనో అట్లే ఈ వివిధ స్వరూపములయ్యును విష్ణువే అంతటఁ బ్రకాశించును.

ఈ సకల బ్రహ్మమే సగుణ బ్రహ్మము. ఈ బ్రహ్మము శరీర భూతుఁడగుటయేగాక అనంత కల్యాణగుణాకరుఁడు, అవాప్తసమస్త కాముఁడు. మూలప్రకృతిరూపమగు శక్తియే యాయన శరీరము. ఈ ప్రకృతి యాయననుండి వేఱుపఱచరానిది. దీనికి స్వతంత్రమగుస్థితిలేదు ఈబ్రహ్మముతో, ఈ బ్రహ్మముకొఱకే దీని స్థితి. ఇది ఉత్తమాధమము లుగా రెండైనది. అధమ (అచేతన) ప్రకృతి పంచభూతములు, మనో బుద్ధ్యహంకారములచే నష్ట విధములు. ఈ అచేతనప్రకృతి ఉత్తమ లేక చేతన ప్రకృతితోకలియగా నేర్పడునదే జీవాత్మ. ఇట్టి బహుజీవాత్మలతో నిండినదే యీ యాశ్చర్యకరమగు బ్రహ్మాండము. సగుణబ్రహ్మశరీర మున నీ మూలప్రకృతి నల్లని మచ్చరూపమున వక్షమున నెలకొనును. అదియే శ్రీవత్సము. ఈ శ్రీవత్సముపై నెలకొనిన పద్మముపైననే లక్ష్మీనివాసము. మూలప్రకృతి కభిమానదేవత శ్రీదేవి. ఈ శ్రీదేవి విష్ణువు, విభూతి. ఈమె అనపాయిని. అనగా విష్ణువు నెడబాయ కుండునది. ఆమెలేనిది ఆయనలేడు. కనుకనే

"లక్ష్మ్యాసహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా
రక్షకస్సర్వ సిద్ధాన్తే వేదాన్తేషు చ గీయతే"

లక్ష్మీయుక్తుడైన హృషీకేశుడే రక్షకుడని సర్వసిద్ధాంతములు, వేదాన్తములు ఘోషించుచున్నవి. ఇది సగుణబ్రహ్మ స్వరూపము.

## సృష్టి స్థితి సంహారములు :

'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి, సతపోఽ తప్యత సతపస్తప్త్వా, తదేవాను ప్రావిశత్'

'యదా యదా ప్రజా స్సృజే యేతి సోఽకామయత, తదా తదా స్వాభిమతానురూపగుణ స్వశక్త్యా స్వలీల యేమం ప్రపంచం కార్య కారణభావేన యథా పూర్వం స సర్జేతి'

సర్వశక్తిసమన్వితుఁడగు నా పరంబ్రహ్మము తానే పెక్కుయ్యె దను గాక! యని యూహించి ఆ జీవులందు తానే ప్రవేశించిన వాఁడ య్యెను.

ఎప్పుడెప్పుడు జీవులకు కరచరణాద్యవయవములనిచ్చి నాటక రంగమగు లోకముననుంచ నిచ్ఛగించునో అప్పుడు తన కభిమతమగు రూపమున, గుణమున, స్వశక్తిచేఁ దన లీలావిభూతియగు నీ ప్రపంచ మును యథాపూర్వముగా కార్యకారణభావముతో నెలకొల్పుచున్నాడు

జీవసృష్టిని గూర్చి 'బ్రహ్మణా స్వేచ్ఛ యా భూతా న్యసృజ్యన్త' ఆ పరంబ్రహ్మము సర్వజీవులను సంకల్పమాత్రమున స్వేచ్ఛగా, నవ లీలగా సృజించెను ఇంకను దీని క్రమమును చెప్పుచు అచేతనప్రకృతిలో భాగమగు "ఆత్మన ఆకాశః స్సమ్భూతః ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యఃపృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో అన్నమ్, అన్నాద్భూతాని జాయన్త". పరంబ్రహ్మనుండి ఆకాశము, దానినుండి వాయువు, దానినుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి పృథివి, పృథివి నుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము అన్నము నుండి జీవులు కలుగుచున్నవి యను క్రమానుసారముగా నయిన జీవ సృష్టి పేర్కొనబడినది.

ఈ జీవులు గర్భక్లేశాదులను పొందుచు జనన మరణాదులతో నున్న జీవితవిషవలయమునందు దగుల్కొని సంసారబద్ధులై అనుప్రళయ మహాప్రళయాదులందు కొంత విశ్రాంతిబొందుచు మరల నిట్టి యవస్థనే పొందుచున్నారు. మహాప్రళయమందు ఈ జీవులన్నియు మూల ప్రకృతిలో నంతర్లీనమగును. ఈ జీవులు చేసిన పుణ్యాపాపములన్నియు

గాసితో చేరపోవును. ఆ మూలప్రకృతితో గూడి యీ సర్వజీవసంపత్తి ఆ పరబ్రహ్మగర్భమందు నిక్షిప్తముగా నుండి రక్షింపబడును ఆయనయే నారాయణుడు. వీరి స్థితియందు మార్పులేక పునః శ్రీమన్నారాయణుని యిచ్ఛామాత్రసంకల్పసృష్టి జరుగునంతవరకు నుందురు. పునఃసృష్టిలో ని జీవులు తాము చేసిన కర్మానుగుణముగా మరల లోకములో నాటక రంగమున ఆయా పాత్రధారులుగ నుందురు. విష్ణువు స్థితిపరుడు. అనగా రక్షించువాడు. భద్రతగలుగజేయువాడు. ఈ పనిలో నాయనకు క్షణము తీరికయుండదు. సృష్టి, స్థితి, సంహారము, పునఃసృష్టి-యిది అంతములేని వలయము. శ్రీమన్నారాయణుని స్వరూపమగు విష్ణువు స్థితి కారకుడు కాగా నాయన నాభికమలమునుండి జనించి బ్రహ్మ సృష్టి కారకుడయ్యెను. ఈయన మొదటగా రుద్రాదులను సృజించెను. ఇది మొదటి సృష్టి. ఇంద్రాద్యష్ట దిక్పాలకులు, నక్షత్రములు, గ్రహ ములు, వీనిని తరువాత సృజించెను ఇది రెండవసృష్టి. మిగిలిన సకల జీవులను మూడవసృష్టిలో జనింపజేసెను. ఇది బ్రహ్మసృష్టిక్రమము. అనుప్రళయములందు నాశమయిన సృష్టిని యీయనయే పునరుజ్జీవింప జేయును. మహాప్రళయానంతరము మాత్రమే మరల ప్రాథమికసృష్టి జరుగుట యనునది భారతీయ సిద్ధాంతము. పాశ్చాత్యు లీ సిద్ధాంతమును నమ్మరు. మనకు పురాణములున్నవి. ప్రసంగవశమున నీ విషయ మిట వివరింపవలసియున్నది. అవి పంచలక్షణసమన్వితములు. సృష్టి, ప్రతిసృష్టి, మనువు, మన్వంతరము, వంశానుచరితము అని ఐదు లక్షణ ములు. మొదటగా చెప్పబడినదియే ప్రథమసృష్టి. శ్రీమన్నారాయణుడు, పరంబ్రహ్మ స్వరూపము తన ఇచ్ఛామాత్రముగా చేయునట్టి సృష్టి. మనువుకాలమునకును మరియొక మనువుకాలమునకును మధ్యనున్నది అనుప్రళయము. ఈ ప్రళయమునందు గలిగెడి నష్టమును మరల పున రుజ్జీవింపచేయునది బ్రహ్మయే. నారాయణాంశతో నాయన నాభీకమలము నుండి యుద్భవించినవాడే యీ బ్రహ్మ. మనువుచరిత్రమే మనువును గురించి చెప్పునది. మనువునకు మనువునకుగల కాలము మన్వంతర

మనబడును. పూర్వరాజులగు సూర్యచంద్రవంశ సముద్భవులగు రాజ చరిత్ర వంశానుచరితము.

ఇదియే అనంతకాలస్వరూపుడు తానెయై విలసిల్లువాఁడు శ్రీ మన్నారాయణుడు కాలస్వరూపమును బేర్కొనునపు డాదినుండి వివ రింపవలసియున్నది ఒక్కొక్కకల్పమందొక్కొక్క బ్రహ్మ సృజింప బడునని ఆ బ్రహ్మలేడుగురని, కల్పములేడని హయశిరోపాఖ్యాన ములో చెప్పబడినది. అవి మానస, చాక్షుష, వాచిక, శ్రావణ, నాసిక, అండజ, పద్మజ మనెడి ఏడుజన్మలు. అట్లే కల్పములును పార్థివ, కూర్మ, ప్రళయ, అనంత, శ్వేతవరాహ, బ్రహ్మ. సావిత్రి అను నేడు నున్నవి. ఇపుడు మనకు శ్రీమన్నారాయణుని నాభీకమలమున జన్మిం చిన పద్మజుఁడు చతుర్ముఖస్వరూపముతో సృష్టికర్తృత్వమును స్వీక రించియున్నాడు. ఈ విషయము మహాభారతములోని శాంతిపర్వములో వేదవ్యాసులవారు తెలిపియుండిరి.

ఈ బ్రహ్మకుగల కాలపరిగణనమును కాలవేత్తలిట్లు నిర్ణయిం చిరి ఈ బ్రహ్మకు పూర్వపరార్థము గడచినది. అనగా నాయనకుగల నూఱుసంవత్సరముల ఆయుర్దాయములో సగము గడచినది. ద్వితీయ పరార్థములో ప్రవేశించిరి. నేబదియొకటవసంవత్సరము నడచుచున్నది. ఇందు ప్రథమమాసము, ప్రథమపక్షము, ప్రథమదినము నడచుచున్నది. ఆ మొదటిరోజులో 13ఘడియల 42 విఘడియల కాలముగడచి ద్వితీయ యామములో ప్రథమప్రాణాయామ కాలములో ప్రవేశించినారు. ఈ సమయమున నింద్రుని నామధేయము పురుహూతుఁడు. పదునలుగురు మనువులలో నార్గురుమనువుల కాలము గడచినది. వారు స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష మనువులనువారు ఇప్పుడు ఏడవమనువగు వైవస్వతమనువు జగత్తును పాలించుచున్నాడు. ఈయన కాలములో అనగా వీరి ఆయుఃకాలము 71 మహాయుగములు మహాయుగమనగా - చతుర్యుగకాలపరిమితి యొక్క మహాయుగము.

ఇది మానుషసంవత్సరములలో 43,20,000 సంవత్సరములు ఇట్టివి 71గడచిననే నా మనువుకాలము తీరును. ఈయన కాలములో 27మహా యుగములు గడచినవి. 28 వ మహాయుగములో కృత, త్రేత, ద్వాపర యుగములు గడచినవి. పంచాంగకర్తలు దానిని ప్రతిసంవత్సరము స్పృశించుచునేయున్నారు. ఈ లెక్కప్రకారము మానవసృష్టి జరిగి 192 కోట్లసంవత్సరము లయినది పాశ్చాత్యులు తమ సాంకేతిక పరిశోధనాద్వారమున దీనిని ఋజువుపఱచుకొన్నారు. కాని వారి మత గ్రంథమాధారముగా సృష్టి జరిగి 5000 సంవత్సరములే. అనంతకాల గణనమునుచేసిన భారతీయ పురాణ ధర్మమెక్కడ ఈ కాలపరిమితి ఎక్కడ! వారి కాలగణన మెక్కడ!.

ఇంకను చూడుఁడు. బ్రహ్మ నారాయణునిచే సృజింపబడినవాఁడు. ఆయనయు కాలమునకు లోబడువాఁడే శ్రీకృష్ణభగవానుఁడు గీతలో

'ఆ బ్రహ్మ భువనాల్లోకాః
పునరావర్తినోఽర్జున'

బ్రహ్మలోకముతో సహితముగా నన్నిలోకములు కాలపరిగణ నమునకు లోబడి ఉత్పత్తివినాశములకు లోనగుననియే చెప్పి.

'న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నే మాని విద్యుతోభాన్తి కుతోయమగ్నిః
............తద్ధామ పరమం మమ'

ఎక్కడ సూర్యచంద్రుల గమనములేదో, విద్యుత్తులేదో, అగ్ని అసలే యుండదో నట కాలమేలేదు. ఆ ప్రదేశమే నాది అని వైకుంఠధామ మునుగూర్చి శ్రీకృష్ణుఁడే చెప్పియున్నాడు.

ఇట్టి దానిని చేరుకొనుటయే ప్రకృత్యంశమున జనించిన జీవుని కర్తవ్యము, లక్ష్యముగూడ. అచేతనప్రకృతి సంభవమగు సత్త్వరజస్త

మోగుణ సంబంధమును వీడి చేతనప్రకృతియగు శ్రీమన్నారాయణుని శరీరసంబంధమును గల్గించుకొనుటయే జీవుల లక్ష్యము గావలెను. పరమాత్మసంసర్గము జీవాత్మ పొందుటకు గల మార్గములను గుఱించి యోచింతము.

ఈ విషయమును మరీచిమహర్షి తన విమానార్చన కల్పములో నెట్లు చెప్పియున్నాడో చూతము.

"అథ భగవత్సమారాధనం చతుర్విధం భవతి. జపహుతార్చన ధ్యానానీతి."

శ్రీమన్నారాయణుని యారాధనము నాలుగు విధములు. జపము, హోమము, అర్చనము, ధ్యానము.

జపమనగా సావిత్రీపూర్వకముగా అష్టాక్షర, ద్వాదశాక్షర మన్త్రమును విధివిధానముగా నాచార్యవర్యునిచే నుపదేశింపబడి శ్రీమన్నారాయణుని ధ్యానించి జపించుట యగును.

తత్తన్మంత్రములచే నగ్నియందు హవ్యముతో హుత మొనరించుటయే హోమమగును.

'గృహే దేవాయతనే వా వైదికేన మార్గేణ ప్రతిమాదిషు పూజయేత్త దర్చనం.'

గృహమందుగాని, దేవాలయమందుగాని ఆగమశాస్త్రవిధి విధానముచే ప్రతిష్ఠింపబడిన విగ్రహాదుల నర్చించుటయే అర్చనము.

నిష్కల సకలస్వభావ స్వరూపభేదమునెఱింగి అష్టాంగయోగ మార్గమున జీవాత్మాసమాయుక్తుడుగానున్న పరమాత్ముని ధ్యానించుటయే ధ్యానము. దీనియన్నింటిలో అందఱు మహర్షులు అంగీకరించి నిర్ధారించినట్లుగా అర్చనము సర్వశ్రేయము. అందువలననే 'తేష్వర్చనం సర్వార్థసాధనం స్యాత్' — వీనిలో నర్చనమే సర్వసమర్థము, సర్వార్థ

సాధనముకూడ నయినది. 'అర్చయన్ను భయస్సిద్ధిం మత్తో విందత్యభీప్సితం'. అర్చనం సర్వార్థసాధనమ్మను వైఖానసమహర్షి మరీచి వాక్యమున కుపపత్తిగా భాగవతమున భగవానుడు 'నన్నారాధించినవాడు ఐహికాముష్మికఫలముల రెంటిని పొందగల' డని బలపరచటమైనది. మిగిలిన మూడింటియందున్న క్లేశము, దీనియందున్న సౌలభ్యము గమనింపవచ్చును. పై మూటిలోనే విఘ్నము కలిగినను మరల యత్నము ప్రాథమికదశ చేరును. కాని అర్చనమందు ఏదైనా ఆటంకముకల్గినచో తద్దశనుండి పునఃప్రారంభమగును.

కనుక అర్చామార్గమే కలియుగములో మనకందఱకు సర్వశ్రేష్ఠమైన, సుగమమైన మార్గముగా విశ్వసింపవచ్చును.

## వ్యూహావతారములు - వ్యూహలోకములు

వేదాంతపరముగా జీవాత్మలక్ష్యముగాఁ బేర్కొనబడిన ప్రదేశము, పరమాత్మతోడియుండెడి సంసర్గము, పరమాత్మ జీవుని యనుగ్రహించు పద్ధతి యివియన్నియు నాగమశాస్త్రములో నయితము నిక్షిప్తపఱుపబడినవని యింతకుముందే తెలుపబడినవి. అందఱికంటెను ఈ విషయములో నెక్కువగా మరీచిమహర్షితన "విమానార్చన కల్పము" లో వివరించియున్నాడు.

అనేకకోటి బ్రహ్మాండముల నేకతముగావించుకొని హిరణ్యాండమావరించియుండును. అట్టి బ్రహ్మాండములలో మనదియొకటి. వీని యన్నింటికి నూర్ధ్వమున నుండునది వైష్ణవాండము. దీనియందే పరమాత్మతోనుండుముక్త, సిద్ధ, నిత్యజీవులుందురు. ఈ వైష్ణవాండము నాలుగుగా విభజింపబడియున్నది. వీని యునికి యొకదానికొకటి క్రమోన్నతము. అవి ఆమోద, ప్రమోద, సమ్మోద, వైకుంఠలోకములు. వీనినిగుఱించి వైకుంఠస్వరూప వర్ణనములో మరీచిమహర్షి యిట్లు చెప్పుచున్నాడు.

'అథాతః పరమాత్మన స్సకాశాద్ధిరణ్మయ మండమభవత్. తదన్తర్భూతానాం సర్వేషామండానా ముపరి సనాతనం నిత్యమచిన్త్యం, దేవైరపి అనభిలక్ష్యం, నిత్య ముక్తశుద్ధస్వభావపురుషైరనుభూయమానం వైష్ణవాండం. తత్రవిష్ణులో కాశ్చత్వారః ఆమోద ప్రమోద సమ్మోద వైకుంఠమిత్యేకైక స్యోపరి యథాక్రమేణ భవన్తి"

అత్యంతోపరిస్థితమగు వైకుంఠమందు -

'తస్మిన్ హేమమయ ప్రాకార చతుర్ద్వార గోపుర తోరణశతసహస్రైః కనక కమల కుసుమాదిభి రప్యలంకృతేఽమృతజలపూర్ణైశ్శత సహస్రైశ్చ సరితాం ప్రభాసమానే దివ్యలోకే సహస్రాదిత్యసంకాశం హేమమయం ద్వాదశతలైర్యుతం విమానం. నిత్యజ్ఞానక్రియైశ్వర్య బ్రహ్మాదిదేవర్షిభిః ర్దివ్యపరిజనైర్యుతం మందిరం!'

ఈ వైష్ణవ లోకములోనే శ్రీ మహావిష్ణువు మందిరమున్నది. హేమమయ ప్రాకారములు, చతుర్ద్వారశోభితములై, కనకమయము లైన పద్మములచే నలంకృతముగావింప బడియుండును దివ్యలోకము వలె నతిప్రకాశమానమై శతసహస్రానేక సరసీతటములతో నిండి యుండును. వేయి సూర్యులకాంతి ప్రభవించును. స్వర్ణమయ ద్వాదశ తల విమానములో బ్రహ్మాదిదేవతా పరివేష్టితుండై, నిత్యులగు అనంత గరుడ విష్వక్సేనాదులతోను ముక్తులగు నారదాది మునిబృందముతోను శుద్ధులైన భృగ్వాది మహర్షులతోను శ్రీ మహావిష్ణుస్వరూపుడగు శ్రీమన్నారాయణుడు నెలకొని యుండును.

ఈ పరమాత్మయే స్వసంకల్పమాత్రముచేతనే శ్రీదేవీ భూదేవీ పరివృతుడై, దివ్యభూషాంబర దివ్యాయుధములను ధరించి ఆమోద లోకమున విష్ణువుగను, ప్రమోదలోకమున మహావిష్ణువుగను, సమ్మోద లోకమున సదావిష్ణువుగను, వైకుంఠమున వ్యాపి నారాయణునిగను ఆ యా లోకములందున్న పుణ్యజీవులకు దర్శనానుభవమును గలిగిం

చును. ఇవియే శ్రీమన్నారాయణుని వ్యూహరూపములగు పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధాది రూపములు, దీనికి ప్రమాణము 'విష్ణో రంశస్తు పురుషః' అను శ్రుతివాక్యము.

మహాభారతములో నీవ్యూహావతారమును గుఱించి దైవిక మానుష భేదములచే నీ వ్యూహములు రెండు విధములని చెప్పుచు శ్రీభగవానుఁడే

'విష్ణుంచ పురుషం సత్య మచ్యుతం చ యుధిష్ఠిర
అనిరుద్ధం చ మాం ప్రాహుర్వైఖానసవిదో జనాః
అన్యేత్వేవం విజానన్తి మాం రాజన్ పాంచరాత్రికాః
వాసుదేవం చ రాజేన్ద్ర సంకర్షణ మధాఽపివా
ప్రద్యుమ్నం చానిరుద్ధంచ చతుర్మూర్తీః ప్రచక్షతే' అని

పేర్కొనెను.

ఈ వ్యూహములు దైవికవ్యూహములనియు మానుషవ్యూహము లనియు రెండువిధములు. దైవిక వ్యూహములు విష్ణు, పురుష, సత్య, అచ్యుతానిరుద్ధులు. మానుషవ్యూహములు వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు. దైవికసంబంధము వైఖానసవిదులకును, మానుష సంబంధము పాంచరాత్ర విదులకును సేవ్యమానములు. దీనికి శ్రుతిలో 'స వా ఏష పురుషః పంచధా పంచాత్మా." ఇవి అచేతన ప్రకృతియొక్క పృథివ్యాప్తేజోవాయురా కాశాదులు. సభ్యాఽహవనీయాఽన్వాహార్యగార్హపత్యావసథ్యాది పంచాగ్ని స్వరూపము. 'పంచధాఽగ్నీన్ వ్యక్రామత్ విరాట్సృష్టేతి' శ్రుతిః. ఇంకను ప్రాణోఽపానోదాన వ్యానసమానాదులగు పంచవాయువుల సమాహారస్వరూపము. వ్యష్టి స్వరూపముగూడను. పారమాత్మికోఽపనిషత్తులో 'పోహూయమానః పంచభిస్వగుణైః, ప్రసన్నైస్సర్వాని మాన్ధారాయిష్యసి' అనువాక్యానుసారము విష్ణు పురుష సత్యాఽచ్యుతానిరుద్ధులు దైవికవ్యూహములుగా నిర్ణయింపబడినవి.

ఈ పంచమూర్తులలో నాదిమూర్తి విష్ణువు. ఈమూర్తి భేదములే మిగిలిన నాలుగు మూర్తులు, అవి క్రమముగా విష్ణువు, మహావిష్ణువు,

సదావిష్ణువు, వ్యాపినారాయణమూర్తులుగా నుందురు. విష్ణువు అంశమే పురుషుడు, మహావిష్ణ్వంశమే సత్యస్వరూపుఁడు. సదా విష్ణ్వంశమే అచ్యుతస్వరూపము, వ్యాపినారాయణాంశమే అనిరుద్ధమూర్తి. వీనికి వరుసగా గుణములు ధర్మజ్ఞాన, ఐశ్వర్య వైరాగ్యములు. దీని విషయములో మరీచిమహర్షి యిట్లు చెప్పినాడు.

"పురుషః పురుషాత్మకః పరమపురుషో ధర్మ మయ ఇతి.

"సత్యస్సత్యాత్మకో జ్ఞానస్సర్వతేజోమయ ఇతి

"అచ్యుతోఽ పరిమితైశ్వర్య శ్రీపతిరితి

"అనిరుద్ధో మహా న్వైరాగ్యః సర్వ సంహారక ఇతి"

విష్ణువుతోగూడిన ఈ యైదుమూర్తులే పంచవ్యూహములు. ఇదియే పర, వ్యూహ, విభవ, అన్తర్యామి, అర్చా స్వరూపములు. ఐదును పంచ విధ వ్యూహాత్మకమగు శ్రీమన్నారాయణుని స్వరూపమును ప్రతిబింబింపఁ జేయును.

వ్యూహావతారమును గుఱించి పరిశీలించిన యనంతరము, పర, విభవ, అంతర్యామి అర్చాస్వరూపములను తెలిసికొన వలసియున్నది.

పరత్వమనగా

వైకుంఠేతు పరేలోకే శ్రియాసార్ధంజగత్పతిః
ఆస్తేవిష్ణురచిన్త్యాత్మా భక్తైర్భాగవతైస్సహ.

జగత్పతి, పితయగు శ్రీమన్నారాయణుఁడు వైకుంఠస్థానమున భక్తుల భాగవతులగూడి లక్ష్మిని విడువక పరస్వరూపమున విరాజిల్లును. అట

నాహోరాత్రిన్నభో న భూమిః నాసీత్తమోజ్యోతిః
న భూత న్నచాన్యత్ శ్రోత్రాది బుద్ధ్యానులభ్యమేకం,
ప్రాధానికం బ్రహ్మపుమాం స్తదాసీత్,

రాత్రింబవళ్లులేవు. భూమ్యాకాశములులేవు. చీకటి వెలుగులు లేవు పంచభూతాదులనలే లేవు. ఇంద్రియాదులకలభ్యమగు ప్రధాన పురుషుఁడొకఁడుండును. ఇంకను

'నిత్యైవైషాజగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ'

జగన్మాతయగు శ్రీదేవి విష్ణువును అనపాయినిగా నిత్యము విడువకయుండును. ఆ పరమందు

తద్విష్ణోః పరమంపదగ్ం సదాపశ్యన్తిసూరయః

నిత్యసూరులైన యనంత గరుడవిష్వక్సేనాదులు ఎల్లవేళల నా పరమపదనాథుని గాంతురు.

'ఏతత్సామగాయన్నాస్తే' శ్రుతి

ఎల్లప్పుడు సామగానమే వినఁబడును. ఇది భగవద్గీతలోని 'వేదానాం సామవేదోఽస్మి' యను భగవానుని వాక్యమున కుప బలకము. ఇది శ్రీమన్నారాయణుని పరావతారవిషయము.

ఇంక విభవావతారములన్ననో నవి తత్తత్కాలసన్నికృష్టైక లక్ష్యముగా గలిగినవి ఆ యా సమయములలో పరమ ప్రయోజనకర ముగా భాసింపజేసి దుష్టశిక్షణ, శిష్టరక్షణాదులను నెరవేర్చుట వీని లక్ష్యము. మానవుడు సాధింప నశక్యమైన సమయములందు భగవానుడు తానే శిష్టుల రక్షణార్థము భువిపై నవతరించి తత్తత్ప్రయోజనానుకూల్య ముతో వర్తించును. ఈ యవతారముల ప్రయోజనము రక్షోవధకు మాత్రమేగాక మర్త్యశిక్షణమునకు గూడనని చెప్పుట నిట ప్రసక్తమగు చున్నది.

"అవతారస్య ప్రయోజనం రక్షోవధాయైన కేవలం మర్త్య శిక్షణం చ"

కొన్ని యవతారములు లోకనిర్దుష్టమొనర్పుటయే ప్రయోజనముగా గలిగినవి. కొన్ని ఉభయ ప్రయోజనముల నమరించి పెట్టునవి. అవతారములు దశకము.

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథవామనః
రామో రామశ్చ రామశ్చ కృష్ణ కల్కిరితి తే దశః

ఈ అవతార విగ్రహములనే మనము దేవాలయములలో వేద మార్గోక్తముగా ప్రతిష్ఠాదుల నొనర్చి పూజించుచున్నాము.

అన్తర్యామిత్వము : 'అన్తః ప్రవిష్టః జనానాం సర్వాత్మా
జగత్సర్వం శరీరం తే తత్సర్వంవై హరిస్తనుః'

సర్వాత్మలకు సూత్రాత్మగా పరమాత్మ అన్తర్యామిత్వము నొందియుండుట.

"తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః"
"తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా ప్రతిష్ఠితః" ఇత్యాది వాక్యములు హృత్పుండరీకమందున్న పరమాత్ముని స్థానమును దెలుపును.

కఠోఽపనిషత్తులో
'అంగుష్ఠమాత్రః పురుషోన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః'

అంగుష్ఠమాత్రుఁడై పరమాత్ముడు అందఱుజీవుల హృదయము నందును నివసించియుండునని తెలుపబడినది.

ఇంకను 'అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తం పచామ్యన్నం చతుర్విధమ్'

నేను జఠరాగ్నియగు వైశ్వానరుని రూపమున ప్రాణుల శరీరము నాశ్రయించి ప్రాణాపానాది వాయువులతోగూడి, జనులు భుజించెడి భక్ష్య, భోజ్య, చోష్య లేహ్యాదులచేనుండు నాలుగు రకముల అన్నమును

పచన మొనర్చుచున్నాను. ఇది అంతర్యామిత్వము. ఇది యోగుల మాత్రమే దర్శింపగలరు.

కనుక నిన్ని పద్ధతులలోను అర్చాస్వరూపమే బహుమేలైనది శీఘ్ర ఫలదాయకము, సుగమము.

ఆలయములో నర్చనావిధాన మీ సిద్ధాంతముపై నెలకొనినది ఈవ్యూహమూర్తులును, శంకరుఁడు బ్రహ్మాదిదేవతలకు ఆలయ నిర్మాణములోను, ఆలయ పూజా నిర్వహణములోను సముచితపాత్ర మున్నది. ఆలయమును నిర్మించుటలో వీరి ప్రసక్తియుగలదు.

వీనిని గుఱించి తరువాత అధ్యాయములో నెఱుంగుదము.



# 12వ అధ్యాయము

## ఆలయములు - ఆగమములు (2)

### ఆగమానుసారముగా వివిధప్రక్రియల ఆలయములు

ఆలయ నిర్మాణములోను, తదాలయాంతర్గత బింబప్రతిష్ఠాపన విషయములోను, నిత్య, నైమిత్తిక పూజావిధాన విషయములోను, బ్రహ్మోత్సవాదుల నిర్వహణక్రమములోను ఒక క్రమానుగతమగు శాస్త్రవిధానము నీ యాగమములు రూపొందించినవి. ఆగమములను మానవుని యంతిమలక్ష్యము పాంచభౌతిక స్వరూపమగు నచేతనప్రకృతి వలయమును వీడి పునరావృత్తిరహితమగు వైకుంఠధామమునుజేరి నిత్యముక్తులచేరుటయే యనియు, దానికి భగవదారాధనమే యుత్తమ మార్గమనియు నిర్ద్వంద్వముగాఁ బ్రకటించినవి.

సంసారహేతువును గూర్చి మరీచిమహర్షి:

'అథా అయం దేహః జన్మకృత్వా భార్యామయపాశనిబంధితో భగవన్మాయయా మోహితత్వాత్ కామక్రోధలోభమదమాత్సర్య హింసాదీని కరోతి.' జీవుఁడు దేహమును స్వీకరించి జన్మనుబొంది భార్యామయ పాశనిబంధితుఁడగును. అనంతరము భగవన్మాయామోహితుడై కామ క్రోధలోభ మోహాదులచే హింసాకృత్యముల నొనర్చును.

'యోనిద్వారేణ నిష్క్రమ్య పునః పునః పాపీయసీం యోనిం ప్రాప్య, పునర్జాయమాన స్వర్గనరకఫలేషు కర్మసు ప్రవర్తతే'

ఇట్టి కృత్యముల నొనర్చి పాపజాతులందు జనించుచు, గిట్టుచు నీ సంసారచక్రములో స్వర్గనరక ఫలములను తాను గావించిన కర్మలాధారముగా ననుభవించును.

'తస్మాద్భగవన్మాయయా మోహితత్వాత్ భగవంతం నారాయణం సమాశ్రిత్య భక్త్యానారాయణ ముపాసీత'

జీవుడిట్టి నరకవేదననుభవించుచు ఎప్పుడో భగవన్మాయకు పరవశుడై నారాయణుని సమాశ్రయించి భక్తితో నాతని నారాధించును.

తత్ఫలితముగా నా భగవత్స్వరూపుడు వాత్సల్యపూరిత స్వభావుడగుటచే భక్తానుకంపముతో తన మాయావాగురను తొలఁగించును.

"తత ఆత్మా జ్ఞానం ప్రవిశతి."

ఆ యాత్మ (జీవుఁడు) జ్ఞానమార్గమును ప్రవేశించిన వాఁడగును.

ఆ తరువాత ఆశ్రమధర్మయుక్తమైన భగవదారాధనము చేయును.

'తదారాధనేన సంసారార్ణవ నిమగ్నో జీవాత్మా పరమాత్మానం నారాయణం పశ్యతి'

ఆ ఆరాధనముచే సంసారార్ణవ నిమగ్నుడయిన జీవాత్మనారాయణుని గాంచుచున్నాఁడు.

కనుక భగవత్సాక్షాత్కారమునకు సులభమార్గముగ భగవదర్చనమే సర్వశ్రేష్ఠమని నిరూపితము.

ఇఁక మనము ఆలయముల విషయములో ప్రవేశింతము గాక! ఆలయాకృతులు, ఆవరణములు ఇవియన్నియు వైష్ణవాండములోని దశలను ప్రతిబింబింపఁ జేయుచున్నవి. అనేకవిధములగు ఆలయాకృతులున్నను అవి వానివానికి సంబంధించిన విగ్రహములను ప్రతిష్ఠించి అర్చించుటకు వీలయినట్టివిగనే యుండును.

## నిట్టనిలువు ఆకృతిగల ఆలయము

జీవులు తమ తమ ఆధ్యాత్మికభావమును పెంపొందించుకొని దానిని యంతర్ముఖము గావించుకొని ముక్తులయినంత వారు ప్రవేశించు వైష్ణవాండములోని విష్ణుస్వరూపమును ప్రతిబింబించునట్టి ఆలయాకృతి ఈనిట్టనిలువు ఆకృతిగల ఆలయము. ఇట్టి ఆలయముపై నన్ని మూర్తులు

ఒకదానిపై నొకటి ఆ యా ప్రదేశములందు ప్రాతినిధ్యము వహించును. ఇట్టి ఆలయము సహజముగా ద్వాదశతలవిమానమును గల్గియుండును. ఇది వైష్ణవాండములోని వైకుంఠలోకములోని ద్వాదశతలవిమానమును స్ఫురింపజేయును. స్వర్ణవిమానము గూడ నిట్టి స్ఫూర్తిని దలపింప జేయుటకే యని నిర్ణయింపనగును. ఈ ద్వాదశతల ఆలయము ఎత్తు 125 అడుగుల వరకు నుండును. కాని చాలచోట్ల రెండు మూడు తలములకంటే నెక్కువయుండుట గాంచము. ఆగమములుకూడ వైఖానసాగమముతోసహా "యత్ర వా దృశ్యతే భేదో భగవచ్ఛాస్త్రశిల్పయోః శిల్పశాస్త్రం పరిత్యజ్య భగవచ్ఛాస్త్ర తశ్చరేత్—ఇతి వైఖానస భగవచ్ఛాస్త్ర భృగుసంహితాయాం." ఆగమశిల్పశాస్త్రములకు ఎక్కడైనను ఆలయాదినిర్మాణములలో భేదముకనుపించినచో శిల్పశాస్త్రము వదలి ఆగమశాస్త్రమే గ్రహించవలయుననినవి. ఈ విధమైన ఆలయమునకు ఏకభూమిక విమానముగా నిర్మాణము చేయుటకు, దానిలో తొమ్మిది మూర్తులను దక్షిణావృత్తముగా నెలకొల్పుటకునవి యంగీకరించినవి. దీనిలోనుండెడి అర్చాస్వరూపము వ్యూహస్వరూపములుగాని లేక విభవావతారములలో నేదో యొకటిగాని గావచ్చును. ఈ ఆలయములలో బ్రహ్మరుద్రులకు సముచితస్థానము లేదు. వీరికి మానసికపూజమాత్రము సమర్పింపబడును. ఇట్టి ఆలయము దక్షిణాదిలో మచ్చుకైనను ఒక్కటి లేదు. ఉత్తరాదిన ఈఆలయములేమైనా హిమాలయ ప్రాంతములో నిర్మాణము గావింపబడియున్నవేమో !.

## ద్విమూర్తి, త్రిమూర్తి ఆలయములు ఒకే వరుసలో

గ్రామములలో ఇష్టమగు ప్రదేశమునగాని, గ్రామము వెలుపల గాని ఒకే ఆవరణములో వరుసగా వేరు వేరు అంతరమండలములను నిర్మించి అందుత్తరమున శంకరుని, దక్షిణమున విష్ణువునులేదా తద్వ్యతిరిక్తముగను ఎదురెదురుగను ప్రతిష్ఠించి ప్రత్యేకముగా నా యా యాగ

మశాస్త్రానుసారముగా ప్రతిష్ఠాపూజాదులను నిర్వహింపవలెను. త్రిమూర్తి ఆలయమయిన సందర్భములో నొకే ప్రాకారములో వేర్వేరు అంతర్మండలములలో మధ్య విష్ణ్వాలయము, ఉభయపార్శ్వములందు బ్రహ్మ రుద్రులను లేదా మధ్య శంకరుని ఉభయపార్శ్వములందు విష్ణువు బ్రహ్మలను, ఆ యా యాగమానుసారముగా ప్రతిష్ఠించి అర్చించవలెను. దక్షిణ భారతములో నిట్టి ఆలయములు అటనట గలవు.

## ఒకటి నుండి ఏడు ఆవరణములు గలిగిన ఏకమూర్తి ఆలయము

ఇది నేటి కాలములో సర్వసామాన్యమైన నిర్మాణముగానున్నది. ఇందర్చింపబడెడి స్వామి వ్యూహమూర్తులలో నెవ్వరైనను గావచ్చును లేదా విభవావతారమూర్తులలో ప్రసిద్ధులెనను గావచ్చును. గర్భగృహములో పరివారదేవతలుగా బ్రహ్మరుద్రులు, మార్కండేయుఁడు, భృగువు ప్రతిష్ఠింపబడుదురు. వీరందరు తమ తమ లక్ష్యమార్గమందు విజయము పొందిన జీవాత్మలే. కాలక్రమమున గర్భగృహములో నుంపవలసిన బ్రహ్మరుద్రాదుల విగ్రహములను ప్రతిష్ఠించుట విరమించిరి. కాని వీరి కింతకుముందు చెప్పబడిన మానసికపూజ మాత్రము జరుగును.

## నవ - షట్పంచమూర్తి ఆలయము

దీని విషయమై మరీచి యిట్లు చెప్పినాడు : సహస్రాధికవిప్రవాసయుతమయిన గ్రామములో మధ్యగాని, గ్రామమునకు పశ్చిమమున గాని నిర్మింపనగును. ఏకతల విమానమునుగాని ద్వితల, త్రితల విమానముగా గాని నిర్మింపనగును. ఈ ఆలయవిస్తారము 9 హస్తముల చతురస్రమునుండి 61 హస్తముల చతురస్రము వరకు నుండవచ్చును. ప్రతివైపుకు రెండుహస్తముల పెంపుదల యుండవలెను. అప్పుడు లెక్కచేయగా నివి 27 ఆకృతుల ఆలయములుగా నగును. వీనిలో నే

# నవషట్పంచమూర్తి ఆలయము




1,2,3,4 చతుర్ద్వారయుతమైన ప్రధాన ప్రాకారము

ఆలయ నిర్మాణ పటము

# ఏకతాల ఏకవిమానము- నవ షట్పంచమూర్తి ఆలయము

ప్రాకారపు గోడ

జలకము

బయలు ప్రదేశము

ఐలింద్రము

ద్వారము

ఐలింద్రము

ద్వారము

బయలు ప్రదేశము

ముఖ మంటపము

బయలు ప్రదేశము

ద్వారము

1. ధ్రువమూర్తి
2. పురుష — ప్రవేశ భాగమున దక్షిణమున
3. సత్య — దక్షిణ దిశ మధ్యను
4. అచ్యుత — పశ్చిమపు మధ్యను
5. అనిరుద్ధ — ఉత్తరపు మధ్య
6. నరనారాయణ — నైరుతిదిశ
7. నారసింహ — పశ్చిమ కుడ్యపు ఉత్తరపు కొసన
8. వారాహ — ఉత్తర కుడ్యపు పశ్చిమపు కొసన
9. శయన — ప్రవేశభాగము ఉత్తర దిశన
10. కౌతుక బేరము — ధ్రువమూర్తి సమీపమున

కాలమానమైనను గ్రహింపనగును. 9 హస్తములకు తక్కువయగు విస్తారముతోగల ఆలయము నిర్మింపవచ్చును గాని, నవ, షట్, పంచ మూర్తుల కౌతుకములను గర్భగృహపుగోడలలో నుంచవలసివచ్చును. కారణము స్థలాభావమే. ఆలయవిస్తారమును నిలువుగ 9 భాగములు అడ్డముగ తొమ్మిది సమానభాగములు చేయవలెను. అప్పుడు మొత్తము 81 సమానభాగముల చతురములగును మధ్యగల తొమ్మిది సమాన చతురములు గర్భగృహవిస్తారమునకును దానిచుట్టును ఆవరించియున్న 16 గదులు గర్భగృహభిత్తికలకును (దీనినే అభ్యంతర భిత్తి యందురు). దీనికి తూర్పువైపున నొకే ద్వారముండును. ఆ తరువాత ఆవరింపబడియున్న సమచతురముల (24) గదులను ప్రదక్షిణమునకు వదలవలయును. దాని తరువాత నావరింపబడియున్న సమాన చతురముల గదులు బాహ్యాభిత్తికకు అనగా బాహ్యప్రాకారము నిర్మించుటకు వినియోగింపవలెను. ఈ బాహ్యప్రాకారములో నాలుగువైపుల మధ్యభాగమున ద్వారములుండవలెను దీనివలన గర్భగృహవిస్తారము ఎటువైపునయినను మూడుహస్తములు, అభ్యంతరభిత్తిక ఒకహస్తము, ప్రదక్షిణము ఒకహస్తము, బాహ్యాభిత్తిక ఒకహస్తము. ఈగర్భగృహ కుడ్యముపై విమానము ఒక తలమయినచో నేకతల విమానమనియు, రెండయినచో ద్వితలమనియు, మూడయినచో త్రితలమనియు చెప్పనగును.

## త్రితల నవమూర్తి ఆలయము

1 వ పటములో చూపిన విధమున మొత్తము స్థలములో మధ్యగల 25 సమచతురభాగములను గర్భగృహనిర్మాణమునకు వదలవలెను. గర్భగృహపుగోడలపయి ఏ విధమయిన మూర్తులనిర్మాణము చేయనవసరము లేక వదలవలెను. గోడలు మొదటితలము, రెండవతలము, మూడవతలము నిర్మించుటకుగాను పునాదిగోడలు బలిష్ఠముగా నిర్మించుట అవసరము. అలింద్రమునందు అనగా అభ్యంతరభిత్తికల నాను

కొని తూర్పున పురుషమూర్తిని, దక్షిణమున సత్యమూర్తిని, పశ్చిమమున అచ్యుతమూర్తిని, ఉత్తరమున అనిరుద్ధమూర్తిని నెలకొల్పవలెను. బాహ్యాభిత్తికలు నాలుగువైపులను మధ్యభాగమున జల్లెడ ఆకృతిలోగల రంధ్రములతోనుండు (నేటి సిమెంటు డిజైనులవంటివి) యమర్చవలెను. దీనివలన ముఖమంటపములనుండియే లోపలఐలింద్రములో నాలుగు వైపుల నెలకొనబడియున్న మూర్తులను గాంచనగును. ఇప్పుడు గర్భ గృహములో మధ్యభాగమున ధ్రువమూర్తిని నెలకొల్పవలెను. తూర్పు నెలకొల్పుట ముఖ్యము. ఐలింద్రమునందే అనగా గర్భగృహముగోడ ముఖమైనానుకొని దక్షిణకుడ్యపు పశ్చిమపుకొనన నరనారాయణులను, పశ్చిమకుడ్యపు ఉత్తరకొనన నృసింహమూర్తిని, ఉత్తరకుడ్యపు పశ్చిమపుకొనన వారాహమూర్తిని, ప్రాగ్ద్వారపు ఉత్తరపుకొనన శేష శయన భోగమూర్తిని నెలకొల్పవలెను. అన్ని మూర్తులును బహిర్ముఖ ములుగానే యుండవలయును.

త్రితల ఆలయము ఆరుమూర్తులకే అయ్యేనేని నరనారాయణులను నృసింహానివారాహమూర్తిని నెలకొల్పుట విరమించవలెను. మిగిలిన వన్నియు సమానమే.

## ఏకతల, ఏకమూర్తి ఆలయము

ఇవి నేడు మనకు సామాన్యముగా దర్శనమిచ్చెడి ఆలయములు. చెక్కడపు రాతికట్టడముల నిర్మాణము ప్రారంభమయిన నాటినుండి యివియే సామాన్యముగా ఆలయనిర్మాణ విధానములో ననుసరింపబడె డివి. ఈ ఏకతల ఏకమూర్తి ఆలయము ధ్రువమూర్తి కౌతుకబేరార్చ నమునకునుగూడ వినియోగార్హమైనది. ఈ ప్రక్క చిత్రమును చూచిన ఈ విషయము సుస్పష్టమగును.

ఇందు 1 వదిఅగు గర్భగృహము 2 వదియగు ముఖమంటపము ఈ రెండును ఒకదానినొకటి యనుసంధించుకొని ఒకే కప్పుక్రిందనుండు

రెండు విడి భాగములు. విమానముగర్భగృహమును మాత్రమే యనుస రించును అనగా గర్భగృహము ప్రాకారముపైననే విమాననిర్మాణము జరుగును. ముఖమంటపముపై డాబావలెనుండి దానిపై యెట్టి పైకప్పు లేకయుండును. గర్భగృహము వెడల్పుతో సమానమయిన వెడల్పు ముఖమంటపమున కుండును. పౌడవుమాత్రము విమానము ప్రారం భములోనున్న పౌడవుకొలతకు సమానముగా నుండును. గర్భగృహ ములోని మూర్తి స్థానకముగాని ఆసనముగానియయినచో గర్భగృహము చతురముగా నుండవలయును. 9 హస్తముల చతురము గలిగిన ఏక తల, ఏకమూర్తి ఆలయమునకు గర్భగృహము $\frac{1}{9}$ వ భాగము లేక విమానపుగోడల ప్రారంభవిస్తారములో $\frac{9}{25}$ వ భాగముగా నుండును. గర్భగృహప్రాకార గోడలచుట్టును కొద్దిపాటిస్థలము ముందరిభాగము తప్ప మిగిలిన మూడువైపుల నెట్టి కప్పులేక వదలివేయబడును. ఇది అంతరాలమగును. గర్భగృహము, దాని ననుసంధించుకొనియున్న ముఖమంటపమును ఈ వివిక్తస్థలము మిగిలిన ఆలయభాగమునుండి వేరుచేయును. ఈ వేరుచేయబడిన స్థలమును అంతర్మండలమని యం దురు. ఇది నవషట్పంచమూర్తి ఆలయములోని ఐలింద్రముబోలినట్టిది. ఈ అంతర్మండలము నంటి యొక నడవ లోపలిభాగమున స్తంభముల తోను బాహ్యమునకు గోడలతోనునిర్మింపబడి యొక నడవవలెనుండును ఇది తూర్పువైపునగాక మిగిలిన మూడువైపుల నావరింపబడును. ఈ అంతర్మండలమునకు తూర్పుభాగము ననుసంధించుకొని అర్ధమంటపము లేక స్నపనమంటపము నిర్మింపనగును. దీనిని 'వేసర' మనియు నాగమపరిభాషలో బిలుతురు. అంతరాలముక్రింద నేలభాగమున మూడు వైపుల ఆలయములో వాడబడిన నీరుగాని లేక వర్షపునీరుగాని పోవుటకు నొక రాతితో నిర్మింపబడిన కాలువయుండును. గర్భగృహమునుండి యుత్తరపువైపు గోడకుగల గోముఖమనెడి యొక రంధ్రమునుండి నీరు వెలువడి ఈ కాలువలో ప్రవేశించును. ఇట రంధ్రమునకు గోముఖా కృతి చెక్కబడుటచేత దీనిని గోముఖమని పిలుచుట కద్దు. ఈమొత్తము

వినియోగపడిచిన నీరు ఈ కాలువద్వారా పుష్కరిణిలో ప్రవేశించుటకు వీలుకల్పింపబడును. ఇది సామాన్యముగా ఆలయపు ఉత్తరదిశను నెల కొనియుండుటచే నిట్లు జరుగుట సహజము. గర్భగృహముగోడలకును అంతర్మండలము నడవకప్పున్నకును ఎట్టి సంబంధము నుండదు.

గర్భగృహమునకు, ముఖమంటపమునకు, అంతర్మండలమునకు ద్వారములు తూర్పువైపుననే యుండును. ఈయువి తూర్పుభాగమున మధ్యస్థముగా నెలకొనియుండును. అంతర్మండలమునకు తూర్పుగా ననుసంధింపబడిన మంటపములో ఉత్సవాదుల సందర్భమున స్వామి వారి ఆస్థానోత్సవములు జరుగనగును. ఈ అర్ధమంటపము చుట్టును బహిరంగముగానుండి 16, 32, 64 స్తంభములలో నేదోయొక నిర్మాణ ప్రక్రియ ననుసరించియుండును.

వేదమూర్తియగు గరుత్మంతుని స్థానము ఈ ఆస్థానమంటపము లోని తూర్పువైపున మధ్యభాగము. ఈ గరుత్మంతుని స్థానమునకు తూర్పున అనగా నీయన వెనుకనే ధ్వజస్తంభము బలిపీఠముల స్థాన ముండును. అంతర్మండలమును మొదటి ఆవరణమని, మొదటి ప్రాకా రపు గోడలనియుగూడ పిలిచెదరు. అంతర్మండలము చుట్టును ఆస్థాన మంటపమునంటి దీర్ఘచతురస్రాకృతిలో నొక విశాలమగు బయలుం డును. దీనినే రెండవ ఆవరణము అని అందురు. ఈ ఆవరణమునంటి పెద్ద రాతిగోడలుండును. దీనిని రెండవ ప్రాకార కుడ్యములనియు, రెండవఆవరణము గోడలనియు నందురు. తూర్పువైపుగోడకుమధ్యగా నొక పెద్దద్వారము స్వామివారి కభిముఖముగా నుండును. ఇటనే ఈ ద్వారము గోపురావృతమై యుండును. దీనిని ముఖద్వారమందురు. అన్ని దేవాలయములు వీనితో సంతృప్తి వహించును. కాని మరికొన్ని పెద్ద ఆలయములకు వీనినంటి మరియొక ఆవరణము, ఆవరణమునకు మరల పెద్ద ప్రాకారపుగోడలు మరల తూర్పువైపున నొక పెద్ద ముఖ

ద్వారము గోపురసమన్వితమై నిర్మింపబడును. ఇది మూడు ఆవరణ ములు గలిగిన ఆలయముగా నెన్నవచ్చును.

ఈ మూడు ఆవరణములు నిత్యపూజావిధానములో ప్రముఖ పాత్ర వహించును. ఆ యా ఆవరణ దేవతలు వారి వారికి నియమింప బడిన స్థానములలో నెలకొనియుందురు పూర్వమెన్నడో ఈ ప్రదేశము లన్నియు విగ్రహములచే నెలకొనబడియున్నను నేడిది సంప్రదాయముగా గానవచ్చుట లేదు.

మరీచి విమానార్చన కల్పమాధారముగా ఆవరణదేవతల చిత్ర పటము విడిగానున్నది వివరముగా పొందుపఱచిన దానిని చూడనగును.

## ప్రాచీన ఏకతల ఏక విమాన నవషట్పంచమూర్తి ఆలయమునకు నేడు వాడుకలోనున్న ఏకతల ఏకమూర్తి ఆలయమునకుగల భేదములు :

1. నేడు వాడుకలోనున్న ఆలయపు అంతర్మండలము ప్రాచీనపు ఆలయపు ఐలింద్రముకంటె నెక్కుడు విస్తారము గలిగి యున్నది. ఐలింద్రము గర్భగృహములో నొక భాగముగనే చెప్పబడినది. కాని నేటి అంతర్మండలము గర్భగృహముతో విడదీయబడి గర్భగృహపు గోడలకును అంతర్మండలమునకును నే విధమయిన సంబంధములేకుండ చేయబడినది. ఐలింద్రము గూడ నాటి విమానమున కనుసంధింపబడెడిది. కాని గర్భ గృహమువరకే నేటి విమానపు కట్టడము జరుగుచున్నది.

2. ఆలయమున కుండెడి ఐలింద్రభాగము తరువాత ముఖమంటప ముండెడిది. కాని నేటి కట్టడములలో గర్భగృహమున కను సంధించి ముఖమంటప ముండుట, అంతర్మండల మీ ముఖ మంటపము ననుసంధించి యుండుట ప్రత్యేకతలు.

3. ప్రాచీన పద్ధతి ఆలయములో ఐలింద్రముచుట్టును నవమూర్తులు వానివాని స్థానములలో నెలకొల్పబడెడివి. నేటి ఆలయపు అంతర్మండలములోననే విగ్రహములు నెలకొల్పబడక ఖాళీ ప్రదేశముగా గానవచ్చుచున్నది. అంతర్మండలము ఉత్తర దిశను మాత్రము విమానమునకు సమీపముగా విష్వక్సేనుని ప్రతిష్ఠించుచున్నారు. ప్రాచీన ఆలయములో విష్వక్సేనునకు ఐలింద్రములో స్థానములేదు. వైఖానసాగమములో మరీచి చిత్తరువులకనుమతి నొసంగియున్నాడు. కాని నేడిది అమలులో నున్నట్లు కానము.

4. ఐలింద్రములోనున్న వ్యూహమూర్తులకు నిత్యార్చనము గలదు. కాని నేడు అమలులోనున్న విధానమున ధ్రువమూర్తికి సమర్పింపబడెడి పుష్పన్యాసముతోనే ఈ వ్యవహారము సరిపెట్టబడుచున్నది. వ్యూహమూర్తి నామమును పఠించి తత్పుష్పమును ధ్రువమూర్తి పాదములనుంచుటయే యీ విధానము.

5. ఇప్పుడు అమలులేకున్నను, ఆధునికమయిన ఆలయములో గర్భగృహములోనే శంకరునకు బ్రహ్మకు స్థానములున్నవి. వాని విగ్రహముల స్థాపనమునకు నవకాశమున్నది. గరుత్మంతునకును, విష్వక్సేనునకును వారివారి స్థానములు నియమింపబడినవి. ప్రాచీన పద్ధతి ఆలయములో నీ విగ్రహములకు స్థానములేదు. ప్రాచీన పద్ధతి ఆలయములో సప్తావరణములున్న ఆలయమును గుఱించి పేర్కొనలేదు. ద్వాదశతల ఆలయము—నిట్టనిలువుగానున్న పద్ధతిలో నిర్మాణము గావింపబడు ఆలయమును గూర్చిమాత్రము, వాని తలములలోనుండు పరివార దేవతలను గుఱించి పేర్కొనబడినది.

ఈ భేదములిట్లున్నను ప్రాచీన, నవీనపద్ధతి ఆలయములలో నొక ముఖ్యమైన విశేషము కలదు. పాతపద్ధతిలో ధ్రువమూర్తిని దర్శించవలెనన్న భక్తులు ఐలింద్రము వెలుపలనున్న ముఖమంటపములో ధ్రువమూర్తికి దూరముగా నుండియే దర్శించవలెను. ఐలింద్రములోనున్న వ్యూహమూర్తులను తొలగించి ముఖమంటపమును ముందుకు నడపినచో భక్తులకు ధ్రువమూర్తిదర్శనము మిక్కిలి సమీపముగా కలుగును. ఈకారణముచే ప్రాచీన పద్ధతికిది యొక సర్దుబాటు పరిణామముగా మనము నిర్ణయింపవచ్చును.



# 12 వ అధ్యాయము

## 3 వ భాగము.

## గర్భాగారము, విమానము—పరివార దేవతలు

### (1) గర్భగృహపాద విన్యాసము

గర్భాగార విస్తారమును మొదట నిర్ణయించుకొని ఆ తరువాత దానిని నాలుగు భాగములుగా విభజించవలెను. ఈ విభజన క్రమమును ఆగమశాస్త్రము చెప్పినది. ధ్రువబేర మొక్కటే ప్రతిష్ఠింపవలెనన్నచో నొక పద్ధతి, ధ్రువబేరము కౌతుక బేరముతోకూడి ప్రతిష్ఠింపవలెనన్నచో మరియొక పద్ధతి ననుసరింపవలెనని ఆగమశాస్త్రములు పేర్కొన్నవి. మధ్యభాగము బ్రాహ్మ్యమనియు దాని నావరించినది దైవికమనియు, దాని తరువాత ఆవరణము మానుషమనియు, తుట్టతుది ఆవరణము పైశాచమనియు ఆగమశాస్త్రము విధించిన పేళ్లు.

మరీచి విమానార్చన కల్పమందు ఈ గర్భాగార పదవిన్యాసమును గూర్చి వివరించియున్నాడు. ధ్రువమూర్తి కౌతుకమూర్తి రెండునుగల ఆలయముగా నిర్మాణమయిన కౌతుకమూర్తిని బ్రాహ్మ్య భాగములోను, దైవభాగములో ధ్రువమూర్తిని ప్రతిష్ఠింపవలెను. కౌతుక మూర్తిలేని ఆలయము నిర్మాణమున కెంచినచో ధ్రువమూర్తిని బ్రాహ్మ్య స్థానమందు ప్రతిష్ఠింపవలెను.

మరీచికల్పములో

"అథగర్భాగార పదవిన్యాస విధింవక్ష్యే."

ప్రాగగ్రై రుత్తరాగ్రైశ్చసూత్రై షట్పంచాశద్ద్విశతభాగం చ విభజ్య తన్మధ్యే షోడశభాగం బ్రాహ్మం తత్పరితశ్చతురధి కాశీతిభాగం దైవికం, తత్పరిత షణ్ణవతిభాగం మానుషం, తద్బహిష్షష్ఠిభాగం పైశాచం

# గర్భాగార పద విన్యాస పటము - 1

కౌతుకముతో కూడిన
ధ్రువమూర్తి స్థాపనమునకు



భవతి. తన్మధ్యే బ్రాహ్మే కౌతుకపీఠం. దైవికభాగం త్రిధాకృత్వా తస్యోప
పరభాగే తన్మధ్యే వా స్థానకం దేవమానుషయోరన్తరే చాసనం కించి
ద్దైవికమాశ్రిత్య మానుషాంశే శయనం స్థాపయేత్.

ధ్రువార్చాచేద్గర్భాగారం సప్త సప్త విభాగం కృత్వా తన్మధ్యే
చైక పదం బ్రాహ్మం, తత్పరితశ్చాష్టభాగం దైవికం, తద్బాహ్యేషోడశ
భాగం మానుషం, తద్బహిశ్చతుర్వింశతిభాగం పైశాచం భవతి.

బ్రహ్మస్థానే స్థాపయేచ్ఛాన్తికం, దైవికేపౌష్టికం, దేవమానుష
యోర్మధ్యే జయదమేవం ధ్రువార్చాస్థాపయేత్.

(విమానార్చనకల్పమ్. పేజీ. 61.)

## ధ్రువమూర్తి కౌతుకమూర్తి రెండును గర్భాలయములో ప్రతిష్ఠింపవలెనన్నచో

గర్భాగార విస్తారమును 256 సమభాగములు చేయవలెను. ఆ విస్తారమును 16 నిలువుభాగములుగను 16 అడ్డభాగములుగను చేసినచో 256 సమచతురభాగములు వచ్చును. మధ్యగల 16సమచతురభాగముల విస్తారము బ్రాహ్మ్యము. బ్రాహ్మ్యము నావరించియున్న 86 సమచతురభాగములున్న విస్తారము దైవికము. దానినంటియున్న 96 సమచతురభాగములు మానుషము. దీని నావరించియున్న చివరి 60 సమచతురభాగములు పైశాచభాగము.

బ్రాహ్మ్యభాగము లేక బ్రహ్మస్థానములో కౌతుకమును మధ్య ప్రతిష్ఠింపవలెను. దీని నావరించిన దైవికస్థానములో ధ్రువమూర్తిని ప్రతిష్ఠింపవలెను. ఈ భాగమును మూడుసమభాగములుగా చేయవలెను. ఈ భాగములు అడ్డముగా చేయవలెను. ధ్రువమూర్తి స్థానకమయినచో ఈ భాగములలోని చివరిభాగములో నుండును. ఆసనమయినచో మూడవభాగమునుండి కొంత మానుషభాగమును ఆవరించియుండును.

శయనధ్రువమూర్తియగుచో చివరి దైవికభాగముతోబాటు ఎక్కువ మానుషభాగము నావరించి ప్రతిష్ఠింపవలసియుండును.

## కౌతుకమూర్తి లేక కేవలము ధ్రువమూర్తి మాత్రమే ప్రతిష్ఠింపవలసిన గర్భగృహమైనచో

ఇందు ధ్రువమూర్తి బ్రహ్మస్థానమందుండును. గర్భాగారమును అడ్డముగను నిలువుగను ఏడు సమభాగములు చేయవలెను. అందులో మధ్యభాగము బ్రహ్మస్థానము. దీనియందే ధ్రువమూర్తి ప్రతిష్ఠింపబడును. ఈ బ్రహ్మస్థానము నావరించియున్న ఎనిమిది సమ చతురములు దైవికస్థానము. దీని నావరించియున్న 16 సమచతురముల విస్తారము మానుషస్థానము. దీనిని ఆవరించిన బాహ్యసమచతురములు పైశాచస్థానము. ధ్రువమూర్తిస్థానకమయినచో బ్రహ్మస్థానమునందును, ఆసనమయినచో కొంత దైవికస్థానములోను, శయనమయినచో కొంత మానుషస్థానములోను ప్రతిష్ఠింపబడవలెను.

ధ్రువకౌతుకమూర్తులతోపాటు ఇతర విగ్రహములను గర్భగృహములో స్థాపింపవలెను. ధ్రువమూర్తికి దక్షిణమున బ్రహ్మయును వామపార్శ్వమున రుద్రుడును ప్రతిష్ఠింపబడవలెను. బ్రహ్మ మానుషస్థానమందును, రుద్రుడు కొంత మానుష పైశాచస్థానమధ్యమందును నెలకొనును. కేవలము ధ్రువమూర్తిమాత్రమే ప్రతిష్ఠింపబడుచో నాధ్రువమూర్తి ఆ విమానమును భేదమునను సరించి ప్రతిష్ఠింపనగును. శాంతికవిమానమయినచో ధ్రువమూర్తిని బ్రహ్మస్థానమున స్థాపింపవలెను. పౌష్టికవిమానమయినయెడల ధ్రువమూర్తిని దైవికస్థానములో స్థాపింపవలెను. జయదవిమానమయినచో ధ్రువమూర్తిని దైవమానుషమధ్యస్థానములో స్థాపింపవలెను. పౌష్టికవిమానముగాని జయదవిమానముగాని యున్న ఆలయమున బ్రహ్మస్థానము వట్టిదిగానుండును. ఈ విధమయిన ఆలయములో కౌతుకబేరమునకు స్థానము

# గర్భాగార పద విన్యాసము - 2

## ధ్రువ బేర మొక్కటియె గల గర్భాలయ విధానము



లేదు. మనము ముఖ్యముగా తెలిసికొనవలసినది యేమన ఆలయమున, కౌతుకమూర్తి ప్రతిష్ఠాపనము ప్రధానమైన విషయము గాదనుటయే.

విమానభేదములనుగూర్చి మరీచి యిట్లు చెప్పినాడు :

విమానవిస్తారము గర్భగృహపు విస్తృతి ననుసరించి సమున్నతిని బొందును. 17 హస్తముల పొడవున్నచో నది శాన్తికమునకు సంబంధించిన విమానము. దీనిలో సగముకంటె నెక్కువ పొడవుగల్గినచో నది పౌష్టికము. దీనికంటే తక్కువగానున్నది జయదము. పాదద్విగుణ మయిన యెడల నది యద్భుతవిమానము. త్రిపాదములున్నచో నది సార్వకామిక విమానమని చెప్పబడినది. విమానపాదాది స్థూపికాన్తము వరకు చతురస్రముగా నడచినచో నది నాగరవిమానము. ఈ విమానము శ్రీశైలమల్లికార్జునస్వామివారి ఆలయమునకు లక్షణము. అదే విధముగా వృత్తమయినచో నది వేసరమగును. అట్లుగాక ప్రస్తరాన్తము చతురస్రముగా నుండి దానిపై వృత్తగ్రీవముండి తద్గ్రీవముపై శిఖరమున్నచో నదియు వేసరవిమానమే. ఇది శ్రీ వేంకటేశ్వరస్వామివారి విమానమునకు లక్షణము. కంఠము మొదలు అష్టాశ్రమైన యాకృతి స్థూపికాన్తము వరకునున్న విమానము ద్రావిడమని యందురు. దీనినే ప్రకీర్ణాధికారములో

'త్రివిధంతు సమాఖ్యాతం ప్రాసాదాకృతయ స్తథా
నాగరం ద్రావిడంచేతి వేసరం చ త్రిధా భవేత్. 17
స్థూప్యన్తం చతురశ్రం స్యాత్ నాగరం సముదాహృతమ్
కంఠప్రభృతి చాష్టాశ్రం ప్రాసాదం ద్రావిడం భవేత్. 18
కంఠప్రభృతి వృత్తంయద్వేసరం తత్ప్రతిచక్షతే
బేరం పూర్వస్థితో యత్ర తత్ర బేరవశాద్భవేత్.' 19

('ప్రకీర్ణాధికారం పేజీ 17')

ధ్రువబేరమునకు సంబంధించిన బ్రాహ్మ్య, దైవిక, మానుష, పైశాచిక భాగములనుగురించి కొంత వివరింపవలసియున్నది. వేదాంత

శాస్త్రములో భగవంతుడు సత్వరజస్తమోగుణాతీతుడయ్యు ఆ గుణములలో లీనమయియుండువాడు. అనగా వానిని లీలామాత్రముగా భావించువాడని తాత్పర్యము. మొదట సృష్టిలో దేవతలు సత్వగుణ సంపూర్ణులుగా సృజింపబడిరి. దైవికభాగము ఈ విషయమును వివరించును. బ్రహ్మ తన మధ్యభాగమగు రజోగుణమునుండి రజోగుణ ప్రవర్తకులగు మానవులను సృజించెను. గర్భగృహములోని మానుష భాగము ఈ విషయమును ప్రతిబింబింపజేయును. కనుకనే ఈ భాగములో మానుషాంశలో జన్మించి ఉత్తమ జీవితమును గడిపి దైవాంశనుజేరిన మూర్తులను ప్రతిష్ఠించుట జరుగును. జీవాత్మలలో నుత్తమోత్తమ జీవియైనబ్రహ్మ యీ భాగములోనే తనస్థానమును పొందును. బ్రహ్మ తన యధోభాగమునుండి రాక్షసులను, పిశాచములను సృజించెను. వీరు తమోగుణ ప్రకృతికి చెందినవారు. బ్రహ్మ రజోగుణపరిపూర్ణ డగుటలో నీయన మానుషభాగ మాక్రమించగా తీవ్ర తపోనిష్ఠచేతను ఉత్తమ భక్తిమార్గము ననుసరించియు భగవంతుని చేరిన సనకసనందనాదులు, భృగు మార్కండేయులు, నవబ్రహ్మలు వీరు ధ్రువమూర్తికి సమీపమందలి దైవికభాగములో వీరు ప్రతిష్ఠింపబడుదురు.

## ధ్రువమూర్తి

మహావిష్ణువున కుండవలసిన లక్షణములను దప్పించి బింబమునకు ఆకృతినగాని, నామమునగాని మరే విధమయిన ప్రత్యేకతయు నుండవలపిన యవసరములేదు. అవతారబింబములకు మాత్రమాయా యవతారలక్షణ సమన్వితమగు ధ్రువమూర్తుల నిర్మాణము జరుగును. సహజముగా నాంధ్రదేశములో గాని, తమిళదేశములో గాని అవతార మూర్తులను దప్పించి మిగిలిన విష్ణుమూర్తుల నా గ్రామనామముతో ననుసంధించి పేర్కొందురు. ఈ మూర్తుల లక్షణమును గుఱించి మరీచి మహర్షులవారు వివరముగాఁ జర్చించియున్నారు. అర్చనార్థమగు ధ్రువ

బింబలక్షణములును పేర్కొనిరి. వర్ణవిషయములో కృతయుగమునందయిన శ్వేతమూర్తి, త్రేతలో స్వర్ణమూర్తి, ద్వాపరములో రక్తవర్ణమూర్తి కలియుగములో శ్యామమూర్తియని పేర్కొనినాడు. అన్నియుగములందు శ్యామవర్ణము ప్రత్యేకముగా నంగీకరింపదగునని నిర్ణయించిరి. ఈ వర్ణముతోబాటు వాహనము, (ధ్వజము), నామనక్షత్రము, పత్ని, బీజాక్షరము, శబ్దము మొదలగునవి ప్రతిమూర్తికి వేఱ్వేరుగానుండును. ఈ కారణముచేతనే విష్ణువు శ్యామవర్ణుఁడు, పీతాంబరధరుఁడు, కిరీట, కేయూర, హార, ప్రలంబయజ్ఞోపవీత, శ్రీవత్సాంకచతుర్భుజయుతుఁడు, శంఖచక్రధరుడు, అభయకట్యవలంబితహస్తుడు అకారబీజసంయుక్తుఁడు, పంచశబ్దమాత్రుఁడు, దక్షిణ వామపార్శ్వములందు శ్రీభూమీసహితుఁడుగా శ్రీమహావిష్ణుమూర్తి లక్షణములమరీచి పేర్కొనినాడు. ఇతర దివ్యాయుధములు, దివ్యాభరణములు ఆయా బింబము ననుసరించియుండును. కొన్ని సందర్భములందు శంఖచక్రములుకూడ విడిచియుండుట, శ్రీదేవీయుతుడు కాకుండుటయునుండును. ప్రలంబసూత్రము, కటిసూత్రము, శ్రీవత్సము తప్పనిసరిగా స్వామి నలకరించియుండును.

ఈ ధ్రువబేరములు ఆగమశాస్త్రాను సారముగా వివిధ స్థితులను పొంది యుండును. వైఖానసాగమములో నీ స్థితులు స్థానక, ఆసన, శయనభేదములచే మూడు చెప్పబడినవి.

మరీచిమహర్షి యిట్లు చెప్పుచున్నాడు:

అథ ధ్రువబేరవిధిం వక్ష్యే: తత్త్రివిధం, స్థానకమాసనం శయనంచేతి. పునస్తదేకైకం చతుర్విధం స్యాత్. యోగం వీరం భోగమాభిచారికంచేతి. యోగార్థీయోగమార్గం, భోగార్థీభోగం, వీర్యార్థీవీరమార్గం శత్రుజయార్థీచాభిచారికం కారయేత్. గ్రామాద్బాహ్యే వివిక్తేదేశే నదీతీరే, తత్సంగమే, పర్వతే, వనే, వనపార్శ్వే యోగస్థానకం, గ్రామాన్తరే

భోగస్థానకం తస్మిన్ద్వాహ్యేవా వీరస్థానకం, వనగిరి జలదుర్గే రాష్ట్రాన్తే శత్రుదిజ్ముఖే చాభిచారికం భవతి.

అనంతరము ధ్రువబేరవిధినిగుఱించి చెప్పుచున్నాడు.

అది మూడువిధములు. స్థానకము, ఆసనము, శయనములు, ఇవి మరల ప్రత్యేకముగా నొక్కొక్కటి యోగ, భోగ, వీర, అభి చారిక భేదములచే నాలుగు విధములు. మరీచి మాత్ర మీ విధముగా చెప్పినాడు. భృగువును, అత్రియున్ను తమతమ గ్రంథములలో అభి చారిక మూర్తికాక 'విరహమూర్తి' యని మరియొక ప్రత్యేకమూర్తిని బేర్కొనిరి. "శ్రీభూమిభ్యాం మునిభ్యాం చ రహితం విరహం విదుః, 'రహితం శంఖచక్రాభ్యాం కేవలం దేవమేవ వా" శ్రీ భూదేవులు ఇరు పార్శ్వములందు లేకుండగను పార్శ్వములందు మునులును, బాహువు లందు శంఖచక్రములు లేకుండగను ఉన్నట్టి మూర్తి విరహస్థానక మూర్తియని పిలువబడును." అని అత్రియున్ను, యోగము నిచ్ఛ గించు యజమాని యోగమూర్తిని, వీర్యార్థి వీరమార్గమును జూపెడి వీరమూర్తిని, భోగేచ్ఛగలవాడు భోగమూర్తిని, శత్రు విజయోత్సాహి, లేక శత్రుభయోత్పాతము నొందువాఁడు అభిచారికమూర్తిని ప్రతిష్ఠింప వలెను. గ్రామ బాహ్యమునగాని, రహస్య ప్రదేశమందుగాని నదితీర, సంగమములందుగాని, పర్వత, వన, వనపార్శ్వములందు యోగ మూర్తిని, గ్రామమధ్యమందు భోగస్థానకమూర్తి, గ్రామమునందుగాని, గ్రామబాహ్య ప్రదేశమునందుగాని వీరస్థానకమును, వన గిరి జల దుర్గము లందు రాష్ట్రసరిహద్దులలోను, శత్రువున కభిముఖముగను అభిచారిక మూర్తిని ప్రతిష్ఠింపవలెను.

## యోగ భోగ వీర అభిచారికమూర్తుల ప్రత్యేకలక్షణములు

1 మూర్తియొక్క వర్ణము:

యోగ, భోగ, స్థానకమూర్తులకు, భోగాసన భోగశయన

మూర్తులకు, వీరస్థానక వీరశయనములకు వర్ణము శ్యామవర్ణముండవలెను. యోగశయనమూర్తి పీతశ్యాముడై యుండవలెను. యోగాసన మూర్తికి, శ్వేతవర్ణము, వీరాసనమూర్తికి ప్రవాళవర్ణము, ఆభిచారిక స్థానక మూర్తికి ధూమవర్ణము, ఆభిచారికాసనశయన మూర్తులకు నీలవర్ణ ముండవలెను.

2. హస్తసంఖ్య:

యోగస్థానక, యోగాసన, భోగస్థానక, భోగాసన, భోగశయన, వీరస్థానక, వీరశయన, ఆభిచారిక స్థానకమూర్తులు చతుర్హస్తసమన్వితులు. యోగశయన, ఆభిచారికాసన, శయనమూర్తులు ద్విహస్తమాత్రులు,

3. శ్రీదేవీ భూదేవులు:

యోగస్థానక, యోగాసన, యోగశయన వీరస్థానకము, ఆభిచారికములోని మూడుదశలలోను శ్రీభూదేవులుండరు. భోగస్థానకాసనశయనములలోను వీరశయన ఆసనమూర్తులు శ్రీభూదేవీ సమన్వితులు.

4. అధోహస్తస్థితి:

యోగస్థానకములో దక్షిణహస్తము అభయహస్తము, వామహస్తము కట్యవలంబితము. భోగస్థానకములో దక్షిణహస్తము అభయముగాని వరదముగాని యైయుండును వామహస్తము కట్యవలంబితమయి సింహపుచెవియాకృతిలోనుండును. వీరాసనములో దక్షిణహస్తము అభయము, వామహస్తము సింహకర్ణాకృతినిబొందును. భోగాసనములో దక్షిణహస్తము వరదహస్తము. వామహస్తము నడుము నుండి వామోరూమిశితమై సింహకర్ణాకృతిలోనుండును. యోగాసనములో దక్షిణహస్తము పీఠముపైనను వామహస్తము వామాంకముపైనను నుండును. యోగశయనములో ఒక చేయి శిరసు క్రిందను, రెండవచేయి యంకమునందు నుండును. వీరస్థానకము విషయములోను అభిచారిక

మూర్తుల త్రిదశలలోను మరీచిగాని యితరులుగాని యేమియును చేర్కొనలేదు.

5. శంఖచక్రములు :

యోగ, భోగ, వీరస్థానకమూర్తులకును, భోగవీరాసనమూర్తులకు వీరశయనమూర్తులకును ఊర్ధ్వహస్తములందు శంఖచక్రము లుండును. యోగాసనభోగశయనమూర్తులలో పంచాయుధములలో నీ శంఖచక్రములు చేర్చబడినవి ఆభిచారికమూర్తుల అన్నిదశలలోను యోగశయన మూర్తియందును శంఖచక్రములుండవు.

6. ఆభరణములు :

యోగాసన, యోగశయనమూర్తులకు దివ్యాభరణ విశేషాలంకరణములను గుఱించి ప్రసక్తమయినది.

7. శేషుఁడు :

స్థానకాసన దశలలో నేనియందును యీ శేషమూర్తి గాన్పింపదు. యోగ, భోగ, వీరశయనమూర్తులలో మాత్రము శేషునకు 5, 7, 9 తలలు చెప్పబడినవి. ఉత్తమాభిచారిక శయనమూర్తికి రెండు తలల శేషుఁడు, మధ్యమాభిచారిక శయనమూర్తికి ఒక తలతోగూడిన శేషుడు శయ్యగానుండును. అధమాభిచారిక శయనమూర్తికి అనంతుడు శయ్యగా నుండడు. కేవలము పీఠముపై శయనమూర్తి ప్రతిష్ఠింపబడును.

8 గరుత్మంతుఁడు, విష్వక్సేనుడు, సప్తఋషులు :

యోగశయనమూర్తులకు వీరుందురు. భోగ వీరశయనమూర్తులకు విష్వక్సేనుఁడుతప్ప మిగిలిన వారుందురు. యోగభోగ, వీరస్థానకాసనమూర్తులకు వీరి ప్రసక్తిలేదు. ఆభిచారిక దశలలో నేనిలోను వీరి ప్రసక్తికానరాదు.

9. మధుకైటభులు, నాభీకమలమున బ్రహ్మ :

యోగ, భోగ, వీరశయనమూర్తులకు మాత్రమే వీరిప్రసక్తి. ఆభిచారికములో వీరి స్మరణము రాదు.

10 బ్రహ్మ శంకరులు :

యోగస్థానకములో తప్ప మిగిలిన అన్నిమూర్తులలోను వీరి ప్రసక్తియున్నది.

11. భృగు మార్కండేయులు :

యోగస్థాన కాధమదశలోను, భోగాసనాధమమూర్తికిని, శయన మూర్తులన్నింటికిని అభిచారికములోనన్ని మూర్తులకుదప్ప మిగిలిన మూర్తులకు వీరి ప్రసక్తియున్నది.

12. సూర్య చంద్రులు :

భోగవీరస్థానకాసన శయనమూర్తులలోను, యోగాసన శయనము లందును ఉత్తమదశలో వీరుందురు. భోగ, వీరస్థానక ఆసనము లందును, భోగవీరమూర్తుల కన్నిదశలలోను వీరుందురు. మిగిలిన మూర్తులలో వీరి ప్రసక్తికానరాదు.

ఆభిచారికమూర్తి :

స్థానకాసనశయన భేదములచే నుండిన యాభిచారికమూర్తి ఉత్తమ మధ్యమాధమ భేదములచే నొప్పుచు ఉత్తమ మధ్యములలో శేషసహితముగను మిగిలిన దశలలో నే దేవతామూర్తియు ప్రతిష్ఠింప బడక కేవల మేకమూర్తిగనే ప్రతిష్ఠింపబడును. ఆలయము విమాన రహితమై విషమకాలమున మాత్రమే ప్రతిష్ఠింపబడును. అంగము లన్నియు మిగుల సన్నమయి తదేకవీక్షణాసక్తమయిన కన్నులు గలిగి యుండును. శ్రీవత్సము, కటిసూత్రము, ప్రలంబసూత్రము మాత్రమే యుండి ఈ మూర్తిని విష్ణువని గుర్తించుటకు వీలిచ్చును. ఈ అభి

చారికమూర్తి యొక్కదృష్టి ఏకలగ్నము. శత్రుమారణమునకై నిర్దేశింప బడినట్టివాదృక్కులు. ఈ మూర్తి కౌతుకసహితము గాకపోవుటచే బ్రహ్మస్థానమునే ఆక్రమించును కాని యిట్టి మూర్తిని ప్రతిష్ఠాపించుట యన్నది సామాన్యమైన విషయముగాదు. బహు అరుదు. మనము ప్రతి ఆలయములోను ధ్రువమూర్తిని ప్రతిబింబించు వివిధమూర్తులను నిత్యార్చన సమయములో ఇతర ప్రత్యేకోత్సవములందును గమనించు చునే యున్నాము. అవి కౌతుక, ఉత్సవ, స్నపన, బలిబేరములనికూడ తెలిసికొనియున్నాము. ఇవి ఆలయమందు పూజావిధికత్యవసరమూర్తులు. కాని ఒకప్పుడివి యటుల భావింపబడలేదు. వీనిని మహర్షులే నిర్దేశించిరి. షణ్మూర్తిఆలయములో ధ్రువకౌతుకములు, నలుగురు వ్యూహమూర్తులు. నవమూర్తిఆలయములో వీరితోబాటు నరనారాయణులు, నృసింహమూర్తి వరాహమూర్తియు ప్రతిబింబింతురు. ఈ కారణముగా ఉత్సవ, కౌతుక, స్నపన, బలిబేరముల యునికికి తావులేదు వ్యూహమూర్తులకు ప్రత్యేకసన్నిధి అందులో ప్రతిమూర్తికి ఒక కౌతుకమును గూర్చి చెప్పబడినది. భగవత్ప్రతిష్ఠావిధి దర్పణములో ధ్రువమూర్తితో కూడి మొత్తము నెలకొల్పవలసిన విగ్రహములసంఖ్య తొమ్మిదికి మించ రాదని ఆదేశింపబడినది. ధ్రువమూర్తి - శ్రీభూసహితము, పురుష, సత్య, అచ్యుతానిరుద్ధులు. ఇవియన్నియు చలనరహితములు. చలితమగు కౌతుక, ఉత్సవ, స్నపన, బలిబేరము లనునవి నాలుగు. మొత్తము తొమ్మిది. వీనిని తప్పక నెలకొల్పవలెనని చెప్పబడినది. కాని యిది శాసనముగా గాక దాతయొక్క సౌలభ్యము ననుసరించి తాను యెంత వరకు సమర్థించుకొనగలడో, నిత్యనివేదనాదుల కెంతవరకు, ఎన్ని బింబములకు లోపము జరుగకుండ చూచుకొనగలడో అంతవరకే నెల కొల్పుటకు ఆగమశాస్త్రము వీలుకల్పించినది. తిరుపతి దేవస్థానము శాసనములలో (I-5, 1.9) కౌతుకమూర్తియగు భోగశ్రీనివాసమూర్తి నే బ్రహ్మోత్సవముల తొమ్మిదిరోజులలో ఉత్సవబేరముగా వీధులందు ఉత్సవములో పాల్గొనజేసెడివారు. ఆ రోజులనాటికి ఉత్సవబేరముగాని,

స్నపన, బలిబేరములుగాని ఆలయములో లేకుండుటయే యొక కారణ ముగాఁ జెప్పనగును. కాని నేటి సంప్రదాయము ప్రకార మీ విగ్రహము లన్నియు నెలకొల్పబడెను. ఉత్సవమూర్తులు ఉత్సవార్థము, బలిబేరము బలిసంగ్రహార్థము, స్నపనబేరము, స్నపనకృత్యములకు. కౌతుకమొక్కటియే ధ్రువమూర్తికి సరియగు నకలుగా ప్రతిభాసించును. నిత్యార్చనములోని వివిధదశలతో బాటు నిత్యాభిషేక మీ కౌతుకమే పొందును. కౌతుకమొక్కటే బ్రహ్మస్థాన మాక్రమించును. ఉత్సవ మూర్తుల ధ్రువమూర్తికి వామభాగమున, స్నపన బలిబేరముల ధ్రువ మూర్తికి దక్షిణభాగమున నుంచవలెనని శాస్త్రము. భృగుసంహితలో 2 అధ్యాయములో

"దేవస్య వామభాగే స్థాపయే ద్బింబముత్సవమ్
స్నపనం బలిబేరం చ దక్షిణే స్థాపయేద్బుధః"

(పేజీ 77)

ఒకవేళ గర్భాలయము తగినంత వీలుకల్పింపలేనిచో నీ బేరములను ముఖమంటపములో నుంచవచ్చును.

ఆలయములో మూడు ఆవరణములలో మూడవ ఆవరణములో కౌతుకమూర్తికి స్థానమున్నట్లుగా భావించుటకును వీలుకలుగుచున్నది. కొన్ని ప్రత్యేక సందర్భములలో నీ కౌతుకబేరము ధ్రువబేరమును విడచి యుండవలసి వచ్చును. నిత్యాభిషేకానంతరము స్నపనపీఠమునుండి కౌతుక బింబమును బ్రహ్మస్థానమునకు జేర్తురు ఆ తరువాత ధ్రువబేర మునకు మూడు ఆవరణములలోనున్న దేవతలకు పుష్పన్యాసము సమర్పింతురు. మొదటి రెండు ఆవరణములలోనున్న దేవతలు నిజమునకు మానసిక పూజగైకొను దేవతలే. వీరువ్యూహమూర్తులు, విభవమూర్తులు. మూడవఆవరణములోని దేవతలు దిక్పాలురు. ఈ న్యాసము పూర్తి యైనంత ప్రత్యేకన్యాసము కౌతుకమూర్తికి జరుపుట శాస్త్రసిద్ధము. రెండుప్రత్యేక ఆవరణములు అనగా నొకటి ధ్రువబేరమునకు రెండవది

కౌతుకబేరమునకున్నట్లు మానసికముగా భావింపవలెను. కౌతుకబేరమున కావరణములన్నది ఊహాజనితమైన భావమైనప్పటికిని ఉత్సవాదులలో ఉత్సవబేరములేని సందర్భములో నీకౌతుకమే ఆకార్యము నిర్వర్తింప వలసివచ్చుచో, కౌతుకబేరము ప్రత్యేకప్రదేశమున నెలకొనవలెను. ఇది మూడవఆవరణము లోపలనే కావలెను. ఈ కారణముచేతనే భోగ శ్రీనివాసమూర్తి, ముఖమంటపమునకు ముందున్న తిరువిలాన్‌కోయిల్‌లో ప్రతిష్ఠింపబడినది. ధ్రువమూర్తితో నన్నిసందర్భములందును శ్రీభూ దేవులు నెలకొనియుందురు. కాని యోగ, అభిచారికస్థితులలో మాత్రము ధ్రువమూర్తితో దేవేరులను గానము. ఒకవేళయున్నను పుష్పన్యాసము మూడు ఆవరణములలో దేవతలందఱకు పూర్తిఅయిన తరువాత మాత్రమే దేవేరికి న్యాసము జరుగును. మొదటి రెండుఆవరణముల లోని మూర్తులు విష్ణువునకు ప్రాతినిధ్యము వహించు వ్యూహమూర్తులు వ్యూహాంతరమూర్తులే. వారు బహిర్ముఖులు. మూడవఆవరణములోని దేవతలు బ్రహ్మచే సృజింపబడినవారు గనుక వారు బ్రహ్మాండమునకు చెందినవారు. వీరందఱు అంతర్ముఖులు. వీరికి న్యాసము అంతర్ముఖ ముగనే జరుగును.

## గర్భగృహమునందలి, విమానమందలి, మొదటి ఆవరణములోని పరివార దేవతలు.

ధ్రువమూర్తికి పరివృత్తముగ కొందఱు దేవతలను ప్రతిష్ఠించుట యన్నది శాస్త్రసిద్ధము నతిప్రాచీనమును. అతి ప్రాచీనాలయములలో నేటికిని వీని యునికిని గాంచనగును. కాని తరువాత వీని ప్రతిష్ఠాపనము ప్రసక్తి ఆలయములలో గానరాదు. కాని నిత్యము ధ్రువమూర్తికి జరుగు నిత్యార్చనాంగభూతమగు పుష్పన్యాససమయమున వీరినామములు చెప్పి ఈ దేవతలను మనసా ధ్యానించి పుష్పములను ధ్రువపీఠమునందు శ్రీవారి పాదములపై నుంచుట నేటికిని జరుగు చున్నది. ఈ దేవతలు రెండువిధములు. అన్ని దశలలోను శాశ్వ

తముగా ధ్రువమూర్తితో నుండునవి. కొన్ని ధ్రువమూర్తి స్థితినిబట్టి నెలకొనునవి. ఇట స్థితియనగా స్థానకాసనశయన బేరములతోగూడిన భోగ, వీర, యోగమూర్తులుగా భావింపవలెను.

ద్వారపాలకులు, ద్వారదేవతలు, విమానపాలకులు, విష్వక్సేనుడు, శ్రీభూతము, గరుత్మంతుడు – వీరెల్లరు శాశ్వతనివాసులు. వీరిని అనపాయినులందురు. బ్రహ్మ, మార్కండేయుడు, భృగుమహర్షి కొన్ని స్థితులలోనుందరు. కాని నిత్యార్చనలోని న్యాస సందర్భములో వీరిని మనసా ధ్యానించి పూజింతురు. వారి స్థానములు ఇపుడిక్కడ ప్రసక్తము కాకున్నవి.

ద్వారదేవులు :

గర్భగృహము ప్రధానద్వారమును గంధర్వస్థానమందురు. ఈ ద్వారము నిరువురు ద్వారపాలకులు ధాత, విధాత యను దేవతలు రక్షింతురు. వీరిరువురు సోదరులు. భృగుమహర్షి ఖ్యాతి యందు గన్నవారు. ధాతదక్షణపుదిశను, విదాత ఉత్తరపు దిశను గాపుందురు. ద్వారమునకు నలువైపులు నాలుగుదేవతామూర్తులు అధి దేవతలుగా నుందురు. అధోపట్టికకు భువంగుడు, ఈయన వెలికల పరుండును. తల దక్షణదిశ నుండును. పాదము లుత్తరముగా నుండును. ఊర్ధ్వ దృష్టి. నీలవర్ణుడు. ద్వారోర్ధ్వ పట్టికపై పతంగదేవు డుండును. ఈయనకు ఉత్తరదిశను తలయుండి అధోదృష్టిగలిగియుండును. పాదములు దక్షిణ దిశనుండును. ఈయన శ్వేతవర్ణుడు. ద్వారపార్శ్వ పట్టికలయందు దక్షిణమున పతిరుడు, ఉత్తరమున వరుణుడు. వీరొకరికొకరు ఎదురెదురుగా నిలుతురు. వీరు స్వర్ణవర్ణులు. ఈ ద్వారమునకు వెలుపల ఇద్దరుద్వారపాలురు మణికుడు, సంధ్య అనువారుందురు. ఇందులో మణికుడు దక్షిణ దిశను సంధ్య ఉత్తరదిశనుందురు. మొదటి

వారు శ్వేతవర్ణుఁడు. రెండవవారు హిరణ్యవర్ణులు. వీరి వ్యాహృత నామములివి.

I 1. మణికాయనమః 3. విమలాయనమః
2. మహాబలాయనమః 4 ద్వారపాలాయనమః

II 1. సంధ్యాయైనమః 3. జ్యోతిరూపాయైనమః
2. ప్రభావత్యైనమః 4. దృఢవ్రతాయైనమః

గర్భగృహము నావరించియుండు విమానమును రక్షించువారు నలుగురు ద్వారపాలురు. వీరిని విమానపాలకులని పిలుతురు. వీరు వరుసగా న్యక్షుఁడు, వివస్వానుఁడు, మిత్రుఁడు, క్షితుఁడు అనువారు. గర్భగృహద్వారమునకు సరిగా పైన విమానమూల తలమున తూర్పు ముఖముగా స్థానకుడై యుండును. వివస్వానుఁడు దక్షిణమున దక్షిణ ముఖుడుగను, మిత్రుఁడు పశ్చిమదిశను పశ్చిమముఖుడుగను, క్షితుఁడు ఉత్తరదిశను ఉత్తరాభిముఖుడుగను నుందురు. అధమాలయములో విమానముండదు గనుక తూర్పువైపున ఒక్క న్యక్షుఁడుమాత్రమే నెలకొనును.

ముఖమంటప ద్వారపాలకులు:

ముఖమంటప ప్రవేశద్వారమున కిరువైపుల దక్షిణమున విఖనసుఁడు, ఉత్తరమున తాపసుడు ఉందురు. వీరిరువురు ముఖమంటపము ప్రవేశద్వారముననుండు ద్వారపాలకులు. వీరి వ్యాహృతులు

I 1. విఖనసాయనమః 3. సిద్ధిదాయనమః
2. తపోయుక్తాయనమః 4. బ్రహ్మదర్శినేనమః

II 1. తాపసాయనమః 3. సర్వదోషవివర్జితాయనమః
2. సిద్ధిరాజాయనమః 4. సహస్రాక్షమేధినేనమః

విష్వక్సేనుడు :

విష్వక్సేనుడు సకల విబుధప్రౌఢ సైన్యాధినాథుఁడు, ఈయన స్థానమును గుఱించి మరీచిమహర్షి తన విమానార్చన కల్పములో నిట్లు చెప్పినాడు.

'ఉదక్ప్రాకార పార్శ్వే, విమానపార్శ్వే, కుబేరేశానయోర్మధ్యే దక్షిణాభిముఖః సింహాసనే సమాసీనః అగ్నివర్ణః, పీతవసనః శ్రీవత్సం బ్రహ్మసూత్రం చ వినా హరి రివ భూషణై ర్యుక్తో ద్విభుజః, పుష్పపాణి శ్శక్తిదండభృత్ వా జయాపతి శ్శృంగకేతుః పుష్పరథవాహనః పూర్వాషాఢోద్భవః పుష్పరవః విద్యాదిబీజః విష్వక్సేనః. ఇతి'

మొదటి ఆవరణములో ఉత్తర ప్రాకారపార్శ్వమందు అనగా విమానపార్శ్వమున కుబేర ఈశానదిశలమధ్య దక్షిణముఖముగా, సింహాసన సమాసీనుఁడును, అగ్నివర్ణుఁడును, పీతవసనుడును, శ్రీవత్స బ్రహ్మసూత్రములులేక సర్వము హరివలె నుండువాఁడును, భూషణములు ధరించినవాఁడును, ద్విభుజుడును, పుష్పపాణియుతుఁడును, దండధరుడును, జయాదేవీ పతియును, శృంగమును ధ్వజముగా గలిగి, శక్తిధరించినవాఁడును, పుష్పరథవాహనుఁడును, పూర్వాషాఢా నక్షత్రజన్ముఁడును, పుష్పరవుఁడును, విద్యాదిబీజయుతుడునునగు విష్వక్సేనుని ప్రతిష్ఠింపవలెను.

బ్రహ్మ :

గర్భగృహములో ఉత్తరముఖముగానున్న దక్షిణకుడ్య సమీపమున నీ బ్రహ్మస్థానముఁడును. హిరణ్యవర్ణుఁడు, వేదరవుఁడు, చతుర్భుజుఁడు హంసవాహనుఁడు, కమండలధరుఁడు. అభిజిత్‌నక్షత్రమున జన్మించినవాఁడు, సావిత్రీపతి, మకారబీజయుతుఁడు. ఈయన వ్యాహృతులు 'బ్రహ్మాణం ప్రజాపతిం పితామహం హిరణ్యగర్భం'

శంకరుఁడు:

ఉత్తరకుడ్యమున యీయన స్థానము. శ్వేతవర్ణుడు. వ్యాఘ్ర చర్మధరుఁడు. పరశువు (గొడ్డలి) మృగమును ధరించిన చేతులు గలవాడు. వృషభవాహనుఁడు, వృషభధ్వజుడు, ఆర్ద్రానక్షత్రజన్ముఁడు, డమరుక రవప్రియుఁడు. మకారబీజయుతుఁడు, ఉమాపతి, గంగా ధరుఁడు. వ్యాహృతులు 'గంగాధరం, వృషభవాహనం, అష్టమూర్తిం, ఉమాపతిం' అను పేళ్లు.

మార్కండేయుఁడు:

స్వర్ణ వర్ణుఁడు, బ్రహ్మచారి, రక్తవస్త్రధరుఁడు, పద్మవాహ నుఁడు, కూర్చధ్వజుడు, శంఖరవుఁడు, మకారబీజసంయుక్తుఁడు. 'మార్కండేయం, పుణ్యం, పురాణం అమితం' ఈయన వ్యాహృతులు.

భృగువు:

అగ్నివర్ణుఁడు, శుక్లవస్త్రధరుఁడు, పద్మవాహనుఁడు, కమండలు ధ్వజుడు, రోహిణీశుడు. శంఖరవుడు, 'భ్రి'బీజయుతుడు, ఖ్యాతీశుడు, పద్మాపిత్రే, వేదభృతం, ధాత్రినాథం — ఇవి వ్యాహృతులు.

విమానపాలకులు:

విమానపాలకులు నిత్యార్చనా సముపేతులుకారు. విమానమునకు అనుబంధముండిన విగ్రహములగుటచేతను. విమానము వైకుంఠోద్భవ మనెడు శాస్త్రసూక్తి చేతను నీ విగ్రహములును అత్యంత పవిత్రవంత ములు. ఆగమశాస్త్రములు (వైఖానసాగమమును) ఆయా విగ్రహము లేయే స్థానములో నెలకొల్పవలెనో నిర్ణయించినవి. విమానమునందలి విగ్రహములనుగాని లేక దానిపై చెక్కబడిన మృగములనుగాని గాంచి వెంటనే ప్రేక్షకుడు అవి శివాలయ సంబంధమని భావించి దానిని శివా లయమనియే నిర్ణయించుకొనును. తిరుమల ఆలయము విషయములో

నిట్టి దురూహకు పాల్పడెడి ప్రేక్షకుని గుఱించి విచారింపబడినది. ఆలయమునకు మొదటి ఆవరణములోనుండెడి వ్యూహములు, వ్యూహాన్తరములు, రెండవ ఆవరణములోనుండెడి విభవములు, విభవాన్తరములు పూర్వము నెలకొల్పబడు సంప్రదాయమున్నది. నేడట్టి పద్ధతి పూర్తిగా విడనాడియు, విమానముపై నీ విగ్రహములు నెలకొల్పబడు చునే యున్నవి.

విమానములు బహువిధములని ప్రసక్తమయినది. శాన్తిక విమానము, పౌష్టిక విమానము, జయదవిమానములను గూర్చి యిది వఱకే ముచ్చటింపబడినది. సామాన్యముగా నేడు మనము చూచెడి విమాన నిర్మాణమిట్లుండును. సమచతురముగా విమానమూల తల ముండి మూలమునకు 1½ లేక రెండురెట్లు పొడవుండును. ఇది రెండు లేక మూడు తలములుగా నిర్మింపనగును. సున్నముతో తయారు చేయబడిన విగ్రహములచే నలువైపుల, నాలుగుమూలల నలంక రింపబడును. ఒకతలమునకు వేఱొకతలమునకు మధ్యగల ప్రదేశము కంఠభాగమందురు. ఈ భాగములోను విగ్రహముల నమర్చెదరు.

**మూలతలమున నుండెడి విగ్రహములు:**

మొదటి తలమున తూర్పుభాగమున గర్భగృహములో నుండెడు మూర్తినే యిచట నలంకరింతురు. ముఖమంటపము పైకప్పుపైనను మూలతలమునకు ముందుభాగమునను తాపసుని, సిద్ధుని నెలకొల్పు దురు. దక్షిణాభిముఖముగా మూలతలముననే సత్యమూర్తిని, పశ్చిమ ముఖమున నచ్యుతమూర్తిని, ఉత్తరముఖమున అనిరుద్ధమూర్తిని ప్రతిష్ఠింతురు. ముఖమంటపు ఉత్తరపుకొనను వినాయకుని, దక్షిణపు కొనను దుర్గాదేవిని ప్రతిష్ఠించుట శాస్త్రసమ్మతము.

**ద్వితీయతలము:**

తూర్పున పురుషమూర్తిని, దక్షిణమున నృసింహమూర్తిని,

పశ్చిమమున అచ్యుతమూర్తిని, ఉత్తరమున వరాహమూర్తిని నెలకొల్ప వలెను.

ద్వితీయతల తృతీయతల మధ్యమును గళమందురని చెప్పబడి నది. ఈ గళమందు వైఖానసమహర్షియగు భృగువు తన క్రియాధి కారములో నిట్లు చెప్పినాడు.

'ఇంద్రం చ దక్షిణామూర్తిం నారసింహం పితామహమ్
ప్రాగాది కల్పయేదేతాన్ గళే లక్షణసంయుతమ్'

తూర్పున నింద్రుని, దక్షిణమున దక్షిణామూర్తిని, పశ్చిమమున నార సింహుని, ఉత్తరమున పితామహుని ప్రతిష్ఠింపవలెను. ఇట్లు కాక పోయినచో పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధమూర్తులనైనను నెల కొల్ప వలెను. ఇట్లు కానిచో తూర్పున విష్ణువును, దక్షిణమున వారాహ మూర్తిని, పశ్చిమమున నారసింహమూర్తిని, ఉత్తరమున హయగ్రీవుని నెలకొల్పవలెను. ఈ మార్పు భృగుమహర్షియే చెప్పియున్నాడు. (శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రము—క్రియాధికారము—విమాన దేవతాకల్పనా ధ్యాయము పే॥ 35) ఇంక కోణములందు

'తథా కోణేషు గరుడం ప్రస్తరోపరి కల్పయేత్
ఆలయేష్వన్య దేవానాం వాహనాని ప్రకల్పయేత్
'మృగేంద్ర మథవా కుర్యాత్ సర్వదేవాలయేషు చ'

— (క్రియాధికారము.)

కోణములందు గరుడ విగ్రహములుగాని ఆలయములోనున్న యితర దేవతల వాహనములుగాని నెలకొల్పవలెను. అట్లు కానిచో నన్ని ఆలయములకును మృగేంద్ర విగ్రహములు మూలలందు నెలకొల్ప వచ్చును.

దక్షిణముననను పశ్చిమముననను ఎన్ని నృసింహమూర్తులను ప్రతిష్ఠించిన అంత శత్రు మారకము జరుగును. రాజు విజయుడగును.

దేశమునకు శత్రుభయము తొలగును. విష్ణ్వాలయ విమానమునకు శైవ సంబంధ ఆలయవిమానమూర్తులను వాడుట శాస్త్రనిషిద్ధముకాదు. ఆ విషయము పైవివరణమువలన స్పష్టమయినది. ఇంద్రుడు. కుమార స్వామి, ఉమాపతి, దక్షిణామూర్తి, నృసింహుడు, శ్రీధరుడు, బ్రహ్మ, ధనాధిపుడు, ఆదివరాహన్నృసింహుడు, హయగ్రీవుడు, నరనారాయణుడు, వాసుదేవ సంకర్షణాది మానుషవ్యూహమూర్తులు, దైవిక వ్యూహ మూర్తులు - విమానదేవతలుగా వైఖానససంహితలు పేర్కొన్నవి. పశ్చిమదక్షిణములలో నారసింహుల నెట్లు పెక్కుప్రతిష్ఠంపనగునో అట్లే ఉత్తరదిశయందు ఒకటి రెండు పర్యాయములు అనంతుని, అనిరుద్ధుని ప్రతిష్ఠింపనగును. ధ్రువమూర్తికి సరియైన నకలును విమానమున నుత్తరదిశను నెలకొల్పనగును.

### అనపాయి పరివారదేవతలు :

శ్రీభూతుఁడు, గరుత్మంతుఁడు, న్యక్షుఁడు, విష్వక్సేనుఁడు, చక్రము, ధ్వజము, శంఖము, యూధాధిపుఁడు, పావకోద్భవుఁడు వీరందరు అనపాయి దేవతలుగా వైఖానసాగమము పేర్కొన్నది. న్యక్షుని, విష్వక్సేనుని గుఱించి యింతకుముందే పేర్కొనబడినది. ఇప్పుడు వరుసగా మిగిలినవానిని బేర్కొందము

### శ్రీభూతము :

బ్రహ్మచారి, దండధరుఁడు. సింహవాహనుఁడు. సింహధ్వజుఁడు, శ్వేతవర్ణుఁడు, రక్తవస్త్రధరుఁడు. ఫాల్గున భరణీనక్షత్ర సంజాతుఁడు, బహిర్ముఖుఁడు. ముఖమంటప ద్వారసోపానకేంద్ర మీయన స్థానము. కుంభశబ్దరవుఁడు. భూతాద్యక్షర బీజుఁడు.

### గరుత్మంతుఁడు : —

శుకపింఛమువంటి వస్త్రమును ధరించును. ఆభరణయుతుఁడు,

కిరీటధారుఁడు, పంచవర్ణ సర్పధారుఁడు, అంజలిసంయుతుఁడు, వాయు వాహనుడు, ఈయనస్థానము రెండవఆవరణము. కాని చిన్న దేవాలయ ములలో ఒకే ఆవరణముగల ఆలయమయినచో చివరి పాతికభాగ మీయన నెలవు. శంఖము, ధ్వజము, చక్రము, మహాభూతము, అక్ష హంతము వీని నన్నింటిని యిటనే వరుసగా ప్రతిష్ఠింపవలెను. మూడు ఆవరణములుగల ఆలయములలో గరుత్మంతుఁడు రెండవ ఆవరణము లోని 2/4 భాగములో నుండును. చక్రము రెండవ ఆవరణములో 3వ భాగములోను, శంఖము మూడవ ఆవరణములోని రెండవభాగము లోను, ధ్వజము మూడవ ఆవరణములోని మూడవభాగములోను, యూథాధిపుడు నాలుగవ ఆవరణములోని మూడవభాగములోను ప్రతిష్ఠింపబడవలెను. అక్షహంతుఁని ఐదవ ఆవరణములోని మూడవ భాగములోగాని లేక గోపురము వెలుపల స్వామి కభిముఖముగా గాని నెలకొల్పవలెను. వీని నన్నింటిని మొదటి ఆవరణములో నెలకొల్ప వలెనన్నచో గర్భగృహమునకు రెండవ భాగములో గరుత్మంతుని, మూడవభాగములో బలిపీఠమును ధ్వజము నెలకొల్పవలెను. ఒక ఆవరణమున్న ఆలయము అధమాధమ వర్గీకరణము క్రిందకువచ్చును. ఈ ఆలయములో విష్వక్సేనుడు గరుత్మంతుడు శ్రీభూతము, న్యక్షుఁడు, భూతపీఠము మాత్రమేయుందురు. అధమాధమాలయములో ధ్వజము, చక్రము, శంఖము, అక్షహంతులు నుండరు.

కాని సంప్రదాయములో శ్రీభూత గరుత్మంతులను విమాన పార్శ్వమందును, చక్ర శంఖ ధ్వజ, యూథాధిప పావకోర్జునులను బలిపీఠ పార్శ్వములందును అర్చించుటను గూర్చి మరీచి చెప్పి యున్నాడు. 'ఏతేషు శ్రీభూత గరుడౌ ప్రాసాదపార్శ్వే' చక్రశంఖ ధ్వజయూథాధిప పావకోఽర్జునాన్ బలిపీఠ పార్శ్వే సంయోజ్యార్చ యేదితి కేచిత్'

# 12వ అధ్యాయము

## 4-వ భాగము

## ఆవరణదేవతలు

### 1. ప్రథమావరణము:

తూర్పు మొదలుకొని ఉత్తరము వరకు వ్యూహమూర్తులు: (1) పురుషుఁడు (2) సత్యమూర్తి (3) అచ్యుత (4) అనిరుద్ధమూర్తులు (విదిక్కులయందు) ఆగ్నేయాదికోణేషు, కపిల, యజ్ఞ, నారాయణ, పుణ్యమూర్తులు. ఇవి నాలుగును వ్యూహాంతరములు. ఈ ఆవరణములో నీ రూపము లోకపర్యాయముకంటె మరెక్కువ పర్యాయములు రావు. అర్చకస్వామి ఈ మూర్తులను మనసా ధ్యానించి న్యాసమును ధ్రువబేర పాదపద్మముల యందుంచును.

### 2. ద్వితీయావరణదేవతలు:

ఇందును రెండు విధములయిన దేవతలుందురు. ఇవి విభవ మూర్తులు. విభవాంతరమూరులు. దిక్కులయందు విభవమూర్తులు. నెలకొనగా విదిక్కులయందు విభవాంతరమూర్తులుందురు. తూర్పు నుండి వారాహ, నారసింహ, వామన, త్రివిక్రమ మూర్తులును-విదిక్కులలో ఆగ్నేయము మొదలు, సుభద్ర, ఈశితాత్మ, సర్వోద్వహ, సర్వవిద్యేశ్వరమూర్తులు నెలకొందురు. ఈ విభవావతారములన్నియు నద్భుతావహమై, సర్వశక్తి సమన్విత దైవతములుగా నవతరించినవే గాని మానుషాంశకు సంబంధించిన విభవావతారములుగాదని గమనింప వలెను కౌతుకమూర్తికిఁగూడ నివియే ఆవరణలు, ఆయావరణలలోని దేవతలునుండుట గమనార్హము.

కౌతుక మూర్తికి ప్రథమావరణములో తూర్పునుండి సుభద్ర, హయాత్మక, రామదేవ, పుణ్య, దేవమూర్తులుందురు. అగ్నేయాదికోణ ములలో సర్వ, సుఖావహ, సంవహ, సువహమూర్తులుందురు.

రెండవయావరణములో తూర్పునుండి మిత్ర, అత్రి, శివ, విశ్వమూర్తులును, ఆగ్నేయాదికోణములలో సనాతన సనందన, సనత్కుమార, సనకమూర్తులును ఉందురు. వీరందరు బహిర్ముఖులు, ఆ భావనతోనే వీరికర్చనము జరుపవలయును.

ధ్రువమూర్తికిగల రెండవ యావరణములో విభవ, విభవాన్తర మూర్తులతోబాటు నవగ్రహములు గర్భగృహములో నంతర్ముఖులై యుందురు. విభవ, విభవాన్తరములు వైష్ణవాండమునకు సంబంధించినవి కాగా, నవగ్రహములు బ్రహ్మసృష్టి సంబంధములు కనుక నివి యంతర్ముఖులు. కనుక నీ నవగ్రహములు వైష్ణవాండ వీక్షణాసక్తులై యుందురు. ఈ కారణమునే ధ్రువబేరమూర్తికి రెండవ ఆవరణములోనీ అధిదైవిక మూర్తులకు నెదురుగా అధిభౌతికమూర్తులు నెలకొనుట యనువిషయము గ్రహింపవలసియున్నది.

ముఖద్వారమునకు ఉత్తరపువైపున సూర్యుడు దక్షిణమున చంద్రుడు ఉందురు. మిగిలినవారు ఈ ఆవరణములో వీరి నడుమ నుందురు.

3. తృతీయావరణము:

దిక్పాలురు ప్రాగాది ఇంద్ర, అగ్ని, యమ, నిర్ ఋతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు. వీరందరును సాత్విక ప్రకృతికి ప్రతినిధులు, బ్రహ్మయొక్క పూర్వకాయమునుండి యుద్భవించినవారు. తృతీయావరణములో వీరుకాక ముఖద్వారమునకు నుత్తరకుడ్యమునానుకొని దుర్గాదేవి, దక్షిణకుడ్యము నానుకొని గంగయుందురు. వీరు పశ్చిమ ముఖులు. ఆగ్నేయమందు ధాత్రి సరస్వతి (మహాకాళి) ఈశాన్యమందు యమున, సింధు, నర్మద, శ్రీ, జ్యేష్ఠ మొదలుగా గలిగిన దేవతలుందురు. అంతరాళమునందు సుర, సుందరి, స్వాహా, స్వధా, సంహ్లాదిని, రాకా, సినీవాలీ దేవతలుందురు. వీరందరును నవబ్రహ్మలలో నెవరికో యొకరికి తనూజలు.

లోకపాలురు, నదీదేవతలు, ఇతర స్త్రీమూర్తులు వీరందఱును నిత్యము ఆలయపూజా సందర్భములలోను గృహములలో సంస్కార ములలోను వీరు ప్రసక్తము చేయబడుదురు. వీరు అగ్నిద్వారా మన యాహుతులను గ్రహింతురు. వేదోక్తముగా వీరికీ యాహుతులు సమర్పణము చేయబడును.

4. నాలుగవ ఆవరణము :

నాలుగు వేదములు నాలుగు మూలలందుండును. హరిణి, అగ్ని, తోయము, వాయువు, గవిష్ఠలున్ను, విష్ణువు, కాశ్యప, గుహ, పంక్తీశ, పవిత్ర, పవన, తక్షక, శివమూర్తులు ఈ ఆవరణములో నుండెడి దేవతలు.

5. ఐదవ ఆవరణము :

ఆవరణలోని పూర్వద్వారోత్తరమున కుహూ, దక్షిణమున అనుమతీ, సప్తమాతృకలు, పశ్చిమమందు జయాద్యప్సరసలు, ఉత్తర మందు సప్తరోహిణులు, ఆగ్నేయమందు వత్సరాదులు, నైరృతి యందు పంచప్రాణాదులు. వాయవ్యమందు మరుత్తు, ఈశాన్యమందు శతరుద్రులునుందురు. అంతరాలయమందు ఏకాదశరుద్రులు, ద్వాదశా దిత్యులు, గంధర్వులు, మునులు, అప్సరసలు, అశ్వినులు, వసవులు, విద్యాధరులు నెలకొందురు.

6. షష్ఠావరణము :

పూర్వద్వారోత్తరమందు తుంబురుడు, దక్షిణమందు నారదుడు నెలకొందురు. దక్షిణమందు షడృతువులు, ఉత్తరమునందు ముద్గలుడు, ఆగ్నేయమందు హవీశుడు, నైరృతియందు జాంబవుడు, ఐశాన్య మందు అసురుడు, అంతరాలయమందు తూర్పున కిన్నర మిథునములు దక్షిణమున ప్రహ్లాదుఁడు, వీనికి దక్షిణమున మదనుడు పశ్చిమమున

విపా, వ్యాజినీ, ఉత్తరమున కామినీ, చంద్రాభా, తూర్పున మరల సున్దర, మాయా దేవులుందురు.

7. సప్తమావరణము:

పూర్వద్వారములో బ్రహ్మ, దక్షిణమున అర్యముడు, దండధరుడు, పశ్చిమమున పాశభృతుడు, ఉత్తరమున కుబేరుడు, ఆగ్నేయమందు సవితారుడు, సావిత్రుడు, నైర్ ఋతియందు ఇంద్రుడు, ఇంద్రాజుడు, వాయవ్యమందు రుద్రుడు రుద్రాజుడు, ఈశాన్యమందు అపుడు, అపవత్సుడు నెలకొందురు. అంతరాలమందు నాలుగు వైపుల పెక్కుదేవతలుందురు. వారు తూర్పువైపు దక్షిణదిశను ఆదిత్య, సత్యక, భృశ, అంతరిక్షక, దుర్గ, ఘూటిముఖీ, ధాత్రీ, వపుషమూర్తులు. ఉత్తరదిశకు: ఈశ, పర్జన్య, జయన్తమహేన్ద్రి, నాగ, భూత, యక్షమూర్తులు.

పశ్చిమపువైపు దక్షిణదిశను: నిర్ ఋతి, దౌవారిక, పుష్పదన్త, కవి, చక్ర, పురుహూతమూర్తులు.

ఉత్తరదిశను: సరిత్పతి, అసుర, శోషణ, రాగ, విద్య, యశస్, భద్రమూర్తులు.

దక్షిణమున తూర్పుదిశను: అగ్ని, వితథ, గ్రహక్షత, రాక్షస, ఉష్ణ, జయ, కృష్ణమూర్తులు.

పడమటివైపున: యమ గంధర్వ, భృంగరాజ, సురుండ, శివ, ప్రాణమూర్తులు.

ఉత్తరపువైపు తూర్పు: సోమ, అర్గళ, అదితి, సూరిదేవ, విద్య అమిత, పాంచభౌతికమూర్తులు.

పడమట: జవన, నాగ, ముఖ్య, భల్లాట, వేదభృత, తాపస, సంధుష మూర్తులు.

## ప్రతి ఆవరణములోని ద్వారపాలకులు

| | |
|---|---|
| 1. ప్రథమావరణ : | కిష్కింధ, తీర్థులు |
| 2. ద్వితీయావరణ | వక్రతుండ నాగరాజులు |
| 3. తృతీయావరణ : | శంఖనిధి పద్మనిధులు |
| 4. చతుర్థావవరణ : | తుహినశ్రీబలిందులు |
| 5. పంచమావరణము : | ఖడ్గశార్ఙ్గములు. |
| 6. షష్ఠావరణము : | శంఖచూళి చక్రచూళి |
| 7. సప్తమావరణము : | చండ ప్రచండులు |

ప్రాకారకుడ్యముల వెలుపల ముఖద్వారమున కెదురుగా నొక మహా శ్రీపీఠముండును. ఇందు బలి సమర్పణము పేరు చెప్పబడని దేవతలకు అధోలోకములోని వారికిగూడ చేయబడును. 'సర్వాన్‌దేవాన్ సమర్పయేత్' అనుపదమిటకూడ వినియోగపడును

## గణములు

మొదటి మూడు ఆవరణములలోగల దేవతల నొక ప్రత్యేకస్థితి గలదు. వీరు ధ్రువమూర్తి కభిముఖులై యుందురు. కాని చతుర్థావరణమునుండి సప్తమావరణమునకును గల పరివార దేవతలు పలువిధములుగా నుందురు. వారివారి స్వభావములచే కొందఱు దుష్టులు కొందరు శుభులు, కొందఱు మధ్యములు కనుక వీరు మూడు విధములుగా విభాగింపబడెడి ఉత్తమ, మధ్యమ, అధములు.

ఉత్తమగణములు :

ఆదిత్యులు, వసు దేవులు, రుద్రులు, సాధ్యులు, మరుత్తులు, విశ్వేదేవతలు, పితృలు, మాతృలు, గృహదేవతలు, అంగిరసుడు, అశ్వినీదేవతలు, స్త్రీదేవతలు, లోకేశులు, వాస్తు దేవతలు, నక్షత్రాదులు, పారిషదులు, తత్త్వపతులు.

మధ్యమగణములు :

సిద్ధులు, ఋషులు, నాగులు, అసురులు, రాక్షసులు, యక్షులు, విద్యాధరులు, సౌరభేయులు, గుహ్యకులు, గంధర్వులు, అప్సరసలు, ప్రజాపతులు, మర్త్యులు, రోహిణులు

అధమగణములు :

భూతములు, ప్రేతములు, పిశాచములు, కూష్మాండములు, ప్రమథులు, స్కందులు, బాలగ్రహములు, తైతలసులు, భైరవులు, కిన్నరులు, వేతాలసులు; అపస్మారులు, యోగినులు, ఢాకినులు, శాకినులు, ఛంకులు మోహినులు, జాఘనులు.

హిందూసిద్ధాంతమేమన ఎన్ని భూతములున్నవో అవి యన్నియు సృష్టిలో అంతర్భాగములే. వానికి మనమెంత తృప్తితో నందించగలమో అంతవరకు చేయవలెను ఆ కారణముచే, వానిని మనము నిర్లక్ష్యము చేయరాదు.

❖

# 12 వ అధ్యాయము

## ఆలయములు — ఆగమములు

## 5 వ భాగము.

### 1. దేవాలయార్చనము - విశ్వమానవ సౌభ్రాతృత్వము

శ్రీ వైఖానసాగమముగాని, మరి యే యితర ఆగమములుగాని ప్రధానముగా విశ్వమానవ పరస్పరసహకారమే ప్రధానసిద్ధాంతమన్న సూత్రముపై నాధారపడియే తమ శాస్త్రములు నిర్మించుకొన్నవి. ఈ సహకారమన్నది కేవలము ఐహికమునకు పరిమితముకాక, ఆధ్యాత్మిక పురోభివృద్ధికిని యగుట గుర్తింపవలసిన విశేషము. ఆముష్మిక ప్రాప్తికై యత్నించి దానిని తమ తీవ్ర తపశ్చర్యల చేతను, సత్ప్రవర్తన చేతను సఫలీకృతము గావించుకొనిన పుణ్యజీవులను మనము పూజించుట యితర దుష్టశక్తులను మననుండి తొలగింప జేసికొనుట, వాని యనుగ్రహము లేకున్నను, వాని దురాగ్రహము మనపై ప్రసరింప బడకుండ చేసికొనుటయే యీ దేవాలయార్చనలోని ముఖ్య సూత్రము. మానసిక శాంతి, సంతృప్తి, సంతోషము మొదలయినవి, భగవంతుని తెలిసికొనుటలోను, యమనియమాద్యష్టాంగ యోగసాధనలోను, తదేక లక్ష్యసిద్ధి ప్రాప్తములోను ఏంతేని సహకరించును. ఇవియే చివరకు మనల మనలక్ష్యమునకు జేర్చును. నిత్యముపూజ, బలి సమర్పణము అను రెండు క్రియలు దేవాలయములో జరుగుట యనగా, వివిధ దైవతృప్తిమూలకముగా న్యాయము, ధర్మము, విశ్వవ్యాప్తము చేయుటే ఫలితము అని తెలియవలెను. అర్చనాఫలమును గురించి విఖనసమహర్షులవారు చెప్పినట్లుగా గృహమందుగాని, దేవాలయమందుగాని భక్తితో భగవంతుని, నారాయణుని అర్చించినచో పరమపదనివాసమగు వైకుంఠమునుచేరుట సత్యమనుట సత్యదూరము కాదు. ప్రాతఃకాలపూజ నిత్య జప హోమాదులను క్రమము తప్పక

చేయువారి లోపదోషనివృత్తి కొఱకును, మధ్యాహ్నపూజ రాజరాష్ట్ర గ్రామాభివృద్ధికొఱకును, సాయంకాలపూజ సస్యవృద్ధికొఱకును చెప్ప బడినది. ఉషఃకాలపూజ ప్రజా, పశు, యజ్ఞాభివృద్ధికిని, అపరాహ్ణపూజ దుష్టశక్తివినాశము కొఱకును, అర్ధరాత్రపూజఅన్ని చతుష్పాత్తు జంతువుల యభివృద్ధికి అని గూడ శాస్త్రములు చెప్పియున్నవి. ఈ పూజ కేవలము మన భుక్తికొఱకు మాత్రమేగాక సర్వజీవసంతృప్తి, సంతోషములుకూడ దీనివలననే ప్రాప్తించుట జరుగవలసియున్నది.

> అర్ధంతృప్యతి నైవేద్యాత్త్రిపాదం హోమపూజనాత్
> పూర్ణంబలి ప్రదానాచ్చ పినియోగాత్సుతృప్యతి.

భగవన్నివేదనవలన స్వామి సగము తృప్తిబడునట, మూడవ భాగము హోమారాధనవలన, బలిప్రదానమువలనను తృప్తిజెందినను, భక్తులకు తన ప్రసాదము పెట్టబడినయెడల భగవానుడు అత్యంత సంతృప్తినొందునని శ్రీవైఖానసాగమమందు అత్రిమహర్షి తెలవిచ్చిరి.

భక్తాన్వాపి భోజయేత్. భక్తులకును భోజనము పెట్టవలసినదిగ పాంచరాత్రాగమము పాద్మము చెప్పినది.

> నైవేద్యభోజనం కృత్వా నిత్యం యః ప్రణమేచ్ఛివమ్

నందీశ్వరునకు బిల్వ పత్రాదికము సమర్పించి శివునికి నమస్కరించుచు వాని ప్రసాదము ప్రాశన జేయవలసినదిగాను శైవాగమ లింగార్చన చంద్రికయందు చూడగలము. బలిదేవతలుకు బలినొసంగుటలోని అంతర్యము శాస్త్రవిధానముచే సమర్ధమయ్యెను, వాని వలన మనకపకారము జరుగకుండుట యొకటి, రెండవది మనకున్నది అందఱును పంచుకొనవలెననెడు సిద్ధాంతమున కుపబలకముగా నుండుటయు గుర్తించవలెను. బలిపీఠముపైనుంచు బలిసమర్పణము పేర్కొనబడని దేవతలన్నిటికినని యిదివరకే చెప్పియున్నాము. వీరు సరిగా గర్భగృహమున కెదురుగానుందురు. బలి సమర్పణముగూడ గర్భగృహము

లోని దేవతలకందఱకు వీరి పర్యవేక్షణములోనే జరుగును. మన యున్నతికయి మనము చేయు విధానమయినను నిది విశ్వజీవులకు వితరణము జూపవలెనను సిద్ధాంతమునకు ఆలంబనమయినట్టిది. కనీసము మనకొఱకు చేసికొన్నను నిది మనకు తెలియకనే విశ్వవ్యాప్తమగుట మనము గమనించవలెను.

## 2. కాలోత్సవము - సంవత్సరోత్సవము

ఉత్సవములు మూడువిధములని వైఖానస మహర్షి మరీచి చెప్పినాడు. ఉత్సవో త్రిధా: 'నిత్యోత్సవ శాంత్యుత్సవ శ్రద్ధోత్సవ ఇతి' "ద్వాదశమాసేష్వేకస్మిన్ మాసేఽబ్దం ప్రతి తత్కాలే నిత్యం సంకల్ప్య యః క్రియతే స నిత్యోత్సవః"

ఉత్సవములు మూడువిధములు. నిత్యోత్సవ (కాలోత్సవ) శాంత్యుత్సవ శ్రద్ధోత్సవములు.

నిత్యోత్సవ మనగా ద్వాదశ (12) మాసములలోను ఏదో యొక మాసములో, ప్రతిసంవత్సర మా మాసములోనే సంకల్పవిధానముచే చేయబడు యుత్సవము నిత్యోత్సవము. దీనినే కాలోత్సవమందురు.

'భయ ప్రమాద, దుర్భిక్ష, వ్యాధి, గ్రహపీడాద్యశుభశాన్త్యర్థం సంకల్ప్య యః క్రియతే సశాన్త్యుత్సవః'

భయము, ప్రమాదము, దుర్భిక్షము, వ్యాధి, గ్రహపీడాదుల శాన్తి కొఱకై సంకల్పించి ఆచరించునది శాన్త్యుత్సవము.

శ్రద్ధా విత్తే యదాయుక్తే తదా యస్సమ్యక్ (శ్రద్ధయా) క్రియతే స శ్రద్ధోత్సవో భవేత్'

శ్రద్ధతో విత్తము ననుసరించి చేసెడియుత్సవము శ్రద్ధోత్సవము' భృగువు దీని ఫలితమునుగూర్చి యిట్లు చెప్పెను.

చేయువారి లోపదోషనివృత్తి కొఱకును, మధ్యాహ్నపూజ రాజరాష్ట్ర గ్రామాభివృద్ధికొఱకును, సాయంకాలపూజ సస్యవృద్ధికొఱకును చెప్ప బడినది. ఉషఃకాలపూజ ప్రజా, పశు, యజ్ఞాభివృద్ధికిని, అపరాహ్ణపూజ దుష్టశక్తివినాశము కొఱకును, అర్ధరాత్రపూజఅన్ని చతుష్పాత్తు జంతు వుల యభివృద్ధికి అని గూడ శాస్త్రములు చెప్పియున్నవి. ఈ పూజ కేవలము మన భుక్తికొఱకు మాత్రమేగాక సర్వజీవసంతృప్తి, సంతో షములుకూడ దీనివలననే ప్రాప్తించుట జరుగవలసియున్నది.

అర్ధంతృప్యతి నైవేద్యాత్త్రిపాదం హోమపూజనాత్
పూర్ణంబలి ప్రదానాచ్చ వినియోగాత్సుతృప్యతి.

భగవన్నివేదనవలన స్వామి సగము తృప్తిబడునట, మూడవ భాగము హోమారాధనవలన, బలిప్రదానమువలనను తృప్తిజెందినను, భక్తులకు తన ప్రసాదము పెట్టబడినయెడల భగవానుఁడు అత్యంత సంతృప్తినొందు నని శ్రీవైఖానసాగమమందు అత్రిమహర్షి తెలవిచ్చిరి.

భక్తాన్వాపి భోజయేత్. భక్తులకును భోజనము పెట్టవలసినదిగ పాంచరాత్రాగమము పాద్మము చెప్పినది.

నైవేద్యభోజనం కృత్వా నిత్యం యః ప్రణమేచ్ఛివమ్

నందీశ్వరునకు బిల్వ పత్రాదికము సమర్పించి శివునికి నమస్కారించుచు వాని ప్రసాదము ప్రాశన జేయవలసినదిగాను శైవాగమ లింగార్చన చంద్రికయందు చూడగలము. బలిదేవతలుకు బలినొసంగుటలోని అంతర్యము శాస్త్రవిధానముచే సమర్ధమయ్యెను, వాని వలన మనకప కారము జరుగకుండుట యొకటి, రెండవది మనకున్నది అందఱును పంచుకొనవలెననెడు సిద్ధాంతమున కుపబలకముగా నుండుటయు గుర్తించవలెను. బలిపీఠముపైనుంచు బలిసమర్పణము పేర్కొనబడని దేవతలన్నిటికినని యిదివరకే చెప్పియున్నాము. వీరు సరిగా గర్భ గృహమున కెదురుగానుందురు. బలి సమర్పణముగూడ గర్భగృహము

లోని దేవతలకందఱకు వీరి చర్యవేక్షణములోనే జరుగును. మన యున్నతికయి మనము చేయు విధానమయినను నిది విశ్వజీవులకు వితరణము జూపవలెనను సిద్ధాంతమునకు ఆలంబనమయినట్టిది. కనీసము మనకొఱకు చేసికొన్నను నిది మనకు తెలియకనే విశ్వవ్యాప్తమగుట మనము గమనించవలెను.

## 2. కాలోత్సవము - సంవత్సరోత్సవము

ఉత్సవములు మూడువిధములని వైఖానస మహర్షి మరీచి చెప్పినాడు. ఉత్సవో త్రిధా: 'నిత్యోత్సవ శాంత్యుత్సవ శ్రద్ధోత్సవ ఇతి' "ద్వాదశమాసేష్వేకస్మిన్ మాసేఽబ్దం ప్రతి తత్కాలే నిత్యం సంకల్ప్య యః క్రియతే స నిత్యోత్సవః"

ఉత్సవములు మూడువిధములు. నిత్యోత్సవ (కాలోత్సవ) శాంత్యుత్సవ శ్రద్ధోత్సవములు.

నిత్యోత్సవ మనగా ద్వాదశ (12) మాసములలోను ఏదో యొక మాసములో, ప్రతిసంవత్సర మా మాసములోనే సంకల్పవిధానముచే చేయబడు యుత్సవము నిత్యోత్సవము. దీనినే కాలోత్సవమందురు.

'భయ ప్రమాద, దుర్భిక్ష, వ్యాధి, గ్రహపీడాద్యశుభశాన్త్యర్థ్యం సంకల్ప్య యః క్రియతే సశాన్త్యుత్సవః'

భయము, ప్రమాదము, దుర్భిక్షము, వ్యాధి, గ్రహపీడాదుల శాన్తి కొఱకై సంకల్పించి ఆచరించునది శాన్త్యుత్సవము.

శ్రద్ధా విత్తే యదాయుక్తే తదా యస్సమ్యక్ (శ్రద్ధయా) క్రియతే స శ్రద్ధోత్సవో భవేత్'

శ్రద్ధతో విత్తము ననుసరించి చేసెడియుత్సవము శ్రద్ధోత్సవము' భృగువు దీని ఫలితమునుగూర్చి యిట్లు చెప్పెను.

నిత్యోత్సవము సర్వలోకశాన్తి నిమిత్తము, సర్వులపుష్టి, తుష్టుల నిమిత్తార్థము, రాజుల విజయార్థము, శత్రు వినాశహేతువునకు, వ్యాధి దుర్భిక్షశాన్త్యర్థము ఉత్సవమును చేయవలసినదిగా పేర్కొనెను.

ఈ నిత్యోత్సవము చేయు విధానమునుగూర్చి

'నవాహం, సప్తాహం, పంచాహం వా వ్యుత్సవో రాజ్ఞో,రాష్ట్రస్య గ్రామస్య, యజమానస్య వా జన్మర్క్షే, ప్రతిష్ఠాదినే, విష్ణు పంచకదినేషు మాసనక్షత్రే ........ అవభృథం సంకల్ప్య ..........

9, 7, 5, రోజులుగా ఉత్సవదినములు నిర్ణయించుకొని స్వామి ప్రతిష్ఠాదినముగాని. నక్షత్రముగాని, రాజరాష్ట్రగ్రామ, యజమాన జన్మ నక్షత్రాదులుగాని, విష్ణుపంచక దినములుగాని అవభృథ సంకేతముగా నిర్ణయించుకొని (తీర్థవారి) దానికి పూర్వము 9 వ రోజునగాని, 7 వ రోజునగాని, 5 వ రోజునగాని సంకల్పమును నిర్వర్తించవలెను. ఆ సంకల్పదినముననే అంకురారోపణము, ధ్వజారోహణము జరుగవలెను. 21 రోజుల ఉత్సవమును భృగువు చెప్పియున్నాడు. ఇట్టి దీర్ఘకాలపు ఉత్సవములు విదేశీదండయాత్ర లెదుర్కొనవలసినప్పుడు, ఆకాశమందు దుష్ట ఫలితముల నొసంగుధూమకేతువు (తోకచుక్క) కానవచ్చినప్పుడు ఆచరించ వలసినదిగా చెప్పెను.

ఉత్సవ విధానము మనము ప్రధానముగా తిలకించవలెను. ఉత్సవములు ప్రపంచములోనున్న సర్వజీవుల సౌభాగ్యాభివృద్ధికొఱకు అన్న విషయము ముందే తెలుపబడినది. 'అనాహూతైవ అధ్వరం గచ్ఛేత్' అని చెప్పబడుటచే దీనికి ఆహ్వానము అవసరములేదు. దేవుని పెండ్లికి అందఱు పెద్దలే, అనుసామెతకూడ మనము వినుచున్నాము. ఎల్లరు తమతమ యంతస్తులను మఱచి, తమ ఆధ్యాత్మిక ఔన్నత్యమును, లౌకికలాభోన్నతి తాత్కాలికముగానైనను మఱచి అందఱు ఈ యుత్సవములలో పాల్గొనజేయుటయే వీని యాదర్శము. మన విషయ

మఱుంచి దేవతలలో నుత్తమమధ్యమా భేదములచే నొప్పు వారినిగూడ మనమేక ప్రదేశమున జేర్చుట గమనింపవలసిన విశేషము.

'సర్వేదేవాః, స్సర్వాదేవ్యః, సర్వేఋషయ స్సర్వాఋషి పత్న్యః స్సర్వేపితరస్సర్వాః పితృపత్న్య స్సిద్ధసాధ్య విద్యాధర, గరుడ గంధర్వ, యక్ష, కిన్నర, నాగ భూతాసుర, రాక్షసాఽద్యష్టాదశగణాః సర్వేఽ ప్యాయాంత్వితృక్త్వా ఘోషయేత్'

సర్వ దేవతలు, ఋషులు, దేవులు, ఋషిపత్నులు, పితరులు, పితృపత్నులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, గరుడులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, నాగులు, భూతములు, అసురులు, రాక్షసులు, మొదలగు అష్టాదశగణములును శ్రీమహావిష్ణువు ఉత్సవ దర్శనార్థమై ఆహ్వానింపబడుచున్నారు. ఇంకను భృగువు

'హవ్యం బలిం సమాదాయ భవన్తు శుభదాయినః'

శుభముల నొసంగుటకు మీరీ బలిని, హవ్యమును గ్రహించుడు- అని కూడ వారికిచ్చునది, వారు మనకిచ్చునదికూడ తేల్చిచెప్పినాడు. లౌకిక ప్రయోజనము గరుడ ప్రసాద భక్షణములోనున్నది. చూడుడు. మరీచి 'ధ్వజస్థగరుడస్య నివేదితమన్నం పిండంకృత్వా స్త్రియః పుత్రకామిన్యః పురుషాస్తత్కామా అశ్నీయుః తా బలారోగ్యయుక్త మాయుష్మన్తం పుత్రం ప్రసూయేయుః'

ధ్వజముపై నెగురవేయబడిన గరుత్మంతునకు నివేదింపబడిన అన్నమును ముద్దగాఁజేసి పుత్రకామినులైన స్త్రీపురుషులు సేవించుచో, వారు బలాయురారోగ్యసంపన్నుఁడైన కుమారుని పొందుదురు.

ఏడు ఆవరణలు లేని ఆలయములకును, సామాన్యముగా నొకే యావరణముగలిగిన ఆలయములకును నాయా విధానములను శాస్త్రము తెలిపియున్నది. దేవుని ఉత్సవములో నెల్లరకు పనికల్పింప బడుట, తద్వారా ఐహిక లబ్ధితోపాటు ఆముష్మిక ఫలప్రాప్తికూడ నుండుట

ఆగమశాస్త్రకారులు చేసిన విచిత్ర సన్మేళనము. అగ్రవర్ణమువారినుండి అంత్యవర్ణమువారివరకు భేదములేక విష్ణువు యుత్సవములో పాల్గొన వలెనని శాస్త్రకారుల నిర్దేశము. బ్రాహ్మణులు వేదప్రవచనముతోను, బండిలాగువారు, పుష్పములను దెచ్చువారు, మాలలను నిర్మించువారు, కర్పూరాది సామాగ్రిని విక్రయించువారు, వస్త్రవిక్రేతలు. హోమాదులకు నేయి, కాష్టములను సమకూర్చువారు, పదార్థములను తయారుచేయు వారు, వాయిద్యకారులు, భజనపరులు, నౌబత్తులు వాయించువారు, వినోదములు, వేడుకలు, హరికథలు, పురాణములు, శాస్త్రచర్చలు, సంగీత సాహిత్యములను ప్రపంచించువారు, నృత్యము, నాట్యము, నాటకాదుల ప్రదర్శించువారు వీరందఱును ఏదోవిధముగా నుత్సవములో పాల్గొనెడివారే. వీరు తమభుక్తికే రానిండు. కాని వీరు తమకు తెలియకనే ఆముష్మిక ఫలమును గొనిపోవుచున్నారు. ఇట్టి విచిత్ర సన్మేళన మేవిధమయిన యితర కార్యక్రమములందును మనము గాంచ బోము.

ఇంక తిరుమల ఆలయము మూడు ఆవరణములు గలిగి యున్నది. తిరుపతిలోని ఆలయములు మాత్రము రెండు ఆవరణములే కలిగినట్టివి. ఉత్సవమునకు ప్రత్యేకధ్వజమేగాని శాశ్వత ధ్వజనిర్మాణ మానావశ్యకము. శయనమూర్తికిదప్ప మిగిలిన అన్నివిధములయిన ఆలయములలో శేషుని ఆవశ్యకత గలదు.

ఈ ఉత్సవములలో ననేక సమిధలు హోమమునందు వాడబడుట యనునది యే జాతికి చెందినవారైనను నుత్సవములో పాల్గొన నర్హత కలిగియుందురని తెలుపుటకేనని భావించవచ్చును. మొదటిరోజున పాలాశసమిధలు, రెండవరోజున బిల్వసమిధలు, మూడవరోజున శ్యామి లసమిధలు, నాలగవరోజున న్యగ్రోధము, ఐదవరోజున ఉదుంబరము, ఆరున అశ్వత్థము. 7 న ఖాదిరము 8 న ప్లక్షము 9 న పాలాశము చెప్ప బడినవి. వీనిలో మిగిలినవానికంటె పాలాశము, అశ్వత్థముశ్రేష్ఠము గాన వీనినే యితర సమిధలకు బదులుగావాడుట సంప్రదాయమైనది.

ఆలయ పూజ గృహపూజకంటె మేల్తరము. ఆలయములోని పూజావిధానము మనకు ధ్యానమునకు, ప్రశాంతికి, పరిసర నిర్మలవాతావరణమునకు మార్గదర్శకత్వము వహించి మనధ్యాన లక్ష్యమును మిక్కిలి శక్తివంతముగాఁ జేయుటలో తోడ్పడును. ఈ కారణముచేతనే మనపూర్వులు ఆలయములేని గ్రామములో నివసించుట కనుమతించ లేదు. కొన్ని ప్రత్యేకవిషయములలో ఆలయపూజావిధానము గృహార్చావిధానముతో భేదించును. గృహార్చాబింబము ఒకటియేయుండును. కనుక గృహార్చావిధానము సర్వసమగ్రముగా ఆలయములో నెరవేర్ప బడునట్లు చేయనసంగతము. ఉపాసకులు, ఏకేశ్వరోపాసకులు, కామ్యసిద్ధికొఱకు నిట్టి దేవతలను తలచు పూజించుట గృహములందును, వివిక్త ప్రదేశములందును జరుగును. ఇదియొకొక్కప్పుడు మానవ కల్యాణమునకు గాక వినాశమునకును త్రోవజూపును. ఆ కారణముచేతగూడ దేవాలయార్చనము సర్వశ్రేష్ఠమని తెలియవలసినది.

విష్ణోఽర్చా సర్వ దేవార్చనా భవతి

విష్ణువు నర్చించుటచే సర్వ దేవార్చనా ఫల మగుచున్నది.

'యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణం భవతి'

యజ్ఞలోపములన్నియు విష్ణువు నర్చించుటచేతనే సర్వసమగ్రమగుచు లోపదోషనివృత్తి కలుగజేయుచున్నవి.

# 13 వ అధ్యాయము

## సింహావలోకనము

ఇప్పుడు గ్రహించిన ఆగమ సూత్రానుసారము తిరుమల ఆలయము శ్రీవారి అర్చా విధానమును పరిశీలించుదము.

చారిత్ర కసత్యమాధారముగా తిరుమల శ్రీవారిమూర్తి స్వరూపమావిర్భవించిన కాలమును తెలియజాలము. శ్రీ మహావిష్ణువు వేంకటాద్రిపై నుండుటచే వేంకటేశ్వరుడయ్యెనో, లేక వేంకటేశ్వరుడే యీ కొండపైనుండుటచే నీ కొండకు వేంకటాద్రియని పేరువచ్చెనో మనము నిర్ణయింపజాలము. బదరి, గయ, బృందావనము, కాశి, అహోబిలములవలె నిదియు జన్మతోడి పుణ్యక్షేత్రము. ఈ కారణము చేతనే మొదటగా నాళ్వారులు ఈ ప్రదేశమును గీర్తించిరి. చాలా మందికి ఈ కొండ నెక్కుట దుస్సాధ్యము. నాడిది విపరీతమగు మహారణ్య సముపేత మయియుండెను. అందువలన చాలమంది కొండ ఆదిపడివద్ద (అలిపిరి) ఒక్క సమస్కారముపెట్టి తిరిగివచ్చెడివారు. ఈ వృత్తాంతము ముక్కోటి ప్రదక్షిణము ఉత్తరకుడ్యముపై వ్రాయబడినది. ఇది పల్లవుల పరిపాలనా కాలమంతమందువరకు జరిగిన వృత్తాంతము. మధ్యదేశపు పరిమితిలోనున్న తొండమండలమునకు సంబంధించిన కొందఱు బ్రాహ్మణులు చోళపాండ్య దేశములు తిరిగి చూచినవారు, ఒక క్రొత్తవార్తను వ్యాపింపజేసిరి. ఆవార్తయేమనగా స్వయంవ్యక్తమైన స్వామి కొండపై వెలసినాడు. అది అర్చాస్వరూపమై, అర్చనావిధానమునకు తగియున్నది. ఆలయములేక మాములుగానున్నది. అని. ఒక మంటపముగాని లేక ఒక చిన్న రక్షణార్థము వేయబడిన తాత్కాలిక నివాసముగానేయుండి సూర్యచంద్రులచ్చట నివసింతురు అన్నవార్తకూడ ప్రచారమయ్యెను. పల్లవుల శిల్ప నిర్మాణరీతిలో నాడు దక్షిణాది సంప్రదాయము ప్రకారము ఒక చిన్నరాతికట్టడము స్వామి

వారి కొఱకు, భక్తులు నిలిచి దర్శనము చేసికొనుటకు కొక ముఖమంట పము నిర్మించిరి. శ్రీవారి గర్భగృహము 'కోయిలాళ్వారు' అని, భక్తులు నిలబడు తావు ముఖమంటపమనియు బిలిచిరి. ఒకటి రెండు నూనె దీపములో లేక నేతి దీపములో నిత్యము వెలిగించు ఏర్పాటుగా భక్తులు దానసమర్పణము చేసిరి. మహానివేదనమునకు గూడ ఏర్పాటు చేయబడి, నిత్యనివేదనానంతరము దానిని వైఖానస అర్చకస్వామికి, అటనున్న వారి ఒకరిద్దరు పరిచారకులకు వినియోగపరచి యుందురు.

చారిత్రకముగా 966 వ సంవత్సరమునకు పూర్వము పూజ ఏ విధముగా జరుపబడుచుండెనో మనకు తెలిపెడి యాధారము లేవి యును లేవు. కాని అంతకు పూర్వము చాలకాలమునుండి శ్రీవైఖా నసులే అర్చకత్వము నెఱపుచుండిరని చెప్పుటకు, ఆధారములున్నవి. స్వామివారి ప్రథమ వైఖానస అర్చకులు గోపీనాథదీక్షితులని ఆధార సహితమైన ప్రమాణములున్నవి. వారాహపురాణమందు – 'రంగదాస స్త్వారురోహ బాలో ద్వాదశవార్షికః స్వామి పుష్కరిణీం ప్రాప్య స్నా త్వాభక్తి సమన్వితః వైఖానసేన మునినా గోపీనాథేన పూజితం వన మధ్యే తరోర్మూలే స్వామిపుష్కరిణీతటే తిష్ఠంతం పుణ్డరీకాక్షం శ్రీ భూమిసహితం హరిం ఆకాశస్థం సందదర్శ పీతనీలా కృతిం శుభమ్.'

పన్నెండు సంవత్సరముల వయస్సుగల రంగదాసనువాడు వెంకటాద్రికిపోయి శ్రీస్వామి పుష్కరిణియందు స్నానముచేసి గోపీ నాథుడను వైఖానసమునిచే పూజింపబడుచు వనమధ్యమందు పుష్కరిణీ తీరమున చెట్టుమూలమున శ్రీ భూసమేతముగ నాకాశమందు పీతనీలా కృతికలిగిన శుభుడైన శ్రీహరిని భక్తితో జూచెను అనియున్నది. మొట్టమొదటగా 966 వ సంవత్సరములో భాద్రపదమాసములో జరిగిన బ్రహ్మోత్సవము వైఖానసాగమ విధానమున జరిగినదనుటకు శాసనస్థ ప్రమాణమున్నది. ఉత్తరాయణము, దక్షిణాయన ప్రవేశములు (కర్కా-

టక మకరం సంక్రమణములు) ముక్కోటి ద్వాదశీ ఉత్సవము - యీ ప్రత్యేకోత్సవములుగూడ సంవత్సరములో జరుగుచున్నట్లు నాటినుండి శాసనములున్నవి. భక్తుని యభీష్టానుసారము బ్రహ్మోత్సవము జరుపు కొనుటకు అవకాశము కలుగునట్లుగనే 'ఆలయము నిర్మింపబడినది. దీనిని అదనపు బ్రహ్మోత్సవము, శ్రద్ధోత్సవము అనిగూడ ఆగమశాస్త్రములు ప్రకటించినవి. 966 వ సంవత్సరములో ఒక చిన్న రజిత విగ్రహమును శ్రీవేంకటేశ్వరస్వామి ధ్రువమూర్తినిబోలి నిర్మించబడి స్వామివారి ఎదుటగల ముఖమంటపములో (నాటికి) ప్రతిష్ఠింపబడుటచే నిది మఱియొక గుడిగా రూపొందెను.

ఆళవందారు, లేక యీయన పరంపరాగతులు, తిరుమలనంబి, శ్రీమద్రామానుజులు-వీరిలో యెవరైనను సంప్రదాయబద్ధముగా శ్రీ వైఖానసాగమవిధానము శ్రీవారి ఆలయములో జరుగుచున్న దానిని తొలగింప ప్రయత్నము చేయరైరి. వీరు ఆలయ నిర్మాణ పురోగతియందును, ముఖమంటప ప్రాకార నిర్మాణాదులయందును మిక్కిలి శ్రద్ధపూని శ్రమించి కృతకృత్యులై పూర్వముకంటెను బాగుగా నభివృద్ధికిఁ దోడ్పడిరి. మొట్టమొదటగా శ్రీవారికి సమర్పింపబడెడి నివేదనములుకూడ పరిమాణములో, గుణములోను తక్కువగనే యున్నవి. శ్రీవారి ఆలయముతో సంబంధమున్న అర్చకస్వాములుగాని లేదా యితర సేవక పరిచారకులుగాని ఈ నివేదనానంతరము ఆ ప్రసాదమును పంచుకొని దానితోనే తృప్తినొంద వలసినదిగా పరిపాలకులచేతను, స్థానిక ధర్మకర్తలచేతను ఆదేశింపబడినవారైరి. వీరందరు కుటుంబములతోగాక నాతిగల బ్రహ్మచర్యము ననుభవించుచు, కుటుంబ సౌఖ్యమును బొందవలెనన్నచో తిరుపతికిబోయి వచ్చెడివారను వృత్తాంతము గల శాసనమున్నది. (1. 124 ఛిద్రశాసనము)

నిత్యపూజా విధానము నయితము ప్రారంభములో శ్రీవారికి మిక్కిలి ప్రశస్తముగాకుండెను. కాని వేంకటాద్రినాథుఁడు ఒక గొప్ప

వరప్రదాతయనియు, లౌకిక, పారలౌకికము లందలి కష్టములను దీర్చు మహానుభావుడనియు, సర్వదేవేశ్వరుడనియు, భగవత్తత్వము నెఱుంగు మార్గోపదేష్టయనియు భక్తులకొక ప్రగాఢ విశ్వాసముండెను. ఆళ్వారు లందరు ఈ విషయమును తరతమ భేదములేక తమ తమ గ్రంథము లందు కీర్తించిరి. సామవాయి మహారాణి రజిత భోగశ్రీనివాస మూర్తిని ప్రతిష్ఠించినప్పుడుగాని, పరాంతకదేవి బంగారపు కిరీటము సమర్పించినపుడుగాని వారు వారిభర్తల కుత్తమగతుల కొఱకు ప్రార్థించియే చేసినట్లు తెలియుచున్నది. యాదవరాయలలో నొకడైన ఘట్టి దేవుడు ఆలయ నిర్మాణము చేసినపుడు శ్రీరామానుజుని ఆధ్యాత్మికశక్తి ప్రభావితుడై యీ విధమయిన ఆత్మోన్నతికై యీ సమర్పణము జరిగించి యుండుననుటలో నాశ్చర్యము చెందనవసరములేదు. ఘట్టిదేవుని తరువాత వచ్చిన రాజులు వీరరాక్షసుడు, తిరువేంకటనాథుడు, శ్రీరంగనాథుడు శ్రీవారి ఆలయములో అర్చన సర్వసమగ్రముగ లోటుపాటులు లేకుండ జరుగుటకుగాను కొన్ని గ్రామముల దాన సమర్పణములు గావించిరి. దీనికి కారణము వారికి శ్రీ వేంకటేశ్వరస్వామిపై గల ప్రగాఢవిశ్వాసము. ఆ స్వామివలనే తమ తమ కుటుంబములు, గ్రామ రాష్ట్ర జీవితములు పెంపొందింపబడుచున్నవనెడి యొకానొక అంతర్లీన భావమే వారినిట్లు ప్రేరేపించినది. 1260 వ సంవత్సరములో సుందర పాండ్యుడు బంగారునీరుపోసిన కలశమును శ్రీవారి విమానముపై సమర్పించెను, ఆయనరాణి నిత్యము శ్రీవారి నివేదనమునకై పెరుగు పాలు అందించుటకుగాను సమర్పించిన గోగణములు-యివి యన్నియు శ్రీవారువారిపై ప్రసరింపజేసిన కరుణాకటాక్షములకు కృతజ్ఞతా సూచకమనియు భావింపనగును. 1359 వ సంవత్సరములో మంగిదేవమహారాజు విమానమునకు బంగారుపూత గావించుటకు నిట్టిదే యేదో యొక అద్భుతసంఘటనము కారణమయి యుండుననుటలో నాశ్చర్యము లేదు. ఇట్టి సేవాసమర్పణములు స్వభావముచే నతి నిరాడంబరములు. యాదవరాయలతో బాటు వీరనరసింగరాయలు, వారితో విజయ

గండగోపాలుడు (తెలుగు పల్లవరాజు) తమ యిహలోకాభివృద్ధికై తిరుమల శ్రీవారిని సేవించిరి. ఇట్టి సేవలు సమర్పణము లన్నియు నాడు శ్రీవారి ఆలయమునంటిపెట్టుకొనియున్న కొద్దిపాటి సేవకులకు పరిచారకులకు అర్చక స్వాములకు, యాత్రికులకు భోజన భాజనాదులు సమకూర్ప బడుటకే సరిపోయెడివి.

## దక్షిణాది సంప్రదాయము ఆలయములో ప్రవేశించి కలుగజేసిన మార్పులు

శ్రీవారి ఆలయము ఈ నిత్యసేవలకు సంబంధించి దక్షిణ దేశమునుండి శ్రీవైష్ణవుల రాకతో గణనీయమయిన మార్పునకు లోనయినది. భక్తిమార్గప్రపూర్ణులగు ఆళ్వారులు తమతమ గ్రంథములలో నీ విషయమును విస్పష్టముగా సూచించిరి. లోకములోని ఉత్తమ వస్తుసంజాతములన్నియు భగవంతుని కొఱకేననియు, ఉత్తమ భక్తుడు తన్ను తాను భగవంతుని దేవేరిగా భావించుకొనుననని తెలుపుటయే వీరి సిద్ధాంతము.

1339 వ సంవత్సరములో అనగా శ్రీరంగనాథ యాదవరాయల మూడవ సంవత్సర పరిపాలనా కాలములోగాని మనము మొట్టమొదటి సారిగా తిరుమల శ్రీవారి ఆలయములోని ఉత్సవమూర్తులను శ్రీభూదేవులతోగూడిన స్వామినిగూర్చి వినము. శ్రీవారిపేర ఒక దాన శాసన సమర్పణము జియ్యరు పరముగా జరిగినపుడు ఉత్సవ మూర్తులు దేవేరులతో నున్నట్లు పేర్కొనబడుటతో నీ విషయము ప్రసక్తమయినది మొట్టమొదటగా 1360 వ సంవత్సరమున తిరువాయి మొజి ప్రబంధగానము తిరుమలలో జరిగినది. ఆండాళ్ల భక్తిమార్గము ఆ సమయముననే శ్రీ గోవిందరాజస్వామి ఆలయములో ప్రవేశ మొనర్చినది. ఈ విధమైన ప్రవేశము, భక్తిమార్గమును దెల్పు ప్రబంధగానములు శ్రీవైఖానసాగమ విధానార్చనకు ఎట్టి ఆటంకము గలిగింపలేకపోయినవి.

1339 వ సంవత్సరము తరువాత వేయబడిన ప్రతిశిలాశాసనములోను ఉత్సవ సందర్భములలో ఉత్సవమూర్తులు ముష్వురు బేర్కొనబడుచునే యుండిరి. ఈ ఉత్సవమూర్తులు శ్రీవారి ఆలయములో చేరక పూర్వము రజతమూర్తియే ఉత్సవమూర్తిగా వ్యవహరింపబడెడివాడు కొన్ని సంవత్సరములు ఉగ్ర శ్రీనివాసమూర్తికూడ ఉత్సవబేరముగా వ్యవహరిం చెడివాడు. కారణము శ్రీవారిధ్రువమూర్తి ఒకే ఒక మూర్తిగనుక ఆలయములోనున్న ధ్రువమూర్తితో నుండవలసిన ఉత్సవమూర్తి శాస్త్రప్రకారము ఒకదే. ఆ కారణముచే చాలకాలమువరకు ఉత్సవ మూర్తులు ముష్వురు అన్న ప్రసక్తి అక్కడ లేకుండెను. ఇదియు శాస్త్ర సమ్మతమే.

నేటికిని గోదాదేవిగాని, ఆళ్వారులుగాని శ్రీవారి ఆలయములో నునికిని సంపాదించుకొనలేరైరి. 1360 నుండి వారిచే రచింపబడిన ప్రబంధములు పారాయణము చేయబడుచున్నను వీరి విగ్రహ-ప్రసక్తి ఆలయములో లేదు. 1467 వ సంవత్సరములో మాత్రమే మొట్టమొద టగా అధ్యయనోత్సవ ప్రసక్తివచ్చెను. శాత్తుమొర (మంగళాశాసనము) తో గూడి నీ జయంత్యుత్సవములు శ్రీరామానుజుని సన్నిధిలో జరుప బడెడివి. 1360 వ సంవత్సరము తరువాత నీ కాలమున నిదియొక గణనీయమైన మార్పుగా మనము భావింపవచ్చును. ఈ యుత్సవము ఆళ్వారుల స్మృత్యర్థము జరుపబడెడి కృతజ్ఞతా సూచకమగు నొక వేడుక దక్షిణదేశములో జరిగెడి అనేకవిధములగు నుత్సవములు క్రమానుసారముగా నొక్కొక్కటి వైఖానసాగమ పరిధిలో తిరుపతి తిరుమల ఆలయములలో ప్రవేశమును సంపాదించుకొన్నవి.

దీని తరువాత మనము ముఖ్యముగా తెలిసికొనవలసినది-1310 నుండి 1328 వ సంవత్సరమువరకు దేశములో జరిగిన మహమ్మ దీయుల దండయాత్రలు తత్ఫలితముగా శ్రీరంగమునందలి రంగనాథ స్వామి ఉత్సవమూర్తి తిరుమల శ్రీవారి ఆలయములో చాలకాలము

ప్రవాసముండుట గమనార్హము. అప్పటికి పూర్తిగా సర్వసమగ్రముగా పెంపొందని నిత్యసేవలలో శ్రీరంగనాథస్వామికి వారి ఆలయములో జరిగెడు పాంచరాత్రపు సేవలందు కొన్ని అంశములు తిరుమలలో జొరబడినవి. దానిలో మొదటివి తిరువీధిసానులు (దేవదాసీలు) శ్రీవారి ఆలయమున పరిచర్యాదులొనర్చుట. ఇది పాంచరాత్ర సంప్రదాయము వీరిని ఎంబెరుమానడియార్లందురు తిరుకురనూడిలోని పాంచరాత్రాగ మానుసారమైన తిరువిలాన్ కోయిల్లో వీరు ప్రసక్తిగలదు. ఇది వైఖా నసాగమానుసారమర్చన జరుగు ఆలయములలోను శాశ్వత చిహ్న ముగా 14 శతాబ్దాంతమునకయ్యెను. ఇది నాట్యకళకు భక్తిపదములకు ఆటపట్టయినను శాస్త్రానుసారముగా గాక కేవలము సంప్రదాయమును వీడి, సంతోషమునకు ఆలవాలమైన విషయముగానయి మిక్కిలి ప్రచా రములోనికి వచ్చెను.

## భక్తివిధాన పూజ

ఇప్పుడీ సమయములో భక్తివిధానపూజ అననేమో తెలియుట అప్రస్తుతముగాదు. తన యిష్టదైవముయొక్క రూపురేఖలను భక్తుం డలవఱచుకొనుట భక్తివిధానపూజలో మొదటి సోపానము. భగవన్ని వేదితాన్నమే భుజించును. భగవదర్పణమయిన పుష్పమాల నలంక రించుకొనును. చందనమును లేపనము చేయును. ఈ విధమయిన తన్మయత్వముతో భక్తిగీతము లాలాపించును. నృత్యముచేయును. ఉన్మాదియగును. ఈ కారణముచేతనే లోకములోని ఉత్తమవస్తుసము దాయమును మొదట భగవంతునకర్పించి తరువాతనే స్వామిభక్తులు సంగ్రహించు సంప్రదాయము చేపట్టబడినది. వేదములు, ప్రబంధములు స్వామివారి యెదుట విన్పింపబడుచు, ధనాపేక్షలేక జరుపబడుట మొదట తిరుమల ఆలయములో సంప్రదాయముగానుండెను. దేవదాసీలు నృత్యమొనర్చి, నృత్యానంతరము కుంభహారతి నొసంగుటయు సంప్ర

దాయమయ్యెను. భజనబృందములు నాదస్వర విద్వాంసులు వారి వారి ప్రజ్ఞాపాటవములు చూపుటకును హేతువయ్యెను.

కాని శ్రీవైఖానస పూజావిధానమే సర్వసమగ్రముగా నాచరింపబడు శ్రీవారి ఆలయములో నిట్టివేడుకలకు తావులేదు. ఈ కారణము చేతనే అధ్యాపనమునకును, వేదపారాయణమునకును, తిరువీధి (దేవదాసీలకు) సానులకును వారివారి కార్యకలాపములకు మొదటి నుండియు ప్రతిఫలాపేక్ష యుండెడిది. అందువలననేమో శ్రీవారి ఆలయములో మొదట మొదటగా ఉత్సవములు పెద్దగా సామూహికముగాకయుండెను. 1468 వ సంవత్సరములో కందాడరామానుజయ్యంగారు దక్షిణదేశములో ప్రముఖ వైష్ణవసంప్రదాయముతో వెలయునట్టి 108 దివ్య స్థలములను తిరిగి వానినిగురించి యొక నిర్దుష్టమయిన అభిప్రాయము నేర్పరుచుకొని శ్రీవారి ఆలయములో గణనీయమగు కొన్ని మార్పులను ప్రవేశపెట్టెను. ఒక అర్ధశతాబ్దపు కాలము విశేషముగా శ్రమచేసి ప్రతియుత్సవమునకు కావలసిన అన్నిహంగులను ఏర్పఱచుటలో ప్రత్యేక శ్రద్ధచూపెను. సాళువనరసింహదేవునిచే, నీయన ప్రవేశపెట్టిన ప్రతి అంశము, ప్రతిసూచన కొనసాగించునట్లు చేయుట నిజముగా నీయన ప్రతిభకు, భక్తిశ్రద్ధలకు నిదర్శనమని చెప్పనగును.

తిరుమలలో శ్రీవారి గర్భగృహములోనికి నాటికిని వండబడిన అన్నప్రసాదము లేవియు, 966 వ సంవత్సరములో మొదటగా నాలుగు నళి (4 శేరులకు సమానము) ప్రసాదము సైతము తేబడలేదు. పండ్లు, పుష్పములు, కర్పూరములకుమాత్రము నిషేధములేదు. ఎంతటి విలువ గలిగిన అన్నప్రసాద సమర్పణమయినను కులశేఖరపడి కావల నుండవలసినదే. అటనుండియే శ్రీవారికి నివేదనము. ఇవియన్నియు కామ్యార్థ సమర్పణములు కాన వానికి శ్రీవారి గర్భగృహములో స్థానములేదు.

తిరుమలలో జరుగుచున్న శ్రీవారి అర్చనావిధానములో శ్రీ వైఖానసవిధాన ప్రత్యేకత యేమనగా నితరమగు ఎన్ని యున్నను ముందుగా శ్రీవారి అర్చనము, నివేదము, శాత్తుమొఱ అయిన తరువాతనే ఉత్సవములేవేని యున్నచో నవి జరుపుటయున్నది. కాని యితర చిన్న ఆలయములలో ఉత్సవముల సందర్భములో మూల మూర్తిపూజావిధానము మొకచో నాటంకపఱుపబడవచ్చును అట్టి వాని నన్నింటిని, శ్రీపుష్పయాగోత్సవము ద్వారా ఉత్సవ లోపదోష పరిహార ప్రాయశ్చిత్తముగా నెరవేర్చుకొందురు. కాని యీ యుత్సవ మిట జరుగుటలేదు. ఏ కారణముచేత నయినను, మూలమూర్తి పూజా దులు సమగ్రముగా నిర్వర్తింపబడిన యనంతరమే మిగిలినవానికి ప్రాధాన్య మొసగుట జరుగుచున్నది.

ధ్వజారోహణము జరిగిన నాటినుండి శ్రీవారి ఉత్సవమూర్తులు దేవేరులతో వేరొక ప్రత్యేకమందిరము నలంకరింతురు. నాడు తిరు మామణిమంటపము, నేడు కల్యాణమంటపములో వీరు వేంచేయు దురు. వీరిట్లు దీపావళి ఆస్థానము జగువరకు నుందురు. ఈ విషయ ముచే మూలవరులు ఉత్సవాదులను నిర్లిప్తమాత్రుడై వీక్షించును. అవి యన్నియు భౌతికలంపటత్వమున, కామ్య సిద్ధికొఱకు భక్తులొనర్చెడి సేవలుగదా!

ఆళ్వారుల విగ్రహములుగాని లేక గోదాదేవి (ఆండాళ్లు) విగ్ర హముగాని తిరుమల ఆలయములో లేవు ఒక్క రామానుజుని విగ్ర హము మాత్రమే యున్నది.

ప్రాచీన యుగానున్న ఆలయ సంప్రదాయము నిరాడంబరత నేటికిని చెడకనేయున్నది తిరుమలలో శ్రీవారి అర్చకత్వము నెఱపుచున్న శ్రీవైఖానసులు తెలుగు సంప్రదాయమునకు చెందినవారు. వారునేటికిని తమ సంప్రదాయమును వీడకుండుటకుగుర్తు చాంద్రమాన పంచాంగము ననుసరించుటయే వీరు తెలుగు మాట్లాడుట యన్నది నేటికిని విశేష

ముగా నొనర్చుకొనకుండుట వీరి ఋజుత్వమునకు నిదర్శనము తమిళదేశమునుండి వెళ్లిన తిరుమలనంబి తిరుమలలో వైఖానసార్చకులకు పరిచర్యలో దోహదమొనర్చెనేగాని వారితో నేవిధమయిన విభేదమును పెట్టుకొని యెట్టిమార్పులుచేయ సాహసింపకుండుట మరియొక విశేషము. రామానుజుడును అదే విధానము నవలంబింపక తప్పదయ్యెను. శ్రీవైఖానసాగమ అత్రేయమందు "వైఖానసేన విధినా పూజనం వైదికం స్మృతం సర్వాభీష్టప్రదం నృణాం సంసారార్ణవతారకం. విఖనోమునయే పూర్వం విష్ణునా సముదీరితం. వైఖానసేన మునినా లోకానుగ్రహకారిణా అస్మభ్యమేత దుక్తం హి విశిష్టాద్వైతపూజనం". శ్రీనివాసుని వైఖానసవిధానముచే పూజించుట వైదికమనియు అది నరులకు సర్వాభీష్టప్రదమై సంసారసముద్రము దాటుటకు తారకమనియు ఈ ఆగమము సృష్టికిముందే విఖనసునికి విష్ణువుచే ఉపదేశింపబడి లోకానుగ్రహముతో విశిష్టాద్వైత ఆరాధనము విఖనసమహర్షిచే జెప్పబడినదని యున్నందున "వైదికేస్మిన్విధౌ సౌమ్యే పాంచరాత్రేణ సంకరే సంస్కర్తుశ్చ వినాశస్స్యాత్తద్గ్రామ యజమానయోః" వైదికమైన వైఖానసాగమము త్రోసిబుచ్చి పాంచరాత్రాగమము ప్రవేశపెట్టిన ఆ సంస్కర్త పతితుడౌనని యు ఇంతేగాక ఆ గ్రామరాష్ట్రాదులు, పరిపాలకులు నశింతురని అత్రిమహర్షి హెచ్చరిక యున్నందున ఏదైనా విశిష్టాద్వైత పూజయే యని భావించియుండునని తలంపవచ్చును. మరియు భారతమందు 'యత్తస్మిన్నుపలభ్యన్తేత త్తేజస్త్రయీమయం తద్వైఖానః పరంబ్రహ్మ ఇతి వేదవిదోవిదుః' వ్యాసులవారు వేదవిభాగముజేయుటకంటే పూర్వమున నన్ని వేదములకు వైఖానసశబ్దమే యుపయోగింపబడినదని వేదవిదులచే జెప్పబడినందున విఖనసమహర్షి వేదకాలమునాటివాడని నిస్సందేహముగా తెలియబడి శ్రీభగవద్రామానుజస్వామి ఎట్టి మార్పులు జేయుటకు సాహసించలేదు.

ఈ విధముగా వైష్ణవులు వైఖానసులు లోపలనున్న విభేదములను విస్మరించి స్వామివారిని నమ్ముకొని నాటినుండి నేటిదనుక ఒకే కుటుంబములోని వారివలె శ్రీవారి నర్చించుచు, పరిచర్యలొనర్చుచు ఐహికాముష్మిక సుఖములనందుకొని ప్రపంచములోని సర్వజీవులకు ప్రశాంతతను, విషయ వైరాగ్యము నందించిరి. అందించుచున్నారు, ఇకముందును అందించనున్నారు.



# 14 వ అధ్యాయము

## తిరుశుకనూరు పద్మావతీదేవి ఆలయము

ఈ దేవాలయమును గురించిగాని లేక ఆలయములోని అమ్మ వారిని గురించిగాని చారిత్రకాంశములు ప్రాచీనమునుండియున్నవి లభిం పకపోవుటచే చారిత్రకముగా దీని ప్రాచీనతను గురించిన విమర్శను కట్టిపెట్టి కేవలము పురాణములు మాత్రమే ఆధారముగా గ్రహించి యీమె యునికిని గ్రహింపనున్నాము.

పర్వతశ్రేష్ఠములలో నత్యంత ప్రాచీనము, మహామహిమాన్విత మగు పర్వతము వేంకటాద్రి. ఇది శేషాచలమను పేరుతో భూలోక ములో కలియుగములో గణుతికెక్కినది. ఈ ఆదిశేషుడు శ్రీమహా విష్ణువునకు నిత్యసూరులైన అనంత, గరుడ, విష్వక్సేనాదులలో నొకరు. శ్రీమహావిష్ణువునకుం బాయని శయ్య. దుష్కృతాంతకుండు. దీనిపై వసించినవాడు సాక్షాత్తు పరంబ్రహ్మస్వరూపమగు నా నారాయణమూర్తియే గాని అన్యుడు కాడు. 'శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే' అని వేదాంతములందు కొనియాడబడెడి పరంబ్రహ్మమితడే యని వేరుగా చెప్పనక్కరలేదు. సాక్షాత్తు పరనామకమగు వైకుంఠమును వీడి యే మానవుని కోర్కెపయి గాక తనకు తానుగా పతితజీవోద్ధరణ సేవా సక్తతతో నీ యాదివరాహక్షేత్రమున నీ యానందనిలయ విమానమున నెలకొనియున్నాడు. లక్ష్మీదేవినికూడ విడచివచ్చి యీ ప్రదేశమున వెలయుటచేత గావచ్చును, నీయనను విరహమూర్తిగా గూడ భావింప వగును. వైఖానసాగమములలో అత్రిమహర్షి విరహమూర్తి స్వరూప నిర్ణయము చేసియున్నాండు. అందులో శ్రీభూదేవులను విడిచి కేవల మొకమూర్తిగానున్న స్వరూపమును ఆయుధరహితమైన బాహావు లున్న మూర్తి స్వరూపమును విరహమూర్తిగా బేర్కొనియున్నారు.

యాత్రికులు శ్రీమహావిష్ణుస్వరూపముగా నుండి కలియుగములో వేంకటేశ్వరస్వామిగా కీర్తినొందిన స్వామిని దర్శింపవచ్చి తమ తిరుగు ప్రయాణములో తిరుశుకనూరు (నేటి తిరుచానూరు) గ్రామము లోనున్న శ్రీఅలమేలుమంగాదేవిని దర్శింతురు. ఇట పద్మసరోవరము గలదు. ఇందు యాత్రికులు మొదటగా స్నానమాచరింతురు. తరువాత నీ క్షేత్రములోగల సూర్యనారాయణమూర్తిని, శ్రీ పద్మావతీదేవిని దర్శింతురు. ఈ విషయమై మరికొన్ని వివరములు తెలిసికొందము.

పద్మపురాణములో నీ కథ గలదు: బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లలో నెవరు యజ్ఞభాగమును స్వీకరింప నర్హతగలవారను సందేహము నివృత్తి చేసికొనగోరి, ఋషులు భృగువును వీరి లోకములకు బంపిరి. అంత భృగువు సత్యలోకమున బ్రహ్మను, కైలాసమున శివుని బరీక్షించి వారి రజస్తమోగుణాధిక్యమును గ్రహించెను. విష్ణువును బరీక్షింపగోరి వైకుంఠమున కేగెను. లక్ష్మీదేవితో కేళీవినోదయుక్తుడై యున్న విష్ణువునుజూచి యుగ్రుడై భృగువు లక్ష్మీదేవి నివాసస్థానమగు విష్ణువ క్షమును దన్నెను. విష్ణువు భృగువును శిక్షించుటకు మారు మన్నించెను. ఈతని సత్వగుణాధిక్యతకు భృగుమహర్షి అలరి ఆతనినే యజ్ఞపురుషు నిగా నిర్ణయించుకొనెను. కాని తనస్థానము నవమానించిన మహర్షిని సత్కరించుట లక్ష్మీదేవికి గిట్టదయ్యెను. లక్ష్మీదేవి కోపముతో పాతాళ మున కపిలమహర్షి తపస్సుచేయు తావున కేగెను. ఆ మహర్షియు శ్రీమహావిష్ణువు నిల్లాలగు లక్ష్మీదేవినియాదరించి ఆమెను పూజించెను. ఇట్లు చాలకాల మామె కపిలమహర్షి సాన్నిధ్యముననే గడపెను.

ఇట్లుండ విష్ణువు లక్ష్మీదేవిని గానక వెదకుచు భూలోకమున కేగెను. కడకు కొల్లాపురమునకు విచ్చేసెను. అచట లక్ష్మీదేవి చిర కాలముగా అగస్త్యమహర్షిచే నర్చింపబడుటచూచి తానును ఆమునులతో గూడి పదిసంవత్సరములు లక్ష్మీదేవి నర్చించెను.

అంత నశరీరవాణి ప్రత్యక్షమై కృష్ణకు దక్షిణమున నిరువది రెండు యోజనములదూరములో సువర్ణముఖరీ తీరమున నొక సరోవరమును నిర్మించి యందు దేవలోకమునుండి సువర్ణ కమలమును తెప్పించి నాటి, తపస్సుచేసినచో నీకు తప్పక మహాలక్ష్మి ప్రసన్నురాలగును అని చెప్పెను. అశరీరవాణి వాక్కువిని మిక్కిలి సంతోషించినవాఁడై విష్ణుమూర్తి సువర్ణముఖరీతీరమును చేరి నట నొక విస్తారమగు సరోవరమును త్రవ్వించెను. వాయుదేవుని బిలిచి ఇంద్రుని యనుమతితో స్వర్ణకమలమును దేవలోకమునుండి తెమ్మని యాజ్ఞాపించెను. వాయుదేవుడును మనోవేగముతో దేవలోకమున కరిగి దేవాధిపతియగు వింద్రుని కీ విషయంబునుచెప్పి యాతని యనుమతితో స్వర్ణ కమలమును దెచ్చెను. వాయుదేవుడు మహావిష్ణువున కొసంగిన విష్ణువా కమలమును గొని సరోవరమున నాటించెను. అది ముకుళింపక సదా వికసింపవలెనను నుద్దేశముతో శ్రీ సూర్యనారాయణమూర్తిని ఆ సరోవరమునకు తూర్పుతీరమున ప్రతిష్ఠించెను. తరువాత నా స్వర్ణకమలమును దినమునకు వేయి పద్మములతో నర్చింపుచు ఆహారనియమములు పాటించి కేవలము క్షీరాహారుడై ద్వాదశసంవత్సరములు తీవ్రముగ శ్రీసూర్యనారాయణస్వామివారికి పశ్చిమాభిముఖుడై తపస్సుచేసెను.

ఇట్లుండ ఇంద్రుఁడు ఈ తపస్సు నెవరో దేవలోకాధిపత్యమును గామించి చేయుచున్నారనెడి సంకల్పముతో సత్యము నరయజాలక నప్సరసలను తపోభంగము గావింపగా బంపెను. ఆ యప్సరసలును భూలోకమునకు దిగివచ్చి యా మాయామానుషవేషుడైన శ్రీ మహావిష్ణువునుగాంచి తన్మయులై తమ నృత్యగీతాదులతో నెన్నోభంగుల తపోవిఘ్నమునకు నాందిపలుక యత్నించిరి. కాని వారి యాటలు సాగవయ్యె. నిజమున కాయన దృష్టిని మరల్చలేనివారైరి. ఇట్లు యీ యప్సరసలు విఫలమనోరథలై సిగ్గుచెంది తమ యధినాథునితో విన్నవింప దేవలోకమున కరిగిరి.

ఇట్లు పదిరెండు సంవత్సరములు గతింప పదుమూడవ సంవత్సరమున కార్తీకమాస శుక్లపక్ష పంచమీతిథియందు శుక్రవారమున ఉత్తరాషాఢా నక్షత్రముతో గూడిన శుభదినమున మహాలక్ష్మి స్వర్ణకాంతితో స్వర్ణకమలముతో పద్మాసనాసీనయై, శ్రీమహావిష్ణువునకు సాక్షాత్కరించెను. దేవతలు పుష్పవృష్టి గురిసిరి. నారదుడు గీతములాలపించెను. దుందుభులు మ్రోగినవి. బ్రహ్మాది సకలసురలు పద్మసరోవరతీరమున నామెను గాంచి కృతార్థులైరి. అప్పుడు వీరెల్లరి సమక్షములోను లక్ష్మీదేవి తన కంఠములోని తామరమాలనుతీసి తపస్సుగావించుచున్న శ్రీమహావిష్ణువు కంఠమున నలంకరింపజేసెను.

అప్పుడు విష్ణుమూర్తి ధన్యుఁడై యపరిమితానందముతో సరోవరమునుగాంచి "నీ తీరమున తపస్సుగావించి లక్ష్మీదేవిని పొందితిని గాన నీవు నేటినుండి పద్మసరోవరమను పేరుతో నత్యున్నత సరోవరముగా ప్రతిభాసింతువుగాక" యని యాశీర్వదించెను. నారదుడు ఈ సరోవరములో స్నానముచేసిన వాడు యేడు జన్మములలో వాడు చేసినపాపమునుపోగొట్టుకొను నిర్మలుడై విష్ణుసమానుడగునని చెప్పెను.

ఇట్లు శ్రీ ఆదివరాహ క్షేత్రమున శేషాచల సమీపమున స్వర్ణముఖరీ నదీతీరమున శ్రీనివాసునిచే నిర్మింపబడిన పద్మసరోవరమున శ్రీనివాసుని తపఃఫలముగ శ్రీ పద్మావతీదేవి (అలర్ మేల్ మంగాదేవి) అవతరించిన కారణముగా నీ సరోవరము, ఈశుకక్షేత్రమగు శుకపురి కడు మాహాత్మ్యము గల్గినవని చెప్పవలెను

వేదాంతదేశికులవారు పద్మావతీ జననమునుగురించి యీ శ్లోకమును పలికిరని చెప్పుదురు.

అగ్రేభర్తుః సరసిజమయే భద్రపీఠే నిషణ్ణాం
అంభోరాశే రధిగత సుధా సంప్లవాదుత్థితాం త్వాం
పుష్పాసార స్థగితభువనైః పుష్కలావర్తకాద్యైః
క్లప్తారంభాః కనకకలశై రభ్యషించన్ గజేంద్రాః

భృగుమహర్షి వృత్తాంతమున నలిగి యంతర్ధానమైన లక్ష్మీదేవి శ్రీని వాసుని తపస్సుచేత భర్తముందర పద్మమయమైన యీ శుకనూరు పద్మసరోవరమున జన్మించినపుడు పుష్కలావర్తకమేఘములు పుష్ప ములను వర్షించుటనుగాంచి గజేంద్రములు కనకకలశములతో నిన్నభి షేకించినవి సుమా అని యీ శ్లోకమున కర్థము.

## పద్మావతీఅమ్మవార్ల బ్రహ్మోత్సవము

ఈ ఆలయములో ననుసరింపబడెడు అర్చనా విధానము పాంచ రాత్రాగమము. వైఖానస పాంచరాత్రాగమములు నాకు రెండునేత్రములు (నేత్రద్వయం మమ) అని శ్రీమహావిష్ణువు పలికిన కారణముననేమో యనునట్లుగా తన ఆలయములో వైఖానసాగమ విధానమున పూజా విధానమును జరిగించుకొనుచు తన యిల్లాలగు పద్మావతీ దేవాలయ ములో పాంచరాత్రాగమ విధానము ననుసరింప జేసియుండెను. ఈ రెండు ఆగమములు నాకు రెండుకండ్లు అని ఆయన చెప్పిన వాక్య మీప్రదేశ ములోనే సమన్వయింపబడినది.

ఈ పద్మావతీదేవి (అమ్మ) వారికి కార్తీకమాస కృష్ణపక్ష ఏకా దశిన గాని ద్వాదశిన గాని బ్రహ్మోత్సవములు ప్రారంభమగును. అవి పాంచరాత్రాగమానుసారము నిర్వహింపబడును. ధ్వజారోహణము తరువాత వరుసగా ప్రతిరోజు నుదయము సాయంత్రము వాహనము లతో అమ్మవారి యుత్సవములుండును. ఐదవనాడు గజవాహనము ఆరవనాడు గరుడవాహనము, ఎనిమిదవరోజు రథోత్సవము జరుగును. అన్ని గ్రామములలో తిరునాళ్ళరథోత్సవముతోసరి. తీర్థవారికంత ప్రాధా న్యముండదు. కాని యీ అమ్మవారి ఆలయములో నట్లుకాదు. పంచమీ తీర్థమను పేరుతో ప్రత్యేకోత్సవము జరుగును. ఇది మిక్కిలి వైభవ ముతో జరుగునుత్సవము. అంతకుముందు దినము తిరుమలలో శ్రీవారి ఆలయములో అధ్యయనోత్సవములలో రాపత్తు చివరిదినము (రాత్రిపది

దినములు) జరుగును. మరునాడు ఉదయము పంచమీ తిథిరోజున శ్రీవారివద్దనుండి పసుపు, తులసి, పీతాంబరము, అన్నప్రసాదములు తిరుమలలో ఛత్రచామరములతో వాద్యయుతముగా ఆలయమర్యాదలతో వేద పారాయణాదులతో నూరేగింపుజరిగి తిరుచానూరు వచ్చును. ఇంతలో మంగాపురములో అమ్మవారికి పల్లకీలోనుత్సవము జరిగి ఆలయములో అర్చనము, చూర్ణాభిషేకము జరుగును. అప్పుడు తిరుపతి నుండి ఏనుగుపై వచ్చు సంభారముల నెదురేగి తోడ్కొనివచ్చి అమ్మవారి సన్నిధిలో నుంతురు. పద్మసరోవరమున స్నపనము, చక్రస్నానము జరుగును. సాయంత్రము అమ్మవారిని వస్త్రాభరణములతో నలంకరించి గంగుంౘడమంటపములో విశేషాస్థానము జరుపుదురు. ఈ రాత్రియే ధ్వజావరోహణము జరుగును. ఆ నాడు శ్రీవేంకటేశ్వరులే తిరుచానూరు వేంచేయుదురని ఐతిహ్యము. ఆ కారణముననే తిరుమలలో శ్రీవారికి అర్చనాదులిట చక్రస్నానమగునంతవరకు జరుగవు. ఈ పంచమీతీర్థమురోజు ఒక్క రోజు మాత్రమే శ్రీవారి తులసి భక్తులకు పంచబడును. మిగిలిన రోజులలో అనగా సంవత్సరములో నీ యొక్క కార్తీకశుక్లపంచమీ తిథిరోజున తప్ప మరియొకరోజున నేనాడును తిరుమల శ్రీవారి తులసి భక్తులకు అలభ్యమే.

'సమస్త జననీం వన్దే చైతన్య స్తన్యదాయినీమ్।
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివరూపిణీమ్'

శ్రీపద్మావతీదేవికి పాంచరాత్రాగమానుసార మర్చనమయినను విటగల సూర్యనారాయణస్వామివారికి మరల వైఖానసాగమార్చనమే కలదు



# 15 వ అధ్యాయము

## సాళువ నరసింహరాయలు, (క్రీ. శ 1445–1492)

తిరుమల తిరుపతి దేవస్థానముల చరిత్ర విషయమును ఈ మహారాజుతో ప్రారంభించుట సముచితమే. 1359 వ సంవత్సరములో విమానమునకు మరల బంగారుపూత, శిఖరమునకు బంగారుపూత పూయించిన సాళువబిరుదాంకితుఁడగు మంగిదేవ మహారాజుకు యీయన ముదిమనుమఁడు. ఈయనకు శ్రీవారిపై గల భక్తితత్పరత హెచ్చు. ఈయనకు తన ఆలయ కార్యక్రమములలో దీటుగాఁబని చేయుటకు అదృష్టవశమున కందాడ రామానుజయ్యంగారు లభించెను. అనుభవము చేతను, భక్తితాత్పర్యాదులచేతను, విశ్వాసముచేతను, ఈయన కీయనయేసాటి అనునట్లుగా తిరుమల తిరుపతి ఆలయముల కొఱకై మిక్కిలి శ్రమించెను. ఈతని కార్యసామర్థ్యము కొనియాడదగినది. ఈతడు కాంచీపురము మనవాళజీయరుస్వామి శిష్యుఁడిగాఁదన్ను తానెఱుక పఱచుకొనెను. ఈయన జీవితకాలము క్రీ. శ 1480 నుండి 1496 వరకు చెప్పవచ్చును. సాళువ నరసింగరాయని పరిపాలనాకాలము క్రీ. శ 1445 –1492 వరకని చరిత్రకారులు నిర్ణయించిరి. ఈయన తిరుమల ఆలయములో అనేకములయిన నూత్నోత్సవములను ప్రవేశపెట్టెను. అన్న ప్రసాదముల నధికము గావించెను. వరుసగా నీ మహారాజు కాలములో నీయన కొనసాగించిన విప్లవాత్మకమయిన మార్పులను బరిశీలింతము.

ఈయనచేసిన విప్లవాత్మకమయిన మార్పులలో చెప్పకోదగినది చాత్తద శ్రీవైష్ణవుల నీయన తన శిష్యులుగా నొనర్చుకొనుట. వీరు పుష్పవనములను పెంచి పోషించి ఆ పుష్పములను, చందనాదులను, ఇతర పరిమళద్రవ్యములను శ్రీభోగ శ్రీనివాసమూర్తి నిత్య తిరుమంజనోత్సవమున సమర్పించుట యనెడు కార్యక్రమములో పాల్గొనెడివారు.

ఇదికాక వీరు నిత్యము శ్రీవైష్ణవులతో కలిసి 'తిరువాయిమొళి' ప్రబంధ పారాయణమును శ్రీవారి సన్నిధానములో చేయుట, దానికై వీరు తగిన గౌరవ సత్కారములు దేవస్థానమువారిచే పొందుటయు జరిగెడిది. ఈ మహత్తరమైన కార్యములను ప్రవేశపెట్టుటలో కీర్తిప్రతిష్ఠలు కందాడ రామానుజయ్యంగారికిని, ఆయనను గౌరవించిన రాజగు సాళువనరసింహ రాయలకును చెందవలసియున్నది. తిరుమల తిరుపతి దేవస్థానముల రెండవ శాసన సంపుటిలో నెక్కువభాగము వీరి సంయుక్త కృషియే ప్రశంసింపబడినది. మరియొక ముఖ్యవిషయమేమన జన్మచే లభించిన కులప్రసక్తికతీతమగు భక్తిభావము పెంపొందించి తద్వారా మోక్షమార్గమును లభింపజేసికొనుటలో నుత్తమవిధానము బోధించెడు, కైశికీ పురాణ, పఠనము ఉత్థానద్వాదశీ దినమునాడు తిరుమల శ్రీవారి సన్నిధానములో నెవరైనను ప్రథమాచార్య పురుషసంతతిలోని వారిచే పఠింప జేయుట. ఇది కైశికద్వాదశి, అనుపేరుతో శాసనములలో క్రీ శ 1308 నుండి పేర్కొనబడుచున్నను క్రీ. శ 1494 (2-115) నుండియే క్రమ బద్ధముగా ప్రతిసంవత్సరము జరుగుటకు తిరునిన్ఱ-ఉర్-ఉడయాన్ మారునాయినార్, పెరుమక్కళ్ గోవిందరులచే నొసగబడిన దాన శాసనము హేతువగుచున్నది.

## పెద్దరఘునాథాలయము

తిరుపతి పట్టణము సాళువ నరసింహరాయని కాలములో గాని ఉచ్చస్థితి పొందనేరదయ్యెను. ఈతఁడు రాజయిన యనంతరమే నిట గోవిందరాజస్వామివారి ఆలయములో నిత్యోత్సవములు, ఆ ఉత్సవములలో సమర్పింపబడెడు అన్నప్రసాదముల పరిమాణము పెంపుదల యును మిక్కిలిగా జరిగెను. శ్రీరామానుజుని ఆలయములో నొక రామచంద్రుని విగ్రహమును 1480వ సంవత్సరములో నరసింహమొదల యార్ అను నాయన సాళువ నరసింహరాయల ప్రతిష్ఠకై నెలకొల్పెను

అదికాక వేరొక రఘునాథాలయము 'పెద్ద రఘునాథాలయము' అన్న పేరుతో 1481 వ సంవత్సరములో నీయనచే నిర్మింపబడియున్నది.

క్రీ. శ. 1468 వ సంవత్సరములో ఈ కందాడ రామానుజయ్యంగారు 'కులశేఖరాళ్వారు' సన్నిధిని తిరుపతిలో నిర్మించెను.

## యుగాది - దీపావళి

తిరుమలలో శ్రీ భోగశ్రీనివాసమూర్తి ప్రతిష్ఠాకాలమునుండి సౌరమానము ప్రకారమే యిచట యుత్సవాదులు నిర్వర్తింపబడుచుండెడివి. కాని సాళువనరసింహరాయని కాలములో అనగా 1491 వ సంవత్సరములో (2-914) అనగా 27-6-1491 నాటి శాసనములో శ్రీమన్మహామండలేశ్వర బేచిరాజ తిమ్మయదేవమహారాజుచే యుగాది, దీపావళి ఆస్థానములలో శ్రీవారికి నివేదనములకుగాను అన్నప్రసాదములను సమర్పించిన విషయము కలదు. ఇది స్పష్టముగా నాటినుండి చాంద్ర సౌరమాన పంచాంగములు శ్రీవారి ఆలయములో యుపయోగములోనికి వచ్చినట్లు తెలుపుటకు వీలొసంగుచున్నది. ఇవి నాడు ప్రధానముగా జరిగెడి ఆస్థానములని చెప్పవచ్చును.

## అధ్యయనోత్సవములు

శ్రీవైష్ణవుల ప్రాముఖ్యతకు ముఖ్యముగా పేరు తెచ్చిపెట్టిన వీ యధ్యయనోత్సవములు. క్రీ. శ. 1360 వ సంవత్సరమునుండి తిరుమలలో ఆళ్వారుల దివ్యప్రబంధ పారాయణము జరుగుచున్నప్పటికి, ధనుర్మాస మహోత్సవము తిరుమలలో క్రీ. శ. 1468 వ సంవత్సరము నుండి క్రమబద్ధముగా జరిగెడిదని తెలియవచ్చును. ఇది సాళువనరసింహరాయలచే నాడొసంగబడిన దానశాసనముచే (2-31) స్పష్టపడుచున్నది. ఈ శాసనములో తిరువధ్యయనమన్నమాట స్పష్టముగా బేర్కొనుటయే విశేషము. 1476 (2-68) లో నొసంగబడిన దానశాసనములోను ఇదే

విషయము కలదు. ఈ రెండు శాసనములను వ్రాయించిన దాతలు తమకు వచ్చు దాతభాగములను శ్రీవైష్ణవులకు వినియోగించుటకయి కందాడ రామానుజయ్యంగారి కధికారమొసంగి రామానుజకూటము నకు బంప నంగీకరించిరి. ఈ అధ్యయనోత్సవములు సంవత్సరములో రెండు పర్యాయములు వచ్చును. ఒకటి ధనుర్మాసములోను (డిసెంబరు) రెండవది (ఏప్రియల్) చైత్రమాసములోను. ఈ రెండు పర్యాయములు తిరుమలలో శ్రీరామానుజునిసన్నిధిలోనే యీ ప్రబంధపారాయణములు కొనసాగించబడును. ఈ సందర్భములో నివేదింపబడెడు అన్నప్రసాద ములు మొదటగా శ్రీవారికి నివేదింపబడిన యనంతరమే శ్రీరామా నుజుని సన్నిధికి జేర్తురు.

## పవిత్రోత్సవము

క్రీ. శ. 1464 వ సంవత్సరములో కటారి సాళువ మల్లయదేవ మహారాజుగారిచే సమర్పింపబడిన దానశాసనముచే, నీ పవిత్రోత్సవము నాటినుండి జరుగుచున్నట్లు తెలియును. ఇది క్రొత్తగా ప్రవేశపెట్టబడిన యుత్సవము (2–18). శ్రావణమాసమున జరుగు నీ యుత్సవకాలము ఐదురోజులు. ఇది పూర్తిగా ఆగమశాస్త్రసంబంధమయినది.

వైఖానసాగమములో నీ పవిత్రోత్సవవిధికి ఎక్కువ ప్రాధాన్య మున్నది. సంవత్సరకాలములో జరిగెడు ఆచార్య, యజమాన, పాచక, పరిచారకాదులు చేసెడి యాహ్నికలోప క్రియానివృత్తికొఱకు పవిత్రో త్సవము విధిగా నాచరింపవలెనని అత్ర్యాదులు చెప్పిరి. ఈ ఉత్సవ దినములందు స్వామివారిని, పట్టుదారములతో తయారుచేసిన పవిత్రము లతో నలంకరింపవలెను. ఆగమశాస్త్రము ననుసరించి హోమాదులు, ప్రసాద నివేదనములు జరిగించవలెను. ఇది పూర్తిగా నాగమశాస్త్ర సంబంధమయిన ప్రక్రియ.

## పారువేట యుత్సవము

ఇది ఈయాలయములో జరుగుచుండెడి చాల పురాతనమైన యుత్సవమయ్యును దీనియావిర్భావము క్రీ. శ. 1456వ సంవత్సరముగా నెన్నవచ్చును. శ్రీవారు మహారణ్యమధ్యస్థితుఁడై యుండుట, పర్వతము పైనుండుట, ఈ స్థానాధిపతి శ్రీవరాహస్వామియగుట ఈవిషయములో గమనింపదగినవి. ఈ ఉత్సవమునకు కూడ 'మృగయోత్సవ' మను పేరిట వైఖానసాగమశాస్త్రము స్థానము కల్పించినది.

## వసంతోత్సవము - ప్లవోత్సవము

ఈ యుత్సవము ప్రప్రథమముగా 1468వ సంవత్సరములో తిరుమలలో జరిగించినట్లు తెలియవచ్చును. వసంతోత్సవము పది రోజులలోని చివరి మూడురోజులలో నీ ప్లవోత్సవము జరిగెడిది. దీని కొఱకు ప్రత్యేకముగా నొక మంటపము వసంతమంటపమను పేరుతో శ్రీస్వామిపుష్కరిణిలో సాళువ నరసింహరాయలు నిర్మించెను. ఈ వసంతమంటపములో శ్రీవారి యుత్సవమూర్తులు ఈ మూఁడురోజులు వేంచేయుదురు. కాని వసంతోత్సవమును, క్రీ శ. 1360వ సంవత్సరము నుండియే ఎఱ్ఱమంచి పెరియపెమ్మనాయకర్ అను నాయన ప్రారంభించినట్లుగా తెలియుచున్నది. ఇది వసంతఋతువులో ప్రారంభింపఁబడు నుత్సవమగుట చేసని వసంతోత్సవమనుటలో నౌచిత్య మున్నది.

క్రొత్తగా ప్రవేశపెట్టఁబడిన మరియొక యుత్సవము డోలోత్సవము. ఇది ఐదురోజుల యుత్సవము. ఇదియును కందాడ రామానుజయ్యంగారి ప్రేరణచే సాళువ నరసింగరాయలచే ప్రవేశపెట్టబడినదే.

## అన్నప్రసాదముల పరిమాణముల హెచ్చింపులు

అన్నప్రసాదముల పరిమాణముల విషయములోను ఈయన కాలమును పేర్కొనదగినదిగాఁ జెప్పనగును. ఉత్సవదినములు, ఇతర పర్వదినముల విషయమటుంచి, క్రీ. శ 1454 నుండి 1494వ సంవత్సరము వరకు నిత్యము శ్రీవారికి నివేదింపబడెడి ప్రసాదముల పరిమాణము 177 మరకాలులు. దీనిలో 'తిరుప్పావడా' మహానివేదన సందర్భములో అపుడపుడు సమర్పించెడి 200 మరకాలుల అన్నప్రసాదము కలుపబడలేదు ఇది కేవల మొక్క సాళువ నరసింహరాయునిచే సమర్పింపఁబడిన దానమే కాదు. ఇతరులనేక దాతలు ఇందు సాయపడినవారు కలరు. వారిలో రాజులు, భక్తులు, దేవదాసీలు, సేనాధిపతులు, రాజబంధువులు, రాణులు నుండిరి

20–9–1504 నాటి శాసనములో (2-138) మొత్తము పేర్కొనబడిన యుత్సవదినముల సంఖ్య 153 దినములు ఈ 153 ఉత్సవదినముల లోను దినమునకొక్క తళిగప్రసాదముకంటె నెక్కువగా సమర్పించిన దాత దేవాలయ ప్రజాపనులశాఖలోని యొకవ్యక్తిఅయిన తిరువేంకటా చ్చెరుక్కన్ ఎంబెరుమానార్. ఈయన నరసింహరాయని కుమారుఁడగు ఇమ్మడినరసింగరాయమహారాజు పరలోకశాంతికై సమర్పించెను దినమునకు రెండుతళిగలని మనము భావించినచో మొత్తము 306 తళిగలగును. ఇదికాక నిత్యము చేయబడెడి అన్నప్రసాదముల పరిమాణమును గమనించినచో నడు శ్రీవారి ఆలయమును దర్శించెడి యాత్రికులను, వారిసంఖ్యను మనము నిర్ణయించుకొనుట సులభమే. ఈయన కాలములో దానమీయబడిన రొక్కపు విలువలు 1,15,605 పణములు. ఇదికాక భూదానము లొసంగబడిన యనేక శాసనములున్నవి. ఈ భూదాన విషయములో యే సేవకుగాను దానమొసంగబడినదో వ్రాయబడినదేగాని, దానివలన వచ్చు రాబడి మాత్రము శాసనస్థము కాలేదు.

## కటక సంక్రమణము : ఆనివర ఆస్థానము

తిరుమల ఆలయములో మొదటి అయనమయిన దక్షిణాయన పుణ్యకాలము ఒక ప్రత్యేకోత్సవముతో ముడిపడియుండుట పేర్కొన దగిన విశేషము. దీనినే నేడు 'ఆనివర ఆస్థానమనె' డు పేరుతో వ్యవహరించుచున్నారు. ఆ రోజున మామూలుగా శ్రీవారినిత్యార్చనము పూర్తిఅయిన తరువాత ఉత్సవమూర్తులు దేవేరులతోసహా తిరుమామణి మంటపములో వేంచేయుదురు. దీనిని మనము 'దర్బారు' అని పిలువ వచ్చును. దేవస్థానపు అధికారులు, అర్చకస్వాములు తమతమ పదవీ బాధ్యతలను ఈ ఉత్సవమూర్తి పాదములచెంత నుంతురు అపుడు పునః పదవీ స్వీకారమహోత్సవము జరుపుదురు. శ్రీస్వామివారి అనుజ్ఞతో తిరిగి తమ పదవులను అర్చకులు, జీయరుస్వాములు, దేవస్థానపు అధికారులు గ్రహింతురు ఆ దినము నుండియే క్రొత్తగా లెక్కలు వ్రాయుట ప్రారంభమగును. ఈ కార్యక్రమమునే తమిళ ములో 'తిరువాండు ఎళుట్టిడళ్' అని పేర్కొందురు. ఈ కటకసంక్ర మణోత్సవము క్రీ. శ. 966 నుండి శ్రీవారి అభిషేకముతో ప్రారంభ మగుచున్నప్పటికిని ఈ యన కాలములో నీప్రత్యేకమగు క్రొత్తలెక్కలు ప్రారంభమును గురించి పేర్కొనుట గమనార్హము. 9-3-1494 వ తేదీనాడు దేవాలయలెక్కల అధికారులు మారునాయినార్ పెరుమక్కల్, గోవిందన్ అను వారలచే నొక దానశాసన మీయుత్సవము కొఱకయి వ్రాయబడినట్లు తెలియుచున్నది. సాళువ నరసింగరాయని కాలములో బాగుగా ప్రసిద్ధిలోనికి వచ్చిన యుత్సవముగా దీనిని పేర్కొనవచ్చును.

## శ్రీ వేంకటాచల మాహాత్మ్య పారాయణము

సాళువ నరసింగరాయని కాలములో పేర్కొనదగిన మరియొక ప్రత్యేకవిషయము శ్రీవేంకటాచలమాహాత్మ్య పారాయణము. ఇది ఒక సంగ్రథనకావ్యము. ఏ భాషలో నిది కూర్పబడెనో మనకు తెలియదు.

కాని సంగ్రథనకారుడు మాత్రము పసింది వేంకటత్తురైహర్ అను నాయనగా తెలియుచున్నది. ఇతఁడు జీయర్ రామానుజయ్యరుగాను పేర్కొనబడినాడు. ఈ గ్రంథము మొట్టమొదటిసారిగా 27-6-1491 తేదీన (2-95) శ్రీవారి యుత్సవమూర్తుల ఎదుట ఈ రచయితచేతనే పారాయణము చేయబడెను.

## పులుగుకాప్పుముతె (పునుగుతైల లేపనము)

ఈ సాళువ నరసింగరాయని కాలములో పేర్కొనదగిన ముఖ్యమగు మరియొక విశేషము. తరువాత కాలములోని వారును యూహ చేయుటకు చాలినంత విషయము కల్పించినది యీ పులుగుకాప్పు. పులుగుకాప్పు అనగా శ్రీవారి ఆలయములో ప్రత్యేకముగా తయారు చేయబడిన పునుగుతైలముచే శ్రీవారి సర్వాంగములకు లేపనముచేయుట.

తిరుమలలో శ్రీవారి ముఖమునకు మాత్రమే ప్రతినిత్యము తిరువారాధన (నిత్యార్చనము) పూర్తియైన తరువాత యీ పునుగుకాప్పు లేపనము ఉదయము చేయబడెడిది. ఇది సంవత్సరమున ఆరునెలలు మాత్రమే జరిగెడిది. ఆషాఢమాసమునుండి మార్గశిరమాసము వరకు గల 6 నెలలలోను ఈ కార్యక్రమమును ప్రత్యేకముగా నాలయములో తయారుచేయబడిన పునుగుతైలముతో నిర్వహించెడివారు. తిరుక్కాలికన్ఱిదాసర్ అను తిరుపతివైష్ణవనాయకుని వినూత్నసృష్టిగా (16-7-1434న) దీనినెన్నవచ్చును. నాడు నిత్యము భోగశ్రీనివాసమూర్తికి అభిషేకము జరిగిన యనంతరమీ కార్యక్రమము నిర్వహింపబడెడిది. ఇది భక్తులకును పరమ మనోహరదృశ్యముగా గానవచ్చెడిది. అతి పరిమళసంశోభితమై, ఓషధీమిశ్రితమైన తీర్థముతో నీ భోగశ్రీనివాసమూర్తి యభిషేకింపఁబడుట చూచువారి కండ్లు పరమపవిత్రములు. ఇది 18-1-1465 నాటినుండి కందాడ రామానుజయ్యంగారిచే ప్రారంభింపబడి, సాళువ నరసింగరాయనిచే 27-12-1467 నాటి నుండి ఆర్థికసంబంధమయిన

వనరులు సమకూర్పబడెను. దీనిని 'అలగప్పిరనార్ తిరుమంజన'మని పేర్కొనుట జరిగెను. (220; 2-30)

## అహోబిలమఠము (వనశఠగోపమఠము)

ఈ వనశఠగోపజీయరు స్వామివారు క్రీ. శ. 1378 వ సంవత్సరములో జన్మించి 1488 వరకు నుండిరి. ఇది అహోబిలమఠచరిత్రను బట్టి తెలియుచున్న కాలవిశేషము. ఈ జీయరుస్వామికి పూర్వులైన సింగయ్య దండనాయకుడు 1339 వ సంవత్సరములో తిరుమలలో అరిశనాలయం తోటను, ఆదివనశఠగోప పుష్పతోటను నిర్మించిరి. ఈ సింగయ్యదండనాయకుడు మైసూరుప్రాంతవాసి. హోయసాలప్రభువైన 3 వ వీరభల్లాలుని మహాప్రధాని. అహోబిలమఠ సాంప్రదాయానుసారముగా నీమఠపుజీయరు తిరునారాయణపురమునకుఁ జెందినవాడని తెలియుచున్నది. అయిన నీయన పుట్టుకగురించిగాని, అహోబిలమునకు వెళ్ళి సాక్షాత్తుశ్రీస్వామివారిచే నెప్పుడు సన్యాసస్వీకారముచేసెనో తెలియుటకును ఆధారములు లేవు. కాని సింగయ్య తిరుపతిలో తాత్కాలిక నివాసమేర్పరచుకొన్నప్పటికే తిరుమలలో వనశఠగోపనంద వనమున్నది యని చెప్పుటలో నెట్టి సందేహమును లేదు. ఈ కాలము క్రీ. శ. 1320 వ సంవత్సరము. ప్రప్రథమ జీయరుస్వామి దీనికి క్రీ. శ. 1378 నుండి యున్నట్లుగా చెప్పవచ్చును. కాని ఈ జీయరుస్వామి నేడు కానవచ్చుచున్న అహోబిలమఠమును స్థాపించినట్టియు, అహోబిలములో సన్యాసస్వీకారముచేసినట్టి ఆదివనశఠగోపస్వామి మాత్రము కాదు. ఈయనకు పూర్వులైన జీయరులు, ఇతరులు పెక్కురు జీయరులకు వలెనే తిరుమల తిరుపతులలో మఠములను స్థాపించి మైసూరునుండి వచ్చెడి యాత్రికులకు సదుపాయములను సమకూర్చుటలో సాయపడెడివారు.

ఇఁక ఒక్కవిషయముతో దీనిని ముగింతము. సాళువ నరసింహుని కాలములోని వనశఠగోపజీయరులు అహోబిలమఠజీయరులతో

నెట్టి సంబంధమున్నవారు కాదు. ఈ కాలములో దీనికి సంబంధించి వెలువడిన యే శాసనము కోను అహోబిలమఠప్రసక్తి వీరికి సంబంధించి తేబడకుండుటయే దీనికిఁ గారణము.

## సాళువనరసింగరాయని కాలములోని దానములు

ఈయన కాలములో ననేక దానములు శ్రీవారి యుత్సవములకు, అన్నప్రసాదములకుగాను చేయబడినవని యిదివరకే తెలుపబడినది. కాని సాళువనరసింగరాయలుగాని, వారిరాణులుగాని, కుటుంబ సభ్యులుగాని ఎక్కువగా ధన, భూ, ఆభరణరూపమైన దానాదులను ఇచ్చినట్లుగా శాసనములు లేవు. సాళువ నరసింగరాయలు ఇచ్చిన గ్రామములతోబాటు అనేక గొట్టపుబావులనిర్మాణమునకు, తద్వారా నీటిని వ్యవసాయభూములకు సరఫరాచేయించుటకు దానములు సమర్పించిన శాసనములుకలవు. సాళువ నరసింగరాయని కుటుంబసభ్యులు, కందాడ రామానుజయ్యంగారుకూడ ఇట్టి యనేక ప్రయోజనములు కల్పించిరి. శాసనములలో పేర్కొనబడిన సేవలవినియోగార్థమే యీ యదనపు రాబడిని వినియోగించెడివారు. దాతలలో ఎవరైనను ఇట్టివి స్వయముగా చేపట్టుట కవకాశములేని పరిస్థితులలో స్థానత్తారు వారినుండి ధనమును గ్రహించి, దానితో నీ మరమ్మతులను కొనసాగించుచుండెడివారు.

## కందాడ రామానుజయ్యంగారు

సాళువ నరసింహరాయలు తన పరిపాలనా కాలములో నెక్కువగా తిరుమలకును, తనరాజధానికినిగూడ దూరముగానుండవలసి వచ్చెడిది. ఇది రాజకీయపుటస్థిరతతోఁగూడిన కారణములచేతనే యని చెప్పవలసియున్నది. అట్టి సమయములోకూడ తాను తిరువేంకటనాథుని భక్తుఁడగుటచే కష్టసమయములో శ్రీవారి ననుగ్రహింపుమని వేడుకొనుటకు తిరుమలచేరి స్వామికివిన్నవించుకొనెడివాడు. ఆ కష్టములు వెనుక

బట్టినంత మరల శ్రీవారికి కృతజ్ఞతలు నివేదించుకొనుటయు జరిగెడిది. ఇట్టిసమయములో నీదేశాంతరమునుండివచ్చిన కందాడరామానుజయ్యం గారికి దేవాలయ పరిపాలనా వ్యవహారములను సర్వము నొప్పగింత పెట్టెను దానితో మొదట మొదట హిందూమతమునకును, వైష్ణవ మతమునకును సర్వవిధముల నుద్ధతిని సమకూర్చవలెనన్న సత్సం కల్పము ఈతనిలో అధికారవాంఛయును, స్వార్థమును బ్రేరేచెను. తిరుమలఆలయములకు సంబంధించినంతవరకు తానొక నియంతగనేలఁ జొచ్చెను. తాను రాజ ప్రతినిధిగను, తానే రాజుగాను సర్వాధికారములు నెఱపజొచ్చెను. అనేక ఉత్సవములను బ్రవేశపెట్టెను. ప్రతియుత్సవ ములో తనప్రత్యేకతయేదియో కానవచ్చునట్లు చేసికొనెను. దేవదాసీలను శ్రీవారియెదుట నాట్యముచేయుటకు నియమించి ఆ గీతములు శ్రీవారి వైభవమును గుఱించినవిగాక తన కీర్తిప్రతిష్ఠలను జాటునవిగానుండ నిర్దే శించుకొనెను. రామానుజకూటము నొకదానిని స్థాపించి దానిని తన ఆధిపత్యముననుంచుకొని అధికార దుర్వినియోగముచేసెను. ఆకాల ములోనే ఈ రామానుజకూటమునకు దాన మొసంగిన దాతలు సయి తము ఈ నిర్వహణముపై నెక్కువమక్కువ చూపలేదనుట నిర్వివాద విషయము.

కందాడ రామానుజయ్యంగారి చర్యలు సాళువ నరసింగరాయని మరణానంతరము చాత్తాద శ్రీవైష్ణవుల నెన్నియో సంకటపరిస్థితులకు గురిచేసినవి. సాళువనరసింహరాయని మరణము క్రీ. శ 1492 వ సంవత్సరము. ఈయన తరువాత నీయన కుమారుఁడగు యిమ్మడీ నరసింగరాయలు రాజ్యమునకు వచ్చెను.

ఈ కందాడ రామానుజయ్యంగారు రామానుజ కూటమునకు సర్వాధిపత్యము వహించుటతోను, అన్నప్రసాదముల, అప్పముల విక్ర యముతోను సంతృప్తివహించలేదు. దేవాలయ పరిపాలనములో, ఆస్తుల పరిరక్షణము, నిర్మాణములు, మరమ్మతులు మొదలగునవి నిర్వ

హించుటకు ప్రత్యేక విభాగ మొకటియుండెడిది. దీనిని 'తిరుప్పణి భాండారమని' పిలిచెడివారు. స్థానాలవారి ఆధ్వర్యములో అనేక విలువ గల వస్తువులతోబాటు మరమ్మతులకు ధనముకూడ తగుమాత్రముండె డిది. ఈయయ్యంగారు శ్రీభాండారములోని ధనము నొక్కింతయైనను మరమ్మతులకు ఖర్చుపెట్ట వీలులేనట్లుగా ప్రణాళికను సిద్ధముచేసి యుంచెను. దానిని ఇమ్మడి నరసింగరాయని యనుమతికై నివేదిం చెను. ఈ విధమయిన ప్రణాళికతో చాకచక్యముగా రాజువద్దనుండి తాను సర్వాభరణములు ఇతర విలువగల వస్తువులకు 'కర్త' గా అధి కారము సంపాదించెను. దీనిని తరువాత 'పొర్ భాండార' మనిరి.

తా నతిచాతుర్యముగా నిర్వహించిన ఈ పదవివలన తనకెం తయో కీర్తిప్రతిష్ఠలను ఆపాదించుకొనెడి ఆత్మస్తుతితోపాటు కొన్ని కొన్ని మంచి కార్యములను ప్రవేశపెట్టుటచేతనే యీతనిపేరు నేటికిని శ్రీవైష్ణవులలో వ్యాప్తమయియున్నది.



# 16 వ అ ధ్యా య ము

## ఇమ్మడి నరసింగరాయలు - వీరనరసింగరాయలు
## (1492—1511 వ సంవత్సరము వరకు)

సాళువ నరసింగరాయలు క్రీ. శ. 1492 వ సంవత్సరములో మరణించిన యనంతర మాతని కుమారుడు ఇమ్మడి నరసింగరాయలు సింహాసనము నధిష్ఠించెను. ఈతఁడు 1505 వ సంవత్సరము వరకు పరిపాలించెను. ఈతనితో విజయనగరరాజులలో సాళువవంశమంతరించినట్లే. సాళువ నరసింగరాయలు రాజుగా నుండగా నాయన ముఖ్యామాత్యుఁడు నరసనాయకుడు తానే రాజైనట్లు వ్యవహరించెను. కుమారుని పరిపాలనములో నైతమట్లే వ్యవహరించెను. ఈయన కుమారుడు వీరనరసింగరాయలు, ఇమ్మడి నరసింగరాయలు 1505 లో మరణించగా సింహాసన మధిష్ఠించి 1509 వ సంవత్సరము వరకు రాజ్యమేలెను.

మన తిరుమల ఆలయమునకు సంబంధించినంతవరకు క్రీ. శ. 1492 నుండి 1509 వరకు ఈ ఇరువురు రాజుల పరిపాలనాకాలమునకు ప్రత్యేకతగలదని చెప్పవలెను. కందాడ రామానుజయ్యంగారి సంస్కరణలు కొన్ని ప్రయోజనాత్మకమయిన మార్పులు తెచ్చినను కొన్ని తీవ్రవిమర్శలకును గురియయినవి. ముందు విలక్షణముకున్న సంస్కరణలను బరిశీలింతము.

1) శ్రీ భోగశ్రీనివాసమూర్తి అభిషేకద్రవ్యములను చాత్తాద శ్రీవైష్ణవులు గ్రహించి తెచ్చి శ్రీవారి సన్నిధిలో సమర్పించుటకు గుర్తింపు కలిగినది.

2) బ్రాహ్మణశ్రీవైష్ణవులతోబాటు చాత్తాదశ్రీవైష్ణవులకును శ్రీవారి ఆలయములో రామానుజుని సన్నిధియెదుట ప్రబంధపారాయణము చదువుటకు తగిన అర్హతా స్థితులు లభించినవి.

ఇంక నప్రయోజనము నాశించినవి.

1) సాళువ నరసింగరాయల మరణానంతరము, దాతల అన్న ప్రసాదభాగము చాత్తాద శ్రీవైష్ణవుల నిమిత్తమై కేటాయింప వలసియుండగా క్రీ. శ. 1494 వ సంవత్సరములో దానిలో కొంతభాగమును తాను దేవస్థానపు జవహరీ బంగారునిధుల అధికారికాగోరి వినియోగముచేయుట నిరసింపబడినది. (ఫోర్-భాండార అధికారి).

2) శ్రీవారిసన్నిధిలో ఊయలపాటలు శ్రీవారిని గుణించికాక రామానుజయ్యంగారినిగుణించి పాడుటకు నట్టువరాండ్రను నియమించి తగినరుసుమును దేవస్థానము వారికి చెల్లించ వారికి తలకు శ్రీవారి పవిత్రశేషవస్త్రము ధరింపజేయుటకు తగిన విధానము కలిగిన సంస్కరణ యీయన మరణముతో నంతమందినది. (2-134, 2-136 క్రీ శ. 1495, క్రీ. శ. 1496.)

శ్రీగోదా దేవిని శ్రీరామానుజయ్యంగారి పుట్టినరోజు సందర్భముగా కొండదిగువ భాగమునకు తీసికొనివెళ్ళి యచట శ్రీవారి ప్రసాదములను సమర్పింపజేసికొను సంస్కరణమునకు గూడ ఈయన మరణానంతరము స్వస్తిపలుకబడినది. (2-140) (తేదీ మాసిపోయినది.)

శ్రీ రామానుజయ్యంగారు దేవస్థానము జవహరీఅధికారి అయిన తరువాత క్రొత్తగా ప్రవేశపెట్టిన యుత్సవము తెప్పయుత్సవము (2-135, 1496). ఈ సందర్భములో దేవస్థానములో ప్రతిచిన్న జవాను నుండి పెద్ద అధికారి వరకు అందరకు ధనపు చెల్లింపులు జరిగించెను. ఇది కేవలము తన కీర్తిప్రతిష్ఠలకు మాత్రమే యని చెప్ప నగును. ఇందులో ప్రబంధపారాయణదారులు కూడ చేరిరి.

ముందు ముందు ఈ ప్రబంధపారాయణము శాశ్వత చిహ్నముగా చోటు చేసుకొనవలెనను నుద్దేశముతో చేసిన కార్యమే యిది. ఈ ఆశయము కడకు క్రీ. శ. 1512 లో ఫలించినది. కాని 1433 వ సంవత్సరములో వీరప్రతాప దేవరాయల మహోత్సాహముతో ప్రవేశపెట్టిన వేదపారాయణదారుల కిందులో స్థానము లభింపలేదు. ఈ తెప్పఉత్సవమునకు నాటి మొత్తము వ్యయము 896 పణములుగా లెక్కచూపబడినది. ఇట్టిదే మరియొక వ్యయము 1464 వ సంవత్సరములో మల్లయ్యదేవ మహారాజుచే నిర్వర్తింపబడిన పవిత్రోత్సవ సందర్భమున జరిగినది. దానిలో స్థానాలవారికిగాని, ప్రబంధ పారాయణదారులకు గాని, నట్టువరాండ్రకుగాని ఏమియు ధనపు బహుమానము లీయలేదు. కేవలము ధనమంతయు పూర్ణభట్టరువారికి ఇతర వేదపారాయణ దారులకు మాత్రమే లభించునట్లాయెను. మరల క్రీ. శ. 1508 వ సంవత్సరములో శ్రీ గోవిందరాజస్వామి వారి ఆలయములో డోలా మహోత్సవము శ్రీవీరనరసింహ మహారాజుగారి ధర్మముతో జరిగినది. అపుడు మరల ఈ కందాడరామానుజయ్యంగారు ఏర్పరచిన ఈ విధమయిన ధనపుబహుమానములను పంపకము కొనసాగినది. ఈసారి నట్టువరాండ్ర కెక్కువ ముట్టినది. వేదపారాయణదారులు పాల్గొనిరి. ప్రబంధపారాయణదారుల పేరు తలచలేదు.

కనుక ఈయన ప్రవేశపెట్టిన సంస్కరణములు కొన్ని యీయన సమకాలికులకే రుచింపలేదని పై విషయములను బట్టి నిర్ధారణ చేయవచ్చును. కొందరు వేదపారాయణదారులను మన్నించగా మరికొందరు ప్రబంధములవారిపై మక్కువచూపిరి. కాని తిరువీధిసానుల విషయమై అందఱు మక్కువ చూపిరి. వారికి ప్రాముఖ్యము ఆలయములలో పెరుగజొచ్చెను.

రామానుజయ్యంగారు ప్రవేశపెట్టెడి ప్రతి యుత్సవమును ఈతని అంతస్తు, నట్టువరాండ్రు-వారి అభినయములు, అతి విలువయైన ప్రసాదముల తయారీలతో నిండియుండును. ఇది యాతని బలహీనతకు నిదర్శనము.

## ఆచార్యపురుషులు

ఈయన కాలములో వీరిని గుఱించి మనము తెలిసికొనవలసి యున్నది. ఈ ఆచార్యపురుషులు ఆలయమునకు సంబంధించినవారు. వారు మతబోధకులుగా నొకప్రక్క, తిరుమల ఆలయమును దర్శింప జేయుటకు భక్తులను ప్రోవుచేయుట మఱియొకప్రక్క వీరిపనిగా నుండె డిది. ఈ ఆచార్యపురుషులలో తోళప్పారు కుమారతాతయ్యంగారు సోదరులు, సొట్టై తిరుమలనంబి కుమారులు, తిరువేంకటతాతయ్యంగారి కుమారులు ముఖ్యులు. వీరు తమ శిష్యులతోబాటు తాము అనేక దానశాసనములను శ్రీవారికి సమర్పించిరి.

# 17 వ అధ్యాయము

## శ్రీవారి ఆలయము

## శ్రీకృష్ణదేవరాయలు (1509–1530)

విజయనగర రాజ్యసింహాసనమును శ్రీకృష్ణదేవరాయలధిష్ఠించిన తరువాత తిరుమల దేవాలయపు పరిపాలనములో పేర్కొనదగిన మార్పులు కలిగినవి.

ఈతఁడు పరిపాలకుఁడుకాక పూర్వమే ఈతడు చక్కని కవిత్వ ప్రియుఁడు, భాషాప్రియుఁడు, పోషకుడు, కళాప్రియుఁడు, కళాపోషకుడు అని మనము చారిత్రకముగా నెఱింగియున్నాము. ఈతని మంత్రి తిమ్మరుసు మహామేధావియేగాక శ్రీకృష్ణదేవరాయలను రక్షించిన ధైర్యవంతుఁడు. శ్రీకృష్ణరాయలను సింహాసనమునందుంచిన మహాధీశాలి. ఈయనయు శ్రీవారికి కొన్ని దానశాసన సమర్పణములుగావించెను. క్రీ. శ 1525 లో రాయలకుమారుఁడు చనిపోవుటలో తిమ్మరుసునకు సంబంధమున్నదను నెపముతో తిమ్మరుసు రాజ్యబాంధవ్యము కోల్పోయెను. దానితో తిమ్మరుసు దీనావస్థకు బాల్పడినట్లు ఆతడొనర్చిన కార్యములచేత దెలియుచున్నది. దాతగా తనకు రావలసిన ప్రసాద భాగములను అమ్ముకొనుటయే యీ కార్యము.

శ్రీకృష్ణదేవరాయలు తిరుమలవెళ్లినపు డాయనవెంట ఆయన రాణులిర్వురు, ఆయన పురోహితులగు రంగదీక్షితులు, శివదీక్షితులును, నిత్యసేవకుడగు బాగూరిమల్లరసు, తన ఆంతరంగిక వ్యవహర్త, తన శాసనలేఖకుడును పెద్దయ్యాశారికుమారుడైన శ్రీపతియు నుండెడివారు. తానిచ్చిన ప్రతిదానవిశేషమునందును తన ప్రశస్తి యంతయు నుదహరింప బడెడిది.

## శ్రీకృష్ణదేవరాయల మతవిశ్వాసములు

శ్రీకృష్ణదేవరాయలు కళాపోషకుడనియు భాషాపోషకుడనియు తెలిసికొనియున్నాము. ప్రతి వసంతఋతువులో విజయనగరములో పండితులు, కవులు, గాయకులు, నాట్యమర్మజ్ఞుల పోటీలు జరుగుట, వానికి బహుమతులిచ్చు వేడుకలు జరుగుచుండెడివి. కాని ఆయన వేదాంతులను తన సభలకు పిలిపించి వేదాంతవిచారము చేసినట్లుగా చరిత్రకారులెవ్వరును వ్రాయలేదు. ఏ మతాధికారి కడకుగాని, సన్యాసివద్దకుగాని పోయి, యితర హిందూరాజు లుపదేశితులయినట్లుగాఁ ఈతడు జేసియుండలేదు. శివాజీ గురువుకడ తనరాజ్యమును సమర్పించి తిరిగి ఆయన ఆశీస్సులతో నారాజ్యమును సంగ్రహించి ఏకచ్ఛత్రాధిపత్యముగా ధర్మపరిపాలనము చేసినట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు.

మనము శాసనము లాధారముగా, శ్రీకృష్ణదేవరాయలు శ్రీకాళహస్తీశ్వరుని యితర దేవతలను పెక్కుపర్యాయములు దర్శించినను, ఆయన యిష్టదైవము శ్రీ వేంకటేశ్వరస్వామిగనే నిశ్చయింపవచ్చును. తిరుపతిలోని శ్రీగోవిందరాజస్వామివారి ఆలయమును ఆయనేలనో ఒక్కపర్యాయమును దర్శింపకపోవుటచే నాదైవమీయన నాకర్షింపలేకపోయెనని భావింపవలసివచ్చుచున్నది. తిరుమల, శ్రీకాళహస్తియే గాక శ్రీకృష్ణదేవరాయ లనేక దక్షిణదేశపు ఆలయములలోని మూర్తులను సందర్శించెను. ఆయా ఆలయములలో తగిన దానశాసనములను సమర్పించెను. వేదములలోని కర్మకాండ యందీయనకు విశ్వాసము మెండుగా నున్నట్లు ఈతని కర్తవ్య పరాయణత్వమును గమనించినచో తెలియును. భక్తి, జ్ఞానమార్గములలో నీయన కేమాత్రమైనను ప్రవేశము గలిగినదన్నచో నది యీయన ఆస్థానములోనున్న పెద్దనామాత్యునివలననేయని చెప్పవలెను. పెద్దన అహోబిలమఠమును స్థాపించిన ఆదివన శఠగోపస్వామి శిష్యుఁడు. ఆతని సాహచర్యముచేతనే నీయన శ్రీవైష్ణవుఁడై ఆముక్తమాల్యదాకావ్యమును రచించినట్లు

మనకుఁ దెలియును. సరి, యది యట్లుండనిండు. ఈతడు యే వైష్ణవ మతబోధకునిచేతను ప్రభావితుడుకాలేదో లేక ఆతనిప్రకృతియే అంతయో- ఈ విషయమును నిర్ణయింపవలసియున్నది. ఈయన ఇచ్చిన యే దానశాసనములోను చివరను తనకు పూర్వపు రాజులు వాడుచువచ్చిన పదము 'శ్రీవైష్ణవరక్ష'ను వాడలేదు. క్రీ. శ. 966 లో సామవాయి మహారాణి శాసనములు వ్రాయించుచు యీ పదమును వ్రాయించి శాసనమును ముగించినది. ఈ సంప్రదాయమును తరువాత వచ్చిన రాజులు కూడ అనుసరించిరి. వీరనరసింగరాయలు, శ్రీరంగనాథయాదవరాయలు ఈ పద్ధతినే యనుసరించిరి కాని విజయనగరరాజులెవ్వరును ఈ విధిని పాటించలేదు. దేవరాయమహారాజులు ఇది ధర్మశాసనము' అని మాత్రము వ్రాయించి ముగింపించెను. (1-192, 5-12-1429)

శ్రీకృష్ణదేవరాయలు వ్రాయించిన దానశాసనములలోని భాషను కొంత పరిశీలించవలసియున్నది. ఇది ఇతర దానశాసన కర్తలకంటె భిన్నమగుటయే యిందులకు హేతువు.

సామవాయి మహారాణి తన శాసనములో చివరన తన శాసనమును పాలించిన వారి పాదములను శిరసున నిడుకొందునని ప్రతిన చేసెను. విజయనగరరాజులలో బుక్కరాయలు మాత్రము తన దానశాసనపాలకుడు సక్రమముగా నిర్వహించినచో నాతడు రెండు దానశాసనములట్టిపి సమర్పించిన ఫలమునొందునని, పాలింపనివాఁడు గంగానదీ తీరములో గోహత్యను గావించిన పాతకమును పొందుననియు వ్రాయించెను. ఇఁక కృష్ణదేవరాయలరాణి కొంతవరకు నున్నతభావముతోనే యుండినది. ఈమె శాసనమును పాలించిన వ్యక్తి మోక్షపదమును పొందుననియు, దానము నొసంగినచో స్వర్గము మాత్రమే పొందగలడనియు పలికి దానమునకు దానపాలనకు భేదము చూపించినది. ఈ దృక్పథములలో నే దృక్పథమును శ్రీకృష్ణదేవరాయలు స్వీకరింపలేదు.

ఇది యట్లుంచి పల్లవరాజుల కాలమునుండి చోళులు, యాదవ రాయలువారు దానశాసనములు సమర్పించిన విధానము వేరు, శ్రీకృష్ణదేవ రాయలు వారికి పూర్వులు అయిన బుక్కరాయలు. తరువాతి వారైన అచ్యుతరాయలు సమర్పించిన విధానము వేరు. పూర్వుల శాసనసమర్పణ ములలోని భాష ఎంతయో మృదువుగ వినమ్రముగ స్వామివారిసేవా భావసమన్వితముగ నుండెడిది.

ఈయన శాసనములో
'భువన భరణ సావధానాయ వేంకటేశాభిదానాయ
శేషాచలనివాసాయ దత్తమిదం ధర్మశాసనమ్'

దానమిచ్చిన వస్తువుగాని, దానము దేనికొఱకీయబడినదియు దీనిలో లేదు. ఇదే సమకాలములో హంపీవిరూపాక్షస్వామి కొసంగిన దాన శాసనములో కడువివరణములున్నవి. ఇందు కేవలము శ్రీవేంకటేశ్వర స్వామి కొఱకు ఇచ్చిన దానమనిమాత్రమే యున్నది. శ్రీవేంకటేశ్వర స్వామివారు కేవలము ఈయన దానధర్మములకై నిలిచియున్నట్లుగ నర్థ మిచ్చెడు భాష ఇది. దీనికి కారణము స్థానాలవారిని ఈయన శాసన ములను పరిశీలింప నియమింపకుండుటయు కారణము గావచ్చును. దేవరాయమహారాజు దానశాసనముకూడ నిదేరీతిలో కొనసాగినది. 'శ్రీమతు తిరుమలెదేవరిగె శ్రీమన్ మహారాజాధిరాజ రాజపర మేశ్వర శ్రీ వీరప్రతాప దేవరాయ మహారాయరు కొడవట్టుకొట్టు ధంమఞ శాశనదే' ఈ ధర్మశాసనము శ్రీ తిరుమలదేవున కీయబడినది' అని కలదు. భగవంతుడు ప్రతిగ్రహీత కాడుకదా।

కాని పల్లవుల శాసనములలోని వినమ్రభావము చూడుడు. అది చిన్న దానశాసనమేకానిండు, పెద్దదికానిండు. "ఈ విజయాదిత్యుడను వాడు తన వినమ్రమమైన సేవను శ్రీవారికి ........ సేవను జరిగించుటకు గాను ఈ విధమైన దానశాసనము సమర్పించబడుచున్నది దీనిని ఆ స్థానాలవారు గ్రహించి ఆ సేవలను శ్రీవారికి ఆ దాతల పరముగా నిర్వ

హించుట జరుగుచున్నది". ఈ విధమయిన వినమ్రభావమీయన శాసనములలో లోపించినదని మాత్రమే చెప్పవచ్చిన విషయము. శ్రీకృష్ణదేవరాయలు తన పరిపాలనా కాలములలో తాను చేసిన పాపములన్నింటిని కడిగికొనుటకు రామేశ్వరమువెళ్లి సముద్రస్నానముచేసి పాపరహితుడనైతినని తృప్తి పడినవాడు. అట్లే తన జీవిత కాలములో కావలసిన కోర్కెలను సాధించుకొనుటకు తిరుమల శ్రీవారిని నమ్మినవాడు. అవి సాధింపబడినంతనే తనకుతోచిన ఆభరణములనో, నగలనో శ్రీవారికి సమర్పించి చేతులుకడుగుకొనినవాఁడు గాని వాని విషయమై తిరిగి పట్టించుకొనినవాడుకాదు. తిరుమలకు తానేడు పర్యాయములువెళ్లినను ఒక్కమారైనను తిరుపతి గోవిందరాజస్వామిని దర్శించలేదు.

## శ్రీకృష్ణదేవరాయలు—తిరుమల ధర్మకర్తలు

శ్రీకృష్ణదేవరాయలు తిరుమల ఆలయములోని ధర్మకర్తలకెట్టి గౌరవమిచ్చెనో, ఆ ధర్మకర్తలు తిరిగి శ్రీకృష్ణదేవరాయలకిచ్చిన గౌరవాదులెట్టివో పరిశీలింతము. ఈ ధర్మకర్తల పునర్నిర్మాణము 1390 లో మాత్రమే జరిగినది. దేవాలయమునకు దానములు వ్రాయించిన శాసనకర్తలందరును అన్నప్రసాదములలో దాతభాగము పూర్తిగా గాకపోయినను కొంతభాగమైనను ధర్మకర్తల కొసంగవలసినదిగా నాదేశించుట సంప్రదాయమయ్యెను. తిరుపతి, చంద్రగిరి ప్రాంతములలో నివసించెడు దాతలు, ముఖ్యముగా, వైశ్యులు, వ్యాపారస్తులు ఈ విషయములో నీ సంప్రదాయమును ప్రోత్సహించిరి. ఇది ధర్మకర్తలకు గౌరవ ప్రతిపత్తిహేతువయ్యెను. వీరు దేవాలయములో వేతనము గైకొను సేవకులుగారు. కేవలము గౌరవసభ్యులు. కొంతకాలము తరువాత ఈ భాగప్రసాదము ధర్మకర్తల విధినిర్వహణమున సంక్రమించు హక్కుగా పరిణమించెను. సాళువ నరసింగరాయల కాలము తరువాత కందాడ రామానుజయ్యంగారి సంస్కరణలలో నీ స్థానాలవారి

గౌరవప్రతిపత్తికి కొంత భంగము కలిగినది. దాతలు ఈ ధర్మకర్తల యునికిని గుర్తింపకనే దానశాసనములు వ్రాయింపజొచ్చిరి. కొందరు తమ స్వయంకృషితోనే సత్రములను స్థాపించుకొని అన్నప్రసాదము లను భక్తులకు వినియోగించుచుండిరి. ఇది శ్రీకృష్ణదేవరాయల పరి పాలనాకాలములో మరింత మిక్కుటమై వారి గౌరవప్రపత్తులు మరింత హీనపడచినది. కృష్ణదేవరాయలు 7 పర్యాయములు తిరుమల శ్రీవారిని దర్శించెను. ఇందులో మూడుపర్యాయములు మాత్రము అన్నప్రసాద సమర్పణములకై దానములుచేసెను. దీనిలో నొక శాసనములో తనకు దాతగా రావలసిఉన్న 2½ ప్రసాదములలోను తన పురోహితులగు రంగ దీక్షితులు, శివదీక్షితులకు చెఱియొకటి, మిగిలిన అర్థభాగము తిరుప్పణి (ఆలయము-ప్రజాపనులుశాఖ) భాండారాధికారికి నొసంగునట్లు నియ మించెను. ఇందులో ధర్మకర్తల ప్రశంసయే చేయబడలేదు. ఈయన రాణులును తిరుప్పణి భాండారాధికారికీయగా మిగిలినది సత్రములకు చెందునట్లుగా నియమించిరి. ఈ విధముగా ధర్మకర్తలు పూర్తిగా నిర్ల క్ష్యము చేయబడిరి. ఈ విధమైన నిర్లక్ష్యమును పొందిన ధర్మకర్తలు శ్రీకృష్ణదేవరాయలపట్ల ఏవిధమయిన ఆదరమును జూపినదికూడ పరిశీ లింతము. శ్రీకృష్ణదేవరాయలు స్వయముగా సమర్పించిన దానశాసన ములలో దప్ప, వారి స్వీయశాసనలేఖకులు వ్రాసినవానిలో దప్ప నితర విధములయిన వారికాలములోని శాసనములువేనిలోను ఈ మహారాజ ప్రశస్తి పేర్కొనబడకుండ చేయగలిగిరి. దేవస్థానము శాసనసంపుటి 3 వ భాగములో నీయన కాలములోని 229 శాసనములలోను నీయన శాసనలేఖకులు చెక్కినవి 55 మాత్రము. మిగిలిన 174 లో 7 శాసన ములో మాత్రము ఈయన ప్రశస్తి పేర్కొనబడినది. మిగిలిన వానిలో వేనిలోను నీ మహారాజప్రశస్తి బేర్కొనబడకయే దానశాసనములు సమ ర్పింపబడుట విశేషము.

ఈ మహారాజు ఆచార్య పురుష పరంపరనుగూడ గుర్తించినట్లు కానరాదు. సొట్టై తిరుమలనంబి వంశమువారు ఆనెగొందిలో నివసించుచు సంగమవంశమునకు వంశపరంపరా గురుత్వమును స్వీకరించి రాజగురువులను పేరుపొంది యుండిరి. ఈ విషయమీతడు గుర్తించినట్లుగాని వారికి ప్రాధాన్యమిచ్చినట్లుగాని తోచదు.

శ్రీకృష్ణదేవరాయలు పుష్పవనములకుగాని వానిని పోషించుటకు వలయు చాత్తాద శ్రీవైష్ణవులనుగాని నియమించుట వారికై ప్రసాదములనోకాక ధనరూపమగు నిర్వహణవ్యయమునో యిచ్చియున్నటుల చెప్పుట కెట్టి అవకాశమునులేదు. పూర్వపు రాజులు శ్రీవారి అలంకరణార్థము పుష్ప సమర్పణమునకై తగుతోటలను పెంపకముచేయుటకు తగిన స్థలము నొసంగి దానిలో నాపెంపకమును పరిరక్షించుటకు చాత్తాద శ్రీవైష్ణవులను నియమించెడివారు. వారికి దాతల భాగములోనుండు అన్న ప్రసాదములనుగాని, యితర ధనరూపములయిన కానుకలుగాని యొసంగెడివారు. అట్టి కార్యక్రమమేదియు నీయన జరిగించలేదు.

ఈయన అనగా నీ మహారాజు తిరుమల శ్రీవారి ఆలయములో నేవిధమయిన నూతన కట్టడములు కట్టించినట్లుగాని లేక యేవైన అభివృద్ధి కరమగు మార్పులు గావించినట్లుగాని, లేక దానికయి శ్రద్ధ వహించినట్లుగానిచూడము. యాత్రికుల సదుపాయములకై యీ మహారాజుచేసిన ప్రయత్నమేదియునులేదు. శ్రీవారితో నీయన యనుబంధము కేవలము వ్యాపార సరళికి చెందినది. అనేకాభరణములు సమర్పించినాడు కాని అవి అన్నియు నేడదృశ్యములు. ప్రభావళి, కిరీటము, కత్తిమాత్రము మిగిలియున్నవి.

## శ్రీకృష్ణదేవరాయలు వారి రాణులు శ్రీవారికి సమర్పించిన సర్వాభరణముల వివరములు :

క్రీ. శ. 10–2–1513 నాడు సమర్పించిన ఆభరణములు :

1. నవరత్న కిరీటము. బరువు 3308 కారెట్లు.
2. ఒక త్రిసరము. మూడు పలకల నెక్లెసు. 225 కారెట్ల బరువు ఇంద్రనీలములు, గోమేధికములు, మాణిక్యములు కలిగినది.
3. కర్పూరహారతి సమర్పించుటకు 25 వెండిపళ్లెరములు.

### రాణి చిన్నాదేవి

4. ఏకాంతసేవలో భోగశ్రీనివాసమూర్తికి పాలునింపుటకు బంగారపు గిన్నె 1. 374 కారెట్లు.

### రాణి తిరుమలదేవి

5. ఏకాంతసేవలోనే భోగశ్రీనివాసమూర్తికి పాలునింపుటకు బంగారపు గిన్నె 1. తూకము 374 కారెట్లు.

2–5–1513 నాటి దానము :

6. కంఠాభరణము. బంగారపుతీవతో వ్రేలాడదీయబడునది. రత్నములతో కూడినది.
7. ఒక కత్తి యొరతో కూడినది. ఒరకు రత్నాదిమణులు కూర్చబడినది.
8. చిన్నకత్తి ప్రతినిత్యము వాడకమునకు. 132 కారెట్ల తూకము, ఎఱ్ఱలు, పచ్చలు తాపినది.
9. 1 చిన్నకత్తి. ప్రతినిత్యమువాడకమునకు. పిడిపైపచ్చలుతాపినది
10. పిడికత్తికి యొర. దానికంతయు మణులు తాపడము చేసినట్టిది.
11. ఒకపతకము. తూకము 87 కారెట్లు. మణులు తాపినట్టిది.

12 భుజకీర్తులు (వంకీలు) 1 జత. 573 కారెట్ల తూకము. వైడూర్యములు, పచ్చలు తాపినది.

13. ఒక భుజకీర్తి 198 కారెట్ల తూకము గలిగినది; నిత్యోపయోగమునకు.

14. రెండుజతల బంగారపు భుజకీర్తులు నిత్యోపయోగమునకు.

15. రావిఆకుల పరిమాణములోనున్న బిళ్ళలు కలిగిన ఒక బంగారపు త్రాడు. దీనిలో నున్నవన్నియు మణులే. 205 కారెట్ల తూకము.

16. అట్టిదే 276 కారెట్ల తూకము గలిగినది.

17. ఉత్సవమూర్తులకు శ్రీదేవీభూదేవులకు 3 బంగారు కిరీటములు. మొత్తము తూకము 380 కారెట్లు. పచ్చలు, వజ్రములు, వైడూర్యములు, గోమేధికములు తాపినవి.

6-7-1514 ప్రతాపరుద్రగజపతిని యోడించి ఉదయగిరి కోటను పట్టుకున్న యనంతరము జరిగిన యాత్ర

18. 30,000 బంగారువరహాలతో శ్రీనివాసునకు కనకాభిషేకము.

19. ముప్పేట బంగారుగొలుసు, ఇందులో పచ్చలు, గోమేధికములు వజ్రములున్నవి.

20. ఒకజతబంగారు కడియములు. తాళ్లపాకము గ్రామము శ్రీవారికి నిత్యము ఒక అన్నప్రసాద నివేదనమునకుగాను సమర్పణము.

రాణి చిన్నాదేవి

21. ఒకపతకముతోకూడిన కంఠమాల. వజ్రములు, పచ్చలు, గోమేధికములు కూర్చినవి. తూకము 200 కారెట్లు. ముద్దైయూరు గ్రామము శ్రీవారి అన్నప్రసాద సమర్పణముకై సమర్పింపబడినది.

## రాణి తిరుమలదేవి

22. ఒక చక్రపతకము. 225¾ కారెట్ల తూకము. వజ్రములు, వైడూర్యములు, పచ్చలు గలిగినది. 'పిరాట్టికులట్టూరు' శ్రీవారి అన్నప్రసాదమునకు సమర్పింపబడిన గ్రామము.

## శ్రీ కృష్ణదేవరాయలు

26-10-1515 యువ సంవత్సరం కార్తీక బహుళతృతీయ: కళింగవిజయము చేపట్టిన యనంతరము

23. 1 నవరత్న ప్రభావళి (మకరతోరణము). మొత్తము తూకము 27,287 కారెట్లు.; దీనిలో 10,994 ఎఱ్ఱరాళ్ల, 754 పచ్చలు, 530 గోమేధికములు, 40 వైడూర్యములు, 45 దినుసురాళ్ల, 74 గోమేధికములు, 920 ప్రాచీనవజ్రములు, 3933 ముత్యములు 4 పెద్దగోమేధికములు, 6 పగడములు, 30 గవ్వశంఖములు.

2-1-1517 సింహాద్రినుండి తిరిగివచ్చుచు పొట్నూరులో విజయస్తంభం నాటిన తరువాత

24 ఒక బంగారు కంఠమాల.

25. ఒక పతకము.

26. 30,000 వరహాల బంగారము శ్రీవారి విమానమునకు బంగారు పూత వేయించుటకుగాను అదనముగా 1000 వరహాలు గొడుగునాడు శిస్తునుండి వసూలుచేసి శ్రీవారి శుక్రవారాభిషేకమునకు వ్యయపెట్టుటకు, మరి అదనముగా 500 వరహాలు గొడుగునాడు శిస్తునుండియే శ్రీవారి నిత్యపూజలో ఉదయము అన్నప్రసాద సమర్పణమునకు నియమము.

ఆనందనిలయవిమానమునకు బంగారుపూత పూర్తిఅయిన తేదీ 9-9-1518 (ఇది అప్పటికి మూడవసారి)

## 17-2-1521.

## రాణితిరుమలదేవి మాత్రమే శ్రీకృష్ణదేవరాయమహారాజుల వెంటనున్నది.

27. ఒక పీతాంబరముల సెట్టు. దానినిండ నవరత్నములు పొదుగబడినది.

28. 'కుల్లావు' (తలగుడ్డ) ముత్యములు, గోమేధికములు, ఇతర మణులున్నది.

29. రెండు చామరములు. నవరత్నశోభితములు, 10,000 బంగారు వరహాలు.

30. ఒక పతకము.

31. రాణి తిరుమలదేవిచే ఒక నవరత్న పతకము.

ఇవికాక యీయన తనతండ్రి సంస్మరణమునకు, తల్లి జ్ఞాపకార్థము తన మూడవసారి యాత్రాసందర్భములో (13–6–1513) కొన్ని దానములు సమర్పించెను. ఈ మహారాజుకాక ఈ రాజుకాలములో నీయన ప్రతినిధులు, ఉద్యోగులు, రాజబంధువులు, సేనాధిపతులు, మంత్రులు, మహామంత్రులు అనేకులు శ్రీవారికి దానశాసనములు సమర్పించిరి

### జీయరులు :

ఈ కాలములోనే తిరుమల తిరుపతులలో మూడు వేర్వేరు జీయరుల మఠములు వెలసినవి. వీనిలో అతిప్రాచీనమయిన మఠము అరిశనాలయము నందవనము మఠము. ఇది మూలతిరువేంకటజీయరువారి ఆధిపత్యములోనికి 1387–1390 వ సంవత్సరము ప్రాంతములోవచ్చెను. ఈయన, తరువాత కొంతకాలమునకు తిరుమల శ్రీవారి ఆలయమునకు ధర్మకర్తలలో నొకరుగా వచ్చెను. ఈతనికి మరియొక సహాయకుడు కూడ నుండెను. ఒకరే తిరుపతి తిరుమల ఆలయ కార్యకలాపములు కొనసాగించుట కష్టసాధ్యము గనుక ఈ సదుపాయము కల్గించుకొని యుండనగును. ఈయన 'కోయిల్‌కెల్వి' అన్నపదవినిగూడ స్వీక

రించెను. ఈపదవి తిరుమల ఆలయములోనికి సామాగ్రిని గ్రహించుట, సామాగ్రిని వినియోగపఱచుటకై యితరులకు నిచ్చుటయే పనులుగా గలిగినది. కృష్ణదేవరాయలకాలములో అనుసంధాన తిరువేంకటజీయరు అనుపేరు వినవచ్చును. (3-2; 19-7-1504) ఈయన తిరువేంకటనాథ తిరువందవనమునకు నిర్వాహకుఁడు. ఈ శాసనములలో ఈయనకు తిరుపతిలో నొక మఠమున్నట్లు అదియును తిరువేంకటనాథమఠమని పిలువబడుచున్నట్లు తెలియుచున్నది. దీనినిబట్టి ఈతడే మఠనిర్వాహకుడు, పుష్పతోటను పెంచినవాడు అని తెలియును. ఈయన రెండువేల పణములను దానమొనర్చెను. దీనిపైవచ్చు వడ్డీతో తిరుమల శ్రీవారికి సంవత్సరమున కొకపర్యాయము అన్నప్రసాదములను సమర్పించెను. ఇది కొంత శ్రీగోవిందరాజస్వామివారికి, రామానుజులకుకూడ కేటాయింపబడినది. తిరుపతిలో దాతలప్రసాదము ననుభవించువారలు మఠమును నిర్వహించువారు. తిరుమలలో ఏకాకిశ్రీవైష్ణవులని వ్రాయబడినది. ఈ అనుసంధాన తిరువేంకటజీయరు క్రీ. శ. 1516 వ సంవత్సరములో కోయిల్ కెల్వి జీయరుగా నయ్యెను. క్రీ. శ. 1520 నాటికి ఈయన పెరియకోయిల్ కెల్వి జీయరుగా పేర్కొనబడెను. ఈ సమయములో నీయన కొన్ని దానసమర్పణములు గావించెను. క్రీ.శ. 1527 నాటికి రామానుజజీయరు కోయిల్ కెల్వి జీయరుగా పేర్కొనబడిన శాసనములున్నవి. కోయిల్ కెల్వితిరువేంకటజీయ్యరు మరణముతో నిది సంభవించియుండనగును. కాని యీయన మాత్రము పెరియకోయిల్ కెల్వి జీయరుగా పేర్కొనబడలేదు. వీరందరును అనగా నీ జీయరులు ప్రధానముగా వనశఠగోపమఠాధిపతులనుండియు, వ్యాసరాయమఠమునుండి దీక్షగైకొని వచ్చినవారు. వనశఠగోపమఠము వడగల సంప్రదాయమునకు చెందగా వ్యాసరాయమఠము మధ్వసంప్రదాయమునకు చెందినది. తిరుమల ఆలయముతో ననుసంధింపబడిన మఠాధిపతులకు తిరుమల ఆలయమువరకే వారి కార్యకలాపములు పరిమితమైయుండును. మిగిలిన మఠాధిపతులకట్లుగాక వారి కార్యకలాపములు శిష్యసంచారమును, వారి బాహుళ్యము ననుసరించియుండును.

## వ్యాసరాయమఠము

శ్రీకృష్ణదేవరాయల కాలములో 12-1-1524 వ తేదీన తిరుపతి తిరుమలలో 'వ్యాసరాయని' పేర మఠములను నిర్మించుటకు శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య, పదవాక్యప్రమాణజ్ఞ దుర్వాదగర్వ సర్వస్వాపహార, శ్రీమద్వైష్ణవసిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్య, సకలవిద్వజ్జన మనఃపద్మవన సౌపష్టికర బిరుదాంకితులగు శ్రీవ్యాసతీర్థ శ్రీపాద ఉడయవర్ వారికి నివేశనస్థలములను దానమొసగినట్లు (3-157, 158, 159) శాసనములద్వారా తెలియుచున్నది. చక్రవర్తివారి యుత్తరువు ననుసరించి తిరుమల శ్రీవారిఆలయ ధర్మకర్తలు వ్యాసతీర్థులవారికి మఠనిర్మాణమునకై యనుజ్ఞనొసఁగుచు స్థలములను వప్పగించిరి.

రాయలవారు ఈవ్యాసతీర్థమఠనిర్వహణార్థమై మహారాజభాగలబ్ధమగు ప్రసాదములలో 15½ ప్రసాదములు 2 అక్కాలిమండె (అన్న), 26 అప్పములు, 26 అతిరసములు, 1¼ పలముల చందనము, 75 వక్కాలు, 150తమలపాకులు ఇచ్చునట్లు ఏర్పాటుచేసెను. పైప్రసాదములు శ్రీకృష్ణదేవరాయిలవారు 'ఉళ' మండలములోని 'కడైకుట్టాన్పాడి' గ్రామములోని పగభాగమును, పురమండలంలోని తాళ్లపాకం పిరాదమ్, దారత్తూర్, ముడియూర్, సత్రపాడి, తురైయూర్ గ్రామాదులపైవచ్చు ఆదాయమునకు సరిపోవు ప్రసాదభాగమును ఈ మఠనిర్వహణమునకై యిచ్చునట్లు శాసనము వ్రాయించెను. భాద్రపద మాసములోవచ్చు బ్రహ్మోత్సవములలో యాత్రికులపై విధించు ప్రత్యేక సుంకముద్వారా వచ్చు ఆదాయమునకు సరిపోవు దాతలబ్ధమగు ¼ వంతు ప్రసాదభాగముకూడ యీ మఠమును నిర్వహించుటకుగాను దానశాసనమున వ్రాయబడినది.

ఈ వ్యాసతీర్థులవారు తిరుమలలో స్థిరనివాసమేర్పఱచుకొనుటకు పూర్వమెచటనుండిటకు వచ్చిరో నిర్ధారణముచేయు నవకాశములు మృగ్యము. క్రీ. శ. 1524 వ సంవత్సరమున తిరుమల తిరుపతులలో మఠ

ములను స్థాపించిరి. ఏదియేమైనను 8–11–1524 నాటి శాసనమునుబట్టి శ్రీవారి అనుభవములోనున్న గ్రామాదులలోని భూములకు వలయు పంటకాలువలను చెఱువులను త్రవ్వించుటకుగాను వ్యయముక్రింద 14,000 పణములనొసంగి ఈగ్రామాదులపై వచ్చు ఆదాయముతో శ్రీవారికిని, తిరుపతిలోని శ్రీగోవిందరాజస్వామివారలకును కొన్ని ప్రత్యేకపర్వదినములలో నన్నప్రసాద సమర్పణముల నేర్పాటుచేసిరి. ఈప్రత్యేక పర్వదినములు మొత్తము 222 రోజులు. వానిలో 96 రోజులు–8 బ్రహ్మోత్సవములు, వసంతోత్సవము, కొడై తిరునాల్ 20 రోజులు, అధ్యయనోత్సవము 24 రోజులు, ఊయలవుత్సవము 5 రోజులు, తిరుపవిత్ర ఉత్సవము 5 రోజులు, ఏకాదశీ ఉత్సవము 25 రోజులు, సహస్రకలశాభిషేకము 5రోజులు, మాససంక్రమణములు 12రోజులు, అమావాస్యలు 13రోజులు ఉగాది, దీపావళి 2 రోజులు, పారువేట ఉత్సవము 1 రోజు, కార్తీకోత్సవము 1 రోజు, కృష్ణాష్టమి 13 రోజులు. ఈ మొత్తము 222 రోజులు అన్నప్రసాదసమర్పణములు నివేదింపబడెడివి.

అటు పిమ్మట కాలాంతరమున విశిష్టాద్వైతమత ప్రచారమేలనో కొంత కొంటుపడినది. ఇట్టి విశిష్ట కార్యపరంపరా నిమగ్నులగు వారిని ధర్మకర్తలేలనో నాడు గుర్తింపలేరైరి. బహుశః దీనికి రాయలవారికి, సంఘమువారికిగల యనైక్యమును హేతువుగా జెప్పనగును. కాని పై మహాత్ములయొక్క శిష్యపరంపర మాత్రము వారి పూర్వుల మహిమలను నిరంతరము ప్రచారము సల్పినట్లు శిలాశాసనములద్వారా తెలియుచున్నది.

ఇంకను ఈ వ్యాసతీర్థులవారు గోవిందరాజస్వామివారి మహానివేదన ప్రసాద కైంకర్యములకయి 'పడైనాడుశీర్మై' లోని 'శియాల్ పండూర్' మరియు 'పళువాంస' గ్రామాదులను దానమొసగి వానిపై వచ్చు ఆదాయమును వ్యయపెట్టుట కనుమతి నొసంగిరి. మహానివేదనమునకేగాక యితరములగునన్న ప్రసాదములకును 8 తిరుపోనకములు,

40 వక్కలు, 80 తమలపాకులు మూడుతులముల చందనమునకై కూడ శ్రీవారికి దానశాసన సమర్పణము గావించిరి.

వ్యాసరాయ మఠములోని శిష్యులకు భోజన సౌకర్యార్థము గోవిందరాజస్వామివారి ఆలయములో జరుగు ఉగాది, దీపావళి ఆస్థాన దినములలో వచ్చు ప్రసాదములో కొంతభాగము దేవాలయ పరిచార కులకును మిగిలినది 12 మంది నిర్వాహకులకును ఇచ్చెడివారు.

వ్యాసతీర్థులవారికి నీ తమిళప్రబంధ పారాయణములు జరుగు అధ్యయనోత్సవములకు నెట్టి సంబంధమునులేదు. కాని అప్పటిలోనున్న ధర్మకర్తలసంఘము వారిని, శ్రీవైష్ణవ సంప్రదాయమును మన్నించి 24 దినముల తమిళప్రబంధ అధ్యయనోత్సవములందు మొదటి పది దినములు వేదగోష్ఠిలో పాల్గొనుట గమనార్హము.

ఇంకను వీరు సంవత్సరములోవచ్చు ప్రతి పున్నమనాటిరాత్రి అనగా సంవత్సరములో 13 రోజులు (3–175; 2–4–1528) శ్రీ గోవిందరాజస్వామివారికి కాగడాల యుత్సవమును జరిపించుటకు 'ఒడ్డంపట్టి' అను గ్రామమును దానమొసంగిరి. ప్రతియుత్సవములోను 3 అన్నప్రసాదముల దానశాసన సమర్పణము గావించిరి. ఈ శాసన ములో పేర్కొనదగిన మూడు ప్రత్యేక విషయములున్నవి.

(1) వీరినామధేయమునకుముందు శ్రీమత్కరకమల సంజాత శ్రీమ ద్బ్రహ్మణ్యతీర్థ శ్రీపాద ఉడయూరు అను బిరుదు గలిగి యుండుట.

(2) వీరు దానమొసగిన 'ఒడ్డంపట్టి' గ్రామమునుండి వసూలు ధాన్య రూపమున గాక రొక్కరూపము నుదహరించుట.

(3) తీర్థులవారు కైంకర్యముచేయు నుత్సవమునకు కావలసిన సామాగ్రి సవివరముగా శాసనములో రూపొందింపబడుట.

## ఏ కా కు లు

ఏకాకులనగా భార్యావియోగముపొంది ఏవిధమయిన సంసార బంధములేక ఏకాకులుగానిలిచెడి శ్రీవైష్ణవులుగాని, సాతానివైష్ణవులు గాని కావచ్చును. తరువాత కాలములో జీయరులు తమకు సహాయ కులుగా నియమించుకొన్న ఏకాంగులకు వీరికిని భేదమున్నది. ఈ ఏకాంగులు భార్యావిహీనులేగాని సోదరీసోదరులో తల్లిదండ్రులోయుండి సంసారము లేకపోయినను కొంత కుటుంబబాధ్యతలుకలిగి యున్నవారు. అనగా వీరిపయి ఆధారపడియుండెడివారు కొందరుందురు. రాయల కాలములో వీరొసగిన దానములును గలవు

## పం డి తు లు

తిరుమలలోని రాయలకాలములో పండితులైనవారు కొందఱినిట బేర్కొనుచున్నాము.

1. తాళ్లపాక పెద్దతిరుమలఅయ్యంగారు
2. యజ్ఞనారాయణ భట్టరు. ఈయన రాయలవారి పురోహితు డగు రంగదీక్షితుని కుమారుడు.
3. దొడ్డయ్యంగారు అప్పా, ఉడయవరుకోయిల్ అన్నా మొద లగువారు శ్రీవారిపేరిట అనేకదానములు చేసిరి. వీరుకాక రాయలకాలములో దేవస్థానము లెక్కలఅధికారులు చేసిన దానములున్నవి. వ్యాపారస్థులగు సిత్తముశెట్టి, తిప్పుశెట్టి, పచ్చిలింగిశెట్టి, పప్పుశెట్టి, కొండుశెట్టి, శరణుశెట్టి మొద లగువారు అసంఖ్యాకములగు దానముల నొసంగినట్లు తెలియుచున్నది.

పై విషయములను దృష్టియందుంచుకొని శ్రీకృష్ణదేవరాయల కాలములో తిరుమల ఆలయమునకు గలిగిన స్థితిని విచారింతము.

(1) తిరుమల శ్రీవారికి విశేషాభరణములు సమర్పింపబడినవి. ఆనందనిలయ విమానమునకు మూడవమారు బంగారుపూత పూయ బడినది.

(2) కృష్ణదేవరాయల తల్లిదండ్రుల స్మృత్యర్థము పుష్యమాస బ్రహ్మోత్సవమును నెలకొల్పెను. ఇతనికి పూర్వపు రాజులవలెనే ఈయనయు నిత్య అన్నప్రసాద సమర్పణములకు వలయు దానము లొసంగెను.

(3) శ్రీగోవిందరాజస్వామివారిని ఒకపర్యాయమైనను దర్శింపలేదు. ఆయనకేవిధమయిన దానశాసన సమర్పణము జరిగించియుండ లేదు.

(4) ఆచార్యపురుషులకుగాని, సన్యాసులకుగాని ఆళ్వారులకు గాని యీయన నిర్మించిన సన్నిధులేవియును లేవు.

(5) హిందూమతము నందలి ఏ శాఖ పైనను మొగ్గుచూపినట్లు భావించుట కవకాశమిచ్చు నేకార్యమును జేసియుండలేదు.

(6) ఈయన వ్యాసతీర్థ శ్రీపాదఉడయవరులకు మఠనిర్మాణమునకు స్థలము నొసంగుట కనుమతినిచ్చుట ఆచార్యభావమునగాక కేవలము సన్యాసిపైనుండెడి గౌరవముచేత గావచ్చును.

(7) దేవాలయ ప్రజాపనుల విభాగమువారికే ఈయన దాతలబ్ధభాగము నిచ్చుట, ఈయన క్రింది అధికారులు, సేవకులు ఆ విధానమునే అనుసరించుటచూడ యీవిభాగమానాడు ఉచితభోజనసౌకర్యములను యాత్రికుల కందించుటలో కడు శ్రద్ధచూపెడిదని చెప్ప వచ్చును.

(8) కృష్ణదేవరాయలకాలములో నొసంగిన దాతలు పెక్కురు ఆయన పరిపాలనాకాలమునుగాని ఆయన పేరునుగాని ఉదహరించలేదు.

ఈయన ప్రశస్తి ఈయన శాసనలేఖకుడువ్రాసిన శాసనములందు మాత్రమే కానవచ్చును.

(9) శ్రీకృష్ణదేవరాయలు ప్రవేశపెట్టిన ప్రత్యేకోత్సవము ఒక్కటియే. అది 15 రోజులకొకసారి జరిగెడి శ్రీవారి పులుగుకాప్పు ప్రతి శుక్రవారము జరిగించుటకు శాసనము వ్రాయించుట. దానిలో (దేవుని యెనిమిది దినాల వరశ పుళికాపుకు) అని ఉన్నది. దీనికై 1000 వరహాలు గొడగూరునాడు గ్రామమునుండి వచ్చు శిస్తురాబడినుండి గ్రహించుటకు మరి అదనపు 500 వరహాలు (ప్రాకునైవేద్యము) ఉదయకాల నైవేద్యమునకు శాసనమును వ్రాయించెను.



# 18 వ అధ్యాయము

## అచ్యుతరాయమహారాజు - తిరుమల ఆలయము

1525 వ సంవత్సరములో శ్రీకృష్ణదేవరాయలు తన కుమారుని మరణానంతరము చంద్రగిరికోటలో బంధించిన అచ్యుతరాయలను విడుదల గావించి ఆతనికి రాజ్యవ్యవహారములందు శిక్షణనిప్పించెను. అచ్యుతరాయలు శ్రీకృష్ణదేవరాయలుకు సవతి తమ్ముడు. అచ్యుతరాయలప్పటికి కోటలో బంధితుడై 16 సంవత్సరములకాలము శ్రీవేంకటేశ్వరస్వామి నామస్మరణముచేయుచున్నవాడు. విడుదలచేసిన యనంతరము పాతపగను మనసునందుంచుకొనక అచ్యుతరాయలు శ్రీకృష్ణదేవరాయలను దైవసమానునిగా నెంచుకొనెను. క్రీ.శ. 1529 వ సంవత్సరములో తన సోదరుడగు శ్రీకృష్ణదేవరాయల ఆశీస్సులనొంది సాక్షాత్తు శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయమునందే భగవంతునికి యుపయోగించు శంఖతీర్థమునే యుపయోగింపజేసికొని పట్టాభిషిక్తుడయ్యెను. ఇది లేక ఈవిధానమును శ్రీకృష్ణదేవరాయల కోరికప్రకారమే జరిగియున్నట్లు తోచును. కారణము తన కుమారుని బ్రతికించుకొనగలందుల కాతడు చేయని విశ్వప్రయత్నములేదు. కాని విధి బలీయమై వికటించినది. దానితో భగవత్కృపను బొందుటకుగాను పట్టాభిషేకము తిరుమల శ్రీవారి ఆలయమందే ఆయన ఆశీస్సులతోనే ఈ మొదటి పట్టాభిషేకము జరిగినదని యూహింపవచ్చును. శ్రీకాళహస్తిలో మరల నొకసారి ఈయన పట్టాభిషిక్తుడయ్యెను. శ్రీకృష్ణదేవరాయలకంటె శ్రీఅచ్యుతరాయలు మిక్కిలి వైష్ణవపక్షపాతి.

అచ్యుతరాయమహారాజు తాను పట్టాభిషిక్తుండగుటకు పూర్వము ఆలయములలో రెండుపర్యాయములు పట్టాభిషేకము పొందెను. తిరుమల ఆలయములో ఒకసారి, రెండవసారి శ్రీకాళహస్తిలోను జరిగినది మూడవసారి విజయనగరములో రాజ్యసింహాసనాభిషిక్తుడయ్యెను.

అచ్యుతరాయలు సుశిక్షితుఁడయిన మేధావిగాని లేక రాజకీయ పరిజ్ఞాతగాని కాడు. ఈతని పరిజ్ఞానమంతయు ఆచారములు, సంప్రదాయములను పట్టియుండును. కొన్నికొన్ని యీతడొనర్చిన అసంబద్ధమయిన కార్యములు శ్రీవారి ఆలయచరిత్రలో మాయనిమచ్చగా పేర్కొనబడుచున్నవి.

నవంబరు 1529 వ సంవత్సరములో విజయనగర రాజ్యసింహాసనము నధిష్ఠించిన తరువాత మొట్టమొదటగా నచ్యుతరాయమహారాజు కపిలతీర్థమువద్ద సంధ్యావందన మంటపనిర్మాణము, చెక్కడపురాతిమెట్ల కట్టడములు, సుదర్శనముల స్థాపనములను నిర్మించుట కానతిచ్చెను. ఇంతకంటె ముందుగా నీయన 'ముద్దుకుప్పయి' అను నాట్యకళావిశారదను తిరుమల శ్రీవారి పరిచర్యసేయుటకుగాను నియమించెను. ఇది ఆలయములో నాట్యవిశారదలకు స్థానమునిచ్చిన విధము వారికి స్వామివారి ప్రసాదసమర్పణమును గురించిన విధము తెలియచెప్పుచున్నది.

శ్రీగోవిందరాజస్వామివారి కేవిధమయిన పుష్కరిణియు గోవిందపుష్కరిణి లేక కృష్ణరాయకోనేరు నిర్మాణమయినంతవరకు నున్నట్లు గావము. ఆళ్వారుతీర్థములోని నీటిని శ్రీగోవిందరాజస్వామివారి తిరువారాధన కుపయోగించుటయే అంతకు పూర్వము జరిగెడిది. ఆళ్వారుతీర్థమును బాగుచేయించుటకై అచ్యుతరాయమహారాజు చేసిన కృషి ఎనలేనిది. సంధ్యావందనమంటప నిర్మాణము నాలుగువైపుల సుదర్శనముల స్థాపనము మొదలయిన యభివృద్ధికర కార్యక్రమము లన్నియు నీతని ప్రేరణములే.

## అచ్యుతరాయలు శ్రీవారి సహస్రనామార్చనమును స్వయముగా చేయుట (31–1–1553.)

శ్రీవారికి సహస్రనామములు చెప్పుట పూజచేయుట అర్చకుల పని. కాని యిటీవల నామములను చదువుటకు వేఱుగా నొకని నియ

మించిరి. పూజమాత్రము నాటికి నేటికి అర్చకస్వాములే నిర్వహించు చున్నారు. కాని మహారాజు అచ్యుతరాయలవారి కాలములో రాజు స్వయముగా అర్చనచేయగా అర్చకస్వాములు నామములు పఠించిరి. ఇది విపరీతము శాస్త్రవిరుద్ధము. ఇట్టి అసత్కార్యముచేసిన ఘనత ఈ మహారాజునకు మాత్రమే దక్కినది. ఇది అర్చనా నిర్వహణములో వ్రేలుపెట్టి ప్రత్యేకముగ నా పవిత్రతను కలుషితముచేయుట వంటిది. ఇతరుఁడెవఁడైనను ఇట్టి కార్యము జరిగించినచో సంప్రోక్షణాదులను నిర్వహింపవలసియుండునని శాస్త్రములు నియమించినవి. శ్రీకృష్ణదేవ రాయలు సైతము పక్షమునకొకమారు జరిగెడు తిరుమంజనమును వార మునకు మార్చనిచ్చగించెనే గాని తన చేతులతో తానే తిరుమంజనము చేయ యత్నింపలేదు. ఈ సందర్భముననే అచ్యుతరాయలు శ్రీవారికి సర్వాభిషేకమును సమర్పించెను. ఇంకను అనేకాభరణములను స్నపన మూర్తికి సమర్పించెను. ఈ సమయములో నీయన అన్నప్రసాదసమ ర్పణములు చేసిన శాసనములేవియు లేనప్పటికి తన పట్టాభిషేక సమ యములోనే అనగా 1529 వ సంవత్సరములోనే యితర రాజులకువలెనే అన్నప్రసాద సమర్పణములను గావించెను.

లక్ష్మీదేవి మహోత్సవము నొకదానిని నిర్వహించుట యీమహా రాజు ఏర్పాటుచేసిన కార్యక్రమములలో నొకటి. ఇది 26–12–1535 నాటి శాసనములో నిర్దుష్టముగా బేర్కొనబడనప్పటికి శ్రీవేంకటేశ్వర స్వామికి అలర్ మేల్ మంగ నాచ్చియార్ కు ఉత్సవము అని చెప్పబడు శాసనములో రూఢిచేయుచున్నది. 'స్వామి అచ్యుతరాయమహారాజు' అని దాతగానున్న తాను 'స్వామి' అని బిరుదును తగిలించుకొనుట యీయన స్వాతిశయమును ప్రకటించుచున్నది. 1473 లో సాళువ నర సింగరాయలు 'డోలోత్సవము' ప్రవేశపెట్టినట్లుగానే ఈయన ఈ 'లక్ష్మీదేవిమహోత్సవము'ను ప్రవేశపెట్టినట్లు తెలియుచున్నది. దీనికి గాను వారు సాలుకు 300 రేఖాపానులు కొండవీటిసీమనుండి వచ్చు

ఆదాయమును ఏర్పాటుగావించిరి. తిరుమలలో జరుగు నీ ఉత్సవము నకు వేంకటత్తురై వార్ అను అర్చకస్వామి తనకు వచ్చు దక్షిణలో కొంతభాగము శ్రీస్వామివారి కైంకర్యమునకిచ్చినట్లున్నది. ఏకాకి శ్రీనివాసయ్య యీ యుత్సవము చివరిరోజున ఒక దోసెపడి నివేద నమున కిచ్చియుండిరి.

లక్ష్మీదేవికి తిరుమలలో నొక స్థానము లేనందున ప్రత్యేకముగా నొక యుత్సవము కల్పించినట్లున్నది. లక్ష్మీదేవిప్రతిమను ముందుగా తయారుచేయుటకు 61 రేఖాపానుల బంగారమును వ్యయపఱచిరి ఈ యుత్సవమునకు 7 మంటపములను తిరుమలలో నిర్మాణము గావిం చుట, ప్రతిమంటపములోను లక్ష్మీదేవికి వివిధములైన అన్నప్రసాద ములను నివేదన, యిచ్చట జరిగెను. ఉత్తరాషాఢా నక్షత్రమురోజున మార్గశిరమాసములో పంచమీతిథిరోజున ఈ యుత్సవము ప్రారంభ మయ్యెను. అనగా అంకురార్పణమా నక్షత్రమున జరిగెను. రోహిణీ నక్షత్రమున అనగా 10 వ నక్షత్రమున శాత్తుమొఱ (మంగళాశాసనము) జరిగినది.

కపిలతీర్థము (ఆళ్వారుతీర్థము) నకు తూర్పున మైలు దూర మున నొక శిథిలావస్థలోనున్న దేవాలయ గోపురమున్నది. అచటనే శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆస్తియైన కొత్తూరు గ్రామములోని నివేశ స్థలమును 2400 పణములకుకొని ఆ స్థలములోనే అచ్యుత దేవాలయ మును నిర్మించినట్లు 8-2-1539 న గల నాటి శిలాశాసనమువలన తెలియు చున్నది. తిరుపతి శ్రీగోవిందరాజస్వామివారి ఆలయము ముందు ఈ దేవాలయము తగు విధమయిన జనాకర్షణములేని కారణముగా ప్రస్తు తము దుస్థితిలోనికి వచ్చినట్లు భావించవచ్చును. ముఖ్యముగ కొండ క్రింది ప్రాంతమగుట, శీతబాధయెక్కువగానుండుట, ఈ బాధలకు గురి యయిన ప్రాంతమగుటచే కొత్తూరుగ్రామముతోబాటు నిదియు క్షీణదశకు వచ్చియుండవచ్చునను నూహకు నవకాశము గలదు.

అచ్యుతరాయకోనేరు :- అచ్యుతరాయలు తన పేరిట స్వామి పుష్కరిణికి పశ్చిమపువైపున అచ్యుతరాయకోనేరు (ప్రస్తుతము దీనినే పాత పుష్కరిణి అని పిలుచుచున్నారు) అను పేరుతో ఒక కోనేరు నిర్మించిరి, ఈ తటాకపుతీరమున నొక మంటపముకూడ యేర్పాటు చేసిరి. శ్రీవారి బ్రహ్మోత్సవ సమయములందు ఈ కోనేరు మంటపమునకు మలయప్పస్వామివారు దేవేరులతో వేంచేయునట్లును దాత యొక్క 13 జన్మనక్షత్రములైన రోహిణులందు శ్రీవారి కైంకర్యమునకై రాయసము రామచంద్రదీక్షితార్ అనువారు 13-8-1533 వ తేదీన నాలుగు నిత్య అన్నప్రసాదములకు 13 ఇడ్డిలిపడులకుగాను 5000 పణములను దానముగా నిచ్చిన సమర్పణ శాసనము వ్రాయించిరి. ఈ దాతయే శ్రీకృష్ణస్వామివారు బ్రహ్మోత్సవ సమయములో ఈ మంటపములోనికి వేంచేయునపుడు 5వ రోజున 1 అప్పాపడి (అన్నప్రసాదము) నివేదన నిమిత్తము 26-12-1533 వ నాడు 5000 పణములు దాన శాసన సమర్పణము చేసెను.

మధురనాయకుల వంశమూలపురుషుడైన అడయిప్పన్ విశ్వనాథ నాయకర్ అనునాతడు అచ్యుతరాయల ప్రభుత్వోద్యోగిగానుండి యీ కోనేరు తీరమున నొక మంటపము నిర్మించి బ్రహ్మోత్సవ దినములలో నన్నిదినములందు స్వామివారికి ఒక అప్పాపడిని (అన్నప్రసాదములను) నివేదించుటకుగాను 15000 పణములకు 12-1-1537 వ తేదీనాడు దానశాసనమిచ్చెను. ఈ తేదీనగల మఱియొక దానశాసనము ద్వారా చిన్నప్పనాయకర్ కుమారులైన కృష్ణప్పనాయకర్ ఈ కోనేరు తీరములో మరియొక మంటపము నిర్మించి ఒక అప్పాపడి నివేదనమునకై 15000 పణములను దానమిచ్చెను. చారిత్రక పరిశీలన లాధారముగానీ కోనేరు నిర్మాణము క్రీ శ 1532 లో ప్రారంభమయ్యెను 1533లో పూర్తిఅయ్యెను. రామచంద్రదీక్షితార్ ఈ కోనేరు త్రవ్వకపు బాధ్యతను నిర్వహించినట్లు తెలియుచున్నది. ఈతడు రాయల ఘనతకై యొక

మండప నిర్మాణముకూడ చేసినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1537 లోగానే ఆ మంటపములు ఈ కోనేరు పార్శ్వములందు వెలసినవి.

1. అచ్యుతరాయలు తనకాలములో తానుగా నిర్మించిన అచ్యుత రాయస్వామి కిచ్చిన ప్రాధాన్యము తనకు పూర్వము రామానుజునిచే ప్రతిష్ఠింపబడిన శ్రీగోవిందరాజస్వామి ఆలయాభివృద్ధి కీయలేకపోయెను.

2. శ్రీస్వామి పుష్కరిణికి సమముగా నచ్యుతరాయకోనేరిని తిరుమలలో నిర్మించినదానికై అధిక ధనవ్యయ, ప్రయాసలకు లోనగుట అతని అతిశయమును, తెలివితక్కువ తనమును ప్రకటించుచున్నది.

3. అర్చన అర్చకస్వామియే చేయవలెనని ఆగమశాస్త్రములు నిర్దేశించగా, సామాన్యులనుండి ధీమాన్యులవరకు దానికి దాసోహమని కట్టుబడియుండగా నీయన త్రోసిరాజని తానే అర్చనకు గడంగుట మహాపచారము. శాస్త్రసంప్రదాయ పరిరక్షకుడే భక్షకుడైన యపకీర్తి దక్కించుకొనుటకే గడంగిన రీతిగానున్నదని చెప్పవలసి వచ్చును.

4. ఈతడు గొప్ప వైష్ణవభక్తుఁడే. తిరుమల శ్రీవారికి మిక్కిలి విశ్వాసపాత్రుఁడే, ఆయననే అన్నివిధముల నమ్ముకొన్న మహనీయుడే. అందులో సందేహములేదు.

❖

# 19 వ అధ్యాయము

## సదాశివమహారాయలు

సదాశివరాయలు నిజమునకు రాజ్యమునధిష్ఠించిన సరియైన సంవత్సరము మనకు తెలియదు. అచ్యుతరాయ మహారాజు కాలము లోని చివరిశాసనము 23–3–1542 నాటిదిగా కానవచ్చుచున్నది. పురావస్తు పరిశోధనాశాఖవారి వార్షిక సంచిక ప్రకారము (1908–1909) పేజీ 193 నుబట్టి ప్రత్యామ్నాయ పాలకునిగ 1537 వ సంవత్సరముననే సదాశివరాయలను అచ్యుతరాయలు నియమించినట్లు తెలియుచున్నది. సదాశివరాయల కాలములో ననేకులు తిరుమల శ్రీవారికి దానసమర్పణములు చేసినను రాయలవారి ప్రశస్తిలేదు. కాని దేవాలయ గణికులు చేసిన శాసనములందు రాయలవారి ప్రశస్తి నుదహరించిరి. దీనికి కారణము సదాశివరాయలకు పూర్వుడైన అచ్యుతరాయలకు నొకడే కుమారు డుండుటచేత ఏమిచేసిన యేమి ముప్పు వాటిల్లునోయని రాజు పేరుగాని రాజప్రతినిధి లేక ప్రత్యామ్నాయ పాలకుని పేరుగాని యుదహరింపకయే దానశాసనములు లిఖించినట్లూహింపవచ్చును. కాని సదాశివరాయలు పాలకునిగా బేర్కొన్న శాసనము లేకపోలేదు. 21–7–1541 నాడు యాంములూరి తిరుమల జ్యోస్యరు కుమారుడైన శ్రీరామభట్టరు వ్రాయించిన శాసనములో సదాశివరాయలు 'రాజపరమేశ్వర శ్రీ వీర ప్రతాప శ్రీ వీర సదాశివరాయల' నియే పేర్కొనబడెను. ఈయన బహుశః తిరుమల శ్రీవారి ఆలయ సిద్ధాంతిగానగును. కాని ఈ కాలములోనివే అచ్యుతరాయలు మహారాజుగా నున్నట్లు పేర్కొన్న కొన్ని శాసనములున్నవి. వీనినిబట్టి 1541 – 1542 సంవత్సరముల మధ్య రాజవివాదమున్నట్లు సుస్పష్టమగుచున్నది. తిరుమల శాసనము లీవిషయములో మధ్యేమార్గము నవలంబించినవి. ధర్మకర్తలసంఘము రాజవివాదముల జోలికి పోలేదు. 1543 వ సంవ

త్సరమునాటికి సదాశివరాయలు రాజసింహాసనమునధిష్ఠించినట్లు తెలియు చున్నది. అరవీటి అళియరామరాజు శ్రీకృష్ణదేవరాయలవారి అల్లుడై నందున సదాశివరాయలు రాజ్యాధిపత్యము వహించుటకు దోహదము చేసిరి. అరవీటివంశస్థులు నామమాత్రపు పాలకులుగానేయుండిపోయిరి. ఈ అళియరామరాజును గుఱించి కవీశ్వరులెన్ని యబద్ధపుటల్లికలు అల్లి నను వానితో మనకెట్టి సంబంధము లేదు. సలకరాజులకంటె ఈ అర వీటిరాజులు శ్రీవారి ఆలయమునకు పెక్కు దానశాసనములు సమర్పిం చిరి. సదాశివరాయల కాలమునాడు దేశము సుభిక్షముగా లేకపోయిన హేతువుచేతను, తళ్లికోట యుద్ధమునందు ఓటమి కలుగుటచేతను హెచ్చుగా దానములు చేయుటకు వీలుకాకపోయెను ఈతడు దానశాస నములు తనకు తానుగా వ్రాయించనందువల్ల ఈతని శ్రీవారి భక్తిని తక్కువగా అంచనావేయ వీలులేదు. ఒక మకరసంక్రమణము నాడు మాత్రమే (27–12–1553) తిరుమల శ్రీవారిని దర్శించెను. తిరుమల ఆలయమునకు ఆ సమయమున దానముచేయగోరు భక్తులకు అగ్రామ ములను, లేక ఆ భూములను దానముచేయుట కనుమతి నొసంగెను. తిరుపతిలోని కొండరాజుయొక్క రామానుజకూటమునకు 16 రాష్ట్రముల లోని 12 విధములయిన సుంకములను దానశాసనముగా సమర్పించెను.

సదాశివరాయల కాలములో అయనగా క్రొత్తయుత్సవములు ప్రవేశపెట్టకపోయినప్పటికిని ప్రాఁతయుత్సవములే కొంత యున్నత స్థాయిలో జరిగినవి.

1) ప్రతిసంవత్సరము పుష్యమాసములో జరుగు యుత్సవ మతి విస్తృతముగా జరుపుటకు తిరుపతికి సమీపములోని శ్రీనివాస పురనివాసియగు కాలట్టిసెట్టి యొక దానశాసన సమర్పణము చేసెను. (5-10; 31–12–1543)

2) ముక్కోటిద్వాదశీ ఉత్సవము గొప్పగ తిరుమలలో జరుగుటకు సదాశివరాయని ప్రశస్తికొఱకు అళియరామరాజు పుదుప్పట్టు

గ్రామమునుండివచ్చు 200 రేఖాపానుల శిస్తును దానసమర్పణము చేసెను. (5-29; 19-1-1545)

3) తాళ్లపాక తిరుమల అయ్యంగారిచే వనభోజనమహోత్సవము ఏర్పరుపబడినది (5-47 A; 3-7-1545), కార్తీకపౌర్ణమి రోజున తిరుమల శ్రీవారికిగాను ప్రతిసంవత్సరము జరిపింపబడె దిది. మలయప్పస్వామివారికి తిరువీధులలో పన్నెండు మంట పములందు ఆస్థానముచేసి అచట అన్నప్రసాద సమర్పణములు జరిపెడివారు.

4) పల్లవోత్సవము (5-51; 5-7-1545):
ఇది వైశాఖమాసములో జరిగెడి ఐదురోజుల ఉత్సవము. విఠ లేశ్వర మహారాజుచే తిరుమల శ్రీవారికి జరిపింపబడినది.

5) కళ్యాణోత్సవము (5-153; 10-2-1554):
తాళ్లపాక తిరుమల అయ్యంగారు తిరుమల శ్రీవారికొఱకు సమ ర్పించిరి. ఫాల్గుణమాసములో 5 రోజుల ఉత్సవముగా జరి పింపబడెను.

తిరుమలలో ఫలోత్సవము, తిరుపతిలో బ్రహ్మోత్సవము శ్రీగోవిందరాజస్వామివారికి జరిపించుట (ఇవి రెండును మాఘమాసము లోనే). ధనుర్మాసములో ఆండాళ్లు (తిరుపతి) కు నీరాటోత్సవము జరు పుట. తిరుమల శ్రీమద్రామానుజులకు అధ్యయనోత్సవము జరిపించు టకు గాను తిరుమలనంబి శ్రీనివాసయ్యంగారు పెరియ ఎక్కలూరు గ్రామమునుండి 2000 రేఖాపానులు దానశాసనసమర్పణము చేసెను. ఇంకను వసంతోత్సవము, తిరుపతిలో కళ్యాణోత్సవము తిరుమలలో శ్రీవారికి సహస్రనామార్చనము, రామానుజశాత్తుమొఱ, ధనుర్మాసో త్సవము, సుదర్శనస్వామికి సన్నిధి, పునుగుతైల సమర్పణము, రథ సప్తమీ ఉత్సవములు మొదలయిన యనేకోత్సవములు ఈయన కాల ములో వైభవముగా జరిపింపబడెను.

ఈ దానశాసనములు వ్రాయించినవారిలో రాజప్రతినిధులు, రాజబంధువులు, సేనానులు, సేనాధిపతులు, సామంతరాజులు, అర్చకస్వాములు, జీయరుస్వాములు, ఆచార్యపురుషులు, వారి పరంపరలోనివారు, దేవదాసీలు, ప్రధానగోపురపు కావలిదారులు, దేవస్థాన జ్యోతిషవిద్వాంసులు, వర్తకులు, వ్యాపారశ్రేష్ఠులు, ఇంక అనేక ఇతరవిధములయినవారు గలరు. వీరందరు నేదోవిధముగ శ్రీవారి కైంకర్యమున పాటుబడితిమన్న తృప్తితోబాటు వారిపేళ్లు కలకాలము చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించుటకు హేతుభూతులైరి.

❖

# 20 వ అధ్యాయము

## ఆరవీటిరాజులు – తిరుమల ఆలయము

## (1565—1665)

తళ్లికోట యుద్ధానంతరము సదాశివరాయలేమైరో చరిత్రకారులు తెలుపలేదు. ఈయుద్ధము 1565 వ సంవత్సరములో జరిగినది. తుళువ వంశము అంతమయినదని భావించినచో రాయలసీమ ప్రాంతమునకు చెందిన తెలుగురాజులైన ఆరవీడువంశస్థులు పెనుగొండ రాజధానినిగా పెట్టుకొని రాజ్యపాలనమునకు వచ్చినట్లు తిరుపతిలోగల శాసనముల వలన తెలియుచున్నది. ఆరవీడువంశస్థులు సదాశివరాయల కాలములో నధికారములో నున్నప్పుడు స్వామివారి ఆలయ పరిపాలనాభివృద్ధికయి దానశాసనములిచ్చినట్లున్నను, వీరు రాజ్యాధికారమునకు వచ్చినపిమ్మట మాత్రము స్వామివారి కైంకర్యములేమియు చేసినట్లు కానవచ్చుటలేదు. కాని ఆ కాలములో దేవస్థానమునకు చెందిన అర్చకులు, జీయరులు, యుద్యోగుల దానశాసనములు మాత్రము కనబడుచున్నవి.

16—1—1583 నాటి (5-3) తిరుపతి తిరుమల ఆలయముల శాసనమునుబట్టి శ్రీరంగరాజు ఆరవీడువంశరాజులలో మొదటివాడుగా కనబడుచున్నాడు. 1583 నుండి 1588 వరకు సీతనికాలపు శాసనములు కానవచ్చుచున్నవి. 16—1—1583 నాటి శాసనములో శుభమస్తు, స్వస్తిశ్రీ యని ప్రారంభింపబడినది. ఇదియొక క్రొత్తపద్ధతి. తిరుమల వైష్ణవుల నిర్ణయానుసారము తిరుమల ఆలయపు ధర్మకర్తలు స్వీకరించిన ఒక దానమునుగురించి శాసనము పేర్కొనుచున్నది. ఈ శాసనములలో విశేషమేమన రాజ్యము పెనుగొండలో నున్నట్లు పేర్కొనకుండుట. విజయనగరములో రాజ్యము చేయకుండినను ప్రజలు తాము మామూలు రాజధానిపౌరులువలె మెలగుట నివి బహుశః శాసనకర్తలకు రాజధానీ విషయముల్లేఖించుటకు వీలుకాకుండియుండవచ్చును.

ధర్మకర్తలసంఘమువారు కూడ ఈ విషయములో మిక్కిలి పట్టుదల చూపియుండరనియు భావింపనగును. శ్రీరంగరాయమహారాజు తర్వాత 14–7–1592 లో వీరవెంకటపతి మహారాయలు రాజ్యము చేయుచున్నట్లుగా శాసనములు చెప్పుచున్నవి. ఈ వెంకటపతిమహారాజుకూడ తిరుమల ఆలయములోనే పట్టాభిషిక్తుఁడయ్యెను. చంద్రగిరిని రాజధానిగా జేసికొని తిరుమల పలుమారులు దర్శించుటకు వీలుకల్గించుకొనెను. ఈయన నాణెములపై 'శ్రీవేంకటేశ్వరాయనమః' అను ముద్రవేసి యా నాణెములు చలామణిలో నుంచెను. అరవీటిరాజులెవ్వరును స్వయముగా దానశాసనములు వ్రాయించకపోవుట విశేషమే. మరియొకవిశేషమేమన, తిరుమల శాసనసంపుటి 6 వ భాగములో వచ్చిన 192 శాసనములలోను ఈ శతాబ్దములోనివి 32 శాసనములుగా గుర్తింప వీలుకల్గించుచున్నవి. ఇందులో 8 శాసనములు మాత్రమే తిరుమల ఆలయము గోడలపై కానవచ్చుచున్నవి. మిగిలినవన్నియు శ్రీగోవిందరాజస్వామి వారి ఆలయము గోడలపయి కానవచ్చుచున్నవి. దీనినిబట్టి క్రీ. శ. 1616 తరువాత శ్రద్ధయంతయు తిరుపతిపై పునకు మళ్లినదని అక్కడ కేంద్రీకృతమయినదనియు చెప్పవచ్చును. బహుశః శ్రీవారి కొసంగిన భూములపయి అనావృష్ట్యాదుల కారణముగా రాబడి రాకపోవుట, అధికారులు ధనము వసూలు చేయుటలో విఫలురగుట, కారణముగ తిరుమల శ్రీవారి ఆలయమునకు నిత్యవ్యయము కూడ భరించ కష్టమగుటవలన కూడ తిరుపతిని కేంద్రముగా జేసికొనియుందురు. తళ్లికోటయుద్ధానంతరము వచ్చిన శతాబ్దములో అన్ని అన్నప్రసాదములు తిరుపతిలోని ఆలయములలోని స్వాముల యుత్సవములకే పరిమితమగుటచే తిరుపతిపట్టణ ప్రజలకెక్కువగా నీ యుభయము లుపయోగపడినవి కాని తీర్థవాసులు ప్రయోజనమును పొందజాలకపోయిరి.

క్రీ. శ. 1616 లో వీరవేంకటపతిరాయల మరణానంతరము దేశములో అశాంతి హెచ్చుయ్యెను. ఆంగ్లేయులు తమ వ్యాపారకేంద్రములను స్థాపించుటకు తగిన స్థలములను వెదకుచుండిరి. గోల్కొండ

నవాబులనుండి క్రీ. శ 1638 వ సంవత్సరమునుండి విపరీతములయిన వత్తిడులకు తట్టుకొనవలసివచ్చెను. ఈతని తరువాత 4వ రామరాయలు, 2వ వేంకటపతిరాయలు, 2వ శ్రీరంగరాయిలు తమలో తాము రాజ్యము కొఱకై యుద్ధములు నడిపిరి. దీనితో దేశములోని వ్యావసాయ కాభివృద్ధి కుంటుపడెను. క్రీ శ. 1630 ప్రాంతములో పెద్దకఱవు వచ్చెను. ఈ మధ్యకాలములో శాసనములు వ్రాయించబడకుండుటకు దీనిని కూడ కారణముగా నూహింపవచ్చును. ఈ నాలుగవ రామ రాయలకాలములో మెట్ల అనంతరాజు దానములను గుఱించి పేర్కొన తలసివచ్చును. ఇవి అన్నియు క్రీ శ. 1628 వ సంవత్సరము నాటివి. తిరుమలకొండ దిగువున శ్రీపాదమంటపము నీయనయే నిర్మాణమొన ర్చెను. ఈయన దానములు ధనవువిలువలో చెప్పవలెనన్నచో కొన్ని లక్షలవరహాల విలువచేయును. శ్రీగోవిందరాజస్వామివారి ప్రధానగోపు రమును, తిరుమలలో శ్రీవారిఆలయపు ప్రధానగోపురము నీయన నిర్మా ణములే. ఇవి కఱవుకాలములో నిర్మింపబడిన కట్టడములగుటచే బీద ప్రజానీకమునకు కొంత భృతి కల్పించినవి.

ఈయన, వైష్ణవ దేవాలయములకు శైవ దేవాలయములకు సమానముగనే దానసమర్పణములు గావించెను. తిరువళ్లూరులో వసంత మంటపమును నిర్మించెను. శ్రీకాళహస్తీశ్వరునకు నెమలివాహనము, బంగారు మోహనవిమానమును సమర్పించెను. తిరుమల శ్రీవారికి బంగారుగుఱ్ఱము, ఏనుగ, సర్వభూపాలవాహనములు సమర్పించెను. ఈయన వితరణ నిర్మాణములకే పరిమితము కాలేదు. అనేక ఉచిత భోజనశాలలు నెలకొల్పి వారికి నిత్యాన్నదాన కార్యక్రమములు సక్రమ ముగా జరుగునట్లు చూచెను.

క్రీ. శ. 1642 లో శ్రీరంగరాయ మహారాయలు (3 వ రంగ రాయలు) రాజ్యసింహాసనము నధిష్ఠించి 1665 వరకు పాలించెను. ఈతఁడు రాజగుటతోడనే ఈతని ప్రతినిధియగు దామర్లవెంకటప్ప.

గోలకొండ నవాబులతో మంతనములు ప్రారంభించెను. రాజీతని కుటిల తను గనుగొని వెంకటప్పను బందీగావించెను. ఈతని అన్న అయ్యప్ప ఈతనిని వదలించుటకు పెద్దసేన నడిపెను తుదకు వేంకటప్పనువిడిచిరి. గోల్కొండ నవాబులసేనలు మీర్‌జుమ్లానాయకత్వముపై శ్రీరంగ రాయలపైన విజృంభించెను. కరవుకాటకములు, యుద్ధములలో ఓటమి శ్రీరంగరాయని యున్మత్తుని చేసినవి. చివరకు 1646 కు పూర్వమే మీర్‌జుమ్లా శ్రీరంగరాయలను ఓడించి వారిరాజ్యమును హస్తగత మొనర్చుకొనెను. ఇట్లు హిందూరాజ్యము గోల్కొండ నవాబుల వశ మైనది. శ్రీరంగరాయలు తిరుమలలో ఒక్కసారి మాత్రమే శ్రీవారిని దర్శించెను. అది 1665 వ సంవత్సరమునకు సరిపడు విశ్వావసు సం వత్సరము. తనకు విజయము కలుగవలెనని తాను తిరిగి రాజ్యమును పొందవలెనని ప్రార్థించుటకై కావచ్చును. చివరికీతడు తన రాజ్య మును గోల్కొండ నవాబులకు బీజపూరు సుల్తానులకు హస్తగత మొనర్చెను. ఈ మీర్‌జుమ్లా 1668 వ సంవత్సరములో మరణించెను. ఈతని తరువాత నెక్‌నమ్‌ఖాన్ వారసుడయ్యెను. 1651 వ సంవత్సర ములో తిరుపతి పట్టణమును శ్రీరంగరాయలు కైవసము గావించు కొన్నట్లుకలదు గాని నిజమునకు మీర్‌జుమ్లా తరువాత వచ్చిన నెన్‌నమ్ ఖాన్ అధికారములోనుండగా శ్రీరంగరాయలు తిరుపతి పట్టణమును తన యధీనములో నుంచుకొనెనో లేదో తెలిపెడి ఆధారములులేవు. శ్రీరంగ రాయల తిరుమల శాసనము 1665 వ సంవత్సరమునాటిది. ఇది తమిళ భాషలోలేదు. తెలుగు భాషలోనున్నది. 'తిరువేంగడనాథదేవుని సదా సేవ' అని యుండుటలో నీయన సదాభక్తితత్పరతను కొంతవరకు అంచనావేయవచ్చును. ఇది అపదలో మ్రొక్కుబడివంటి పదముగా నున్నది. కాన 'దైవభారము' తో తాను యత్నించువిషయము మనకు స్పష్టపఱచుచున్నది. ఇది విజయనగర సామ్రాజ్య పతన సంవత్సర ముగా నిర్ణయించ వచ్చును (1665) తిరుమల ఆలయమునకు సంబం

ధించినంతవరకు విజయనగరరాజుల కాలము రమారమి 300 సంవత్సరములు. క్రీ. శ. 1359 వ సంవత్సరములో మంగిదేవ మహారాజుతో ప్రారంభము 1665 వ సంవత్సరములో శ్రీరంగరాయమహారాజుతో అంతమయినది.

బీజపూరుసుల్తానుల, గోల్కొండ నవాబులవశమయిన తరువాత హిందూరాజ్యములో హిందువులకు భద్రతలేకుండెను, హిందువులు తిరుమల యాత్ర కొనసాగించుట కడు దుర్ఘటమయిన విషయముగా నయ్యెను. దక్షిణభారతమంతయు నట్టుడికినట్టుడికి పోవుచుండెను. ఈ విధమయిన క్లిష్టపరిస్థితిలో దక్షిణభారతమునుంచి విజయనగర సామ్రాజ్యమంతరించెను.

❖

# 21 వ అధ్యాయము

## విజయనగరానంతరకాలము

### 1 గోల్కొండ నవాబులు.

క్రీ. శ 1664 లో ఆరవ రంగరాయలు ముస్లిములతో తుది పోరాటము సలిపి పరాజయము పొందినపిదప దక్షిణభారతదేశమంతయు నాలుగు సేనావాహినులచే నాశముచేయబడి దేశమంతయు నరాచకము దుర్భిక్ష పరిస్థితులతో నిండిపోయెను. గోల్కొండ నవాబు పరిపాలించుచుండగా క్రీ. శ. 1677 లో శివాజి 5000 అశ్వికదళము తోను. 40,000 కాల్బలముతోను తిరుపతి, కాళహస్తి, కంచి, పట్టణములుగల కర్ణాటక ప్రాంతములపై దండెత్తివచ్చెను. క్రీ. శ 1678 వ సంవత్సరములో బీజపూరు సైన్యములు శివాజీమహారాజునకులొంగిపోయెను. దీనితో చెంజి మొదలు వెల్లూరు వరకుగల రాజ్యములోని 72 కొండలు, 14 కోటలు, 22 లక్షల పెగోడాల రెవిన్యూఆదాయముతో శివాజీ స్వాధీనమయ్యెను. మొత్తము దక్షిణదేశమంతయు శివాజీ స్వాధీనముకానున్న తరుణములో దైవదుర్విపాకముచే శివాజీ మహారాజు 1680 వ సంవత్సరములో మరణించెను.

శివాజీ మరణము నవకాశముగా దీసికొని ఔరంగజేబు తన కుమారుడైన మో-అజ్జామ్‌ను గోల్కొండను జయించుటకు పంపెను. మో-అజ్జామ్ కపటరాజీపేరుతో గోల్కొండ మంత్రులయిన అక్కన్న మాదన్నలను సభకు బిలిపించి వారిద్దరిని హత్యచేయించుటయేగాక చాలమంది బ్రాహ్మణులనుగూడ నిర్దాక్షిణ్యముగా హత్యగావించెను. ఔరంగజేబు 1686 లో బీజపూరును, 1687 లో గోల్కొండను స్వాధీనము చేసికొనెను. శివాజీకుమారుడైన శంభాజీని 1689 లో బందీగాపట్టుకొనిరి. మరణశిక్ష విధింపబడి యాతడు సంహరింపబడెను. మొగ

లాయి సేనలు తిరుచినాపల్లి వరకు దేశమును స్వాధీనము గావించు కొనిరి. మహారాష్ట్రసేనలు గోల్కొండ రాజ్యములోని గ్రామములను దోచుకొని 'అక్కరా' కోటను స్వాధీనము గావించుకొని దాని గవర్నరును సంహరించిరి. ఈ మహారాష్ట్రులు కాంచీపురమును 13-1-1688న దోచుకొన్నట్లు తెలియుచున్నది.

దేశము పై కారణములవలన భీభత్సపరిస్థితులలో నుండెను. ఇట్లుండుటచే శ్రీవారి ఆలయమునకు క్రీ. శ. 1638 నుండి దానములకు సంబంధించిన శాసనములు లేకుండెను. 19-3-1684 వ తేదీనాటి శాసనము తెలుగుభాషలో తిరుమల దేవాలయపు రెండవప్రాకారపు దక్షిణపుగోడపై కానవచ్చుచున్నది. దీనిలో 1684 వ సంవత్సరము వరకు ప్రసాద వినియోగమునకు ఆచరింపబడుచున్న పద్ధతిని రద్దుచేసి ప్రసాదమంతయు దేవాలయసేవకులకు, అర్చకులకు స్థానికవైష్ణవులకు యాత్రికులకు పంచిపెట్టవలెననియున్నది. ఈ శాసనము ఒక మహారాష్ట్రఅధికారి సమర్పించినది. ఈశాసనమునకు పూర్వము 1681 లో అక్కన్నమాదన్నలు తిరుమల శ్రీవారికి సమర్పించిన అన్నప్రసాద సమర్పణశాసనమున్నది. శాసనములలో సమర్పింపబడిన దానధనము రొక్కములోకాక 'బంగారుకంటె' రూపములో సమర్పింపబడినది. అది ప్రాత ధర్మకర్తలకుగాక క్రొత్తగా నియమితులైన 'స్థానాలవారి' పరముగా సమర్పణము జరిగెను. ఆ కంటెను నివేదనమునకు వలయు వస్తువుల సరఫరాకు తిమ్మనయ్యవారివద్ద యుంచుటకు, దేవునకు నైవేద్యము చేయు బాధ్యత స్థానాలవారికిచ్చినట్లునున్నది. దాత రాజా శ్రీశివ రాజరామచంద్ర దబీర్‌సా వారనియనియు కంటె బరువు 25 వరహాలనియు పేర్కొనబడినది. ప్రసాద విభాగమునుబట్టి 1638 వ సంవత్సరములో ధర్మకర్తలు 6 గురు కాగా నేడు 1684 లో 4 గురు మాత్రమే యుండిరని వారంతా తెలుఁగువారేననియు తెలియుచున్నది. అంతవరకు శాసనములలో స్వస్తి, శ్రీశుభమస్తు, లకు బదులుగా 'శ్రీవేంకటేశ'

శుభమస్తు' అని పేర్కొనబడుచున్నది అంతవరకు ఉన్న శాసనములలో శుద్ధాన్నము తిరుపోనకము (అన్నప్రసాదము) లేక సంధి అన్నప్రసాద సమర్పణము అని యుండగా నీ శాసనములో 'అవసర నివేదనము' నిర్దేశింపబడినది. ఇంతవరకునున్న 'పెరియకోయిల్ కెల్వి' 'ఇలంకోయిల్ కెల్వి' అను పదములకు బదులుగా పెదజియ్యంగారు చినజియ్యంగారు అని పేర్లు మార్చబడినవి.

ఈ శాసనమునుబట్టి అళియరామరాయల కాలములో నీయబడిన యన్నప్రసాద సమర్పణములు గోల్కొండ నవాబుల కాలములో నాపివేయబడినందున దేవాలయ పరివారము, అర్చకసిబ్బంది భోజనాదులకు మిక్కిలి యిబ్బందిపడుచున్నందున దాతలు పూర్వపుధర్మకర్తలపరము గాకాక నూతన స్థానాలవారికి దేవాలయ పరిచారకులకు నితరులకు వినియోగించుటకుగాను యేర్పాటుగావించినట్లు కానబడుచున్నది. గోల్కొండ రాజ్యమంతయు ఔరంగజేబుచే సుభాలు, జాగీరులుగా విభజింపబడి వాని నిలువలు ఆదాయముకట్టుటకు 'కనుంగో'లను వారు నియమింపబడిరి.

దాదాపు 20 సంవత్సరములు మొగలులుకు మహారాష్ట్రులకు జరిగిన యుద్ధములవలవ ప్రజలు కొల్లగొట్టబడుటయు, హింసింపబడుటయు జరుగుటచే దేశపరిస్థితి యధ్వాన్నమైపోయెను. ఔరంగజేబు ప్రతినిధి జుల్ఫికర్ఖాన్ అనువాడు దక్షిణదేశములోని దేవాలయముల నన్నింటిని 1698 వ సంవత్సరములో దోచుకొనెను. ఈ జుల్ఫికర్ ఖానుకు క్రీ. శ. 1713 లో మొగలునవాబు మరణశిక్షవిధించెను. కాని ఈతడు దక్షిణదేశమంతయు దోచుకొనినను తిరుమల శ్రీవారిచాయలకు రాకపోవుట యనునది కేవలము తిరుమల శ్రీవారి మాహాత్మ్యముగానే చెప్పవచ్చును. క్రీ.శ. 1713 లో సాదత్-ఉల్లాఖాన్ అనువాడు దక్కను గవర్నరుగా వచ్చినపుడు ఆతనికి తోడరుమల్ అనునతడు సలహాదారుగా నుండెను. తోడరుమల్లు శ్రీవారికి భక్తుడగుటచే ఆతనితల్లి, భార్యల, తన విగ్రహములు నేటికిని శ్రీవారి ఆలయము ధ్వజస్తంభ మంటప దక్షిణభాగమున నున్నవి.

క్రీ. శ. 1733 లో సాదతుల్లాఖాన్ మరణానంతరము దోస్తుఅలీ ఖాన్ అను నాతడు కర్ణాటకనవాబుగా నియమింపఁబడెను. తిరుమల దేవాలయ పరిస్థితు లీకాలమునాటివి యేమియు తెలియుటలేదు, కాని తిరుమల దేవాలయపు పరిసరములు మాత్రము ప్రశాంతముగా నున్నట్లూహింపవచ్చును. క్రీ. శ. 1739 లో మహారాష్ట్రులు నైజాము ప్రభుత్వప్రోత్సాహముతో దోస్తాలిఖాన్‌పై దండయాత్ర జరిపి ఆతనిని రెండవ కుమారుని చంపివేసి ఆతని సంపదను దోచుకొనిపోయిరి. 18-8-1740 లో రావినూతల 'ఆదిఅప్ప' అను నింగ్లీషువారి గూఢ చారి వ్రాసిన యుత్తరములో మహారాష్ట్రసేనాధిపతి బాజీరావుతల్లి, భార్య తిరుమలకు వచ్చి శ్రీవారిని సేవించినట్లు తెలియుచున్నది.

ఈ ఆది అప్ప అను నాతఁడు 1-10-1740 వ తేదీన ఇంగ్లీషు వారికి వ్రాసిన ఒకజాబులో తిరుపతిదేవాలయము ఆదాయము మొత్తము ఆర్కాటునవాబు స్వాహాచేయుచున్నట్లు వ్రాసెను. అంతేకాక అందులో 50వేల రూపాయలు మాత్రము మహారాష్ట్ర వకీళ్ళకు చెల్లించినట్లు వ్రాసియుండెను.

బాజీరావుద్వారా వకీళ్ళుపొందిన ధనమునుండి బాజీరావు తల్లి, భార్యల కోరికననుసరించి 20వేల రూపాయలు తిరుమలదేవుని దానసమర్పణమున కుపయోగింపబడినట్లు తెలియుచున్నది.

18-1-1745వ తేదీన ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికి యుద్ధము ప్రకటింపబడిన కారణముగా కర్ణాటకములోని పరిస్థితులు తారుమారయ్యెను. దీని ఫలితముగా కర్ణాట దేశములో ముస్లిముల పరిపాలన మంతమగుటకు నాందిజరిగినట్లు భావింపవచ్చును. ఈ ఇరువైపుల నాయకులు క్లైవు డూప్లేలు. ఆంగ్లేయులు వారి పరిపాలనాకాలములో హిందువుల మతాచారములలోను దేవాలయపరిపాలనములోను జోక్యము కలుగజేసికొనకుండెడి విధానము నవలంబించిరి. క్రైస్తవమిషనరీలు

కూడ హిందువుల దేవాలయ పరిపాలనావిధానములో వారి మంచిచెడ్డలు వారు నిర్ణయించుకొను విధానమునకే ప్రోత్సాహము నొసంగిరి.

21-9-1746 న ఫ్రెంచివారు మదరాసును స్వాధీనముగావించు కొనిరి. ఆపిమ్మట 18-8-1749 లో ఇంగ్లీషువారి ఐక్స్-లా-చాపెల్లే రాజీషరతుల ప్రకారము తిరిగి మదరాసు ఆంగ్లేయులకు వప్పగింత పెట్టబడెను.

ఫ్రాన్సునుండి వచ్చి పాండిచ్చేరీలో స్థానమాక్రమించుకొని గవర్నరైన డూప్లేకు ఆనందరంగపిళ్లై అను దుబాసీ యుండెను. ఈతడు 17-5-1746 వ తేదీన తనడైరీలోని ఒకపేజీలో ఈ క్రింది విషయమును పొందుపఱచెను. కార్వేటి నగరజమీందారు తిరుమల దేవాలయ అర్చకులద్వారా డూప్లేగవర్నరు అభిమానము సంపాదించు టకై శ్రీవారి నివేదనములోని అన్నప్రసాదము భాగమును, ఒక జరీ శిల్కు వస్త్రమును, ఒక గుజరాతు నడికట్టుగుడ్డ, శిల్కు తలపాగా, 1 శాలువా, 1 బంగారుపిడిబాకు, ఒక యవనాశ్వము తనకు పంపెనని వ్రాసికొనెను. ఈ కార్వేటినగర జమీందారు తిరుపతి ఆచార్యపురుష లలో నొక శాఖకు చెందినవాడైయుండగా ఆనందరంగపిళ్లై శింగరా చార్య వారిశాఖకు చెందిన శిష్యుడయియుండెను. కార్వేటినగరము జమీందారు బహుమతులు తెచ్చినవారిలో సింగరాచారిగారి అల్లుడయిన శ్రీనివాసాచారియర్ కూడకలడు.

## తిరుమల శ్రీవారి ఆలయఆదాయము క్షీణతకు చెందుట

తిరుమల దేవాలయములోని ఆదాయము 1751 నుండి ఎంత వసూలైనదియు అర్కాటునవాబు దేవాలయభూములనుండి ఆదాయమును వసూలుచేసి క్రమేపి ఇంగ్లీషువారికి చెల్లించినచరిత్రయు మనకు చారిత్ర కాధారముల చేఁదెలియుచున్నది. 9-12-1751 తేదీగల ఉత్తరములో నాంగ్లేయులు బలపఱచిన నవాబు మహమ్మదాలీ దేవాలయపుటాదాయ

మును వసూలు చేసినట్లు దానిలో కొంతభాగము క్లైవుకు పంపినట్లు తెలియుచున్నది. 20-12-1751 లోని వుత్తరువు ననుసరించి ఇంగ్లీషు వారికి తిరుపతిలో వసూలైన మొత్తము చెల్లింపబడలేదనియు తెలియుచున్నది.

1752 వ సంవత్సరము పిమ్మట ఇంగ్లీషువారు శ్రీవారి ఆలయములో యాత్రికులనుండి ప్రతిదమ్మిడీ కూడ వసూలు చేసిరి. ఆయుత్సవములు ముఖ్యముగా బ్రహ్మోత్సవము, వైకుంఠఏకాదశి, అనివర ఆస్థానము (కటకసంక్రమణము) రోజులలో-ఈమూడు పర్యాయములుగ దేవాలయ సొమ్మును వసూలుచేసెడివారు.

ఈ దిగువున ఆ సంవత్సరములు వసూలుచేసిన మొత్తము లీయబడినవి

| సంవత్సరము | వసూలుచేసిన ఆదాయము రూపాయలలో |
|---|---|
| 1753-54 | 92, 000 |
| 1754-55 | 58, 841 |
| 1755-56 | 53, 235 |
| 1756-57 | 51, 240 |
| 1757-58 | 50, 866 |

దీనినిబట్టి ఇంగ్లీషు కంపెనీవారికి తిరుమల ఆదాయమునుండి. భూముల తదితర ఆదాయములు కలుపుకొని సాలీనా 2½ లక్షలరూపాయలు చెందుచున్నట్లు తెలియుచున్నది. ఇంగ్లీషువారి డైరీద్వారా 1751-53 వ సంవత్సరముల నడుమ శ్రీనివాసాచార్య అనువారు దేవాలయ కౌలుదారుగా నియమింపబడినట్లుకూడ తెలియబడుచున్నది.

క్రీ. శ. 1754 సెప్టెంబరులో ఆర్కాటునవాబు సమస్తహక్కులతో తిరుపతి పరగణాను ఇంగ్లీషు వారికిచ్చివేసెను. 1754 వ సంవత్సరములో సెప్టెంబరు మాసములోనే తిరిగి ఈ శ్రీనివాసాచార్యులే తిరుమల

తిరుపతి ఆలయముల కౌలుదారుగ నియమింపబడెను. కృష్ణాజీపంత్ అను నాయనను వసూళ్లలో కౌలుదారుకు సహకరించుటకుగాను నియమింపబడెను. ఈతడు తహసీలుదారుగకూడ నియుక్తుయ్యెను.

మహారాష్ట్ర సేనాని బలవంతరావు తిరుపతి దేవాలయాధికారులకు తాను రెండువేల అశ్వికదళముతో శ్రీవారి సేవకు వచ్చుచున్నానని 13-8-1757 న ఇంగ్లీషువారికి తెలియచేసెను. ఇంగ్లీషువారి సేన తిరుపతికి 8 మైళ్లదూరములో 12-8-1757 న బలవంతరావును అతని అశ్వికదళమును కలిసికొని బలవంతరావు ఒక్కరినిమాత్రమే కొండకు పోవుటకు అనుమతించిరి.

క్రీ. శ 1758 మార్చిప్రాంతములో బాలకృష్ణశాస్త్రి రాఘవాచార్య అనువారలు బాలాజీరావు వద్దతు తమకు కలదనియు కర్ణాటక ప్రాంతములో తమకు శిస్తువసూలుచేసికొను హక్కు కలదనియు ప్రకటించి మట్లవారి రాజసహాయముతో తిరుపతి ముట్టడించిరి. తిరుపతి పరిసరములలో జరిగిన యుద్ధములో రాఘవాచార్యులను ఇంగ్లీషువారి కౌలుదారైన శ్రీనివాసాచార్యులు 5 మే 1758 వ సంవత్సరములో చంపివేసెను.

## ఫ్రెంచివారి పాలనములో తిరుపతి

1-10-1758 న ఇంగ్లీషువారిచే నియమింపబడిన తహశీలుదారు కృష్ణాజీపంత్ మదరాసు గవర్నరుకు పంపిన వర్తమానములో మచిలీపట్టణములో ఫ్రెంచిసేన నాయకుడు. నెల్లూరుకుచెందిన నజీబుల్లాఖాను చంద్రగిరికి చెందిన అబ్దుల్‌వహబ్‌ఖాన్‌లు ఒకముఠాగాకూడి తిరుపతి పరగణా ఆక్రమించినట్లు తెలియుచున్నది. ఫ్రెంచివారు అబ్దుల్‌వహబ్ ఖానును తిరుపతిపరగణాను కౌలుకిచ్చుటకుగాను కొంతధరావతు కోరిరి. అపుడు వహబ్‌ఖాన్ ఇంగ్లీషువారి కౌలుదారైన శ్రీనివాసాచార్యకు

కబురుపంపి ఆతనివద్దనుండి కొంత ధరావతు పైకము పొందెను. ఆ కౌలు ధరావతు పైకము ఫ్రెంచివారి కప్పగించగా నాతఁడు బ్రహ్మోత్సవము 5వ రోజైన 7–10–1758 వ తేదీన ఫ్రెంచివారి కౌలుదారుగా నియమింపబడెను. తరువాత ఫ్రెంచివారినుండి 1762 వ సంవత్సరము నాటికిగాని ఇంగ్లీషువారు తిరుపతి పరగణాను స్వాధీనపఱచుకొనలేక పోయిరి. అప్పటినుండి ఆర్కాటునవాబు పాలనములో నున్నప్పటికిని 1800 సెప్టెంబరు వరకు తిరుపతి దేవాలయము ఆదాయమును, అధికారమును ఇంగ్లీషువారు అనుభవించినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 1801 లో ఈస్టిండియాకంపెనీవారు నవాబును తొలగించి తిరుపతి దేవాలయ పరిపాలనమును తమ హస్తగత మొనర్చుకొనిరి. దేవాలయ పరిపాలనమునకై ప్రజలనుండివచ్చిన సలహాలను స్వీకరించి ఆ పరిపాలనావిధానమును రూపొందించిరి.

28–7–1821 లో 'బ్రూస్‌కోడ్' అను పేరుతో అప్పటి జిల్లా కలెక్టరు అంగీకారముతో దేవాలయ పరిపాలనమును ప్రవేశపెట్టిరి. దీనికి ప్రభుత్వఅనుమతి లేకున్నను దేవాలయ పరిపాలనమును ఈ నిబంధనముల ప్రకారమే కొనసాగించుచుండిరి. వీనిమీద వచ్చు ఆరోపణలు న్యాయస్థానములో పరిష్కరింపబడుచుండెడివి. క్రీ. శ. 1821 నుండి దేవాలయ పరిపాలనము క్రమబద్ధము చేయబడినది. పారుపత్యదారు 'అమలునామా' అను తన దినచర్య పుస్తకములో దేవాలయములో జరుగు నిత్యకార్యక్రమవిధానమును పొందుపఱచెను. పారుపత్యదారు రూపొందించిన ఈ నిత్యకార్యక్రమములో నేవేని లోపములు, దోషములున్నచో నవి న్యాయస్థానములందు 25 సంవత్సరముల తరువాతనైన పరిష్కరింప సాధ్యమగునట్లుగా నా 'అమలునామా' రూపొందింపబడెను.

## 1821 సంవత్సరములో దేవాలయభూములు ఇంగ్లీషువారి ప్రభుత్వము స్వాధీనము చేసికొనుట

రాజ్యపరిపాలనమును ఇంగ్లీషుకంపెనీవారి స్వాధీనము కాగానే దేవాలయ భూములన్నింటిని వారు స్వాధీనము చేసికొని 'తస్దిక్ భత్యము' అనుపేరుతో కొంత నామమాత్రముగా రుసుము చెల్లించు ఆచారమును ప్రవేశపెట్టిరి. 1822 వ సంవత్సరమునుండి యిచ్చిన నామ మాత్రము రుసుమును లెక్కలుగట్టి చూచినచో ప్రభుత్వసహాయము దేవాలయము వ్యయమునకే మాత్రము సరిపోనట్లు తెలియుచున్నది. క్రీ.శ. 1841 లో గవర్నమెంటువారి ఉత్తర్వుమేరకు జిల్లాకలెక్టరు దేవస్థానపు పరిపాలన నిర్వహణమునకై ఒక కమిటీని వేయుటకు ఆచార్యపురుషు లకు ఆహ్వానములు పంపగా వారు కలెక్టరువారి కార్యాలయమునకు వెళ్ళుటకు నిరాకరించిరి. అంతేకాక జిల్లాకలెక్టరును తాము దేవాలయ గోపురమువద్ద చూడగలమని సమాధానము చెప్పిరి. దీనిపై జిల్లా కలె క్టరు కించపడి వీరి ప్రమేయము లేకనే దేవాలయపు భూములన్నింటిని స్వాధీనము గావించుకొన నిర్ణయించెను.

ఆ కాలములో 19 దేవాలయములు పెద్దవిగాను, 18 దేవాలయ ములు చిన్నవిగను విభాగమొనర్చిరి. వీటికి సర్కారువారు ఇచ్చు ధన సహాయము నిర్ణయింపబడినప్పటికిని వస్తువుల ధరవరలనుబట్టి ఈ సహా యము మారుచుండెడిది. పడితరము ఖర్చులుమాత్రము మార్పులేక కొనసాగెడివి. ఆ కారణముచే పెక్కుదేవాలయములు వానిమీద వచ్చు ఆదాయముతోనే స్వయంపోషకులుగానుండెడివి.

దేవాలయమునకు వచ్చు ఆదాయము ఈ క్రింద పద్దుల క్రింద యుండెడివి. ఫసక్కి మొదలగు ఇతరపద్దులు, కానుకలు, ఆర్జితములు, ధర్మకర్తలద్వారా కొన్ని యితర సేవలక్రింద వచ్చెడు ఆదాయము, దేవాలయ భూములనుండి వచ్చు ఆదాయమునుండి సర్కారు వారిచ్చెడి సహాయము.

ఖర్చులపద్దులీ విధముగా నుండెడివి:

దినభత్యము కొందఱకు బియ్యము రూపములో నుండెడిది.
దేవాలయ సేవలకుగాను వ్యయము.
సర్కారు వారి సిబ్బందిఖర్చు.
సిబ్బంది వినియోగార్థమై ఈనాము భూములపై వ్యయము.
ధర్మకర్తల సిబ్బందిమీద ఖర్చు
మీరాశిదార్లకు చెల్లింపులు.
చిన్న దేవాలయములకిచ్చు సహాయము.

ఈస్టిండియా కంపెనీనుండి మహంతులు విచారణకర్తలుగా నియమితులైన పిమ్మట తస్దిక్‌భత్యము వారు పుచ్చుకొన్నట్లు దేవాలయపు ఆదాయవ్యయములలో కానవచ్చుటలేదు.

ఆంగ్లేయులపరిపాలనములో తిరుమల దేవాలయమునుండి చిన్న దేవాలయములకు ఏమియు పరిహారమీయబడలేదు. మహంతుల పరిపాలనములో మాత్రము ఆ నిర్ణయమును మార్చి తిరుమల దేవాలయమునుండి ధర్మకర్తలు నిర్ణయించిన మేరకు తిరుపతిలోని యితర దేవాలయములకు సహాయముచేయు విధానమును ప్రవేశపెట్టిరి. మహంతులు దేవాలయ పరిపాలనమును స్వీకరించినకాలము 1843వ సంవత్సరము. వీరు విచారణకర్తలుగా ఆంగ్లప్రభుత్వము వారిచే నియమింపబడిరి. ఇందులో మొదటివారు మహంతుహత్తీరాంజీవారు. ఈయన దేవాలయ పునరుద్ధరణమునకై కొంతపాటుపడెను. శ్రీస్వామివారి పుష్కరిణి యిట్టి పునరుద్ధరణము జరిగిన నిర్మాణములో నొకటి. ఇది 1849 వ సంవత్సర కాలము. ఈయన తరువాత వచ్చిన మహంతు సేవాదాస్‌జీ శ్రీవేంకటేశ్వరాలయములోని కొన్నికొన్ని భాగములకు మరమ్మతులను చేయించినట్లు తెలియుచున్నది. 1865 లో వచ్చిన మహంతుధర్మదాసజీ కపిలతీర్థము, మంటపములు మొదలైనవి మరమ్మతులు గావించినట్లు (10-2-1865) శాసనములు తెలుపుచున్నవి. ఈ పడికావలిగోపుర

మును పునర్నిర్మాణము గావించిన దీతదే (11–9–1878) తరువాత మహంతు ప్రయాగదాసజీ (1908–9–90) శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆనందనిలయవిమాన కనక కలశమును తన సోదరుడగు రామలక్ష్మణ దాసుచే ప్రతిష్ఠింపించెను. ఇట్లు ఈమహంతుల పరిపాలనములో 1933వ సంవత్సరము వరకు దేవస్థానపుపరిపాలనము కొనసాగినది. తరువాత 1933 వ సంవత్సరములో మద్రాసు ప్రభుత్వమువారి నూతన చట్టము ప్రకారము తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యము సర్వ స్వతంత్ర ప్రతిపత్తిగల ఒక కమిటీని హిందూదేవాదాయ ధర్మాదాయ శాఖాధికారియగు కమీషనరువారి పరిధిలోనుండునట్లుగా నియమించిరి.



# 22వ అధ్యాయము

## తిరుమల దేవాలయము

## ధర్మకర్తలసంఘము

## పరిపాలనము

1933 వ సంవత్సరములో మద్రాసు అసెంబ్లీవారిచే ప్రత్యేకచట్ట మొకటి ఆమోదింపబడిన ఫలితముగా తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యపు బాధ్యతను స్వతంత్ర ప్రతిపత్తిగల ఒక ధర్మకర్తల సంఘము స్వీకరించినది. ఈ సంఘము మద్రాసు ప్రభుత్వము వారిచే నియమింపబడిన దేవాదాయ ధర్మాదాయ కమీషనరుగారి అధికారమునకు లోబడి పనిచేయవలసివచ్చెను. దీని తరువాత 1951 వ సంవత్సరములో భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము వచ్చిన తరువాత అప్పటి మద్రాసుప్రభుత్వము మరియొక చట్టము చేసెను. ఆ చట్టము ప్రకారము నూతన ధర్మకర్తల సంఘమేర్పడెను. దేవస్థానమునకు ధర్మకర్తల సంఘము సూచించు కార్యక్రమముల నమలుపఱచుటకు ఒక కార్యనిర్వహణాధికారిని అప్పటి మద్రాసు ప్రభుత్వమే నియమించెను. ఈ దేవస్థానమునకు అట్టి మొదటి కార్యనిర్వహణాధికారి శ్రీచెలికాని అన్నారావుగారు.

ఈ దేవస్థానము క్రిందనున్న ఆలయములీ క్రింద నుదహరింపబడినవి.

1. తిరుమలలోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయము
   1. శ్రీ వరాహస్వామివారు
   2. శ్రీభాష్యకార్లు
   3. శ్రీబేడిహనుమంతరాయస్వామి

4. శ్రీ దోవభాష్యకారులు
5. శ్రీ క్షేత్రపాలకస్వామి
6. శ్రీ మదాంజనేయస్వామి వారు
(వరాహస్వామివారి ఆలయమున కెదురుగా)

2. **తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయము. దాని కను సంధింపబడిన ఇతర ఆలయములు**

1. శ్రీ సాలై నాచ్చియారు
2. శ్రీ చూడికుడుత్తనాచ్చియార్ (గోదాదేవి)
3. శ్రీ మొదలిఆళ్వారు
4. శ్రీ చక్రత్తాళ్వారు
5. శ్రీ మధురకవిఆళ్వారు
6. శ్రీ ఆంజనేయస్వామి (ధ్వజస్తంభమువద్ద)
7. శ్రీ ఆంజనేయస్వామి (పెద్దబుగ్గవద్ద)
8. శ్రీ మనవాళమహాముని
9. శ్రీ నమ్మాళ్వారు
10. శ్రీ వేదాంతదేశికులు
11. శ్రీ పుల్ ఆళ్వారు
12. శ్రీ తిరుమలనంబి
13. శ్రీ భాష్యకారులు
14. శ్రీ కూరత్తాళ్వారు
15. శ్రీ సంజీవరాయస్వామి
16. శ్రీ తిరుమంగై ఆళ్వారు

3. శ్రీ కోదండరామస్వామివారి ఆలయము, తిరుపతి.

4. శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయము, తిరుపతి.

5. శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయము (తిరుచానూరు) న కనుసంధింపబడిన ఇతర ఆలయములు

1. శ్రీ కృష్ణస్వామివారి ఆలయము
2. శ్రీ సుందరరాజస్వామి
3. శ్రీ సూర్యనారాయణస్వామి

6. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారి ఆలయము, నారాయణవనం. ఆ యాలయమున కనుసంధింపబడిన ఇతర ఆలయములు.

1. శ్రీ పరాశరేశ్వరస్వామివారి ఆలయము
2. శ్రీ వీరభద్రస్వామి ఆలయము
3. శ్రీ శక్తివినాయకస్వామి
4. శ్రీ అగస్త్యేశ్వరస్వామి
5 శ్రీ అవనాక్షమ్మ వారి ఆలయము

7. నాగలాపురములోని శ్రీ వేదనారాయణస్వామివారి ఆలయము

8. శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయము, మంగాపురము.
ఈ మంగాపురము అలమేలు మంగాపురము కాదు. చంద్రగిరి సమీపములోనున్నది.

## బ్రహ్మోత్సవములు

తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవములు ప్రతిసంవత్సరము సెప్టెంబరు మాసములో అనగా భాద్రపద మాసములో వచ్చు శ్రవణానక్షత్రమును తీర్థవారి దినముగా నిర్ణయించుకొని దానికి పూర్వము తొమ్మిది రోజులు ముందుగా ధ్వజారోహణము జరుగును. ప్రతిసంవత్సర మనేక లక్షలమంది యాత్రికులీ యుత్సవమును దర్శించుటకు విచ్చేయుదురు. దేవస్థానమువారు విశేషమగు కార్యక్రమములతోబాటు అనేకవిధములగు రక్షణపదుపాయములను కల్పింతురు. ఈ బ్రహ్మోత్సవములలో ప్రతి

నిత్యము విశేషదినమే యయ్యు, గరుడోత్సవము, రథోత్సవములు మాత్రమత్యంత దర్శనీయములు. ఇందు ప్రతినిత్యము రాత్రి వాహన మంటపముపై వేంచేయుటకు పూర్వము మలయప్పస్వామి వారికి దేవేరులకు కన్నులపండువుగా నూయలయుత్సవము జరుగును. ఇది యత్యంత సౌందర్య సముపేతము. చూచువారి జన్మ ధన్యము.

## ప్లవోత్సవము

తిరుమల శ్రీవారి యుత్సవులకు ప్లవోత్సవము జరుగును. ఇది ప్రతిసంవత్సరము ఫాల్గుణపూర్ణిమకు జరుగును. శ్రీమలయప్పస్వామి వారిని, దేవేరులను సర్వాంగసౌందర్య సముపేతముగా నలంకరించి పుష్పములతో నలంకరించి శ్రీస్వామి పుష్కరిణిలోనున్న మంటపము నకు జేర్చి యట నూతనముగా నిర్మింపబడిన తెప్పపై నలంకరించి యూరేగింతురు. ఇది ఐదు దినముల యుత్సవము. మొదటి దినమున శ్రీకోదండరామస్వామి వారికి, రెండవదినమున శ్రీకృష్ణస్వామివారికి, మూడవదినము నుండి యైదవదినముదనుక శ్రీమలయప్పస్వామి వారికి నీ యుత్సవములు జరుగును.

## వసంతోత్సవము

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి వసంతోత్సవము ప్రతి సంవత్సరము చైత్రమాస పౌర్ణమికి జరుగును. ఈ యుత్సవ కాలపరిమితి 3 రోజులు. ఇది ఆర్జిత సేవగాకూడ పరిగణింపబడును. ఎవరైనను భక్తులు రు. 2000/- చెల్లించి యుత్సవములో నుభయదారులుగా పాల్గొనవచ్చును. ఇందు మొదటి రెండురోజులు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి యీ యుత్సవము జరుపబడును మూడవరోజునమాత్రము శ్రీవారితోబాటు, శ్రీకోదండరామస్వామివారికి, శ్రీకృష్ణస్వామివారికి కూడ రజతరథోత్సవము జరుగును.

## పవిత్రోత్సవము

ఇది వేంకటేశ్వరస్వామివారి ఆలయములో ప్రతి సంవత్సరము శ్రావణమాసములో జరుగును. ఇది పూర్తిగా ఆగమసంబంధమైన కార్యక్రమము. దీక్షాదులుండును. స్వామివారిని పవిత్రములచే నలంకరింతురు. ఇది త్రయాహ్నికదీక్షతో జరుగును. మొదటి రోజున అంకురార్పణము, రెండవరోజున పవిత్ర ప్రతిష్ఠ, హోమములు, మూడవదినమున పవిత్రారోపణము లేక సమర్పణము జరుగును. హోమములు ఉదయ సాయంత్రములందును జరుగును. నాలుగవరోజు ఉదయమున పూర్ణాహుతితో నీ కార్యక్రమము పూర్తియగును.

## తిరుచానూరు

## పద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవము

అలమేలుమంగాపురములోనున్న పద్మావతీఅమ్మవారికి బ్రహ్మోత్సవము కార్తీకమాస కృష్ణపక్ష ఏకాదశిన గాని ద్వాదశిన గాని ప్రారంభమయి మార్గశిర శుద్ధపంచమి రోజున తీర్థవారి జరుగును. ఈరోజునే పంచమీ తీర్థమను పేరుతో పెద్దయుత్సవము జరుగును. ఇది తొమ్మిది రోజుల వేడుక. అంకురార్పణము, ధ్వజారోహణముతో ప్రారంభమగును. గరుడోత్సవము, రథోత్సవములు దర్శనీయములు. పంచమీ తీర్థమునకు ఒక ప్రత్యేక సంప్రదాయమున్నది. ఈ విషయము పద్మావతీదేవి ఆలయ చరిత్రములో పూర్తిగా వివరింపబడినది.

## ప్లవోత్సవము

ప్రతి సంవత్సరము జ్యేష్ఠపూర్ణిమకు ఐదురోజుల యుత్సవముగా నీ తెప్పయుత్సవము జరుగును. ఇందు మొదటి రోజున శ్రీకృష్ణస్వామివారికి, రెండవరోజున శ్రీసుందరరాజస్వామివార్లకు మూడు నుండి ఐదురోజులు వరకు అనగా చివరి మూడురోజులు పద్మావతీ అమ్మవార్లకు నీ తెప్పయుత్సవము రాత్రులందు అతిమనోహరముగా

రంగు రంగుల విద్యుద్దీపముల కాంతులలో మిరుమిట్లు గొల్పుచు పండు వెన్నెలలో జరుగును. దృశ్యము లతిమనోహరములు, కమనీయములు. పుష్పాలంకారములు, భూషణాలంకారములు చూచితీరవలయునే గాని వర్ణింప నలవికాదు.

## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి ప్లవోత్సవము

తిరుపతిలోనున్న శ్రీ గోవిందరాజస్వామివారికి ప్లవోత్సవము ఐదురోజుల కార్యక్రమముతో మాఘమాసములోని పౌర్ణమినాడు జరుగును. ఇందు మొదటిరోజున తిరుపతిలోని శ్రీ కోదండరామస్వామి వారికి జరుగును. రెండవరోజున కృష్ణస్వామివారికి, గోదాదేవికి యీ తెప్ప ఉత్సవము జరుగును. మూడునుండి ఐదవరోజువరకు అనగా చివరి మూడురోజులును శ్రీ గోవిందరాజస్వామివారికి ప్లవోత్సవము జరుగును.

## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవము

తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామివారికి ప్రతివైశాఖమాసము లోను బ్రహ్మోత్సవము జరుగును. ఈ బ్రహ్మోత్సవ మన్నిదినముల తిరుపతి పట్టణమెంత యాధునికమైనప్పటికి నీ యుత్సవకళ పట్టణమునకు అంటిపెట్టుకొనియే యున్నట్లుండును. ఇది శ్రీ వేంకటేశ్వర స్వామివారి యుత్సవ దినసంఖ్యవలెనే (9 రోజులు) నవాహ్నిక దీక్షతో జరుగును. వైశాఖపౌర్ణమి అవభృథము. అంకురార్పణములో ప్రారంభమయి, ధ్వజారోహణము రెండవరోజు, మిగిలినయన్నిరోజులు నిత్యము ఉదయ సాయంత్రములందు శ్రీగోవిందరాజస్వామివారిని ఉభయదేవేరులతో రాజవీధులలో సర్వాలంకార సమాయుక్తులనుగాజేసి యూరేగింతురు. ఈ దినములలో చేసెడు అలంకరణము విశేష జనసమాకర్షణముగానుండును. గరుడోత్సవము రథోత్సవము దర్శనీయములు.

## శ్రీకోదండరామస్వామివార్ల బ్రహ్మోత్సవము

తిరుపతిలో వేంచేసియున్న శ్రీకోదండరామస్వామివార్లకు ప్రతి చైత్రమాసములోను జరుగును. ఇదియు నవాహ్నికమే. ఇదియే పెద్ద రఘునాథుని ఆలయము. ధ్వజారోహణాది తీర్థవారి పర్యంతము 9 రోజులలోను ప్రతినిత్యము ఉదయ సాయంత్రములలో శ్రీస్వామివారికి వాహనసేవలగును. రాజవీధులందు ఉత్సవములు జరుగును. చక్కని అలంకారములు చేయుదురు. రథోత్సవము,గరుడోత్సవము మిక్కిలి ప్రశస్తములు, దర్శనీయములు.

## కపిలేశ్వరస్వామివారి ప్లవోత్సవము

ధనుర్మాసములో కపిలేశ్వరస్వామివారి ఆలయములో నీ కపిల తీర్థమునందు ఈ తెప్పయుత్సవము జరుగును. ఇది యిచట మూడు రోజుల యుత్సవము. మొదటిరోజున విఘ్నేశ్వర, చంద్రశేఖరస్వామి వార్లకు, రెండవరోజున శ్రీసుబ్రహ్మణ్యస్వామివారికి, మూడవదినమున శ్రీకపిలేశ్వరస్వామివారికి ఈ యుత్సవములు జరుగును.

# నారాయణవనం

## పద్మావతీ సమేత శ్రీకల్యాణ వేంకటేశ్వరస్వామివారల బ్రహ్మోత్సవము

ప్రతి వైశాఖమాసములో శ్రవణానక్షత్రమును అవభృథముగా నెన్నుకొని తత్పూర్వము తొమ్మిదియవ దినమునుండి యీ బ్రహ్మోత్సవము లీ నారాయణవనము గ్రామములో ప్రారంభింపబడును. ఇక్కడనే పద్మావతీ శ్రీనివాసుల కల్యాణము జరిగినదని, ఆ కారణము చేతనే యిక్కడ నిలిచిన శ్రీవారిని శ్రీకల్యాణ వేంకటేశ్వరస్వామివారని పేర్కొనిరని యైతిహ్యము. ఇదియు నవాహ్నిక దీక్షతోనే ఆరం

భింపబడును. 9 వ రోజువరకు ధ్వజారోహణమునుండి ప్రతినిత్యము ఇటగలనుత్సవమూర్తులకు సర్వాభరణముల నలంకరింపజేసి వీధ్యుత్సవములు జరుపబడును. శ్రవణానక్షత్ర ముదయమునుండగా తీర్థవారి జరిగింతురు (అవభృథము). ఇట వైఖానసాగమవిధానమగు నర్చనము జరుగుచున్నది.

## శ్రీ పద్మావతీసమేత శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామివారికి ప్లవోత్సవము

నారాయణవనగ్రామములో నీ తెప్పయుత్సవము ప్రతి కార్తీక మాసములోను పూర్ణిమనాడు జరుగును. ఇది ఇట నైదురోజుల యుత్సవము. మొదటి రోజున శ్రీరామస్వామివారికి, రెండవరోజున శ్రీకృష్ణస్వామివారు—గోదాదేవులకు, మూడవదినము నుండి యైదవ రోజువరకు శ్రీకల్యాణ వేంకటేశ్వరస్వామివారికి నీ యుత్సవములు జరిపింపబడును.

# నాగులాపురము

## శ్రీ వేదవల్లీసమేత శ్రీ వేదనారాయణస్వామివారి సూర్యపూజా మహోత్సవము

శ్రీ వేదనారాయణస్వామివారి విషయమై నిత్యవిషయమత్యంతాసక్తికరమగునది యొకటి గలదు. శ్రీస్వామివారిని సూర్యుడు సేవించుటయే నిటగల విశేషాసక్తికరమగు విషయము. ఎవనియాజ్ఞాభంగభయముచేత సూర్యుడు వెలుగుచున్నాడో, వాయువు వీచుచున్నదో అగ్ని, ఇంద్రులు ఎవరి కార్యక్రమములు వారు నిర్వహించుచున్నారో, పంచమవిషయమగు మృత్యువుపరువెత్తుచున్నదో అట్టివాడు భగవంతుడు ('సవాచ్యో భగవానితి') ఆయన సర్వేశ్వరుడుగా నుండి నిత్యవిభూతిలో లీలావిభూతిలో నటవెలసిన యర్చాస్వరూపము. ఆయన వేదనారాయణ

స్వామి. ఈయన నాగులాపురములో వెలసియుండెను. సంవత్సరాంత మగు ఫాల్గుణమాసములో మూడు దినములు (అనగా మార్చినెలలో) సూర్యనారాయణుడు జగత్తు నుద్ధరింప యుదయించి తన్నుద్ధరించు శ్రీమన్నారాయణుని మొదటిదినమున సాయంకాలము 5 గంటలకు పైగా శ్రీవారి ఆలయమున ప్రవేశించి శ్రీస్వామివారి పాదారవిందములను సంసేవించును. రెండవదినము శ్రీవారి నాభీకమలమును తన సహస్ర కిరణసమాయుక్తముగా ప్రకాశింపజేసి సంసేవించును. మూడవదినమున శ్రీవారి ముఖారవింద సౌందర్యమును ప్రకాశింపజేసెడి నెపమున కైంకర్యముచేయును. ఇట్లు తనకు నియమితమైన లోకరక్షణాకార్యమును నెరవేర్చుచునే ఆ దినములందు తనకు నియంతగానున్న జగత్ప్రభు వగు శ్రీమన్నారాయణుని కైంకర్యములో పాల్గొనుట మనము ప్రత్యక్షముగా గాంచవచ్చును.

## శ్రీ వేదనారాయణస్వామివారి ప్లవోత్సవము

ఇది ఫాల్గుణమాసములో మూడురోజులు జరిగెడి యుత్సవము. శ్రీసూర్యసేవ శ్రీవేదనారాయణస్వామివారికి జరిగెడి దినములలోనేయీ యుత్సవము జరుగుట విశేషము. ఈ మూడురోజులు జనము తండోపతండములుగా నీ విచిత్రమును గమనింప నిటకువత్తురు. ఆ సమయముననే శ్రీవారి ఆలయము చెంతగల పుష్కరిణిలో రాత్రులందు ఈ జలవిహారమును నడపుదురు. ఇందు మొదటి దినమున శ్రీ సీతాసమేత శ్రీరామచంద్రస్వామివారికి మిగిలిన రెండురోజులు శ్రీ వేదవల్లీసమేత శ్రీవేదనారాయణస్వామి వారికి నీ యుత్సవము లతివైభవముగా జరుగును.

## బ్రహ్మోత్సవము

ఈ స్వామివారి బ్రహ్మోత్సవము ప్రతిసంవత్సరము చైత్ర మాసములోని శ్రవణానక్షత్రము తీర్థవారిదినముగా నిర్ణయించుకొని

యంతకుపూర్వము తొమ్మిది దినములుగా శ్రీవేదనారాయణస్వామి వారికి అంకురారోపణ ధ్వజారోహణాదులు జరుగును. ఇది నవాహ్నిక దీక్షతో జరిగెడి యుత్సవము. ఈ యుత్సవములో ప్రతినిత్యము ఉదయము సాయంత్రములందు శ్రీవారిని విశేషాభరణాదులతో నలంక రించి గ్రామములో నూరేగింపు జరుపుదురు. శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి తిరుమలలో నెంతవైభవముతో నుత్సవములు జరుగునో యంతే వైభవముతో నిటగూడ నీ బ్రహ్మోత్సవములు జరుగును.

ఈ పైన చెప్పిన యుత్సవములు గాక తిరుమల శ్రీవారి ఆలయ ములోను తిరుపతిలోగల యితర ఆలయములలోను అనేకోత్సవములు జరుగును. ఆళ్వారాచార్యుల తిరునక్షత్రములును జరుగును. నిత్యము శ్రీవారి ఆలయమున ఉత్సవదినమే కలియుగ వైకుంఠమనజెల్లు ఈ తిరుమలతో సమమైనక్షేత్రము బ్రహ్మాండములోనే లేదు. తిరుమల దైవమునకుమించిన దైవమును - ఇతిరుదెవ్వడునులేదు

అందువలననే

'వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తికించన
వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి'

— స్కాన్దపురాణము

అన్న శ్లోకము చెప్పబడినది

## శ్రీవేంకటేశ్వరస్వామి దేవస్థానము వారిచే ఈ క్రింది విద్యాసంస్థలు నిర్వహింపబడుచున్నవి.

| | | |
|---|---|---|
| 1. | శ్రీవేంకటేశ్వర ఆర్ట్సు కళాశాల | తిరుపతి |
| 2. | శ్రీగోవిందరాజ ఆర్ట్సు కళాశాల | తిరుపతి |
| 3. | శ్రీపద్మావతీ స్త్రీల కళాశాల | తిరుపతి |
| 4 | శ్రీవేంకటేశ్వర నృత్యసంగీత కళాశాల | తిరుపతి |

| | | |
|---|---|---|
| 5 | శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాల | తిరుపతి |
| 6. | శ్రీవేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల | హైదరాబాదు |
| 7. | శ్రీవేంకటేశ్వర కళాశాల | న్యూఢిల్లీ |
| 8. | శ్రీపద్మావతీ స్త్రీల ఉన్నతపాఠశాల | తిరుపతి |
| 9. | శ్రీ వేంకటేశ్వర ఉన్నతపాఠశాల | వెల్లూరు |
| 10. | శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యఉన్నతపాఠశాల | తిరుమల |
| 11. | శ్రీ వేంకటేశ్వర ప్రాథమికపాఠశాల | తిరుపతి |
| | శ్రీ వేంకటేశ్వర బాలమందిరము | |
| 12. | శ్రీవేంకటేశ్వర ఉన్నతోన్నత పాఠశాల | తిరుపతి |
| 13. | శ్రీవేంకటేశ్వర ప్రాథమిక పాఠశాల | తిరుమల |
| 14. | శ్రీవేంకటేశ్వర శిల్పకళాకేంద్రము | తిరుపతి |
| 15. | శ్రీవేంకటేశ్వర వేదపాఠశాల | తిరుమల |
| 16. | శ్రీవేంకటేశ్వర వేదశాస్త్ర ఆగమ విద్యాకేంద్రము (నూతనముగా) | తిరుమల |

పై వియన్నియు తిరుమల దేవస్థానమువారిచే నిర్వహింపబడు చున్నవి.

## యాత్రికులకు సౌకర్యములు

దిగువ తిరుపతిలోను ఎగువ తిరుపతిలోను ఉచిత సత్రములు బాడుగ వసతి గృహములనేకము లేర్పడినవి. ఇవి యాత్రికుల వసతికే గాక వంటవార్పులకు నుపయుక్తముగా నిర్మింపబడినవి. విశాలమగు గదులతోపాటు నీటి పారుదల సౌకర్యములు గలిగి ఆరోగ్యసూత్రముల కనువగు రక్షిత నీటి సరఫరా పథకమున లభించు కొళాయి నీటి సౌకర్యముకలదు. ఆధునికసౌకర్యముల కనుగుణమయిన మరుగుదొడ్లచే

నీ సత్రములు మిక్కిలి పరిశుభ్రముగానుండును. పూర్వము తిరుమల మలేరియావ్యాధిచే పీడింపబడెడిదిగాని అనవరతమగు దేవస్థానమువారి ఆరోగ్యశాఖ సిబ్బంది కృషిచేత నీ బాధయంతరింపబడినది. ఇప్పుడు తిరుమల పట్టణము చక్కని ఆరోగ్యవంతమగు నితర పట్టణములతో సమానముగా పరిగణింప వీలు నిచ్చుచున్నది. యాత్రికుల సౌకర్యార్థము పాత్ర సామానులును ఉచితముగా నొసంగబడును. ఫలహార శాలలు, భోజనశాలలు యాత్రికులుండెడి వసతి గృహములకు సమీపముననే యేర్పాటుచేయబడినవి. దేవాలయములో శ్రీవారి దర్శనము సమయము బాగుగా పెంచబడినది శ్రీవారి దర్శనము ఇపుడు సామాన్య యాత్రికుడు ఉచితముగా ఉదయము 8 గంటలనుండి రాత్రి 9 గంటల వరకు చేయవచ్చును యాత్రికులు క్యూ వరుసలలో నిలబడ నవసరము లేకుండగ బల్లలమర్చబడినవి మధ్యమధ్యలో మంచినీటి సౌకర్యము సమకూర్చబడినది. ఈ నాడు యాత్రికులు దర్శించుటకేగు సమయము హెచ్చయినను ప్రమాదరహితముగా నిర్విఘ్నముగా దర్శనముచేసికొని రాగల స్థితిలోనున్నారు ఇంకను దేవాలయాధికారులు, క్యూ ఇన్స్పెక్టర్లు యాత్రికులకు సర్వసమయములందును సహాయము చేయుటకు సన్నద్ధులయి యుందురు.

యాత్రికులకు వలయు సమాచారము నందించుటకు రాష్ట్రము లోను, రాష్ట్రము వెలుపలను అనేక సమాచారకేంద్రములు నెలకొల్పబడినవి. మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు, కేంద్రములలో ప్రతి నిత్యము సుప్రభాతపఠనము వారము వారము మరి కార్యకలాపములు జరిగించుట, వాని విషయమై ప్రసంగములు జరుగుట నెరవేర్పబడు చున్నవి ఈ దేవస్థానమునకు సమాచారకేంద్రములు మద్రాసు, హైదరాబాదు, గూడూరు, కాళహస్తి, భద్రాచలము, బెంగుళూరు, భీమవరము, శ్రీశైలము. గుంటూరు, మధుర, దావణగిరి, ఋషీకేశములో గలవు.

ఋషీకేశములోను ఆంధ్రాశ్రమమును ఈ దేవస్థానపు పాలక వర్గము స్వాధీన పరచుకొన్నది. ఇంతేకాక యీ ప్రదేశములో ఒక శివాలయము, విష్ణ్వాలయము దక్షిణాది సాంప్రదాయము ప్రకారము నిర్మాణము గావింపబడి అందు ప్రతిష్ఠావిధానము నిర్వహింపబడినది. అట విష్ణ్వాలయమున వైఖానసాగమానుసారము, శివాలయమున శైవాగమ విధానమునను అర్చనలు జరుపబడుచున్నవి.

యాత్రికుల కుచితమగు వైద్యసహాయము తిరుమల తిరుపతులలో దేవస్థానమువారు కల్గించుచున్నారు. ప్రసాదములు దేవస్థానము వారి భాగమునకు సంబంధించి నంతవరకు యాత్రికుల కుచితముగా పంచిపెట్టుచున్నారు. శ్రీవారి శ్రీపాదరేణువు, శ్రీవారి చందనము చిన్న చిన్న పేకెట్లలోనుంచి యాత్రికులకు దేవాలయ పరిధిలోనే అడిగిన వారికందజేయుచున్నారు. తిరుపతి, తిరుచానూరులలో గూడ దేవస్థానమునకు వారి వంతుగావచ్చిన ప్రసాదమును తైర్థికుల కుచితముగా పంపిణీచేయుచున్నారు తిరుమల కాలిబాట, పాపనాశనమునకు బోయెడి కాలిబాట, ఆకాశగంగకుపోవుదారి మిక్కిలి దర్శనీయస్థితిలో నుండునట్లు దేవస్థానమువారు కృషి యొనర్చిరి. రాత్రులందు ఈ కాలిబాటలలో విద్యుద్దీపములు వెలిగించుటతో యాత్రికులు శ్రమలేకనే నడచుటకు వీలు కలుగుచున్నది తిరుపతినుండి తిరుమలకు చేరెడి ఘాటురోడ్డు రెండవది ఉపయోగములోనున్నది దీనివలన యాత్రికులు మరింత సౌకర్యమునుపొంది రాకపోకల విషయములో మిక్కిలి త్వరిత గతిని పాటింప వీలుగలుగును.

## దేవస్థానమువారికిగల రవాణాసౌకర్యములు

తిరుపతినుండి తిరుమలకు మొదటగా ఘాటురోడ్డు (మోటారు రోడ్డు) 1945 వ సంవత్సరములో వేయబడినది. దేవస్థానమునకు 1943 నుండి 1973 ఇంతమువరకుగల బస్సుల సంఖ్య 216. లారీల

సంఖ్య 461, కార్లు చిన్నవి 54, ట్రాక్టర్లు 4 యున్నవి. తిరుపతినుండి తిరుమలకు పాపవినాశమునకు, బెంగుళూరు, శ్రీశైలము, విజయవాడ, రేణిగుంట, తిరుచానూరు, నాగలాపురములకు దేవస్థానమువారు అనుదినము బస్సులను నడుపుచు యాత్రికులకు మిక్కిలి సౌకర్యము చేగూర్చుచున్నారు. దేవస్థానమువారి బస్సులేకాక రాష్ట్రప్రభుత్వ రవాణాశాఖవారు, అంతరాష్ట్ర ప్రభుత్వరవాణాశాఖవారు వారి వారి ప్రాంతములనుండి తిరుపతికి బస్సుల సౌకర్యమును యాత్రికుల నిమిత్తమై కల్గించిరి. *

దేవస్థానపు ఫలహారశాలలు భోజనశాలలన్నియు శుచిగా, పరిశుభ్రమయిన ఫలహారములను, భోజనమును లాభనష్టములులేని పద్ధతిలో యాత్రికుల కందించుచున్నవి.

దేవస్థానమువారు ప్రత్యేకముగా నొక ఆధునిక ముద్రణ యంత్రములు గలిగిన ప్రెస్సును నిర్వహించుచున్నారు. ఇందు శ్రీవారి చిత్రపటముల ముద్రణములు, దేవస్థానమువారి ప్రచురణములు, స్థలపురాణములు, దేవస్థానమువారికి కావలసిన అన్నివిధములయిన స్టేషనరీ సామానులు ఇచటనే ముద్రింతురు. దేవస్థానమువారిచే పలుభాషలలో ప్రచురింపబడు 'సప్తగిరి' మాసపత్రిక యీ ముద్రణాలయమునందే ముద్రితమయి చందాదారుల కందజేయబడుచున్నది.

## దేవస్థానమువారి వితరణసంస్థలు :

శ్రీవేంకటేశ్వర బాలమందిరమను సంస్థ యొకటి 1943 లో దేవస్థానము వారిచే నెలకొల్పబడినది. ఏ విధమయిన ఆలంబనములేని బాలబాలికలకు అన్నవస్త్రములతో బాటు విద్యాబుద్ధులు గఱపి వారిని జీవితములో నుత్తమపౌరులుగా తయారుచేయుటయే యీ సంస్థ నెలకొల్పుటలోని ప్రధానలక్ష్యము.

* 10 ఆగస్టు 1975 నుండి దేవస్థానం బస్సుల విభాగము రాష్ట్ర రోడ్డురవాణ సంస్థకు స్వాధీనము చేయబడినది.

ఇందులోనుండు బాలబాలికలు ప్రాథమిక తరగతులనుండి విశ్వ విద్యాలయ స్థాయివరకు విద్యను గ్రహించువారున్నారు. ఈ సంస్థలో నుండు బాలబాలికలకు 4 జతల మంచి బట్టలతోబాటు ఇంటిలో నుండి ధరించుటకు వీలుగా మరి రెండుజతల బట్టలనొసంగుదురు ఇవి కాక ప్రతిసంవత్సరమును ఒక బిస్నీదుప్పటి, ఒక తుండు, ఒక ప్రక్కకు దుప్పటి. ఒక దిండు, ఒక స్టీలుపళ్ళెము ప్రతియొక్క విద్యార్థికి నొసంగుదురు. 1969–70 వ సంవత్సరమునుండి నిత్యము మూడుపూటల భోజనముతోబాటు అదనముగా ఉదయమప్పుడు ఫలహారము గూడ నొసంగుచుండిరి. తిరుమల తిరుపతి దేవస్థానముల వైద్యాధికారి ఈ హాస్టలు విద్యార్థులను క్రమముదప్పక పరీక్షించి తగిన ఔషధములనిత్తురు.

ఈ విద్యతోబాటు నేర్చుకొను వారలకు కుట్టుపని, తోటపని, మున్నగునవి నేర్పుదురు.

ఈ సంస్థలో ఈ నియమములు పాటింపబడును.

1. ఆడపిల్లలయినచో 18 సంవత్సరముల వరకు మగవారయినచో 21 సంవత్సరములవరకు మాత్రమే యిందులో నుండుటకర్హులు.
2. ఇక్కడి సంస్థలోనుండి 60 దినములు వరుసగా నే విధమైన యనుమతిలేక హాజరుకాకుండినచో సంస్థనుండి తొలగించబడుదురు.
3. ఈ సంస్థలోని విద్యార్థి ఒకేతరగతి రెండు పర్యాయములు తప్పిపోయినగాని లేక తానున్న కాలములో మొత్తము విద్యాసంవత్సరములు మూడు నష్టపోయిన గాని యిందు కొనసాగుటకర్హుడు కాడు.

1969–70 వ సంవత్సరములో ఈ సౌకర్యములు విద్యార్థులకు కల్పింపబడెను.

1. అందరకు చెప్పులు సమకూర్చబడినవి.
2. ఫిబ్రవరి మాసములో మతసంబంధమైన, ఆధ్యాత్మికచింతనము గలిగిన చలనచిత్రములు చూపబడినవి.
3 సంవత్సరములో రెండు పర్యాయములు తిరుమల శ్రీవారి దర్శనము చేయు నవకాశము కల్గించబడినది.
4. పుస్తకములు కొనిపోవుటకు చేతిసంచులు సమకూర్చబడినవి.
5. పండ్లపొడి, బట్టలుతుకు సబ్బు, లైఫ్‌బాయ్‌సబ్బు, తిలకముసీసాలు స్త్రీలకు పీనితోబాటు ఆదనముగా గాజులు, రిబ్బనులు సమకూర్చబడినవి.

అక్కారామ్‌పల్లిలో శ్రీవేంకటేశ్వర అనాథాశ్రమ మొకటి నిర్వహింపబడుచున్నవి.

## శ్రీ వేంకటేశ్వర పాడిపరిశ్రమ — తిరుపతి.

తిరుపతిలో నీ పాడిపరిశ్రమ శ్రీస్వామివారికి సంబంధించినది గలదు. దీనిలో కేవలము పశువులే గాక శ్రీవారికి సంబంధించిన ఏనుగులు, గుఱ్ఱములు, ఎడ్లు, పునుగుపిల్లులు చేరియున్నవి. పాడిపరిశ్రమ వలన లభించు పాలు తిరుమల తిరుపతి దేవస్థానమువారిచే నిర్వహింపబడు అనేక దేవాలయములలో నుపయోగింపబడును. అంతేగాక ఫలహారశాలలు, భోజనశాలలలో నీ పాలు వినియోగింపబడును. ఇక ఏనుగులు మొదలైన జంతువులు తిరుమలలోను తిరుపతులలోను జరుగు నుత్సవముల సందర్భములో ముందు నడచును. పునుగుపిల్లులు 7 పెంచబడుచున్నవి. వారము వారము జరుగు శ్రీవారి అభిషేకమునకు గావలసిన పునుగు దేవస్థానమువారే సరఫరాచేయుచున్నారు. 31-3-70 నాటికి ఈదేవస్థానమువారికి గలిగిన పశుసంపద విలువ రూ. 2, 02, 260

## పు ష్ప తో ట లు

తిరుమల శ్రీవారి ఆలయములో కావలసిన పుష్పములన్నియు దేవస్థానమువారే సరఫరా చేయుచున్నారు. దానికొఱకై ప్రత్యేకముగా దేవస్థానమువారు ఉద్యానవనములు పెంచుచున్నారు. దేవస్థానమువారు పెంచు తోటల వివరములివి:

| | | |
|---|---|---|
| రహదారిబంగళాలోయ మంగళబావి ప్రదేశము నారాయణగిరి | 20 | ఎకరములు |
| చామకూరతోట | 4 | ,, |
| రామబగీచాతోట | 8 | ,, |
| అనంతపల్లిగుంటతోట | 4 | ,, |
| స్వామివారితోట | 2 | ,, |
| యన్. సి. మరియు డి. ఎమ్. బి | 4 | ,, |
| బస్‌స్టాండుమిట్టతోట | 6 | ,, |
| ప్రభుత్వమువారి వృక్షపరిశోధనా ప్రదేశము | 10 | ,, |
| పద్మావతీ స్త్రీల కళాశాల, తిరుపతి. | 6 | ,, |
| శ్రీ వేంకటేశ్వర ఆర్ట్సు కళాశాల | 2 | ,, |
| మొత్తము | 66 | ఎకరములు |

మొత్తము శ్రీవారికి యితర ఆలయములలో నున్న స్వామి వారలకు పూలను మొత్తము ఈ తోటలే సరఫరా యొనర్చుచున్నవి. 31-3-70 నాటికి అంతమగు సంవత్సరములో ఈ తోటలనుండి యుత్పత్తియయిన పుష్పములవిలువ మొత్తము రు. 1, 50, 854-62లు

## శ్రీ వేంకటేశ్వర ఆర్ష సంస్కృతి సదస్సు

సుమారు ఒక పాతిక సంవత్సరములకు పూర్వము ఆలయములో ఆర్షసంస్కృతి సదస్సులుకాని విజ్ఞానవినోద విద్వద్గోష్ఠులుగాని

జరిగెడివిగావు. సంగీత సాహిత్యసల్లాపములును జరిగెడివికావు. అదే కాలములో తమిళనాడులో కాంచీపురమున భగవత్కథాకాలక్షేపములు, మత ప్రచారమునకు పలయు ననేకయుపాంగ ములుండెడివి. శ్రీరంగమునందుకూడ పండితగాయన గాయనీగోష్ఠులు జరిగెడివి. దేశ ప్రఖ్యాతిగాంచిన తిరుపతిలో నట్టివి నాడు లేకుండెను. కాని నేడట్టిస్థితి తిరుమలలోలేదు. ప్రత్యేకముగా ఆర్షసంస్కృతిసదస్సు నొకదానిని దేవస్థానమువారు నెలకొల్పి యందు సంగీత, శాస్త్రకళా కోవిదులకు ప్రత్యేకముగా నవకాశ మొసంగి వారిచే నమూల్యమగు హరికథా కాలక్షేపములు, ఉపన్యాసములు సంగీతకచేరీలు, పండిత గోష్ఠులు వివిధ సద్గ్రంథములపయి పురాణకాలక్షేపములు ఈ సదస్సు ద్వారమున జరిపించుచున్నారు.

తిరుమలలోనేగాక యిటీవల తిరుపతిలో శ్రీ కోదండరామస్వామి వారి ఆలయములో నైతమిట్టి యేర్పాటును కొనసాగించుచుండుట యెంతయు ముదావహము. ఇది ఆస్తికజనులకు భక్తిమార్గపోషకమనుట యొకటి, రెండవది ఆయా కళాకారులకు ప్రోత్సాహ సదవకాశము లొసంగుట. వారికళా పిపాసను వెలుగులోనికి గొనివచ్చు ప్రయత్నము. ఇవి దేవస్థానమువారి ఆర్షధర్మస్థాపన కృషిలో మేల్తరముగా భావింప వచ్చును.

## వేదశాస్త్ర ఆగమ విద్వత్ సదస్సు

దేశము నలుమూలల వేదవ్యాప్తి శాస్త్రవ్యాప్తి ఆగమ విద్యావ్యాప్తి కలుగవలెనన్న సత్సంకల్పముతో కంచికామకోటి పీఠస్వామి వారి ఆదేశానుసారము ఈ సదస్సు మొట్టమొదటగా 1968 మార్చిలో నెలకొల్పబడినది. దేవస్థానమువారే ఆయా వేదములలో, ఆగమము లలో, శాస్త్రములలో పరీక్షలు నిర్వహించి యందు త్తీర్ణులైనవారికి నగదు బహుమతులు, దుశ్శాలువలతో సన్మానము జరిపించుట యీ కార్య

క్రమములోని భాగము. దేశమునందుగల యిట్టి పండిత ప్రకాండుల పోషించుట, యీ సదస్సుద్వారము వారి అమూల్య కృషిని బహిర్గత మొనర్చుట, వారిని సన్మానించుట యీ సదస్సు లక్ష్యములు. ఇందు తీర్ణులైన వారికి కేవలము యొక్క సంవత్సరపు బహుమానముతో నరికాక వారి యావజ్జీవిత పర్యంతము తిరుమల శ్రీవారి సాన్నిధ్యము నకు వచ్చి శ్రీవారి ఆశీస్సులు గొనుటకు వారికి వార్షికబహుమానమును దేవస్థానము వారేర్పాటు గావించిరి. ఇది విద్వల్లోకమును చిరస్మర ణీయముగాజేయు యేకైక కార్యమనుటలోవి ప్రతిపత్తి లేదు.

ప్రతి సంవత్సరమును అనవరతము నీ విధముగనే యిది కొన సాగునట్లు శ్రీవారిని ప్రార్థించవలసియున్నది.

## హిందూధర్మ ప్రతిష్ఠానము

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారిచే తిరుమల తిరుపతి దేవస్థాన ముల ఆశ్రయమున హిందూధర్మ ప్రచార, ప్రసారములకై హిందూ ధర్మ ప్రతిష్ఠానము అనుసంస్థ 1969 వ సంవత్సరములో స్థాపింపబడెను.

## ధర్మప్రతిష్ఠానముయొక్క లక్ష్యములు

1. హిందూధర్మముయొక్క ప్రసార ప్రచారములు నలుపుట.

2. ధార్మిక సాహిత్యమును ప్రకటించుట

3. ధార్మిక భావనలను, నైతిక మౌల్యములను ప్రజాసామాన్య ములో విశేషించి చిన్నవయస్సుగలవారిలో ప్రచారముచేయుట.

4. హిందూధర్మముయొక్క ముఖ్యతత్వములయందు శ్రద్ధాసక్తులను గల్గించి భారతీయ దృక్పథానుగుణముగా జీవిత విధానమును రూపొందించుట.

5. విద్యాశాలలలో నైతిక ధర్మవిషయములను ప్రబోధించుట

6. మతాంతరీకరణము నరికట్టుటకు సమగ్రహిందూ సమాజము నందు ఐక్యతా భావమును పెంపొందింపజేయుట.

ఈ ఆశయములతో తిరుమల తిరుపతి దేవస్థానములవారు ఒక ప్రత్యేకవిభాగమును నెలకొల్పి హిందూధర్మమును ప్రచారము చేయు చున్నారు.

## దేవస్థానము పాలకవర్గము
## నూతన సభ్యులు

1977 జనవరిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారిచే నియమింపబడిన నూతన దేవస్థాన పాలకవర్గసభ్యుల సమావేశము హైదరాబాదు (తిరుమల తిరుపతి దేవస్థాన సమాచారకేంద్రము)లో జరిగినది. ఇందు శ్రీ చెలికాని అన్నారావుగారిని దేవస్థానపు నూతన పాలకవర్గపు అధ్యక్షునిగా ఏకగ్రీవముగా నెన్నుకొనిరి.

## దేవస్థానపు పాలకవర్గసభ్యులు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ చెలికాని అన్నారావు, (మాజీ కార్యనిర్వహణాధికారి) | అధ్యక్షులు |
| 2. | శ్రీ వి. యన్. గౌడ్ | మెంబరు |
| 3. | శ్రీ పి. ఆర్. మాధవరావు | ,, |
| 4. | శ్రీ ఆర్. సత్తిరాజు | ,, |
| 5. | శ్రీ వై. మహానందరెడ్డి | ,, |
| 6. | శ్రీ బి. సత్యనారాయణ | ,, |
| 7. | శ్రీ సిహెచ్. వెంకటరత్నం | ,, |

| | | |
|---|---|---|
| 8. | శ్రీ బి. సుబ్బారావు | మెంబరు |
| 9. | శ్రీ జి. వెంకన్న | ,, |
| 10. | శ్రీ జి. చంద్రశేఖరంనాయుడు | ,, |
| 11. | శ్రీమతి టి శాంతాబాయి | ,, |

ఈ నూతన పాలక వర్గము ఇనుమిక్కిలిగా యితోధికమయిన కృషితో యాత్రికుల సౌకర్యములను పెంపొందింతురని ఆశించుచు వారికి సర్వేశ్వరుడయిన శ్రీనివాసమూర్తి యండదండలను ప్రసాదింపవలసి నదిగా ప్రార్థించుచున్నాను.



ఈ గ్రంథమును అనువదించుటలో తోడ్పడిన యితర గ్రంథములు :

History of Tirupati *by Dr. S. Krishnaswamy*

Ephigraphical Report of Tirumala-Tirupati Devasthanam
*by Sri Sadhu Subrahmanya Sastry, B. A.*

T. T. D. Inscriptions Vols. 1, 2, 3 to 10

T. T. D. Administration Report for 1969-70.

Lord of Seven Hills *by Sri Sitapati, I.A.S.*

మరీచి విమానార్చనకల్పమ్

భృగుసంహిత

పారమాత్మికోపనిషత్తు

పద్మావతీదేవి చరిత్రము *by* శ్రీ వంగీపురం రంగస్వామి అయ్యంగారు

సమూర్తార్చనాధికరణము — అత్రిమహర్షి

వేంకటాచల మాహాత్మ్యము — తరిగొండ వెంకమాంబ

ప్రమాదినామ సంవత్సర సిద్ధాన్త పంచాంగము 1973–74
— తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణము

శ్రీ వేంకటేశ్వర ఇతిహాసమాల

